# ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణములు

| | |
|---|---|
| అకారాద్యముద్రిత గ్రంథసూచిక | 0–50 |
| అమరుకము – జయంతి రామయ్యపంతులుగారు | 1–25 |
| అఖండదేశమునందలి ఆంధ్రవాఙ్మయము – ఆ. ఉమాకాంతముగారు | 0–25 |
| ఆర్యభాషావిభాగము | 0–50 |
| ఆంధ్రసాహిత్య పరిషద్వృత్తాంతము | 0–50 |
| ఈశానసంహిత | 0–50 |
| ఉత్తరరామచరిత్రము – జ. రా. పంతులు | 2–50 |
| ఉన్మాదసహస్రము (వెఱ్ఱివేయివిధములు) కొత్తపల్లి సూర్యారావు | 0–75 |
| కవిజనోజ్జీవని – సమస్యలు – శ్రీ కోటి రఘునాథతొండమాన్ | 0–50 |
| కవిజనాశ్రయము | 2–00 |
| కాళిందీకన్యాపరిణయము – అహోబలపతి (ప్రథమ భాగము) | 1–50 |
| డిటో (ద్వితీయ భాగము) | 0–75 |
| చంపూరామాయణము (ఆంధ్రము) జ. రా. పంతులు | 1–50 |
| చాటుధారాచమత్కారసారః – (సంస్కృతము) | 0–75 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0–25 |
| జ్యోతిశ్శాస్త్రసారము – కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0–50 |
| నమస్కారములు – కొత్తపల్లి సూర్యారావు | 0–25 |
| పరిషత్పుస్తకభాండాగారము 2 వ భాగము | 1–00 |
| ,, 3 వ భాగము | 1–00 |
| ప్రాకృతభాషోత్పత్తి – శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0–75 |



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

పరాభవ - చైత్ర - కార్తికములు

సంపుటము 55 సంచిక 1-4



"దేశభాషలందు దెలుఁగు లెస్స."



సంపాదకుఁడు

కవిమూర్ధన్య : కాకరపర్తి కృష్ణశాస్త్రి

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,

జమీందారు, ఉయ్యూరు

# ఆంధ్రసాహిత్య పరిషత్తు – కాకినాడ

అధ్యక్షులు

"విమర్శకాగ్రేసర" 'ఐతిహాసికసమాట్'

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

"అభినవభోజ"

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయకార్యదర్శి :-

"కవిశిరోమణి", "ఉభయభాషాప్రవీణ" A

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక వర్గ సభ్యులు :-

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి గారు
2. "బాలవ్యాస" శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు
3. "భాషాప్రవీణ" "వ్యాకరణ విద్యాప్రవీణ"
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారు
4. "కవిమూర్ధన్య" "ప్రౌఢకవిచంద్ర"
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి గారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు గారు (బి. ఏ.)
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ గారు
7. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు గారు
8. శ్రీ దామెర రాజగోపాలరావు, గారు బి. ఏ.
9. శ్రీ వేదుల రామచంద్రకీర్తి గారు, (ఎమ్. ఏ. ఆనర్సు)
10. "సాహిత్యవిద్యాప్రవీణ" "ఉభయభాషాప్రవీణ"
    శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి గారు
11. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, (బి. ఏ. బి. ఎల్.)

# విషయసూచిక

శ్రీ రామాయ నమః

# వేఙ్కటేశ్వర స్తుతిః

శ్రీ శిష్ట్లా బాలకోటీశ్వరరావు

శ్లో॥ శ్రీమనఃపతిం సత్కవిరాజహృద్య
పద్యప్రసూనపరిపూజితపాదపద్మమ్
దయామయాలోకపునీతలోకం
త్వాం వేంకటేశ్వర మహం శరణం ప్రపద్యే. ౧

శ్లో॥ శ్రీ శేషశైలభవనేషు భవన్నివాసః
దీనార్థిలోకహృదయేషు చ బద్ధదీక్షః
ప్రస్తూయసే కవివరైః స్తుతలనాప్రసంగే;
సర్వేశ్వరః ఖలు భవాన్ శ్రితపారిజాతః. ౨

శ్లో॥ నో జానే భవదన్యదైవత ముమాజానే! ప్రసన్నే దేతి, మా
జానే! మా మవ, పాలయేతి బహుధా భక్త్యా ముహుః ప్రార్థయన్
దుర్దైవోపహత స్త్వదేకశరణ స్త్వా మేవ యాచ్నామి మే
వాంఛా మంబురుహాక్ష! పూరయ సదా శ్రీ వేంకటేశ ప్రభో. 3

శ్లో॥ ఆరాధయామి వచసా మనసా చ మూర్ధ్నా
తే పాదనీరజ ముమాధవ! వేంకటేశ!
సర్వాత్మకే త్వయి నివేశితచిత్తవృత్తిం
మామేహి పాహి పురుషోత్తమ! దేవదేవ! ౪

శ్లో॥ అకించనత్వాత్ విగతాశ్రయత్వాత్
దురంతదుఃఖానల తప్తచిత్తః
భవత్పదారాధనబద్ధబుద్ధిః
భజామి విశ్వేశ్వర! మాం ప్రసీద. ౫

# సంజయశ్రీకృష్ణుల రాయబారము లందలి విశిష్టత

శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

సంజయుని రాయబారమునకు ప్రసక్తి యేమనగా, శకుని దుర్యోధనులచే ప్రోత్సహింపబడిన ధృతరాష్ట్రుడు సుహృద్ద్యూతమునకని పాండవుల నాహ్వానించి రప్పించినతరువాత ద్యూత ముపక్రమించిన కౌరవులు కపటమున వారి నోడించుటలో వనవాసాజ్ఞాతవాస - పణములు పెట్టి యోడినవారు 13 సం॥లు రాజ్యభ్రష్టు లగునట్లు నాతరువాత వారిరాజ్యము వారు పొందునట్లు

"త్రయోదశే చ నిర్వృత్తే పున రేవ యథోచితమ్,

స్వరాజ్యం ప్రతిపత్తవ్యమ్"

అని నిర్ణయించియుండి "నికృత్యానంచితాః పార్థాః। ద్యూతేన చ పరాజితాః।। ప్రహితా శ్చైవ కాననమ్" అని ద్రోణపర్వములో కర్ణుడు చెప్పినట్లు కౌరవులు కపటద్యూత మవలంబింపగా నోడిపోయిన పాండవులా 13 సం॥లు యథాక్రమముగా గడపి విరాటనగరములో నుత్తరాభిమన్యుకుమారులకు జరిగిన వివాహమహోత్సవములో పాల్గొని కుతూహలులై యున్నపు డక్కడ సమావేశ మయిన బంధువర్గము ద్యూతకాలనిర్ణయప్రకారము పాండవులకు రావలసియున్న రాజ్యమునుగూర్చి యాలోచించి ద్రుపదపురోహితుని బంపగా వెడలి యాతడు గతవృత్తాంతమును పాండవులుపడినకష్టములను చెప్పినను దానిని వారు మనస్సులో బెట్టుకొనక లోకహాని లేనిపద్ధతినే వారు తమ రాజ్యమును కోరుచున్నారు.

"తే భవన్తో యథా ధర్మం యథా సమయ మేవ చ

ప్రయచ్ఛన్తు ప్రదాతవ్యం మా వః కాలో ఽత్యగా దయమ్॥

మీరు ధర్మమును ద్యూతకాలనిర్ణయమును పురస్కరించుకొని కాల విలంబము కాకుండ వారిది వారి కీయవలయు నని చెప్పెను.

కర్ణుఁడది విని దుర్యోధనునివైపు చూచి యిట్లనెను. పాండవులు తమరాజ్యమును పొందఁగోరుదురేని ద్యూతనిబన్ధనప్రకారము మరల నంతకాలము వనవాసాదులు చేసి రావలసినదే యని.

ఆ కర్ణునిమాటకు భీష్ముఁ డాగ్రహించెను. ధృతరాష్ట్రుఁడు మంద లించి నా సందేశము సంజయునిచేత బంపుచున్నా నని చెప్పి ద్రుపద పురోహితుని బంపివైచి సంజయుని తానుపంపినసందర్భములో సంజ యుని రాయబారము ప్రసక్తమయినది.

—: ధృతరాష్ట్ర సందేశసారాంశము :—

"నీవు ధర్మజుపాలికి నెమ్మి నరుగుము...అతనికి ననుజవర్గంబునకును
బంధులకు నింపు పుట్టంగ బలుకు మచట"

"నెయ్యము వాటించి కయ్యం దియ్యమెసగ నలుకలెల్ల దీరెడునటుగా గయ్యా మనుతలపు లోనుగ నయ్యమనందనుఁడుమానునట్టు తెలుఁగుగాన్."

ఈ ధృతరాష్ట్రమతము ననుసరించి సంజయుఁడు వెడలి యిట్లు చెప్పెను.—

"న చేద్భాగం కురవోఽన్యత్ర యుద్ధా
త్ప్రయచ్ఛేరం స్తుభ్య మజాతశత్రో!
భైక్షచర్యా మన్ధకవృష్ణిరాజ్యే శ్రేయో
మన్యే న తు యుద్ధేన రాజ్యమ్"

ధర్మజా! యుద్ధములేకుండ కౌరవులు మీరాజ్యము మీ కీయని పక్ష ములో మీరు జీవనార్థము వృష్ణి - అన్ధక-రాజ్యములలో భిక్షాటనము చేయుటే మంచిది కాని యుద్ధముతో రాజ్యము రాబట్టుకొనుట యెంతమాత్రము మంచిది కా దని నాయభిప్రాయము" అని.

దీనినిబట్టి కేవలస్వార్థపరు డయినలోభి తనది యెంతయన్యాయ మయినను సరే, తన కెంతయపఖ్యాతివచ్చినను సరే, యెదుటివా రేమై పోయినను సరే, తనక్షేమముననే చూచుకొనుచు నిస్సంకోచముగా ప్రవర్తించు నన్నది ధృతరాష్ట్రాభిమత మగు నీసంజయరాయబార మందలి విశిష్టత.

అది విని ధర్మజు డిట్లనెను. సంజయా! ధర్మము ద్వివిధము. ఇది ధర్మమే యనిపించెడి ధర్మ మొకటి. ఇది యధర్మ మనిపించెడి ధర్మ మొకటి. ఇట్లే యధర్మముకూడ ద్వివిధము. ఇది యధర్మమే యనిపించెడి యధర్మ మొకటి. ఇది ధర్మమనిపించెడి యధర్మమొకటి. ఇట్టిస్థితిలో ధర్మాధర్మములు నిర్ణయింపగలవాడు శ్రీకృష్ణుడే కనుక నే నాయనమీదనే నిర్ణయభార ముంచితిని." అని.

అది విని శ్రీకృష్ణు డిట్లనెను- సంజయా! పాండవులకు జీవనో పాయము కౌరవులను వధింపకుండ సామదానములతో సిద్ధించునేని భీమసేనుని శాంతింపజేసి పాండవులు పుణ్యము గట్టికొన్నవా రగుదురు. యుద్ధమునకు సంకల్పింపక శాంతింపు మనుచున్న నీవు క్షత్రియులకు యుద్ధము ధర్మమో, నీ వనినభిక్షాటనము ధర్మమో చెప్పుము వినెదను. పరులయైశ్వర్యమును చోరునివలె నొకరా జెప్పుడు హరింపదలచునో యప్పుడే యుద్ధమునకు ప్రసక్తి. దానికై యేర్పడినవే కవచము, ఖడ్గాదికము, ధనుస్సు, నిత్యాదులు. "తత్ర పుణ్యం దస్యువధేన లభ్యతే" అట్టిదుష్టులను వధించుటచేత పుణ్యము వచ్చును. పరులసొత్తును చూడకుండగా హరించువా డొకడు చూచుచుండగా బలాత్కారముగ హరించువా డొకడు. చూచుచుండగా హరించినవాడు చోరుడు కాక పోవునా? "కిం వై పృథక్త్వం ధృతరాష్ట్రస్య పుత్రే" ఇట్టిచోరుని కంటె నేమి భేదము దుర్యోధనునియం దున్నది?

ద్యూతకాలనిర్ణయములో తమ దగ్గఱ బెట్టుకొన్న పాండవ రాజ్యము ననంతరము వీరు తీసికొనునిబంధన ముండగా దానిని వీరి కేందు కీయరు? "అస్మిన్ పదే యుధ్యతాం నో వధోఽపిశ్లాఘ్యః పిత్ర్యం పరరాజ్యా ద్విశిష్టమ్" ఈ విషయమై యుద్ధము చేయుమాకు ప్రాణ హాని యయినను శ్లాఘ్యమే. పరరాజ్యముకంటె పిత్ర్య మైనస్వరాజ్యమే ప్రశస్తము" అని.

తరువాతప్రసంగములో సంజయునితో యుధిష్ఠిరుడు "మా సోదరపంచకమునకు పంచగ్రామములను దుర్యోధను డిచ్చినను మేము శాంతించెద" మని చెప్పెను. శ్రీకృష్ణుడు "స్వయం త్వహం ప్రార్థయే తత్రగన్తుం సమాధాతుం కార్య మేత ద్విపన్నమ్" చెడిపోయిన యీ కార్యమును చక్కబరచుటకై కురుసభకు నేనే స్వయముగా రాదలచి యున్నాడ నని చెప్పి సంజయుని బంపెను. సంజయుడు వెడలి ధృతరాష్ట్రదుర్యోధనాదులతో విషయమంతయు జెప్పినమీద పంచగ్రామ సంధిమాట నెత్తుకొని దుర్యోధనుడు—

"యుధిష్ఠిరః పురం హిత్వా పంచగ్రామాన్ స యాచతే

భీతో హి మామకా త్సైన్యా త్ప్రభావా చ్చైవ మే విభో"

నాసైన్యమునకు నాప్రభావమునకు భయపడి యాతడు గ్రామములను యాచించుట దగ్గఱకు వచ్చినాడు. నేను వాని కేమియు నిచ్చువాడను కానని కూర్చుండెను. శ్రీకృష్ణుడు హస్తినాపురమునకు వెడలి విదురునిచే బూజింపబడి ముచ్చటించుసందర్భములో నక్కడిస్థితిగతులు తెలిసినవిదురు డిట్లనెను.

శ్రీకృష్ణా! దర్పితుడై యున్నదుర్యోధనుడు నీవు చెప్పినను విను వాడు కాడు. ఆదుష్టులలోనికి నీవు వెడలుట నాకు సమ్మతము కాదు". అని చెప్పుకొనగా శ్రీకృష్ణుడు "సర్వ మేత దహం జానన్ క్షత్తః ప్రాప్తో ఽద్యకౌరవాన్" నేను తెలిసియే వచ్చితిని. "సోఽహం యతిష్యే ప్రశమం క్షత్తః కర్తు మమాయయా" నేను సంధికొఱకు నిష్కపటముగా ప్రయత్నింతును.

"ఆకేశగ్రహణా న్మిత్ర మకార్యా త్సంనివర్తయన్ అవాచ్యః కస్యచి ద్భవతి..." తనజుట్టు పట్టుకొనునంతవరకు మిత్రుని నకార్యమునుండి మరలింపవలయును. అట్లు చేసినపుడు నింద లేకుండ బోవును.

"న మాం బ్రూయు రధర్మిష్ఠాః మూఢాః...
శక్తో నావారయ త్కృష్ణః..."

యుద్ధము నివారింపగలిగినకృష్ణుడు నివారింపకపోయె నని యధర్మపరులు మూఢులు న న్ననకుండుటకై నేను వచ్చితిని. నా కెంతదుష్టు లయినను వారు న న్నేమియు జేయలేరు" అని చెప్పి విదురుని సమాధానపఱచి కురుసభలో బ్రవేశించి జామదగ్న్యకణ్వనారదాది మహాత్ములసమక్ష ములో తాను చెప్పవలసిన దంతయు జెప్పి దుర్యోధనాదుల ప్రతికూల తను గ్రహించి, తుదకు—

"దృశ్యతాం వా పుమాన్ కశ్చి త్సమగ్రే ప్రార్థివే బలే
యోఽర్జునం సమరే ప్రాప్య స్వస్తిమా న్వ్రజే ద్గృహాన్
కింతే జనక్షయే నేహ కృతేన భరతర్షభ!
యస్మిన్ జితే జితం త త్స్యా త్పుమా నేక స్సదృశ్యతామ్"

దుర్యోధనా! యుద్ధముతో జనక్షయమున కేల యత్నింతువు? ఫాల్గుని జయింప గలవాని నొకని నీ వెన్నుకొనుము. ఆయిద్దరికే యుద్ధము. అం దేపక్షమువాడు నెగ్గునో యాపక్షము గెలిచినట్టు లనికూడ బోధించి దానికిని వా రంగీకరింపకుండుటను జూచి యిక వీరికి కాలమాసన్నమైన దని వెడలి వచ్చెను.

దీనినిబట్టి తెలిసి చెప్పదగినవాడు తనమాట సాగకపోయినను చెప్పవలసినదే. యావచ్ఛక్తి వినియోగించి యకార్యమునుండి మిత్రుని మరలించుటకు యత్నింపవలసినదే, తనమీదకు వచ్చులోకాపవాద మును తాను తొలగించుకొనవలసినదే. సంధిని ఘటింపజేయువాడు నిష్పక్షపాతముగా వ్యవహరింపవలసినదే.

అనున దీ శ్రీకృష్ణరాయబారములోని విశిష్టత, (విశేషము)—



# తిక్కనార్యుని కృత్యవతారిక

శ్రీ చేబోలు చిన్నయబ్రహ్మము

కవిత్రయములోని రెండవకవీంద్రుఁడగు తిక్కనసోమయాజి పదుమూఁడవశతాబ్దమున నుండినట్లు తెలియుచున్నది. ఈకవిచే రచింపఁబడిన నిర్వచనోత్తరరామాయణకృత్యవతారికనుబట్టి యీతఁడు నెల్లూరిని రాజధానిగా దెలుఁగునేలను బాలించిన మనుమసిద్ధియాస్థానమున నుండినట్లు విశదమగును. ఈ రాజకవులు పోషకపోషితులవలెఁ గాక మిక్కిలిసన్నిహితులై యుండినట్లు తోఁచుచున్నది.

నిర్వచనోత్తరరామాయణము నీకవి బాల్యప్రాయమున రచించియుండును. జటిలసంస్కృతపదజాలము, క్లిష్టాన్వయము గల యీకృతి రచన యీవిషయమును నిరూపించును. ఈకృత్యవతారికలోఁ దన్నుఁ గూర్చి "అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ" నని యిత్యాది వ్రాసికొనెను. సంస్కృతమున రచించినకావ్యములు లేకున్నను దద్భాషాకావ్యమర్యాదను సమగ్రముగా నెఱిఁగి, తెనుఁగుఁగైతతీరుతీయములలోతుపాతులను గ్రహించి, వానిని రచించుశిల్పమున నారితేరినవాఁడ ననియు గళావిదుఁడ నని పేర్కొన్నాఁడు. ఇట్టి విశేషప్రస్తావన యాంధ్రభారతవిరాటపర్వకృత్యవతారికయందుఁ గనిపింపదు. యౌవనమున రచింపబఁడిన నిర్వచనోత్తరరామాయణమున నట్టి స్వాతిశయోక్తి యుండుట సహజము. వయసుతోఁ బాటనుభవము పెరుగుటచేతను సోమయాజియై తాత్త్వికచింతాపరుఁ డగుటచేత భారతకృత్యవతారికలో స్వవిషయము నత్యంతవినమ్రభక్తిభావబంధురముగా సముచితముగా చెప్పియుండెను.

నన్నయ యాంధ్రీకరణమునకుఁ బిమ్మట రెండువందలసంవత్సరముల కీకవి యుదయించెను. తాతతండ్రులవంశము ప్రసిద్ధపండితమంత్రి

వంశ మగుటం జేసి జన్మతః స్వాతంత్ర్యప్రవృత్తి, గాంభీర్యము, నార్జవము మున్నగు సుగుణములు చేపడినవి. వానికిఁ దోడుగా నుభయభాషాకావ్యరచనాభినివేశము చక్కని యారోగ్యభాగ్యములు సమకూడుట మఱియొకవిశేషము. కావ్యరసజ్ఞశేఖరుఁ డగుసుప్రసిద్ధి విశేషగౌరవాదరణలు సంప్రాప్తించుట యీకవిరేణ్యుని తెలుఁగుజాతిపూర్వపుణ్యము. ఈతఁడు కవిరాజమాత్రుఁడే కాఁడు. కవిబృందకవితాపోషణనిరతుఁడు. దీనింబట్టి యుదారబుద్ధిగలవాఁ డనియుఁ దనకుఁ గల కీర్తిధనములను కేవలము విశ్వోన్నతికిం బట్టుఁగొమ్మయగు కవితాభివృద్ధికే వినియోగించిన ట్లూహింపవచ్చును. ఈతఁ డెంత మృదుమధుర రసభాషియో యంత భావనిరంకుశుఁడు., విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుఁడు కూడ.

“హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వమునుండియే యీకవి పూర్వోక్తవిశేషణములు కారణముగా నాంధ్రీకరించెను. ఏ కొలదిభాగమో శేషించిన యరణ్యపర్వమును నన్నయ రచించినట్లే సమర్థించెను. అరణ్యపర్వశేషరచనాప్రసంగము నీతఁ డతిప్రజ్ఞతో జాఱవిడచెను. అట్లు విడచుటలోఁ గొన్ని సందియము లుండినను వానిని వెలువరింపక తాను విరాటమాది పదునేను పర్వము లాంధ్రప్రజాహ్లాదసంవర్ధనముగాఁ దెనిగింప నున్నట్లు సూచించెను.

తిక్కన కృత్యవతారికను జూచినపు డందు లౌకికమైన, యలౌకికమైన చిత్తసంస్కారప్రయోజనములు పొడకట్టును. మనుమసిద్ధి దాయాదులచే రాజ్యభ్రష్టుఁ డైనట్లును దిక్కన గణపతిదేవుని మెప్పించి మహారాజకేసరుని సహాయమున శత్రువులనుండి మనుమసిద్ధికి రాజ్యమిప్పించినట్టివృత్తాంతము నిర్వచనోత్తర రామాయణకృత్యాదిని గన్పట్టును.

పదుమూఁడవశతాబ్దభాగమున నాంధ్రదేశమున శైవులకు వైష్ణవుల కంతఃకలహములు చెలరేగినవి. మా శివుఁడు గొప్పవాఁడని శైవులు. కాదు మా విష్ణువు గొప్పవాఁడని వైష్ణవులు తగవులాడిరి. తెలుఁగునేల వారి యనైకమత్యమున నిర్వీర్య మగుట గుర్తించి సమయజ్ఞుఁడగు తిక్కన శివకేశవు లభిన్ను లనియు, నా రెండుమూర్తులును బరతత్త్వమున నంతర్భాగములే యని బోధించి తన్మూలముగా రెండుమతములవారి నొకత్రాట నడిపింపఁదలఁచియే తనకృత్యవతారికలో హరిహరనాథుని సాక్షాత్కరింపఁజేసికొని తన్ముఖకమలమునుండి యమూల్యసందేశము నందఁజేసినాఁడు. కేవలము కవితాదృష్టితోనే కాక సాంఘికవిప్లవవిచ్ఛేదనదీక్షతో నీతఁడు చక్కనివాతావరణమును సృష్టించియుండెను. కృత్యవతారికలోఁ గల హరిహరనాథ సాక్షాత్కారము, కృతిపతిత్వాభిలాష, యాత్మకథనములు కవికృతకల్పనయందును భగవత్పరముగాఁ జెప్పియుండుటచే సత్యదూరము కానేరదు. మీఁదు మిక్కిలి "ఆత్మసమ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచునుండు దెప్పుడున్"- మున్నగాఁ బరాత్పరు డభిభాషించుటచే నీ ప్రస్తావన తెలుఁగుకావ్యలోకమునకే సంజీవని యైనది. ఏతత్కారణముగాఁ దిక్కనార్యుఁడు తెలుఁగుజాతికీర్తిదీప్తులకు సహస్రకరుఁడైనాఁడు.

స్వప్నమునఁ గనిపించినహరిహరనాథుని సత్కవితావేశముతో భక్తిపరవశుఁడై రచించినసీసపద్య మతిమనోహరము. పద్యపఠనము పూర్తి యగుసరికి పాఠకులహృదయవీథి నొకయపూర్వదివ్యమూర్తి ప్రత్యక్షమగును. ఈ చిత్రమును జిత్రించుటలోఁ బ్రముఖచిత్రకారులు గూడ తబ్బిబ్బు పడవలసినదే. ఈపద్యమున సమకూర్చినకావ్యశిల్పము మిగిలిన పదునేనుపర్వములయం దన్నియెడలఁ బ్రదర్శించియుండెను. "హరినీలపాత్రిక సురభిచందన మున్నగతి. "సురనదియును గాళిందియు

బెరసినట్లు" అను విశేషణములు సహజములు గాకపోయినను నుద్దిష్ట రూపకల్పనమున నాతఁడు చేసినచిత్రసృష్టి యనిపించును. ఇట్టి జగన్మోహనమూర్తి కనఁబడకపూర్వము గుంటూరివిభుఁడు మధురకీర్తి... సాంగవేదవేది స్వర్గస్థుఁ డయినకొమ్మనదండనాథుఁడు పుత్త్రవాత్సల్యముప్పొంగుచుండఁ గానిపించుటయుఁ దానపుడు నమస్కరింపఁగా జనకుఁడు సమాదరబుద్ధితో 'నీవు మున్ను రచించిన "కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్; కిం కాలకూటః కిము వా యశోదాస్తన్యః తవ స్వాదు వద ప్రభో! మే" అను శ్లోకము తన్నంతో యలరింపఁజేసిన దని హరిహరనాథుఁ డన్నట్లు తన్నుఁ గార్యార్థినిగాఁ బంపి తా నియ్యెడ కిపుడే విచ్చేయుచున్నా డని చెప్పెను. ఇంతలోఁ గరుణాగసము వొంగి...అనుపద్యానురూప రూపముతో సర్వేశ్వరుఁడు సన్నిధిసేయును.

ఇందు సూచించినసంస్కృతశ్లోకము హరిహరనాథ పరమైనది. అంతకుఁబూర్వమే యీ కవి దీనిని రచించియుండును. ఈ యొక్క శ్లోకమే తక్కఁ దదనుబంధము లైనశ్లోకములు లభింపకపోవుటచే నీతఁడు సంస్కృతమున హరిహరస్తవ మనునొకగ్రంథమును రచించె నని చెప్పుటకు వీలు లేదు. "నీవు దొల్లి రచియించినపద్యంబు గాఢాదరంబున నవధరించె నని తానే వ్రాసికొనియుండుటచే దీనిని వ్యస్త శ్లోకముగానే పరిగణింపవచ్చును.

నన్నయ తనకావ్యాదిని 'శ్రీ వాణీగిరిజా శ్చిరాయ' అను సంస్కృతశ్లోకమును రచించెను. కాని యేతాదృశకల్పన చేసియుండ లేదు. తిక్కన తన కావ్యాదిని 'శ్రీ యన గౌరినాఁ బరగుచెల్వకు' అను తెలుఁగుపద్యమును రచించి తనకుఁ గలత్రిలింగభాషాభిమానమును జాటుకొనెను. నన్నయ తిక్కనల శ్లోకపద్యములందుఁ గొంత రచనావైవిధ్య మున్నది. నన్నయ లక్ష్మీసరస్వతీ పార్వతు లను ద్రి

మూర్తులను గావ్యసిద్ధికై ధ్యానించెను. తిక్కన శ్రీదేవిగిరిజాదేవత లకు మనోరంజనము సేయ హరిహరరూపములను దాల్చిన భక్త జనంబు వైదికధ్యాయిత కిచ్చమెచ్చుపరతత్త్వము నారాధించెను. నన్నయను పూర్తిగా దిక్కన యనుకరింపలేదు. తిక్కన విష్ణురూపాయ నమశ్శివాయ హరిహరాయ పరతత్త్వాయ నమో వ్యూహమ్మనివాడు. పేరు మోసినపెద్దవారి యడుగుజాడలలో వారిని గౌరవించునుద్దేశ ముతో నాతీరుగనే పోవువారు కొంద ఱుందురు. కాని తిక్కన భావ నావిశేషమున విలక్షణుఁడు క్రొత్తతీరుతీయములు తీసికొనివచ్చి వస్తు తత్త్వమునకు మెఱుఁగు లెట్టఁగల మహాకావ్యశిల్పి యితఁడు.

నన్నయకుఁ ద్రిమూర్త్యాత్మకదృష్టి యుండఁగాఁ దిక్కనకు మూర్తిత్రయాత్మకాధారకపరతత్త్వమునం దెక్కువమక్కువ యుండి నట్లు తెలియవచ్చుచున్నది. దీనినిబట్టి యితఁడు రచనావ్యవసాయమున ద్వైతి యైనను, నాధ్యాత్మికముగా నద్వైతి యని తేటపడుచున్నది. భక్తవత్సలుం డగుహరిహరనాథుఁడు శాంతమూర్తి...భక్తిమయం బగుసాష్టాంగదండప్రణామంబు–లలాటోపరిభాగంబున నంజలిపుటంబు– నయనావయవములు – ప్రమదబాష్పపులకపటల విలులిత పరికలి తంబులు – అని చేసిన పదప్రయోగమునుబట్టి యిమ్మహాకవి పరమ భాగవతోత్తముఁ డనిపించును. సత్త్వగుణవిశేషం బయిన భక్తిజ్ఞానం బగు నను భాగవతోక్తింబట్టి యీతఁడు సాత్త్వికభక్తి ప్రవర్ధితాత్మజ్ఞా నసంవర్ధితుఁ డని యూహింపవచ్చును.

స్వప్నమునఁ దిక్కనకుఁగనిపించిన పరమేశ్వరుఁడు

ఉ॥ వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచున్
భేదములేనిభక్తి మది నిర్మలవృత్తిగఁ జేయుచుండ ను
త్పాదనిరంతరస్మరణ తత్పర భావముకల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండు దెప్పుడు.

అనినాఁడు. ఇవి కేవలము భగవద్వచనము లైనను, నందుఁ దిక్కనా ర్యుని వ్యక్తిత్వము చెప్పకయ చెప్పుచున్నట్లు వ్యక్తమగుచున్నది.

వైదికధర్మబద్ధ మైన వర్తనమునకు సర్వసమభావము గలభక్తి, మనస్సును నిష్కామ్యముగను బ్రశాంతముగఁ జేయుచుండఁగా నిరంతరము నాచరణపంకజధ్యానము కలిగియుండువారికేఁ గావ్యరస మాత్మానందమును గలిగించును. అట్టి కావ్యరసము నా కత్యంతాభిమానపాత్ర మని హరిహరనాథుఁడు వచించినట్లు రచింపబడినది. ఈ రచనావైచిత్ర్యము, వైదుష్యములు లోకమున నతిలోక మైన యమరసందేశమును సృజింపగల్గినవి.

కావ్యరసము వైదికధర్మనిబద్ధప్రవర్తనమును, నిర్మలచిత్తప్రచాయినియగు సర్వసమభక్తిని, నిరంతరభగవచ్చరణార్చన పారవశ్యము నాత్మానందమును గలిగించు ననియూఁడఁ జెప్పనగును. రెండవసారి తోఁచినయర్థముకన్న మొదటియర్థవిశేషమే తిక్కనయభిప్రాయ మై యుండు ననుటకు సందేహము లేదు.

కేవలము శైలి, యలంకారము, పాత్రచిత్రణము గుణము మున్నగునంశములనే దృష్టియం దిడుకొని కావ్యపరమార్థ మగునాత్మానందమును మఱచి.......కావ్యరసపానము సేయువారికి వైదిక ధర్మబుద్ధి, నిర్మలభక్తి, భగవదర్పిత భావములు కల్గుచున్నవా? లేదు. అందుచేతనే రెండవసారితోఁచినయర్థముకన్న మొదటియర్థమే శ్రేష్ఠ మనిపించుచున్నది. మానవుని జ్ఞానమే విషయమున సార్థక మగు ననెడు దృష్టి నేసపు డెన్నికావ్యములను జదివినను దసూర్మాలముగాఁ గల్గునది బాహ్యానందమే కాక నిత్యమును నిరవధిక మైనబ్రహ్మానంద మొదవునా? తాత్త్వికచింతనము, ధర్మదీక్షయాత్మజ్ఞానము లేనికావ్యపరిజ్ఞానము నిష్ప్రయోజన మని భగవంతుఁడే నిర్దేశించినట్లు రచించుటయే తిక్కనకవీంద్రుని మహదాశయము.

ఈ కవి తనకృత్యవతారికలోఁ దన్నుఁగూర్చి ప్రయోగించిన విశేషణములు చాలవఱ కీతని మనస్తత్త్వనిరూపణసమర్థములై యున్నవి. ఆత్మానందలక్ష్యసిద్ధిం గోరినవాఁ డగుటం జేసి యాత్మస్తుతిపదప్రయోగవిడంబనము సేయక 'అమలోదాత్తమనీషులకుఁ గావ్యరసము పరమానందమును గల్గించు' ననుసత్యము నుగ్గడించెను.

ఏకళకైన నాత్మానందము లక్ష్యము. కావ్యరస మనునపుడు కేవలము సాహిత్యమునకే కాక సంగీతాదికళలకు నన్వయించును. ఆలోచనామృతమున కుద్దిష్టమైన కావ్యామృత మాత్మవివేకముగలవారి యెడ నుపకరించినట్లు తద్విలక్షణమతులయెడ నుపకరింపదు.

తరువాత హరిహరనాథుఁడు పారాశర్యకృతియుఁ బంచమవేద మనఁదగిన భారతము ప్రజల కారాధ్యము. దానియందలి మహత్త్వమును గ్రహించి యాంధ్రీకరింపు మనియు నట్లొనర్చుటవలన భవ్యపురుషార్థతరుపక్వఫలము ప్రాప్తించు ననియు నేతత్కావ్యకన్యాపతిత్వమును గోరి వచ్చితి ననును. ఈ వచనములవలన తెలుఁగుభారతోదయము దైవసన్నిర్ణయ మని తెలియుచున్నది.

నిర్వచనోత్తరరామాయణమును రచించి పంచమవేద మనఁదగిన మహాభారతము నాంధ్రీకరింప దక్షుం డయ్యును దాను బాలస్వభావుఁడ ననియే చెప్పుకొనెను. హరిహరనాథదివ్యవచనామృత పరిప్లావితచిత్తుం డగు నీకవీంద్రుఁ డప్రమేయ భావనాతీతుం డయ్యును భగవంతుం డాశ్రితులకు సులభుం డని బుధులవలన వినికిం జేసి ననుబోటి బాలస్వభావున కిట్టిమహనీయమహిమ దొరకొనుటయుం గలుగున కాక......యను వచనములవలనఁ దిక్కనార్యునకుఁ బ్రాజ్ఞులయెడఁ గలగౌరవము నిరహంకారభావన లధికము లని తెలియుచున్నది.

ప్రాపంచికవిషయానురక్తి గల తుచ్ఛమైన తనచిత్తము నఖిలాండపతి భూరికారుణ్యక్షీరాంబుధివిస్తారమహితముగా నునిచె నని

చెప్పుచు భావజ్ఞులమనఃఫలకమున మఱియొకచిత్రమును దీర్చిదిద్దెను. కరుణ యనుపాలసంద్రమున నీదులాడు రాజహంస క్షీరనీరవిభాగ మనుప్రయాస యక్కఱలేకుండఁగనే పరమేశ్వరుఁడు తనమనస్సును కారుణ్యక్షీరాంబుధి విహరింపఁజేసిన ట్లభినందించును. సర్వజ్ఞుఁడ వగు నిన్నుఁగూర్చి మదీయవాణి పలుకనేరదు. అయినను నీ కృప నేను వర్ణింపఁగల్గుభాగ్యమును నోచుకొన్నది. గీర్వాణభాగతము నాంధ్రీకరించు నుద్యోగస్థుఁడ (పదస్థుఁడ) నైతిని. మఱలఁ గలుఁగఁబోవు జననమరణపరంపరాక్లేశమును దొలఁగింపుమని వేఁడును. ఈకోరిక యైనను నుపలాలితుం డగుభిక్షుకుఁడు తనకొలంది యెఱుంగక మహాపదార్థంబును వేఁడు చందమునఁ గోరితి నని చెప్పెను. తనకోర్కె నాదయామయుఁడు తప్పక ప్రసాదింపఁగలఁ డను సంపూర్ణవిశ్వాసముతోడనే సర్వాంగాలింగితమహీతలం బగునమస్కారము చేయును.

అంతఁ బ్రసన్నుఁ డయిన యాజగన్నాథుఁడు జననమరణాదులైనసంసారదురితములకు నగపడకుండంగఁ దొలఁగుతెరువు గను వెలుంగు నీ కిచ్చితినని వరము దయచేయును.

ఈ దివ్యవచనము కర్ణానందమునే కాక మానసమున కాశ్చర్యము నొదవింపఁగా నెంతో ప్రొద్దల్లే భక్తితాత్పర్యములతో నూహించుచు నీకవివర్యుఁ డానందించెను.

ఈసంవాదమువలనఁ దిక్కనమనస్తత్త్వము విదిత మగుచున్నది. సామాన్యకవులవలెఁ బ్రాపంచికభోగభాగ్యములను గోరక యనన్యదుర్లభమును, మానవజీవితపరమార్థ మగు బ్రహ్మానందమునే యభిలషించుటయు, సఫలమనోరథుం డయినట్లు రచింపఁబడుటంజేసి యీకవిబ్రహ్మ నిజముగాఁ జరితార్థుడే కాక బ్రహ్మజ్ఞుఁ డైనాఁడు.

ఈపరప్రసాదసంతోషాతిరేకమున నీశ్వరాదేశముతోఁ బూజ్యమూర్తి యగు భారత సంహితను జెప్పఁ గన్నట్లును, నిట్టిసదవకాశ

మును గల్పించిన యాదేవుని భక్త్యానందమున నభిషేకింతు నని కృతజ్ఞతాపూర్వకనమ్రభావమును జూపించును. అమూల్య మైన రత్నమును సువర్ణమునఁ బొదుగఁ దగును. భారతకావ్యస్వర్ణకుమారిని హరిహరనాథదైవరత్నమున కంకితముసేయుట యుక్త మనియుఁ దా నేర్చిన భంగి నాంధ్రభారతమును రచించి సహృదయు లగుభక్తులకు నాంధ్రులకు నర్పించియుండ నయ్యెద నని చెప్పి మహాకావ్యరచనా ప్రారంభమునకు (శ్రీ)కారము చుట్టెను.

తిక్కనవ్యక్తిత్వమును భావవైచిత్ర్యమును, నిర్మలహృదయ శుద్ధిని ప్రయోగదక్షతను, మహాకవీశ్వరానురూప మైన కళానిష్ఠను నాంధ్రమహాభారతకావ్యపీఠిక యైన యీ కృత్యవతారిక యుపలక్షకముగా ప్రదర్శింపఁ జాలి యున్నది.



## గీర్వాణాంధ్రకవివరులకు సంపాదక విజ్ఞప్తి

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికానామమునకు సార్థక్యము సంతరించుతలంపుతో నీదిగువ ముద్రిత మగుశ్లోకమున కాంధ్రపద్యానువాదమును, సమస్యకు సముచితపూరణమును గావించి శారదారాధన మొనరింప బ్రార్థితులు.

శ్లో॥ "రామం దశరథం విద్ధి
మాం విద్ధి జనకాత్మజాం
అయోధ్యా మటవీం విద్ధి
గచ్ఛ తాత! యథాసుఖమ్."

(సీతారాములతో గాననమున కేగదలచిన తనతనయు నుద్దేశించి సుమిత్ర వాచించిన విషయ మిది. ఇందలివిశ్లేషార్థముగూడ నపరిహార్యము)

— సమస్య —

"గ్లైన్ సీతను రావణాసురుఁడు దా
గ్రేగంట నీక్షించుచున్."

హరిహరదేవాయ నమః

# భు వ న వి జ య ము

## (ప్రథమరంగము)

ప్రదేశము :- భువనవిజయనామాంకిత మగు రాయలకవితాభవనము.

ప్రవేశము :- రాజవిదూషకుఁడు మక్కళుఁడు.

మక్క :- (ప్రవేశించి) అబ్బబ్బా! ఎంత యహంభావము! ఎంత తలబిరుసుదనము! గజారోహణములట! గండపెండేరములట! ఘంటాకంకణములట! కాశ్మీరపుసాలువజోడులట! పల్లకీమోతలట! ప్రతిపద్యబిరుదంబులట! ఇంకేమోయట! ఏమేమోయట! ఇన్ని దరిసించినను "తృప్తోఽస్మి" యనుమాట నోటినుండి యూడిపడునా? ఆస లనుమంతిగానితోకవలె నట్టట్టే పెరిగిపోవుచునే యున్నవే! ఈ కవి కులములోని యూరభటికి నసూయావేశములకును నంతును, బొంతును లేకున్నదే! అయగారిముదుసలికవిని గనినంతనే యమ్మగారియగణపుఁగని యట్టే మొగము ముడుచుకొనును. ఈతనిగాంచి యాతఁడు రవంత పెదవి విఱిచి యసహనము నట్టే వెడలఁగక్కును. ఇక దక్కువారి విపరీతఘోరణుల జెప్పనక్కఱయే లేదు. వాని కవిత వట్టిపెసరపప్పు, పేలపుఁబిండి యని యీత డనును. వీనిది పాషాణపాక మని వాడధిక్షేపించును. రక్తి గలయుక్తులతో రామకృష్ణకవి తరచుగ వీరలనోళ్ళకు దాళముల వేయుచునే యున్నాడు. ఐనను మామహారాజు మాత్రము సామరస్యము సమకూర్పజాలక వారి నడుమ బడి నలిగి పచ్చడి యగుచున్నాడు. ఈ నడుమ దురదృష్ట మేఘములలో డాగిన తిరుమలమ్మగారియదృష్టభాను డరణపుకవి కలముపోటుతో బైటబడినాడు. నాఁడుమొదలుగ చిన్నమరాణిగారి పరివారజనముల మొగముల గత్తివైచిన నెత్తురుచుక్క లేదు.

( నే ప థ్య ము న )

ఎవ్వ రాసభామంటపమున ? ఓహో ! కొంటెకోణంగి విదూషక మక్కళి మహాశయుడా !

మక్క :- (ప్రక్కకు జూచి) ఓసి ! తొత్తుకూతురా ! ఎంతటి గాఢ సమాధిని గంగ గలిపితివే! అంతిపురమున హాయిగ నేకువక యా స్థాని నడుగు పెట్టితి వేమే? కొంపదీసి నీకును గానంత కవిత్వపుబిచ్చి యెత్తలేదుగదా! (చెవియొగ్గివిని) ఆఁ ఏమనుచున్నావు? "నామాట కేమిగాని నీసమాధిసంగతి యనియా? ఛీ.ఛీ. నిరుద్యోగు లగుసోమ రులకేకాని పాడుకవిత్వ మల్లుకొను ప్రారబ్ధము నా కెందులకే?

( మఱల శ్రవణించి )

"ఆఁ. ఔను. అప్పాజీకంటె నమిత మగు రాజకీయకార్య భరము నీనెత్తిపై నున్నటు లున్నదిపాపము! నీకు తీరిక యెక్కడిది? అయ గారికి నమ్మగార్లకును నడుమ తంపులమారివై యటు నిటు రాయ బారముల సాగించుటకే నీకు కాలము చాలకున్నది. గంటమా డించుటకు నీకు వ్యవధి యేది ?" యని యనుచుంటివా ! (సగర్వ ముగ) ఓ మగవాడు పనివచ్చినపుడు గంటమేకాదు కత్తిగూడ నాడింపగలడు.

(నేపథ్యమున) "నీ మేకపోతుగంభీరత కేమిగాని మహామాత్యు లవా రిటకు దయచేసి యున్నారా ?"

మక్క :- మహాకవుల మాయలలో జిక్కి మహారాజుల మతి యిది వఱకే మందగించినది. మంత్రిగారుకూడ నిచటదిరుమంత్రోపదేశము నాశించుట లేదుగదా! రాణులకు బ్రతినిధులై రాకాసిదాసిముండలే యిక రాజకీయచక్రమును ద్రిప్పుదురు గాబోలును !

( నేపథ్యమున – తమాల )

"వారెగో ప్రధానామాత్యులవా రిచే దయచేయుచున్నారు. ఇక నీ నోటికి తాళమే"

( అంతట తిమ్మరుసు ప్రవేశించును )

తిమ్మ :— ఓహో! మక్కశాస్త్రులా ? ఏమయ్యా! పొలిమేర అరాయి వలె నంత నిశ్చలముగ నిలువబడి యుంటివి ?

మక్క :— మహారాజులమాటల మక్కికి మక్కిగ మహామంత్రులతో మనవిచేసికొనుటకు.

తిమ్మ :— ఏమని ?

విధూ :— ఏ మున్నది. ప్రాతపాఠమే. కవిగజముల భువనవిజయసభా వనాంతగమునకు ద్రోలుట.

తిమ్మ :— సరియే. నీబరువు దించుకొని బ్రదికి బట్ట గట్టుకొంటివి. నీ విక వెడలవచ్చును.

( ఇరువురు నిష్క్రమింతురు )

( ద్వి తీ య రం గ ము )

ప్రదేశము :— సభాభవనము.

ప్రవేశము :— ప్రధానామాత్యుఁడు తిమ్మరుసు.

తిమ్మ :— (తనలో) ఆయుష్మంతుఁడగు మారాయులు కత్తిని గంటమును నేకలీల నుపయోగించుచున్నాడే. తాను విరచించిన విష్ణుచిత్తీయకావ్యమును సమీపభావిలో పెద్దనగారి యధ్యక్షత నావిష్కరింప నున్నాడు. తనరచన రాణు లిరువురకు జదివి విన్పించుచుండ నేనును గొన్నిఘట్టముల వింటిని. రచనలో విశిష్టత యున్నది కల్పన లనల్పములు. (శబ్దము విని) అదిగో హజారములోని గడియారము నాలుగుమారులు ప్రహరించి యాగినది. సభాసమయమాసన్న మైనది. (తెఱవంక జూచి) ఎవడురా అక్కడ ? సభాసన్ను లగు నాస్థానకవీశానులకు స్వాగతవచనము లారంభింప మాయానతిగ వందిబృందము నెచ్చరింపుము.

( నేపథ్యమున వంది) చిత్తము. చిత్తము.
తెరలో గానము

పల్లవి :- "విజయంబు మా భువనవిజయంబునకు సదా॥ విజ॥
అ॥ పల్లవి :- అజమహాద్భుతసృష్టి సతకరించెసుకృతుల
సృజన మ్మొనర్చు కవిగజరాజరాజి కిదె॥ విజ॥"
(నేపథ్యమున వంది)
"తే.గీ. ఆంధ్రకవితాపితామహా! యల్లసాని
పెద్దనామాత్య! శ్రీకృష్ణవిభువిశాల
* కల్పనానల్పధీక! స్వాగతము నీకు."
(ఇరుగెడల నిరువురు సుందరీమణులు వంగి తిర్యక్చరణవిక్షేపములతో మార్గమున పూలుజల్ల పెద్దన రంగాధిరోహణము గావించును.
తిమ్మరుసు :- (ఎదురేగి) ఆంధ్రకవితాపితామహుల యాగమనలాంఛ మీ యాదిమాసన మాకాంక్షించుచున్నయది.
పెద్దన :- (నగుచు) ప్రధానామాత్యుల యానతి కన్యథాత్వ మున్నదా?
(నేపథ్యమున) జయము - జయము. ఆంధ్రకవితాపితామహు లకు. కవిజననయనచకోరరాకాశశాంకులకు (పెద్దన పీఠ మధ్యాసించును)

( నేపథ్యమున )

"ఉ. ముచ్చట దీర ముద్దుపదముల్ గదియించుచు, జిన్నసన్నక
మ్మెచ్చునఁ దీగ లాగినటు, మేదురమాధురి గార, బండితుల్
మెచ్చఁగ, బారిజాతహృతి మేల్కృతిఁ జేసి నృపాలు కేలి కం
దిచ్చిన నందితిమ్మనకవీందుకళాధర! స్వాగతం బయా!
(పూర్వోక్తసరణి తిమ్మన సభారంగ మధిరోహించును)
తిమ్మరుసు :- (ఎదురుగ జని) పారిజాతపరిమళపాటచ్చరసరసకృతి రచయిత లీపీఠిక నధ్యాసింతురుగాక.

---

తిమ్మన :- (నగుచు) అమాత్యమణియాదేశ మవశ్యాచరణీయమే కదా
( తిమ్మన యుపవిష్టు డగును )

( నేపథ్యమున )

"ఉ. దుర్జయకాకవీంద్రపరితో భరితోన్నత సర్వగర్వసం
మార్జనతత్పరా! సుజనమాన్యవరా! సుకవిత్వతత్త్వని
ర్వ్యార్జితసద్యశోధవళితాంధ్రవసుంధర! సాహితీభరా!
ధూర్జటిసత్కవీశ్వర! యిదో గ్రహియింపుము స్వాగతంబులన్
(ధూర్జటి రంగ మధిరోహించును)

తిమ్మరుసు :- (ఎదురేగి) భువనమోహనకవనకల్పనానల్పధుర్యా
ధూర్జటిమనీషివర్యా! ఈ యాసన మలంకరింపుము.

ధూర్జటి :- ప్రధానప్రధానుల ప్రసన్నాహ్వాన సుమూల్యము (కూర్చు
డును)

( నేపథ్యమున )

"మ. ఉరుసాహిత్యకళాప్రశస్తి, ప్రతిభావ్యుత్పత్తిసంపత్తి, వి
స్ఫురణం బారఁగ బాండురంగమహిమాభోగంబు రూపించు క
వ్యరమన్ గూర్చినరామకృష్ణకవినాథా! యుక్తియుక్తోక్తిసం
భరితా! స్వాగతవాగుపాయనము సంభావించి కైకోఁగదే!"
(రామకృష్ణకవి సభారంగము జేరును)

తిమ్మరుసు :- (అభిముఖుడై నడచి) చతురవచనరచనాచణా! యాక్తి
ప్రసంగభంగీకృత కృతముఖప్రతిముఖపండితమండలీవివాదా! వ
కృతవచోదేవతాప్రసాదా! మహారాజమానసమలిమ్లుచా! రామ
కృష్ణకవిశేఖరా! దయచేయుడు.

రామకృ :- (చిఱునగవుతో) అప్పాజీ యభిమానమగంద మాసా
దించిన మాకంటె ధన్యతము డెవ్వాఁడు?
( రామకృష్ణు డాసీనుడగును )

( నేపథ్యమున )

"ఉ. అంగద లేసిలీల నిఖిలావనిలో మను మానవాళిలో
నం గలతత్స్వభావకలనం గనుదోయికిఁ గట్టినట్లు చూ
పంగలశక్తి నీకృతుల భాసిలు; ద్వ్యర్థికృతిప్రణేత! యో
పింగళిసూరనార్యసుకవీ! యిదె స్వాగత మాదరింపవే!"

( పింగళి సూరకవి రంగ మధిరోహించును )

తిమ్మరుసు :– (ఎదురేగి) వయసున బాలుఁడయ్యును, కవితను ప్రౌఢుఁడగు మాచిరంజీవి సూరనకవయిత్రకై యియ్యాసనము ప్రత్యేకింపబడినది. పింగళివంశముక్తాఫల మిద్దాని నలంకరించుఁగాక.

( నేపథ్యమున )

"ఉ. రామకథాసుధారసము రమ్యభవత్కృతిహైమపాత్రికన్
ప్రేమదలిర్ప నాంధ్రసుకవిప్రకరంబు రసజ్ఞసజ్జన
స్తోమము కామనాప్తి జవిజూచిరి; యయ్యలరాజు రామభ
ద్రా! మహితాత్మ! స్వాగతము రాగదె పూవులబాటమీఁదుగన్."

( రామభద్రకవి రంగాధిరోహణము గావించును )

తిమ్మరు :– (ఎదురుగనేగి) రామభద్రకథాసంవిధానభద్రుఁ డగు మా రామభద్రుఁడు సరససాహితీసముద్రుఁ డేతదాసన భాగ మాక్రమించుగాక.

రామభ :– (నగుచు) కవితాసాగ్రహిలు లగుమంత్రిసత్తముల యానయానందసంధాయికము.

( రామభద్రుఁ డాసీనుఁడగును )

( నేపథ్యమున )

"క. భువనవిజయాంక భవనము
భవదీయాగమననిరతవాంఛారంభ

స్తవనీయము స్వాగతికం
బవుచున్నది మాదయార్యమల్లనసుకవీ !

తిమ్మరుసు :- (ఎదురేగి) మాదయసూరికుమారమణి యీ రమణి యాసన మంగీకరించుఁగాక

మల్లన :- (నగుచు) విద్యానగరప్రాభవసంభాతల యానతులు శిరోధార్యములు.

( ఉపవిష్టు డగును )

"శ్లో॥ శ్రీకృష్ణరాయగ్రహణైకధన్యా
కర్ణాటభాషామయకావ్యకన్యా
భవన్మనీషాజలరాశి జన్యా
తే స్వాగతం తిమ్మకవీంద్రమాన్య!"

( తిమ్మకవి ప్రవేశించును )

తిమ్మరుసు :- (ఎదురేగి) గీర్వాణకర్ణాటకోభయభాషావిశేష విభూషితః కర్ణాటకవికులతిలక స్తిమ్మమనీషీ సలీల మాసన మలంకరోతు.

తిమ్మకవి :- (సహాసం) భవతాం తత్రభవతా మవశ్యసంభావనీయో నీయోగః (తిమ్మకవి నిషణ్ణు డగును)

( నేపథ్యమున )

మ. నితరామర్చిత మారుతాత్మజ కృపానీరంధ్రనిక్షేపవ
చ్ఛతలేఖిన్యవధానపద్యకలనా సంగీతచాతుర్యతో
షితసన్మండల! రామభూషణమనీషీ! ద్వ్యర్థికావ్యైకని
ర్మితిరాజన్మతి! స్వాగతోక్తి గొను కీర్తిస్ఫూర్తి నర్తింపగన్"

( రామరాజభూషణుడు రంగస్థలి జేరును )

తిమ్మరుసు :- (ఎదురేగి) గిరాం దేవతానుచయుగళీపయఃపానసమాసాదితసంగీతసాహిత్యసంస్తుత్యా ! కవిభూషణా ! రామరాజభూషణా! ఈ విబుధాసనము నీచే సనాథ మగుగాత!

రామ :- (సవినయముగ) భారతీయప్రాభవవివర్ధన సమర్థు లగు విజయ నగరసామ్రాజ్యప్రధానప్రధానుల సపరితోషాహూతి శిరోధార్యము గదా, (రామరాజు మంత్రికి సభాసదులకు వందించి కూర్చుండును)

తిమ్మరుసు :- (ఆనందముతో) పండితమండలిచే నేఁడు మన భువనవిజయము పుండరీకమండిత మ్మగుసరోవరమువలె గలకలలాడుచు న్నది. ఇక సభాసరశ్శోభను ద్విగుణీకరింపగల రాజహంసము రానై యున్నది.

( నేపథ్యమున )

"జయ విజయీభవ! జగనొబ్బగండబిరుదాంక! జయ జయ రాజ వేశ్యాభుజంగ! జయ కవికోకిలవసంత! జయజయ నరసింహదేవ సుకుమార సుకుమార! జయ తృణీకృతకుమారవిక్రమక్రమ! జయ మదవతీమదన! జయ జయ ఆంధ్రభోజ! జయ విజయీ భవ శ్రీకృష్ణరాయసార్వభౌమ!

తిమ్మరుసు :- (ఆలకించి) వారెగో! విద్యాసముద్రు లగువిద్యానగర ప్రభువరేణ్యులు విజయం చేయుచున్నారు. (అభిముఖముగ నడచును) ( సభాస్తారులు లేచి నిలువఁ బడుదురు )

( తృ తీ య రం గ ము )

[ ప్రదేశము :- భువనవిజయము ] [ ప్రవేశము :- కృష్ణరాయలు—మక్కళుఁడు

శ్రీకృష్ణ :- (చేతులు జోడించి) నమస్సభాయై. ఎల్లరును సుఖాసీను లగుటకు మావినీతవిజ్ఞప్తి. పండితకవిమండలి మహదాశాసనము లతో మా విష్ణుచిత్తీయకావ్య మావిష్కరింపబడవలసి యున్నది. అమ్మహోత్సవ మవిఘ్నముగ సాగింపగల సమగ్రత కవిచందిరుల యధీనమందే యున్నది గాదా!

మక్క :- అయ్యయ్యో! పండితకవులు పద్దియము లల్లగలరు గాని కమ్మనివంటకములు వండుట గని విని యెఱుంగము. కవనమున గాసంత శృంగారరస మధికమైన నంతగ బ్రమాదము లేదు గాని వంటకములలో రవంత లవణరస మమితముగ గటాక్షించిన గంగ వెఱ్ఱులెత్తి భోక్తలు కాందిశీకు లగుటమాత్రము తథ్యము.

పెద్దన :- (నవ్వుచు) మనమక్కళుడు నేడు మహాకవియై మాటాడు చున్నాడే!

కృష్ణ :- మతిమాలిన యీవాచాలునిగోలతో గాలయాపన సేయుట మాని మన మిక కవితాగోష్ఠిలో దేలి వినోదించుటకు మా మన ముత్సహించుచున్నది.

తిమ్మన :- ప్రభువువారిచే సద్యోదత్తము లగుసమస్యల సత్కవులు పూరింపవలయు ననునాదేశము గతపరిషత్తుననే ప్రకటిత మైనది గదా!

శ్రీకృష్ణ :- అది యాదేశముగాదు కవీంద్రా! అభ్యర్థనము మాత్రమే అందు గొంత మార్పుపు చేయవలసియున్న దనుకొందును. మహా కవుల బరీక్షించునధికారము మాకు లేదు. కావున గవులలో గవులే పరస్పరము నవీనసమస్యల నిచ్చుకొని పూరించుచుండ మేము సానందులమై సాక్షిధర్మము వహింతుము.

రామకృ :- (నగుచు) అవనీధవులు నవీనప్రియు లను కాళిదాసోక్తి కిదియే తార్కాణము. పెద్ద లగుపెద్దనగారే దీనికి నాందీపూజ గావించుట యాచారము గాదా!

మక్కళ :- ఆగు డాగుడు. దానికన్న మున్ను తగవు పరిష్కరింపబడ వలయును.

శ్రీకృష్ణ :- (నగుచు) మిత్రమా! ఆంధ్రకవితాపితామహులకు నీవు ప్రతినిధిగ నుండి హరిః ఓం'' అని యన నెంచితివా?

మక్క—శ :- మహాప్రభూ! జన్మజన్మాంతరములనైన నన్ను గవిగా బుట్టింపవల దని బ్రహ్మదేవునిశ తథా—సహస్రథా—లక్షథా—కోటిథా—బహుథా—సథా ప్రార్థించుచునే బ్రదుకుచున్నాడను.

రామకృ :- కాని యేమిలాభము? కమలభవుని కర్ణాష్టకమున నీకోరిక దూర లేకపోయినది. ప్రారబ్ధవశమున నీవు కవిగా మారితివి. భోజుని మోము గన కవి యగువారట! నీ వాంధ్రభోజుల యాననము సదా దర్శించుచు భువనవిజయమున దిరుపాదము పెట్టుటచే గవి యగుట తప్పినదికాదు.

మక్క—శ :- కొంప మునిగినది. కవినై నేను పద్దె మల్లి యంగడి బెట్టి యమ్ముకొనజాలను. దాని గొని నలువురినోళ్ళ బడి తల నెత్తుకొని తిరుగనులేను.

శ్రీకృష్ణ :- ఏమి! పద్య మమ్మినవా రెవ్వరు? కొనినవా రెవ్వరు.

మక్క—శ :- ఇరువురు నీ సభయందే యున్నవారు. నన్నడుగు టెందులకు? తిమ్మనకవీంద్రులు ముక్కుపై ముద్దులొలుకు పద్దియ మల్లి దానిని భట్టుమూర్తిగారి కమ్మినారట.

రామకృ :- (లేచి) ఛీ. ఛీ. ఇదియేమియపవాద మయ్యా! "నానాసూనవితానవాసన" లనుపద్యమును మించుపద్యరాజముల నవలీల వేలకొలది రచింపగల వసుచరిత్రకవి— పండితవిమర్శకు బాత్ర మగు నీపద్దెమును గ్రయించి తన పొత్తమున బొందుపఱచెనా? ఇది మతి గలమానవుడు విశ్వసించునా?

శ్రీకృష్ణ :- (తిమ్మనదెస రామరాజు వంక జూచును)

తిమ్మన :- (లేచి) మహారాజా! రామరాజభూషణకవి ప్రౌఢకవితా విలాసగతిగాంచి యసూయ నందిన యల్పబుద్ధి యెవ్వడో నదించిన ప్రవాద మిది. నే నీ పద్యకర్తను గాను.

పెద్దన :- తిమ్మనకవిగారి ప్రకటనమే యీ విషయము నిర్ధరింప బ్రమాణము. ప్రభూ! కాని మనరామకృష్ణమనీషిమాత్ర మీ పద్యము పండితవిమర్శలకు పాత్ర మని యొక్కచణుకు విసరినాడే!

రామకృ :- (నగుచు) భువనవిజయకవిబృందమునందలి యొక కవిప్రముఖుడు తెలమలుగున గావించిన యధిక్షేపణ మాలకించి యట్లంటిని గాని నాకు సందియమే లేదు.

శ్రీకృష్ణ :- ఏమని యా విమర్శనము? ఆ పద్దె మొకమారు పఠింపుము రామకృష్ణకవిచంద్రా!

రామకృ :- "శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా? న న్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపం బంది యో
షానాసాకృతి బూని సర్వసుమనస్సౌరభ్యసంవాసి యై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజమ్ము నిర్వంకలన్"

శ్రీకృష్ణ :- ఆహాహా! ఇంత మనోజ్ఞ మగుపద్యము నిశితవిమర్శలకు లోనగుటయా!

మల్లన :- ప్రభూ! గంధఫలి స్త్రీలింగము సౌరభ్యసంవాసి యనునది పుంలింగము. వీనికి విశేషణవిశేష్యకల్పనము కవి గావించె నను నధిక్షేపణ మేమో!

పింగళి :- ఆఁ దీని కాధార మేది? లింగసంఖ్యావిభేద మున్నను విభక్తి యొకడే యగుచో విశేషణవిశేష్యత చెల్లు ననుకారిక యున్నది కాదా మల్లనకవినాథా! వైయాకరణశిరోమణి యగు మన రామరాజున కామాత్రము తెలియక ప్రయోగించెనా?

పెద్దన :- సరియే. ఇవుడు మా తిమ్మనకవివరునిచే గింపదంతియు, సూరనార్యునిచే సందియమును సమాధానింపబడినవి కావా?

మక్కళ :- (ఉవ్వెత్తుగ లేచి) లేదు. స్వామీ! లేదు. హతశేష మపారముగనున్నది. నే నద్దాని గ్రుక్కతిప్పకుండ గ్రక్కివేయగలను.

రామకృ :- (నగుచు) మక్కళివిమర్శకంచున్యు డిదివఱలోనే తన కుప
దేశింపబడిన విమర్శనాభాసమును నా చెవిని వైచినాడు.

శ్రీకృష్ణ :- ఏమని ?

రామకృ :- ఈపద్యమున గర్భ్యపదము గంధ ఫలి స్త్రీలింగము. సారంగము పుంలింగము. తన్ను సారంగ మంగీకరింపని కారణమున నా గంధ ఫలి స్త్రీ తపించి గిరికాదేవినాసమైజన్మించినది. సారంగము గిరికా ప్రేక్షణమాలికామధుకరీపుంజమై జనించి యిరువంకల సమీపగత మగుటచే గంధఫలికోర్కి నెర వేరినది. ఇది యిందలికల్పనము.

శ్రీకృష్ణ :- ఔను. ఇందు సందియ మే మున్నది ?

రామకృ :- సాంగముగ ప్రభువు లవధరింప ప్రార్థితులు.

"ఇందు గంధఫలీపదము స్త్రీలింగము. సారంగపదము పుంలింగము గదా. స్త్రీ యగుగంధఫలి పురుషు డగుసారంగముయొక్క సంపర్క మభిలషించినది. కాని సారంగముచే బ్రతాంరింపఁబడి దీక్షతో దపించి పునర్జన్మమున దపఃఫలితముగ స్త్రీలింగ మే యగునాన యై గిరికాదేవి మోము నాశ్రయించినది. అనగ జన్మాంతరమున గూడఁ స్త్రీగనే జనించినది. కాని పుంలింగ మగుసారంగము పుంలింగ మగు మధుకరవారమై పునర్జన్మమున గిరికానన మాశ్రయింపక స్త్రీలింగ మగుమధుకరియై పుట్టినది. స్త్రీలింగ మే యగుప్రేక్షణ మాలికయే యైన నేమి ప్రయోజనము? మధుకరి యైనది. ఒక స్త్రీ యొకపురుషునకై తపించి మే న్విడిచి మఱల స్త్రీయై పుట్టినది. ఆ పురుషుఁడు పురుషజన్మము దాల్పక స్త్రీయై యా వలచినకాంత నంటసిల్లినాఁడు. ఇది యిందలి రసభంగము. నిరుపయుక్త మగు తపశ్చరణము"

పెద్దన :- (అట్టహాసము గావించి) మహారాజా! మనరామలింగకవి గొప్ప చిక్కు దెచ్చిపెట్టినాఁడు గదా.

రామకృ :- ఇది నా విమర్శకాదు మహాత్మా! అజ్ఞాతావిజ్ఞతలనడుమ బడి మిడుకుచు నజ్ఞాతవాసి యైన యీ యసూయావిష్టు డగుకవి దే యని నే నాదిపుండే మహారాజులకు మనవి నొనరించితిని.

రామరాజు :- (లేచి నగుమొగముతో) ఇపుడు రామకృష్ణకవి బాహా టించిన యీ తెఱమరుగువారి చిలుకపలుకులు బాగుగనే యున్నవి. కాని యిందు గలశంక యేమో నాకవగతము గాకున్నది.

మక్కళి :- మోమోటలేక మారామకృష్ణుడు పద్దియమును ముక్కలు ముక్కలుగ దెగగొట్టి చెప్పియుండ నక్షరాభ్యాసోత్సనమే యెఱు గని యీ మక్కళాచార్యునకే తెలిసినదే. మహాకవిని నీవు గ్రహింపలే దనిన నేను నమ్ముదునా?

రామరాజు :- పద్యముననే నాభావము దేటతెల్లముగ వెల్లడింప నీవిచికిత్స లెందులకు? తపించి తనువుపీడినము జన్మాంతరమున సతి యై జనించినగంధఫలికి ప్రేక్షణమాలికామధుకరీకాంతలు దాపు రించుటచే తపము విఫలమేకాక విపరీతఫలప్రదముగూడ నైన దనియే పద్యభావము. అనగ దీక్షతో తపించినను, జన్మాన్తర మునగూడ గంధఫలిగోరిక నెరవేరలే దనుట. దీని ని ట్లుండనిండు. గంధఫలి,నాసాపదములు స్త్రీలింగము లైనట్లు, సారంగ మధు కరీపుంజపదములుమాత్రము పుంలింగములు కావా? పుంజశబ్దము పుంలింగమని విమర్శకుడు మఱపు నందనోపు.

ధూర్జటి :- సెబాస్-రామభూషణకవిమణీ! ఆ కింవిమర్శకునకు జక్కని సమాధానము నిడి వానిపటమును వానిమొగముననే కొట్టితివి. మక్కళా! ఇప్పుడైన నీసందియము దీరినదా!

మక్కళి :- దేహామే యెఱుగక యిందు బడియున్ననాకు సందేహ మేమి? ఆ పెద్దను దిక్కు తీరవలయును గాని

రామకృ :- ఆ పెద్దలపేరిపేరోలగమున గాసంత సంస్మరించిన మహా పుణ్యము గాదా?

శ్రీకృష్ణ :- రామకృష్ణ కవీశా! ఈ కందుఱీగలతుట్టను మఱి మఱి రేపెద వెందులకు? మక్కళా! మహాకవుల నధిక్షేపించు సాహసమున కిక స్వస్తి చెప్పుము.

పెద్దన :- మహారాజా! మక్కళవిదూషకునిమాట లిం దేరికిని గోపకారణములు గావు. పరిషత్తులలో ప్రబంధవిమర్శనలకు వాదోపవాదములకును దావొసంగుటలో దప్పున్నదా? "స్పర్ధయా వర్ధతే విద్యా" యను నార్యోక్తి దేవరవారి కవిదితము గాదుగదా?

రామకృ :- ఆంధ్రకవితాపితామహుల యభిప్రాయ మింకను ప్రస్తుత శంకాసమర్థనములు సమాప్తి నందలే దనియే కాబోలును.

శ్రీకృష్ణ :- పెద్దనార్యా! వాదిదౌర్బల్యమే, నాదిదౌర్బల్యము కావున వాదమున కవధి యెక్కడిది?

పింగళి :- పూర్వపక్షముల బుంఖానుపుంఖములుగ జేయగలసమర్థులును, వానిని ఖండించి సిద్ధాంతీకరింప బటీయు లగుబుద్ధిశాలురును గల యీ భువనవిజయమహాపరిషత్తున పెద్దనగారి యాదేశము మాననీయ మేమో.

శ్రీకృష్ణ :- పరస్పరవిద్వేషములకు మూలములు గాని మీమాంసరస విమర్శనలను మేముమాత్ర మాతంకింతుమా-కానిండు.

పెద్దన :- రామభూషణా! నాశంకన న్యథా భావింపకుము. సత్కాలక్షేపమునకై నీసమర్థనము నిట్లు శంకించుచుంటిని. ఉత్తమకవీ-నీ విపుడు పుంజశబ్దపుంస్త్వ మాధారముగ పద్యమును స్థిరీకరించితివి. ఈపుంజము మధుకరీపుంజమే కాని మధుకరపుంజము గాదే. గంధఫలీకామినికి మధుకరీమానిను లెందులకు? భావలోపము బరిశీలించుకొనవలదా?

తిమ్మన :- పెద్దనామాత్యా! శంక లన్నియు నాదినుండి యంతమువఱకు శబ్దముల గైకొనియే సాగుచుండె. నిపుడు పుంజశబ్దమును బోనాడి భావమాత్రగ్రహణమున వాకొనుట ధర్మమా?

రామకృ :- సెబాస్ తిమ్మనమనీషిరత్నమా !

శ్రీకృష్ణ :- కవిదిగ్గజములకు మా నమోవాకములు. మే మిట కే యభిలాషతో నేగుదెంచితిమో దాని దీర్పు సవినయసంప్రార్థనము.

తిమ్మన :- చిత్తము. విద్యావయోవృద్ధు లగుపెద్దనగారే తొలుత నుపక్రమింపగలరు.

పెద్దన :- కాదు. అన్నిట సమర్థు లగుమీరే యారంభింప నావాంఛితము.

తిమ్మన :- అటులైన సమస్యాపూరణప్రప్రథమగౌరవము మీకే దక్కవలయును. రాజస్తవగర్భిత మగు నీసమస్య నవధరింపుడు.

సమస్య :- "చ. రసికుడు రాజు సత్కవియు రాయలెకాక మఱొండు లేడిలన్,"

పెద్దన :- ఓహో! ఉభయతారక మగు నీసమస్య మా కమితోత్సాహమును రేకెత్తించుచున్నది.

"చ. ఒసపరిపాపపూపసగ పూరగ ధీరతరప్రసంగ మిం
పెసగ నొనర్చువాడు, గుణమే గణియించెడువాడు, కామినీ
కుసుమశరాసనుండు, నవకోమలసారకవిత్వ సత్కళా
గసికుడు, రాజు, సత్కవియు, రాయలె కాక మఱొండు లేడిలన్"

శ్రీకృష్ణ :- (హర్షముతో) ఆంధ్రకవితాపితామహుల సీమలు దాటిన వాత్సల్యమర్యాధిక గౌరవము ననుగ్రహించుచున్న దేమో కదా!

పెద్దన :- (నవ్వి) పండితప్రభువులకు నిరహంకృతిప్రసంగము సహజమే. ఇక నావంతు వచ్చినది. తొలుత మనమహారాజుపై దిమ్మనకవీంద్రు లొకపద్యము సెప్పి పిదప "రతు లానందము గూర్చె రాముని కుం బౌరస్త్రీజనప్రవృత్తముల్" అనుపద్యపాదము బరిపూరింప మాకోరిక.

తిమ్మన :- చిత్తము. క. దోషాకరుండు రాజట !
భాషాసాగరుడు మధురభాషణుడు లస

దోషాపంచశరుండు తు
రాషాడ్వైభవుఁడు కృష్ణరాయలు వెలయన్.

ఇటుపై సమస్యాపూరణము సభాసదులు శ్రవణింతురుగాక.

“మ. శితికంఠోగ్రధనుర్విదారణముచే సీతావధూటిల్ శుభో
ద్ధతిఁ జేపట్టి” దమించి భార్గవునియౌద్ధత్యం, బయోధ్యాపురిం
బితతో దమ్ములతో వధూజనముతో వేంచేయఁ గర్వాపహా
రతు లానందముఁ గూర్చె రామునకుఁ బౌరస్త్రీజనప్రత్తముల్.”

ఇక మాసమస్యాప్రయోగము సమగ్ధతముఁ డగురామభూషణకవి దెసకు మరలింప దలచితిమి. హరిశ్చంద్రనలోపాఖ్యానకావ్యకర్త కిది యొకలెక్కలోనిది గాదు. రామభూషణా! రాజప్రశంస నొకసీసమున నాశువుగ జెప్పి యాపై

“కం. కాలుఁడు హిమశైలబాలఁ గౌగిటఁ బొదివెన్.”

“ఉ. వర్తకముల్ నటింపఁ బురిఁ బొఱెను నీ రవిరామసంగతిన్.”

అనుసమస్యాయుగళము బూరించి పండితప్రభువుల మన్ననలబడయుము.

రామ రా :- సీ. కవిసమూహమ్మును గాందిశీక మొనర్చె
దమ్ములశోభ నెంతయు హరించె
పాంథలోకమున కపారార్తి గల్పించె
పూర్వపక్షస్ఫూర్తి గర్వ మందె
కింకిరాతుని జేరి కైంకర్యము నొనర్చె
నజహత్కలంకంబు ననుభవించె
బహుళదై నందినపటుకార్శ్యమునఁ గుందె
గురుసతీసంగమపరత మించె

తే. గీ. కువలయామేయసంపదఁ గులుకుఁగాక
జడధితనుజాతుఁ డైనదోషాకరుండు
రాజ్ఞో! రాజశబ్దసార్థకత నీకె!
హరిగుణసాంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!”

ఇక సమస్యాపూర్తి నిర్వర్తింపబడును.

"క. కేల నవలీలఁ బెఱుకుచుఁ
కైలాసాచలము నెత్తఁగా రావణుఁ డాం
దోళించుదానిఁ గంశే
కాలుఁడు హిమశైలబాలఁ గౌఁగిట బొదివెన్."

"ఉ. ఆర్తి ఘటిల్లె బంధనము లారమిఁ బౌరుల; కాలమంద సం
ఫూర్తిగ లంఘనం బెసంగఁ బొక్కెఁ; దటిల్లతికావితానవి
స్ఫూర్తి రహింపఁగా నశనిపుంజముఁ జిమ్మెచు గ్రమ్మెపుష్కలా
వర్తకముల్ నటింపఁ బురిఁ బొఱెను నీ రవిరామసంగతిన్."

శ్రీకృష్ణ :- మఝ్ఝారే! శతవధానవిధాన నిధానమగు మా వసుచరిత్ర కవి భూషణుని కీసమస్యాపూరణము 'దండాపూపన్యాయసదృశ మే కదా!'

రామరా :- మా కత్యుక్తికంటె స్వభావోక్తియే సమ్మతము. పాండు రంగమాహాత్మ్యప్రబంధరచయిత యిక సమస్య నొసఁగదగును.

రామకృ :- ధూర్జటికవిధూర్జటీ!

(సమస్య) "చ. మునిఁ బరిమార్ప నేమిటికి ? ముద్దులగుమ్మను బొంద నేటికిన్ ?"

అను దాని బూర్తి గావించెదవా ?

మక్కళుఁడు :- (లేచి) అన్యాయ మన్యాయము! క్రమము దప్పినది.

శ్రీకృష్ణ :- (చిరాకుతో) పానకములోని పుల్లవలె మాటిమాటికి నీ వడ్డురాకుము మక్కళా! ధూర్జటిసుకవీ! మీపనిఁ జూచుకొనుఁడు.

ధూర్జటి :-

"చ. జనని 'యుమా యుమా' యనుచు సారెకు సారెకు నెంత చెప్పినన్
వినక, హరు న్మనోహరుగ వే గొని పార్వతి తా దపింపగా,
మనసిజవిద్ధుఁడై శివుడు మారు దహించి యుమన్ గ్రహించె, గా
ముని బరిమార్ప నేమిటికి? ముద్దులగుమ్మను బొంద నేటికిన్ ?

ఇక మూడవంతు వచ్చినది. అవతారద్వయశక్తి నభిధాన మందే తాల్చిన మా రామకృష్ణునకు సమస్యల బూరించుటయన నల్లేరుపై బండియే. ప్రభువుల యభిరుచి బాటించుట మావిధి.

(సమస్య) "శా. వాణీనాయకు డెద్దు వీడి రథియై రాజిల్లె నుగ్రాకృతిన్."

"ఉ. అందఱు నందతే మరియు నందఱు నందఱె యంద అందఱే!"

రామకృష్ణ :-

"శా. క్షోణిం జేసి రథమ్ముగా, హరులుగా శ్రుత్యాళి గల్పించి యా
వాణీప్రాణవిభుండు దోలుకొనుచున్ వచ్చెన్; రమానాథుఁడున్
బాణంబై పరగెం గరమ్మున, బుగధ్వంసార్థసన్నద్ధశ
ర్వాణీనాయకు డెద్దువీడి రథియై రాజిల్లె నుగ్రాకృతిన్."

శ్రీకృష్ణ :- (నగుచు) ధూర్జటికవినాథా! కవుల కసహాజ మగు నైకమత్యమునకు మీరు మార్గదర్శకులైనారే! సమస్యాప్రదానమున యత్నించి యతి భంగించి పూరించుమిత్రమునకు సౌలభ్యము సమకూర్చితిరే. అటులే కానిచో 'రాజిల్లె' ననుటకుమారుగ 'భాసిల్లె' నని యనియే యుందురు.

మల్లన :- ప్రభువులు రసజ్ఞులేకాక దోషజ్ఞులుగూడ నని వెల్లడి యైనది.

రామకృ :- సమస్యావిషయమున నిది దోష మన వీలుకాదేమో ఇఁక రెండవది.

"ఉ. కొందఱు ధర్మకర్మతులు, కొంద ఱవక్రపరాక్రమక్రముల్
కొంద ఱనూనదానపరితోషనధీకలనా నిధాను, లెం
దెందున నుందురేమొ కలి నీయిలలోనఁ; బరోపదేశమం
దందఱు నందతే మఱియు నందఱు నందఱె యంద అందఱే!"

శ్రీకృష్ణ :- బళీ! రామకృష్ణకవిచంద్రా! ఇక నయలరాజురామభద్రకవిసుధాకరులు పింగళి సూర్యనార్యులకు సమస్య నొసంగుదురు.

రామభ :— (లేచి)

(సమస్య) ఆ. వె. నీరసమ్ము బల మపార మొసఁగె'' యనుదాని బూరింపుడు.

పింగళి :— ఆ.వె. చాలతడవు నెఱపి జలకేళిఁ బ్రియులతో
నగ్నివర్ణభూపు డలసిపోయి
చెలులతోడ గూడి సేవించుచో గోస్త
నీరసమ్ము బల మపార మొసఁగె.

రామభ :— రాఘవపాండవీయరచయితలు సమస్య సరసగతి బూరించిరి. ఇపుడు వారు మాకు నొసంగగలరు.

పింగళి :— (సమస్య) మ. దురమయ్యెన్ దమయంతికి న్నలున కెంతో వింతగా నంతటన్''

రామభ :—

''మ. సుగసందేశములా నిరాకృతము లౌచున్ దీనదీనమ్ములై
మఱలెన్ వెన్క ; కురుస్వయంవరదినంబా డగ్గఱెన్; కంతుడా
విరికోలల్ గుఱిపెట్టి కొట్టె నెడఁదన్; ప్రేమానుబంధమ్ము మే
దుర మయ్యెన్ దమయంతికి న్నలున కెంతో వింతగా నంతటన్''

శ్రీకృష్ణ :— ఇపుడు మా భువనవిజయకవివరులలో నిరువురుమాత్ర మే శేషించి యున్నారు. వారిలో నొక్క రగు మాదయగారి మల్లన కవితల్లజులకు మే మొకసమస్యయు, కవితాపితామహు లొండును నీయ నుత్సహింతుము. కర్ణాటకభాషలో నిజరచిత మగుమహాకృతి మా కంకితము గావించిన తిమ్మనసత్కవిసింహునకు పెద్దనామాత్యులే ప్రత్యేకముగ సమస్య నొసంగుదురు.

మక్కళి :— మాటనిలుకడ మహారాజులకు మాత్ర మక్కఱలేదు గాబో లును!

శ్రీకృష్ణ :— (నగుచు మక్కళి గాంచి) మిత్రమా మే మాడి తప్పితిమా?

మక్కళి :- చిత్తము. ప్రభువులు పరాకు జిత్తగించుట పరిపాటియే. కవులసమస్యలలో గలుగజేసికొనబోమని తొలుత బలికితిరి. ఆశపథము, సాక్షిత్వము నిపుడు చల్లగ జాఱిపోయినవి.

శ్రీకృష్ణ :- ఇది కవితాశక్తికి గలశక్తి గాని మాదోషముగాదోయి! మల్లనార్యా!
(సమస్య) తే.గీ. పదము గఱచెను తన్నరవరుని గరము" దీని బూర్తిసేయుడు.

మల్లన :- "తే.గీ. తపముగావింప తండ్రికన్దరమునందు
పాముఁ జుట్టుపరీక్షిత్తుపైనిఁ గనలి
శృంగి శాపింపఁ దక్షకాహీనగూఢ
పదము గఱచెను తన్నరవరుని గరము."

పెద్దన :- అవనీనాథు నాదిమానతి ననుసరింప దీనినిగూడ గైకొనుఁడు
(సమస్య) ఉ. మారుని కేళిలో దనకుమారుని గూడిన కామినీమణిన్"

మల్లన :-
"ఉ. చేరువ నున్నశయ్యపయి స్నిగ్ధగతిన్ గుఱువెట్టి నిద్దురం
గూరినవానిఁ గృష్ణుఁ గనుగొన్నది కాని యశోద, మున్నెలోఁ
జేరి గమించుదాని దరిసించియు బోల్పకపోయె జీకటిన్
మారుని కేళిలో దనకుమారుని గూడిన కామినీమణిన్."

పెద్దన :- వహ్వారే! మల్లనకవికుంజరుని సమస్యాపూర్తి మనోజ్ఞముగనున్నది. ఇఁక కర్ణాటకకవిసమ్రాట్టున కీసమస్య తగియుండును. తిమ్మనసీమిశిరోమణీ! మనము మహారాజప్రశంసలతో బరిషదారంభము గావించి యుంటిమి. అద్దానితోడనే బరిసమాప్తి నందింపుట మంచి దని మా భావము.

తిమ్మ :- ఆచార ఏష ఏ వా నిదంపూర్వ శ్చావభ్యస్తో నఖలు. పాపఠ్యతాం సమస్యా!

పెద్దన :- "శ్లో. అహో సజాతీయనిబద్ధబుద్ధిః"
తిమ్మన :- "శ్లో. సృజంతి భో కృష్ణధరావరేంద్ర!
విరోధిదారాక్షిషు వారిధారాం
భవత్కృపాదూరకృపాణధారా
అహో! సజాతీయనిబద్ధబుద్ధిః!"
పెద్దన :- అహో! కల్పనానల్పవై దగ్ధ్యమ్!
శ్రీకృష్ణ :- ఇందఱు కవిచంద్రులకు కించిన్మానసికశ్రమ మాకల్పించిన మాకవితాచాపల్యము క్షంతవ్యము. మా కింకను తృప్తి లేదు "సంతుష్టి నందిన పార్థివునకు నష్టప్రాప్తి" యను నార్యోక్తి మీా కవిదితము గాదుగదా.
మక్కళి :- అది రాజ్యవిస్తరణవిషయమే కాని పద్యరచనాప్రసక్తి గా దయ్యా! మహానుభావా! నా కీ సభ జరుగకున్నను సంతృప్తియే. ఏమన "అసంతుష్టో ద్విజో నష్టః" అనుకారికను మీారు పేకజువ్వానువలె నాదెసకు బ్రయోగించుట మానరుగదా!
శ్రీకృష్ణ :- (నగుచు) మక్కళీ! "సుకవితా య ద్యస్తి రాజ్యేన కిమ్" మ్మనుసూక్తి నీ వెన్నడైన నాలించితివా?
మక్కళి :- ఓ. విన కేమి ఆ సూత్రము నాంధ్రభూజానులాచరణమున నుంచిన నాంధ్రకవివరాహము లారణ్యసీమలముస్తె లెత్తవలసినదే.
శ్రీకృష్ణ :- అటు లనుట సరికాదు. వసుమతీశుల భాగధేయములు సుకవుల యధీనములు.
రామకృ :- మా రాచులవారు వసుమతీశులు సుకవులును గూడ.
పెద్దన :- అవనీనాథుల యానతులకై కవిలోకము ప్రతీక్షించుచున్నది.
శ్రీకృష్ణ :- మా యానందమునకై మహాకవుల మానసములకు పున రాయాసము గల్పించుట ధర్మము గాదు. కావున మీా మీా కావ్యములనుండి యొండు రెండు పద్యములఁ బఠించి మాకు శ్రవణసుఖ మాకల్పింప నర్థింతుము. ఏమందురు పెద్దనమహాశయా!

పెద్దన :- చిత్తము దేవా! మనుసంభవమునందలి చంద్రోపాలంభనము బఠింప ననుజ్ఞయా ?

శ్రీకృష్ణ :- అటులే కానిండు. ఆద్యంత మేకరీతి మధురగతి సాగిన యాప్రబంధరాజములో న్యూనాధికత లున్నవా ?

పెద్దన :- (పఠించును)

క. "గోవధము సేయుతురకల,
దైవంబవు నీవు మొదల దక్కక పాంథ
స్త్రీవధము సేయ రోయుదె?,
నీవర్తన మేమిచెప్ప నీరజవైరీ!

క. గాండీవము నీచేతిది, పాండవునిం జేరఁబట్టి బ్రదికితి మావి
ల్లుండిన నేడు నిశాచర!, చెండవె యల్లునికిఁ దోడు శితభల్లములన్.

తే.గీ. పాల బుట్టినమాత్రాన మేలిగుణము,
నేడు నీకేలగల్గు నోనీగజారి!
నీట బుట్టినవాడు గా డోటు వహ్ని,
గాల్చుచున్నాడు జగమెల్ల కరుణ లేక.

చ. ఒక పెనుబాపఁడేడు చల మొప్ప రసాతలసీమకుం జకో
రకములు భూతధాత్రికి సురల్ దివికిం బగ దీరునట్లుగా
మెకమెకపాటుతోఁడ నిను మ్రింగక పో రెపుడుం ద్రిలోకకం
టకు డవు గాన నీమొదలు నజ్జుగ జేసి కురంగలాంఛనా!"

శ్రీకృష్ణ :- వృద్ధమూర్తులకు విశ్రాంతి నొసంగుట మావిధి. ఇక తిమ్మనకవివరులు ప్రారంభింప బ్రార్థితులు.

తిమ్మన :- (పఠించును)

ఉ. ఎంతకులేదు నారదమునీంద్రుడు! శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినగా బలికెం బతి గూర్చుదాన నా
యంతటివారు లే రని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్
నంతను వచ్చుసత్యగరువం బిక చెల్ల దటంచు మానినీ!

చ. అన విని క్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయి వోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి హె
చ్చిన కనుదోయి గెంపు తనచెక్కుల గుంపుచుపత్రభంగ సం
జనితనవీనకాంతి వెదజల్లగ గద్గదఖిన్నకంఠి యై.

శా. ఏమేమీ! కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా?
యామాటల్ చెవియొగ్గి తా వినియెనా? యాగోపికావల్లభుం
డేమే మాడెను రుక్మిణీసతియు, నీ విం కేటికిన్ దాచెదే!
నీ మోమోటలు మాని నీరజముఖీ! నిక్కం బెఱింగింపవే!

చ. అతులమహానుభావ మని యవ్విరి దా నొకపెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చకం బాదవ నూడిదయిచ్చిన నిచ్చుగాక! తా
నతడు ప్రియంబు గల్గునెడ కర్ణ జేసిన జేసెగాక! యా
మతకరివేలుపుందపసి మమ్ము దలంపగనేల యచ్చటన్.

క. కలకాల మొక్కగతిం బూ,
సలలో దాగంబుమాడ్కి సతి మదిలోనన్
మెలగెడు పురుషులు గలుగుట,
తొలిజన్మమునోముఫలము తోయజనయనా!

శ్రీకృష్ణ :- ఆహా! ఎంతస్వభావము పుంజీభవించినది? ఇక మన రామరాజభూషణునివంతు వచ్చినది.

రామకృ :- వసుమనుచరిత్రములకు గొంత నామసామ్యమున్నది కాన మన రామరాజును చంద్రోపాలంభనము గాసంత పఠించిన మంచిదేమో!

రామరా :- చిత్తము (పఠించును)

శా. రాజీవాక్షుల నేచుపాతకివి చంద్రా! రాజవా నీవు? నీ
రాజత్వంబునఁ జక్రముల్ మనియెనో! రంజిల్లి సత్సంతతుల్
తేజం బందెనొ! డిందెనో! యహిభయోద్రేకమ్ము దా జెల్లరే!
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే? రాజౌట దోషార్థమే?

ఉ. ఇంతుల నేచుపాతక మ దింతట నంతటఁ బోదు పాంథలో
కాంతక! నిన్ను ఘోరతమమై ఘనమై యజహాత్కళంకమై
వంతలబెట్టి యారుపదివ్రక్కలు సేయక, పూర్వపక్షపుం
గంతుల కేమి? చూచెదవుగా తుది నీ బహుళార్తిఖేదముల్.

ధూర్జటి :- రామరాజా! యొకపరి దెగడి మఱియొకతరి బొగడిన "ఫలభంగములు సేయు" సకలాగమాంత" యనుసీసద్వయము బఠించెదవా?

రామరాజు :- (పఠించును)

సీ. ఫలభంగములు సేయుచిలుకకు స్వాంగమై,
క్రోధగసంబు ముక్కున నె యుండు
గాలభేదికి మహాకాలమూర్తికి దంట
కోయిల కెఱమంట గుఱియుఁ గంట
మదమరాళికి సదంభస్థితి యుడివోదు,
ముఖరాగమును గళంబున విసంబు
సలరుగొమ్మల దావు లార్చి యాసవపూర్తి
నెడలించునళికి మే నెల్ల మలిన

తే.గీ. మట్టియిట కేలవచ్చి తీయధరబింబ,
మీతలిరుగేలు నీభుజామృదుమృణాళి
కలును నీపుష్పకోమలాంగములు బూని,
గట్టుదొరపట్టి వగుటెల్ల గంటి మబల!

సీ. సకలాగమాంతవాసనల గాంచి విముక్త
కాంచనమ్మగుమాధుకరకులమ్ము
వర్ణిత్వమున దృఢావాప్తి సంయమములై
శౌరి చేర్కొను శుకసంతతులును
గన్న పెంచినవారి గలియక మాధవా
ర్పితసూక్తి మను వనప్రియచయంబు
పద్మాసనాభ్యాసపారవశ్యమున బ్ర
హ్మాధీనగతులైన హంసతతులు

తే.గీ. పుష్పఫలపత్రజలమాత్రముల శరీర
యాత్ర గడపుచు సన్మార్గ మధిగమించి
యెసగు నివియెల్ల నీ కేల యెగ్గొనర్చు
వనిత! యా వంత యావంత వలవ దమ్మ!

శ్రీకృష్ణ :- ఔరా! రామరాజు పిలిచినమాత్ర ప్రౌఢభారతి ఓ, యని పలుకుచున్నది.

రామకృ :- ధ్వనిప్రధాన మగు వసుచరిత్రమే యుత్తమకావ్యమని యాలంకారికుల యభిప్రాయము ప్రభూ!

శ్రీకృష్ణ :- రామకృష్ణకవిప్రౌఢరచన లిపుడు శ్రవింప నుత్సహింతుము.

రామకృ :- (పఠించును)

మ. వనితామానససూనసాయకుడు, జీవత్రాతపాదుండు భూ
జనసన్మాన్యవిశుద్ధవర్తను డుదంచత్త్యాగశీలుండు చం
ద్రుని పెన్నుద్ది సమగ్రకాంతిమహిమన్ నూనూగుమీసాల లే
గొనబుం బ్రాయపు దేజుకూన యత డుత్కోచుండు వాచాలతన్

సీ. కలదు లే దనువాదముల కోర్చి మీనుమీ
సముపంటి యొంటిజందెము మెఱవగ
బహుసంకుమదపంకపాణింధమం బైన
తాళిగోణపుజుంగు నేల జీర

గడలేని పీడ్యంపుగప్పచందురకావి
మోవిపల్లొత్తుల ముసుగుదన్న
సానతాకులు గల్లుసూనాస్త్రశంఖంబు
గతి నఖరేఖాంకగళము దనర

గీ. సఖులు పరిహాసకులు వెంట జనగ యువతి
భుక్తనిర్ముక్తపరిధానయుక్తు డగుచు
నగరఘంటాపథంబున నగుచు దిరుగు
నొఅపుగలతీవి జాతిమాత్రోపజీవి.

గీ. భార్యపాలిండ్లు రిక్తకుంభములు ఆోయి
వెలదిచనుదోయి నిండుకుండలు కులంబు
తరుణిఫాలంబు చవితిచందురుడు వేశ్య
నుదురు వానికి బ్రతిపదిందుండు నయ్యె.

సీ. ఉష్ణున హోమాగ్ని నూదనొల్లడు గాని
విరహజ్వరార్తుడై వెచ్చ నూర్చు
సంధ్యకు బ్రార్థనాంజలి ఘటింపడుగాని
మెరగు నీర్ష్యాకషాయితల కర్థి
నాగమవాదంబు లౌ గా దనడు గాని
విటవాదములు తీర్చు వేగి లేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలడు గాని
యూవతాధరసీధు వాని చొక్కు

గీ. బుద్ధ్యాచిహ్నంబు లపఘనంబున నటింప
సిగ్గువడు గాని కలనఖశిఖరలిఖిత
జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు
నారజము మీరి యూ దుర్వివాహారహారి.

సీ. తాతముత్తాతతంత్రులు తరతరంబు
చీమవలె గూడబెట్టి యార్జితముసేయు
విత్త ముడివోయె దత్కారాయత్త మగుచు
నురగదష్టుని మేనినెత్తురును బోలె.

శ్రీకృష్ణ :– మనరామకృష్ణకవిసింహుని కవనపద్ధతిలో ప్రత్యేకవిశిష్టత యున్నది. ఇపు డయ్యలరాజు రామభద్రకవిహంసము పారిషదుల ప్రస్తుతు లందుకొనగలఁడు.

రామభ :– (పఠించును)

తే.గీ. సాగరవిమంబు గ్రోలి ధూర్జటియుబోలె
నాత్రివిక్రముగతి దివి నాక్రమించి
విధియుబలె నాదిసృష్టి గావించి కాఱు
మొగులు దలపించె నపుడు త్రిమూర్తిమహిమ.

తే.గీ. మేఘరాజులు సరసత మీర దమ్మ
దరళవిద్యుల్లతాదీర్ఘతరకటాక్ష
వీక్షణకలాపముల గారవింప నలరి
నెమ్మినర్తించు బురి విచ్చి నెమ్మిగములు.

శా. ధారాశుద్ధి ప్రసిద్ధిగాంచి, ఘనశబ్దస్ఫూర్తి వర్తిల్లఁగా
దోరం బైన రసస్థితిన్ దరళవిద్యున్మాలికాలక్షణో
దారంబై కవిసేవ్యమై వనమయూరారూఢి బ్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధమా ట్లఖిలపద్యాక్రాంత మయ్యెం దగన్.

తే.గీ. పడియె వడగండ్లు నింద్రగోపములు గూర్మి
ఘనవిభుడు గ్రొమ్మెఱుంగుజవ్వని బెనంగ
బన్నసరమున సడలి పైపైన రాలు
విమలముక్తాఫలాబ్జరాగము లనంగ.

శ్రీకృష్ణ :- ఎంత చక్కనిప్రౌఢధోరణి! రామభద్రార్యా! సీతా రాములగూర్చి రెండుపద్యరాజములగూడ పఠించి ధూర్జటిమనీషి. కవకాశ మిచ్చెదరా?

రామభద్ర :- చిత్తముప్రభూ! (పఠించును)

చ. అలజవరాలు తాలు విభు డంఘ్రుల బోవఁగ ద్రోవఁ ద్రోవ బె
ట్టులికి సతీశతంబు లగునో యనుశంక మొఱంగి నాథ! తా
నెలవుల నూదమెట్టకుము నీచరణాబ్జము కందు నావుడున్
వెలదితలం పెఱింగి రఘువీరుడు నవ్వుచు నేగె నవ్వలన్.

చ. పలుకదొడంగి రవ్వడమిపట్టి గనుంగొని నీ కిదేటికిం
జలమునఁ జావ? నీమగనిసత్తువ యీపొలిమేరఁ జొచ్చి రా
గల దని యెంచితే? ఖరుడుగా డటు కూలబడంగ శంకరో
జ్జ్వల రజతాచలోత్థనన శాత శిఖోన్నఖరుండు మానినీ!"

ధూర్జటి :- (పఠించును)

శా. ఓసామిూ! యిటువంటి కొండదరిలో నొంటిం బులున్ సింగముల్
గాసింబెట్టెడు కుట్రనట్టడవిలో గల్జువ్విక్రీనీడ నే
యాసం గట్టితి వేటిగడ్డ నిలు నీ వాకొన్నచో గూడు నీ
క్లేసుట్టంబులు దెచ్చిపెట్టెదరు? నీ కిం దేటికే లింగమా!

ఉ. కొండల గానలం దిరిగి క్రొవ్వినపందుల నేళ్ల దుప్పులం
జెండిన బెక్కుచందముల జిన్నక పెద్దక గారుకమ్మగా
వండుదు రట్లపిట్టలను వండుదు రిచ్చట నుండనేల? నా
కొండొక టానతీక యుడు మూరికి రాగదవయ లింగమా!

కం. ఓ లింగమ! విను నివ్వరి,
ప్రాలును నోడిపిల్లు గునుకుబ్రాలును వెదురుం
బ్రాలును సవరపుమెకముల,
పాలునుగల వచట నీకు బాయసమునకున్.

గీ. పుట్ట తేనియ పెర తేనె పుట్టజున్ను,
తొఱ్ఱ తేనియ గల వందు దోఁచిదోఁచి
కాలిమలదులనై పిండిపోలె రాలు
నట్టి నింజెట్లు గలవు నీ కారగింప.

శా. ఇల్లో ముంగిలియో యనుంగుచెలులో యాడైనచుట్టంబులో
యిల్లాలో కొడుకో తరింప వశమే యేపోడుము ల్లేక మా
పల్లెం గోరిన వెల్లనుం గలవు తెప్పల్గాగ నీ కిచ్చెదన్
చెల్లంబో యిట నొంటినుండ కటు విచ్చేయంగ దే లింగమా!

గీ. చురుకుజూపున గాలినకొఱత నురుకు,
నురుకుజూపుల బుట్టించు నెఱుకునారి
యిరుకువలిగుబ్బపాలిండ్లయిగురుబోండ్ల,
సేన కిచ్చెద నీకు విచ్చేయవయ్య!

మ. నను మన్నించెద వేని నీ విపుడు రా నా వెంట, రాకుండినన్
నిను నే బాసి చనంగనోప; నిచటన్ నీతోడిదే లోకమై
మనువాడం, గనువాడ నీకరుణ, నామానంబు చిత్తంబు న
చ్చినచో మానుదుగాని నిన్నిపుడు కష్టింబెట్ట నా కేటికిన్.

శ్రీకృష్ణ :- మఝ్ఝూ! ధూర్జటికవన మెంతటి స్వభావసంకలితము! ఇక పింగళివారికవితామకరందము జవిజూడగలము.

మల్లన :- కవితయన నెటు లుండవలయునో మా సూరనగారే నుడువవలయును.

పింగళి :- దానినిర్ధరింప నే నెంతవాడను? అది మధురమో యధరమో యాస్వాదించు వారియభిరుచిపై నాధారపడి యుండును. నాభావము నే వాకొందును. (పఠించును)

సీ. శబ్దసంస్కారగ మెచ్చుటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగా
బునరుక్తిదోషంబు పొంత బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియ గడవ జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నడుకుచు
నుపపత్తి యొందు నస్ఫూర్జితముగ

తే. నొకట బూర్వోత్తరవిరోధ మొందకుండ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనర
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె!

సీ. పొసగ ముత్తెపుసరుల్ పోహళించినలీల
దమలోన దొరయుశబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు నస్థాంబుగ వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితమ్ములై తనరారెడు
ప్రాసంబు లింపుగా బాదుకొల్పి

గీ. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవిత చెప్పంగ నేర్చుసత్కవివరునకు
వాంఛితార్థంబు లొసగనివారు గలరె?

లయవిభాతి :-

చలువగలవెన్నెలలచెలువునకు సౌరభము గలిగినను సౌరభము చలువయు దలిర్పం, బాలు పెసగుకప్పురపు బలుకులకు గోమలత నెలకొనిన సౌరభము జలుచపసయుం గో, మలతయును గలిగి జగముల మిగుల బెంపెసగు మలయపవనంపుగొదమలకు మధురత్వం, బలవడిన నీడు మఱి కల వనగవచ్చు గధవెలయుగల యీ సుకవిపలుకులకు నెంచన్.

శ్రీకృష్ణ :- సూరనకవయితధోరణి సుకవిజనాదరణీయము. ఇక మంచి పద్యము కట్టకడకు దాచుకొనినటులు మాయల్లనకవితల్లజుని సుకవితతో సభ సమాప్తి గావింతము.

మల్లన :- (పఠించును)

ఉ. నిద్దపురత్నభిత్తి దననీడఁ గనుంగొని తోడనాడు న
మ్ముద్దులబాలు డంచు గరముల్ పలుమాఱును జాచి చీరుచున్
విద్దెము సేయుచుం దిరుగు విందులు విందులు విందు లంచు నే
ప్రొద్దు నృపాలుకున్ సతియు బొంగుచు నక్కున గారవించుచున్.

శా. కేళీకాంచన సౌధవీథికలచక్కిం దొట్లలో బెట్టి యో
ప్రాలేయాచలకన్యకాధవ! కృపాపాంగంతా! నిద్రపో
వే లావణ్యపయోనిధీ! యనుచు నావిర్భూతమోదంబునన్
జోలల్ పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతామణుల్.

క. అల్లారుబెల్లమై గలు
గల్లున నందియలు మొరయగా వేడుక పె
న్వొల్లి మురిగించె ధరణీ
వల్లభనందనుడు చూచువారల చూడ్కుల్.

గీ. కఱకుజూపుల మూడవకన్నునంగ
రత్నములు గీలుకొల్పినరావిరేక
ఫాలభాగంబునను గ్రాల బాలుఁ డపుడు
శంబరారాతియభియాతిచంద మయ్యె.

మ. వనితానేత్రచకోరచంద్రిక తనుస్వచ్ఛందకాంతిచ్ఛటా
ఖని యుత్సాహకళాఖసూరి మతిరేఖామంత్రసంసిద్ధి భో
గనివాసంబు లతాంతసాయకభుజాగర్వావలంబంబు యీ
వన మమ్మానవనాథపుత్రునకు మన్వం బొప్ప నేతెంచినన్.

ఉ. రామునికంటె నప్పరశురామునికంటె ధనుర్విశేషవి
ద్యామహనీయుడై మెఱసి యాతడు చేతులు తీట వో సము
ద్దామ విరోధిబాహుజవితానము నుక్కడగించి వీరల
క్ష్మీమదిరాక్షికిన్ వలపు గీల్కొలిపెన్ విషమాస్త్రకేళికిన్.

శ్రీకృష్ణ :— కర్ణాటకభాషాపారంగతుడు మాతిమ్మకవిదక్షిణ దక్షిణ వారిపద్యపఠనములు పరిపూర్తి నందినవి. ఇచట సదస్యులలో బలువురికి కన్నడ మపరిచితము గావున వీరి శ్లోకసమస్య నందఱి యంగీకృతితో నామరభాషలో నొసంగ సంకల్పించితిమి. ఏమి తిమ్మనకవిసత్తమా? అనుమతింతురా?

తిమ్మ :— యథా రోచతే సత్కవిరాజన్యానామ్. సమాహితా వయమ్.

శ్రీకృష్ణ :—

శ్లో. "శీతరశ్మి రివ దృశ్యతే రవిః" పూర్యతాం మహాభాగైః.

తిమ్మ :— (పూరించును)

శ్లో. ద్యోధునీవిమలవారివిస్ఫుర
త్తావకాయతసుకీర్తిమండలైః
కృష్ణరాయనృపతే! పరీవృత
శ్శీతరశ్మి రివ దృశ్యతే రవిః

తిమ్మన :— అహో! తిమ్మకవిబ్రహ్మణో గైర్వాణీగిరాం దేవతా! సుకవే! పునః పాఠ్యతా మేష శ్లోకః.

తిమ్మ :— (సహర్షమ్) రసికసుకవీంద్రదయాసాంద్ర మాజ్ఞాపనం శిరోధార్య మేవ. (ఇతి పునః పఠతి)

శ్రీకృష్ణ :- మాకోరిక సఫలీకృత మాచరించిన కవిపుంగవమండలికి మా వందనసహస్రములు. ఇక సభాసమాప్తి గావింతమా?

అందఱు :- చిత్తము. చిత్తము.

శ్రీకృష్ణ :- మిత్రమా! మక్కళా! సత్కవిసత్కార మికయవశిష్టము గాదా?

మక్కళి :- మహాప్రభువులు మా కావిషయ మాదియందే యను మాత్రము సూచించియుండిన మేమును నే తిమ్మకవిగారినో, దాసు కృష్ణకవిగారినో సమాశ్రయించి రెండుమూడు భుజంగప్రయాతముల వ్రాయించుకొని వచ్చియే యుందుము.

శ్రీకృష్ణ :- అన్నిపాట్లు బడకుండగనే నీవును బహూకరింపబడుదువు గాదా?

రామకృ :- ప్రభువులు పాలితుల యెడాటమున బండితపామరత్వముల పాటింపరు.

పెద్దన :- ఔను. పండితులలో వీరలు ఘనులు. పామరులలో మక్కళు మహాఘనుడు.

మక్కళి :- చిత్తము. మా కాశక్తి కొఱత-మీకు మా సామర్థ్యము శూన్యము. ఉభయులము సమ్మానార్హులమే. నానోటికడ గూడు పడగొట్టుట పాడిగాదు.

శ్రీకృష్ణ :- నిరుత్సాహము వలదయ్యా మక్కళిమహావిదూషకా! నీ కళకు ప్రత్యేకస్థాన మీయాస్థానమం దున్నది.

రామకృ :- చిత్తము. వీనిసాలువునకు విలువయే వేరు. దానికిరూపమే లేదు.

అందఱు :- (నవ్వుదురు)

మక్కళి :- (లోనికేగి కాశ్మీరపుసాలువలు, తాంబూలముల నందించును. రాజు క్రమానుగతి గవుల సత్కరించును)

మక్కళి :- మానాలువు మాట మహారాజులు మఱచి మహాకవిభుజా దండమున వైచెదరేమో.

రామక్క :- నీమను నీనాలువునను బారిశేషికన్యాయమే.

పింగళి :- ఔను. మక్కళిమహాత్మునకనామకతయు ననాకారిత్వమును సహజసిద్ధములు. కావున......

తిమ్మకవి :- ఏతస్యంబహూక్రియమాణస్య ప్రావార స్యాపి చ.

శ్రీకృష్ణ :- (హసించును) వో నమః పండితాఖండలేభ్యః (చేతులు మోడ్చును.)

అందఱు :- స్వస్తి కవిమండలేశ్వరేభ్యః.

(నేపథ్యమున గానము)

పల్లవి :- విజయంబు మా భువనవిజయంబునకు సదా॥ వి॥

అ. ప॥ అజమహాద్భుతసృష్టి నతకరించినకృతుల

సృజన మొ్నర్చు కవిగజరాజరాజి కిదె॥ విజ॥

పెద్దన :- తథాస్తు - తథాస్తు - తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు)

సంపూర్ణము.

# విగ్రహారాధన దానిచరిత్ర-పురాతనయుగము.

శ్రీగరిమెళ్ల వీరరాఘవులు

విగ్రహారాధన ననాదిగా నార్యులు చేపట్టి యవిచ్ఛిన్నముగా దానిని చేయుచున్నా రని నేను తెలుపుటకు సాహసించుచున్నాను. అయితే చరిత్రకారుల రచన లందులకు వ్యతిరేకముగా నున్నవి. వా రెట్లు నిర్ణయించిరో ముందు పాఠకులు తెలిసికొనవలసియున్నది గాన వాని నుదహరించి యాపైన నవసర మగుఖండనముండనములు చేయ వలసియున్నది. వేదములు, విగ్రహారాధననుగూర్చి చరిత్రకారుల నిర్ణయము లిట్లున్నవి :—

(1) వేదములు ఋషు లాయాకాలములందు రచించినవి. క్రీ.పూ. 5000–1000 మధ్యకాలమున రచింపబడినవి. అని యాకాలవిషయ ములోకూడ నందఱును నేకీభావమునకు రాక యెవరికితోచిన కాలము లను వారు నిర్ణయించిరి.

(2) ఆర్యులు విదేశములనుండి యీ దేశమునకు ద్రావిడుల తరువాత వలసవచ్చి క్రమక్రమముగా నీదేశము నాక్రమించుచు ద్రావిడులను దక్షిణమునకు దరిమి యాయాప్రదేశములం దున్నపు డాయా వేదభాగ ములను రచించి రని యందఱు చరిత్రకారులును వ్రాసిరి.

(3) మొదట ఋగ్వేదమును రచించి ప్రకృతిదేవతాస్తోత్రములు చేసిరనియు పిదప యజుర్వేదమును రచించి సూత్రములు నిర్ణయించు కొని సామగానము చేయుచు క్రతువులనుమాత్రము చేయుచుండి రనియు నాపిదప నథర్వవేదము నుపనిషద్బ్రాహ్మణములను రచించి యుపాసనచేయ నారంభించి జ్ఞానమార్గమును గనుగొని యనుసరించి రనియు, బ్రాహ్మణములు వేదవ్యాఖ్యలే కాని వేదభాగములు కా వనియు వీరివాదన.

(4) వేదత్రయికాలములో నుపాసనను విగ్రహారాధనమును వారెఱుగరనియు తరువాతకాలములో బౌద్ధ, జైనమతముల నెదుర్కొనుటకు చక్కని, రుచికరమైన పురాణములను రచించి జనాకర్షణచేసి దేవాలయముల నిర్మించి విగ్రహారాధనను క్రీస్తునకీవలావల కొద్దిశతాబ్దములవ్యవధిలో నెలకొల్పిరనియు వీరు నిర్ణయించిరి. విగ్రహారాధనను బౌద్ధులనుండి వీర లెరువుతెచ్చుకొనిరని వ్రాసిన చరిత్రకారులును గలరు. భక్తిజ్ఞానవైరాగ్యమార్గములు నిర్వచించిన వెనుక సనగా ప్రపత్తిప్రతిపాదకుడగు శ్రీకృష్ణుని యనంతరము వైష్ణవవ్యూహవిభవతత్త్వము పూర్ణవికాస మంది విగ్రహారాధన పెరిగి యజ్ఞయాగాదులు వెనుకబట్టె ననియు, నావ్యూహతత్త్వకాలము క్రీస్తునకు 1, 2 శతాబ్దములు పూర్వమున ననియు, బుద్ధు నవతారపురుషునిగా జేర్చుకొని బౌద్ధమతమును హిందూమతములో లీనము జేసికొనిరనియు వీరి నిర్ణయము.

(5) శివలింగము పానవట్టము స్త్రీపురుషసమ్మేళన స్వరూపమనియు, దానిపూజ లబూరిజనులు చేయుచుండిరనియు దాని నార్యులు విధిలేక స్వీకరించి సంస్కరించిరనియు, వృక్ష, నాగార్చనలు ద్రావిడులవి యార్యు లవలంబించిరనియు వారు వ్రాసిరి.

(6) బౌద్ధతాంత్రికమునుండి హిందూతాంత్రిక ముద్భవించె నని వీరివాదము.

వీరివాదముల కాధారములుగా వీరు చూపినవి :- వేదములలో మంత్రములు చెప్పినఋషులపే ర్లుండుట; స్థలనామము లందుండుట, కొన్నిగాథ లందుండుట, విభాగమైనపిదప నున్నచతుర్వేదస్వరూపము, విదేశయాత్రికుల వ్రాతలు, విదేశచరిత్రలు, పురావస్తుపరిశోధనపై వీరియూహలు, విదేశీయాచారములు, నుపాసనలు, బౌద్ధ, జైనగ్రంథసాక్ష్యములు, పురాణములునాధారముగా గైకొనిరి.

ఈ యాధారములపై నెవరికి కలిగినయభిప్రాయములను వారు వ్రాసిరి. అంతకంటె నీపని యీకాలమున జరిగిన దనుటకు నిశ్చితాధారములేదు. ప్రారంభకాలమున మనదేశమున చరిత్రరచయిత లరుదు. విదేశచరిత్రకారు లెప్పుడో వచ్చి యిచ్చటిసాంప్రదాయములు భాషయు మతమును తెలిసియు తెలియనిస్థితిలోను, తమ చరిత్రకన్న యీదేశ చరిత్రకున్న పురాతనత్వమును మరుగుపరచినగాని తమచరిత్రకు గొప్పదనము రానందునను తమ మతముకన్న గొప్పదగు హిందూమత శ్రేష్ఠత్వము నస్తవ్యస్తము చేసినగాని తమ మత వ్యాప్తికి దోహదము లభింప దని యెంచియు నీదేశమతసాంప్రదాయ, వేష భాషాదులను సంస్కృతిని నస్తవ్యస్తముచేసి చూపినగాని యాజాతి తమసార్వభౌమత్వమునకు లొంగి యుండ దనియు తప్పుగా చరిత్రలు వ్రాసిన చరిత్రకారులును, సంస్కృతము, వేదాదివిద్యలు నేర్చి విమర్శన దృష్టితో సత్యాన్వేషణము చేయలేక సాంప్రదాయ మెఱుగని విదేశస్థుల విమతస్థుల వ్రాతలపైనను మనమతగ్రంథములకు వారు రచించినయాంగ్లానువాదములపైనను నాధారపడి చరిత్ర లల్లిన హైందవ చరిత్రకారులును గలరు. నేడొకస్థలమును త్రవ్వుటలో బయల్పడు వస్తువులపై జనించినయూహపై నాధారపడి యొకకాలనిర్ణయసిద్ధాంతము వచ్చును. అంతకన్న పురాతనమైన దేదియు లేనందున నదియే చరిత్ర కారంభ మనిపించును. రేపు మఱియొకచోట మరియొకటి వెలువడి దానికన్న పురాతనత్వమును సూచించును. భూగర్భమనంతము. హిందూనాగరికత యనాది కాన నీపరిశోధనలో స్థిరముగానుండి మారనిసిద్ధాంతము నిరాక్షేపణీయమైనది యరుదు. ఊహలునుననంతమే. కావుననే చరిత్రకారులు భిన్నాభిప్రాయు లగుట తటస్థించినది. కేవలమూహపై నాధారపడిన సిద్ధాంతము లెట్లుండును? వైదికులవాదనలు వీరు వినరు. వారి నేవగించుకొందురు. వారు చూపుశబ్దప్రమాణముల

రిది పశ్చిమాభిముఖ మైనది. ఇక కలియుగ మెట్లు? మనప్రభుత్వమున కీచరిత్రతో సంబంధము లేదు. అర్థకామములే నేటి పురుషార్థములు. తక్కినపురుషార్థముల యాస్తిక్యము నేడు చెల్లుబడికాదు. కాన నింక తేల్చవలసిన సమర్థత పరమేశ్వరునకే యున్నది. ఆతనిసంకల్ప మెట్లు న్నదో యెవరి కెఱుక?

ఇక వైదికసాంప్రదాయజ్ఞుల సిద్ధాంతము లెట్లున్నవి? వీరి వాదములో నీ సాంప్రదాయజ్ఞులకు భిన్నాభిప్రాయములు లేవు.

(1) వారిలో (శ్రీ)వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారా స్తికత యనుగ్రంథములోను, (శ్రీ)చివుకుల అప్పయశాస్త్రులుగారు వేదాంగ చంద్రిక యను గ్రంథములోను నింకను పలువురు పలుగ్రంథములందును వేదము లపౌరుషేయము లనియు, పరమేశ్వరుని నిశ్వసితముగా నావిర్భవించిన వనియు, నవి యనాద్యనంతములనియు,

(2) వేదమంత్రరచయితలుగా చారిత్రకులు చెప్పుఋషులు మంత్ర ద్రష్టలే కాని రచయితలు కా రనియు సృష్టికిపూర్వపరములందును వేద మున్న దనియు, ననేకకారణములను వేదోదాహరణలను చూపి తమసిద్ధాంతమును ఋజువు చేసియున్నారు. వారికి సమాధానము నింతవర కేచరిత్రకారుడును చెప్పలేదు. వేదము బ్రాహ్మణో పనిషదా రణ్యకములు కలసియే యైన దని సకారణముగ సిద్ధాంతీకరించిరి. వానికి ముందు వెనుక కాలనిర్ణయములు చేయుట పొరబాటు. ఈనాడు ఋగ్యజుస్సామాథర్వణములుగా గన్పట్టు వేదస్వరూపము మొదటనట్లు లేదు. అథర్వు డనుఋషి క్రతునిర్వహణసౌకర్యముకొఱకు వేదవిభా గము చేసినపిదప నాల్గువేదము లయ్యెను. మఱియొకపర్యాయ మింకను నేర్పుతో వేదవ్యాసుడు విభాగించినపిదపనే నేటి చతుర్వేదస్వరూప మేర్పడెను. కాన చతుర్వేదములకు ముందు వెనుకల పుట్టుకను కల్పిం చుట పొరబా టని సకారణముగా వారు వ్రాసిరి. దానికి గూడ చరిత్రకారులు జవా బీయలేదు.

(3) ఇక నార్యు లిచ్చటివారే కాని వలసవచ్చినవారు కారు. ద్రావిడార్యభేదము కల్పితము. అనాదిగా నార్యనివాసము సరస్వతీతీరమున నే యున్నది. సింధునాగరికత యని చెప్పునది యార్యనాగరికత యే కాని యబోరిజనులది గాని ద్రావిడు లను వేరుజాతిది కాని కాదు. విగ్రహారాధన మార్యు లనాదిగా చేయుచున్నారనువిషయములు సిద్ధాంతీకరించవలసి యున్నది. ఇందులకు నీయుభయవాదులకును కాలనిర్ణయ విషయమున నంగీకారమునకు తెచ్చుమార్గము లేనందున నింకొకవిధముగా చర్చచేసి విషయనిర్ణయము తేల్చవలసివచ్చినది. కాన నా ప్రధానవిషయ మగు ననాదియగు నార్యవిగ్రహారాధనసిద్ధాంతమును ఋజువు చేయుచున్నాను. వేదత్రయి యార్ష గ్రంథములలో పురాతనమైన దని యుభయులు నంగీకరింతురు. ఆ పిదప సూత్రములు, వేదాంగములు, నుపవేదములు, షడ్దర్శనములు, కావ్యములు, నాటకములును, రచింపబడిన వని యీవరుసక్రమము నుభయులు నంగీకరింతురు. చరిత్రకారులు సింధునాగరికత వేదములకన్న పూర్వీక మందురు. ఆ పిదప వారిత్రవ్వకములలో వెలువడినవస్తువుల ముందువెనుకలను వారే నిర్ణయించిరి. కాన నుభయులవరుసక్రమములను దేని కదిగా తీసికొని వాని కాదియందును నార్యవిగ్రహారాధన యున్నట్లు చూపినచో నా యనాదివిగ్రహారాధన సిద్ధాంతము స్థిర మగును. మఱియు నారెంటి వరుసక్రమములో నన్నిగ్రంథములందును నన్నిత్రవ్వకముల ఫలితములందును నార్యవిగ్రహారాధనమును చూపినచో ననిచ్ఛిన్నార్యవిగ్రహారాధనసిద్ధాంతము స్థిర మగునుకాన నట్లుచేయుచున్నాను. చూడుడు.

## వేదములు - విగ్రహారాధన

చరిత్రకారులు వేదకాలమున విగ్రహారాధనము లే దనిరిగదా! అధర్వవేదము, నుపనిషత్తులు, బ్రాహ్మణములు, మహానారాయణము మొదలగువానిలోనుండి కొల్లలుగా విగ్రహారాధనప్రక్రియలు చూప

వచ్చును. కాని చరిత్రకారులు వానికి దఱువాత కాలమునిర్ణయించి తోసిపుచ్చుదురు. వేదత్రయిలోనే వారికి విగ్రహారాధనప్రశంస యున్నటుల చూపినగాని యొప్పుకొనరు. వేదత్రయిలో సూచనప్రాయముగా ననేక స్థలముల విగ్రహప్రశంస యున్నది. కాని యవి యా యర్థములో చెప్పబడలే దనియు, స్పష్టముగా చెప్పబడలే దనియు త్రోసిపుచ్చవచ్చును. కాబట్టి వానివిషయ మటుల నుంచి స్పష్టముగా దేవాలయార్చన కాలములో నున్నట్లు చెప్పునాధారము చూపవలెను. పరికింపుడు.

శ్రు॥ ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహ్యేన మిష్టాపూర్తే సగ్ంసృజేథా మయం చ॥" యజు – ౧౫–౫౪

ఈమంత్రమునం దిష్టాపూర్తియందు యజమానునితో గూడి యున్న యగ్నియొక్క ప్రార్థన గలదు. ఇష్టాపూర్తములకు మను వి ట్లర్థమును నిర్వచించినాడు.

శ్లో॥ అగ్నిహోత్రం తప స్సత్యం వేదానాం చానుపాలనమ్
ఆతిథ్యం వైశ్వదేవం చ ఇష్ట మి త్యభిధీయతే
వాపీకూపతటాకాని దేవతాయతనాని చ
అన్నప్రదాన మారామః పూర్త మి త్యభిధీయతే॥

అనగా నగ్నికార్యము తపస్సు, సత్యము, వేదపాఠము, నాతిథ్యము, వైశ్వదేవకర్మ వీని కిష్టమనియు; నుయ్యి, దిగుడుబావి, చెరువు, దేవాలయము, నుద్యానవనము ప్రతిష్ఠాపించుటయు నన్నదానమును పూర్తమనియు; మనువు నిర్వచించెను. "య ద్వై మను రవద త్త ద్భేషజమ్" (యజు 2 అ 2 ప్రశ్న "మన్వర్థవిపరీతా తు యా స్మృతిః సా న శస్యతే" అనువాక్యములు మనువు చెప్పినయర్థమే శిరోధార్యమని తెల్పుచున్నవి. బ్రహ్మసూత్రశంకరభాష్యమునకు నానందగిరి వ్యాఖ్యయగు తత్త్వదీపనములో నీనిర్వచనమే యుదాహరింపబడెను.

జూడరు. ఇరువురును కలసి చర్చించి యోరిమితో సమన్వయము చేయు రంగస్థలమే లేదు. అందుచే నొకరిది పూర్వాభిముఖ మైనది. ఇంకొక ఇది బహుకాలము క్రిందట స్వాయంభువమనువు చేసిననిర్వచనము వేదత్రయిలోనే యిట్లు దేవాలయప్రతిష్ఠావిషయము చెప్పబడినది. మనువుకాలమున ప్రచారములో నున్నది. కాన విగ్రహారాధన మార్యులశ్రుతి స్మృతివిహిత మని తేలినది.

అంతియే కాదు. వేదత్రయిలోని దగుసామవేదమునకు చెందిన షడ్వింశబ్రాహ్మణములో

"యదా దేవాయతనాని కంపంతే దైవతప్రతిమా
హసంతి రుదంతి నృత్యంతి స్ఫుటంతి ఖిద్యంతి న్వింద్యం త్యున్మీలంతి
నిమీలంతి తదా ప్రాయశ్చిత్తం భవ తీదం
విష్ణు ర్విచక్రమ ఇతి స్థాలీపాకం హుత్వా
పంచభి రాహుతి జుహూతి
విష్ణవే స్వాహా. సర్వభూతాధిపతయే స్వాహా. చక్రపాణయేస్వాహా.
ఈశ్వరాయ స్వాహా. సర్వపాపశమనా యేతి
వ్యాహృతిభి ర్హుత్వాథ సామగాయేత॥"

అనగా దేవస్థానముకదలినను దేవతాప్రతిమలు హసించినను నేడ్చినను భిన్నమైనను, నాటలాడినను, చెమట వానికి గల్గినను, నవి కండ్లు మూసి తెరచినను, 'ఇదం విష్ణు' ఇత్యాదిమంత్రములచేత హోమము లైదు గావించి సామగానము చేయవలెను. లేకున్న దేశా రిష్టము కల్గును) అని యర్థము. దీనినిబట్టి వేదములలో దేవాలయ నిర్మాణవిధియే కాక దేవాయతన, విగ్రహాదులకు గల్గినవిచ్ఛిత్తికి పునర్నిర్మాణప్రాయశ్చిత్తాదులుకూడ నందే విధింపబడిన వని తెలియు చున్నది. ఈయాధారము చారిత్రికుల వాదన కడ్డువచ్చుటచే నీ బ్రాహ్మణమును వారు ప్రక్షిప్తమనిరి. దేనియందుప్రక్షిప్తము లున్నను

వేదములం దట్టివి చొరకుండ వానికాండలు, ననువాకములు, పదములు నక్షరములు, స్వరములుకూడ గణించి నిర్ణయింపబడియున్నవి. అట్టివేదములో నాభాషలో ప్రక్షిప్తములు దూర్పగల వారెవ్వరు? వారి కట్టియలౌకికజ్ఞాన మెచ్చటిది? ప్రక్షిప్తమే యగునో దాని నెవ్వ రంగీకరింతురు? ఈబ్రాహ్మణమును వారు ప్రక్షిప్త మన్నను యజుర్వేద మంత్రమును ప్రక్షిప్త మనలేరుగదా! కాన విగ్రహారాధన వేదసమ్మతము, విధియునే కాని యన్యథా కానేరదు. అది యార్యులదే కాని యెరువుతెచ్చుకొన్నది కా దనికూడ వేదప్రమాణముచే తేలినది.

ఋగ్వేదము II 33–9; 1–25–13; VIII 69–12, IV 24–10 VI 28–6; IV 17–4; X 184–1 లలో విగ్రహప్రశంసగలదు. నమకములో రుద్రప్రశంస చాల యున్నది. యజుర్వేదములో సర్వారాధన, దుర్గారాధన (సం. 3–4 అ. 2 వ పన్నము 35 పనస) దేవాతార్చనా విధి 2 వ మంత్రపన్నము ఉత్తరఖండ (మంత్రజహీఖండ) మారంభించి చెప్పబడెను. ఐతరేయబ్రాహ్మణములో (1–1–1) విష్ణుపూజావిధి వివరింపబడెను. శతపథబ్రాహ్మణము, తైత్తిరీయసంహితలలో విష్ణ్వవతార ప్రశంస యున్నది. మహానారాయణము, శ్రీసూక్త, పురుషసూక్తములలో విగ్రహారాధనపద్ధతి యున్నది. శివలింగప్రశంస యున్నది. దీనివలన శివలింగార్చన నబోరిజనులది (ఆటవికులది) కా దనియు నది యార్యులదే యనుటయు స్పష్టమగును. మైత్రేయోపనిషత్తులో

పదం విదగ్ధోదరపూరణాయ బ్రమంతి కాక ఇవ సూరయోపి

పాషాణమణిమృణ్మయవిగ్రహేషు పూజా పునర్జననభోగకరీ ముముక్షోః

అని విగ్రహనిర్మాణద్రవ్యములు పేర్కొనబడెను. (ప్రథమోధ్యాయః)

ఫలము చెప్పబడెను. రామతాపిన్యుపనిషత్తులో

మననాత్త్రాణనా న్మంత్రసర్వహచ్యస్య వాచకః
సోభయాస్యస్య దేవస్య విగ్రహో యంత్రకల్పనా
వినా యంత్రే చే త్పూజా దేవతా న ప్రసీదతి॥ ౧౩ ॥

ఇట్లు విగ్రహారాధనలో యంత్రావశ్యకత చెప్పబడినది. అధర్వ వేదములో విగ్రహార్చనయు నుత్సవవిధానములును చెప్పబడెను. శ్వేతాశ్వతరోపనిత్తులో 'తస్య ప్రతిమా అస్తి' అని యున్నది. జాబాల్యుపనిషత్తులో "శివ మాత్మని పశ్యంతి ప్రతిమాసు న యోగినః.

అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమా పరికల్పితాః॥ అని మందాధికారులకొఱకు విగ్రహారాధనవిధి చెప్పబడినది. దేవతామాతృపూజ యతిపురాతనకాలమునుండియు జరుగుచున్నట్లు **Mackey** పండితుడు వ్రాసెను. రామోత్తరతాపిన్యుపనిషత్తులో

శ్లో॥ మణికర్ణ్యాం మమ క్షేత్రే గంగాయాం వా తటే పునః
క్రిమికీటాదయో ప్యాసు ముక్తా స్తం తు న చాన్యథా
అవిముక్తేతర క్షేత్రే సర్వేషాం ముక్తిసిద్ధయే
అహం సన్నిహిత స్తత్ర పాషాణప్రతిమాదిషు.
క్షేత్రేస్మిన్ యో ర్చయే ద్భక్త్యా మంత్రేణానేన మాం శివ
బ్రహ్మహత్యాదిపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

అని యాకాలమునాటికే కాశీ మొదలైన క్షేత్రములు నందలి దేవాలయములు నున్నట్లు స్పష్టపడుచున్నది. కాశీ యనాదిదివ్యక్షేత్రము. అన్నపూర్ణ విశాలాక్షీ సహితవిశ్వేశ్వరుడు, దుర్గ వీరి తనయుడు ఢుంఠిగణపతి, నందిభైరవుడు, మాధవుడు మొదలగునన్నిమతముల యర్చాస్వరూపములు నిచట ననాదిగా ప్రతిష్ఠింపబడిరి. ఇది సప్తమోక్షదాయకపురు లలో నాల్గవది. వరుణా, అసి గంగాసంగమప్రదేశ మైన పవిత్రద్వీపము. భక్తు లిట కోరికల వదలి నిస్సంగు లగుదురు. కాశ్యాం తు మరణా న్ముక్తిః అనునది పురాణవచనము. ఈప్రదేశమునకు మహాశ్మశాన మని పే రున్నది. సమస్తవిద్యలకు ననాదివిద్యాపీఠ మిది. గురుకులపద్ధతివిద్యాభ్యాస మిట నున్నది. సమస్తమతముల ప్రచారము తుదకు బౌద్ధమతప్రచారముకూడ నిచట ప్రారంభమయ్యెను. కోటి

లింగము లిచ్చుటగలవట! కాశీదేవి నగరదేవత ముస్లిములెన్నియో యాలయములను నాశ మొనర్చిరి. లేక మశీదులుగా మార్చిరి. ముఖ్యముగా విశ్వనాధాలయ మౌరంగజేబు మశీ దయ్యెను. అపుడు విశ్వేశ్వరలింగము జ్ఞానవాపి యనునూతిలో దాగుకొని పిదప నేటి యాలయమున నహల్యాబాయిచే ప్రతిష్ఠ నందెను. రణజిత్ సింగీదేవాలయమునకు 18 మణుగుల బంగారము నిచ్చెను. ఆజ్ఞానవాపి పవిత్రజలముగల దయ్యెను. నేటికిని రాజఘాట్‌లో ననేకపురాతనవిగ్రహములు బయలుపడుచున్నవి. ఇచట 360 ఘట్టములు తీర్థములు నున్నవి. పంచక్రోశయాత్ర, పంచగంగాయాత్ర, నగరప్రదక్షిణయాత్ర, వ్యాసకాశీయాత్ర మొదలగు న వెన్నియో చేయుదురు. మానమందిర్, రామమందిర్, బిర్లాగారు నూతనముగా నిర్మించినశివాలయము, మాళవ్యా పండితుడు నెలకొల్పిన హిందూవిశ్వవిద్యాలయము, సారనాథ్‌లోని మృగదావనములో బౌద్ధ జైనదేవాలయములు, నచటనే యున్నయతి పురాతనశివాలయము మొదలైనవి దర్శనీయములు. ఈనగరము నిత్యజీవకళతో నలరారును. ఎంతవర్ణించినను తఱుగదు. గంగ యిచట నుత్తరావాహిని.

1. Development of Hindu Iconography by Mr, J. N. Benerjiea

ఆ క్షే ప ణ ము

కాని విష్ణుధర్మోత్తరపురాణము III – 13–VI–9 లో ఇట్లున్నది

శ్లో॥ సత్యయుగే దేవానాం ప్రత్యక్షపూజనం త్రేతాద్వాపరయోః
ప్రత్యక్షపూజాప్రతిమానుచ తత్రాపి త్రేతాయుగే గృహే, ద్వాపరే
కారణ్యే కలౌ చ దేవాయతననిర్మిత న్నగరేషు సమాగత్వాః
భూమిదానం విధాయైన దేవాయతనప్రతిష్ఠా కార్యా దేవాలయ
యోగ్యభూమిః

శ్లో॥ కృతత్రేతాద్వాపరేషు నరః పశ్యంతి దేవతాః
తిష్యం ప్రాప న పశ్యంతి పూజా స్వర్గాగతా యతః॥

అని యున్నది. దీనికి చరిత్రకారులు "వైదికులకు విగ్రహార్చన మిష్టము లేనిదైనను తప్పనిసరి వచ్చి యంగీకరించి రనియు, నుచితస్థానము దాని కిచ్చి రనియు, కృతత్రేతాద్వాపరములందు దేవతలు కనిపించెడివా రనియు, కలిలో వారు కన్పింపక యీ విగ్రహములలో నుండి రనియు, నార్యులంగీకారము నిట్లు తెలిపి"రనియు వ్యాఖ్యానించిరి. భాగవతములో సప్తమస్కంధము 453 వచనము ప్రహ్లాదాజగరసంవాదములో "పరస్పరపాత్రంబులకు సహింపని మనుష్యులకు బూజనార్థంబుగా త్రేతాయుగంబునందు హరిప్రతిమలు కల్పింపబడియె. కొందఱు ప్రతిమార్చనంబులు చేయుదురు. పాత్రపురుషద్వేషు లైన వారలకు నట్టిప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబు గాదు. మందాధికారులకు బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగు" నని యున్నది.

## సమాధానము.

వేదములో ననంతకాలమున కనువగు సర్వాధ్యాత్మికవిధానములును స్పష్టముగా నిర్వచింపబడియే యున్నవి. అందు లేని దేదియు లేదు. ఒక్కొక్కకాలమున నొక్కొక్క యాధ్యాత్మికవిధానము (తపస్సు, కర్మ, జ్ఞాన, భక్తులయం దొక్కొక్కటి ప్రధానముగా నవలంబింపబడుచు వచ్చినది. ఈవిషయము నేనువ్రాసిన 'దేవాలయములు-వాని పుట్టు పూర్వోత్తరములు' అనుగ్రంథము చరిత్రభాగము నంతయు చదివిన నిరూపిత మగును. అదియును గాక పై పురాణవాక్యములలో గూడ సత్యయుగములో దేవతలకు ప్రత్యక్షపూజ యున్నట్లు చెప్పబడినది గాని పూజయే లేనట్లు చెప్పబడలేదు కదా! త్రేతలో ప్రతిమార్చనంబు గలదనిగదా యందు చెప్పబడినది. దీనిని సమన్వయము చేసికొనుట కిట్లు యోజింపవలెను. "వేదములో నన్నిమార్గములు చెప్పబడినను సత్యయుగములో నవన్నియు ననుసరింపబడకపోవచ్చును. లేదా యల్పసంఖ్యాకు లగుమందాధికారులు చేయుపూజ గణనలోనికి

రాకపోయియుండవచ్చును. దేవతాప్రత్యక్షము చేసికొని పూజించిన యధికసంఖ్యాకులున్నారు. గాన వారికే ప్రాధాన్యమిచ్చి పైపురాణ వాక్యములు వెలువడియుండును. మఱియు పైనవివరించినట్లు యజుర్వేదము సామవేదబ్రాహ్మణములకన్న యీవిష్ణుధర్మోత్తరపురాణమును, భాగవతమును నాధునికగ్రంథములే కదా! అట్టిచో పూర్వగ్రంథములు దేవాలయములున్నట్లు చెప్పగా నొకటిరెం డాధునికగ్రంథములు దాని కొకమాదిరి వ్యతిరేకాభిప్రాయము కనబరచినంతమాత్రమున సర్వకాల, సర్వశ్రేష్ఠప్రామాణికగ్రంథ మగువేదవాక్యము లెట్లు ఖండింపబడును? సత్యయుగమునకు వేదము సమీపగ్రంథమూను ప్రమాణము గ్రంథమును నగునా? లేక విష్ణుధర్మోత్తరపురాణ మట్టిదా? శ్రుతికి వ్యతిరేకముగా మఱి యేగ్రంథ మెట్లుచెప్పినను దానిని పరిహరించి శ్రుతిని ప్రమాణముగా స్వీకరింపవలెననుసాంప్రదాయ మున్నది. శంకరాచార్యులవా రట్లు స్మృతి లోకవివర్జిత మని చెప్పబడినసన్యాసమును శ్రుతిప్రమాణముచే స్వీకరించి స్మృతివాక్యమును పరిహరించెను. దేవీభాగవత మీవిషయము వివరించినది. అదియునుగాక సృష్ట్యాదిని స్వాయంభువమనువు వ్రాసినస్మృతిలో

శ్లో॥ తపఃపూర్వం కృతయుగే త్రేతాయాం యజ్ఞ మేవ చ
ద్వాపరే దాన మిత్యాహుః కలౌ భక్తి గ్గరీయసీ॥

అని వ్రాసెను. ఈస్మృతికారునివచనముప్రకార మాయాయుగములందు నాయావిధానములు వన్నెకెక్కిన వని మాత్రము 'గరీయసీ' యనుపదమువలన చెప్పబడినది. అంతియె కాని తక్కినవిగ్రహార్చనాదులాయాకాలములందు లేనేలే వని చెప్పబడలేదు. ఇదియే సరియగు నన్వయము. పైపురాణ, భాగవతవచనముల నట్లే యర్థముచేసికొనవలెను. అదియునుగాక వేదముల కర్థమువ్రాసిన ప్రథమవ్యాఖ్యాత యాస్కాచార్యుడు" ఆకారచింతనం దేవతానాం పురుషవిధః' అని

వేదములలో విగ్రహారాధనవిధి యున్నట్లు మనకు తెలియజెప్పు చున్నాడు.

కాబట్టి యనాదిగా వేదవిహితముగా నార్యులు విగ్రహారాధన చేయుచు దేవాలయనిర్మాణములు చేసి, యవి శిథిలమైనచో పునర్ని ర్మాణప్రాయశ్చిత్తాదులు చేయుచుండి రని ధృవమైనది. విగ్రహారాధన వేదచోదితమే కావి యన్య మెట్టిదియుకా దనియు, చారిత్రకు లనినట్లు లాటనిపుల శివలింగార్చన మార్యులు స్వీకరింపలేదనియు, వేదవిరుద్ధమైన దేదియు నీదేశమున నిలువలే దనియు, తత్రాపి యార్యసాంప్రదాయ ముగా నిలువలే దనియు మనవిచేయుచున్నాను. పురాణములుకూడ నెట్టివేదవిరుద్ధకర్మను ప్రవేశపెట్టలే దనియు నొక్కిచెప్పుచున్నాను.

బ్రాహ్మణములు, నారణ్యకములు, ఖిలములు, గృహ్య, కల్ప సూత్రములలో విగ్రహారాధనప్రశంస బాగుగ చేయబడెను. దేవగృహ దేవాయతన, దేవకులదేవళపదములు నందు వాడబడెను. ఈశాన క్షేత్రపతి, మీఢుషీ, జయంత (శ్రీ), ధనపతి, భద్రకాళి దేవతల ప్రశంస యుం దున్నది.



## వేదాంగములు – విగ్రహారాధన

వేదాంగము లారు గదా! శిక్ష, ఛందస్సు, వ్యాకరణము, నిరుక్తము, కల్పము, జ్యోతిషము.

నిరుక్తము :– వేదార్థము వ్రాసిన యాస్కాచార్యుడు తన నిరుక్త గ్రంథమునందు "ఆకారచింతనం దేవతానాం పురుషవిధః" అని విగ్రహారాధన చేయు నంగీకరించినాడు. దేవతలకు మానవాకారగ మున్న దనినాడు.

కల్పము :– బోధాయనకల్పసూత్రములందు క్రత్వారంభ దేవతార్చన విధింపబడినది. క్రత్వారంభమున గణపతిపూజ చేసి దాని

కుద్వాసనచెప్ప కట్టేయుంచి యజ్ఞపరిసమాప్తి యగువరకు ప్రతిదినము నాతనికి పూజ చేయుదురు. బోధాయనకల్పసూత్రపరిచర్యాప్రకరణ మున ఇలా లో "స్నాత్వా శుచౌ గోమయే నానులిప్య ప్రతికృతిం కృత్వా అక్షతపుష్పై ర్యథాలాభ మర్చయేత్". అని విధించెను. మహా దేవం పూజయేత్ అనికూడ విధించెను.

జ్యోతిషము :- వేదాంగజ్యోతిషగ్రంథము లగధుని గ్రంథము ననుసరించి వ్రాయబడినవి. వానికాలము BC 1400-1300. ఆగ్రంథ కర్త 35, ఉత్తరాక్షాంశరేఖలో నుండె నని తేన్కార్ పండితుడును, నార్యజ్యోతిషచరిత్ర నిర్ధారకుడు శంకరబాలకృష్ణదీక్షితులును నిర్ధా రించిరి. హిందూజ్యోతిశ్శాస్త్రము BC 2780 నాటికే యుండెనని తీబర్ వీబర్ Indian Literature లోను, నది 3000 B.C నాటి దని క్యాసిని బెలిజెంటల్, ఫైఫర్ జాక్సన్ను వ్రాసిరి. ( Theory of Hinduisom) యజుర్వేదమున గణకు లనియు, నక్షత్రకు లనియు జ్యోతిష్కులకు పేర్లున్నవి. అంగా వేదమంత్రములకు సమీపకాలము ననే జ్యోతిశ్శాస్త్ర ముదయించె నన్నమాట. వేదకర్మలు జ్యోతిశ్శాస్త్ర ప్రకారము నిర్ణయింపబడినముహూర్తములం దారంభింపబడు ననుస యంద తెలిసినదియే. కావుననే యీశాస్త్రము వేదాంగమైనది. నవ గ్రహములు లేనిజ్యోతిశ్శాస్త్రము లేదు. నవగ్రహశాంతుల నది నిర్వ చించినది. వానికి పూజావిధాన మున్నది. జప, హోమ, తర్పణము లున్నవి. యంత్రము లున్నవి. ద్వాపరాంతమున జరిగిన భారతయుద్ధ మునకు కృష్ణుడు ముహూర్త ముంచినట్లు భారతమున గాథ గలదు.

వ్యాకరణము :- పాణినికి పూర్వ మున్నవ్యాకరణములు నేడు కాన రావు. కారణము పాణిని యేకాలమందును నేభాషకును రచింపబడ నంత విపులముగా శబ్దజాలమును సూత్రబద్ధము చేసి గొప్పవ్యాకరణ శాస్త్రము రచించి పూర్వుల మరపింపజేసెను. అతడు పశ్చిమోత్తర

సీమలోని శలాతురగ్రామవాసి. పాణినికాలము BC 500-400 అని యయ్యస్వామి శాస్త్రిగారును BC 360-58 అని V.S. అగ్రవాల గారును B.C 500 అని రాధాకృష్ణపండితుడును (Indian Philosophy) వ్రాసిరి. అతనివ్యాకరణశాస్త్ర మి ట్లుత్పత్తియైనది :-

శ్లో॥ నృత్తావసానే నటరాజరాజః ।
నానాద ఢక్కాం నవపంచవారం
ఉద్ధర్తుకామః సనకాది సిద్ధాన్ ।
ఏతద్విమర్శే శివసూత్రజాలం ॥

ఇట్లు వ్యాకరణోత్పత్తియే శివుని ఢక్కానాదమువలన కలిగి నది. కావుననే వీనికి మాహేశ్వరసూత్రము లని పేరువచ్చెను. కాన వ్యాకరణరచనాధారమే యొకమాదిరి విగ్రహారాధన.

పాణినిసూత్రములలో 5-3-99, 5-3-100 లలో 'కన్' ప్రత్యయము ప్రతికృతి యనునర్థము వచ్చినను రాదని సూత్రనిర్ణయము. 'జీవికార్థే చాపణ్యే' అనునది సూత్రము. 'జీవికార్థం యత్ అవిక్రీయమాణం తస్మిన్ వాచ్యే కనోలుప్స్యాత్, వాసుదేవః శివః స్కందః॥" దేవలకానాం జీవికార్థాసు దేవప్రతికృతిషు ఇదం వాసుదేవ ప్రతికృతి ఇత్యాదయః అని వ్యాఖ్య. ఇచ్చట ఈప్రతికృతులు బజారులో దొరకు బొమ్మలు కావు. పూజనీయవిగ్రహముల కీపదము సూచితము. అని స్పష్టముగా సూత్రీకరింపబడినది. మఱియు నాకాలమునాటికే వాసుదేవ, శివ, స్కందాదుల యర్చనలు సాగుచున్నట్లు దీనివలన తెలియును. పాణిని IV-1-112 లో శైవమతముల పేర్లను శివపూజకుల వివరములను నిచ్చెను. (శివాదిభ్యోణ్) భవ, శర్వ, మిధాదినామముల చేర్కొనెను. శైవశాఖలగూర్చి IV-2-104 (అవ్యయాత్త్యప్) పై వార్తికవ్యాఖ్య వ్రాయుచు నుదీచ్యగ్రామ, శివపుర, లేక శైవపురముల చేర్కొనెను. (కీల్హారన్ Cep cit Vol II PP 396-97) ఈ

గ్రామము మయూరి విద్యాగ్రంథమునగూడ బేర్కొనబడెను. ఉదీచ్య గ్రామమే శివపుర మని శిల్వెన్ లేవీ నిర్దేశించెను. ( Journal Asiatique 1915 PP 37-70) ఇది పంజాబులోనిది. పాశుపతులకన్న ముందే ఘోరకర్మలు చేయు కాపాల, కాలాముఖాదిమతములు బయలుదేరెను. "ఇంద్రభవశర్వరుద్రమృడహిమారణ్యయవయవనమాతులాచార్యాణా మానుక్" అను సూత్రము.

పతంజలి శివుని రుద్రుని చాలసార్లు చెప్పెను. "పశూనాం రుద్ర యజతే శివా రుద్రస్యభేషజే" (మహాభాష్యము Vol. 1 PP331-434; Vol III PP 14-403 Kelihoru)

పాణిని II-2-34 (అల్పాచ్తరం) పై వాఖ్యలో ధనపతి, రామ (బలరామ) కేశవ (కృష్ణ) దేవాలయములు సూచించెను. అనేకమంది భక్తులు చేరి గీతవాద్యములు చేయుటను చెప్పెను. "మృదంగశంఖ తూణవః పృథ న్ననాదతి వంసంది ప్రాసాదే ధనపతిరామ కేశవా నాం" అని వ్రాసెను. దీనినిబట్టి యానాటికే వ్యూహవిగ్రహార్చనయు, భక్తితత్త్వమును, భజనపద్ధతులు నున్నట్లు తెలియుచున్నది. అనేక శైవమతము లున్నట్లు తెలియుచున్నది. "పాణినినాటికి యక్షపూజ యున్నట్లు బౌద్ధజైన గ్రంథములు తెలుపును. యక్షుల కున్నపీఠము లున్నట్లు పాణిని చూచి వ్రాసెను. గ్వాలియర్ మ్యూజియంలో మాణిభద్రుని విగ్రహముక్రింద శాసనము యక్షవిగ్రహములు పూజింప బడుచున్నట్లు తెలుపును. వీరికి ప్రత్యేకాలయము లున్నవి. ప్రాగ్జం యక్షునికి గ్రైవేయకాది హిందూ దుస్తులే యున్నవి. బౌద్ధయక్షవిగ్రహములు వేరుగా నుండును. వానియాయుధములు, వాహనములు, వేరుగా నుండును. వానిది యుదీచ్యవేషము"

ఛందశ్శాస్త్రము :- ఇందు గణములకు దేవతానామము దేవతాధిపతులు నిర్వచింపబడిరి. జగతీఛందము, గాయత్రీఛందము

మొదలగుద్వైవీయఛందలక్షణములు చెప్పబడెను. వాని ప్రయోగములు, వాని యధిదేవతలు, నా ఛందము కావ్యాదిని చెప్పించదువలన నాదేవత లిచ్చుఫలములు పేర్కొనబడినవి. భరతనాట్యములో 16, 32 అధ్యాయములు ఛందస్సంబంధము గలవి. అందు 16వ దానిలో ఛందస్సులు ప్రవేశపెట్టబడెను. అగ్నికి 8 తత్త్వములుగావునను, గాయత్ర్యధిదేవత యగ్నిగావునను (సాంఖ్యాయనసూ.) గాయత్రీఛందస్సునకు 8 అక్షరములు గలవు. ఇట్లు ఛందస్సు లన్నియు దేవతాతత్త్వములతో సంబంధము గలవై యున్నవి. కావుననే యీశాస్త్రము వేదాంగ మైనది.

శిక్షాశాస్త్రము :- వేదమంత్రములకు స్వరనిర్ణయము నిర్ణయించిన దీశాస్త్రము. ఇందు స్వరముల కధిదేవతలు వారిచ్చుఫలములు నప స్వరములు బల్కినచో వచ్చు నర్థభేదము, తత్ఫలితములు వర్ణితమైనవి.

పైనచెప్పబడినవిధముగా వేదాంగము లన్నిటియందును విగ్రహారాధన వివరింపబడి యున్న దని తేటతెల్లమైనది.

ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, నర్థశాస్త్రము లేక స్థాపత్యశాస్త్రము నుపవేదము లనబడినవి. ఒక్కొక్కవేదమునకొక యుపవేదమున్నది.

ఆయుర్వేదము :- ఈశాస్త్రరచయిత లందరును వ్యాధికారణములలో పూర్వార్జిత దుష్కర్మఫలమును, వ్యాధినివారణోపాయములలో దేవపూజను చెప్పుచు వచ్చిరి. ఇట్టిపద్ధతి చరకునివఱకును ప్రచారములో నుండెను. ఆత డిట్లు చెప్పెను :-

శ్లో॥ పూర్వజన్మార్జితం పాపం। వ్యాధిరూపేణ బాధతే
తచ్ఛాంతి రౌషధైః ర్దానై ర్జపహోమసురార్చనైః ॥

---

(2) Development of Hindu Iconography by Mr. J. N. Benerjia

అని స్పష్టముగా విగ్రహారాధనోపాయమును చూపినాడు. ఈతడు కనిష్ఠుని యాస్థానమున నుండెను.

ధనుర్వేదము :- విష్ణుని యాయుధములను నాయుధపురుషులుగా పూజించు నాచార మున్నది. బ్రహ్మోత్సవము చక్రతీర్థముతో నాఖరగును. జనకునింట శివునివిల్లు చిరకాలము పూజింపబడినది. అస్త్రదేవత లందరును రామునిచే పూజింపబడి యాతడు కోరినపుడు బహిర్గత మగుట కాతనిలో లీనమైరి. పాశుపతాస్త్రదానసమయమున దాని పార్థుని కిచ్చుచు పూర్వులచే పూజింపబడిన దీనిని గైకొమ్మనెను అస్త్రములకుగూడ పూజ, మంత్రజపాదు లున్నవి.

గాంధర్వవేదము :- వివిధరాగములకు భైరవి, శ్రీరాగము, నిత్యాదిదేవతానామములే యుండబడినవి. రాగాధిదేవతలు గలరు. అసలు గాంధర్వమే నాదబ్రహ్మము. నాదస్వరూపమే పరాభగవతి సరస్వతి. వీణ సరస్వతికి ప్రత్యేకాయుధము. దేహములో గలషట్చక్రసంచయాధారమునవే వీణాస్వరూప మేర్పరుపబడి నిర్మింపబడి నాదబ్రహ్మ, శబ్దబ్రహ్మసాక్షాత్కారము కలిగించును. నారదుడు విష్ణునామసంకీర్తనకొరకే యీవిద్యనభ్యసించి యితరుల కుపదేశించెను. శృంగి, భృంగి యీశ్వరునివద్ద పాటకులు గదా! శివుడు వారిసహాయమున నృత్యము చేసెను. అపుడు మద్దెలను గణపతి వాయించెనట. దానికి నమస్కరించిగాని మార్దంగికులు తమపని నారంభింపరు. పార్వతిలాస్యము దానిప్రత్యేకప్రాముఖ్యముచే 10 భాగములుగా నాట్యశాస్త్రములో వివరింపబడెను. నాట్యవేదము బ్రహ్మచే సృష్టింపబడి పరమపురుషార్థప్రయోజనము గలదై భరతముని కుపదేశింపబడి యచ్చరలచే నటింపబడెను. ఇంద్రుడు రాక్షసుల గెల్చి ధ్వజముఖమహోత్సవము చేసికొనుచుండగా నందు నాకథయే యచ్చరలచే నటింపబడెను. ఇట్లు గాంధర్వవేదమంతయు దైవోపచారముకొరకే యేర్పడినది.

అర్థశాస్త్రము లేక స్థాపత్యశాస్త్రము :– అర్థశాస్త్రము నందు విగ్రహారాధన ప్రశంస నెట్లు నడిచెనో నారచన యగు 'దేవాలయములు వానిపుట్టుపూర్వోత్తరములు అనుగ్రంథమున చరిత్రభాగమున విప్లవయుగమున పాఠకులు చూడగలరు. స్థాపత్యశాస్త్రము స్థలశుద్ధి కొరకు విఘ్నేశ్వరపూజ, పుణ్యాహవాచనము ఆ తరువాత వాస్తుపురుష మండలము దేవాలయనిర్మాణము ననునంగములు గలవి. కాన నంది విగ్రహారాధనోపాంగ మన జెల్లును. ఇట్లన్నియుపవేదములందును విగ్రహారాధనావశ్యకత, విధానములు నిర్వచింపబడినవి.



## సూత్రములు – విగ్రహారాధన

సూత్రకారులలో బోధాయను డతిప్రాచీనుడు. ఈతడు స్పష్టముగా విగ్రహారాధనను రూపొందించెను. ఈతని గృహ్యసూత్రములలో నొకయధ్యాయము జ్యేష్టా దేవీపూజావివరములకే వినియోగించెను. గృహ్యసూత్రపరిశిష్టములో దేవతాపూజావిధానము చెప్పెను. అది ఋ, వే. 1–22–18 17–20; తై. సం. 1–2–13–2; 4–2–8–2 ననుసరించి యున్నది. ద్వాదశనామములు, మంత్రములు తై. బ్రా. 2–4–6 తో సంబంధము గలవే.[3] పితృమేధానంతర ముదకశాంతికర్మ చెప్పిన దీత డొక్కడే. అందు మంటపావాహనకలశపూజాదులు గలవు.

ఆపస్తంబుడు బోధాయనుని శిష్యుడు. ఈతడు వేదినిర్మాణవిధులలో శిల్పకళకు పునాదులు వేసెను. శ్రౌతసూత్రములలో చైత్యనిర్మాణవిధులు గలవు. షోడశస్మార్తకర్మలు నాంధ్రదేశమున నీతని సూత్రానుగుణముగనే నేటికిని నడచుచున్నవి. అందు పూజావిధానము లేనికర్మయే లేదు గృ. సూ. VII 20 లో గోపికాగీతవంటి పాటలలో నీశానమిఢీ జయంతాదిదేవతలను గృహస్థు తీసికొనివెళ్ళి వారి కొరకు నిర్మించిన పాకలలో నుంచి స్థాలిపాకాన్నమును నైవేద్యము

(3) Mr. Gondia, Early con ceptor of Vishnavism

చేయవలెను. గృ సూ. VII 19, 13; హిరణ్యకేశి గృ. సూ. 11-3-8-2-4 సాంఖ్యాయన గృ. సూ. II 14, 14, 17 పారస్కర గృ. సూ. I 16-73 లలో నిమ్మకాయ యావాలతో కలిపి తౌడు వైవేద్యము చేయవలె ననివిధి యున్నది. (నంద, మర్క-ఉపవీర, సౌండికేయ, ఉలూఖల, మలింలుచ, అనిమిష, హంత్రుముఖసగ్నపారుణ కుమార మొదలగు వారికి) పారస్కర గృ. సూ. III 14-8 లో స్నాతకుడు రథములో దేవవిగ్రహములవైపునకు వెళ్ళునపుడు (దైవతాని) రథము దిగి పోవలెనని విధింపబడినది.

గోభిల గృ. సూ. (XIV, IV 7, 37-41 SBE Vol XXX P 123 of Also vogel Indian serpent dore p 198) గృహవాస్తుకర్మ చెప్పుచు (వాస్తుశమన) పదదిక్కుల యధిపతులకు పదిబలులు వేయవలె ననెను. (ఇంద్ర వాయు యమ పిత్రువరుణ మహారాజా సోమమహేంద్రవాసుకి బ్రహ్మములకు) సామవిధాన బ్రాహ్మణము వాస్తుప్రశమన విషయములో నిట్లే చెప్పెను.4

ఆశ్వలాయన గృ. సూ. VII 20-3 ప్రకారము జయంతుడనగా శివుడు. మహాభాష్యముప్రకారమును నంతియే. ముగ్గురు దేవతల నది తెల్పును. ఈశానమిధుషీజయంతులను. హరదత్తు డామూడును దేవవిగ్రహము లనెను.(౫)

సూత్రయుగము B. C 1400-500 అని కొమర్రాజు లక్ష్మణరావుగారును B. C 600-200 అని L. ముఖర్జీగారును వ్రాసిరి. ఆపస్తంబుడు B. C 700 నాటివా డనిరి. భండార్కరుగారు నీతడు B.C 800 నాటివాడు అతనికాలము B. C 300 అని 2500 years of Buddhism లో వ్రాయబడెను. B. C 5, 4 శతాబ్దముల వాడని

(4) P 521 of Development of Hindu Iconography by Mr. J. N. Benerjia

(5) Development of Hindu Iconography by Mr. J. N. Benerjia.

బూలర్ సిద్ధాంతము. గౌతమునికాలము B. C 6వ శతాబ్ద మని 2500 years of Buddhism లో వ్రాయబడెను. C. కుమారస్వామిగారు సూత్ర, ధర్మశాస్త్రపురాణములు B. C 400–100 లో రచింపబడె నని వ్రాసిరి. కోట వెంకటచలం పంతులుగా రాపస్తంబ, పతంజలి, పాణిని, వ్యాసాద్యనేక ఋషులను గుదిగ్రుచ్చి కలియుగారంభము ననగా B. C 3000 కు నెట్టిరి. ఇట్లెవరికితోచినకాలమును వారు నిర్ణయించిరి. ఏకీభావము లేదు.



## ఇతిహాసములు – దేవాలయములు

### శ్రీమద్రామాయణము.

రామాయణ మాదికావ్యము. దానిని వాల్మీకిముని రచించి కుశలవులద్వారా రామాశ్వమేధయాగమునకు పూర్వ మయోధ్యలో రామునియాస్థానమును, నగరమునను ప్రచారము గావించెను. రాముడు 24 వ మహాయుగములోని త్రేతాయుగమున నుండెను. కాని చరిత్రకు లీపురాతనత్వము నొప్పరు. మన పంచాంగములోని గణనను సరకుగొనరు. కాని విచారకర మైనసంగతి యేమనగా రామాయణ మొకకవి యొకకాలమున వ్రాసినగ్రంథము కాదనియు, క్రీ. శ. 3 వ శతాబ్దమువరకును దానిరచన సాగెననియు, నీగ్రంథమున బాలోత్తర కాండలు ప్రక్షిప్తము లనియు, చరిత్రకారులలో కొందరు హైందవులే వ్రాయ సాహసించుట. అట్టి మొదలుతుదలేని కావ్యంబు వ్రాయవల సినగతి వాల్మీకి కెట్లు పట్టెనో వీరు నిరూపింపరైరి. మన బుద్ధి కేది తోచిన నదియే ప్రక్షిప్తము గదా! మన హిందూ చారిత్రికులకే యిట్టి యభిప్రాయ ముండుట యాత్మవంచనగాక మరి యేమి? రామాయణ తత్త్వకథన మనుగ్రంధమున శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు నిట్టి దుర్వాదన లనేకము ఖండించినారు. చదువరులు చూడ ప్రార్థన

ఏది యైనను బుద్ధునికిపూర్వమే రామాయణభారతముల రచన జరిగినదని యంగీకరింపకతప్పదు. బుద్ధునినాటికి యయోధ్య పుణ్యక్షేత్రము. రాముని సాంగత్యము గల ప్రదేశము గాన ఈవిషయమును బౌద్ధ గ్రంథములే చెప్పుచున్నవి. బుద్ధునితరువాత రామాయణము రచింపబడిన దన్నచో బుద్ధునికాలమునుండి యవిచ్ఛిన్నముగా వ్రాయబడిన హిందూ,బౌద్ధ, జైనగ్రంథములలోగాని, చరిత్రలలో గాని, రామాయణ పురుషులతో నెట్టిసమావేశమును, నెప్పుడును నేమతాంతరునితోను జరిగినట్లు వ్రాయబడలేదు. అప్పటికిరామాయణమున్నట్లుమాత్రము గ్రంథ సాక్ష్యములున్నవి. కాన రామాయణరచన కనీసము బుద్ధునికిపూర్వమే జరిగెను కాని తరువాత జరుగలేదు. భారతముకన్న రామాయణము పూర్వగ్రంథ మని దాని నాదికావ్యనామమును నితరాధాగములును చెప్పుచున్నవి. భారతరచనయే కలియుగాదిని జరిగినట్లు సాక్ష్యమున్నది. అనగా B. C 3100 లో భారతరచన జరిగె నన్నమాట. కాన చారిత్రికులనిర్ణయము పొరబా టనక తీరదు. ఏలనన B. C 1000 లో నది వ్రాయబడినట్లు Geits History of Assam నుండి శ్రీ S. శ్రీనివాసాచారి, M. S. రామస్వామయ్యర్ గా ర్లుదాహరించిరి. ఇంక స్మిత్తుదొరగారు దానిరచన బుద్ధునికి తరువాత ననగా B. C 400-200 లో సాగె నని వ్రాసిరి. ఈ నిర్ణయము లెంతహాస్యాస్పదములో పాశ్చాత్య చరిత్రకారానుకరణములో యోజింపుడు. ప్రకృతమునకు వత్తము. రామాయణకాలములో దేవాలయోద్యమ మెట్లు కొనసాగినదియు పరిశీలింతము :-

బాలకాండ :- 77 సర్గ ౧౨ ౪ శ్లో॥ వివాహమై రామాదులు పుర ప్రవేశముచేసిన వెనుక జరిగిన పని వివరించుచు

శ్లో॥ మంగళాలాపనై శ్చాపి శోభితాః క్షౌమవాససః
దేవతాయతనాన్యాసు సర్వా స్తాః ప్రత్యపూజయన్

పెండ్లికుమారు లందఱు భార్యలతో సహాచందన మలంకరించు కొని దేవాలయములకు పోయి పూజ లొనర్చి రని చెప్పబడినది.

అయోధ్యాకాండము :- దశరథుడు రామరాజ్యాభిషేకము స్థిర పరచిన వెనుక దానికి తగినయేర్పాటులు శాసించుచు 3 వ సర్గ 18 వ శ్లోకమున బ్రాహ్మణుల నిట్లు నియోగించుచున్నాడు.

శ్లో॥ దేవాయతనచైత్యేషు సాన్నభక్ష్యా స్సదక్షిణాః
ఉపస్థాయితవ్యా స్స్యు ర్మాల్యయోగ్యాః పృథక్ పృథక్ ॥

అనగా రామక్షేమార్థమై యన్నము భక్ష్యములు, దక్షిణలు మొదలైనవి తీసికొని దేవాలయములకును చైత్యములకును మీరు వరుసలు తీర్చి వెళ్ళి దేవతల నర్చింపుడని" కోరెను. అనగా నొక నూతనాధికారస్వీకరణారంభమున దేవాలయములలో తగినవారిచే పూజలు చేయించునాచార మాకాలమున నున్న దని తేలినది. మఱియు నిప్పటి మన "కమ్యూనిస్టు" మానాడే ప్రచారములో నున్న దని దీనిని బట్టి తెలియుచున్నది. అట్లు జరిగిననే ప్రశాంతవాతావరణ మేర్పడి ధ్యానయోగాదులు చక్కగా సాగును. అట్టిస్థితినుండి నేటిగందరగోళ స్థితికి దేవాలయార్చనాదులు దిగజారుట దురదృష్టకరము.

మఱియు నడవులకు పోవు పుత్రునికి కౌసల్యాదేవి యిచ్చు నాదేశము నించుక గమనింపుడు :-

శ్లో॥ యేభ్యః ప్రణమసే పుత్ర చైత్యే ష్వాయతనేషు చ
తే చ త్వా మభిరక్షంతు వనే సహమహర్షిభిః ॥

అనగా నగరచతుష్పథములందును పల్లెలలోను నడవులందును కూడ నానాటికి దేవాలయము లున్నట్లు తెలియబడు చున్నది. వానికి నమస్కరించుచు వెళ్లుము. అందలి దేవతలు నిన్ను రక్షింతు రను చున్నది. ఈయాదేశము 'ఏషవిగ్రహవాన్ ధర్మః' అనియు పరమాత్మావతార మనియు ననిపించుకొన్నవానికి తల్లి యిచ్చు నాదేశము.

ఆత డట్లు దేవతల పూజించినట్లు లీక్రింద మనకు తెలియును. అంతటి రాముడు విగ్రహారాధన చేయగా మన మద్వైతసిద్ధుల మని దానిని మానుటయు నిరసించుటయు నెట్టికార్యములో యోజించుకొనుడు. మఱియు భరతుడు రామవనగమన, పితృమరణములు తెలుపబడకుండ నయోధ్యకు రప్పింపబడి పురప్రవేశము చేయుచు సారథితో పలికిన వాక్యముల బరిశీలింతము :-

శ్లో॥ దేవతార్చాః ప్రవిద్ధా శ్చ యజ్ఞగోష్ఠ స్తథావిధ్యా
మాల్యాపణేషు రాజంతే నాద్యపణ్యానివాతథాః ॥

అనగా పూర్వమువలె నీ దేవాలయములు నేడు పూజాపురస్కారములులేక పాడువడి యున్నవేమి? పుష్పమాల లిచ్చుట నేడమ్మబడుట లేదేమి? యని యడుగుచున్నాడు. మఱియు -

శ్లో॥ దేవాయతనచైత్యేషు దీనాః పక్షిగణా స్తథా
మలినం చాశ్రుపూర్ణాక్షం దీనం ధ్యానపరం కృశం
న స్త్రీపుంసం చ పశ్యామి జన ముత్కంఠితం పురే
ఇ త్యేవ ముక్త్వా భరత స్సూతం తం దీనమానసః ॥

నాన్యనిష్టాన్యయోధ్యాయాం ప్రేక్ష్య రాజగృహం యయా" 71 సర్గ 43, 44 శ్లో దేవాయతన చైత్యములందు పక్షిగణములు దీనముగా నున్నవి. కండ్లవెంట నీరు గార్చుచున్నవి. ధ్యానపరములై యున్నవి. ఈ యాలయములయందు నేడు స్త్రీపురుషు లెవ్వరును రానరారు ఏమి యిట్లున్నవని ప్రశ్నించుచున్నాడు? దీనినిబట్టి పుష్పమాలాకారవృత్తి దేవాలయప్రాంతములందు సాగుచున్నట్లు తెలియును.

అరణ్యకాండ :- అగస్త్యుని యాశ్రమమునకు వెళ్ళి రాముడచ్చట ననేక దేవతలస్థానములు చూచుచుండ నగస్త్యుడు వచ్చి పలుకరించి వానిని వివరించె నని చెప్పబడినది. అప్పుడు దీక్షితులవా రచట నీశ్వర స్థానము లేకుండుటను, నగస్త్యు డీశ్వరభక్తు డనియు, గాన నాత

డాయా దేవతల నాహ్వానించి యాయాస్థానములందు కూర్చుండబెట్టి వారితో గలసి యీశ్వరోపాసన చేసె ననియు నిది నిర్గుణోపాసన యనియు చెప్పి రామాయణము నీశ్వరప్రధానముగా జెప్పిరట.

కిష్కింధాకాండ :- క్రౌంచపర్వతము వెదకుమనుచు సుగ్రీవు డిట్లు చెప్పినాడు.

శ్లో॥ వసన్తి హి మహాత్మాన స్తత్ర సూర్యసమప్రభాః।
దేవై రభ్యర్చితా స్సమ్య గ్దేవరూపా మహర్షయః॥
ఇక్కడ దేవతలు పూజింపబడినట్లు చెప్పినాడు.

సుందరకాండ :-

"ప్రాసాదై శ్చ విమానై శ్చ లంకా పరమభూషితా
ఘనై రివాతపాపాయే మధ్యమం వైష్ణవం పదం॥ 39 సర్గ 22 శ్లో॥
యస్యాం స్తంభసహస్రేణ ప్రాసాద స్సమలంకృతః
కైలాసశిఖరాకారో దృశ్యతే ఖమివోల్లిఖన్ ॥ 23 శ్లో.
పుష్పకపరిశోధన చేయుచు హనుమంతుడు

శ్లో॥ నియుజ్యమానా స్తు గజా స్సుహస్తా
స్సకేసరా శ్చోత్పలపత్రహస్తాః
బభూవ దేవీ చ కృతా సుహస్తా
లక్ష్మీ స్తథా పద్మిని పద్మహస్తా॥

ఇట్టిగజలక్ష్మీస్వరూపమును చూచెను. రావణునింట లక్ష్మీ విగ్రహ ముండుట విశేషము.

యుద్ధకాండ :- రాముడు తిరిగి సీతతోగూడి విమానముపై నింటికి వచ్చుచు ననేకసంఘటనలు జరిగినచోట్లు చూపించుచు వారధిబంధన స్థలము చూపి యిట్లనెను.

శ్లో॥ ఏతత్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః
సేతుబంధ ఇతి ఖ్యాతం త్రైలోక్యే నాధిపూజితం ॥ ౧౫
ఏత త్పవిత్రం పరమం మహాపాతక నాశనం
అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరో త్ప్రభుః ॥ ౧౬ ॥

అని పరమేశ్వరునియెడల కృతజ్ఞభావము చూపుచు తాను రామేశ్వరలింగప్రతిష్టచేసినచోటు చూపెను. నికుంభిలాహోమము నింద్రజిత్తు నికుంభిలాదేవతల కెదుట నేచేసెను. అదియొక యభిచార మూర్తి యుత్తరకాండలో రావణుడుచేసిన శివార్చన. కైలాసమెత్తుట మొదలైనగాథలు వర్ణింపబడెను. ఇన్నిసాక్ష్యము లుండగా రామాయణములో విగ్రహారాధన ప్రశంసయే లేదని వాదించిన విశ్వవిద్యాలయాంధ్రాచార్యులను బౌద్ధుల జూచి విగ్రహారాధన నేర్చుకొని రని వ్రాసిన చరిత్రకారులను నేమనవలయునో పాఠకులకు వదలివేయుచున్నాను.



## భారతము – విగ్రహారాధన

శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు తమ 'భారతతత్త్వకథనము'నుగ్రంథమున భాగవతము 1వ స్కంధము 4 అ॥; 2 స్కం. 1 అ॥; బృహత్సంహితావచనము, సాహిత్యదర్పణచర్చ, ప్రభాసఖండము 2 అ॥ మొదలగు గ్రంథాధారములతో విపులచర్చ చేసి భారతరచనాకాలము కలియుగారంభ మని సకారణముగా ఋజువు చేసినారు. అనగా 3101 B. C ప్రాంతమున నాగ్రంథము రచింపబడినది. చరిత్రకారులు దీని నంగీకరింపరు. B. C 1000 నాడది రచింపబడె నందురు. స్మిత్తుగారు B. C 400–200 మధ్య రచింపబడె ననిరి. పురాణముల లోని బార్హస్పత్యకథనం శకకథనము పంచాంగగణనలనుబట్టి నేటికి 5065సంరములక్రిందట పాండవరాజ్య మని గణించినారు. అదియు B. C 3101 తో సరిపోవును.

భగదత్తునితో కృష్ణునికి పోరు గల్గెను కాన నతడు B. C 3100 ప్రాంతమున నుండెను. ఆతనితండ్రి నరకాసురుడు సత్యభామచే వధింపబడెను. ఆతడస్సాం (కామరూపము)లో కామాఖ్యాలయముకట్టించెను. దానినిబట్టి యాప్రాంతమున శాక్తేయము ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది. ఈయాలయ మిప్పటికి నున్నది.6

భారత మాదిపర్వము II అధ్యా. 2 శ్లో॥ లోను నరణ్యాపర్వము తీర్థయాత్రాప్రకరణములోను వందలకొలది తీర్థయాత్రలప్రశస్తి యున్నది. నారాయణీయములో భక్తితత్వము విపులీకరింపబడెను. ఉత్తరహిందూదేశస్థులు వాసుదేవభక్తులు. భగవద్గీతలో నిట్లున్నది.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రియతాత్మనః
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి యదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణం॥

ఇందు పూజావిధానము ముక్తిమార్గముగా నిర్వచింపబడినది గదా! గీతలో 12వ అధ్యాయము భక్తియోగమే కదా!

వనపర్వము 39 అధ్యా. 65 శ్లో॥ లో నిట్లున్నది :- (పాశుపతాస్త్ర సంపాదనసందర్భము)

శ్లో॥ రుధిరేణాప్లుతాంగస్తు పాండవో భృశదుఃఖితః
శరణ్యం శరణం గత్వా భగవంతం పినాకినం
మృణ్మయం స్థండిలం కృత్వా మాల్యే నాపూజయ ద్భవం
తచ్చ మాల్యం తదా పార్థః కిరాత శిరసి స్థితం
అపశ్యత్ పాండవశ్రేష్ఠో వర్ణేణ ప్రకృతిం గతః॥

అర్జునుడు కిరాతరూపమున నున్న శివునతోడి యుద్ధములో గెలువలేక రక్తసిక్తాంగుడై విసివి పార్థివలింగమును చేసి పూజించి

(6) Indian History by Mr. S. Srinivasachari & Mr. M. S. Ramaswamayyar

దానికి మాలసమర్పించి పై కిచూడగా తాను లింగమున కర్పించినమాల కిరాతుని మెడలోకన్పింపగా నాశ్చర్యచకితుడై యా కిరాతుడు శివుడని తెలిసికొని ప్రణమిల్లెను. ఈక్షణిక విగ్రహారాధనమాకాలములో నున్నట్టిది సాక్ష్యమిచ్చుచున్నది. అర్జునతపోస్థల మగు నింద్రకీలాద్రియే విజయవాడలోని విజయేశ్వరలింగము నెలకొన్నకొండ యనియు, నర్జునునిచే నీలింగము ప్రతిష్ఠింపబడినట్లును నది యర్థనారీశ్వరదుర్గభ లింగమనియు, మల్లేశ్వరుడే విజయసేను డనియు నందురు.

తీర్థయాత్రాప్రకరణములో దేవియొక్క యోని స్తనపీఠములు పేర్కొనబడెను. భీమాస్థానవిశేషమును (పంచనదముల కావల)నుద్యత్పర్వతగౌరీశిఖరములపై (గౌహతీప్రాంతము) పవిత్రకుండము లున్నట్లును తెల్పును. వనపర్వము 83–23; 84–85 లలో ముంజవత, రాజగృహప్రదేశములలోని పూజాస్థానములలో యక్షిణీదేవాలయము లున్నట్లు తెలుపబడినది.7 సభాపర్వము 21–9 లో కృష్ణుడు జరాసంధవధపర్వాధ్యాయములో భీమార్జునులకు రాజగృహనగరమును వర్ణించి చూపుచు నది స్వస్తికమణినాగములకు నివాస మనెను. "స్వస్తికస్యాలయ శ్చాత్రమణినాగస్య కో త్తమః ॥" అనెను. ఆ యాలయము లచట నున్నవన్నమాట. ఇప్పుడు కూడ నానగరమున మణియార్ మఠమను ప్రదేశ మున్నది. అచట నాగపూజాప్రదేశము బయలుపడెను.

అనుశాసనికపర్వములో కృష్ణుడు మహాదేవుని పూజించినట్లు చెప్పబడెను, శివదీక్ష గొన్నట్లు చెప్పబడెను. "దండము దాల్చి ముండనుడై చింకిగుడ్డల ధరించి యొకనెల ఫలాహారియు, పిదప నాల్గునెలలు జలాహారియు నై యేకపాదస్థుడై యూర్ధ్వబాహుడై చిరకాలము తపస్సుచేసి యుమామహేశ్వరుల దర్శించెను. ఇంద్రవిష్ణుబ్రహ్మలు రథంతరసామగానము చేయుచుండగా చూచి మహాదేవుని నుమను

(7) P 338 Development of Hindu Iconography by Mr. J N. Benerjia

స్తుతించి యిరువురివలనను చెరియెనిమిదివరములు పొందెను. అందొ కటి తానెప్పుడును శివభక్తుడై యుండవలె ననునది.[8]

నారాయణీయములో సాంఖ్య, యోగ, పాంచరాత్ర, వేద, పాశు పతమతములు పేర్కొనబడెను. (శాంతిపర్వము 64 అధ్యా - 777) ఇట్లు భారతకాలమున దేవాలయోద్యమము విశేషముగా నభివృద్ధి గాంచినది. భగవద్గీతాతత్త్వబోధ సర్గముచేసికొని యనుభవించగ లంతటి పార్థుడు విగ్రహారాధన జేసెను. సామాన్యుల మగుమన కెట్లది యనవసర మగును ?



## భాగవతము - విగ్రహారాధన

వ్యాసుడు భారతమును 18 పురాణములను రచించియు నేకా గ్రత కలుగక సరస్వతీ తీరము జేరి విశ్రాంతిం చుకొనుచుండగా నారదోపదేశము లభ్యమై తదనుసారముగ భాగవతమును రచించెను. దాని నేడుదినములలో మరణము నందబోవుపరీక్షిత్తునకు మోక్ష మార్గముగా శుకయోగి యాతనికి వినిపించెను. భాగవతప్రచారము కలియుగమున 30 వ సంవత్సరమున జరిగెను.

శ్లో॥ ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్ ।
అధీతవాన్ ద్వాపరాదౌ పితు ర్ద్వైపాయనా దహమ్
(శుకః స్కం. 2 అ 1)

ఆకృష్ణనిర్గమా త్త్రింశద్వర్షాధికగతే కలౌ
నవమీతో నభస్యే చ కథారంభం శుకో కరోత్ ॥
(భాగవతమహాత్మ్యం)

భాగవతములో విగ్రహారాధనప్రశంస యెట్లు చేయబడినదో చూతము :-

(8) History of culture of Indian People I P 457-58 by Mr. R. C. Benerjia

(1) "మా వేలుపులగోడపై నోహేలావతి నీతమూజు డెంగిలి చేసెన్"
ఇది గోపికలు కృష్ణునిపై యశోదకు చేసినఫిర్యాదు. అనగా గోడకు పసుపుకుంకుమలు దేవీచిహ్నముగా నుంచి దానిని పూజించునాచార మున్నదని తెలియుచున్నది.

(2) సుభద్రాపరిణయమునకు ముందు యోగివేషమున నున్న యర్జునుడు ద్వారకలోని దేవాలయముననే గదానివాస మేర్పరచుకొన్నది.

(3) గోవర్ధనగిరిపూజను మహావైభవముగ కృష్ణుడు జరిపించెను. అంతకుపూర్వమున నున్న యింద్రోత్సవమును మానిపించినకారణముననే యింద్రుడు కోపించి రాళ్ళవర్షమును కురిపించెను. అట్టి యింద్రోత్సవము కాళహస్తి, కావేరిపక్కెంలలో ప్రచారమున నుండెను.

(4) రుక్మిణి శిశుపాలపాణిగ్రహణపు టేర్పాటులలో సాంప్రదాయ ప్రకారము మమాదేవిగుడికి పోయి యర్చించి వచ్చుచుండగా కబురంది వచ్చిన శ్రీకృష్ణు డామె నెత్తుకొనిపోయి రాక్షసవివాహము చేసుకొనెను.

(5) సత్రాజిత్తు సూర్యారాధన చేసి శ్యమంతకమణిని పొంది దాని నర్చించుచుండెను. రుక్మాంగదచరిత్రలో నేకాదశీవ్రతము, నంబరీషచరిత్రలో విగ్రహారాధన వర్ణింపబడెను.

(6) పాంచరాత్రులపంచతత్త్వస్వరూపము లుపాసింపబడినట్లు లాయా ఘట్టములందు వర్ణింపబడినది. వైష్ణవభక్తి, ప్రపత్తి యీకాలమున పూర్ణపరిణామ మంది కృష్ణభక్తి వెల్లివిరిసినది. ఆతడు నాయకుడు. గోపికలు నాయికలు. ప్రకృతిపురుషప్రేమతత్త్వములో భక్తి కట్టలు త్రెంచుకొని లోకమును ముంచెత్తినది.

(7) మ॥ "తనుహృద్భాష లసఖ్యమున్.....భద్రమంచు దలతున్ సత్యంబు దైతోత్తమా॥" అను నవవిధభక్తులు నీకాలమున వెలసినవి.

(8) ప్రభాసతీర్థమున యాదవు లందఱు సమ్మైవారిజాతర నడుపుటకు పోయినపుడే పరస్పరకలహమున శాపవశంగతు లైరి.

(9) శ్రీకృష్ణునికొడుకు సాంబుడు మగశీలనుండి సూర్యారాధనాపద్ధతులు నేర్చి యావిధానము నీదేశమున ప్రవేశపెట్టెను. ఆలయ ప్రతిష్ఠలు చేసెను. కుష్ఠరోగమును బాపుకొనెను. ఆ సూర్యవేష ముదీచ్యవేషము. విషయ మిట్లుండగా చారిత్రకులు భాగవత రచనాకాలము క్రీస్తున కీవలావల యని చెప్పుటయు, బౌద్ధమతము నుండి ప్రజలను మరలించుటకు పురాణములును భాగవతమును రచింపబడిన వనియు బౌద్ధులశూన్యత్వస్థానమున భగవత్తత్త్వము ను ప్రవేశపెట్టి రంజకముగా కథలల్లి కృష్ణుని దేవుని చేసి బుద్ధుని విష్ణ్వవతారముగా గైకొని బౌద్ధమతమును హిందూమతములో లీనము చేసిరనియు చెప్పుట సరికాదు. గౌతమ బుద్ధుడే ప్రథమబుద్ధుడు కాడు. అంతకుపూర్వము 24 గురుబుద్ధులుదయించి యవతారప్రయోజనమును నెరవేర్చి యవతారములలో నొకటిగా గణింపబడి రని బౌద్ధగ్రంథములు, నిఘంటువులు నితరగ్రంథములనుండి యాభాగముల జూపి శ్రీవారణాసిసుబ్రహ్మణ్యశాస్త్రులవారు నిరూపించియున్నారు.

ఇట్లు భక్తిమార్గముచే తరించిన యెందరో పురుషుల చరిత్ర లిందు వర్ణింపబడి మననయోగ్యములై ముక్తిదాయకములై యనుసరణీయములై యున్నవి. బుద్ధిమంతులు తల్లాభము నందుదురుగాక!

---

## ధర్మశాస్త్రములు – విగ్రహారాధన

ధర్మశాస్త్రములు దేశమునకు తగినవిధముగా చాతుర్వర్ణ్యవ్యవస్థకు తగినవిధముగా చిరకాల మా వ్యవస్థ సాగుట కనుకూలమైన

మార్పుల కంగీకరించి కట్టుదిట్టముల నేర్పరచి వ్రాయబడినవి. మనుస్మృతి యతిపురాతనకాలమునకు చెందినది. హిందూదేశ మంతటికిని శిరోధార్యమైనది. దానిని దేవప్రవచనముగా భావింతురు. అది శాసనముల కాది. నిరంకుశత్వము చూపక "ఏష ధర్మ స్సనాతనః" అను హితబోధాపద్ధతి నున్న శాసనము. శాశ్వతధర్మ ప్రతిపాదన గలది. మానవుల కన్యోన్యసంబంధమును మొట్టమొదటగూర్చిన న్యాయశాస్త్ర మది. యాజ్ఞవల్క్యుడు దానిని క్రమపరచెను. ఆతనిగ్రంథము నేటికిని నాధికారికముగా నెంచబడును. ప్రజాహితసంస్థలు దానితో స్థిరపడెను. సమాజవ్యవస్థకు దారి ద్రొరకెను. చ్యుతుల నది నిషేధించెను. సమాజమును నెమ్మదిగా నడిపించెను. విదేశస్థులకు సమాజమున తావిచ్చి కలుపుకొని వారిలోని మంచి పద్ధతులను తనవిగా జేకొని మార్పు లంగీకరించెను. నాగరికసంస్కృతులకు స్థిరమగు పునాది వేసి సాంస్కృతులవిలువల నవిచ్ఛిన్నముగ సాగునట్లు జేసెను. క్రొత్త జాతులసృష్టి నిర్వచించెను. అవి చాతుర్వర్ణ్యవ్యవస్థలో భాగములయ్యెను. కలసియున్నవి గాను, వేరుగాను నుండునట్లు సమాజాభివృద్ధి కాటంకము లేకుండునట్లు మలిచెను. జాతులు దైవనిర్ణయములుగా నెంచబడెను. కాని తత్త్వశాస్త్ర మందరికిని నొకటే యీజాతులరచనకు మతాధారము, నాత్మోన్నతి మోక్షమందుట కవకాశము, సమాజసేవ లక్ష్యములుగా జేయబడెను. సమాజకార్య బాధ్యతలునిర్వచింపబడెను. ఈవర్ణవ్యవస్థాపద్ధతి రాజుగారియిష్టానిష్టములతో గాని సమాజముయొక్క ఇష్టముతో గాని నిమిత్తము లేనిది. ధర్మ, నీతి, దేవతలపై నాధారపడిన నియమములు గల సంఘనాయకుల శాసనమే దానిని నడపునది. అర్జునుడంతవాడు దానికి వెఱచి యుద్ధమునకు సిద్ధపడెను. అర్థశాస్త్రములో సన్న్యాసియగుటకు రాజాంగీకారము కావలె నని వ్రాయబడెను. వర్ణసంకరము నొందినవానికి హుపరదూరత్వము శిక్షగా నిర్ణయింప

బడెను. అట్టి చాతుర్వర్ణ్యవ్యవస్థపై నాధారపరచబడి వైష్ణవ, భాగవత, శైవసిద్ధాంతములు ప్రచారమయ్యెను. ధర్మశాస్త్రమును భగవంతుడు భృగువు మొదలగువారికి చెప్పగా భృగువు దాని నందరికిని చెప్పెను. అట్లు ధర్మశాస్త్రము భగవత్సంబంధము గలది. నారద, మార్కండేయ, సుమతులు మనుస్మృతిని సూక్ష్మీకరించిరి. ధర్మశాస్త్రములో తపోవిధానములు తాత్త్వికసిద్ధాంతములు కూడ వివరింపబడెను. విష్ణుస్మృతి విష్ణువుచే చెప్పబడినది. బహుపురాతనమైనది. కధకపద్ధతిది. భాగవతులు దానిని గద్యపద్యాత్మకముగా రచించిరి. స్మృతులు A.D 100 మొదలు A.D 600 కాలములో వ్రాయబడినట్లు చారిత్రకనిర్ణయము. వారు మనుస్మృతి B. C 200 నాటి దనిరి. మనుస్మృతిలో విగ్రహముల నూరేగించవలె ననియు (IV 39) తెలిసి యుండి విగ్రహపునీడను దాటరా దనియు (IV 130) పర్వములందు రక్షణకొరకు దేవతావిగ్రహములవద్దకు వెళ్ళవలె ననియు (IV 153) వంతెన, జెండా, దేవాలయము, విగ్రహములను పాడుచేసినవాడు (సంక్రమ ధ్వజ యష్టీనాం ప్రతిమానాం చ భేదకః) దాని పునరుద్ధరణపుఖర్చు నంతయు భరించుచు 500 పణము లపరాధము చెల్లించవలె ననియు (IX 285) మనువు శాసించెను."

ఇట్లు విగ్రహారాధన వేదాదిసమస్త శ్రుతి, స్మృతి, శాస్త్రేతిహాసాది గ్రంధసమ్మతమై యనాదియై యవిచ్ఛిన్నముగ కొనసాగినది. కొనసాగుచున్నది. కొనసాగగలదు. అది సమాజమున కంతముఖ్యము గావుననే వేదాది సమస్తగ్రంథములు దాని నొప్పుకొని దోహద మొనర్చినవి. నేడశ్రద్ధ జనించుట దురదృష్టకరము. తిరిగి దేవాలయోద్యమము మహోన్నతస్థాయి నందుగాక!



# దేవీస్తవ వృత్త రత్నమంజరి

శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి.

మానినీవృత్తము :

సర్వము నీ మహిమాతిశయమ్మున
        సంభవమయ్యెడు లోకమునన్
సర్వము నీదు కృపారసదృష్టిఁ బ్ర
        శస్తము నొందుచుఁ బెంపుఁ గనున్
సర్వము నీవలనన్ లయ మొందెడు
        సర్వము నీవె మదీప్సితమున్
నిర్వహణ మ్మొనరింపఁగ దే! మది
        నిన్ను భజింతు జగజ్జననీ!

మత్తకోకిలావృత్తము :

డెందమందలి కుందుఁ దీర్చి క
        డిందికూరిమి నన్ను నా
నందవార్నిధిఁ దేల్చ నియ్యెడ
        నమ్మియుంటిఁ గదే! నినున్
మందభాగ్యుల కీవె దిక్కఁట
        మానిమానస వాసినీ!
వందితామర పోషిణీ! వర
        భక్త శోక నివారిణీ!

వనమయూరవృత్తము

ఎన్నితి మదాత్మ నిను నెంతయును బ్రీతిన్
మున్ను మహిషాసురుని మొత్తి జగ మెంతే
సన్నుతులఁ గన్న నెఱజాణవుగదే? యా
పన్నులను బ్రోచు టిది భారమె? భవానీ!

పంచచామరవృత్తము :

దురంతదుఃఖవారిరాశి
దోఁగుచుంటి నన్ సము
ద్ధరింపు భక్తకల్పవల్లి !
తల్లి ! నిన్నె నమ్మితిన్-
చరాచరమ్ము లెల్ల నీ ప్ర
సాద మొందుటం గదా
సురార్చితాంఘ్రిపద్మయుగ్మ !
సొంపు నింపు నింపెడున్. 4

తోదకవృత్తము :

మది నిను నిల్పి యమందమతిన్ నీ
పదకమలమ్ములఁ బ్రార్థన సేయన్
వదలక నిచ్చఁ గృపారసదృష్టిం
బొదలఁగ వారిని బ్రోవవె దేవీ !. 5

భద్రకవృత్తము :

నెమ్మనమ్మున నిన్ను నే
నమ్మియుంటిఁ గృపాంబువుల్
చిమ్మి నన్నిటఁ బ్రోవవే
నెమ్మమై జగదీశ్వరీ !. 6

స్రగ్విణీవృత్తము :

నీ పదాబ్జమ్ములన్ నిష్ఠమైఁ గొల్చెదన్
నాపయిం గూర్మిచే నామొ తాలింపవే !
పాపబంధమ్ములం బాపు నాప్రాపునుం
బ్రోవు నీవే కదే ! ముక్తిసంధాయినీ !! 7

సుగంధి వృత్తము :

కన్నులార నిన్ను గాంచఁగల్గు భాగ్య మెన్నఁడో
సన్నుతాంగి! భక్తపారిజాత! లోకమాత! నీ
కన్న నన్ను గాచువారు గానరారు ధారుణిన్;
క్రొన్నెలం దలం ధరించు కొన్న కాళికేశ్వరీ!. 8

మత్తేభవిక్రీడితవృత్తము :

వరుసన్ బద్మభవాదులేనియు నినున్
వర్ణింప లే రన్న నే
స్మరియింపంగలనే? భవచ్చరణయు
గ్మ మ్మెంతయు న్భక్తి నా
పరితాపానల మార్చి ప్రోవఁ గదవే!
వాత్సల్యముం జూపవే!
స్ఫురదిందీవరలోలలోచన! మహా
జ్యోతిర్మయాకారిణీ! 9



## పండిత రాజప్రతిభా విశేషము

శ్రీ కొల్లూరి సోమశేఖర శాస్త్రి

"విమర్శః కవితా చేతి ద్వంద్వం యది సుసంగతం।
ప్రసువీత రసం హృద్యం సమ్మోదాయ సచేతసామ్॥"

అను వరదార్యోక్తినిబట్టి, కేవలవిమర్శకునికన్న కవి యగు విమర్శకుడు మిన్న యనునది నిర్వివాదాంశము. రసగంగాధరకర్త యగుపండితరాయలు– "నిర్మాయ నూతన ముదాహరణానురూపం, కావ్యం మయాత్ర నిహితం న పరస్య కించిత్" అని తన రసగంగాధరమునకు తనకవితనే యుదాహరణముగ జూపుచుండును. మఱియు కవిత రసమున కనుకూలముగ నుండవలయు ననియు, ప్రాచీనకవు

లీనియమమును సరిగ పాటించుట లేదనియు, సోదాహరణముగ నిరూపించెను. "శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించి చ్ఛనై ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్య గండస్థలీం, లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుంబితా" అనుపద్యమున ల్యప్పులు, మహాప్రాణవర్ణములుగల యీరచన సుకుమార మగుశృంగారరసమున కెంతప్రతికూలమో సహృదయు లెఱుంగనిది కాదు.

"తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ క్వాపి" అని నిర్దుష్టములు, సగుణములు నగుశబ్దార్థములు రెండును కావ్య మని ప్రాచీనాలంకారికులమతము. ఈమతము సరికాదు. "కావ్యం శృతం, అర్థో న జ్ఞాతః, కావ్యా దర్థోవగమ్యతే" కావ్యమును వింటిని. కాని యర్థము తెలియుటలేదు అని, కావ్యమువలన నర్థము తెలియుచున్న దనియు నిర్బాధ మగు లోకవ్యవహారమునుబట్టి, రమణీయార్థప్రతిపాదక మగు శబ్దమే కావ్యముకాని, శబ్దార్థములు రెండును కావ్య మని చెప్పుట యుక్తముకాదు. మఱియు సత్కావ్యము లనియు, దుష్టకావ్యము లనియు, కావ్యములు రెండురకములు. కాగా కావ్యలక్షణమునం దదోషౌ, అనువిశేషణము సరిగాదని పండితుని నిర్ణయము.

కావ్యసామగ్రిని నిరూపించుటయందును పండితునకును ప్రాచీనాలంకారికులకును భేదము కలదు. ప్రాచీనులు – శక్తి, (అదృష్టము) నైపుణ్యము, అభ్యాసము, ననుమూడును కలిసి కావ్యమునకు కారణము లనుచున్నారు. పండితుడు కేవలము ప్రతిభయే కావ్యమునకు కారణము. వ్యుత్పత్త్యభ్యాసములు లేకున్నను ప్రతిభావంతులు కావ్యములను రచించుచున్నారు. నవనవోన్మేషము గలప్రజ్ఞకు ప్రతిభ యని పేరు. ప్రతిభ లేనివారి కెంతవ్యుత్పత్త్యభ్యాసము లున్నను, కావ్యమును రచింపజాలరు. కావ్యమున "కవి ర్జాయతే న తు భవతి" అనునార్యోక్తి సంగత మగుచున్నది.

కావ్యము-ఉత్తమ మనియు, మధ్యమమనియు నధమ మనియు త్రివిధమని, ప్రాచీనుల విభాగము. వాచ్య మనియు, వ్యంగ్యమనియు కావ్యార్థము ద్వివిధము. అందు వ్యంగ్యము ప్రధాన మయినయెడల నది యుత్తమకావ్యము. వ్యంగ్య మప్రధాన మయినయెడల మధ్యమ కావ్యము. అలంకారప్రధానమైనది యధమము నని వారివిభాగము. కాని యలంకారములు అర్థాలంకారము లనియు, శబ్దాలంకారము లనియు, రెండురకములుకాగా నర్థాలంకారప్రధాన మధమ మనియు, శబ్దాలంకారప్రధానము నధమాధమ మనియు విభజించుట యుక్త మని పండితుని యభిప్రాయము.

రసము– "విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః" యను భరతాచార్యుల సూత్రమునుబట్టి, యభినవగుప్తుడు మున్నగు నాలంకారికులు రసస్వరూపమును నకరకములుగా నిరూపించిరి. పండి తుడు వారిమతములను నిరూపించి, నవ్యాస్తు అని నవీనమార్గమున రసమును నిరూపించియున్నాడు.

కావ్యమునందు కవిచేతను, నాట్యమునందు నటునిచేతను, విభా వానుభావవ్యభిచారిభావములు ప్రదర్శింపబడును. వానిని గమనించిన సభ్యునికి. 'దుష్యంతునకు శకుంతలయందు రతి కల దని' తెలియును. పిమ్మట భావన యనుదోషమునవలన తనకు తెలియకుండగనే, తనయం దొక విలక్షణ మగురతి కలుగును. దోషమునవలన ముత్యపుచిప్పయందు వెండి యను నొకవస్తువు పుట్టును. ఇది యనిర్వాచనీయము. అనగా నిర్ధారణముచేసి చెప్పుటకు వీనిలేనివస్తు వని యర్థము. అట్లే సభ్యుని యందు భావనవలన పుట్టినరతియు ననిర్వాచనీయము భావనయన కావ్యార్థమును తలుచుగ మననముచేయుట. సామాజకునియం దుదయించిన యీరతి, భావనకు కార్యము. భావన నశించినతోడనే

నశించును. ఈరతిపుట్టిన వెంటనే చెప్పశక్యముగానియానందముకలుగును. ఆ యానందముతో నీరతికి గలభేదముమాత్రము మనకు గోచరింపదు. కావుననే రస మానందరూప మని వ్యవహారము. అట్లే. సామాజికునియందు గల స్వాభావిక మగురతికి, యీ యనిర్వచనీయరతికిని గల భేదము గోచరము కాకుండుటచే నిదికవులకు వర్ణనీయము. కావ్యమునకు వ్యంగ్యమును నగుచున్నదని రసమనిర్వచనీయ మని నిరూపించెను. ఈవాద మనిర్వచనీయవాదము నంగీకరించిన యద్వైత వేదాంతుల కెంతేని సమ్మతము. దీనినిబట్టి పండితుడ ద్వైతి యనియు, తక్కినవారు ద్వైతు లనియును చెప్పవచ్చును.

మఱియు స్త్రీకి బహునాయకాసక్తి రసాభస మనుసందర్భమున ద్రౌపదికి గల బహునాయకాసక్తి రసాభాస మగునా కాదా యని శంకించి ద్రౌపదియొక్కగతి పరిణేతృబహునాయకగత మగుటచే రసాభాసము కా దని నిరూపించెను. మఱియు రసాభాసము రస మగునా కాదా యని శంకించి, రస మనుపక్షమును రసముకా దను పక్షమును గూడ సయుక్తికముగ నిరూపించెను. ఇట పతంజలిపోకడ కన్పట్టుచున్నది. పతంజలి రెండుపక్షములను శంకించి రెండుపక్షము లందును దోషమును చెప్పి రెండుపక్షములను సిద్ధాంతముచేయుట కలదు.

శబ్దము నర్థమును బోధించునపుడు శబ్దార్థములకు సంబంధ ముండవలయు నను నది సర్వసమ్మతము. ఆసంబంధము ముఖ్య మనియు, నముఖ్యమనియు రెండువిధములు. ముఖ్యసంబంధమును శక్తి యనియు, నముఖ్యసంబంధమునకు లక్షణ యనియు వ్యవహారము. కాగా నాలంకారికులు వ్యంజన యని మఱియొకసంబంధమును గూడ నంగీకరింతురు. దీనివలననే రసాదిప్రతీతి కలుగు నందురు. కాని చాలమంది ప్రతివాదులు యీవ్యంజన నంగీకరింప బనిలే దని చెప్పుచున్నారు. కాగా వ్యంజనా

వ్యాపారము సిద్ధించనినాఁడీయలంకారశాస్త్రమే విఫల మగుచున్నది. ఇట్లుండ పండితుఁడు సుదూరము చర్చించి వ్యంజన నిట్లు స్థాపించు చున్నాఁడు.

"యోగరూఢస్య శబ్దస్య యోగే రూఢ్యా నియంత్రితే।
ధియం యోగస్పృశోర్థస్య యా సూతే వ్యంజనైవ సా॥"

అని సంగ్రహశ్లోకము. శబ్దము యోగ మనియు, రూఢ మనియు, యోగరూఢ మనియు, మూఁడువిధములు. యోగ మనగా నవయవ శక్తి. ఈరెండిటిలోను యోగముకన్న రూఢి ప్రబలము. కాగా "అబలానాం శ్రియం హృత్వా వారివాహై స్సహానిశం తిష్ఠంతి చపలా యత్ర సకాల స్సముపాగతః" అని వర్షాకాలప్రారంభమును చెప్పుచు న్నాఁడు. ఇట రెం డర్థములు స్ఫురించుచున్నవి. స్త్రీలయొక్క శోభను హరించెడిమెఱుపులు మేఘములతో కలిసి యుండెడికాలము వచ్చిన దనెడియర్థము తొలుత దోఁచును. పిమ్మట దుర్బలు లగుపురుషుల యొక్క నైశ్వర్యమును హరించిన చంచలస్వభావము గలస్త్రీలు జలవాహకులతో గలిసి యుండెడికాలము వచ్చినదని రెండవయర్థము తరువాత దోఁచుచున్నది. ఈపద్యమున కీరెండవయర్థమును చెప్పనియెడల నందమే పోవుచున్నది. కాగా నీరెండవయర్థము వ్యంజనావ్యాపారము నంగీకరింపనినాఁడు లభింపజాలదు కాన వ్యంజనావ్యాపారము నంగీకరింప వలయు నని పండితుని నిర్ణయము.

మఱియు నుత్ప్రేక్షాలంకారమున తార్కికులతో, శాబ్దికులతోను నిర్భయముగ శాస్త్రార్థమును చేసి తుద కలంకారశాస్త్రముగూడ స్వాతంత్ర మయినదని నిరూపించెను. మఱియు వీరరసవిభాగసందర్భమున పాండిత్యవీరున కుదాహరణము నిచ్చుచు "అపి వక్తి గిరాం పతిః స్వయం యది తాసా మధిదేవతా పి వా" యని తనపాండిత్యదర్పమును ప్రకటించెను. బృహస్పతిగాని వాగ్దేవికాని వాక్యార్థమునకు వచ్చినను నేను

సిద్ధమే యని భావము. దీనినిబట్టియే యీతడు భగవదనుగ్రహాలబ్ధ ప్రతిభాసంపన్ను డనియు స్పష్టమగుచున్నది. ఇట్లే "నిర్మాణే యది మార్మికోసి నితరా మత్యంతపాకద్రవన్మృద్వీకామధుమాధురీ మదపరీవాహోద్ధురాణాం గిరామ్। కావ్యం హంత సఖే సుఖేన కథయ త్వం మాదృశాం సన్నిధౌ నో చేద్దుష్కృత మాత్మనా కృత ఇతి స్వాంతా ద్బహిర్మాకృథాః" యనుసందర్భమున తనకవితను గురించియు చెప్పి యున్నాడు. ఒకడు పండితునివద్ద తనకవితను విను మనిచెప్పగా పై తీరున పండితు డనెను. ఓయీ! నీవు చక్కగ పండినద్రాక్షారస మాధుర్యమువంటి మాధుర్యము నీకవితయం దుండిన నాకువినిపింపుము. లేనియెడల నీవు చేసినది దుష్కృతముకాని, కవిత్వము కాదు. కాన నోరు విప్పకు మనిభావము.

ఇక నలంకారనిరూపణసందర్భమునం దసమాలంకారమును, ను దాహరణాలంకారమును, తాను క్రొత్తగా సోదాహరణముగ నిరూపించెను. దీపకతుల్యయోగితల నొకయలంకారముక్రిందను, కావ్యలింగార్థాంతరన్యాసముల నొకయలంకారముగను జెప్పవచ్చు ననియు, కావ్యలింగ మలంకారమే కా దనియు, లలితాలంకారము నిదర్శన యందే చేరిపోవుటచే నది వేఱుగునలంకారము కాదనియు వీరవిహారము నొనర్చెను.

పండితు, డైదుదాననములు గల రసగంగాధరగ్రంథమును రచించె ననియు, నందు మూడాననములు లోపించిన వనియు, వాడుక గలదు. కాని మొదటిది రసాననము, రెండవది ధ్వన్యాననము. మూడవది యలంకారాననము. నాలుగు దోషాననము. ఐదు గుణాననము. అందు నుత్తరాలంకారాంత మగు నీగ్రంథము కొద్ది తక్కువగ ప్రధానము లగు మూడాననములు దక్కినవి. రెం డాననములు లోపించినవి యనుకొనుట యుక్తమేమో యని నాతలంపు.

దీక్షితమతఖండనములతోను, తార్కికశాబ్దికమతములకు విరుద్ధముగను, నతిస్వతంత్రముగను వెలువడిన యీరసగంగాధర మన్ని విశ్వకళాపరిషత్తులందును గౌరవింపబడుటచేత నే యీగ్రంథముయొక్క గొప్పదనము స్పష్ట మగుచున్నది.

ప్రాచీనులు భావధ్వని, భావోదయధ్వని, భావశాంతిధ్వని, భావసంధిధ్వని, యని విభాగముల జూపిరి. కాని యివి యన్నియు భావధ్వనులే యని పండితునినిర్ణయము. ఈవిషయమును రసాననము చివర చూడనగును. సైంధవ మానయ యనునపుడు నానార్థక మగు సైంధవపద మొకప్పు డశ్వమును. మఱియొకప్పుడు లవణమును బోధించుచున్నది. కాగా నానార్థకము లగుపదముల యర్థవిశేషమును బోధించుటలో నియామకములు. "సంయోగో విప్రయోగశ్చ...... విశేషస్మృతిహేతవః" యని 24 హేతువులను ప్రాచీనులు సోదాహరణముగ నిరూపించియున్నారు. ఈసందర్భమున ప్రాచీనమతమును సుదూరము చర్చించి, చివరకు లింగమొక్కటియే చాలును. ప్రాచీనులు చెప్పిన వన్నియులింగమునందే చేరిపోవు నని సయుక్తికముగా నిరూపించెను.

అప్పయదీక్షితులు చిత్రమీమాంస యనుగ్రంథమునందు "స్వతస్సిద్ధేన," యను విద్యానాథుని యుపమాలక్షణమునందు నన్నివిశేషణములను ఖండించెను. ఆంధ్రుడగుపండితుడు తన రసగంగాధరమున దీక్షితుని యుపమాలక్షణము చక్కగ విమర్శించి, ఖండించి, తన యాంధ్రాభిమానమును జూపెను. మరియు నంతతో నాగక దీక్షితుని రచన లన్నిటిని వీలున్నవరకు నిరాకరించుచునే వచ్చెను. మచ్చునకొకయుదాహరణము :- "వాగర్థా వివ......పార్వతీపరమేశ్వరౌ" యనునెడ దీక్షితు లిట పార్వతీపరమేశ్వరులకు గల నిరతిశయప్రీతి వ్యక్త మగుచున్నది గాన నిది రసధ్వని యనెను. పండితు డిట

పార్వతీపరమేశ్వరుల ప్రీతికన్నను కవికి వారియందు గలభక్తి ప్రధానముగ వ్యక్తమగుటచే నిది రసధ్వని కాజాలదు. భావధ్వని యనియు, రస మలంకార మనుటయే యుక్త మని నిరూపించెను. వేయేల రసగంగాధరమునం దెక్కడ జూచినను పండితుని ప్రతిభాతిశయము స్పష్టముగ గన్పట్టుచునే యుండును. కాగా పైని చూపినవిషయములను బట్టి పండితరాజజగన్నాథుని పాండిత్యము కాని, కవిత్వము కాని, యనన్యసాధారణము లని స్పష్ట మగుచున్నది. పండితునియందు కవితా విమర్శ లనుద్వంద్వము సుసంగతమై హృదసమ్మోదావహ మగు నీ రసగంగాధర మనుఫలమును కనిన దని మనవిచేయుచున్నాను.



## కుకవి మరణశయ్య

శ్రీ దామెర రాజగోపాలరావు B. A.

ఒకనాఁ డెంతయుఁ జింతలోఁ దగిలి దైన్యోద్భూతబాష్పాంబువుల్
వికలాలోకనముల్ కడల్కొన నెఱిం బ్రేతాకృతిం దోఁచుచుం
గుకవిగ్రామణి యొక్కఁ డిక్కరణిఁ బల్కున్ మృత్యుశయ్యాపరిన్
సకలాత్మీయజనంబు క్రచ్చుకొనఁగా సంభ్రాంతచేతోరతిన్.

సం దీకుండఁగ స్వచ్ఛభావముల కస్పష్టాన్వయక్లేశ మే
పొందం గ్రందుగ నప్రసిద్ధకటుశబ్దోద్దామవిన్యాస మొ
ప్పం దబ్బిబ్బుసమాసముల్ కలగొనం బాషాణపాకంబునన్
ఛందోబద్ధము చేయుటే కవితగా జాటించి పాటించితిన్.

కుప్పంగూర లొనర్చితిం గృతులు కోర్కుల్ మీఱఁ బేరొందఁగన్
డప్పుం గొట్టితిఁ జూ సభాముఖములన్ డంభంబు జృంభింప నా
గొప్పం గూరిచి నాకు నేన నలుదిక్కుల్ వోయి నా యొప్పులున్
మెప్పుల్ సెప్పి ప్రచారముల్ సలుప నంతేవాసులం గూర్చితిన్.

లెక్కా నాకుఁ గవిత్వశిల్పమున వాల్మీక్యాదులున్ సృష్టిలో
నొక్కండం గవి నౌదు నేఁ గవుల యన్యుల్ వారిఁ గీర్తించుటల్
న్యక్కారం బనుచుం బురాణనవకావ్యప్రౌఢ నిర్మాతలన్
ధిక్కారం బొనరించితిం బటుమదాంధీభూతచిత్తుండ నై.

పరగ మదీయకావ్యముల పైన విమర్శ లొనర్చువారలం
బరుషము లాడితిన్ గురుల మన్నన సేయఁగ నైతి నాదు ము
ష్కర మగునోటిధాటి కెద జంకు వహించిన పెద్ద లీయఁగా
బిరుదులు సాహితీసభల వేదుల నేలితి విఱ్ఱవీఁగుచున్.

చారుమహోపదేశములు చాల నొసఁగఁగ నాకు నెమ్మి మై
నారచనారుచిన్ విషువు మందును సాగమటుల్ హితుల్ సదా
యూర యొకించు కేనియును నయ్యాని వీడఁగ నైతి నే నదీ
నీరము లెన్ని తూకొనిన నీరధి యాత్మరుచిం ద్యజించునే.

ఆలంకారికు లెల్లరుం బ్రతిభ యభ్యాసంబు వ్యుత్పత్తియుం
బోలం గల్గఁ గవీశుఁ డౌ ననినఁ గాఁబో లంచు భావించి నే
నాలోచింపఁగ లేకపోయితిని నాహా యీగహాస్యంబు ము
న్నోలిం దాబుపి కానిచో సుకవి కానోపం డ టం చెన్నఁగన్.

కాలము చెల్లిపోయినది కందితిఁ గాటికిఁ గాళ్లు సాఁచితిన్
వ్రీలెను గర్వ మెల్ల మఱి నేఁ డటు చేసినతప్పు దిద్దుకోఁ
జాలక యుంటి గొప్ప యపచారము చేసితి దిష్టిబొమ్మనుం
బోలె వెలార్చి నే లలితమూర్తిని నాకవితాలతాంగినిన్.

ద్రాగుంబోతు వరింప వేఁగు వనితారత్నంబు చందంబునన్
నే గేల్పట్టుటఁ జేసి యో కవితరో నీవెంతగా వేఁగితో
వాగోద్వేలత భావిజన్మమున నిన్ రంజింతుఁ జేపట్టి నా
పై గాసిల్లక యీసడింపక క్షమింపన్ వేఁడుచుంటిం గడున్.

పిన్నలు పెద్ద లందఱును వేఁడితి నోకవులార మీ రికన్
నన్ను క్షమించి జాలిమెయి నాకొఱకున్ విడుఁ డొక్కబాష్పమున్
సన్నిహితార్యులార యిదె నాకృతులం గొనితెచ్చి పేర్చుఁడీ
మిన్నక నేఁడు నా చితిగ మీకుఁ గృతజ్ఞతఁ గేలుమోడ్చెదన్.

ఆశ్చర్యం బొనరింపవచ్చును మదీయాలాపముల్ మీ కిఁకం
బశ్చాత్తాపముఁ బొందితిన్ నిజముగాఁ బ్రార్థించుచున్నాను నా
దుశ్చారిత్రము సాహితీప్రియులు తోడ్తో విస్మరింపంగ నే
నిశ్చింతన్ మరణింతు నట్లయిన శాంతిం బొందు నా యాత్మయున్.

చేయకుఁ డాప్తులార స్మృతిచిహ్నజయంతిమహోత్సవాదులన్
నా యెడ స్నేహ మోహముల నా చనిపోయిన వెన్క వేఁడుకొం
దీ యపరాద్ధజీవితము నింతటితో దయసేసి యొలిమిన్
మాయఁగ నింక మీకు నభిమానమె యుండిన సుంత నా పయిన్.

నాకుం గ్రమ్మఱ నిమ్మహిన్ మనుజజన్మంబుం బ్రసాదించి యో
లోకాధీశ త్వదీయ పాదసుమనో లోలాత్మరోలంబమై
నీ కల్యాణ కథాసుధామధువులన్ నేఁ గ్రోలి పాడంగ సు
శ్లోకప్రాభవ మొప్ప నన్ సుకవిగా సొంపారఁ గావింపవే.

అనవుఁడు సొమ్మసిల్లె నతఁ డాడక గ్రుడ్లు తేలగిల్లఁగన్
దినకరుఁ డస్తమించె నటఁ దీతువు కూయుచు నింటిమీఁదుగాఁ
జనె వికటమ్ముగా నఱచె జంబుకముల్ పొరి నల్లకాటరో
దనములు సల్పి రాప్తులు పదంపడి జీవము వీడెఁ గాయమున్.

అడఁగెను గాలగర్భమున నాతఁడు నాతని యొల్లకబ్బముల్
తడవఁగ మంచికావ్యములు తప్పక యెప్పటికిన్ నలిన్ నిలం
బడెడుఁ దదాశ్రయంబు గొని మానుగ నా కృతికర్తలున్ స్థిరం
బడెదరు ధారుణీస్థలిని భాస్వరశాశ్వతకీర్తిమూర్తులై.

# శ్రీనాథుని స్వస్థానాదికము లు

శ్రీ వేటుమళ్ల కామేశ్వరరావు

శ్రీనాథమహాకవి జన్మస్థల మేది? ఆత డాంధ్రుడా, కాడా; మత సాంప్రదాయ మెట్టిది? ఇత్యాది సమస్య లెన్నియో యున్నవి. ఆ మహాకవి యెందఱిచరిత్రలనో వ్రాసినాడు. తన కావ్యములలోఁ గృతి పతులను గుఱించి యొక్కొక్కప్పు డొక యాశ్వాసమంతగ్రంథమునుఁ గూడ సంతరించినా డని చెప్పవచ్చును. కృతిపతివంశాభివర్ణనము నతి దీర్ఘముగా వ్రాయుపద్ధతి నితఁ డే ప్రవేశపెట్టినాడు. అతఁ డెన్నియో దానశాసనములను లిఖించినాడు. కాని తన విషయమునుఁ జేర్చుకొన లేదు. తాను వ్రాసిన పుస్తకములలోఁ దానుపూర్తి చేసిన కాలము నైనఁ జెప్పలేదు. ఇంత యెందుకు! అతని యింటిపే రేదియో మనకు దెలియదు.

మనకవు లే పోలేగమ్మమీఁదనో, యే పోతురాజుమీఁదనో శతక ములను సృష్టించెడి శ్రద్ధయె గాని మన మహాకవులను గుఱించి వ్రాసి మన కృతజ్ఞతనుఁ జూఁగొన్నవారు కారు. ఇట్టి లక్షణములవల్ల శ్రీనాథునిగుఱించి పెక్కుసమస్య లేర్పడినవి.

ఈ సమస్యల పరిష్కారణమునకు ముందుగా నతని వంశచరి త్రను సంగ్రహముగాఁ దెలుసుకొనవలసియున్నది.

## వంశ చరిత్ర

రెడ్డిరాజ్యముకంటె పూర్వ మున్నది కాకతీయసామ్రాజ్యము. రెడ్డిరాజు లాదిని కాకతీయచక్రవర్తులవద్ద నుద్యోగస్థులుగా నుండినారు. వేమారెడ్డి యను నాతఁ డీ రెడ్లవంశమునకుఁ గర్త. అతఁడు కాకతీయ రుద్రమదేవి (1260 – 1296 ) వద్ద నొక సైన్యాధిపతి. అతని కుమారుఁడు ప్రోలయ యనువాఁడు ప్రతాపరుద్రునివద్ద నుద్యోగిగా నుండి బిరుదులను సాధించె ననిఁ చెప్పవచ్చును. అతనికొడుకు వేముడు. ఇతఁడె రెడ్డి రాజ్యమును 1326 ప్రాంతములో స్థాపించెను.

అతని మొదటిరాజధాని యద్దంకి. పిమ్మట కొండవీటికి మార్చ బడినది. శ్రీనాథు డాశ్రయించిన రెడ్డిరాజులు పై విధముగా కాకతీయు లకు సేవ చేసిరి.

శ్రీనాథుని తాత మైలకమలనాభుడు కాకతీయసార్వభౌముని వద్ద నుద్యోగిగా నుండెను. ఆ విషయమును శ్రీనాథుడే యిట్లు తెలియజేసినాడు.

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణ సంగ్రహకథాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు మా
యనుగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్.
(భీమ ఆ 1 ప 10)

అట్లు కమలనాభుడు మహాకవి యనిఁ దెలియుచున్నది. కాని యతని గ్రంథమొక్కటియు లభింపలేదు.

కమలనాభుఁడు కాకతిసార్వభౌము డైన వీరప్రతాపరుద్రునివద్ద పెద్దయుద్యోగి. అమాత్యచూడామణిగా నా మహారాజువద్ద నుండెనా? దానిని విశదము చేయు శాసన మేదియు లభించలేదు. అతఁడు ప్రారంభ మందు 'కాల్పట్టణాధీశ్వరుఁడు'. అనగా గ్రామ కరణము మాత్రమే. గ్రామకరణములను పురశాసను లని మనకవులు వర్ణించి యున్నారు కదా! అట్టి కరణీకమె శ్రీనాథుని తాతది కూడ. అతని స్వస్థలము సముద్రతీర మందలి కాల్పట్టణము.

శ్రీనాథునితాత కాకతీయులవద్ద పెద్దయుద్యోగి యనిఁ దెలుసు కొంటిమి. ఇట్లే మఱియొక కుటుంబమును గుఱించిగూడ శ్రీనాథ మహాకవి వర్ణించినాడు. అదియే బెండపూడి కుటుంబము. ఆ మహాకవి భీమేశ్వరపురాణములో బెండపూడి అన్నయమంత్రి తాత యైన అన్నయ మంత్రిని గుఱించి—

కాకతిక్ష్మాపాలగంధ దంతా వళీ
ధ్వజినీ మహాధురంధరుడు

అని వర్ణించినాడు.

ఈవిధముగా రెడ్లు, కమలనాభామాత్యుడు, బెండపూడికుటుంబము కాకతీయుల సేవ జేసిరి.

## శ్రీనాథుని యాంధ్రత్వము

ప్రథమములో శ్రీనాథుఁ డాంధ్రుడా? కర్ణాటకుడా? యను చర్చ యుండెడిది. అట్టి సందేహము గలుగుటకు కారణము శ్రీనాథుడు చెప్పుకొన్న యీ క్రింది చరణములే—

తే. గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు
పలుకునుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వ రేమన్న నండ్రుగా కేల కొఱత
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష (భీమ 1 ఆ ప 15)

కర్ణాటక మనుమాటయొక్క చిత్రచరిత్ర తెలిసిననే కాని యామాటయొక్క నిజమైనయర్థము పొడగట్టదు. కర్ణాట మనుమాట తెలుగుదేశములో బుట్టి, కన్నడదేశమునకుఁ బోయి, కడపటికి తమిళ భాషకుగూడ నదియె పేరై, యింకను వింతమార్పులనుఁ బొంది, సంగీతమునకుఁగూడ నామమైనది. ఈక్రింది యుటంకింపునందు దాని సాహస చరిత్రనుఁ గొంత గమనించవచ్చు. దాని "కర్ణరాజులు శ్రీశైలప్రాంతములోఁ బరిపాలించగా నది కర్ణనా డయినది. ఆ మాటయొక్క రూపాంతరములుకన్న, కర్ణవారి రాజ్యము రెండుసముద్రముల మధ్య స్థలము నాక్రమించుకొన్నది. అందులో నున్న తెలుగు, కన్నడభాషలను మాట్లాడుస్థలములకుఁ గర్ణాటకరాజ్య మనుపే రేర్పడెను. నెల్లూరుజిల్లాలోని యుదయగిరి కర్ణాటకదేశమునకు నడిబొడ్డని చెప్పబడినది. రావిపాటి త్రిపురాంతకుఁ డంటిమిట్ట రఘువీరదేవుని 'కర్ణాట

కాధీశా!' యని సంబోధించినాడు. శ్రీనాథమహాకవి తా నెన్నఁడును కన్నడభాషలో రచించక పోయినను తనది కర్ణాటకభాష యని పేర్కొన్నాఁడు. అట్లే యొక తెలుగుకవి (క్రీ. శ. 1630) తిరుపతి దేవునిఁగూడ కన్నడభాషలో స్తుతించుచున్నా నని పలికి తెలుగుభాషలోస్తుతించెను. ఇంతటితో శబ్దసంచార మాఁగలేదు. కర్ణాటకసామ్రాజ్యము నాశనమైన పిమ్మట నుదయగిరినుండి కొలరూన్ వఱకు నున్నప్రదేశము కర్ణాటక రాజ్యమై తమిళదేశమునుఁగూడ కర్ణాటకదేశ మని పేర్కొన్నది. అసలు కన్నడదేశమును విడిచిపెట్టినను, నిప్పటికిఁగూడ వ్యాప్తిలో నున్నది.''

సంగీతమునకు కర్ణాటకసంగీత మనిపేరు కదా! మన తూర్పు సముద్రతీరమునకుఁ గర్ణాటకతీర మనిపేరు. ఇట్టిసందర్భములలో కర్ణాటకపదమునుఁ బట్టుకొని యూగులాడుటవల్ల నేమిప్రయోజనము? అయితే యీ పదమును శ్రీనాథు డేలవాడె ననుప్రశ్న పుట్టకమానదు.

అతఁడు తన్ను వెక్కిరించుచున్న యితరకవులనోరు మూయుట కా పదమును చమత్కారముగా వాడెను. అంతియెగాక తాను మొన్నటివఱకు విద్యాధికారిగా నుండిన కోమటివేమారెడ్డిరాజ్యము, వరదవలె వ్యాపించుచున్న కర్ణాటకసామ్రాజ్యములో చేరిపోయినది. ఇంక నచ్చటిభాష పే రేమయినట్లు? కాబట్టి యతనిపలుకులను సులువుగా నెవ్విధముననైన సమర్థించవచ్చును. నూటికి నూరుపాళ్లు తెలుగు కవిత్వము చెప్పిన వానిభాష మఱియొకటి కాజాల దని స్థిర మగుచున్నది.

## శ్రీనాథుడు పాకనాటివాడా?

శ్రీనాథమహాకవి పాకనాటిసీమవా డనునభిప్రాయము ప్రబలముగా నున్నది. అది యెంతమాత్రము కా దని విశ్వసించువారుకూడ

1. నేఁటూరి వెంకటరమణయ్యగారి కర్ణాటఅనువ్యాసము - ఆంధ్ర చారిత్రక పరిశోధకసంస్థయొక్క ఆంగ్లపత్రిక. సం 10 పుట 97-99

చేయునది లేక ఊఁకొట్టుచున్నారు. ఇట్టిసందర్భములో దానిని గూర్చి చర్చ చేయవలసి యున్నది.

ఆ మహాకవి పాకనాటిసీమవా డని వాదించుటకు తగినంత కారణము లేకపోలేదు. భీమేశ్వరపురాణములో శ్రీనాథు నుద్దేశించి కృతిపతి యైన యన్నయమంత్రి—

తే. గీ. పాకనాటింటివాడవు, బాంధవుడవు,
కమలనాభుని మనుమడ, వమలమతివి...

(భీమ. ఆ 1 ప 23)

అని సంబోధించినాడు. అందువలన నామహాకవి పాకనాటిసీమవాడనియు, నది యతని యింటిపే రనియు, వాదించుటకు నవకాశ మేర్పడినది. అతఁడు వాడిన మాటలయొక్క ముఖ్యార్థ మెరిగినచో విపరీతార్థములు పుట్టవు కదా!

శ్రీనాథు డేమాట నుపయోగించినను బహుళార్థవంతముగాఁ జేయును. పడికట్టుగా పదమును దొర్లింపవలసినగతి యతనికి లేదు. అతని పాండిత్యము నాటికి నేటికి నే తెలుగుకవికిని లేదు. అతని బావమఱిది యైన దగ్గుబల్లి దుగ్గన తన నాచికేతోపాఖ్యానములో నావిషయమై కొంచెముగా స్పృశించినా డనువిషయమును పండితు లెరుగుదురు. శ్రీనాథమహాకవి యెన్నియో భాషలను నేర్చుకొన్నాడు. ఏన్నియో శాస్త్రములను శోధించినాడు. అట్టివాఁడు పాకనాటింటిపదబంధము నర్థములేకుండ నుపయోగించునా! ఈపదబంధములోని 'ఇల్లు' శబ్దమును పరిశీలించెదము. ప్రాచీనవిధానముల కలవాటు పడినపండితులామాటకు నిచ్చెడి వ్యుత్పత్తిని గమనించుడు—

| 2 అరవము | తెలుగు | సంస్కృతము |
|---|---|---|
| ఇల్ | ఇల్లు | ఇలా |

'ఇలా' యను పదమునకు 'సీమ, భూమి' యనియర్థము. కాబట్టి 'ఇల్లు'

2. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. 22 సంచిక 34 పుట 130.

అను తెనుగుమాటకు కూడ నదియె యర్థము కదా! అందుచేత 'పాక నాటింటివాడ' వనగా 'పాకనాటిసీమవాడ' వని భావము. కాబట్టి యాపద మాతని యింటిపే రని చెప్పుటకు సాధ్యము కాదుకదా!

అదే పదబంధమును వాలేశ్వరు డనుకవి భళ్లాళచరిత్రములో వాడెను. ఆ కవి కృష్ణాజిల్లాలోని చిన్నకోటకాపురస్థుడు. అతడు తన్ను గుఱించి [3]"పాకనాటింటివాడ" నని చెప్పుకొన్నాడు. ఆపదబంధము యొక్క భావము తాను పాకనాటిసీమనుండి వచ్చినవాడ నని మాత్ర మె యైయున్నదని రుజు వగుచున్నది.

అయితే శ్రీనాథుడు పాకనాటిసీమవాడా? యనుప్రశ్న నింకను చర్చించవలసియే యున్నది.

శ్రీనాథుడు రాజమహేంద్రవరమునకు విచ్చేసి బెండపూడి యన్నయమంత్రి నాశ్రయించినాడు. వారికుటుంబములకు తాతలకాలము నుండియు సంబంధము గల దని తెలిసికొంటిమి కదా. బహుకాలము నుండియు నెఱిగిన వా డగుటచేతనె యన్నయమంత్రి చనువుతో 'కమలనాభుని మనుమడ వమలమతివి' యని పలికినాడు. అంతియె కాక యన్నయమంత్రి వెనుకటి నుండియు పరిచయస్థుడు.

అన్నయమంత్రినిఁ 'బెండపూడన్న జగనొబ్బగండ బిరుద!' యని శ్రీనాథుడు భీమపురాణములో ప్రశంసించినాడు. 'జగనొబ్బ గండ' బిరుదు కొండవీటి రెడ్లది. అన్నయమంత్రి కొండవీటిరెడ్లకు సేవ చేసి, యాబిరుదును సంపాదించియున్నా డని చెప్పవచ్చును. కొండవీటిలో నుద్యోగము చేసినవాడు శ్రీనాథుడు. కాబట్టి వా రిద్దరును కొండ వీటిలో నున్నకాలమునుండియు బాగుగా నెరిగియున్నవారు. కావుననే యన్నయమంత్రి వెనుకటి పరిచయములను తిరుగవేయుచు పాకనాటింటి (-సీమ) వాడ నని పేర్కొనెను. కనుక పాకనాటింటి శబ్దములో

3. ట్రయన్నియల్ కాటలాగ్ సం 3 భాగము 3 పుట 1096.

శ్రీనాథునియొక్క యింటిపే రని కాని, శ్రీనాథునియొక్క జన్మసీమ యనిగాని యర్థములు లేవు. ఆ విషయము ముస్ముందు నింకను విశదము కాఁగలదు.

శ్రీనాథుని స్వస్థల మేది ?

అతఁడు తనకుటుంబముయొక్క స్వస్థలమునుగూర్చి చెప్పినది యొక్క-చోటున మాత్రమె ? అది యే దన-

'కనకక్ష్మాధరధీరు వారిధితటీకల్పట్టనాధీశ్వరున్' అను చరణములో నతని కుటుంబము సముద్రతీరమున నున్న కాల్పట్టణము నందుండిన దని తెలియుచున్నది. అతఁడు ప్రయోగించిన మఱియొక పద్యమునుండి పై సమాచారము బలపడుచున్నది. భీమేశ్వరపురాణములో ధ్వనిగా నిట్లు చెప్పుకొన్నాఁడు-

తే. గీ. నికటముననుండి శ్రుతిపుటనిష్ఠురముగ
నడరి కాకులు చిట్టు పె ద్దఱచినప్పు,
[4]డుదధిరాయంచ యూరకయుంట లెస్స
పై పరాకున్న నెందేని జనుట యొప్పు.

(భీమ. ఆ 1 ప 14)

అట్లాతని జన్మస్థలము సముద్రతీరమున నున్న కాల్పట్టణమె యని ధ్రువపడుచున్నది. అయితే నాతఁడు చెప్పిన కాల్పట్టణ మేది ?

ఆ పేరుగలపట్టణ మిప్పు డేదియును తూర్పుసముద్రతీరమున లేదు. కాబట్టి విమర్శకు లనేకపట్టణముల నా పేరుతో ముడిపెట్టుచున్నారు – కాళీపట్టణము, కలపటము, కృష్ణపట్టణము, క్రొత్తపట్టణము, కాల్ స్థానకోట మున్నగునవి.

---

4. ఉడిగి రాయంచ అను మఱియొక పాఠమున్నది. ఉడిగి అను శబ్దమునకుగల అర్థమె ఊరకయుంట అనుపదబంధమునకుఁగూడ. కాబట్టి నీరసమైన ఈపాఠమును లెక్క చేయనవసరము లేదు.

శ్రీనాథుడు పాకనాటిసీమలో జన్మింపలేదను విషయము రుజువైనయెడల కృష్ణపట్టణము క్రొత్తపట్టణము, కాల్ స్థానకోటలను గుఱించి చర్చయే యనవసరము కదా! పడమటిగోదావరిజిల్లాలో నున్న కలపటగ్రామము శిథిలమైపోయినది. పైగా కలపటమునకు రూపాంతరము కాల్పట్టణము కాలేదని కొందఱు విమర్శించుచున్నారు.

తూర్పుగోదావరిజిల్లాలోని 5కాళీపట్టణమె కాల్పట్టణము కావచ్చు నను బలమైనవాద మున్నది. కాని దానికిని 6నభ్యంతరము లేకపోలేదు. వేఱేదియు సరిపడక పోయినప్పుడు దీనినిగుఱించి విచారింపవచ్చును.

శ్రీనాథమహాకవియొక్క కవిత్వమును లోతుగాఁ బరిశీలించినవా రాతఁడు గోదావరిజిల్లాప్రాంతపువాఁడని పలుకుచున్నారు. చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు7 "శ్రీనాథుని రచనలలో గానవచ్చెడి వాక్యవిన్యాసపద్ధతిని, మాండలికపదముల కూర్పును బరికించి, యతను భీమమండలిలోఁ బుట్టి పెరిగినవానిగనె భావించుట భావ్యమని నా మనవి" యన్నారు. ఏకవినైనను నతఁడుపయోగించిన మాండలికములనుబట్టి యతని స్వస్థలమును సుమారుగా నిర్ణయింపవచ్చును. అట్లైన శ్రీనాథునిశబ్దజాలమును గుర్తించినచో నాతఁడు గోదావరిజిల్లా వాఁడని తేలుచున్నది.

---

5. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం 51 సంచి 3-4. అంతియెగాక వేటూరి ప్రభాకరశాస్త్రి గారి వాదనకూడ నట్లెయున్నది.

6. కాళీపట్టణ మనుశబ్దమును కాల్పట్టణముగా స్త్రీవాచకములో నీకారమును లోపముచేసి శ్రీనాథమహాకవి ఛందోనియమముకొఱకు ప్రయోగించునా యను విషయమును పండితలోకము నిర్ణయింపవలెను. అట్లు ప్రయోగింపబడనేర దని నా దృఢమైన నమ్మకము"—ఠేకుమళ్ళ అచ్యుతరావుగారి విజయనగరరాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయచరిత్రము, మొదటిభాగము, పుట 24 లోని అథోజ్ఞాపిక.

7. ఆ. సా. ప. ప. సం 52-53 సంచికలు 5-6, పుట 67

జన్మస్థలమందలి యభిమానమును బట్టి శ్రీనాథుడు భీమేశ్వర పురాణమును తెనిగించినా డనవచ్చును. అతనికి నాప్రాంతమందలి భౌగోళికవిషయములు సూక్ష్మముగాఁ దెలియును. అది యట్లుండగా శ్రీనాథుని తల్లి పేరు భీమాంబిక. అది భీమేశ్వరస్వామి పేరు కదా. ఆమె భీమమండలిప్రాంతమది కాబట్టి యాపేరు వచ్చినది.

శ్రీనాథునిది భీమమండలి యైనచో నాప్రాంతమున నతని స్వగ్రామముగా నుండఁదగినది యేది? పురాతనకాలమునుండియు భీమమండలిలోని వగు దక్షారామ పిఠాపురప్రాంతములు ప్రసిద్ధి వహించినవి. ఆంధ్రచక్రవర్తి హాలునికాలములో దక్షారామచరిత్ర పేరుపొందినది. పిఠాపురమె బౌద్ధజాతకములోని పిట్టపుర మనియు, నచ్చటికుక్కుటేశ్వర స్వామి సందర్భముగా పిట్టపురము పిఠాపుర మైనదనియు కొందఱుపపాదించుచున్నారు. ఆప్రాంతమందలి సముద్రతీర మంతయు ప్రసిద్ధి గాంచినది. తీరమున చొల్లంగి, ఉప్పాడ, కోరంగి, నీలపల్లి, ఇంజరము మొదలైన రేవుస్థలము లున్నవి. పిఠాపురప్రాంతము క్రీ. శ. 210 లో శాతవాహనపాలకులక్రింద నుండినదని[8] కొడవలిశాసనము చెప్పుచున్నది. ఏడవశతాబ్దములో కోరంగి[9] కళింగదేశమున ప్రసిద్ధమైన రేవు. ఆత్రేయినది యనుపేరు గలగోదావరిపాయ సముద్రమున గలియు చోటున కోరంగి యున్నది. దానిప్రక్కనె నీలపల్లి యను మఱియొకరేవున్నది. నీలంపల్లి యన్నను, నీలపల్లి యన్న నిదియె. ఇది పిమ్మట కాలమున కోరంగికంటెను ప్రసిద్ధిని పొందినది. పదునెనిమిదవ శతాబ్దములో[10] నాంగ్లేయుల ముఖ్యవ్యాపారరేవులలో నిది యొకటి. 1870 ప్రాంతములో నుండిన ఓగిరాల జగన్నాథకవి''[11] యీగ్రామవాసి.

---

8. ఆ. సా. ప. ప. సం 52-53 సంచికలు 5, 6, 1, 2 పుట 67
9. చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రులచరిత్ర మొదటి సంపుటము, పుట 24
10. ఆ. చా. ప. సంస్థ పత్రిక, జూలై 1932, పుట 43
11. కం. వీరేశలింగకృతాంధ్రకవుల చరిత్ర పుట 608

శ్రీనాథునికి తెలుగుభాషమీద నెంతప్రేమయో సంస్కృతము మీద కూడ నంతె. మనకవులు స్థలముల పేళ్ళ కొండల గ్రామముల పేళ్ళను[12] సంస్కృతభాషలోని కనువదించుకొన్నారు. కొందఱు తమ పేళ్ళను సంస్కృతములోనికి తర్జుమా చేసుకొన్నారు కూడ. గాలి నరసయ్యగారు ప్రభంజనము, అహోబలస్వామిగా రయినా డట! చింతలపూడి ఎల్లన్న మహాకవి తన పేరు బాగులే దని[13] అనంతయ్యయైనాడు. శాసనములలో కొండపేటికి సంస్కృతనామము శైలపురము.

కొంతవఱకు నీ కోవకుచెందినవాడె శ్రీనాథమహాకవి కూడ. క్రీడాభిరామములో వినుకొండ శ్రుతపర్వత మైనది. కాశీఖండములో చిలుకసరస్సు కీరాంభోనిధి యైనది. అట్టివాఁడు తన స్వస్థలమునకు మఱియొక పేరు పెట్ట డనగలమా! అతని స్వగ్రామము నీలపల్లి (నీలంపల్లి) అది రేవుస్థలము. దానికి భాషాంతరీకరణము కాలపట్టణము లేక కాల్పట్టణము. ఇది భీమమండలిలోని స్థలమె. పల్లికి పట్టణము భాషాంతరీకరణ మగునా యని సందేహపడ నలదు. పట్టణ మనగా సముద్రపురేవని సంస్కృతభూగోళికశాస్త్రపరిభాష. కాబట్టి కాల్పట్టణ మని చెప్పబడుటలో విచిత్రమేమియు లేదు.

కమలనాభయ్య నీలపల్లికరణము (కాల్పట్టణాధీశ్వరుడు). అట్టి సందర్భములలో శ్రీనాథుఁడు భీమమండలములోని ప్రత్యంగుళము మేర నెఱిగియుండుటలో వింత లేదు.

---

12. సంస్కృతభాషలోనికి భాషాంతరీకరింపబడిన కొన్ని పదముల జాబితాను కుంమారి ఈశ్వరదత్తుగారు చేర్చినారు. పిష్టపురము=పీఠికాపురము; డాకిరేమి=ద్రాక్షారామ; బెజవాడ=విజయవాడ; ఓరుగల్లు=ఏకశిలానగరము; కంమకూరు=స్కందపురము; నిరమానూరు=నైరామనము; కర్నూలు=కందనవోలు; పెనుగొండ=ఘనశైలము; ఆర్వేలనాడు=షట్సహస్రప్రదేశము; సలికి-చాళుక్య; రొంపిచెఱువు=పంకతటాకము; మాల్ ఖాడ్=మాన్యఖేటము (రెడ్డిసంచిక, పుట 101)

13. వెంకటేశ్వర విశ్వవిద్యాలయ విద్యార్థుల ఉపన్యాస సం 1 వంచికలో నేను వ్రాసిన వ్యాసమును చూడండి.

నీలపల్లికి కొంతదగ్గరలోనె బెండపూడిగ్రామ మున్నది. అందు కోట గలదు. బెండపూడి యన్నయ్యస్వగ్రామ మాయూరె. కాబట్టి శ్రీనాథుని, నన్నయ్య కుటుంబములు పూర్వమునుండియు పరిచయస్థులుగా నున్నా రని గ్రహింపవచ్చును. పిమ్మట వారు కాకతీయుల ప్రభుత్వములో చేరినారు. ఆ పరిచయము ముదిరినది.

శ్రీనాథుని కర్ణశతాబ్దము పిమ్మటివాడైన చింతలపూడి ఎల్లన్న (1480 – 1550) 'మా శ్రీనాథున్ కవితాసనాథున్' అని పేర్కొన్నాడు. అతడు భీమమండలిప్రాంతపు వా డని కొందఱు విమర్శకుల భావము.

శ్రీనాథుని యింటిపేరు మనకుఁ దెలియదు. స్వగ్రామములె యింటిపేరుగా నున్నవా రెందఱో యున్నారు కదా! ఇతని యింటిపేరు నీలంపల్లి వారా? ఆ ఇంటిపేరు గల నియోగు లమలాపురము తాలూకాలో నివ్వుడున్నారు.

శ్రీనాథమహాకవి వైదికియా? నియోగియా? ఆ కాలములో నియోగి యనగా వృత్తి గలవా డని మాత్రమె యర్థము. ఆతఁడు ప్రభుత్వాధికారి లేక సేవకుడు కూడ కావచ్చు. రాజ్యములో డెబ్బది రెండు నియోగముల వా రుండెడివారు. వారిలో గణక, లేఖక, పౌరాణిక, పురోహిత, జ్యోతిష్కాద్యా దు లున్నారు. ఇంక నియోగు లెవరు, వైదికు లెవరు? ఆవిభేదములు తరువాతకాలములో సంఘములో పుట్టిన దుర్మాంసములు. కాని యీ మహాకవియొక్క యుద్యోగాది విషయములను బరిశీలింపవచ్చును.

శ్రీనాథుడు విద్యాధికారి లేక విద్యాపరీక్షకునిగా నుండినాడు. ఆతఁడు వ్రాసిన శాసనపాఠములలో 'విద్యాధికారీ శ్రీనాథో' యని లిఖించుకొన్నాడు. దీనికి కావలసిన యర్హతలు సామాన్యమైనవి కావు.

శ్రీనాథునికి నించు మించుగా సమకాలికుడైన కొఱవిగోప రాజకవి తాను వ్రాసిన సింహాసన ద్వాత్రింశిక యను ప్రబంధములో

పరీక్షాధికారియగ్నాతలను వర్ణించుటయె కాక చిన్నకథనుకూడ యల్లి నాడు—

క. ధర గల పురాణముల, వ్యా
కరణంబుల, శాస్త్రముల, నిగమములఁ గవితం
బరిణతుఁడ మాళవేంద్రుని
పురోహితుఁడ, జన్మసంజ్ఞఁ బురుహూతుండన్.

గీ. అధిపు కొలువునఁ బరీక్షాధికారి
నగుటఁ జేసియు, నొక విప్రుఁ దెగడి పుచ్చి,
యట్టికీడున నిర్జనం బైన యడవిఁ
జచ్చిగతి లేక బ్రహ్మరాక్షసుడ నైతి.

(సింహా. ద్వా. ఛా. ఆ 6 ప 43, 44)

కాబట్టి పరీక్షాధికారి పండితుడే కాక పురోహితుడై యుండవలెను. అట్టియెడ నాతఁడు వైదికియా? నియోగియా? శ్రీనాథునికి సమకాలికు డని చెప్పదగిన కొఱవి గోపరాజు శ్రీనాథునిచేత దెబ్బతిని యా కథను తనపుస్తకములోని కెక్కించినట్లుగాఁ గనఁబడుచున్నది.

ఆ కాలములోఁ బురోహితులు తమపేరుచివరను విధిగా భట్టు శబ్దమునుధరించుచుండిరి. ఆవిషయ మేకామ్రనాథుని ప్రతాపచరిత్రనుఁ జూచినచోఁ దెలియును. శ్రీనాథుఁడు తన్ను గుఱించి శ్రీనాథభట్టు నని చెప్పుకొన్నాడు. కాబట్టి యాతఁడు పురోహితవంశములోనివాఁ డని చెప్పవచ్చును. అతఁ డాఱువేలవాఁడు మాత్రము కాఁ డని కొఱవి గోపరాజుయొక్క కవిస్తుతిని జూచినఁ దెలియును.

చ. అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి పెద్దిరా
జును చినవీరరాజుఁ గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజు సో
మన నమరేశ్వరుం దలతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.

పురోహితు లని కాబోలు నీ జాబితానుండి నన్నయభట్టు శ్రీనాథ భట్టులు తొలగింపబడినారు. ఆఱువేలశబ్దమును బరిశీలింపగా నిట్లుం గనబడుచున్నది. అది సంఖ్యావాచకముగాక ప్రదేశనామముమాత్రమె. ఇప్పటి 'ఏఱు' శబ్దముయొక్క తొలిరూపము 'ఆఱు'. ఇది యిప్పటికి నరవములో వాడుకలో నున్నది. ఆఱువేలనాటిలోని వేలశబ్దమునకు సముద్రప్రాంత మని యర్థము. కాబట్టి నది, సముద్రతీరము చేరిన స్థల మాఱువేలనాడు. ఇది కృష్ణాముఖద్వారమునకు దక్షిణభూమియై వేల నాటిలోని భాగము కావచ్చును. అట్లది స్థలనామమె గాని మఱియొకటి కాదు. దాని తరువాతిపరిణామము వేరుగా నుండవచ్చును. అది వేరు కథ. కాబట్టి శ్రీనాథు డాఱువేలనాటివాడు కాడు, పాకనాటివాడు కాడు.

భీమమండలిలోని వారోరుగంటిలో నె ట్లుద్యోగములను సాధించి రనుసందేహము కలుగవచ్చును. కాని యాకాలములో భీమ మండలిలోని వారోరుగంటిని చేరుట చాల సులువు. ఈ కాలమందు రైలుప్రయాణమెట్టిదో, యాకాలమం దోడ పడవప్రయాణము లట్టివి. గోదావరిలో పడవ యెక్కినచో నోరుగంటికి పదియామడల దూర ములో నున్న మంథనను జేరుదురు. పిమ్మట నక్కడకూడ నేళ్లు గలవు. వాటిమీాద నోరుగంటికి బోవచ్చును. నాటుప్రయాణము బహుస్వల్ప ముగా నుండును.

ఏటిలో సులభముగా ప్రయాణము చేసి చేరుకొనుటకు వీలుగా పట్టణాదులు నదులతీరమున వెలసినవి. నదిమీాదవలెనె సముద్రము మీాద సబురుచేసి సముద్రతీరపట్టణములను చేరుకొనెడివారు. కాబట్టి యెన్నియో రేవుపట్టణములు సముద్రతీరమున పుట్టినవి. వానిలో కొన్నియాళ్లు రైలు పుట్టినపిమ్మట నాశనము లైనవి.

శ్రీనాథుని నామము శైవనామము కాదా ? శ్రీపర్వతము, శ్రీగిరి యనునవి మల్లికార్జునుని శ్రీశైలమును తెలుపును. శ్రీపతి

యనిన మల్లికార్జునుడు కదా! శ్రీపతియె శ్రీనాథుడు. అది శైవ నామముగాక మరేమగును! పిమ్మటి కాలములో కొన్నిటి యర్థములు కొంతవఱకు మారినవి. అది వేరు విషయము. కమలనాభునిపేరు వైష్ణవము. శ్రీనాథుని పేరు శైవము. ఇది యద్వైతలక్షణమును సూచించుచున్నది. శ్రీనాథునికి శైవమునం దభిమానము మిక్కుటముకదా. అట్టి పాక్షికాభిమాన మద్వైతమందె కలదు. శైవము వైదికమతముకంటె ప్రాచీనమైనది.

## ఆనాటి మత సంప్రదాయములు

ఆనాటి మతసంప్రదాయములనుఁ జర్చించుటకు ముందుగా నొక రిద్దఱు మహాకవులచరిత్రలను సంగ్రహముగాఁ దెలుసుకొన వలసి యున్నది.

కాకతీయులనాటి చరిత్ర నేకామ్రనాథుఁ డను నాతఁడు ప్రతాప చరిత్ర యను పేరిడి యొకవచనకావ్యమును సంగ్రహముగా వ్రాసెను. పుస్తకము చిన్నదైనను ప్రయోజనము పెద్దది.

శివతత్త్వసార మను నాంధ్రపద్యస్తవగ్రంథమును వ్రాసిన పండిత మల్లికార్జునారాధ్యుని కాలమును గనుగొనుటకు చారిత్రకాధారము లున్నవి. కావున నాతనికాలము 1120–1190 మధ్య నని స్థూలముగా నిర్ణయింపబడినది. ఆకాలమందు రాజ్యమునుఁ బాలించుచున్న గణపతిదేవచక్రవర్తికి మల్లికార్జునపండితుడు గురువుగా నుండె ననియు, రెండుగ్రామములను ఁబొందె ననియు ప్రతాపచరిత్రలో గలదు. గణపతి రాజ్యకాలము 1198 నుండి 1261 వఱకును. కాబట్టి మల్లికార్జున పండితు డాశతాబ్దము కడపటివఱకు జీవించియున్నా డని చెప్పనొప్పును. అప్పటికి నాతని కాలము 1130 నుండి 1200 వఱకు నని సుమారుగా నిర్ణయింపవచ్చును. అతఁడు గ్రహించిన రెండుగ్రామముల తాలూకు శాసనములు నేటివఱకు బైటపడలేదు.

మల్లికార్జున పండితునికి పిమ్మటవచ్చిన యొక మహాకవి పాలకురికి సోమనాథుడు.

ప్రతాపచరిత్ర[14] కర్తయైన యేకామ్రనాథుఁ డాతని శిష్యుడనని, తన గ్రంథములోనె వెల్లడించుకొన్నాడు. ఆశిష్యుడు వ్రాసిన వ్రాతలలో నద్భుతాలను దిగవిడిచిన నమ్మదగిన యంశములు పెక్కు గలవు.

పాలకురికి సోమనాథుఁడు రెండవప్రతాపరుద్రుని కాలము (1296–1324) నాటివాఁ డనియు, మహమ్మదీయులు కాకతీయ సామ్రాజ్యముపై దాడివెడలెద రని గ్రహించినవాడై, దక్షిణముగా బోయి యుండె ననియు ప్రతాపచరిత్రలోఁ జెప్పబడినది. ఈ గ్రంథములో నాతని మరణవిషయము లేకుండుటచే నిది యంతకుమున్నె రచింపబడినదని తలపవచ్చును. సోమనాథమహాకవి 1280–1340 మధ్య జీవించి యుండవచ్చు నని విమర్శకులు[15] నిర్ణయించిరి. కావున యథావాక్కుల నన్నమారాధ్యుఁడు– సర్వేశ్వరశతకకర్త (1242 ప్రాంతం) పాల్కురికి సోమనాథునికి పూర్వపువాడె కాని వెనుకవాడు కాదు.

పింగళి ఎల్లకవి (1590–1620) తోభ్య చరిత్రను వ్రాసినాడు. అతఁడు కవిస్తుతిలో–

సీ. భక్తిమై రేణుకప్రమథోత్తము నుతించి,
మాయదేవాహ్వయు మహిమఁ బొగడి
చెలగి యథావాక్యముల నన్నమయగారి
భజియించి మ్రొక్కెడి పాలకురికి
సోమనగారి బ్రస్తుతి జేసి......

---

14. ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము చరిత్రాంశముల గని దీనిని విపుల వివరణతో నచ్చువేసినచో చరిత్రకును వాఙ్మయమునకును మిగుల మేలు.

15. పాల్కురికి సోమనాథుడు 1280-1340 ప్రాంతపువాడని యంగీకరించిన వారు చిలుకూరి నారాయణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, చాగంటి శేషయ్య, నేలటూరి వెంకటరమణయ్య, వేదము వెంకటకృష్ణశర్మ గార్లు, దాని నంగీకరించనివారు వేటూరి ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ్య, నిడదవోలు వెంకటరావుగార్లు.

యని వ్రాసినాడు. ఆ యిద్దఱు మహాకవుల కాలక్రమము నెఱిఁగియె యట్లు వ్రాసినా డని తోఁచుచున్నది. అన్నమయ్యకు యథావాక్కుల యనునింటిపేరు. అతని కాలమునుండి గాక, యంతకు ముందునుండియె యున్నట్లు భావింపవచ్చును.

శ్రీ శంకరాచార్యులవా రవతరించుటకుముందు మన దేశములో దేవతల యారాధనలోను, తత్త్వచింతనలోనుఁ గూడ విశేషలోపముగా నుండెడిది. ఆచార్యులవా రద్వైతమతమును స్థాపించి సాకార దేవతారాధనలో ముఖ్యముగా శివకేశవులలో నొకరికంటె నొక రెక్కువ యనుభావమును నిరసించిరి.

రామానుజాచార్యు లద్వైతమువల్ల దేవతారాధనలోని సమరసతను గ్రహింపక విశిష్టాద్వైతమును విష్ణు వొక్కఁడే దేవుఁడనుసిద్ధాంతములను బయటపెట్టెను. దాని దుష్ఫలితములు వెంటనె కనఁబడినది. శైవమతసంప్రదాయములో నొకభాగము వీరత్వమును దాల్చినది.

బండారు బసవన (1126-1168) వర్ణభేదములు లేనిశైవమును ప్రచారముచేసినాడు. అతని సిద్ధాంతముతోఁ దృప్తిచెందని పండిత మల్లికార్జునుడు (1130-1200) వర్ణభేదములు విడువని వీరశైవమును బోధించినాడు. దీనికి నారాధ్యమతము లేక వీరమహేశ్వర మని పేరు.

క. శివ! నిన్నును వేదములను,
శివభక్తుల బ్రాహ్మణులనుఁ జెడ నాడెడు పు
ణ్య విహీను డధోగతి బడి
యవిరళనరకాగ్నిబాధ లందు మహేశా!

(శివతత్త్వసారము 287 పద్యము)

అని శపించినాడు. అతఁడు స్థాపించిన మతమునకు లింగధారణము తప్పని సరి కాదు.

బసవన స్థాపించిన వీరశైవసంప్రదాయమునకు లింగాయతమాత మని పేరు. దీనిలో వర్ణవివక్షత లేక రెండే వర్గము లుండును. జంగములు లింగాయతులు. ఇది కన్నడదేశములో వ్యాపించినది.

తెలుగుదేశములో వర్ణభేదము లేని శైవమతము కాని, వీర శైవమతము కాని లేదు. ఇక్కడ జంగములు[16] శూద్రకులము మాత్రమె. లింగబలిజలు లింగమును ధరింతురు. బ్రాహ్మణులలో లింగమును ధరించినవారు లింగధారులు. లింగమును ధరించినవారు మిగత వర్ణములలోఁగూడ గలరు. పండితారాధ్యసంప్రదాయకు లైనవారారాధ్యులు. వీరికిని; లింగధారులకును శివపూజావిధానములో భేదము లున్నవి.

బసవన గాని, పండిత మల్లికార్జునుడు గాని, స్థాపించిన మత సంప్రదాయములు ద్వైతములు. వీనిలో శివుడు పశుపతి. మిగతవారు పశువులు.

దీనిలో విష్ణువు వీరశైవుఁడు మాత్రమె యని పాల్కురికి సోమనాథుడు తాను రచించిన చతుర్వేదసారములోఁ (పుట 87) జెప్పినాడు.

పాల్కురికి సోమనాథుడు శ్రీశైల మల్లికార్జునస్వామి భక్తుడు. అతఁడు శివభక్తుల చరిత్రలను వ్రాసిన మహాకవి, స్వచ్ఛమైన బ్రాహ్మణుడు. పిమ్మట నారాధ్యమతసంప్రదాయము ననుసరించినాడు. వెనుక నుదహరించిన గోజవి గోపరాజుయొక్క కవిస్తుతి పద్యములోఁ జేర్కొనబడిన సోమన యితఁడె యైనచో నాత డద్వైతిగా నుండినప్పుడు కొన్ని గ్రంథములను వ్రాసె ననిఁ జెప్పవలసివచ్చుచున్నది.

పాల్కురికి సోమనాథునికి పండిత మల్లికార్జునుని మీదకంటె బసవనిమీద నెక్కువగౌరవము. అతడు శివభక్తుడె కాని నందీశ్వరుడన్న ప్రత్యేకవిశ్వాసము. కావున నంది స్తోత్రముచేయుచు ప్రత్యేక

16. ఆంధ్రవాచస్పత్యము (గుంటూరు)

ముగా వృషాధిపశతకమును వ్రాసెను. దీనిలో బసవా! బసవా! బసవా! వృషాధిపా! యనునది మకుటము. దీనిలోని బసవశబ్దము బండారు బసవనది కాదని తెలుపుటకె వృషాధిపయను పదమును గూడ చేర్చెను. ఈశతకములో నందతిభక్తులతో బాటు మల్లికార్జునుని, బసవనను( గూడ స్తుతించెను. సోమనాథుని మఱియొకగ్రంథము చతుర్వేదసారము. దాని మకుటము 'బసవలింగ'. దానిలో బసవనకు, నందికి నభేదముగా పద్యములు లేకపోలేదు. బసవనయనగానె నంది యనియె సామాన్యమైన యర్థము. శంకరాచార్యులవారు శివునియొక్క యపరావతార మని మనము భావించవచ్చును. అంతమాత్రముచేత శివునకున్న పర్యాయపదము లన్నియు నాచార్యులవారికి చెల్లవు. అట్లె బసవన నందీశ్వరుని యవతార మని యాతనిభక్తులు భావింపవచ్చును. కాని నందియొక్క పర్యాయపదము లన్నియు నతనివి కావు.

సోమన యారాధ్యబ్రాహ్మణుడు క్షితిని ముప్పదిరెండు సీసపద్యంబులు సరసోక్తిగా( బాలకురికి సోమ

గీ. నాథుడననొప్పు నారాధ్యనవ్యమూర్తి
యఖిలవేదపురాణశాస్త్రాది విదుడు
వీరశైవ సభాయోగ్య విదితముగను
జెన్నమల్లేశు బ్రీతిగా( జెప్పెనిట్లు.

బసవనకు ముందున్న భక్తులను గూడ నాతడు స్తుతించెను. వారందఱును లింగాయతమతస్థులు కారు కదా! సోమనాథుని పూర్ణచరిత్ర కారునిగా గణించుట మేలు.

సోమన స్వతస్సిద్ధముగ స్మార్తబ్రాహ్మణుడు. అతడు తొలుత వ్రాసిన[17] భక్తస్తవములో బండారు బసవనప్రశంస లేదు. దానికి పూర్వము వ్రాసినగ్రంథావళిని గుఱించి మనకు దెలియదు. కాని యారాధ్యుడైన పిమ్మట బసవనగోత్రుడ, భృంగిరిటి గోత్రుడ నని

17. ఆ. సా. ప. ప. సం 21 సంచిక 3 పుట 108

చెప్పుకొన్నాడు. అతని తొలిగోత్రము బైటపడలేదు. పరిశోధన యవసరము.

సోమనాథుఁడు నిట్టి మతసంబంధము లగుపల్లటీలనుఁ గొట్టగా 'పతితు' డని పేర్కొనబడినాఁడు. ఏ దయిన నాత డారాధ్యుడే కాని మఱియొకడు కాడు.

రెండవప్రతాపరుద్రునినాటి కులములు ప్రతాపచరిత్రలోఁ జేర్కొనబడినవి. బ్రాహ్మణులతో బాటుగ నష్టాదశవర్ణములు వివరింప బడినవి. వానిలో శివవిప్రులు మహేశ్వరులు నున్నారు. బలిజలు మాత్రము చెప్పబడినారు. జంగములప్రశంస లేదు. క్రొత్తగా బయలుదేరిన వీరశైవమును గుఱించి యేమియు లేదు. ఇది పేరునకు మాత్రమె యుండి యుండవచ్చును.

శ్రీనాథుని తాత పాల్కురికి సోమనాథునికి సమకాలికుడు. కాన కమలనాభుడు తనమనుమ డైన శ్రీనాథునికి సోమనాథుని నిజ వృత్తాంతమునుఁ దెలిపి యుండవచ్చును.

శ్రీనాథుఁ డద్వైతబ్రాహ్మణుఁడు. శైవమందు పక్షపాతము సహజము. అతఁడు పండితారాధ్యచరిత్రను వ్రాసినాడు. కాని బస వనచరిత్రను వ్రాయలేదు. బసవనసంప్రదాయము తెలుగుదేశపు పడమటి యంచులలోనె కొంత కనబడుచున్నది. ఆ మహాకవికి శివకే శవులయందు భేదము లేదు. కాశినుండి వచ్చిన వ్యాసుఁడు పిఠాపుర ములో కుక్కుటేశ్వరునితో బాటు కుంతీమాధవస్వామినిఁగూడ పూ జించెను. శ్రీనాథుడు శైవకథలనె కాక నందనందనచరిత్రయును కృష్ణ చరిత్రనుఁగూడ వ్రాసినట్లు కనఁబడుచున్నది. వల్లభాభ్యుదయ మను పుస్తకములోని వృత్తమేదియో! పోతన వీరభద్రవిజయమును, భాగ వతమును గూడ వ్రాసినాడు. అతఁడు శివుని ధ్యానించుచుండగా రాముడు కనబడినాడట!

కవి తాను వర్ణించువానితో తాదాత్మ్యము చెంది చెప్పుమాట లాతని స్వీయభావనము లనుటకు వీలులేదు.

వీరశైవకవులు, స్మార్తకవులు గ్రహించిన వాఙ్మయమూర్తులు లేరా? ద్విపదను వీరశైవకవులు, నురుతర పద్యగద్య ప్రబంధము లను స్మార్తకవు లభిమానించినట్లుగాఁ గనబడుచున్నది.

శ్రీనాథుఁ డద్వైత కవి యగునా, కాదా యనువిషయమును రుజువు చేయజాలిన యొకయంశ మేమనగా నద్వైతకవులు తమ కవి స్తుతులలో నద్వైతులు కానివారిని చేర్చలేదు. కవిస్తుతులలోని కెక్కిన శ్రీనాథుఁ డద్వైతకవియె గాని యన్యుఁడు కాఁడు. కవిస్తుతులలో నిట్టి బిగింపు కాలక్రమమున సడలుట సహజము.

పూర్వకాలమం దొకకవి కావ్యమును వ్రాయుటలో రెండు శక్తులుపనిచేయుచుండెడివి—ఒకటికవియిష్టము. రెండుకృతిపతియిష్టము. ఈరెండింటియొక్కఫలితము కృతి. కృతిభర్తయొక్క యిష్టమే ప్రధాన ముగా నడుచుచుండెడిది. పోతనవలె స్వతంత్రముగా గాని, ధూర్జటివలె నిర్లక్ష్యముగాగాని యుండినకవులు సకృత్తు. శ్రీనాథుఁడు శైవాభిమాని యగుటయు, రాజులుకూడ నట్లె యుండుటయు, నతని ప్రత్యేకాదృష్ట మని చెప్పవచ్చును.

శ్రీనాథమహాకవికి స్వదేశాభిమానమును, స్వస్థలాభిమాన మును, మిక్కుటము. సప్తశతిలోని హాలునికి సప్తగోదావరులతో సం బంధ ముండుటచేతను పండితారాధ్యుఁడు తెలుగుదేశస్థుఁ డగుటచేతను హరవిలాసములోని కిరాతార్జునీయకథ, చిరుతొండకథను, నొకటి విజయవాడతో, మఱియొకటి కంచితో సంబంధ ముండుటచేతను; భీమే శ్వరపురాణము స్వస్థలమునందలి విషయ మగుటచేతను, పల్నాటివీర చరిత్ర తెలుగుదేశముది యగుటచేతను, నాయాగ్రంథములను రచించె నని చెప్పవచ్చును.

దైవభక్తికి తోడుగా నింతటిదేశభక్తి గల కవి మనప్రాచీనులలో లేడు. కవులతనిభావమును గాక, భావము ననుసరించియున్నచో, తరువాతి తెలుగువాఙ్మయ మద్భుతముగా వృద్ధి చెందెడిది.

నాటికైని నేటికైని శ్రీనాథమహాకవి యాంధ్రసాహిత్యములో సద్వితీయుడు.



## శివలీలార్ణవము. (ఆంధ్రానువాదము)

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

శ్లో॥ పూతం స్వతః పూతతరం తతో యు
ద్ధాంగం పయ శ్శంకర మౌలిసంగాత్.
త త్పాతు మాతుః ప్రణయాపరాధ
పాదాహతైః పూతతమం తతో నః ॥

తే. గీ. పూత మయ్యు ముక్కంటి కొప్పున వసించి
పూతతరమయి, పొలయల్క పూను గిరిజ
తన్నులం బడుటను బూతతమము నగుచు
నొప్పుగంగాజలమ్ము మ మ్మోముఁగాత.

శ్లో॥ అశక్య మంగాంతరవ ద్విభక్తు
మన్యుప్రమాణాం కరణం య దంతః
సామాన్యభూతం శివయో స్త దేకం
సానుగ్రహం స్యా న్మయి గర్భదాసే ॥

తే. గీ. ఎంచి యితరాంగమటు విభాగించలేక
యేకమై యణురూపమై యొసఁగు శివుల
యంతరంగ మాగర్భదాసానుదాసుఁ
డైన నను బ్రోచుత మనుగ్రహమ్ము నెఱపి.

శ్లో॥ అన్విష్య ఖిన్నం నిగమా న శేషా
నమీనమీనం ప్రథమం స్మరామః
అన్విష్యమాణం నిగమై రశేషై
రంబ స్తుమ స్తే వయ మక్షిమీనమ్ ॥

తే. గీ. నిఖిలనిగమ్మములను దానె నెమకి నెమకి
యలసి సొలసిన మీనముం దలఁపనేల?
నిగమములచే నిరంతరాన్విష్యమాణ
మైన నీ నేత్రమీనము నంబ! తలఁతు.

శ్లో॥ స్తన్యేన కశ్చి త్కవయాంబభూవ
తాంబూలసారేణ పరో జనన్యాః
అహం తతో ప్యున్నతి మాప్తుకామః
సేవే తతో ప్యున్నత మక్షికోణమ్ ॥

తే. గీ. అంబచనుఁబాలఁ గైతల నల్లె నొకఁడు
తల్లితాంబూలరస మాని యల్లె నొకఁడు
వారికంటె నున్నతి పొందవలె నటంచు
నామె యున్నతదృక్కోణ మాశ్రయింతు.

శ్లో॥ అర్ధే తనో రద్రిసుతామయో స్మి
త్యహంయునా కిం ఫల మాదియూనా
గీర్వాణయోగీంద్ర ముపాస్మహే తం
సర్వాత్మనా శైలసుతాత్మకో యః ॥

తే. గీ. అర్ధతనువున గిరిజ నే నైతి ననుచు
ఆదిపూరుషుఁడటు గర్వ మంద నేల?
పూర్ణగిరిజాత్మతఁ బుణికి పుచ్చుకొనిన
భవ్యగీర్వాణయోగీంద్రుఁ బ్రస్తుతింతు.

శ్లో॥ కాలేన శంభుః కుల తావతాపి
కలా శ్చతుష్షష్టిమితాః ప్రణిన్యే
ద్వ్యాస ప్తతిం ప్రాప్య సమాః ప్రబంధాన్
శతం వ్యధా దప్పయదీక్షితేంద్రః ॥

తే. గీ. బ్రతికి చిరకాల మా పశుపతిమితమ్ము
గాఁ జతుష్షష్టికళలు నే కడకుఁ గూర్ప
స ప్తతికె నూటికిని మించి సరసకృతులు
దీక్ష సంధించె నప్పయ దీక్షితుండు.

శ్లో॥ అనాహతోద్భూత మపా స్తభేద
మాద్యం శివ స్యాపయికం విదాతుః
నాదాభిధం పారగ మధ్వనాం త
దను త్తరం జ్యోతి రనుస్మరామః॥

చ. మొదట ననాహతమ్మున సముద్భవమంది నిర స్తభేదమై
మొదలిటిదై మహానటునిమూ ర్తికె లభ్యము నౌచు, మోక్షపుం
బదవినిఁ బోవువారలకుఁ బారగమై, నినదస్వరూపమై
పొదలు నను త్తరం బయిన పూర్ణమహస్సుఁ దలంతు నెమ్మదిన్.

శ్లో॥ సాహిత్యవిద్యాజయఘంట యైవ
సంవేదయ న్తే కవయో యశాంసి
యథా యథా స్యాం ధ్వని రుజ్జిహీతే
తథా తథా సా గ్వతి మూల్యభేదాన్ ॥

తే. గీ. కవులు సాహిత్యజయఘంటికానినాద
ములనె తమ యశస్సును జాటఁగలుగుచుంద్రు
వాన నెంతెంతగా ధ్వని ప్రకటిత మగు
నంతలంతలె మూల్యభేదాంతరములు.

శ్లో॥ యావ త్కవే ర్మార్దవ ముక్తిబంధే
యావ ద్ధియః శ్రోతరి కోమలత్వం
తావ ద్ధ్వనౌ తద్వ్యతిభేదమూలే (ద్వ?)
తారత్వ మాలంకృతికా వదంతి ॥

తే. గీ. కైతలో మార్దవము శ్రోతృ గణమనీషఁ
గోమలతయును నెందాఁకఁ గొఱతవడవొ
అందనుక భేదమూలకవ్యంగ్యకృతుల
కుచ్ఛదశ యంచు శాస్త్రంబు లూఁదిపలుకు.

శ్లో॥ అస్మి న్మహత్యస్తమితాన్యవేద్యే
విస్పృత్వరే వీచితరంగరీత్యా
కావ్యధ్వనౌ జాగ్రతి దేహభాజాం
కర్ణం విశేయుః కథ మన్యశబ్దాః ॥

తే. గీ. విస్మృతమ్ము స్తమితాన్యవేద్యము నయి
వీచికాభంగరీతిని వెల్లివిరియు
ధ్వనివిషయమునఁ గవి శ్రద్ధధానుఁ డగుడు
నితరశబ్దముల్ శ్రుతి కేల యింపు నింపు.

శ్లో॥ కీర్ణాని ఘంటాపథ ఏవ హంత
శబ్దార్థరత్నాని గిరాం సవిత్ర్యా
అత్యాదరా దామృశతాం కవీనాం
దృగ్గోచరం కస్యచి దేవ యాన్తి ॥

తే. గీ. తల్లి వాగ్దేవి ఘంటాపథమ్ము నందె
చిమ్మె శబ్దార్థరూపవిచిత్రమణుల
సాదరమ్మునఁ గవులు చే సాచుచున్న
నందఱకుఁ గానఁబడ వందు నందు సుకృతి.

శ్లో॥ ప్రాయ స్తిరోభూత మహాప్రకాశాః
పాషాణఖండే ష్వివ చంద్రకాంతాః
శబ్దేషు శబ్దా మిలితా శ్చరంతి
భాగ్యోత్తరా ప్రత్యభిజానతే తాన్ ॥

తే. గీ. కప్పువడినదీప్తులఁ జంద్రకాంతమణులు
ఉపలఖండములను గూడి యుండినటులు
శబ్దములఁ గూడి శబ్దముల్ సంచరించుఁ
బుణ్యులే వాని గుర్తింపఁ బోలియుండ్రు.

శ్లో॥ యానేవ శబ్దాన్వయ మాలపామః
యానేవ చార్థాన్వయ ముల్లిఖామః
తై రేవ విన్యాసవిశేషభవ్యైః
సమ్మోహయంతే కవయో జగంతి ॥

తే. గీ. మనము ప్రతిదిన మనుకొనుమాట లెవియొ
తడవుదుమొ నిత్య మెట్టియర్థములు ససిగ
వాని విన్యాసపూర్ణవైభవముకతనఁ
గవులు జగములఁ దనియింపఁగలుగుచుండ్రు.

శ్లో॥ గాయంతి వీణా అపి వేణవోపి
జానంతి బాలాః పశవోఽపి చేదమ్
కావ్యాని కర్తుం చ పరీక్షితుం చ
ద్విత్రా భవేయు ర్నతు వా భవేయుః ॥

తే. గీ. జడము లగు వేణువులుఁ గిన్నెరలును బాడ
పసులుఁ బసిపాప లానందపడుదు రాని,
కృతులు గూర్పఁగ వానిఁ బరీక్షసేయ
నిర్వురో మువ్వురో కలరేమొ? లేరొ.

శ్లో॥ సవ్యం వపుః శబ్దమయం పురారే
రర్థాత్మకం దక్షిణ మామనంతి
అంగం జగన్మంగళ మైశ్వరం త
దర్ధాంతి కావ్యం కథ మల్పపుణ్యాః ॥

తే. గీ. అథవుసవ్యాంగమే సుశబ్దాత్మ, దక్షి
ణాంగ మర్థాత్మ మాటఁ గావ్యము శివాత్మ
మది జగన్మంగళార్థాయి యర్హుఁ డగునె
యల్పపుణ్యుఁడు సాధుకావ్యము రచింప.

శ్లో॥ స్తోతుం ప్రవృత్తా శ్రుతి రీశ్వరం హి
న శాబ్దికం ప్రాహ న తార్కికం వా
బ్రూతే తు తావ త్కవి రి త్యభీక్ష్ణం
కావ్యాపరాసా కవితా తతో నః ॥

తే. గీ. శ్రుతి మహేశ్వరుఁ గొనియాడఁజొచ్చి యతని
దార్కికునిగ శాబ్దికునిగాఁ దలఁపలేదు
కవి కవి యటంచుఁ బదిఁబదిగా వచించె
నట్టి కవితయె పరమగమ్యంబు మాకు.

శ్లో॥ కర్ణం గతం శుష్యతి కర్ణ ఏవ
సంగీతకం సైకతవారిరీత్యా
ఆనందయ త్యంత రనుప్రవిశ్య
సూక్తిం కవే రేవ సుధా సగంధా ॥

తే. గీ. చెవిని బడి చెవియందె శోషించిపోవు
భవ్యగానము సైకతవారి పగిది
మాన్యకవిసూక్తి యమృతాయమాన మై, హృ
దంతరము చేరి యానంద మందఁజేయు.

శ్లో॥ పశ్యేయ మేకస్య కవేః కృతిం చేత్
సారస్వతం కోశ మవైమి రిక్తమ్
అంతఃప్రవి శ్యాయ మవేక్షిత శ్చేత్
కోణే ప్రవిష్టా కవికోటి రేషా॥

తే. గీ. చేరి యొకకవికావ్య మీక్షింతుమేని
శబ్దకోశమె శూన్యమానరణి దోఁచు
కోశముం దఱచితిమేని కొసకు నొక్క
కోణమం దుండు నీ కవికోటియెల్ల.

---

# సాహిత్యచింతామణౌ సవ్యాఖ్యానే
## దోషప్రకరణమ్

అథ ప్రబంధవర్ణనీయ వేంకటమహీపతిసూర్యరాయ మహారాజే తరక్షుద్రనాయకప్రతిపాద్య కుకవికల్పనీయకవితామార్గప్రదర్శన వ్యాజేన దోషా నిరూప్యంతే.

కావ్యనిరూపణానంతరం రసాదినిరూపణే ప్రసక్తేపి ఉద్దేశానుసారేణ దోషనిరూపణాయ సంగతి మాహ అథేతి. దోషనిరూపణస్య వర్ణనీయే నాయకేఽ నుచితత్వా త్తద్వైరిభూపాలవిషయత్వేన నిరూప్యంత ఇతి భావః.

### దోషనిరూపణమ్

శ్లో॥ హేతూ రసాపకర్షస్య దోష శ్శబ్దార్థగోచరః ॥

దోషసామాన్యలక్షణ మాహ. హేతు రితి. రసాపకర్షాపాదకత్వం దోషత్వం. తదుక్తం కావ్యప్రకాశే ముఖ్యార్థహతి ర్దోష ఇతి. రసస్తు ముఖ్య స్తదాశ్రయా ద్వాచ్య ఇతి శబ్దార్థగోచర ఇతి విభాగపరః.

శ్లో॥ పదగో వాక్యగ శ్చేతి శాబ్దో ద్వివిధ ఉచ్యతే.

శబ్దార్థగోచరత్వేన దోషం విభజ్య తత్రాద్య శ్శాబ్దః పున ర్ద్వివిధ ఇత్యాహ పదగ ఇతి. పదగతో వాక్యగత శ్చేతి ద్విధాస్యప్రవృత్తి రితి భావః.

### పదదోషాః

శ్లో॥ అన్వార్థచ్యుతసంస్కార సందిగ్ధ పరుషాణి చ
అసమర్థ మథాశ్లీలం విరుద్ధమతి కృ త్తథా
అప్రయుక్త మపుష్టార్థం తథా క్లిష్టం నిరర్థకం
అప్రయోజకనేయార్థగ్రామ్యగూఢా న్యనంతరం
అవిమృష్టవిధేయాంశ మప్రతీత మతః పరం
పదదోషా ఇమే స ప్తదశైవ సముదాహృతాః

రసప్రతీతేర్విభావాదిమూలత్వా ద్విభావాదే ర్వ్యాక్యాధీనత్వా ద్వ్యాక్యానాం చ పదారబ్ధత్వా త్ప్రథమం పదదోషా న్నిరూపయితు ముద్దిశతి అన్యా ర్థేతి.

అన్యార్థచ్యుతసంస్కారౌ.

శ్లో॥ య ద్రూఢిప్రచ్యుతం నామ త దన్యార్థ ముదీర్యతే
శబ్దశాస్త్రవిరుద్ధో య శ్చ్యుతసంస్కార ఉచ్యతే.

యథోద్దేశం లక్షయతి య దితిరూఢేః ప్రసిద్ధేః ప్రచ్యుతం య త్త దన్యార్థ మవాచక మి త్యేకే. శబ్దశాస్త్రం వ్యాకరణం తద్విరుద్ధ శ్చ్యుతసంస్కారః.

ద్వయ మపి యథా

శ్లో॥ శ్రీసూర్యారాయేంద్ర! భవద్విపక్షం
ఘటాబ్ధికీర్తే విజయేతి మూఢాః
ద్విత్రైః పద్యై ర్వార్షికవేతనేన
స్తువంతి కేచి న్ముదితాః ప్రకామమ్.

ఉదాహరతి శ్రీసూర్యారాయేంద్రేతి. అత్ర క్షీరవాచకత్వేన ప్రయుక్తం ఘటపద మవాచకం అప్రసిద్ధత్వాత్ విజయేతి విపూర్వస్య జి ధాతోః పరస్మైపదత్వేన ప్రయోగా చ్చ్యుత సంస్కారః విపరాభ్యాం జేరి త్యాత్మనేపదత్వనియమాత్ సుగమ మితరత్.

సందిగ్ధం పరుషం చ

శ్లో॥ సందిగ్ధం తన్మతం య త్స్యా త్సందిగ్ధార్థప్రతీతికృత్
పరుషం నామ త ద్యత్స్యా ద్విహితం పరుషాక్షరైః

సందిగ్ధపరుషే లక్షయతి సందిగ్ధం పరుషం చేతి.

ద్వయ మపి యథా :–

శ్లో॥ సూర్యరాయవిభుక్రోధా దబ్ధ్యుద్ధ్యాతా భవాదృశాం
వినశ్యతి కథాంకానాస్యాఖండితానతమంగళాః

లాఘవార్థం ద్వయమప్యేకే నోదాహరతి సూర్యయేతి. అబ్ధ్యుద్ధ్యాతా లక్ష్మ్యః. ఖండితం ఆనతం మంగళం యేషాం తేషాం సంబుద్ధయః. అత్రపూర్వార్ధే పరుషాక్షరైః ప్రతిపాదనాత్పరుషం. ఉత్తరార్ధే ఖండిత మఖండితం వేతి సందేహాత్సందిగ్ధం చేత్యూహ్యమ్.

అసమర్థ మశ్లీలం చ –

శ్లో॥ యోగమాత్రప్రయుక్తం య దసమర్థం త దుచ్యతే
అశ్లీలం త దమాంగళ్యజుగుప్సా వ్రీడకారణమ్.

అసమర్థ మశ్లీలం సవిభాగం చ లక్షయతి యోగేత్యాదినా. యోగ మాత్రప్రసిద్ధం శాస్త్రమాత్రప్రసిద్ధ మిత్యర్థః. మాత్రపదేన వాచక శక్తివిరహః ప్రతిపాద్యతే. అమాంగళ్యజుగుప్సావ్రీడానాం కారణ మశ్లీలముక్తవిధయాత్రివిధ మి త్యర్థః. యథా–

శ్లో॥ మేదస్వినీవారిధరవ న్మణిభి స్తర్పయ శ్రితాన్.
కాండపృష్ఠం కరే కుర్వన్ రిపూన్ జహి మహీపతే.

అత్ర మేదస్వి న్నితి జుగుప్సాకరం. తర్పయే త్యమంగళం. కాండేత్యాది వ్రీడాకరం వారిధరవ దితి సముద్రవాచకత్వేన ప్రయుక్తం పదమసమర్థం ఉదాహరతి మేదస్విన్నితి.వ్యాకరోతి అత్రేతి. మేదస్విన్ బలవన్!వపావ న్నితి చ నిందావహత్వా జ్జుగుప్సాకరం "మేదో బవే వపాయాం" చేతి హేమచంద్రః. తర్పయ సంతృప్తాన్ కురు. నివాపాంజలిభి స్తృప్తిం కుర్వి త్యశుభావహత్వా దమంగళం. కాండపృష్ఠం ధనుః శేషాగ్ర మితి వ్రీడాకరం. "ధను శ్శేషాగ్రయోః కాండపృష్ఠశబ్దోఽ భిధీయత" ఇతి పదమంజరీ. ఇతి త్రివిధ మశ్లీలం వారిధర ఇతి మేఘవాచకస్య సముద్ర పరత్వేన ప్రయుక్తత్వా దసమర్థమ్.

విరుద్ధమతికృత్ -

శ్లో॥ విపరీతార్థధీ రస్మా ద్విరుద్ధమతికృ న్మతం.

స్పష్టమ్. :- యథా

శ్లో॥ కాంభోజనృపతే పూర్ణ కామధ్వజవిలోకనాత్
హ స్తస్రస్తాస్త్రధన్వానో భీతా ధావంతి తే భటాః.

అత్ర పూర్ణ కామేతి సంబుద్ధ్యంతతయా ప్రయుక్తస్య ఉత్తరపదేః సమాసమస్తత్వేన విరుద్ధప్రతీతే ర్విరుద్ధమతికృత్.

ఉదాహరతి కాంభోజనృపత ఇతి యోజయతి అత్రేతి. కామధ్వజ శబ్దయోఃన్యైగంతర్యేణ ప్రయోగా త్కామధ్వజత్వప్రతీతే ద్విరుద్ధ మతికృ దిత్యవగంతవ్యమ్.

అప్రయుక్త మపుష్టార్థం చ-

శ్లో॥ య దప్రయుక్తం కవిభి రప్రయుక్తం త దుచ్యతే
ప్రకృతానుపయుక్తార్థ మపుష్టార్థం త దుచ్యతే.

అప్రయుక్త మపుష్టార్థం చ లక్షయతి యదితి :- యథా-

శ్లో॥ సూర్యరాయవిపక్షాఘూ న స్మృతోపి స దైవతః
విచిత్రం ద్వాదశార్ధార్ధనయనస్య భువం గతాః.

అత్ర దైవత ఇతిప్రయోగా దప్రయుక్తం. త్రిలోచన ఇతి వక్తవ్యే ద్వాదశార్ధార్ధనయనేతి సంఖ్యావిభాగస్య అనుపయోగా దపుష్టార్థం.

ద్వయమ ప్యుదాహరతి సూర్యరాయేతి. అత్ర పూర్వార్థే "దైవతాని పుంసి" వేత్యమరసింహేన భాషితవై భాషికపుంలిగస్య తస్య కవిభి రనభిహితత్వా దప్రయుక్తం త్రిలోచన ఇతి వివక్షితే ద్వాదశార్థం షట్ తదర్థం త్రీణీతి సంఖ్యావిభాగస్య అనుపయోగా దపుష్టార్థమ్.

క్లిష్టం నిరర్థకం చ—

శ్లో॥ క్లిష్టం తదర్థావగతి ర్దూరదూరా యతో భవేత్
పాదపూరణమాత్రం య త్త న్నిరర్థక ముచ్యతే.

క్లిష్టం నిరర్థకం చ లక్షయతి క్లిష్ట మిత్యాదినా అర్థప్రతీతే రతిదూరత్వం క్లిష్టం. పాదపూరణమాత్రప్రయోజకత్వేన నిరర్థకం. యథా—

శ్లో॥ ఇంద్రజామిత్రసోదర్యవాహైః ర్వ్యాసో వనే హి వై
విధినా లాటితః ఫాలే సూర్యారాయారియోషితామ్.

అత్ర ఇంద్రజో అర్జునః, త స్యామిత్రం కర్ణః, తస్యసోదర్యో యమః, తస్యవాహో మహిషా ఇతి వ్యవహితార్థగతేః క్లిష్టం హి వై శబ్దయోస్త్వ యోః కయోశ్చి ద ప్యర్థయో రన్వయాభావా త్పాదపూరణమాత్ర ప్రయోజకత్వేన నిరర్థకత్వమ్.
ఉదాహరతి ఇంద్ర ఇతి వాకుర్వన్ క్లిష్టత్వం నిరర్థకత్వం చ దర్శయతి అత్రేతి. అమిత్ర మసుహృత్.

నేయార్థ మప్రయోజకం చ—

శ్లో॥ స్వసంకేతప్రసిద్ధార్థం నేయార్థం పరికీర్త్యతే
తదప్రయోజకం య త్స్యా దవిశేషవిధాయకమ్.

నేయార్థ మప్రయోజకం చ లక్షయతి స్వసంకేతేత్యాదినా వ్యత్యస్త వర్ణేన పదేన స్వసంకేతితప్రతీతి ర్లక్షణ యేతి వక్తవ్యం. తత్ర ప్రవీణాది శబ్దవ న్నిరూఢి ర్నిమిత్తం నాపి "గంగాయాం ఘోష" ఇత్యాదివ త్ప్రయోజనం. కింతు స్వసంకేతమాత్రం అత స్తత్రాశక్త్యం లక్షణో పేక్షణీయా నిరూఢా లక్షణాః కాశ్చి త్సామర్థ్యాభిధానవత్ క్రియంతే. సాంప్రతం కాశ్చి త్కాశ్చి న్నైవత్వశక్తిత ఇ త్యాచార్యై స్త స్యా నిషిద్ధత్వా దతో నేయార్థ మిత్యవగంతవ్యం. సుగమ మితరత్. యథా—

శ్లో॥ కాంభోజవసుధానాథ కిం బ్రవీమి పురం తవ
పికప్రకర సంకీర్ణం వశ భోగ్యైషిభి ర్వృతం.

అత్ర పికవశశబ్దావర్ణవ్యత్యాసేన కపిశవ త్వప్రతీతి సంకేతపరా. తతో నైయార్థకం పికప్రకరసంకీర్ణ మభితః కుటిలాధిప మితి పాఠేన కుటిలాధిప మితి విశేషానాధాయకత్వా దప్రయోజకం.
ఉదాహరతి కాంభోజేతి అత్ర దోషం యోజయతి అత్రేతి.

గ్రామ్యం గూఢార్థం చ–

శ్లో॥ పామరవ్యవహారైకప్రసిద్ధం గ్రామ్య ముచ్యతే
ప్రయుక్త మప్రసిద్ధార్థే గూఢార్థం పరికీర్త్యతే.

గ్రామ్యగూఢార్థే లక్షయతి పామరవ్యవహారేత్యాదినా. ఇంగాలవ త్పామరవ్యవహారసిద్ధం గ్రామ్యం. అప్రసిద్ధార్థనియుక్తం గూఢార్థం యథా–

శ్లో॥ వినీలగల్లరదనా శోణితాలకరూపితాః
దేశా స్నిష్కాసితా స్సూర్యరాయేంద్రరిపుయోషితః.

అత్ర గల్లపదం కపోలపరత్వేన గ్రామ్యం. శోణితేతి రక్తే ప్రసిద్ధస్య పాటలత్వేన ప్రయోగా ద్గూఢార్థం ఉదాహరతి వినీలేతి యోజయంతి అత్రేతి.

అవిమృష్టవిధేయాంశకం–

శ్లో॥ అవిమృష్టవిధేయాంశం గుణీభూతవిధేయకం.

అవిమృష్టవిధేయాంశం లక్షయతి.అవిమృష్టేతి. అవిమృష్టః ప్రాధాన్యేన అనిర్దిష్టో విధేయాంశో యత్ర త దవిమృష్టవిధేయాంశం. తదే వాహ గుణీభూతవిధేయక మితి. పృథక్పదాభ్యాం ప్రాప్త ముద్దిశ్య అప్రాప్తం విధీయతే. యథా పర్వతో వహ్నిమా నితి. అన్యథా వహ్నిమత్పర్వత ఇత్యపి ప్రయోగప్రసంగాత్– యథా

శ్లో॥ సూర్యరాయవిభో ర్వైరిదుర్విపాకం విలోకితుం
సాక్షాత్సహస్రనేత్రోఽపి నాలం సర్వోద్యమై రపి.

అత్ర నయనసహస్రస్య విలోచనపర్యాప్తత్వేన విధేయస్య గుణీభావా దవిమృష్టవిధేయాంశకమ్.

ఉదాహరతి సూర్యరాయవిభో రితి దుర్విపాకం దురవస్థాం యోజయతి. అత్రేతి స్పష్టం.

అప్రతీతం–

శ్లో॥ శాస్త్ర మాత్రప్రతీతం య దప్రతీతం త దుచ్యతే.

అప్రతీతం లక్షయతి. శాస్త్రేతి– యథా

శ్లో॥ సూర్యరాయభక్తై ర్గ్లానాం నాసా మాచ్ఛాద్య విద్రవన్
మానక్లేశాన్వితోఽపి త్వం కిం జీవసి హి మాళవ!

అత్ర క్లేశపద మభినివేశపరత్వేన యోగశాస్త్రమాత్రప్రసిద్ధ మిత్యప్రతీతం. ఉదాహరతి. సూర్యరాయభక్తై రితి లూనాం ఛిన్నాం లక్ష్యలక్షణం యోజయతి. అత్రేతి.

వాక్యదోషాః

శ్లో॥ శబ్దహీనం క్రమభ్రష్టం పునరుక్తం విసంధి చ
సంబంధవర్జితం పశ్చా ద్వ్యతిభ్రష్టం తతఃపరం
ద్వే భిన్నలింగవచనే తతః ప్రక్రమ భంగవత్
వ్యాకీర్ణం వాక్యసంకీర్ణం వాక్య మర్ధ మరీతికం
తతోఽధికోపమం లుప్తవిసర్గం చ తతః పరం
న్యూనాధికపదే ద్వే చ ఛందోభంగ మతఃపరం
సమాప్తపునరాత్తాఖ్య మశరీర మపూర్ణకం
పతత్ప్రకర్షకం హీనోపమ మస్థానవిగ్రహం
చతుర్వింశతి రుచ్యంతే దోషా వాక్య సమాశ్రయాః.

వాక్యదోషా నాహ శబ్దహీన మిత్యాదినా క్రమేణ. తేషాం స్వరూపోదాహరణాని–

శబ్దహీనం

శ్లో॥ అపశబ్దయుతం వాక్యం శబ్దహీన ముదీర్యతే.

శబ్దహీనం లక్షయతి అపశబ్దేతి— యథా

శ్లో॥ వర్షం త్యంబుఘనా ఏతే య ద్ధరాధరమండలే
త దిదం స్మరయ త్యస్మాన్ సూర్యరాయవిభో శ్చమూమ్.

అత్ర వర్షంతి అంబు ఇతి పదద్వయప్రయోగే దోషావిర్భావా ద్వాక్యమేవ దుష్టం ప్రసిద్ధకర్మస్థలేన కర్మోపాదాన మితి శాస్త్రనియమాత్.

ఉదాహరతి. ఏతే ఘనా మహాంతః మేఘాశ్చ ధరాధరమండలే రాజమండలే పర్వతసమూహే చ. అంబులక్షితలక్షణయా శరం జలం చ వర్షయం తీతి యత్ త దిదం లక్ష్యే లక్షణం యోజయతి అత్రేతి. నను చ్యుతిసంస్కారస్యైవ శబ్దహీన మితి సంజ్ఞాంతరం న పృథక్ దోషః. వాక్యగతత్వేన నార్థకస్య కావ్యప్రకాశకృతా పదద్వయే యుగప దసాధుత్వాసంభవేన పరిహృతత్వా దితిచేత్ సత్యం. యద్య ప్యేకపద మేవాసాధు. తథాపి తరసాధుత్వం పదాంతరసమన్వయసాపేక్ష మితి వాక్యదోష ఏ వాయం న పదదోష ఇత్యభిప్రే త్యాహ ప్రసిద్ధేత్యాదినా.

క్రమభ్రష్టం యథా—

శ్లో॥ క్రమభ్రష్టం భవే దార్థ శ్శాబ్దో వా యత్ర నక్రమః.
క్రమభ్రష్టం లక్షయతి. క్రమభ్రష్ట మితి.— యథా

శ్లో॥ వితర త్యాంధ్రభూపాలే వాంఛాధికఫలశ్రియః
మందారం కర్ణ మపివా న కోపి బహుమన్యతే.

అత్ర కర్ణం మందార మపి నేతివక్తవ్యే వ్యుత్క్రమే ణోక్తం. కర్ణాపేక్షయా మందారస్య ఉత్కృష్టత్వా దిత్యర్థక్రమభంగః.

అర్థక్రమభంగ ముదాహరతి వితర తీతి. లక్ష్యే లక్షణం యోజయతి. అత్రేతి. నను యవాగ్వాగ్నిహోత్రం జుహోతి. యవాగూం పచ తీత్యత్ర పాఠక్రమానుపపత్త్యా వర్థక్రమో యథా స్వీకృతః తద్వదత్రాపి యథాయోగ మన్వయోంగీక్రియతా మితి చే న్న. అపౌరుషేయ వేదవాక్యే యథాతథా వాస్తు. పుంవాక్యే తు కర్ణానంతర మేవ మందారస్య వక్తృవ్యత్యప్రతీతే స్త దసహిష్ణుత్వా ద్దుష్టత్వ మేవే త్యనవద్యం. పునరుక్తవత్-

శ్లో॥ శబ్దార్థపౌనరుక్త్యేతు తద్వాక్యం పునరుక్తవత్.

పునరుక్తవ ల్లక్షయతి. శబ్దార్థేతి. - యథా

శ్లో॥ గాంభీర్య శౌర్యసౌందర్యై స్స్మరసింధు మృగాధిపాన్
విశ్వం విజయతే నిందన్ విశ్వజిన్మనుజేశ్వరః ॥

అత్ర గాంభీర్యాదిక్రమేణ సింధుసింహమనోభువ ఇత్యుచితే శాబ్దక్రమే తథా నోక్తం. గాంభీర్యాదిభి స్స్మరసింధుమృగాధిపా నితి యథాయోగ్యం సముదాయాన్వయే ఒర్థాన్వయసిద్ధే ర్నాత్రార్థక్రమభంగః. కింతు శబ్దప్రయోగ ఏవ విశ్వజిత్. విశ్వం విజయత ఇతి పునరుక్తం చ.

పూర్వోదాహృతావశిష్టశబ్దక్రమభంగం పునరుక్తవ చ్చైకేనోదాహరతి గాంభీర్యేతి. మృగాధిప స్సింహః లక్ష్యే లక్షణం యోజయతి. అత్రేతి.

విసంధిసంబంధవర్జితయతిభంగాః-

శ్లో॥ విసంహితో విరూపో వా యస్య సంధి ర్విసంధి తత్
సంబంధవర్జితం త త్స్యా ద్యత్రేష్టో నాన్వయో హతః.
యత్రస్థానే యతిభ్రంశ స్త ద్యతిభ్రష్ట ముచ్యతే.

విసంధి సంబంధవర్జిత యతి భంగాన్ లక్షయతి విసంహిత ఇత్యాదినా. విగతా సంహితా వర్ణానా మన్యోన్యసన్నికర్షో యత్ర విసంహితః

విశ్లిష్ట ఇత్యర్థః. విరూపః కర్ణకఠోరః ఉక్తరీత్యా విసంధిర్ద్వివిధ మిత్యర్థః. సంబంధే నేష్టయోగేన వివర్జితం. సంబంధవర్జితం భ్రష్టా యతిర్యత్రేతి యతి భ్రష్టం. వాహితాగ్న్యాది ష్వితి పరనిపాతః. యతిర్నామ పదవిచ్ఛేదః. తదుక్త మాచార్యదండినా "శ్లోకేషు నియతస్థానం పదచ్ఛేదం యతిం విదు" రితి. యతి ర్విచ్ఛేద ఇతి పింగళాచార్యాద్యా శ్ఛాందసాః – యథా.

## దోషప్రకరణమ్

శ్లో॥ భానుభ్వౌదార్యభా గ్భూయో జయ ఆచంద్రసూర్యభమ్
సంగ్రామరంగభీమో భవా న్జయశ్రీ ర్హిలాసికా ॥

అత్ర భానుభ్వౌదా ర్యేతి విరూపరూపోఽయం విసంధిః. జయ ఆచంద్రేతి విసంహితాత్మా విసంధిః. భీమో భవా నితి యతిభ్రష్టం జయశ్రీరూపా యా లాసికా యా భవత స్సంగ్రామ ఏవ రంగ ఇతి సంబంధేనోక్త ఇతి సంబంధవర్జితం.

ఉదాహరతి భా న్వితి. భానుభూః కర్ణః తస్య ఔదార్య మివ ఔదార్యం భజతీతి తథోక్తః. జయశ్రీ ర్జయలక్ష్మీ ర్లాసికానర్తకీ "నర్తకీ లాసికేసికే సమ" ఇత్యమరః. యోజయతి అత్రేతి. కర్ణకఠోరత్వా ద్విరూపం విసంధి "అకస్సవర్ణేదీర్ఘ" ఇతి సవర్ణ దీర్ఘాభావా త్స్వరస్వరసన్నికర్షాభావరూపం విసంధి పాదాంత వర్ణస్య భకారస్య చతుర్థపాదాద్యభవచ్ఛబ్దత్వా ద్విచ్ఛేదాభావేన యతిభ్రష్టం సుగమ మితరత్.

భిన్నవచనలింగ భగ్నప్రక్రమాని.

శ్లో॥ యత్రోపమా భవే ద్భిన్న వచనా భిన్నలింగకా
తద్భిన్న వచనం భిన్న, లింగం చాహు ర్మనీషిణః ॥
ప్రకాంతనియమత్యాగే భగ్న ప్రక్రమ ముచ్యతే॥

భిన్నలింగ భిన్నవచన భగ్నప్రక్రమాని లక్షయతి యత్రేత్యాదినా. యత్ర ఉపమానోపమేయయో ర్భిన్నవచనత్వం భిన్నలింగత్వం చ దోషహేతుత్వం. యథా

శ్లో॥ భావత్కవీత మివ రాజతి పూర్వశైల
స్తస్మి న్భవా నివ విభాతి కళంకమూర్తిః
కాంభోజభూవరయ శోభి రివ త్వదీయై
శ్చంద్రత్విషా ధవళితా భవతి త్రిలోకీ ॥

అత్ర పూర్వార్ధే వీతమివ పూర్వశైల ఇతి భిన్నలింగకోపమం ఉత్తరార్ధే యశోభి రివ చంద్రత్వి షేతి భిన్నవచనం పూర్వార్ధే ఉపమానోపమేయయోః ప్రథమాంతత్వేన గ్రహణా దుత్తరార్ధే వైయ్యధికరణ్యే న గ్రహణాచ్చ ప్రక్రమభంగః.

ఉదాహరతి భావత్కేతి. భావత్కం భవదీయం వీతం హస్త్యశ్వం "వీతం త్వసారగం హస్త్యశ్వ" మిత్యమరః. తదివ పూర్వశైలో రాజతి. తస్మిన్ తత్ర కళంకమూర్తి శ్చంద్రవ్యక్తిః భవా నివ విభాతి. హే కాంభోజ భూవర త్వదీయై ర్యశోభి రివ చంద్రత్విషా చంద్రికయా త్రిలోకీ లోకత్రయ మపి తద్ధితార్థేత్యాదినా సమాహారసమాసే అకారాంతోత్తర పదత్వేన స్త్రీత్వాద్ద్విగోరితికారః. ధవళితా ధవళీకృతా భవతి యోజయతి అత్రేతి. వ్యాకీర్ణమ్

శ్లో॥ వ్యాకీర్ణం త ద్విభక్తీనామ్ వ్యాకీర్ణే తు మిథోన్వయే ॥
వ్యాకీర్ణం లక్షయతి వ్యాకీర్ణ మితి విభక్తీనాం విభక్త్యంతానాం ప్రదానా మిత్యర్థః. సంకీర్ణపద మేకం వాక్యం వ్యాకీర్ణమ్. యథా

శ్లో॥ వాచాస్మర న్నతిక్రౌర్యమ్ కోమలం మనసా వదన్
వైరి ష్వభినయ న్మైత్రీమ్ మర్మజ్ఞో జహి వంగతాన్ ॥
అత్ర మనసా స్మరన్ వాచా వదన్ ఇతి సంబంధో వ్యాకీర్ణం ఉదాహరతి వాచేతి యోజయతి అత్రేతి స్పష్టం.

వాక్యసంకీర్ణం.

శ్లో॥ వాక్యాంతరపదైః కీర్ణమ్ వాక్యసంకీర్ణ ముచ్యతే ॥

వాక్యసంకీర్ణం లక్షయతి వాక్యాంతరపదై రితి. యథా.

శ్లో॥ ధనౌ సమాకర్ష నతా న్క్రూరేషు
క్షుద్రాం త్సమారోపయ ముంచ కాండాన్
ఇత్థం కళింగాధిపసైనికానామ్
కోలాహలః క్రామతి దిఙ్ముఖాని॥

అత్ర క్షుద్రా న్క్రూరేషు ఆకర్ష ధనౌ కాండాన్ సమారోపయ నతా న్ముంచ చేతి వక్తవ్యే భిన్నవాచకపదానా మన్యోన్యసంకలనా ద్వాక్యసంకీర్ణమ్.

ఉదాహరతి ధనావితి యోజయతి అత్రేతి. ధనౌ ధనుషి "ధను ర్వంశ విశుద్ధోపి నిర్గుణః కిం కరిష్యతీతి మహాకవి ప్రయోగదర్శనా న్నపుంలింగత్వనిషేధః. కాండా న్బాణాన్ "కాండోఽస్త్రీ దండబా ణార్వవర్గావసర వారి" ష్విత్యమరః. నతాన్ నమ్రాన్ శరణాగతా నితియావత్.

వాక్యగర్భితమ్

శ్లో॥ తద్వాక్య గర్భితం యస్య మధ్యే వాక్యాంతరం భవేత్ ॥

వాక్యగర్భితం లక్షయతి తదితి. వాక్యేన వాక్యాంతరేణ గర్భితం సంజాతగర్భం వాక్యం వాక్యగర్భిత మిత్యర్థః "తదస్య సంజాత" మితీత ప్రత్యయః. యథా

శ్లో॥ భూపాల తే విశిఖపత్రిసమీరణోఽరి
శౌర్యప్రదీపపటలీ ప్రశమం విధాయ
లోకా స్తదంజనమనం త మితీరయంతి
చక్రు స్తదీయవనితానయనేషు వృష్టిమ్ ॥

అత్ర శరగరుద్వేగవాతాః ప్రతీపభూపప్రతాపదీపికామాలికా శ్శమయిత్వా వృష్టిం చక్రు రితి వాక్య మధ్యే తదంజన మిత్యాది వాక్యాంతరానుప్రవేశా ద్వాక్యగర్భితం.

ఉదాహరతి భూపాలేతి వాక్యగర్భితత్వం యోజయతి అత్రేతి.

అరీతికం.

శ్లో॥ రసాననుగుణారీతి ర్య త్రారీతిక ముచ్యతే।

అరీతికం లక్షయతి రసేతి. అరీతికం విరుద్ధరీతిక మిత్యర్థః. యథా

శ్లో॥ దినముఖరవిభిన్నాంభోజపత్రేక్షణాభి
ర్నినదదళికదంబభ్రాంతికృత్కైశికాభిః
కనకకలశయుగ్మోద్భాసిపీన స్తనీభి
ర్భజ భజ రతిసౌఖ్యం భోగినీభి ర్నరేంద్ర!

అత్రారభటీవృత్తి రతిప్రౌఢవర్ణా గౌడీరీతి శ్చేతి ద్వయ మపి శృంగార రసప్రతియోగి.

ఉదాహరతి దినముఖేతి. దినముఖె ప్రాతఃకాలే యో రవి స్తేన విభిన్నాని అంభోజాని తేషాం పత్రాణీవ ఈక్షణాని నయనాని యాసాం తాభిః నినదతా మళీనాం కదంబం సమూహః తద్భ్రాంతికృత్ కైశికం కేశ స మూ హః యాసాం తాభిః కనకకలశయుగ్మవదుద్భాసినౌ స్ఫురంతౌ పీన స్తనౌ యాసాం తాభిః అత్ర రసాననుగుణత్వం విశదయతి. అత్రేతి. ఆరభటీగౌడీ చ ప్రాగేవ నిరూపితే తద్ద్వయస్యాపి శృంగారరసప్రతియోగిత్వేన నిబంధనా దరీతికం.

అధికోపమం న్యూనోపమం చ.

శ్లో॥ యత్రోపమాన మధికమ్, నూనం వా స్యా ద్విశేషణైః
తత్రాధికోపమం పూర్వమ్ న్యూనోపమ మతఃపరమ్.

అధికోపమ ముదాహరతి దినముఖేతి. అరీతికోదాహరణ మేవాస్యాప్యుదాహరణం అధికౌపమ్యం విశదయతి నినదదితి యథా వా.

శ్లో॥ కాంభోజ మనుజేంద్రస్య ఖడ్గో రాజతి సంగరే
మదాలస మహీపాలయశోరాకేందు-రాహువత్॥

అత్ర వీరరసే కైశికీవృత్తి రతికోమలవర్ణా వైదర్భీరీతి శ్చాత్యంత విరుద్ధే పూర్వోదాహరణా దసంతుష్టానాం సంతోషాయ ప్రత్యేక ముదాహరతి కాంభోజేతి. అత్ర రాహువ దిత్యస్య ఉపమానభూతస్య యశోరాకేం ద్వాత్యధికవిశేషణో పాదానా దధికోపమ మి త్యవగంత వ్యమ్.

న్యూనోపమం యథా

శ్లో॥ తిగ్మప్రభావా ఇవ శత్రుభూపా
దావాంబు భూకీల దురాపరూపాః
నిరాకృతా వారిభృతేవ రాజన్
గాంగేయ బద్ధత్సరుణాసి నా తే॥

అత్ర వారిభృతః కనకబద్ధత్సరుకరవాలస్య అధికస్య సాదృశ్య కథనా న్న్యూనోపమం.

అవశిష్టం న్యూనోపమ ముదాహరతి తిగ్మేతి. దావాంబుభూ ర్దావా నలః తస్య కీల వ ద్దురాపం రూపం యేషాం తే తిగ్మస్య సూర్యస్య ప్రభావా ఇవ "తిగ్మః ప్రభాకరే పుంసి తిగ్మం తీక్ష్ణే త్రిషు స్మృత" మితి వ్యాడిః. గాంగేయేన కనకేన బద్ధో నిర్మితః త్సరు ర్ముష్టి ర్యస్య తేన "త్సరుః ఖడ్గాదిముష్టౌ స్యా" దిత్యమరః. వారి భృతేవ జలధరేణేవ యోజయతి అత్రేతి.

లుప్తవిసర్గకమ్.

శ్లో॥ జీత్వం లోపో విసర్గస్యా, సకృల్లుప్త విసర్గకమ్.

లుప్తవిసర్గకం లక్షయతి జీత్వ మితి. మనోరథా విఫలితా ఇత్యాదిం పరంపరయా విసర్జనీయ స్థానికస్య యకారస్య లోపో వ్యోర్వలీతి లోపవిధానా ల్లుప్తవిసర్గత్వం లాటితోవాస ఇత్యాదౌ తు యద్యపి విసర్జనీయస్య సత్వాది సంధికార్యవశా ద్గుణే సత్యోత్వమేవ న లోపః. తథాపి విసర్గాదర్శనా ల్లుప్తవిసర్గవ్యవహార ఇతి ద్రష్టవ్యం. య దాహు రాచార్యాః అదర్శనం లోప ఇతి. యథా

శ్లో॥ లాటితో౽ నిటలే వాసో విధినా కాననే తవ
మనోరథా విఫలితా జాతా మగధభూపతే.

అత్ర విసర్గాదర్శనా ల్లుప్త విసర్గకం.

ఉదాహరతి లాటిత ఇతి స్పష్టం.

న్యూనపదమ్

శ్లో॥ నోక్తం స్యా ద్యత్ర వక్తవ్యమ్, త దాహు ర్వాచ్యవర్జితమ్॥
యేన వినా కార్య మనుపపన్నం త దప్రయోగే న్యూనపదం ఇద మేవ వాచ్యవర్జిత మితి వ్యవహరంతి.

న్యూనపదం లక్షయతి. నేతి స్పష్టం. యథా

శ్లో॥ ఖడ్గైః కుంతైః ప్రమథితై ర శ్వైః కృంతైః కరివ్రజైః
కాంభోజః కురుతే భూపో, దిశో నిబిడితాంతరాః॥

అత్ర కరివ్రజై రపీతి సముచ్చయ బోధకస్యాపి శబ్దస్య వక్తవ్యస్య అనుపాదానా న్యూనపదమ్.

ఉదాహరతి ఖడ్గై రితి. యోజయతి అత్రేతి.

అధికపదఛందోభంగ సమాప్త పునరాదాని

శ్లో॥ యత్రాధికపదోక్తి స్స్యా, త్తత్రాధికపదం మతమ్
ఛందోభగ్నం వచో యత్ర, చ్ఛందోభంగ స్తదా భవేత్.
సమాప్తపునరాదానా త్సమాప్త పునరాత్తమ్॥

ఉద్దేశానుక్రమే ణాధికపదఛందోభంగ సమాప్త పునరాదాని లక్షయతి యత్రేత్యాదినా. భగ్నం ఛందోవృత్తం యత్ర త చ్ఛందోభంగం. సమాప్తస్య వాక్యస్య విశేషేణ ద్వారా పునరుపాదానేన సమాప్తస్య వాక్యస్య విశేషణ ద్వారా పునరుపాదానేన సమాప్త పునరాత్తకం భవతి.

శ్లో॥ కాంభోజేంద్ర ప్రతాప స్తే కుంకుమాకార దీప్తిమాన్
రంజయత్యఖిలదిశో రక్తోత్పలనిధప్రభః.

అత్ర ఆకార పద మధికపదం తృతీయపాదే ఛందోభంగః కుంకుమాకారదీప్తిమత్త్వస్య సమాప్తస్య రక్తోత్పలనిభప్రభ ఇతి పునరుపాదానాత్సమాప్త పునరాత్తకం.

త్రయ మ ప్యుదాహరతి కాంభోజేం ద్రేతి. యోజయతి అత్రేతి. కుంకుమదీప్తిమా నిత్యనేన పూర్ణే సత్యాకార పదగ్రహణా దధికపదం తృతీయపాదే "పంచమం లఘు సర్వేషు సప్తమం ద్విచతుర్థయోః, షష్ఠం గురు ర్విజానీయా దేత చ్ఛ్లోకస్య లక్షణ" మితి లక్షణాత్ షష్ఠ సప్తమయో ర్గురుత్వాభావా చ్ఛందోభంగం. కుంకుమాకారదీప్తిమా నితి సమాప్తస్య వాక్యార్థస్య విశేషణద్వారా పునారక్తోత్పల ప్రభ ఇత్త్యుపాదానా త్సమాప్తపునరాత్తకం.

అశరీరమ్

శ్లో॥ క్రియాపదేన రహిత మశరీరం నిగద్యత ఇతి.

అశరీరం లక్షయతి క్రియాపదరాహిత్యే నాన్వయాభావా దశరీరమ్ అతో మతాంతరే ఙానన్వయ ఇతి చాహుః యథా

శ్లో॥ రాజ్యే నిష్కంటకే నిత్యం, ప్రాసాదే ష్వనుఖేలతః
వనే సకంటకే ఘోరే, శైలే ష్వద్య సతో నృపాన్॥

అత్ర పశ్యేతి క్రియాపదానుపాదానా దశరీరం.

ఉదాహరతి రాజ్య ఇతి నిష్కంటకే నిష్ప్రతీపే సకంటకె కంటక సహితే యోజయతి. అత్రేతి.

అపూర్ణమ్

శ్లో॥ అపూర్ణం త ద్భవే ద్యత్ర, న సంపూర్ణః క్రియాన్వయః

అపూర్ణం లక్షయతి అపూర్ణ మితి.

శ్లో॥ సంపాదితా నను మయా గజతా పరిభూతా
నల్పాధ్వలంఘునగతౌ చతురా హయా మే
హేలాభిభూతశమనై శ్చ భ టైః పరీతం
మామ ప్యహో న వృణుతే కలహే జయశ్రీః॥

# సంపాదకీయము

పాఠకమహాశయులారా!

ఈ పరాభవవత్సరమున వెలువడవలసిన యాంధ్ర సాహిత్యపరిషత్పత్త్రికాచతుష్టయము కారణాంతరములవలన నేటిదనుక బ్రచురింపబడియుండలేదు. కొలది దినములనుండి నూతనముగా నియమింపబడి పరిషత్పత్త్రికాసంపాదకతాభారము వహించియున్నాడను. పలువురు పండితకవుల నర్థించి వ్యాసరాజముల సంపాదించి పత్త్రికకు బరిపుష్టి గల్పించి పరిషత్తు నేటికి బ్రచురింపగల్గినది. ఇటుఁబట్టి మాద్వైమాస పత్త్రిక సకాలమున వెలువడి మీ కరసీమ నలంకరింపగలదని మనవి చేయుచున్నాడను.

ఈ పత్త్రికాదిమపత్రమున శ్రీ శిష్ట్లా బాలకోటీశ్వరరావుగారిచే రచితమగు "వేంకటేశ్వరస్తుతి" ముద్రింపబడినది. అందలి ప్రథమ శ్లోకము న1, 3 పాదము లింద్రవజ్ర వృత్తఛందస్సును, 2, 4 పాదములు వసంతతిలకావృత్తఛందస్సును గలిగియున్నవి.

"పద్మప్రసూనార్చితపాదపద్మమ్" అని రెండవపాదమును, "త్వాం వేంకటేశం శరణం ప్రపద్యే" యని నాల్గవపాదమును, సవరించుకొనదగునేమోయని నా మిత్ర మగు వారిని చనవుచే నడిగితిని.

"ఇది మదిచ్ఛాపూర్వకమే కాని ప్రమాదపతితముగాదు. ఇట్టివియే కొన్ని గలవనియు సమాధానించి, యట్టివి కొన్ని శ్లోకములబఠించి యయ్యాదిమశ్లోకమునకు యథాస్థితినే గల్పింపుడని నా హితుడు వాచించినాడు.

ఈ పత్త్రికయందు "భువనవిజయ" మను నొక చిన్న దృశ్యకావ్యమును - నాంధ్రీకరణార్థము హనుమన్నాటకమందలి యొక శ్లోకమును - సుకవిపూరణమునకై యొక యాంధ్రపద్యసమస్యయు బ్రకటింపబడినవి.

శారదారాధనశీలురగు మా పండితకవిమండలి తమ యమూల్యము లగు గద్యపద్యాత్మకహృద్యవ్యాసముల బంపుచు నిరంతర మీ సాహిత్యపరిషత్పత్త్రికాభివృద్ధికి దోడ్పడ బ్రార్థితము.

కాకినాడ
15-12-1966

ఇట్లు
పరిషత్పత్త్రికాసంపాదకుడు
(కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర, బ్రాహ్మీభూషణ)
కాకరపర్తి కృష్ణశాస్త్రి

| | |
|---|---|
| ప్రాస్తావిక పద్యావళి | 0–75 |
| బాలభారతము (అగస్త్యకృతమునకుఁ దెలుఁగు) | 2–50 |
| బాలరామాయణము | 0–25 |
| మాధ్యమిక కారికలు – సంస్కృతము – నాగరిలిపి | 2–50 |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1–00 |
| రఘునాథరామాయణము (ప్రథమభాగము) | 1–00 |
| రాధికాసాంత్వనము – సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | 1–50 |
| రాఘవయాదవీయము | 1–00 |
| రెడ్డినాఁటి రెండుశాసనములు | 0–50 |
| లక్షణసారసంగ్రహము | 2–00 |
| విప్రనారాయణచరిత్రము – చదలవాడ మల్లన్న | 1–25 |
| శతకసముచ్చయము (ద్వితీయభాగము) | 1–25 |
| శాసనపద్యమంజరి (మొదటిభాగము) | 1–75 |
| ,, (ద్వితీయభాగము) | 0–75 |
| శివరాత్రి మాహాత్మ్యము – శ్రీనాథకవి | 2–50 |
| షోడశకుమారచరిత్రము – వెన్నెలకంటి అన్నయ్య | 1–25 |
| సర్వేశ్వరశతకము – యథావాక్కుల అన్నమయ్య | 0–25 |
| స్వప్నవాసవదత్త – భాసకృతి కనువాదము | 2–00 |
| సింహాసనద్వాత్రింశిక – కొఱవి గోపరాజు | 1–50 |
| ,, (ద్వితీయభాగము) | 1–50 |
| సీతారామచరిత్రము | 1–00 |
| హాస్యరంగములు | 0–50 |
| 42 – వార్షికమహాసభ – వ్యాసములు – 250 పుటలు | 1–50 |

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| * | 1 | సంపుటము | ... | ... | ... | 15-00 |
| * | 2 | ,, | ... | ... | ... | 15-00 |
| | 3 | ,, | ... | ... | ... | 15-00 |
| | 4 | ,, | ... | ... | ... | 15-00 |
| | 5 | ,, | ... | ... | ... | 15-00 |
| | 6 | ,, | ... | ... | ... | 15-00 |
| | 7 | ,, | ... | ... | ... | 15-00 |

* పునర్ముద్రితముగానున్నవి.

ప్రతులకు :

## ఆంధ్ర సాహిత్య పరిషత్తు

రామారావు పేట

కాకినాడ

తూర్పుగోదావరిజిల్లా.



"దేశభాషలందు తెలుఁగు లెస్స."

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**పరాభవ - మార్గశీర్షపుష్యములు**

**సంపుటము 55** **సంచిక 5**



సంపాదకుఁడు

కవిమూర్ధన్య : కాకరపర్తి కృష్ణశాస్త్రి

# ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

| | |
|---|---|
| అ[illegible] గ్రంథసూచిక | 0-50 |
| అమరుకము—జయంతి రామయ్యపంతులుగారు | 1-25 |
| అరవ దేశమునందలి ఆంధ్రవాఙ్మయము— | |
| ఆ. ఉమాకాంతముగారు | 0-25 |
| [illegible]ము | 0-50 |
| ఆంధ్రసాహిత్య పరిషద్వృత్తాంతము | 0-50 |
| ఉశానసంహిత | 0-50 |
| ఉత్తరరామచరిత్రము—జ. రా. పంతులు | 2-50 |
| ఉన్మాదసహస్రము (వెఱ్ఱివేయివిధములు) | |
| కొత్తపల్లి సూర్యారావు | 0-75 |
| కవిజనోజ్జీవని—సమస్యలు — శ్రీ కోటి రఘునాథతొండమాన్ | 0-50 |
| కవిజనాశ్రయము | 2-00 |
| కాళిందీకన్యాపరిణయము—అహోబలపతి (ప్రథమ భాగము) | 1-50 |
| డిట్టో (ద్వితీయ భాగము) | 0-75 |
| చంపూరామాయణము (ఆంధ్రము) జ. రా. పంతులు | 1-50 |
| చాటుధారాచమత్కారసారః— (సంస్కృతము) | 0-75 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0-25 |
| జ్యోతిశ్శాస్త్రసారము—కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0-50 |
| సమస్యాగములు—కొత్తపల్లి సూర్యారావు | 0-25 |
| పరిషత్పుస్తకభాండాగారము 2 వ భాగము | 1-00 |
| ,, 3 వ భాగము | 1-00 |
| ప్రాకృతభాషోత్పత్తి— | |
| శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0-75 |



"దేశ భాషలందు దెలుఁగు లెస్స."

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

పరాభవ - మార్గశీర్షపుష్యములు

సంపుటము 55 సంచిక 5



సంపాదకుఁడు

కవిమూర్ధన్య: కాకరపర్తి కృష్ణశాస్త్రి

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు:

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు - కాకినాడ

అధ్యక్షులు

"విమర్శకాగ్రేసర" 'ఐతిహాసికమహారథ'

శ్రీ బండారు తమ్మయ్యగారు.

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

"అభినవభోజ"

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయకార్యదర్శి :-

"కవిశిరోమణి", "ఉభయభాషాప్రవీణ" A

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు :-

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి గారు
2. "బాలవ్యాస" శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. "భాషాప్రవీణ" "వ్యాకరణ విద్యాప్రవీణ"
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారు
4. "కవిమూర్ధన్య" "ప్రౌఢకవిచంద్ర"
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి గారు
5. శ్రీ కుంపూరి ఈశ్వరదత్తు గారు (బి. ఏ)
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ గారు
7. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు గారు
8. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ.
9. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, (ఎమ్. ఏ. ఆనర్సు)
10. "సాహిత్యవిద్యాప్రవీణ" "ఉభయభాషాప్రవీణ"
    శ్రీ ఓలేటి సుబ్బారాయశాస్త్రి గారు
11. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, (బి. ఏ. బి. ఎల్.)

# విషయసూచిక

హరిహరదేవాయ నమః

# సంక్రాంతి సంరంభము

## శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

సీ. బంతిపూదండల ద్వారాల సోగణ
గండ్లపై తోరణా ల్గట్టువారు
పెనుభోగిమంటకై పెద్దదుంగల దొంగి
లించి మూలల దాగురించువారు
క్రొత్తయల్లుని మెప్పుకోసమై వెలపెట్టి
మంచిబట్టలను గ్రయించువారు
కూతు నల్లుని దోడుకొనిరాగ వీలుకా
దాశౌచ మని యంగలార్చువారు

తే.గీ. భోగి బులిహోర, సంక్రాంతి బూరి, గారె
కనుమదినమున నని భావికార్యసరణి
బలుకువారలునై ముదంపడిరి జనులు
మకరసంక్రాంతి చేరువ మసలువేళ. 1

ఆ.వె. పేడ పచ్చమన్నుఁ బిసికి గోతుల మెత్తి
గోడ వెల్ల వైచి గుమ్మములకు
బసపు రాచి చుక్క లెసగ బెట్టిరి సతుల్
తరణి మకరరాశి కరుగు ననుచు. 2

శా. "తల్లీ! బిచ్చము వెట్టు మమ్మ!" యనుచుం
దండోపతండంబులై
వల్లెన్ బత్తనవీధి నర్థిజనముల్
వ్యాపించి త్రోపాడఁగా

పిల్లల్ తాలను ఉవ్వ వారిపయి వే
వేంచేసి భైక్ష్యంబులం
డల్లుల్ వెట్టిరి సంతతిన్ గదుముచున్
ధర్మంబు పాటించుచున్. 3

మ. మెలివెట్టెం గడు పెద్దకా పౌకఁడు దా
మీసాల, లోలోన న
క్కలివేయంగ నహంకృతుల్ వనితలం
గన్గొంచు వాల్గూపులన్
పలువుల్ ధాన్యము లిచ్చి గర్ణునిగ తన్
భావించుచున్ గంగిరె
ద్దుల నాడించెడువారి కింద్రుడును జం
ద్రుం డంచు వా రాడగన్. 4

ఉ. కట్టెదుటన్ వసించి సౌర
కాయను బుగ్గలు పూరటింపగా
బిట్టుగ నూదుచున్ తెలిచి
పేటిక మూతలఁ జేత మెల్లగా
నిట్టె యనన్ ఫణుల్ క్రుధ ర
హింపగ దోకల నిట్టనిల్చి వే
గొట్టె నరేంద్రునిం బడగ
గొబ్బున విచ్చుచు పూత్కరించుచున్. 5

మ. "పలుకే యక్షిణి! పల్కు కాళి! జగదం
బా! పల్కవే శాంభవీ!
పలుకే" యంచును గేకరించి డమరుం
బల్మారు వాయించుచున్

చలిలో వీక్షకులం దెల్లవాఱుతఱి స్వే
చ్ఛాచారియై వచ్చి సా
ఖిలినా డింతు లోసంగుపైన గొని తా
వేంచేసె దీవించుచున్. 6

ఆ. వె. "క్రొత్తకోక గట్టుకొన్న యమ్మా" యంచు
పెద్దకేక వెట్టె వృక్షమెక్కి
క్రింద గుడ్డ పఱచి కీచుబొంగురురావ
మెసరేగ గొమ్మదాసరయ్య. 7

సీ. దుర్గంధభరితమై తూటులుపడు పట్టు
పంచెను మోకాళ్ళపైకి గట్టి
అంచులు చినిగి వ్రేలాడు నీలపుచేల
మున గట్టిగా నడుమును బిగించి
పదలమ్ముసుద్దచే ఫాలమ్ముపై నుద
రమ్ముపై నూర్ధ్వపుండ్రములు దీర్చి
కేకిపింఛ మ్మొక కేల నాడించుచు
చిరుతల రెండవచేత మీటి

ఆ. వె. పాడుపాటలోని ప్రత్యక్షరమునకు
నొత్తు లిడుచు క్రార లుచ్చరించె
"క్రెంధు కుంఛినావు బ్రంధిఖానలో" యంచు
దివ్వె చుట్టు దిరిగి తిరిగి దాసు. 8

మ. జనతల్ పైసల బ్రాతగుడ్డలను హ
ర్షం బూని వర్షింప, గా
విని పెన్నేటిక బెట్టి మోయు తనయా
లిన్ వేగ రా బిల్చుచున్
తనపార్శ్వం బుదరమ్ము దండలును చిం
దన్ రక్తమున్ మల్లికా

జ్జను డే తెంచెను త్రాట బాదుకొను చా
రుప్పల్ నింగి బొంగారఁగన్. ౯

తే. గీ. బుగ్గపై హత్తుచురకత్తి భూరిరుధిర
ధార నుమిసెడురీతి లాక్షారస మిడు
నత్తికోతలవాని గన్నత్తి చూచి
గొల్లుమని యేడ్చి పాఱిరి పిల్లలెల్ల.

మ. రవణిల్లన్ మెడ వ్రేలుబిళ్ల నడిబా
టం గూలి డబ్బాటు క
న్గవ నెంతేనియు మోడ్చి కొట్టుకొనుచుం
గాంతామణుల్ జాలిమై
నవిరామమ్ముగ బోయ నీరమును హా!
హా! యంచు వే గొల్లు కై
తవమూర్ఛానటు డైన యర్ధి కిడి ర
ర్థం బన్నమున్ పుట్టముల్. 11

ఉ. "మా పోలిమేఱదిమ్మ యిదె,
మా పినతండ్రి క్రయించు మావి తో
టో పిదె, రాముకోవెల య
దో కుడివైపున-దాని చెంగటన్
మా పెదకాపుగారి భవ
న" మ్మని చెంగట నున్న భర్తకున్
జూపుచు నాగమించె నొక
సుందరి పండుగ కెడ్లబండిపై. 12

తే. గీ. విలువ యంతగ లేనట్టివలువ లొసగ
తనకు దా గన్నకొమరున కనుచు మిన్నుల
బుగ్గల నొక్కుకొని మూతి ముడుచుకొనియె
క్రొత్తవియ్యపురాలు దా కోపగించి. 13



# ఉత్తర రామాయణము

## (తిక్కన - కంకంటి పాపరాజు)

శ్రీ ఆర్. అనంతపద్మనాభరావు, బి. ఏ.

"శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విధేయ తిక్కననామధేయ ప్రణీతం బయిన యుత్తరరామాయణమును," విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాననిర్మాణ ప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతం బయిన శ్రీమదుత్తరరామాయణమును" నాంధ్రసాహిత్యమున విశిష్టస్థానము నాక్రమించుకొన్నవి. కవిత్రయమున శ్రేష్ఠుడయిన తిక్కనార్యుఁ డుత్తరరామాయణరచనాకాలమున కమ లోదాత్త మనీష నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునందుపారగుఁ డును కళావిదుఁడు నయినాఁడు. పాపరాజును శ్రీ మదనగోపాలలలిత కటాక్షమున విజ్ఞానవిభవవిజితసనందనుఁ డయినాడు. అప్పటికే విష్ణు మాయా విలాసయక్షగానకర్తయు నాయెను. కాన నిరువురును నుత్తర రామాయణకావ్యరచనాసమర్థులే యని జెప్పనొప్పును. అట్టిచో వారిరు వురు నాకావ్యరచనమున నెంతటిప్రతిభను జూపిరో పరిశీలించుటే యీ నా యుద్దిష్టవ్యాసంగము.

13వ శతాబ్దివాఁడగు తిక్కనామాత్యుఁడు - "ఏ నిన్ను మామ యనియెడు దానికిఁ దగ నిమ్ము భారతీకన్యక నాకీ నర్హుఁడ వగు దని" మనుమభూపాలునిచే నభ్యర్థితుఁడై యుత్తరరామాయణరచన గావించి యతని కంకిత మొసఁగెను. పాపరాజో - "ప్రబంధ మొనర్ప శ్రీరఘూ ద్వహుని చరిత్రమున్ దొరకె - వాసిగ నీకృతిరత్న మేమహా మహునకు సమర్పణసేయుదు నంచు నెమ్మది యోజనసేయుచున్న" పుడు తన యిష్టదైవ మగు మదనగోపాలుఁడు స్వప్నమున గాన్పించి తన కంకిత మొసఁగ వలసినదిగా కోరినాఁడు. "దుహితను భర్త నారయుజనున్ బలె యోజనసేయు" కవి యాస్వప్నవృత్తాంతమును తన సహశ్రోత

స్త్రైన పుష్పగిరి తిమ్మనాఖ్యకవిచంద్రునకు జెప్పి; "కిరీటికి శౌరి తోడై యునయట్టు లమ్మహాకవి సాహాయ్య మాచరింప' గృతినొనగ్పంగ బూని నాడు. ఆదికవి యగు నన్నపార్యునకు నారాయణభట్టువలె సీతనికి పుష్పగిరి తిమ్మన సాహాయ్యుం డాయెను.

తిక్కన యుత్తర రామాయణకావ్యరచనాకాలమునకు రంగ నాథరామాయణము ప్రశస్తి నొందియుండెను. కొందఱు తిక్కన తాత యగు భాస్కరునిరామాయణమున నుత్తరభాగముగా నీగ్రంథమును రచించె నని భావింతురు. ఎట్లు తలంచినను పూర్వరామాయణ మా కాలమునకు ప్రశస్తి నొందియుండె ననుట నిర్వివాదాంశము. తిరిగి, పూర్వరామాయణరచనకు తిక్కన యుద్యుక్తుండు గాలేదు. "ఎత్తఱి నైనను ధీరోదాత్తనృపోత్తముండు రామధరణీపతిసద్వృత్తమసంభావ్య మగుట నుత్తరరామాయణోక్తి యుక్తుండ నయితిన్ అని తనతలపును పొందుపఱచినాండు. మఱి పాపరాజేల యుత్తరరామాయణము తిరిగి రచింపం బూనుకొనె ననుట నాలోచింపవలయును.- తిక్కన నిర్వచనముగా రచించిన యుత్తరరామాయణమున కంతప్రశస్తి రాలేదు. తరువాతికాలమున కవులు ప్రజలు దాని నాదరింపలేదు. తిక్కనయుం దన తొలికావ్యమునుగూర్చి మహాభారతాంధ్రీకరణ సమయమున ప్రస్తావింపలేదు. అందులకు గారణమగు నాతనిదృష్టిలో నంత ప్రముఖరచనముగా దోపకుండుటయే. అయినను కవిత్వదృష్టితోం జూచినపుడును, భారతరచనముతోం బోల్చినపుడును, తిక్కనగావించిన యీ మహోత్తరకావ్యమునకు వన్నె తగ్గదు. ఈ పరిస్థితిలో 18వ శతాబ్ది వాం డగు కంకంటి పాపరాజు తిక్కనరచనను జూచి దాని కింకను మెఱుగుపెట్టి ప్రబంధముగా నొనరించి యుత్తరరామాయణమునకు ప్రశస్తిని గొనిరావలయు నని యత్నించి సఫలీకృతుం డాయెను. కావుననే యువతారికలో-

వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యంబై తగం జేసె ను
త్తరరామాయణ మందునన్ మఱి ప్రబంధం బూని నిర్మించుచే
సరసత్వం బని ప్రాజ్ఞులార నిరసించంబోకుడీ! రాఘువే
శ్వరు చారిత్రము లెంద ఱెన్ని గతులన్ వర్ణించినం గ్రాలదే!-
యని సమాధానము జెప్పినాఁడు.

ఉత్తర రామాయణరచనాకాలమునకు "నిర్వచనముగా గావ్యము రచించుట యార్యుల రొప్పిద"మని తిక్కన తలఁచియుండెను కాని భారతాంధ్రీకరణసమయమున కాభ్రమ సరిగా దని తెలిసినది. అందులకు ముఖ్యకారణము తన రామాయణము ప్రజాదరణ మొంద కుండుటయే యయి యుండనోపును. కావుననే భారతాంధ్రీకరణమున్న "పద్యములన్ గద్యములన్ రచియించెదన్ కృతుల్ అని పేర్కొని నాఁడు. అది తిక్కన తనప్రథమకావ్యమగుటచే గాఁబోలు దానిని సంపూర్ణముగా తీర్చిదిద్దవలసినభారము కంకంటి పాపరాజు వహింప వలసివచ్చెను.

తిక్కన తన యుత్తరరామాయణమున ప్రబంధలక్షణములను జూపినా డనియు, ఉత్తర రామాయణమును ప్రభంధముగా బరిగణింప వచ్చు ననియు, మద్గురువర్యులు శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామ శర్మగారు నెల్లూరు మండలసర్వస్వమునందలి తమవ్యాసమున నిరూ సించిరి. అట్టిచో నిక పాపరాజు గావించిన గొప్ప యేమి యను ప్రశ్న ముదయింపక పోదుకాని, పాపరాజునకు తిక్కనపై గల యాదరాభి మానములచేతను, నుత్తర రామాయణమున కింకను బ్రశస్తి జేకూర్చుటకును తనకావ్యకళారీతులను వెల్లడించుటకును తిరిగియుత్తర రామాయణగాధను గ్రహించియుండును.

రెండుకావ్యములను బరిశీలించినచో ముఖ్యముగా గనిపించు నది గ్రంథవిస్తారము. తిక్కన— పది యాశ్వాసములలో— 1280 పద్య

ములలో కావ్యనిర్మాణము గావింపగా; పాపరా జెనిమిది యాశ్వాసములలో-3130- పద్యములను రచించినాడు. పాపరాజు గావించిన గ్రంథవిస్తారమునకు పూర్వరామాయణగాథ తార్కాణ. తిక్కన పూర్వరామాయణగాథను 22- పద్యములలో సంగ్రహముగా జెప్పగా పాపరాజు- 63- పద్యములలో పూర్వగాథను విస్తరించెను. తిక్కన శైలి లలితము గాగ పాపరాజు ప్రౌఢశైలిని కవనము గావించెను. తిక్కన ద్రాక్షాపాకమున రచింపగా, పాపరాజు నారికేళ పాకము నభిమానించెను. తిక్కనకు సంక్షిప్తతమక్కువ యెక్కువ. ఆయన పదములను తూచి తూచి ప్రయోగించును. కావుననే యాయన కొలఁదిపద్యములలో గొప్పభావమును వ్యక్తీకరింప గలిగెను. అట్లని పాపరాజు కృతిని లఘూకరింప యత్నించుట లేదు. ఒకటి రెండు ఘట్టములను పరిశీలించి యిరువురి కావ్యకళా వైదుష్యమును బరిశీలింతము :—

వేదవతినిఁ జూచి రావణుఁడు సంభాషించు ఘట్టము.

శంభునిచే సంభావితుఁ డయిన రావణుఁడు హిమవంతమున కేగి యొకచో నేకాంతమున గిరికన్యవలె తపంబుననున్న తపసికన్నె నొక్కతె జూచినాఁడు. చూచి కామాయత్తచిత్తుఁడై యాకన్యను బలుకరించినాఁడు ఆనెలతయు నాపలుకులు తా వినియుఁ విననియదియు బోలె, నుచితవిధి నాతిథ్య మొసఁగినది. తాను హరిని బడయఁగా దప మొనరించుచుంట నని తనవృత్తాంతము నెఱిగించినది. ఇట- తిక్కన రావణునిచే- "యొఱఁగవుగాక భోగములకెల్లను నెచ్చెలి జవ్వనంబ యిత్తఱి ననిపింపగా, పాపరాజు- తపించె దూగకే కన్నెఱికంబు కాఱడవి గాచిన వెన్నెలజేసి యయ్యయో"- యనిపించి మఱికొంతకు" హరియన్నామము గప్పకున్ చెరయు నేల యీవృథాభ్రాంతి- యని పలికించెను. వేదవతి యాదుష్టుని ప్రవర్తనకుఁ గినిసి- "విశ్రవసుం

పలంచుకొని యాతిథ్యంబు గావించి మాగ్ఫలుకుల్ పల్కిన నింతయు గలిగె నన్నది. ఈఘట్టమున నిరువురును జక్కని పాత్రపోషణ గావించిరి.

రావణుఁడు వరుణునిపై దండెత్తి పోయి తిరిగి లంకకు బయనమై పుష్పకమున వచ్చుచు, లోకములోని స్త్రీలనెల్ల చెఱలువట్టె నని తిక్కన పేర్కొనెను. పాపరాజు మఱికొంతదూరము పోయి దివ్య విమానమున వచ్చురావణుఁడు-ఎలప్రాయంబుల్ చెల్వముల్ చతురతల్ హేలావిశేషంబులుం గల కన్యామణు లెవ్వరొకో-యని ప్రశ్నింపగా మహాపార్శ్వప్రహస్తాది మూర్ఖులారక్షోనాథున కిట్లు వివరించిరంట ముదిమి యెన్నఁడు లేని కొదమ ప్రాయపు చెల్వ నేర్పులు వేల్పుగన్నియల కమరు సొలుపుల జూపుల తళ్కుఁ జెక్క లొయ్యారముల్ మనుజకన్యల కమరు మఱియు దక్కిన జాతులమందయాన లొఱపులువహించి యుందురొక్కొక్కవగల వీరిలో మెచ్చువచ్చినవారి బట్టి తేవలయు నన్న నింద్రజి త్తెత్తుననుచు నాఁరావణుఁడు పలికెనని వర్ణించినాఁడు. ఇవి పాపరాజు గావించినయూహ!



## రంభారావణ సంవాదఘట్టము

కైలాసోద్యానమున విహరించు రావణుఁడు “నును వాల్చూపుల బెళ్కు నెమ్మొగమునందు దెల్లమౌ తెల్వి గుల్కునడల్ సఖీహితోక్తుల పరాకున్ మిఱు నొక్కనిపై మేల్వాడి నేగురంభను జూచి “త్రోవకు నడ్డమయి నిలిచి తొయ్యలి కేల్గవఁ బట్టి నిల్వ” నేవేవో వదరినాఁడు. “తగదయ్యా దశకంఠ! వంశగుణ-విద్యాశ్రీలఁబోకార్చుచేత గదయ్యా యిది తాల్మినన్ విడిచి పెద్దల్ చన్నత్రోవన్ మెలంగి గురుత్వంబు వహింపవయ్యా!” యని ప్రార్థించినది. ఉన్మత్తుఁడయిన రావణుఁ డామాటలు పెడచెవిబెట్టి బలిమిమై కానిపనులు కావించినాఁడు.

ఈఘట్టమున తిక్కన చూపిన కౌశల్యము రసౌచిత్యము గుర్తింప దగియున్నవి. రావణుని మాటలకు రోసిన రంభపల్కులు జూడుడు :— "నేను లంజియుం గావుడు వానితోడి, తమకం బది లంజియు గాదు"— అనమోడక విరస వచనములు పలికినది. ఆతఁడు వినియుసు వినని చెవులు సేసి యున్మత్తునిగతి లావు వెరవును మెఱయఁగా ననంగ క్రీడాసంగతి నెంగిలిగావించి, కారించి విడిచినాఁడు. పాపరాజీ ఘట్టమున కొంతరసౌచిత్యమును బాటింపలే దనియే పలువురు భావింతురు. రావణుఁ "డా బాలను కేలువట్టి చెంగల్వపాన్పు చేర గొనిపోయి కఠినరతుల నలంచినాఁడట. ఈఘట్టమునసేగాక శృంగార వర్ణనలం దట నట పాపరాజు మితిమీరి వర్ణించెను. అది యాయన తప్పు గాదు. శృంగారలాలసతకు బుట్టినిల్లై "తాటాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడిన పాప మంచు" నని సిద్ధాంతీకరించిన, దక్షిణాంధ్ర వాఙ్మయప్రభావితుఁడగుటయే తప్పు. ఎట్లున్నను నాఘట్టమున, పాపరాజు రసౌచిత్యమును గోల్పోఁజేసెను.

ఈఘట్టముననే రంభ నలకూబరునికడ తనగోడు చెప్పుకొనునెడ తిక్కనను మీరి పాపరాజు వర్ణనగావించుట యుచితరీతి నుండుటయే కాక సముంజసము ననిపించును. రావణుఁడు గావించిన దుశ్చేష్టితమును జెప్పి— "మానమె పోకముందఱన్, దెగువకుఁ జొత్తు నన్నఁగువిధిన్ విధిచేసె నమర్త్యకాంతగాన్" అని వాపోవును. అటు చనిపోవుటకును, వారినుండి తప్పించుకొనుటకును వీలులేకపోవుటను పాపరాజు చక్కగా చిత్రించెను.

రాఁబోవు కథాపరిణామమునకుఁ బూర్వసన్ని వేశములను గావించిన సీతారాముల వనవిహార జలవిహారాదికము లగువర్ణనలను నిరు వురును సంపూర్ణముగఁ జిత్రించిరి. అది యెంతయు సముచితముగా నున్నది.

## రాముఁడు లక్ష్మణునివెంట సీత నడవికి బంపుఘట్టము.

లోకాపవాదమును వినిన శ్రీరాముఁడు సీత నడవులకుఁ బంప నిశ్చయించి, లక్ష్మణు నాకార్యమునకు నియోగించెను. మరుదినమున వారు బయలుదేరునపుడు రాముఁడు తన మనమున 'అడలడచికొని' అక్కడకు వచ్చినపుడు లక్ష్మణుఁడు "చిత్తమున ఖేద మంది, (అది) యానన మొందగా" సీత- అది చూచి వేఱొక విధమున భావించు నని తలఁచిన రాముఁడు—

"దూరమునాక ఘోరవన దుర్గతలంబుల గేలి సల్పఁగాఁ
గోరెదు భామలం బ్రియలఁ గోరినయట్టుల పుచ్చురాజులున్
ధారుణి నెందు గానమని తామును దీనికి నడ్డపెట్టి నే
బోరిత మాడి యిట్లు నినుబుచ్చుట కల్గినవాడు చూచితే"—

అని నెపము గప్పి మాటాడినా డని తిక్కన చిత్రించెను. ఇది రాముని ధీరోదాత్తతను వెల్లడించున దైనను, తన్ను నమ్మిన ధర్మపత్నిని మోసగించిన కపటచిత్తత యయినది. ఈఘట్టమున నీ యపవాదమునుండి రాముని తప్పించుటకై పాపరాజు యత్నించెను, ఆఘట్టమున రాముని ప్రవేశమునే జేయక, లక్ష్మణుని చిత్తవృత్తిని చక్కగాఁ జిత్రించి రసౌచిత్యమును, రామునిపాత్రకు విశిష్టతను జూర్చెను.

ఆ. వె. "ఏమి యెఱుఁగ దక్కట యీముగ్ధ
యనదజేసి యొంటినడవి ద్రోచి
యెటులవత్తు ననుచు నెడద దల్లడపడె
లలన యెఱుఁగకుండ లక్ష్మణుండు"

అని లక్ష్మణుని చిత్తవికారమును మాత్ర మెఱుకపఱచెను. ఇది సమంజసముగా నున్నది.

ఇట్లు ప్రతిఘట్టమునను తిక్కన రచనమును పాపరాజు రసోచితముగ ననుకరించియు, ననుసరించియు నెడనెడ నుచితానుచితము లనుగ్రహించి, పరిహరించియు, కొన్ని ఘట్టముల విస్తరించియు ప్రబంధమును జక్కగా ఘటించెను.

తిక్కన కథను విషాదాంతము గావించుటను మడి నొల్లక రాముఁడు, సీత భూమిం గ్రుంగినపిమ్మట నగరమునకు వచ్చి కుశలవులతోఁ సుఖముగాఁ గాలము గడిపె నని గ్రంథాంతము గావించినాఁడు. పాపరాజు ఆఘట్టము మిగుల నావశ్యక మను తలంపున రామనిర్యాణమును పరమపదవర్ణనమును గావించి యుత్తరరామాయణగాథను సంపూర్ణము గావించెను. విషాదాంత మగునను నెపము చక్కనిదిగా గాన్పింపదు. భాగతమున స్వర్గారోహణపర్వమువలె కరుణరసోత్పాదక మగు రామనిర్యాణ ఘట్టము కథాగమనమున ప్రముఖ మయినది. అట్టిదానిని పరిహరించుట యుచితముగాదు. కావుననే పాపరాజులోపమును పూరించెను. ఇట్లు తిక్కన, కంకంటి పాపరాజుల యుత్తరరామాయణకావ్యములను బరిశీలించినచోఁ-తిక్కన యుత్తర రామాయణము నాధారముగాఁ గొని పాపరాజు ప్రబంధోచితరీతిలోఁ ప్రౌఢ మగు వైదర్భీరీతిలోఁ ప్రబంధసృష్టిం జేసి యుత్తరరామాయణమునకును, తనకును విశిష్టఖ్యాతిని సంపాదించెను.

# పీష్వా బాజీరావు.

## శ్రీ మోచర్ల రామకృష్ణకవి

జితకాశి ప్రథఁ గాంచె బల్లిదుఁడు బాజీరావు- డిల్లీ మొగల్
పృతనాధీశుల గుండె గాలమయి నర్తించెన్- మహారాష్ట్ర భూ
పతి సామ్రాజ్యము పెంపు సేయఁ గలిగెన్- బుందేల్మహీఖండ
విస్తృతిలోఁ మూఁడవపాలు గైకొనియెఁ దత్పృథ్వీశు సఖ్యమ్మునన్. 1
అలహాబాదు మొగల్ నబాబు తనపై నాటోపముం జూప, నం
చెలుగా సేనలఁ దీర్చినం బిలిచె బాజీరాయనిం దోడు బుం
దెలఖండేశుఁడు ఛత్రసాలుఁ, డనురక్తిన్ వాహినీయుక్తుఁడై
చెలికాఁడై చని ఛత్రసాలు నల బాజీరావు గెల్పించెఁ దాన్. 2

తన కీ తెఱఁగున విజయము నొనఁగూర్చిన వాని కొసఁగె నలువాగాఁగ్ర
న్నను బ్రాగుక్తము స్వీయావనిభాగము ఛత్రసాల వసుధేశ్వరుఁడున్ తె
ఇంతే కా దల ఛత్రసాల విపులాధీశుండు ప్రేమస్ఫుట
స్వాంతన్ స్వీయమహమ్మదీయవనితాజాతన్ సుతన్ గన్నియన్
గాంతారత్నము నిచ్చె బాజికి నుపగ్రాహ్యమ్ముగా నాతఁ డెం
తెంతో వేడుకతోడ నాగమణితో నేగెన్ స్వదేశానకున్. 4

ఆయొయారి నామధేయము మస్తాని గాని మార్పునందె దాని పేరు–
బాజీరావు రాణివాసమై యెసఁగి యాకుందరదన 'మంజుఘోష'
యయ్యె. 5

మింటిమీఁదఁ దళుక్కున మెఱసిపోక
యలరు సౌదామనీవల్లి యనఁగ నవని
మీఱు నా మించుఁబోణి శరీరయష్టి-
పోల రాపెను వేలుపుంబొలఁతు లైన. 6

చందమామలోని చల్లఁదనంబును
సారసములలోని సౌరభంబుఁ
దీసి వడియఁగట్టి పోసి చేసెనో ధాత
యనఁగ నింపులీను నామెమోము. 7

ఆ మనోజ్ఞవదన యందంబుతో వియ్య
మందఁగలిగె మాటపొందికయును
జూడఁ జూడ మాటలాడఁగాఁ జవు లూరఁ
జేయు నామెపల్కు సోయగంబు. 8

కోమలము లగు మావిచిగుళ్ళు మేసి,
కొసరి కో యని కూయుపుంస్కోకిలమ్ము
లామె గొం తెత్తినంతనే యంబరమున,
కెగిరి పోవును సిగ్గుతో మొగము వంచి. 9

వేణు వూదఁగలదు, వీణియ వాయింపఁ
గలదు, నాట్య మాడఁగలదు కలికి,
భరతశాస్త్ర గానసరణియందుఁ బ్రవీణ,
మేటి యా 'గవాయి' పాటలోన. 10

అట్టిది మంజుఘోష, తన కబ్బెను, దానొ శుభాంగలక్ష్మికిం
బుట్టిన యి ల్లనందగిన పూరుషమూర్తి, రసానుకూల మా
ఘట్టము సంఘటిల్లె, గృతికర్త సమర్థుఁ డొకండు గల్గుచో
ఎట్టి యహీనకావ్యము మహిస్థలిలో వెలయించునో కదా! 11

కల దాబాజీరాయని కెలదోఁట యొకండు. సకలవృక్షములకు సూ
నలతా జాతుల కయ్యది నిలయంబై నందనవని నెఱిఁ దలదన్నున్. 12

ఆ యుద్యానపు మధ్యభాగమున రమ్యంబైన హర్మ్యంబు, శి
ల్పాయత్త ప్రతిభావినిర్మిత మనల్పాలేఖ్యసౌందర్యశో
భాయుక్తిం దనరారు నొక్కటి; విసర్వాణుం డభిజ్ఞుండు బా
జీ యద్దానిని మంజుఘోష నెలవై చెల్వారఁ జేసెన్ వెసన్. 13

అవి మధుమాసపున్ దినము లబ్బుగపుం దమి గుబ్బతిల్లఁగా
చివురు మెఱుంగుపట్టునునుచీరను మేన ధరించి, యెంతయున్
నవకపుఁగాంతు లీను సుమనస్తతి వేనలిఁ గీలుకొల్పి, త
త్సువిహిత మైన సౌరభముతో వనలక్ష్మి తనర్చె నత్తఱిన్. 14

పూవుఁదేనెలఁ గడుపారఁ ద్రావి త్రావి
సోగు లై బంభరములు జుంజు మ్మటంచు
లతల విహరించెఁ గాకలీరుతము లలరఁ
బలికెఁ జిలుకలు గోరువంకలు చెలంగె. 15

సంభావ్యచైత్రరథ శుభసంభారము నాను రంభసవురున, లీలా
సంభృతజీవిత మిా సంరంభముతో మంజుఘోష ప్రారంభించెన్. 16

సోఁకు ప్రణయవనధి నడిరేయి కడచినదనుక మునిఁగి తేలి, దరికిఁ జేరి, కూర్కి, రమణు మేలుకొల్పును బ్రత్యూషముననె మురళిగానమున నెలంత. 17

హంసము నెక్కి యేగు దయితుని వెనువెంట
నొక్క కత్తలాని నెక్కి తాను
పురుషవేష మూని పోయివచ్చు వయాళి
యామడలకొలంది యామవెలంది. 18

వచ్చి పన్నీటఁ దోఁగి, యాప్యాయమంది,
కట్టి తోడి పూసి రుచులీను బొట్టు లూని,
మిసిమిచిఱుదిండ్లు దిని, ఫలరసము లాని,
యరుగుదురు వారు మందిరోద్యానమునకు. 19

ఫలసంపత్కదళీతతుల్ గల వనద్వారంబునం జిల్కబా
రులకల్యాణపుఁ బచ్చతోరణముతీరున్ సారె వీక్షించి, రం
జిలుచున్ బూఁబొదరిండ్ల కేగుదురు బాజీమంజుఘోషల్ లతా
లలితాంగుల్ గుసుమాక్షతల్ జివురుఁగేళ్ళన్ గొల్లఁగాఁ జల్లఁగన్ 20
పుష్పాడిబాటలన్ నడచి పోదురు వారు మరందవాహినుల్
గుప్పున దాటుచున్ మధురకూజితముల్ విని సొక్కి సోలుచున్
గుప్పున గూరగా నుడుతకోఁజలగంట్లకుఁ జుట్టుప్రక్కలన్
చప్పిలు నారికేళజలశీకరపాళులఁ దొప్పదోఁగుచున్. 21

వ॥ ఒక్కనాఁ డీచందంబున మందయానంబునఁ బ్రమదావనంబునఁ
బ్రవర్తిల్లునెడ. 22

ముందు మిగిలె విభుఁడు, పూలుగోయుచు మంజు
ఘోష నిలిచె నొక నికుంజమునకు
నికటమందు భ్రమర మొకటి తన్ముఖసరో
జమ్ముఁ గ్రమ్మెఁ బరిమళమ్ముఁ గోరి. 23

వెంట లే దిదేమి వెలది యంచుఁ బ్రియుండు
తిరిగి చూడ, బోటి తేఁటియగుడు
వదలిపోవఁ గేలు మెదలింప నది కల్వ
కంటి కన్నుఁదోయిఁ గవియవచ్చె. 24

చిదిమినపూలు పయ్యెదపసిండి చెఱంగున సంగ్రహించి, యు
య్యాల తన డాకయిన్ హోయలు హత్త వహించి, దృగంచలంబులన్
బోదివిన చంచరీక ముడిపోఁ గుడికై పువుతో విదిల్చినన్
గుదికొనె నానెలంత కనుగొల్కులయందుఁ బరాగపాంసువుల్ 25

అరసి సంభ్రమించి యురుదెంచి చెంతకుఁ
జేర్చుకొని కపోలసీమ నిమిరి
బుజ్జగించు వల్లభుని సల్లలితబాహు
పంజరమున వ్రాలె మంజుఘోష. 26

అంగుళులన్ మనోరమను డంగన తొంగలిఱెప్ప చెక్కి క
న్నుంగవ రాలినట్టి సుమనోరజమున్ వదనానిలమ్ముచే
తం గడవెళ్ళఁజేసినను దన్వి పరాగపులేశ మున్న దం
చుం గనిపట్టుఁ జూడుఁ డనుచుం బొడిచెన్ బ్రియుఁ డానురమ్మునన్

ప్రబల వక్షోరుహప్రహారముల శిక్ష
ననుభవించినవాఁ డని కనికరించి,
ప్రేయసుని కేలు వట్టి కొంపోయి యొకర
సాలతరుశాఖ వ్రేలునుయ్యాల నుంచి 28

కమలనయన వసంతరాగమున నొక్క
పాట పల్లవితో నూఁచెఁ బ్రాణవిభుని
స్థాణువులు పల్లవింప వృక్షముల యాల
వాలముల చంద్రకాంత రత్నాలు కరఁగ. 29

ఆనందంబున వార లీసరణి డోలాందోళనక్రీడలో
మేనుల్ మానసముల్ విలీన మయి సోమింపఁ వినోదించి, లీ
లానీకాశవిలాసముల్ వెలయఁ గేళాకూళిలో హాయిగా
స్నానాదుల్ పచరించి, సౌధ మనువొందం జేరి విశ్రాంతులై. ౩౦

బహువిధవ్యంజనాంచితభక్ష్యభోజ్య
ములు సుధాసమపానీయములును దనరు
భోజనమ్ము లొనర్చి యప్పురుషవరుఁడు
గాంతయును గేళిమందిరాభ్యంతరమున. 31

కమనీయభావ మొక్కటి వల్లభుం డీయ,
మధురపద్యము వ్రాయు మంజుఘోష,
ప్రేయసి యర్థ మర్థించిన వ్యాసఘ
ట్టం బొందు ప్రియుఁడు స్పష్టం బొనర్ప
సకుఁ డొక సన్నివేశంబు వర్ణింప నా
దృశ్యంబు లలన చిత్రించి యిచ్చుఁ
బ్రాణేశుఁ డొక యంగహారంబు పేర్కొన
నంగన యానాట్యభంగి చూపు.

మగువ యొకగ్రంథముం గొని మంచిపట్టు
వెదకి ప్రత్యక్షశయ్యలోఁ జదువ, సమ్మ
దమున వినిపించుఁ గావ్యఘట్టములు విభుఁడు
సతికిఁ బాంచాల బాహాట శయ్యలందు. ౩2

కాల మిట్లు వారు గడుపుచుండఁగ నొక్క
వాసరమున దెల్లవాఱువేళ
సేవకుం డొకండు చేరవచ్చె నమంద
గమనమూని తన్నికాయ్యమునకు. ౩౩

మొగ సాలలేచి, బాజీయగపాటు లభింప నతని యంతికమునకున్
దగ నడకువమైఁ జని, కరయుగము న్ముకుళించి నేరు ఫుల్లసిలంగఁగా. 34

అరగడియసేపు మాటాడి యరుగుమయ్య
యనుచు సెలవిచ్చి పంపినా గమ్మగారు
దేవరా! యాజ్ఞ పాలించితిని, మనస్క-
రించి మీరిచ్చునాన ధరింతుఁ దలను, 35

అని పలికినవిని బాజీ
'చని విన్నప మాచరింపు జనయిత్రికిఁ గ్రొ
న్నన వచ్చెద నిదే యనఁ గై
కొని సెలవుఁగా వీడె సేవకుఁడు మందిరమున్. 36

పిమ్మట బాజీరాయుం
డమ్మ గృహంబునకుఁ బోయి యామె పదాంభో
జమ్ములకు మ్రొక్కి వినయభ
యమ్ములు భక్తియును భావమం దనువారన్. 37

'ఏమి సెలవు తల్లి! సేమమే కద నీకుఁ?
వచ్చినాఁడ నీదు పనుపు సేయ
ననుచుఁ గుశలమడిగి యమ్మ రాధాబాయి
యనుఁగు సుతునితోడ ననియె నిట్లు. 38

'వృద్ధురాలనైతి నింక నేఁ బెక్కేండ్లు నిలువబోను ధారుణీతలమునఁ
బుణ్యతీర్థములకుఁ బోయి సేవించుకోవలయునన్న తలఁపు గలిగె నాకు. 39

నాయీకోరిక తెలియంజేయ న్నిను బిలువనంపి చెప్పితినోయీ
నాయన! నీమదికెక్కిన చాయఁగ గర్తవ్యమీవు జరుపంబోలున్. 40

నావిని తనయుఁడు 'తల్లీ! నీ వాంఛాపూర్తి నేను నెఱవడఁ జేతుఁగా
పావనతీర్థములెల్లఁగా సేవింపంగలవు నీ వచిరకాలములోన్.' 41

అని వచించి జనని యనుమతిఁగొనిపోయి,
కులపురోహితులను బిలువఁ బనిచి,
తీర్థయాత్రకరుగ దివ్యముహూర్త మే
ర్పఱుపఁజేసె బాజి వారిచేత. 42

వలసిన వస్తుజాతములు వాటపు గొల్లెన బండ్లమీఁద, నొం
టెలపయి వేసడాలపయి నిండి బయల్వెడలెన్; భటావళుల్
గొలువుదు కొంద్రు వాహనములన్ శకటమ్ములనెక్కి ముందుగా
వెలిరి; పల్లకీలపయి వెల్వడి రింతులు తీర్థయాత్రికై. 43

ఉదయపురముఁ జేరి తదుపరి జయపురమరిగి మధుర కేగి యందు హరిని
గొలిచి యచటినుండి యలకురుక్షేత్రమ్ముఁజూచి యచోటునాపి సుసథ
మూని 44

పాపఘ్నమైన గంగాద్వీపవతిం దగ సరస్వతీకాళిందుల్
పాపఘ్నవవీచికలం జూపి కవుంగిట గదించు సంచుఁ గని తమిన్. 45
తనరఁ ద్రివేణీసంగమమున రాధాబాయి స్నానముం గావించెన్
జననము చరితార్థంబయ్యె నటంచు మదిందలంచి తృప్తింగనియెన్. 46
చేయుదు రాప్లావంబులు హాయిగఁ దైర్థికులు గతభవార్జితదురితా
ఘ్యాయసమాప్తిం గాంతురు, శ్రేయః పదముం గడింత్రు చేగ
ప్రయాగన్. 47

వారు ప్రయాగనుండి భవబంధవినాశికి వారణాసికిన్
జేరిరి ; జాహ్నవీరుచిరనిర్మలశర్మదవారిఁ దోగి, సం
సారమలంబువాసి, స్మరసంహరు శంకరు విశ్వనాథు దు
ర్గారమణున్ భజించుకుతుకమ్మునఁ గోవెలకేగి రెల్లరున్. 48
వందనుండు ముందునడువ రాధాబాయి నడచిపోయె విశ్వనాథుగుడికి
దేవదేవుఁజూడఁబోవుచో నెవరైనఁ బాదచారులగుటెకాదె తగవు! 49

దేవళము చుట్టు ముమ్మాఱుతిరిగి, లోని కరిగి, విధ్యుక్తరీతి రుద్రాభిషేక ములను గావించి యర్చించి పుణ్యహేతువులు మహేశ్వర నిర్మాల్య ములు ధరించి. 50

శివునిటు బాజీరాయుం డవిగళభక్తి ప్రపత్తులమర నుతించెన్
భువి నట్టివాని కీ భక్తివిశేషము విశ్వనాథు కృపఫల మేమో! 51
"గంగాతుంగతరంగసంఘరుచిరంగచ్చంద్రికాంచజ్జటా
శృంగారుండవె, యైన మేన గిరిపుత్రిం దాల్చియున్నావు; నె
య్యంగా శౌరిని జూచువాఁడ వటులయ్యున్ దత్సుతు న్మారు ద
గ్ధాంగుం జేయక పోవలేదుగద దేవా! కాశికావల్లభా! 52
కాశికావల్లభుఁడవైనఁగానిబుధులు తొడరికొల్చెడివిశ్వనాథుఁడవుగావె!
నీవు లేనిది పాలింపనిది సమస్తలోకములయందు లేదు పినాకపాణి. 53

హాలహాల మబ్ధిలోనుండి యవతరించినపుడు
గగ్గోలుపడిపాఱి రఖిల సురులు;
విషము కంఠాన దాచి యీవిశ్వమెల్లఁ
బ్రోవగలిగిన దేవుఁడవీవె స్వామి! 54

త్రైలోక్యపురారంభపు మూలస్తంభంబ వష్టమూర్తివి- మాముఁబోల్
బాలిశులకు నీ మర్మము నీలలియుం దెలియవచ్చునే విశ్వపతీ! 55

విశ్వమున కీశ్వరుండవు శాశ్వతుఁడవు
కలవు నీయందు బ్రహ్మాండములు శివుఁడవు
భువనమయుఁడవు నిస్సంగుఁడవు నిరంజ
నుఁడవు నిర్గుణుఁడవ కారణుఁడవు దేవ! 56

నేనెవండనొ తెలియంగ లేనివాఁడ,
నిన్ను నీ తత్త్వముంగూర్చి నేనునిర్ణ
యింపఁబూనుట నగుబాటె యేది యెట్టు
లుండినను నాకు విశ్వనాథుండె గురుఁడు. 57

అని నుతించి బాజి జననితో నన్నపూర్ణాలయమునకరిగి యామెపూజ పరఁగజరిపి, కాలభైరవాలయమున నర్చనాదికంబు లపురఁ జేసి. 58

పిత్రు దేవతలకు శ్రద్ధాన్వితుండై పిండప్రదాన విధులొనరిచి, స
న్మతి గయకుంజేరి యచటన్ వితతశ్రాద్ధాదికములు నిర్వర్తించెన్. 59

పొనగనిటు తీర్థయాత్ర సంపూర్తి చేసి
కొనె కృతార్థత చేకూర్చుకొన్న జనని
తోడ బాజీ మహామంత్రి వీడు సేరి
రాజకార్యములందు నిమగ్నుండయ్యె. 60

(సశేషము)

---

# "ఆంధ్ర శిల్ప కళామతల్లి అమరావతి అచ్చటి ఖననపరిశోధనలు"

శ్రీ ఇంగువ కార్తికేయశర్మ

ప్రథమభాగము :-

పవిత్ర మగుకృష్ణానది యెన్నియుగాలనుండియో తనతీరాన జీవించుచున్న మానవునికి చేయూత నిచ్చుచుప్రవహించు చున్నది. ఈ తీరమునంతను పురాతననగరము లెన్నో బౌద్ధపుణ్యక్షేత్రములు శిల్ప కళా కేంద్రములు షుమారు క్రీ॥ పూ॥ 3 వ శతాబ్దమునుండి క్రీ॥ శ 5వ శతాబ్దమువరకును నత్యంతవైభవోపేతముగ విరాజిల్లుచుండెడివి. స్వదేశీయులేకాక విదేశీయులుకూడ వాటిదర్శనభాగ్యమునకై యవిరామముగ వచ్చుచుండిరి. ఆవిదేశీయులలోని కొందరు విజ్ఞులు మన కెన్నియోవిషయముల తెలియబరచినారు. ఈవచ్చినవారిలో మెగాస్థనీసు (క్రీ॥ పూ॥ 300), ప్లినీ (క్రీ॥ శ॥ 77), టాలోమి క్రీ॥ శ॥ 140). హ్యూయన్ త్సాంగ్ (క్రీ॥ శ॥ 700), ఇట్సింగ్ మొదలగువారు గావించినరచనలద్వారా యాంధ్రదేశపుచరిత్ర దానివిశిష్టత చాలవరకు తెలియుచున్నది.

## 1. పాశ్చాత్యుల పరిశోధనలు :- వాటి పరిణామము

అటువంటి మహాక్షేత్రములలో గుంటూరుసమీపమున నున్న యమరావతి యత్యంతప్రాముఖ్యమైనది. ప్రస్తుత మీచారిత్రకశిథిలము లున్నగుట్టను "దీపాలదిన్నె" యని పిలుచుచున్నారు. 1797లో కలనల్ మెకంజీ యనుభూశాస్త్రవేత్త యిచ్చట స్థూపశిథిలములను కొన్నింటిని చూచుట తటస్థించెను. అప్పటికే యాప్రాంతపు జమీందారగు రాజా వాశిరెడ్డి వెంకటాద్రినాయు డనుమహాశయు డాప్రాంతమునంతను ఇటుకలనిమిత్తమై త్రవ్వకములను సాగించి, శిథిలములై యున్నకట్టడముల నన్నింటిని నాశనము గావించెను. దానిప్రాముఖ్యతను గుర్తించిన మ్యాకంజీదొర తిరిగి 1816లో పలువురు యూరోపియన్ శాస్త్రవేత్తల తోడుకొనివచ్చి ముక్కలై పోయిన యీశిల్పావశేషములను సాధ్యమగునంతవరకు చిత్రించుటయేకాక, కొన్నింటిని కలకత్తాలోని "బెంగాల్ ఏషియాటిక్ సొసైటీ" మ్యూజియమునకు తరలించివైచెను. ఆతర్వాత 1830, 1845, 1881, 1890 లలో పలువురు యూరోపియన్ విజ్ఞానవేత్త లనర్గళ మగుకృషి చేసి యీస్థూపము చుట్టుప్రక్కల ప్రాంతముల త్రవ్వకము గావించి షుమారు ఒక వేయికి పైగ శిల్పశిలాఖండాలను మన దేశములోని ముఖ్యమైన పురావస్తు భండాగారములకు, బ్రిటిష్, జెర్మనీ, పారిస్, అమెరికాలోని భండాగారములలోనికి పంపివైచిరి. ఒక్క "బ్రిటిష్ మ్యూజియం" లోనే దాదాపు 121 శిల్పాలను చూడవచ్చు. ఇవి "ఎలియట్ మార్బల్స్" అని పిలువబడుచు ప్రధమప్రాంగణములో చూడవచ్చినవారిని తన్మయులను చేయుచున్నవి. సర్వపండితులగౌరవమును చూరగొనుచు పూజింపబడుచున్నవి.

## 2. 1960 - 64 నాటి ఖననపరిశోధనలు

ఈవిధముగ స్థలము పలుమార్లు త్రవ్వబడి పూర్వశేషలు

పరించి శిల్పావశేషములను కొల్లపోయి చూడవచ్చినవారి కత్యంత విషాదకర దైన్యస్థలముగ కనుపించుచుండెను. శిల్పావశేషములను కొన్నింటిని మాత్రము ఒక రేకుల కుటీరములో పదిలపరచియుండిరి. ఇట్లుండగా 1958–1960 లలో నాగార్జునకొండ త్రవ్వకాలకు ప్రతినిధి యగు డాక్టరు రాలిప్రోలు సుబ్రహ్మణ్యంగారు అమరావతిని వక్కడి శిథిలావశేషము యున్నస్థలములను కడుజాగ్రత్తతో పునః పరిశీలించి యవసరమగు ముఖ్యస్థలములందు కొంత త్రవ్వకములుకూడ కావించిరి. (Indian Archaeology, 1958-59 Review, P. 5 PLS I and II). శిథిల స్తూపముయొక్క జేసిమట్టము నాధారముగ తీసికొని కొంతవరకు దానిని పూర్వాకృతికి కట్టించిరి (చూడుడు ఛాయాచిత్రము–1). వీరిత్రవ్వకమువల్లనే యీబౌద్ధస్తూపావశేషము లున్న ప్రదేశము చరిత్ర మరికొంతవిశదముగా తెలియవచ్చినది.

అట్లుతిరిగిపూర్వాకృతికికట్టుటచే, స్తూపముయొక్క పరిధి 168 అడుగులని రుజు వగుచున్నది. ప్రదక్షిణ పథము 11 అడుగులు వెడల్పు కలిగి విశాలమై యుండెడిది. అశోకుని శిలాస్తంభ శాసనమునకు సంబంధించిన ముక్కలు పునాదులలోను, చుట్టుపట్లను లభ్యమగుటచే దీనిని మొట్టమొదట క్రీ॥ పూ॥ 3 వ శతాబ్దమున కట్టియుందురని ధృఢపడుచున్నది. బహుశః అశోకచక్రవర్తియే కట్టియుండవచ్చునని పైవిజ్ఞాని యభిప్రాయము. శ్రీ సుబ్రహ్మణ్యంగారి పరిశోధనలలో బయల్పడిన 5–అమూల్యమగు స్వచ్ఛమైన రాతిస్ఫటికముచే తయారు చేయబడిన స్తూపాకారపు భరిణలు (చూడుడు ఛాయాచిత్రము – 2) అపూర్వములు. ఇవి తూర్పుదిక్కున నార్యకకంభము లుంచబడిన పటముక్రింది భాగమున పొడుగుపాటి చక్కనిరాతిలో 5–సమభాగములలో వరుసగా సమర్చిన గుంటలలో నిముడ్చబడి యుండెను. వానిపై యథాప్రకారము స్తూపకట్టడ ముండెడిది. మన యదృష్టవశాత్తు నివి 1876, 1881, 1890 లలో త్రవ్విన సివెల్ బర్గెస్ అలెగ్జాండర్ రీ

మొదలగు పురాతత్త్వవేత్తలకంట బడలేదు. వీనిలో (ఛాయాచిత్రము-2) మధ్యభాగమున నున్న భరిణిలో నొకచిన్న యెముక, బంగారు తాయత్తు బంగారుపుష్పములు, నుంచబడినవి. మిగిలినయన్నింటిలోను బంగారు పుష్పములు బూడిద విలువైనరత్నములు నున్నవి. ఇదివరలో పండితు లూహించినట్లు యీస్తూపము బుద్ధభగవానుని యస్తికల పైననే నిర్మింపబడినదని నిర్ణయ మైనది.

ఇవిగాక స్తూపపునాదుల క్రింద మఱియు సమముగా నున్న మట్టిపొరలలో నత్యంతశోభాయమాన మైన నల్లటి మృణ్మయ పాత్రల యవశేషములు చాల ముఖ్యమైనవి. ఇవి యుత్తరహిందూ దేశము లోని యతిప్రాచీన మైనట్టియు, బుద్ధుని కాలమునకు చెందిన పట్టణాలైన, పాటలీపుత్రము, రాజగృహము, హస్తినాపురము కౌశాంబినగరము, ఉజ్జయిని మొదలగు చోట్ల లభ్యమై క్రీ॥ పూ॥ 600-700 సంవత్సరములకు చెందియుండెను. వీనిని బట్టియు నశోకుని శిలాశాసనపు భాగమును బట్టియు స్తూపము చుట్టుప్రక్కల నున్న పట్టణశిథిలములు, నాకేకాలమునకు చెందినవని చెప్పనగును. ఇదివర కటి త్రవ్వకాలలో నీ యవశేషము లభ్యము కాలేదు. ఇవిగాక యింకను ముఖ్య మయినట్టివి రోమునగరములో వాడుక లో నున్న మృణ్మయపాత్రల యవశేషములు (Rouletted ware) రోమను చక్రవర్తుల నాణెములు క్రీ॥ శ 100-300 సంవత్సరము లకు చెందిన, (కాలము-2,) మట్టివరుసలలో దొరికినవి. కాలము -3 నకు సంబంధించిన యనగా 4వ శతాబ్దము నుండి 10వ శతాబ్దము వరకు వాడుక లో నున్న మృణ్మయపాత్రలు, (Celadon ware) తాంత్రికబుద్ధుల శిలాప్రతిమలు, మైత్రేయనాథుడు, హేరుకతార ఉగ్రతార మొదలగు మూర్తులు లభ్యమైనవి. ఈ విధముగ ఈ ప్రదేశము క్రీ॥ పూ 3వ శతాబ్దము నుండి 10వ శతాబ్దము వరకు నత్యంత ప్రాముఖ్యమయి

యుండి విదేశములతో కూడ నత్యంతసన్నిహితముగా నుండినట్లు, త్రవ్వకముల వలన కూడ రూఢి యైనది.

శ్రీ రావిప్రోలు సుబ్రహ్మణ్యముగారి పరిశోధనల ఫలితాలతో నుత్తేజితులై, తిరిగి 1962 లో భారతప్రభుత్వము శ్రీ వేంకటరామయ్య గారి యాధ్వర్యవమున ధాన్యకటకము ను త్రవ్వవలె నని నిశ్చయించెను. ఈ త్రవ్వకములు (Indian Archaeology A review, 1962–63 and 63–64.) శాతవాహనుల పట్టణ మని యెంచబడిన యెత్తైన కోటగోడల పైనను, కృష్ణానది గట్టున పడమటి భాగమునను నుద్దేశించి మొదలు పెట్టబడినవి. ఈ త్రవ్వకముల కారణముగా కోటయొక్క పడమటి భాగము నానుకొని దాని వెలుపల, కృష్ణకు చేరువనే యున్న యొక పెద్ద యోడరేవు, దానికి సంబంధించిన కట్టడములు, నావలను నదిలో నుండి రేవులోనికి తీసుకొనివచ్చు కాల్వమార్గములు బయల్పడినవి. ఈ కట్టడము లన్నియు నొక్కసారిగా చేయుబడ లేదు. షుమారు 6 దఫాలుగా వివిధసమయములలో నవసరముల కనుగుణముగ పూర్తి కావింపబడెను. మొట్టమొదటి నిర్మాణము క్రీ॥పూ॥ 2 వ శతాబ్దమునకు చెందినది. ఆతర్వాత యాఖరి శాతవాహనుల ఇక్ష్వాకుల కాలములలో పాత దానిని తిరిగి బాగుచేయించుటయే గాక యెత్తును పెంచుటకూడ జరిగెను. కోటగోడలకు వెలుపలి వైపు మట్టికంకరతో గట్టుపోయించుట యేగాక యవసరమగు చోట్ల నిటుకగోడలను కట్టిరి. దీనినిబట్టి చూడగా కృష్ణానది పలుమారు లుప్పతిలుగా పొంగి యీ యోడరేవును కోటగోడల ను ముఖ్యముగా పడమటివైపు నాశము కావించి నట్లు తెలియుచున్నది. వ్యాపారావసరములను బట్టియు పట్టణప్రాముఖ్యమును బట్టి పలుమార్లు తిరిగి బాగు చేయించవలసివచ్చెను. ఈ విధముగ నీరేవుపట్టణము క్రీ॥ శ॥ 500 సంవత్సరములవరకు విశేషముగ నుపయోగములో నున్నట్లు తెలియుచున్నది.

ఇదివరలో మనకు శాసనములద్వారా యాత్రికుల గ్రంథముల వలన అమరావతి నాగార్జునకొండల ఖ్యాతి యితరప్రాంతములతో వాని వాణిజ్యవ్యాపారసంబంధములు చూచాయగా మాత్రము తెలియుచుండెను. పై త్రవ్వకముల వలన బయల్పడిన యవశేషము లన్నింటిని బట్టి యీధాన్యకటకము రేవుపట్టణముగా శాసనములలో చెప్పినట్లు అంగవంగవైదేహచీనయవన సింహళదేశముల వర్తకము గావించుచుండె ననుట నిస్సంశయముగా తేలిపోయినది ఇక్కడనుండి యోడలు సరుకులనింపుకొని మచిలీపట్టణము వరకు (మైసోలియా) నదిలో ప్రయాణముచేసి యా తర్వాత బంగాళాఖాతము చేరుకొనెడివి.

1963 వసంవత్సరములో కూడ పై యధికారి కోటగోడల కీవల వైపు నుండిన పట్టణము లోని కట్టడవివరములను వాటికాలమును తెలిసికొనుటకై మఱికొన్ని చోట్ల త్రవ్వకములను కొనసాగించెను. ఇంకనుకొన్నికొన్ని చోట్ల త్రవ్వకములుజరుగుచున్నవి. ఈ త్రవ్వకముల లో రోమనుచక్రవర్తుల నాణెములు (ముఖ్యముగా చక్రవర్తులు అగస్టుసను హేడ్రియానసు ఫాస్టినా మొదలగువారివి) గాజుగ్లాసులు "ఆంఫోరా" యను నట్టి కూజాముక్కలు మొదలైనవి చాల ముఖ్యమైనవి. వీనినిబట్టి తర్వాతశాతవాహనేక్ష్వాకురాజులు రోము సామ్రాజ్యముతో యెంత సన్నిహితసంబంధము లుంచికొనిరో తెలియుచున్నది. రోమునగరము నుండి యోధులను రప్పించుకొని తమ ప్రాసాదములలో కావలిగా నుంచుకొన్నట్లు మనము శిల్పములద్వారా కూడ గ్రహింపనగును.

౩. అశోకుని శిలాస్తంభశాసనభాగము : దానిప్రాముఖ్యము

ఈమధ్యబయల్పడిన వానిలో నత్యంత ప్రాముఖ్యమైనది, చిత్ర పటము–1 లో చూపబడిన శాసనభాగము. ఇదివరలో అనగా 19వ శతాబ్దపు త్రవ్వకముల లో కూడ కొన్ని క్రీ॥పూ॥ 2వ శతాబ్దపు

బ్రాహ్మీలిపి కల రాతిముక్కలు దొరికియున్నవి. బర్గెస్ దొరగారు (Archaeological survey of India vol I, PL. LVI-No 4) వానిని గూర్చి వ్రాయుచు ముఖ్యముగ "ముడకతల" యనునొక సేనాని గావించిన శిలాశాసనమును గూర్చి చెప్పియున్నారు. ఆతర్వాత కూడ నీ మౌర్యకాలలిపికి సంబంధించిన శాసనపు ముక్కలు పలురకములు దొరకినవి. వానిని శ్రీరామేశ్వరప్రసాద్ చందా గారు (Epigraphia Indica vol XV PP. 258H). ప్రకటించిరి. వీటన్నిటి కన్న ప్రాచీన మైనది దక్షిణహిందూదేశ చరిత్రలోనే యత్యంత ప్రముఖస్థానమును సంపాదించుకొనబోవునది యీక్రింద విశదీకరింపబడుచున్న యశోకుని శిలాస్తంభశాసన భాగము. దీనిని శ్రీ దినేశచంద్రసర్కారుగారు "ఎపిగ్రాఫియా ఇండికాసంపుట -35 సంచిక 1 పుటలు 41-43 లలో వివరించి యున్నారు. శాసనము కల శిలాశేషము 10 అంగుళములపొడవు 17 అంగుళముల మోస్తుకలిగియుండి 7-వరుసల యక్షరముల గల్గి యున్నది. వరుసలు 6 7 లలో నక్షరములు పూర్తిగా శిథిలము లైనవి. ఈశాసన మశోకుని యితర శిలాస్తంభశాసనములవలె చూనార్ గనులలో చెక్కించి నునుపు చేయబడలేదు. ఇది మన యాంధ్రలో నల్లమల ప్రాగంభములో లభ్యమగు చదునైన "యినుకరాతి" తో చేయబడినవి. మౌర్యకాలమునాటి ప్రఖ్యాత మైన శిలాస్తంభము లన్నింటిపైన కల యత్యంతశోభాయమానమైన నునుపుదనము కాకపోయినను చక్కగనే నునుపు చేయబడి యున్నది.

ఈశాసనముల యొక్క లిపి అశోకునికాలపు బ్రాహ్మీభాష ప్రాకృతము. శాసనములోని యక్షరశైలి యశోకునిచే చెక్కించబడిన పడమట దక్షిణదేశములలోని రాతిశాసనములను బోలియున్నది.

ముఖ్యముగ "గీర్నారు" రాతిశాసనమునకు నతిసన్నిహితముగా నున్నది. ఇంకను పూర్తిగా మిగతభాగములు దొరికినచో సీశిలా స్తంభశాసనము దక్షిణహిందూదేశములో నశోకుని మొట్టమొదటి శిలాస్తంభముగా భావింపనగును.

ఇకశాసనమును వివరింతము. ఒక్కొక్కవరుసలోని పద ప్రయోగముల నితరాశోకశాసనములలోని మాటలతో పోల్చి చూతము.

వరుస 1 :- పరా(ర్), త అభి (స) - .పూర్తిగా "పరాక్త అభిసిత" యని యుండవచ్చును. మొదటిపదములో "త) యనుచోట "ర్త"గా వ్రాయబడినది. ఇదియశోకుని గీర్నారుశాసనములోకూడ కాననగును. కాని యశోకుని శాసనములలో "పరార్త" (పరలోక) మఱియు "అభిక్షిత" (కోరబడిన) ఈ రెండును నొకచోట కానరావు. (శ్రీ) సర్కారుగారు దీనినే "అభిక్షిక్త" యని తీసుకొనుచు నీరెండు పదములు నీవరుసలోనే కలిపిచదివినచో నర్థమిచ్చుటలేదని "పరత్)" యనునది యూపై వరుస కన్వయించి రెండవపదమును వేరుచేసెను. కాని పై విధముగ చదివినట్లయినకొంతయర్థవంతముగా నుండునేమో!

వరుస 2 :- ఖోలిఖితె [మ+] a - - పూర్తిగా "ఇదధం లిఖితె మె యని యుండవచ్చును. 'ఖో' యను నక్షరమునకు ముందున్న యక్షరభాగమును 'ధ' గా భావించినచో దానిముందు 'ఇ' యుండ వచ్చునని సర్కారు గారి యభిప్రాయము. అట్లే 'తె' తర్వాత, నురి యొక 'మె' యుండవచ్చు ననుట మరింత సమంజస మనిపించు చున్నది. పూర్తిగా "ఇధ ఖోలిఖితెమె" యనగా ఇహ ఖలులిఖితం మయా, (ఇది నాచే స్వయముగా లిఖింపబడినది). ఈవరుస నశోకుని శాసనము లకు మరింతదగ్గరగా యున్నది. 'ఖో' యనుపద మశోకుని శాసనము లలోనే వాడబడయున్నది. ఆతర్వాతప్రాకృతశాసనములలో నెచ్చటను

(సశేషము)

# ఆంధ్రీకరణసమస్యాపూరణములు

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక గతసంచికలో నొసంగబడిన శ్లోకము సమస్యయు—

శ్లో. రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత! యథాసుఖమ్.

సమస్య: శా. గిల్లెన్ సీతను రావణాసురుఁడు దా
గ్రేఁగంట నీక్షించుచున్.

కవుల యాంధ్రానువాద సమస్యాపూరణములు —

1. శ్రీ శిష్టా బాలకోటీశ్వరరావు

తే. గీ. దశరథునిబోలె రామచంద్రముని దలఁచి
మాపగిది జనకాత్మజ న్మానసించి
కాననమ్ము నయోధ్యగ గారవించి
పోయి రా నాయనా! సుఖమ్ములు ఘటిల్లు.

శా. చెల్లెన్ రాముని విక్రమారభటి ని
శ్శేషంబుగా నేఁడు మా
ర్చిల్లెన్ లక్ష్మణుఁ డస్మదీయపటుని
స్త్రింశమ్ముచే నొచ్చి భీ
తిల్లెన్ వానరయూథ మోయబల! యే
దీ దిక్కు నీకంచు రా
గిల్లెన్.................నీక్షించుచున్.

(రాగిల్లు=గర్వోక్తులుపలుకు (సూర్యరాయాంధ్ర నిఘంటువు)

2. శ్రీ బి. యస్. మూర్తి

తే. గీ. నీవు రాముని దశరథునిగఁ దలంచి
మాసరిగ మేదినీసుతన్ మానసించి
వని నయోధ్యగ మదిలోన ననుమతించి
యరుగుమా తండ్రి! సౌఖ్యమ్ము లందఁగలవు.

శా. అల్లంతన్ గని సీత కాంచనమయం
బౌ లేడి నర్థింపఁగా
విల్లమ్ముల్ కయిసేసి రాముఁ డరుగన్
వెన్ వెన్క సౌమిత్రి వో
నుల్లాఁస్యమ్మున నాకుటీరనికటం
బుద్వృత్తిమై డాసి రా
గిల్లెన్ ..............నీక్షించుచున్.

3. శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి

ఆ. వె. దశరథుబలె రాముఁ దలఁపుము మావలె
జనక రాజతనయఁ గనఁగదయ్య!
అడవియే యయోధ్యయంచు నెంచి యనుంగుఁ
బుత్త్రి! సౌఖ్య మెనయఁ బోయి రమ్ము.

శా. ముల్లోకమ్ములయందు జవ్వనులు, పూఁ
బోండ్లుం, జకోరాక్షులుఁ
ఫుల్లాబ్జాస్యలు లేరె? వారియెడలన్
మోహమ్ము వాటిల్లెనే?
యిల్లావణ్యవతీ తనూవిభవ మెం
దేఁ గంటిమే? యంచు రా
గిల్లెన్ ...................నీక్షించుచున్.

4. శ్రీ ఓరుగంటి రామచంద్రయ్య

క. కను రాముని దశరథుగా
కనుమా జనకజను నన్నుగాఁగ, నరణ్యం
బు నయోధ్యాపురిగా బొడ
గని పయనింపుము యథాసుఖమ్ముగ తండ్రీ!

శా. ఒల్లం బొమ్మను రాముపొందునకు ను
ద్యోగించి ముక్కుం జెవుల్
గొల్లంబోయెను చుప్పనాతి; ఖరము
ఖ్యుల్ మ్రందినా; రేమి సం
ధిల్లన్ లంకకు, జానకీశ్వర క్రుద్ధా
గ్నిన్ రాజిలంజేయ, రా
గిల్లెన్ .................. నీక్షించుచున్.

5. శ్రీ ఆర్. అనంతపద్మనాభరావు

తే. గీ. రాము నెదఁదలంపుము దశరథునివోలె,
జనకనందన నెంచుము జనని వోలె
నీయయోధ్యగ భావింపు మీ వడవిని
పోయిరావయ్య నాతండ్రి! మోదమునను.

శా. "ఉల్లంబందున భీతి గల్గెడిని, అ
య్యో! లక్ష్మణున్ పంపితిన్
చెల్లుంబో! యిక నాదు పాప మనుచున్
చింతించు భామామణిన్;
చెల్లెల్ జెప్పిన రూపసంపదలతోఁ
జెన్నొందగన్ గాంచి, రా
గిల్లెన్ ......................... నీక్షించుచున్.

6. శ్రీ వి. మల్లినాథశర్మ

తే. గీ. రాము సీతండ్రి దశరథరాజువోలె
భూమిజాతను నన్నుగా బోలెనెంచి
యాయరణ్య మయోధ్యగా నాత్మనెంచి
కదలి పొ మ్మిఁక నాతండ్రి! కడుసుఖముగ.

*7

ఆ. వె. దశరథునిగ రాముఁ దలఁపుము; మానవలె
జనకరాజతనయఁ గను; మయోధ్య
భాతిఁ గాననంబు భావింపుమా సుఖం
బుగను పోయి రార ముద్దుతండ్రి!

*8

తే. గీ. రాము దలపోయుమా దశరథునివలెను;
జనకతనుజను మావలె గను; మయోధ్య
భాతి నెంచుము గహనమున్; పరమసుఖము
దనర జనుమయ్య నాముద్దుతండ్రి! నీవు.

*9

క. తెలియుము రాముని దశరథు
బలె, మావలె జనకధరణీవల్లభతనయం
దలపు; మయోధ్యగ వనమును
దలపోయుము పోయిరమ్ము తండ్రీ! సుఖివై.

* అనుల్లిఖిత నామధేయు లగుముగ్గురినుండి మాకుచేరిన మనోహర
పద్యానువాదత్రయము.

10. శ్రీమతి యస్. హైమవతి

తే. గీ. రాఘవుని దలంపుము దశరథుని పగిది,
కనుము మావంటి దని యెంచి జనకతనయ,
నూహసేయుము వనము నయోధ్య యనుచు
వెడలిర మ్మింక కుశలివై కొడుకుగుఱ్ఱ!

శా. చల్లైక మంజుల శీతలాతపసుధల్
జాబిల్లి శోభిల్లి సం
ఫుల్లెన్ లాలితమల్లికావరిమళా

స్నీతమ్ము వాతమ్ము, రం
గిల్లెఁ మానుది కామితార్థదము లీ
శ్రీ లెంచు మీ వంచురా
గిల్లెన్ .............. నీక్షించుచున్.

11. శ్రీ కేగిళ్ళ సత్యనారాయణశర్మ

తే. గీ. రాముని తలంపుమీ దశరథునిగాను
జనకసుతను మావలె నెంచుకొనుము; ఘోర
గహనమును నీ వయోధ్యానగరము నట్లు
నెంచి పుత్రకా! సుఖమున నేగు మయ్య.

శా. ఉల్లాసంబున నగ్నిలోఁ బడుటకై, యుద్యుక్తకీటంబుబో
అల్లాడేమ్మాదయాన పంచవటి నేకాంతప్రదేశంబులో
ముల్లోకాలకు దల్లిజూచి మదిలో మోహంబు రేకెత్త రా
గిల్లెఁ సీతను.................. నీక్షించుచున్.



# వేమన విషయ మేమి

( శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు )

వేమనమహాకవి పేరును వినని తెలుగువ్యక్తి యుండడు. అతని పద్యములకు నంతటి జనత (పాప్యులారిటి) యున్నది. అయితే యమ్మహాకవి యెన్నిపద్యములను వ్రాసినాడు? ఎక్కడివాఁడు? ఎప్పటి వాడు? ఇత్యాదిసమస్య లున్నవి.

## గ్రంథ బాహుళ్యము

ఈ కాలములో నచ్చయిన వేమనగ్రంథములలో నయిదు వేల పద్యములు గలవి కనబడుచున్నవి. 1924 లో రాయవరపు పూర్ణయాచార్యు లచ్చువేసిన వేమనసూక్తిరత్నావళి యనుగ్రంథములో

4035 పద్యము లున్నవి. అంతకు పూర్వము 1824 లో సి. పి. బ్రౌన్ ద్వార తెలుగుదేశపు నాలుగుమూలలనుండియు వ్రాతప్రతులను బ్రోగు జేసి, రమారమి 2000 పద్యములను సేకరించెను.[1] వానిలో 693 టి నెంచి, యాంగ్లానువాదముతోఁగూడ 1829 లోఁ బ్రకటించెను. మిగిలి నవి వేమనవి కా వని సందేహించెనా? తంజావూరి సరస్వతీమహలులో నున్న తాటాకుప్రతులలో 500 కి మించిన పద్యము లున్నప్రతి లేదు. ఇట్లు వెనుకకు పోనుపోను వేమనపద్యసంఖ్య తగ్గుచున్నది. అనగా. మొదట కొంచెముగా నున్న వేమనపద్యములు కాలముగడచినను జాస్తి యైన పని స్థూలముగా నిర్ణయించవచ్చును. అట్లు వృద్ధియగుటకు కారణము లేమి? వేమన వ్రాసిన యాటవెలదిపద్యముల ననుక రించుట బహుసులభము. వాని లక్షణము, భాష కూడ అంత తేలిక. కాబట్టి యీ మాదిరి పద్యము లితరులచే సృష్టింపబడినవి.

వేమన నీతికవిగానె కాకుండ వేదాంతకవిగాకూడ పేరుపొందెను. అతని పేరిట నొకమతసంప్రదాయ మేర్పడినది. దాని ననుసరించినవారు కొందఱు వేమయ్యల మని పేరు పెట్టుకొన్నారు. గంజాయిదమ్ము బైరాగులు కావలసినంతమంది! వీ రందఱును వేమనకవిత్వమునకుఁ దమపైత్యమును బుమ్కలముగా చేర్చిరి.

వేమన యాటవెలదిలోఁ జెప్పినభావమును వేమయ్యలు, బైరా గులు మరియొకలక్షణములోనికి మార్చి చెప్పెడివారుకూడ- అనగా, కందము, తేటగీతి, వృత్తము మొదలైనవానిలోనికిగూడ పరివర్తన చేసెడివారు. ఇట్లు కాలము పోను పోను నెన్నియో రూపాంతరములు బయలుదేరినవి. అంతేకాక పామరులనోళ్ళలో బడి పద్యములకుఁ బాఠాంతరములు ముమ్మర మైనవి. ఆ రీతిగా వేమనపద్యములసంఖ్య వేలమీదికిఁ బెరిగిపోయినది.

---

1. సి. పి. బ్రౌన్- కొత్తపల్లి వీరభద్రరావుగారి గ్రంథం (1963) పుటలు 102,103.

## శతకము వంటి రచనలు

ఈ పట్టున శతకమువలె కనఁబడు నితరరచనలను గుఱించి కొంత ప్రస్తావించవలసియున్నది. సంస్కృతసంప్రదాయము నటుంచి తెలుగు పద్ధతిని చూచెదము.

శతకమువలె కనఁబడు నితరరచన లున్నవి. వానిలోని పద్యములకుఁగూడ నేదియో యొక మకుటముండును. అయితే మకుటము గ్రంథమంతట నొకేవిధముగా నుండవలె నను నియమము లేదు. ఈ రచనలలో నంతరశీర్షిక లుండును. గ్రంథములోని పద్యములసంఖ్య యొకపరిమితి యుండదు. ఇంకను మరికొన్నిలక్షణము లుండవచ్చును. వీని కీ క్రిందివి యుదాహరణలు.

పండితమల్లికార్జునుఁడు వ్రాసిన శివతత్త్వసారము శతకమా, కాదా యనుచర్చ యిదివఱ కుండినది. పాల్కురికి సోమనాథుఁ డా గ్రంథమునుగుఱించి 'శతకంబు, శివతత్త్వసార' మని చెప్పగా, చాల కాలముపాటు విమర్శకులు శతక మను మాట శివతత్త్వసారమునకు విశేషణముగా పరిగణించి, యా గ్రంథమును శతకమనిరి. కాని పండిత మల్లికార్జునుఁడు కన్నడములో నొకటి, తెలుగులో నొకటి '(శ్రీ)గిరి మల్లికార్జునా!' యను మకుటముతో శతకములను నిర్మించినాఁ డను విషయము వెలుగులోనికి రాగా, వెనుకటివాదన వ్యర్థమైపోయినది. అట్లు శివతత్త్వసారము శతకము కా దని రుజువయినది. ఇట్టిరచనలె మఱికొన్ని కలవు. పాల్కురికి సోమనాథుఁడు వ్రాసిన చతుర్వేదసారము చూచుటకు శతకమువలె కన్పడును. వానిలో 301 పద్యము లున్నవి. అంతరశీర్షిక లున్నవి. ఇట్టిది వేరురకపు పుస్తకము. అదే విధముగా యథావాక్కుల అన్నమయ్య వ్రాసిన సర్వేశ్వర స్తోత్రము కూడ దీనిలో అంతరశీర్షిక లుండగా శతకముల జాబితాలోనుండి బైట పడినది.[2] ఇట్టివి కొన్ని శతకములవలె గన్పడుగ్రంథములు. వీటి లక్ష

---

2. నిడదవోలు వెంకటరావుగారి తెనుగుకవుల చరిత్ర, పుట 376

ణాములను పైన జెప్పితిని. శతక మనుమాటకు విపరీతార్థము గల్పించి, వేలకొలదిపద్యము లున్నగ్రంథమునుగూడ శతక మనుట యర్థములేని మాట.

## వేమన శతకము

వేమన యెన్నిపద్యములను వ్రాసె ననునది యొక పెద్దప్రశ్నకదా!

విమర్శకులు వేమనను శతకకవిగానె నిర్ణయించినారు. నంగూరి సుబ్బారావుగారు, వేదము వెంకటకృష్ణశర్మగారు వేమనను శతక కవి గానె నిర్ణయించి, తమ కవులచరిత్రలలోని కెక్కించిరి. అంతకంటె ముఖ్యమైనవిషయ మేమనగా, ప్రాతతాళపత్రగ్రంథములఁ గొన్నిటి మీాద వేమనశతక మని మాత్రమె వ్రాసియున్నది, శతకమును వ్రాసిన వాఁడె శతకకవి. శతక మను పేరులోనె కలదు దాని పద్యసంఖ్య. మన పూర్వులెందఱో శతకములను సృష్టించిరి. వారిపుస్తకములలో ప్రతి దానిలోను పద్యసంఖ్య నూటి కటునిటుగానుండును. కాబట్టి శతక కవి యైనవేమన వ్రాసిన పద్యములుకూడ నూటికి నటునిటుగా నుండు నను విషయమును గ్రహింపవచ్చును. వేరొక లెక్క కుదురదు. అందుచేత వేమన నూఱుపద్యాలు గల శతకమునుమాత్రమె వ్రాసినాడని నిర్ణ యించవచ్చును. అదియే వేమనశతకము. కాబట్టి యతనిపేర చెప్ప బడెడి వేలాదిపద్యములకును, నతనికిని సంబంధము లేదు.

అయితే యతనిపేర చలామణి యగుచున్న వేలకొలది పద్య ములలో నతనిపద్యము లని గుర్తించుటకు సాధనములున్నవా యను ప్రశ్నను పరిశీలింతదము. వేమన పద్యాలను గుర్తించుటకు మొదటి సూత్ర మేమనగా, మనపరిశోధనను ప్రాతతాళపత్రసంపుటములకు పరి మితి చేసుకొనవలెను. దానితో నిటీవల సృష్టింపఁబడిన వేలాదిపద్య ములబాధ తొలగును. ఒకేపద్యము గీతము, కందము, వృత్తము

విశ్వాదిపద్యములలోనికి రూపాంతరములు చెందగా, మూలపద్య మిది యని గ్రహించి, దాని సత్యస్థితి పరిశీలింపవచ్చును.

ప్రతిశతకమునకు నొకమకుట ముండు నను విషయము మన మెఱిగినదె! ఆ మకుటము నా గ్రంథములో మారదు. వేమన తన శతకమునకుఁ బెట్టుకొన్న మకుటము 'విశ్వదాభిరామ వినుర వేమ' యనునది. కాబట్టి యీ మకుటము గలపద్యములలోమాత్రమె వేమనవి యున్నవని మనము నిష్కర్షగాఁ జెప్పుకొనవచ్చును. ఆ మకుటము లేని పద్యము లతనివి కావు. ఆ మకుట మాటవెలది పద్యచరణము కదా! అత డాటవెలదిపద్యములనుమాత్రమె రచించినాడు. కాని వేమయ్యలు, గంజాయిబైరాగులు నతనిపేరున నితరలక్షణములలోఁ పద్యాలను కూటసృష్టి చేసిరి.

విశ్వదాభిరామ వినుర వేమ యనుమకుటము గలపద్యములైనను నొకనూఱుగాక, కొన్నివే లున్నవి. కాబట్టి యీపద్యములలో వేమన వ్రాసినవి యని కనిపెట్టుటకు సూక్ష్మసాధన లేమైన నున్నవా? వేమన పద్యము లని యందఱ నోళ్ళలో నున్న పద్యములను నాలుగింటిని తీసుకొని, వాని సామాన్యలక్షణములను గమనింపవచ్చును.

ఆ. వె. [3] తామసించి చేయదగ దెట్టికార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనె! ॥విశ్వ॥

ఆ. వె. గొడ్డుటావు బితుకకుండ గొంపోయిన
పాల నీక దన్ను పండ్లు పడగ
లోభివాని నడుగ లాభంబు లేదురా! ॥ విశ్వ ॥

---

3. తామసించి యనుమాటకు కోపించి యను నర్థమును చెప్పుకొనుచున్నారు. కాని యది సరియైనదిగాఁ దోచదు. చిత్తూరుజిల్లాప్రాంతములో తామసించి యను మాట వాడుకలో నున్నది. దానికి నాలస్యము, జాగు దనిమాత్రమె యర్థాలు. ఆ యర్థమె యిక్కడ సరిపోవును.

ఆ.వె. అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచె మగుచు నుంట కొదువగాదు
కొండ యద్దమందు కొంచమై యుండదా? ॥ విశ్వ ॥

ఆ.వె. గంగిగోవుపాలు గంటెడైనను చాలు
కడివె డైననేమి ఖరముపాలు
భక్తితోడ గూడు పట్టెడైనను చాలు ॥ విశ్వ ॥

ప్రతిపద్యములోను ప్రత్యేకచరణము లేక చరణాలలో నొక యుపమాన ముండును. ఇట్లు వేమన వ్రాసిన పద్యాలకు మరింత సన్నిహిత మాయ్యెదము. అయితే వేమన వ్రాసిన ప్రతిపద్యములో నొక యుపమాన ముండు నని చెప్పలేము. అవి లేని పద్యములుకూడ నున్నవి. వానినికూడ వేమన పద్యములుగానె చెప్పుచున్నారు. మచ్చునకు

ఆ.వె. చెప్పులోనిరాయి, చెవిలోనిజోరీగ
కంటిలోని నలుసు, కాలిముల్లు
నింటిలోనిపోరు నింతింతకాదయా! ॥ విశ్వ ॥

ఆ.వె. చంపదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు ॥ విశ్వ ॥

ఆ.వె. తప్పు లెన్నువారు తండోపతండంబు
లుర్వి జనులయందు నుండు తప్పు
తప్పు లెన్నువారు తమతప్పు లెఱుగరు. ॥ విశ్వ ॥

ఆ.వె. పరగ రాతిగుండు పగలగొట్టగవచ్చు
కొండ లన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తుమనసు కరిగింపరాదయా! ॥ విశ్వ ॥

సుమతీశతకకర్త కూడ తన పద్యాలలో నెన్నియో యుపమలను చేర్చినాడు. కాని యుపమ లేని పద్యాలనుగూడ వ్రాసినాడు. అట్లే వేమన పద్యములలోఁగూడ నుపమానములులేనివి కలవు.

వేమన పద్యము లని గుర్తుపట్టుటకు మరికొన్ని యితరలక్షణములుకూడ గలవు. అతని పద్యములలోని భావము తేటగాను, భాష తేలికగాను నుండును. నడక కుంటువడదు. భావము చరణము లేక చరణములయొక్క సరిహద్దును దాటదు. అట్లె మాటలుకూడ చరణాంతముతో నంత మగును. అంతియెకాని రెండవచరణములోనికి ప్రాకవు. పదమధ్యమందు మరియొక చరణము మొదలుపెట్టదు. అనగా ప్రాకుడుచరణము (రన్ ఆన్ లైన్స్) లుండవు. వీని కెన్ని యుదాహరణములనైన నీయవచ్చును. చరణాంతములందు పెట్టిన గీట్లను గమనించుడు!—

ఆ. వె. ఆలు మగనిమాట కడ్డంబువచ్చిన
ఆలుకాదు, నుదుటివ్రాలుకాని
యట్టియాలు విడిచి యడవి నుండుట మేలు

ఆ. వె. నీళ్ళలోన మొసలి నిగిడి యేనుగ బట్టు
బైట కుక్కచేత భంగపడును
స్థానబలిమికాని తనబల్మి కాదయా

ఆ. వె. ఆడువారి గన్న నర్థంబు బాడగన్న
సార మైనరుచుల చవులు గన్న
అయ్యగారికైన నాశలుగలుగవా।

ఈ విధముగాఁ జెప్పబోయినచో నాతనిపద్యము లన్నియు నుదాహరణలే! దాని కెక్కడైనను మినహాయింపుకూడ కనబడవచ్చును.

అంతియె కాదు. వేమన యొక్కొక్కగణములో నొక్కొక్క మాట సరిపోవునట్లుకూడ చాలవఱకు కూర్చును. అన్నియు రెండేసి,

మూడేసి యక్షరములమాటలు తెలుగువికానిండు, సంస్కృతాసి కానిండు దీనికికూడ నతని ప్రతిపద్యము నొక యుదాహరణమె-

ఆ.వె. కులము గలుగు వారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగు వారు
పసిడి గల్గువాని బానిస కొడుకులు

ఆ.వె. కులము లో నొకండు గుణవంతు డుండిన
కులము వెలయు వాని గుణము చేత
వెలయు వనములోన మలయజం బున్నట్లు

అయితే మనకు వినుగుపుట్టించునంతగా నీ యేకరీతి (యూనిఫార్మిటి) యుండదు. కాబట్టి యక్కడక్కడ చిన్న చిన్న మార్పు లుండును. పైన నుదహరించిన వన్నియు వేమన రచితములే యని నిష్కర్షగా చెప్పలేము. వేమనపద్యలక్షణములను బాగుగా నెరిగిన వేమయ్యలు గంజాయి బైరాగులుకూడ ననుకరించవచ్చును. అది గుడ్డిగుఱ్ఱపు తాపు మాత్రమే. ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండునుకదా! ఇట్టి పరిశీలనవలన వేమనపద్యములను నూటికి దించవచ్చును.

వేమన పేరుతో నెన్నియో పద్యము లున్నవికదా! వాని మకుటములు వేరువేరుగా నుండును. వేమన, వేమా, దేవర వేమా, వేముడు, వేమనృపాలశేఖరా మొదలైనవి. అట్టివి యతనివి కావనియు నతని మతసాంప్రదాయికుల కూటసృష్టి యనియు స్పష్టము!

వేమనతాలూకు చాటుపద్యము లని వ్యవహరింపబడుచున్నవి కూడ నట్టివే. అవి శిష్యగణము ప్రసాదించినవి మాత్రమే!

సుమతీశతకకర్తవలె, వేమనకూడ నొక్కశతకమె వ్రాసినాడు. దానిఘనతవలన నాంధ్రవిశ్వవ్యాప్తి యైనది. మసిపాత్రలోని మాణిక్యములనువలె వేమనపద్యములను వెదకి వెలికి దీయవలసియున్నది. అవి నూఱుమణులు! (సశేషము)

శ్రీః

# చీనా దురాక్రమణము

[యక్షగానము]

శ్రీ దామెర రాజగోపాలరావు

క॥ శ్రీమన్నారాయణు హృ
త్సీమం గొలిచి, గణపతిని సేవించి, వచో
భామ న్నుతించి, సుకవులఁ
ప్రేమం దలఁచి, గురువుల స్మరించి ప్రవర్తిన్.

వ॥ అని కవీశ్వరుండు కృతీశ్వరుం డగుచు చిత్రాడపురవాసుని శ్రీ వేంకటేశ్వరస్వామిని నేమని కీర్తించుచున్నాఁడు.

స్తవన–

సాక్షాన్మదనకోటిసౌందర్యమూర్తి! అక్షయానంతశాంతామలకీర్తి!
జలధర కోమలశ్యామలగాత్ర! జలజారిజలజాప్త సంభృతనేత్ర!
అలఘుదయామృత కలితాంతరంగ! అలమేలుమంగా మనోజ్ఞసారంగ!
దుష్టశిక్షాదీక్ష! దురితవినాశ! శిష్టరక్షాదక్ష! శ్రీవేంకటేశ! ॥

వ॥ అని సన్నుతించి యాదేవదేవునకు షష్ఠ్యంతములు సెప్పినచొప్పెటువలెను.

అర్ధచంద్రికలు–

మనుకులఁ బ్రోచినమీనంబునకుం, కొండను మోచినకూర్మంబునకుం,
కుంభినిఁ దాల్చినక్రోడంబునకుం, కనక కశిపుఁ జీల్చిననరహరికిన్,
బలిని నడంచినవటుబాలునకున్, నృపతులఁ ద్రుంచినభృగురామునకు,
రావణుదునిమిన రఘురామునకున్, గీతాసుధ చిలికినకృష్ణునకుం,
ప్రేమ కరుణ కఱపినబుద్ధునకుం, గఱకుల నఱకిన కల్కినుతునకుం,
ప్రియుఁ డాసర్వుఁడు వేంకటపతికిన్ ॥

వ॥ సద్భక్తిసమర్పితంబుగా నా యొనర్పం బూనిన చీనాదురాక్రమణ మనుయక్షగానంబునకుఁ గథావిధానం బెట్టి దనిన.

ద్విపద—

శ్రీదేవదేవభాషితధర్మసీమ, వేదమంత్రపవిత్రనాదాభిరామ,
మునివరప్రాపితపుణ్యైకధాత్రి, ఘనతరచరిత, సకలదేశనేత్రి,
నీతినియమసంజనితయశోలాస్య, పూతగంగాద్యంబు పోషితసస్య,
నిరుపమసంస్కృతి నిరతవేశంబు, వరణీయరమణీయ భరతదేశంబు॥

వ॥ అటువంటి భరతదేశమునకుఁ బ్రధాని యగుజవహరలాలొక్క నాఁడు పేరోలగం బున్నవేళ వేగువారలు విచ్చేసి విన్నవించిరఁట యెటువలెను.

త్రిపుటతాళము—

పెద్దయెత్తున వచ్చి మనసరిహద్దుఁ గాచెడివారిఁ జీనా
యెద్దుమొద్దులు మట్టుపెట్టిరి, తద్దసామి! ॥

వ॥ అన విని ప్రధాని చీనానియంత యగుచౌయెన్లైకుఁ దక్షణంబ యాక్షేపంబు పంపి రఁట యెటువలెను.

రచ్చతాళము——

నీతిమాలినచేఁత లివి, యీరీతి నేటికిఁ జేసినారో?
ప్రీతితో మిముఁ జూతుము గదా! ఈతగవు నేఁ డేల మాతో?

వ॥ అంత దానికిఁ జీనానియంత సమాధాన మిచ్చెనఁట యెటువలెను.

ద్విపద—

మా సీమఁ జొరఁబాఱి మా వారి నొయ్య,
మీ సైనికులె చంపఁ జూచినా రయ్య!
ఆసమయమ్మున నాత్మరక్షణము
సేసికొన్నా రంతె మా సైనికు లట. ॥

వ॥ ఈప్రకారంబు మృషాభాషణంబుల, నిందారోపణంబుల, నుత్తర ప్రత్యుత్తరంబులు కొన్నినాళ్ళు వెళ్ళించి, బిట్టుబిల్లొక్కనాఁడు

చైనీయు లనంతసేనావాహినులతోఁ బవిత్రహిమాలయమ్ముల నతిక్రమించి, భారతభూభాగంబును దురాక్రమణం బొనరించి భారత ప్రభుత్వంబునకు నేమని వార్తనంపిరి.

గీ॥ ఆంగ్లసామ్రాజ్యవాదు లయ్యెదనునఁ దమ
యిచ్ఛవచ్చినక్రియ నిర్ణయించినారు,
రిత్తమేర 'మెక్మాహన' రేఖ యనుచు;
దాని నీకొన మెంతమాత్రంబు మేము.

వ॥ దానికి భారతప్రధాని సమాధాన మొసంగిరఁట యెటువలెను.

గీ॥ అది చరిత్రప్రసిద్ధ మైనట్టి హద్దు;
గౌరవించిరి దాని మీ వారుకూడ,
నెంతకాలమునుండియో యెలమితోడ;
నేఁడు కాదను టయ్యెది సాడి యగునె?

వ॥ అందులకుఁ జీనానియంత యేమనుచున్నాఁడు.

లఘుశేఖరము—

క్రొత్తహద్దు దిద్దుకొనుట యుత్తమంబు మీరు మేము;
ఇత్తగవున కొప్పుకొన్నఁ, బొత్తు కుదురు మీకు మాకు;
ఒప్పుకున్న నేఁడు పోరు తప్ప దింక; మంచి చెడుగుఁ
జెప్పి చూచినాము మేము; తప్పు లేదు మా యెడ మఱి॥

వ॥ అనవుడుఁ జీనాకు నెదురాడు తెగువ లేనిపిఱికిపందలును, నిది యదనుగాఁ గైకొని తమస్వార్థంబులు సాధింపఁ జూచుచున్న మొక్కలికాండ్రు, దక్కఁ దక్కుంగలశిష్టరాజ్యాధినేత లెల్లరును నేమనుచున్నారు.

సీ॥ అసమానవిజ్ఞానలసమానభారత
శ్రీ పెంపుసొంపు వీక్షింపలేక,
యల్ల జంబూద్వీపమం దెల్ల తమమాట
క్రిందయ్యెడు నటన్న కించచేత,

పనుదినము తమసీమ నెదుగుజనసంఖ్యా
గడ్డుసమస్యయై గాసిఁబెట్టు,
నెవ్వరితోడనో యెప్పుడు కలహించు
చుండెడి కడునడి బండ వాట,
గీ॥ శాంతికాముకులును, నహింసాప్రియులును,
బరమధార్మికులు, నవీనవగ్గరతులు,
నైన యలభారతీయులపైనఁ గత్తి
దూసినారు చైనీయులు దుష్టమతులు.
వ॥ అప్పటున భారతప్రధాని ప్రజానీకంబును హెచ్చరించిరఁట యెటువలెను.
ఆదితాళము—
అవె! చీనాసేనలు, లెండు! లెండు! యువకులారా! యువతులారా!
అవక్రపరాక్రమ ధైర్యస్థైర్యవివేకవిభూషితులారా!
అంచితశాంతికాముకులమై భావించినాము మిత్రులుగాఁ
బంచశీల నమ్మసేసి వచ్చిరి వంచకులై శత్రులుగా॥
మతమట బౌద్ధము; అహింసయఁట ధర్మమహో! ఎంతవిచిత్రము!
అతులితహింసాపరిపూరితములు, సతతము సేఁతలు మాత్రము॥
సమయమువచ్చెను నేఁడిఁకఁదడయక నలుపుఁడు సర్వముత్యాగము
సుమాళమున మన జన్మభూమిపైఁ జూపుఁడు మీ యనురాగము॥
మనమెల్ల భారతీయుల మనియెడిమాటను మఱిమఱి తలఁపుఁడు,
అనన్య మగణ్య మౌ మన భారతజనప్రతిష్ఠ నిలుపుఁడు॥
వినోదవిలాసవిభేద విరోధవిధంబులు విడిచిపెట్టుఁడు;
అనంతదీక్ష మాతృదేశరక్షణార్థమయి నడుముకట్టుఁడు॥
ధర్మము మన పక్షము, భగవానుఁడు తద్రక్షకుఁ, డేల భయము?
నిర్మలకర్మాచరణులము మనము; నిజముగ మనదే విజయము॥

వ॥ అత్తఱి నాకాశవాణి వార్త లాకర్ణించు చున్న త్యాగమూర్తి యైనస్వర్ణ యనునన్నులమిన్న యోర్తు నెచ్చెలికత్తెతో నే మను చున్నది.

త్రిపుట తాళము–

వింటివే? చెలి! దాడిచేసినదంట చీనా, మనము నోముల
పంట పావనభాగ తావని పైన నేఁడు॥
నాశనము కా కుండ నియ్యెడ దేశమును రక్షించుకొనుటకు,
రాశులుగ మఱి ధనముకావలె రణములోన॥
కూడఁబెట్టినసొమ్ము లెల్లరు పాడినిచ్చెడియదను వచ్చెను,
దోడఁబట్టుకపోరుగాదే! తుదకు నేరు?॥
వెంటనే చని దేశరక్షణనిధి కిచ్చె నా నగ లిచ్చిరమ్మా!
ఒంటిమంగళసూత్ర మొకటిని నుంచు చాలు॥
దేశసేవకు నుపకరింపని యీశరీరవిలాస మేటికి?
లేశమైనను నీనగలప్పై నాశ యేటికె?॥

వ। ఈలీల నాబాలగోపాలంబు, స్త్రీలు పురుషులు లక్షాధికారి మొదలుకొని, భిక్షుకునివఱకు, భారతీయుఁడన్నవాఁడెల్ల, శక్తికిమించి ధనకనకవస్తువాహనాంబరనికురంబంబులు సంబరమున సహస్రలక్షలు రక్షణనిధికి సమర్పించుచున్నంత, సుజాత యనువీరమాత యొకర్తు తనపుత్త్రుఁడు విజయుని బ్రోత్సహించెనఁట యెటువలెను.

మ। కొడుకా! దైవము పెక్కునోములకు నాకున్ నిం బ్రసాదించె; నేఁ డుడిగెం గాలము; లావు సెల్లె; స్మరణీయుండయ్యె మీయయ్య; నా యెడఁదం గోరిక యొండు తా మిగిలిపోయెన్ నేఁటికిన్ నేఁటికిం; బుడమిన్ నే నొకవీరమాత నను మెప్పుంబొందు లే యద్దిరా!

శా॥ పాదాతంబులతోడ వచ్చి మన భూభాగంబునన్ నేఁడు, చీ
నాదుష్టాత్ములు పక్కవేసికొని యున్నా రంట, విన్నావుగా?

యాందాసీన్యము నుజ్జగించి పటుశౌర్యస్ఫూర్తిమైఁ బుత్త్ర! యా
ప్రాదయ్యంబులఁ బాఱఁదోలవలె సంరంక్షింప స్వాతంత్ర్యమున్

వ॥ అన విని విజయుండు తల్లితో నేలాగున నుల్లేఖించుచున్నాఁడు.

శా॥ అమ్మా! దీవన లిమ్ము, "కొమ్ము విజయం బంచుం, జిరంజీవివై
రమ్మా", యంచును నాకు; సైన్యమునఁ జేరం బోవుచున్నా నిదే!
నెమ్మిన్ నే శిరసావహించి వరమౌ నీ యిచ్చునాదేశముల్,
సమ్మోదంబున మాతృదేశమునకై సర్వస్వ మర్పించెదన్.

ఉ॥ ఈయవె! నీదుచిత్తరువు, నే గొనిపోయెద యుద్ధభూమికిం;
బాయక నీ సుధామధురవాక్కులు జ్ఞప్తికిఁ దెచ్చుకొంచు, న
మ్మా! యలచిత్రమందలిత్వదాస్యమునం బ్రతివాసరంబు, చై
నీయుల వచ్చివెచ్చనగు నెత్తురుతోఁ దిలకమ్ము దిద్దెదన్.

వ॥ ఈ చందంబున నశేషయువకబృదంబు, మదాంధగంధసింధుర సంఘుంబుమీఁద లంఘించు సింగంపుంగొదమలభంగి, పొంగారునుత్సాహంబునఁ, జీనాసేనావారంబులపై దుముకుచున్నంత సంగరరంగంబున నుండి చారులు తెంచి ప్రధానికిఁ జైనీయుల దుండగంబులు నివేదించిరఁట యెటువలెను.

ద్విపద—

సామి! వారలసేఁత లేమి సెప్పుదుము!
ఏమాటుననొ దాఁచి తా మాయుధములు,
లామాలవలె వచ్చి సామము నెఱపి, యేమఱి యున్నంత నే చంపువారు;
గొడ్డుగోదలఁ దోలుచుకొని పోయినారు; బిడ్డలఁ దల్లులఁ బెడబాపినారు;
ఒకగుడినుండి కొంకక బుద్ధమూర్తి సకలమ్ముతోడ నెత్తుకుపోయినారు;
పరికింప నీచీనివారలకంటెఁ గర మలనాఁటిరక్కసులైన మేలు॥

వ॥ అన విని ప్రధాని యే మనిరి.

మత్యతాళము—

గోవుమొగము పులు లటంచు, నేవలేక యుంటి మకట!

సావి నెంచి నేఁడు కీడు నావటించినారు వీరు ॥
కేవలమ్ము దురమునఁ దమ లావుఁ జేవను దలఁచుకొని,
కావరమున నున్నవారు, భావిదృష్టి లేక వీరు ॥
వేగిరమున నన్నిటను బురోగమించు చున్న మనదు
బాగు చూచి కడుపుమంట నీగొడవకుఁ గడఁగినారు ॥
వీరితోడ లేదు మనకు వైర మనుచు, నాద మఱచి
నార మాట నోటమి మునుపోరులోనఁ బొందినాము ॥
ఐన దేశమొ యైన దింకఁ, బ్రాణమైన సరకుఁగొనక,
పూనిక మన సీమనుండి చీనివాని గెంటవలెను ॥
వ॥ అయ్యెడఁ బ్రపంచమందలి యనేకరాజ్యాధినేత లేమి సేసిరి.

అటతాళము—

భరతదేశము చీనీదాడికి శిరము వంచినయెడలఁ,
బరిణమించుఁ బ్రపంచశాంతికె కరము చేటు ॥
అనుచు భారతదేశమునకై యనికి సాయ మంపిరి,
ధనము ధాన్యము లాయుధంబులు ఘనముగాను ॥

వ॥ ప్రపంచసానుభూతి యీ రీతి భారతీయుల వైపు నేపుగ మొగ్గుచున్నకన్నెఱింగి, యోటమియందలి బెగ్గల మగ్గలింపఁ బోరాటంబు డిగ్గనాడి కొంతమేర వెనుకకుఁ దగ్గి, చైనీయులు సంధిసూచనలు సేసిరఁట యెటువలెను.

గీ॥ పోరుడిగి వెనుకను నింతమేర మేము
తగ్గినా, మంత మేగకుఁ దగ్గరేని
మీరు నున్నచోటుననుండి పోరుమాని,
సమ్మతింతుము రాయబారమ్ము సేయ॥

వ॥ అనుటయుఁ బ్రధాని చీనానియంతకు సమాధానమిచ్చిరఁట యెటువలెను.

కుఱుచజంపెతాళము—

మాయిలను నలి పీడిపోమ్ము, లేదా రాయబారమె లేదు సుమ్ము॥
నమ్మ మోసము సేసినావు, నీ వేసమ్ము లిం కిటఁ బనికిరావు॥
నీలావు పొడసూచి మేము, సుంతయు, డీలుపడువారలము కాము॥
యుద్ధమున కేము సిద్ధమ్ము, లెమ్మా! బుద్ధి దారికిఁ దెచ్చుకొమ్ము॥

వ॥ అయ్యవసరంబున.

క॥ జంబూద్వీపాంతరరాజ్యంబులు గొన్ని సభసేసె నలసింహళదే
శంబునకు రాజధాని కొలంబోనగరమున నిక్కలను వారింపన్॥

వ॥ ఆ సభవారు సేసినప్రతిపాదనములఁ గైకొని యొక్క శుభ
ముహూర్తమున—

త్రిపుటతాళము—

రాయబారము సేయఁ జీనా పోయె సింహళముఖ్యమంత్రిణి;
మాయమాటల సాగనంపిరి యాయబలను॥
ఔను కా దనకుండ నేవో లేనిపోనిసవరణలు నుసువ
బూని రాప్రతిపాదనములకుఁ జీనివారు॥

వ॥ పిమ్మట యమ్మంత్రిణి భారతదేశంబునకు విజయంబొనరించి,
కొలంబో ప్రతిపాదనములు ప్రధానికి నివేదించెనఁట.

ద్విపద—

అంతట వారు సహచరులతోడ మంతనంబులు సేసి సాంతంబుగాను,
పన్నుగాఁ దరిచి యాప్రతిపాదనముల,
నున్న వున్నట్టుగా నొప్పుకొన్నారు;
ఈ కారణేఁ బ్రధాని యీకొన్నఁ, జీని యేకాకి యైపోయె లోకంబులోన॥

వ॥ ప్రపంచమందలిరాజకీయవేత్త లత్తఱిఁ జీనానియంత యవివేక
మును గర్హించుచు, భారతప్రధాని చూపిన యసమానరాజనీతిజ్ఞతకు
నివ్వెఱపోయిరి. అటు లుండ భారతదేశమును నాదుకొన్న వివిధ
దేశాధీశులను బ్రధాని యభినందించిరఁట యొటువలెను. (సశేషము)

# గ్రంథస్వీకృతి

శ్రీ బండారు తమ్మయ్య

1. వరూధిని :- పద్యకావ్యము. వెల రు. 0-50 లు. కర్త సహస్రావధాని శ్రీరాం వీరబ్రహ్మ కవిగారు, బందరు.
ఈ లఘుకృతి మనుచరిత్రమునందలి వరూధిని కథను సంబంధించినది. ఇందు 109 పద్యములు కలవు. వానిలో నచట కవిగారివాగర్థ్యము కతముననో, ముద్రాపకుల యసమ్యక్పరిశీలనము వలననో దోషములు కానవచ్చుచున్నవి. అయినను శైలి మృదుమధురము.

2, 3. భారతప్రధానులు శ్రీ జవహరిలాల్ 'లాల్ బహదూరు శాస్త్రిల స్మృతులు:- వెల 0-50. ప్రచురణకర్త శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు. భారతీ సమితి, పామఱ్ఱు.

4. కవిసార్వభౌమ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి స్మృతి వెల 0-50 శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరాయ ప్రచురితము.

5. గోల్కొండ:- పద్యకావ్యము ద్వితీయముద్రణము వెల రు2/-లు. రచయిత శ్రీసురగాలి తిమోతీ జ్ఞానానందముగారు, కాకినాడ.
కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథసత్యనారాయణగారిని వీరు గురువులుగా భావించి పూజింతురు. వారు వీరిని వాత్సల్యముతో ప్రేమింతురు. ఈ కవి రచనలు సాధారణముగా గురువుగారి యామోదా శాసనపీఠికలు గలిగి వెలువడుచుండును.

6. విజయాభిషేకము: వెల రు2-00, కృతికర్త శ్రీ జ్ఞానానందకవిగారే!
వీరి రచనలలో ననేకము లాంధ్ర మంత్రుల కంకితములుగావింపబడినవి.

7. పద్యలేఖావళి :- వెల 0-50. కృతికర్త శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునకవిగారు. ఈపొత్తమున నాత్మీయబంధుమిత్రులనడుమ తేలికమాటలతో వ్రాయబడిన పద్యలేఖలు ముద్రితములైనవి.

## ఆంధ్రీకరణార్థము

శ్లో॥ ప్రాలేయాచలవన్మహోన్నతతమం
గాంగాంబువత్పావనం
గంభీరాంబుధివత్సురాలయగవీ
వత్కామితార్థప్రదా
శౌరేర్దర్శనవత్సదార్చనకలా
లక్ష్మ్యా ఉభాఽవ వ్యాపినీ
స్వర్యావద్విబుధాశ్రితా వసతు మే
గీర్వాణగీరానవే."

(కవిమూర్ధన్యకృత వ్యాజవ్యాహారే)

## సమస్యాపూరణార్థము

"ఉ. తాళము సాళగింప వడి
దాకెను భార్గవు డంత రాఘవున్."

*కవీంద్రులారా! మీచే లిఖితములగు పై విషయములు మాఘమాసాంతము దాటకుండ బంప ప్రార్థితులు.

సంపాదకుడు.

అత్ర గజతానంతం తత్తాదృగశ్వబలం తాదృగ్భటపరీత మపి మాం
జయలక్ష్మీ ర్న వృణుతే ఇతి వివక్షిత స్సంబంధో న సంపూర్ణః.
ఉదాహరతి సంపాది తేతి. గజతా గజసమూహః మే మయా
హేలయా అభిభూత స్తిరస్కృత శ్శమనో యమో యై స్తైః కలహే
యుద్ధే జయశ్రీ ర్జయలక్ష్మీః యోజయతి. అత్రేతి.

పతత్ప్రకర్షమ్

శ్లో॥ పతత్ప్రకర్షం తత్ప్రాహుః, ప్రకర్షో యత్ర విశ్లథః ॥
పతత్ప్రకర్షం లక్షయతి పతత్ప్రకర్ష మితి విశ్లథః భ్రష్టః యథా

శ్లో॥ కస్మా ద్దేశా దాగత స్త్వమ్, వనే పాంచాలభూపతే!
పాంచాలా త్ప్రాంచితభటా ద్ధావదశ్వా ద్భ్రమద్గజాత్ ।

అత్ర! ప్రకృష్టవిశేషాణాం వ్యత్యాసేన కథనా త్పతత్ప్రకర్షతా ఉదాహరతి కస్మా దితి. అత్ర భటాద్యపేక్షయా గజానాం ప్రకృష్టత్వా త్పూర్వ ముపాదానం భటాదీనాం పునరపకృష్టత్వా త్పశ్చా దేవోచితం తథాపి భటాదీనాం పూర్వ ముపాదానే ప్రకర్షభ్రంశా త్పతత్ప్రకర్ష మితి భావః ॥

అపదస్థసమాసమ్

శ్లో॥ అపదస్థసమాసం త, త్సమాసో యత్ర నోచితః ॥
అపదస్థసమాసం లక్షయతి. అపదస్థసమాస మితి పదస్థానం అస్థానస్థసమాస మిత్యర్థః. యథా.

శ్లో॥ తిగ్మప్రభావా ఇవ శత్రుభూపా
దావాంబుభూకీలదురాపరూపాః
నిరాకృతా వారిభృతేవ రాజన్!
గాంగేయబద్ధత్సరుణాసినా తే.

అత్ర శత్రురాజవిశేషణే అస్థానే సమాసః. అయం చ భేషయితరి ప్రయోక్తవ్య ఏవ. న తు భీషయే ష్వితి అపదస్థసమాసం.

ఉదాహరతి తిగ్మేతి. ప్రాగ్వ్యాఖ్యాతః. అస్థానసమాసత్వం వర్ణయతి. అత్రేతి. ఇతి వాక్యదోషాః

అథార్థదోషాః

శ్లో॥ అహేతువ్యాహతగ్రామ్యాశ్లీలా స్సహచరచ్యుతం
అక్రమానుచితాపార్థన్యూనాసిద్ధోపమా దశ.

వాక్యదోషనిరూపణానంతర మర్థదోషా న్వక్తు ముద్దిశతి. అహేత్విత్యాదినా.

అహేతుః

శ్లో॥ హేతో ర్వినార్థకథన మహేతు రితి కథ్యతే.

అథైతేషా ముద్దేశానుసారేణ లక్షణోదాహరణా న్యాహ. హేతో రితి. హేతో ర్వినా హేతునా వినేత్యర్థః. పృథగ్వినేత్యాదినా పంచమీ యథా

శ్లో॥ దూరేఽవతీర్య జననా ద్యువనక్షితీంద్రో
బాహాగ్రఖడ్గలతికాం పురతో నిధాయ
జానుద్వయేన పృథివీ ముపవిశ్య శశ్వ
చ్ఛృంగాటకే ద్యుతల ఏవ దృశా విధత్తే.

అత్ర ఆనందకరహిమకరసేవనేచ్ఛ యేతి హేత్వనుక్తే రహేతుః. ఉదాహరతి దూర ఇతి. యువనక్షితీంద్రః దూరే జననా దశ్వా దవతీర్య బాహాగ్రే హస్తే స్థితాం ఖడ్గలతికాం పురతో ధురి నిధాయ శృంగాటకే చతుష్పథే "శృంగాటక చతుష్పథ" ఇ త్యమరః. జానుద్వయేన జానుభ్యాం శశ్వ న్ముహుః. పృథివీ ముపవిశ్య ద్యుతల ఏవ దృశౌ విధత్తే. దివం పశ్యతీ త్యర్థః. అత్ర హేతు ర్నోక్త ఇత్యాహ అత్రేతి.

వ్యాహతం

శ్లో॥ వ్యాహతం దేశకాలాదివిరుద్ధం బహుధోచ్యతే.

వ్యాహతం లక్షయతి వ్యాహత మితి. దేశకాలాదీత్యాదిశబ్దేన విద్యాస్వభావాదయో గృహ్యంతే. వ్యాహతం విరుద్ధ మిత్యర్థః- యథా

శ్లో॥ సౌఖ్యాయ ద్వయ మేవాత్ర కౌబేరో మలయానిలః
వర్షాగ్రరాత్రనిర్నిద్రపుష్కరం విమలం సరః.

అత్ర పూర్వార్ధే కౌబేరో మలయానిల ఇతి దేశవిరోధః, ఉత్తరార్ధే కాలవిరోధః. దేశకాలవిరోధా వుదాహరతి సౌఖ్యాయేతి. అత్ర దేశే ద్వయ మేవ సౌఖ్యాయ భవతీ త్యర్థః. కిం తద్ద్వయ మిత్య త్రాహ. కౌబేరః ఉత్తరదిశ్యః మలయానిలః వర్షాసు వర్షాకాలే అగ్రరాత్రే చ నిర్నిద్రాణి వికసితాని పుష్కరాణి పద్మాని యస్మిం స్తత్ విమలం దోషరహితం చ సరః. విరోధం దర్శయతి అత్రేతి. మలయానిలః కౌబేర ఇతి దేశవిరోధః. పద్మానాం వర్షాగ్రరాత్రయో ర్వికసనాభావా త్కాలవిరోధ శ్చే త్యవగంతవ్యమ్. ఏవ మన్యేపి ద్రష్టవ్యాః.

## గ్రామ్యమ్

శ్లో॥ పామరచ్ఛాందసోక్తి ర్యా త ద్గ్రామ్యం పరికీర్త్యతే.

గ్రామ్యం లక్షయతి పామరేతి. పామరోక్తి శ్ఛాందసోక్తి శ్చేతి గ్రామ్యం ద్వివిధ మిత్యర్థః.

## పామరోక్తిః

శ్లో॥ భవా నివశ్వాపాంచాల సమృగోహ మిహాహవే
గళగ్రాహం గృహీతో భూ ద్బత తేన ససత్వరమ్.

పామరోక్తి ముదాహరతి భవా నితి-

## ఛాందసోక్తి ర్యథా

శ్లో॥ కరవాలబిడాలో యం భూపాల! తవ వైరిణామ్
యశఃపయః పిబ త్యాశు త్రిలోకీభాండసంస్థితమ్.

ఉదాహరతి కరవాలేతి. కరవాల ఏవ బిడాలః. త్రిలోక్యేవ భాండ స్తత్ర సంస్థితం యశ ఏవ పయః. ఛాందసత్వం స్పష్టమ్. యథా వా

శ్లో॥ ఆశాయోపాదుకూలాని రిపుకీర్తిమయాని వో
భిద్యంతే రాజసైన్యానాం కరవాలాగ్రమూషకైః.— స్పష్టమ్.

శ్లో॥ సంఘీకరణకౌశల్యే స్వీయానా మన్యవంచనే
ద్విపాదో వాలరహిత స్సృగాలః కోంకణప్రభుః

పరిహాసాస్పదత్వేన పునః పున రుదాహరతి సంఘీకరణేతి స్పష్టం.

అశ్లీలం

శ్లో॥ అశ్లీలార్థస్య కథన మశ్లీలం పరికీర్త్యతే.

అశ్లీలం లక్షయతి అశ్లీలేతి. అశ్లీలార్థస్య అమంగళజుగుప్సావ్రీడా జనక స్యే త్యర్థః. అత్ర పర్యాయై ర్వ్యస్యార్థస్య సువచత్వా త్పదవి పర్యాసహిష్ణోః పదదోషా దశ్లీలా దముష్య భేద ఇతి బోధ్యమ్—యథా

శ్లో॥ దృష్ట్వా కామోద్ధితం ప్రాంశుర విమూఢా స్స్మరకేతనం
అత్తు మిచ్ఛంతి సంగృహ్యా విపక్షనృపయోషితః.

అత్ర వ్రీడాకరార్థప్రతీతి జనకత్వా దశ్లీలం.

ఉదాహరతి దృష్ట్వేతి. విమూఢా అత్యంతవివేకహీనాః విపక్షనృప యోషితః కామోద్ధిత ముల్లాసే నోద్ధితం తారుణ్యాజన్యేన కామే నోద్ధితం చ. ప్రాంశుం మహాంతం దీర్ఘం చ స్మరకేతనం మత్స్యం కామ ధ్వజం చ దృష్ట్వా సంగృహ్యా, అత్తుం భోక్తుం రంతుం చ ఇచ్ఛంతి. అశ్లీలత్వం యోజయతి అత్రేతి.

సహచరచ్యుతం

శ్లో॥ హీనై స్సహై వోత్కృష్టానాం పాత స్సహచరచ్యుతమ్.

సహచరచ్యుతం లక్షయతి హీనై రితి. యథా

శ్లో॥ వ్యాధః కోకకులై ర్మహీధరగుహా స్సింహై ర్విషాణై ర్ఘనై
కాంతారోద్భవకాసరాః పికబలై ర్వృక్షో రసాలాహ్వయః
దంతై ర్మత్తమతంగజా స్త్వమపి చ క్షోణీపతే మాళవ!
నిర్వ్యాజోపనతై ర్నిసర్గమధురై రాశ్రియ్యసే సద్గుణైః

ఉదాహరతి వ్యాధ ఇతి. కోకకులైః వృకసమూహైః "చక్రవాకే వృకే కోక" ఇతి రత్నమాలాయాం. వ్యాధః మృగయుః సింహై ర్మహీధర గుహాః ఘనై ర్దీర్ఘై ర్విషాక్తై శ్శృంగైః, కాంతారోద్భవా వన్యాః, కాసరా మహిషాః. "లులాయో మహిషో వాహ ద్విషత్కాసర సైరిభా" ఇత్యమరః. పికాః కాకాః. "పికః కాకే కోకిలేచేతి విశ్వః తేషాం బలై స్సముదాయైః రసాల శ్చూతః. "ఆమ్రశ్చూతో రసాలో సా" విత్యమరః. దంతై ర్మత్తమతంగజాః.అత్ర వ్యాధాదిభ్యో మాళవ భూపతేః కోకాదిభ్య స్సద్గుణానాం చ సర్వోత్కృష్టత్వా త్తత్వాతేన సహచర చ్యుతమ్.

అక్రమం

శ్లో॥ ఉచ్యతే క్రమ వాచ్యార్థవ్యుత్క్రమో క్రమనామకః.

అక్రమం లక్షయతి ఉచ్యత ఇతి- యథా

శ్లో॥ కస్మా ద్దేశా దాగత స్త్వం వనే పాంచాలభూపతే !
పాంచాలా స్త్యాంచితభటా ద్ధావదశ్వా ద్విమద్గజాత్.

ఉదాహరతి కస్మా దితి. వ్యాఖ్యాతోఽయం ప్రాగ్వాక్యత్వే వ్యస్య అర్థపరిక్రమవ్యుత్క్రమా దపక్రమత్వ మి త్యవగంతవ్యమ్.

అనుచితం

శ్లో॥ య దయోగ్యస్య కథనం త దే నానుచితం విదుః

అనుచితం లక్షయతి య దితి. అయోగ్యస్య అవర్ణనీయస్య- యథా.

శ్లో॥ ఆకీర్ణకేశిక ముదంచితకంప ముద్య
త్స్వేదం భయా దగణితాపగతో త్తరీయం
రాజ్యం విహాయ విపినే చరితారికాంతా
వ్యాధా వలంతి కుసుమే ష్వనువిద్ధచిత్తాః.

అత్ర భయేన పలాయితాసు శత్రుకాంతాసు వ్యాధానాం రిరంసా వర్ణనా దనుచితం. ఉదాహరతి ఆకీర్ణేకేశికం పర్యాకులకేశపాశం

సుమేషుణా మదనేన అనువిద్ధం చిత్తం యాసాం తాః, యోజయతి అత్రేతి. రిరంసా రంతుమిచ్ఛా.

అపార్థం.

శ్లో॥ సముదాయార్థశూన్యం య దపార్థం త త్ప్రకీర్త్యతే.
అపార్థం లక్షయతి సముదాయేతి– యథా.

శ్లో॥ కాంభోజః కనకాంభోజః కుంతలః కీర్ణకుంతలః
విశ్వం విశ్వంభరక్ష్మ స్తం కాచి త్కాంచి న్మదం దదా.

అత్ర దశదాడిమాదివ దర్థ్యశూన్యత్వా దపార్థతా,
ఉదాహరతి కాంభోజ ఇతి. యోజయతి అత్రేతి.నిరర్థకత్వా దపార్థతా.

హీనోపమం

శ్లో॥ యత్రోపమానం హీనం స్యా త్తద్ధి హీనోపమం మతం.

హీనోపమం లక్షయతి యత్రేతి. జాతిప్రమాణాభ్యా ముపమానస్య హీనత్వం హీనోపమం. అతఏవ పూర్వోదాహృతాభ్యాం న్యూనాధికోపమాభ్యా మస్య వక్ష్యమాణస్య అధికోపమస్య చ భేదోఽవగంతవ్యః, యథా.

శ్లో॥ పాటవం మ్లేచ్ఛవీరాణాం రిపువిద్రావణే న చేత్
అశ్వానుధావనే శక్తిః కాసరాణాం చ నో భవేత్.

అత్ర మ్లేచ్ఛవీరాణాం సైరిభైస్సహ వ్యంగ్యౌపమ్యం హీనం.
జాతిహీనోపమ ముదాహరతి పాటవ మితి, యోజయతి అత్రేతి,

అసిద్ధోపమం

శ్లో॥ అప్రసిద్ధోపమానం య త్త దసిద్ధోపమం మతం.
అసిద్ధోపమం లక్షయతి అప్రసిద్ధేతి స్పష్టమ్– యథా.

శ్లో॥ త్వాటకావ దదభ్రాంగ్యో హంసీవ దణుమధ్యమాః
కోకీవ న్మధురాలాపా రాజంతే కుకురస్త్రియః.

"అంగాదిభ్య శ్చేతి ఙీష్". కోకీవ ద్వ్యాకాంగనావత్. "వృకకోకిల యోః కోక" ఇతి మాధవః. కుకురస్త్రియః కుక్కుటాంగనాః.

అన్యే చ కేచన దోషా ఉదాహ్రియంతే

నిరలంకారః

శ్లో॥ అలంకారేణ రహితో నిరలంకార ఉచ్యతే.

నిరలంకారం లక్షయతి అలంకారేణేతి.— యథా.

శ్లో॥ అహో! విపక్షసౌధేషు ముహు రాఘ్రాయ మేదినీం
ఉద్ధృత్యైకపదం శ్వానో మూత్రం ముంచంతి పశ్యథ.

అత్ర న కశ్చి దలంకారః. న స్వభావోక్తి రస్తీతి వాచ్యం శ్లాఘ్య విశేషణాభావాత్. ఉదాహరతి అహో ఇతి. యోజయతి అత్రేతి.

అధికోపమం

శ్లో॥ యత్రోపమాన మధికం తద్భవే దధికోపమం.

అధికోపమం లక్షయతి యత్రేతి. హీనోపమవ జ్జాతిప్రమాణాభ్యా ముపమాన స్యాధిక్య మధికోపమం.—యథా

శ్లో॥ సముత్ప్లుతే స్సార మేయై శ్శబరా యాంతి సంవృతాః
గజారిశిశుభి ర్లగ్నాః పాదా ఇవ మహీభృతాః.

అత్ర సారమేయై స్సహ ప్రతీయమానం సింహకిశోరసామ్య మధికం. ఉదాహరతి సముత్ప్లుతై రితి. సముత్ప్లుతై స్సారమేయైః కుక్కురైః సంవృతాః స్సంత శ్శబరా మ్లేచ్ఛజాతివిశేషాః "గోమాంస భక్షకో యస్తు లోకబాహ్యం చ భాషతే సర్వాచారవిహీనోఽసౌ మ్లేచ్ఛ ఇత్యభిధీయతే" భేదాః కిరాతశబరపులిందా మ్లేచ్ఛజాతయః" ఇ త్యమర కోశాదయః గజారిశిశుభి స్సింహకిశోరైః "కంఠీరవో గజరిపుః పింగదృష్టి ర్మృగాధిపః, బాలః కిశోర" ఇతి చాపరః. అత్ర యద్యపి కిశోరపదం "బాలం కిశోర" ఇత్యమరకోశే హయకిశోరపర్యాయ త్వేన వ్యాఖ్యాతం. తదపి సామాన్యేన సర్వబాలపరత్వే ప్రయోగ

బాహుళ్యా న్న దోషః. లగ్నా మహీభృతాం పాదా ఇవ యాంతి.
యోజయతి అత్రేతి.

అసదృశోపమం

శ్లో॥ య దతుల్యోపమానం స్యా త్త ద్భవే దసదృశోపమం
అసదృశోపమం లక్షయతి. అసదృశోపమాన మసదృశోపమం—యథా

శ్లో॥ భాతి కాంభోజభూజాని స్సంవృతో ద్యత్తురంగమః
ఇందిందిరసమాక్రాంత సరోరుహాసరో యథా.

ఉదాహరతి భాతీతి. కాంభోజభూపతిః న హ్యత్ర కాంభోజభూపతి
సరసో స్తద్ధర్మయో శ్చ సాదృశ్యప్రసిద్ధిః. నచ ధర్మిణో ర్ధర్మద్వారా
సాదృశ్యం. ధర్మయో శ్చ ధర్మిద్వారేతి వాచ్యం. ఇతరేతరాశ్రయ
త్వప్రసంగాత్ యథాహ "బధ్నామి కావ్య శశినం వితతార్థరశ్మి"
మిత్యత్ర వామనః. తదేవ మితరేతరాశ్రయదోషో దురు త్తర ఇతి.

వ్యర్థం.

శ్లో॥ యత్ప్రయోజనశూన్యం స్యా ద్వ్యర్థం త త్పరికీర్తితం
వ్యర్థం లక్షయతి యదితి— యథా.

శ్లో॥ కోసలేంద్రపురావాసో నదీందో ర్భ్యాంతరే ద్విజః
సవైస్రజశ్చ రచయే త్కథం స న కవి ర్భవేత్.

అత్ర కవితాసంపాదనే నదీతరణాదిక మప్రయోజకం
ఉదాహరతి కోసలేతి—యోజయతి అత్రేతి. ఏవ మన్యేపి దోషా
స్త్వ న్తతో ద్రష్టవ్యా ఇతి విరమతి. ఇత్యర్థదోషా ఇతి. ఇతి అర్థ
దోషాః. అథ దోషాపవాదః

శ్లో॥ సర్వే ప్యేతే నుకరణే న దోషాః పరికీర్తితాః
నాప్రతీతస్య దోష స్స్యా చ్ఛాస్త్రే ర్త్థప్రకాశనే.

[సశేషము]

# సంపాదకీయము

వెనుకటిసంచికలో ప్రచురితము లగు శ్లోకమున కాంధ్రానువాదమును, సమస్యకు బూరణమును గొంద ఱాంధ్రపండితకవులు లిఖించి పంపినందుల కెంతయు గృతజ్ఞులము.

ఆంధ్రానువాద మొనరించిన కొందఱి పద్యరచనలలో, గోరబడిన "మా" శబ్దశ్లేష లోపించినది. ఐనను వారిపద్యములుగూడ స్వీకరించి ప్రచురించడమైనది. భావిరచనలలో సూచితనియమపాలన పాటింప బ్రార్థితులు. ప్రకటితపద్యముల బఠించి యందలి సారస్య నైపుణ్యము నిర్ధరించు నధికారము మా సాహిత్యరసికపాఠకనికరమునకే ప్రస్థాపింపబడినది.

రచయితల నామధేయములు లేకుండ రెండు మూడాంధ్రానువాదములుమాకు పంపబడినవి. అనువాదములు చక్కగ నుండుటచే వానినిగూడ బ్రకటీకరించితిమి.

ఈ సంచికయందుగూడ గతమందువలెనే శ్లోకమును సమస్యయు నొసంగబడినది. పండితకవివరులు స్వీకరించి పూరించి సకాలమున రచనల బంప నర్థించుచుంటిమి. ఆలసించి పంపబడిన యిరువురుకవుల రచనల ముద్రితములైనవి. కారణ మావిషయమంతకుమున్నే ముద్రితమగుటచేతనే కాని యన్యముగాదు.

గ్రామ్యవ్యావహారికభాషానిరాకృతియు, పరిశుద్ధప్రసిద్ధ గ్రాంథికభాషోద్ధరణవ్యాపృతియు మా యాంధ్ర సాహిత్య పరిషత్ప్రధానాశయములు. కావున వ్యాసరచయితలు దయతో నైజగద్యపద్యరచనలలో విసంధుల బర్యుదాసించి, వ్యావహారికపదప్రయోగముల బరిహరించి రసవంతముగ, మితముగ విస్పష్టాక్షరకలితముగ బత్త్రముల వ్రాసి పనుప బ్రార్థన.

సంపాదకుడు : కాకరపర్తి కృష్ణశాస్త్రి
(కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర,
విద్వత్కవివర, బ్రాహ్మీభూషణ)

| | |
|---|---|
| ప్రాస్తావిక పద్యావళి | 0-75 |
| బాలభారతము (అగస్త్యకృతమునకుఁ దెలుఁగు) | 2-50 |
| బాలరామాయణము | 0-25 |
| మాధ్యమిక కారికలు-సంస్కృతము-నాగరిలిపి | 2-50 |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1-0 |
| రఘునాథ రామాయణము (ప్రథమ భాగము) | 1-00 |
| రాధికాసాంత్వనము- సముఖము. వేంకటకృష్ణప్పనాయకుఁడు | 1-50 |
| రాఘవయాదవీయము | 1-00 |
| రెడ్డినాఁటి రెండు శాసనములు | 0-50 |
| లక్షణసార సంగ్రహము | 2-00 |
| విప్రనారాయణచరిత్రము- చదలవాడ మల్లన్న | 1-25 |
| శతకసముచ్చయము (ద్వితీయ భాగము) | 1-25 |
| శాసనపద్యమంజరి (మొదటిభాగము) | 1-75 |
| ,, (ద్వితీయభాగము) | 0-75 |
| శివరాత్రి మహాత్మ్యము- శ్రీనాథకవి | 2-50 |
| షోడశకుమార చరిత్రము- వెన్నెలకంటి అన్నమయ్య | 1-25 |
| సర్వేశ్వర శతకము- యథావాక్కుల అన్నమయ్య | 0-25 |
| స్వప్నవాసవదత్త - భాసకృతి కనువాదము | 2-00 |
| సింహాసనద్వాత్రింశిక - కొఱవి గోపరాజు | 1-50 |
| ,, (ద్వితీయభాగము) | 1-50 |
| సీతారామచరిత్రము | 1-00 |
| ప్రహస్వరంగములు | 0-50 |
| 42 - వార్షికమహాసభ - వ్యాసములు - 250 పుటలు | 1-50 |

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | |
|---|---|---|
| *1 | సంపుటము ... ... ... | 15-00 |
| *2 | ,, ... ... ... | 15-00 |
| 3 | ,, ... ... ... | 15-00 |
| 4 | ,, ... ... ... | 15-00 |
| 5 | ,, ... ... ... | 15-00 |
| 6 | ,, ... ... ... | 15-00 |
| 7 | ,, ... ... ... | 15-00 |

* పునర్ముద్రితము కానున్నవి.

ప్రకాశకులు :

## ఆంధ్ర సాహిత్య పరిషత్తు

రామారావుపేట

కాకినాడ

తూర్పుగోదావరిజిల్లా.

*Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Gopalam at Republic Press MainRoad, Kakinada.*



"దేశభాషలందు తెలుఁగు లెస్స."

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

పరాభవ - మాఘ ఫాల్గుణములు

సంపుటము 55 సంచిక 6



సంపాదకుఁడు

కవిమూర్ధన్య: కాకరపర్తి కృష్ణశాస్త్రి.

# ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

| | |
|---|---|
| అకారాద్యముద్రిత గ్రంథసూచిక | 0-50 |
| అమరుకము-జయంతి రామయ్యపంతులుగారు | 1-25 |
| అజవ దేశమునందలి ఆంధ్రవాఙ్మయము- ఆ. ఉమాకాంతముగారు | 0-25 |
| ఆర్యభాషావిభాగము | 0-50 |
| ఆంధ్రసాహిత్య పరిషద్వృత్తాంతము | 0-50 |
| ఈశానసంహిత | 0-50 |
| ఉత్తరరామచరిత్రము-జ. రా. పంతులు | 2-50 |
| ఉన్మాదసహస్రము (వెఱ్ఱివేయివిధములు) కొత్తపల్లి సూర్యారావు | 0-75 |
| కవిజనోజ్జీవని - సమస్యలు - శ్రీ కోటి రఘునాథతొండమాన్ | 0-50 |
| కవిజనాశ్రయము | 2-00 |
| కాళిందీకన్యాపరిణయము-అహోబలపతి (ప్రథమ భాగము) | 1-50 |
| డిటో (ద్వితీయ భాగము) | 0-75 |
| చంపూరామాయణము (ఆంధ్రము) జ. రా. పంతులు | 1-50 |
| చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) | 0-75 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0-25 |
| జ్యోతిశ్శాస్త్రసారము-కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0-50 |
| నమస్కారములు-కొత్తపల్లి సూర్యారావు | 0-25 |
| పరిషత్పుస్తకభాండాగారము 2వ భాగము | 1-00 |
| ,, 3వ భాగము | 1-00 |
| ప్రాకృతభాషోత్పత్తి- శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0-75 |
| ప్రాస్తావిక పద్యావళి | 0-75 |
| బాలభారతము (అగస్త్యకృతమునకుఁ దెలుగు) | 2-50 |



"దేశభాషలందు తెలుఁగు లెస్స."

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక


పరాభవ - మాఘ ఫాల్గుణములు

సంపుటము 55 సంచిక 6




సంపాదకుఁడు

కవిమూర్ధన్య: కాకరపర్తి కృష్ణశాస్త్రి.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు — కాకినాడ

అధ్యక్షులు

"విమర్శకాగ్రేసర" 'ఐతిహాసికసమ్రాట్'

శ్రీ బండారు తమ్మయ్యగారు.

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

"అభినవభోజ"

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయకార్యదర్శి :—

"కవిశిరోమణి", "ఉభయభాషాప్రవీణ" A

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు :—

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. "బాలవ్యాస" శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. "భాషాప్రవీణ" "వ్యాకరణ విద్యాప్రవీణ"
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. "కవిమూర్ధన్య" "ప్రౌఢకవిచంద్ర"
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు (బి. ఏ)
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ చిరువోలు కోటేశ్వరరావుగారు
8. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ.
9. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, (ఎమ్. ఏ. ఆనర్సు)
10. "సాహిత్యవిద్యాప్రవీణ" "ఉభయభాషాప్రవీణ"
    శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రిగారు
11. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, (బి. ఏ. బి. ఎల్.)

# విషయసూచిక

పరాభవ ♦♦ మాఘఫాల్గుణములు

సంపుటము ౫౫ సంచిక ౬

# పీష్వా బాజీరావు.

శ్రీ మోచర్ల రామకృష్ణకవి.

గతసంచిక తరువాయి

అతని కప్పటికే ఘూర్జరాధిపత్య
మమరె మాళవరాష్ట్రనాయకత దనరె
ముందె బందేలఖండంబునందు పాలు
పంచుకొనె నాతఁడు తురుష్కబలము నొంచి. 61

ఇంకఁ దనవంక ఢిల్లీమహీశ్వరుండు దృష్టి ప్రసరింపఁజేయుట కెద్ది తాను
జేయవలయునో దాని బాజీమనీషి సలుపసమకట్టె-సాగించె జైత్రయాత్ర.

జయపురపరిపాలకుఁ డగు జయసింహునితోడి మైత్రి సంపాదించెన్
నయవిదుఁ డగు బాజీ; యీక్రియ ఢిల్లీ చక్రవర్తికి న్వెఱగొలిపెన్.

అరరే! జయసింహుం డను కరువలి తోడయ్యె నిపుడు గడుసరి బాజీ
యొరవలి కని ఢిల్లీశ్వరుఁ డురుసంత్రాసంబు నొంది యుఱ్ఱట్లూగెన్. 64

సామోపాయము నిష్ప్రయోజనము పీష్వాపట్ల భేదక్రియా
సామగ్రుల్ పనిసేయ వాతనియెడన్ జర్చించి చూడంగ సం
గ్రామోపాయముచేఁ బరాజయము భోగ్యం బౌట తథ్యంబు బా
జీమంత్రి. న్వశవర్తిఁ జేసికొన యోజింపందగున్ మార్గమున్. 65

అని ఢిల్లీజనపాలమౌళి యనివార్యస్థైర్యు నక్షీణవీ
ర్యుని బాజీని వశీకరించుకొన దానోపాయమే మంచి. సా
ధన మంచు న్మది నెంచి వానిఁ దన యాప్తశ్రేణికిం జేర్చి, పే
ర్చినపూన్కిన్ 'సరిదేశపాండ్య' నొనరించెన్ దక్షిణక్షోణికిన్.

వచ్చె బాజీకి సరిదేశపాండ్యపదవి
దాన మొగలాయివారి యాదాయమందు
వంద కైదేసిరూప్యంబు లొందెఁ దాను
నిండె భాండారము యంశంబు నెఱసె దెసల. 67

ఆకాలంబున విజృంభించుచు నయోధ్యామండలం బేలు జ
న్యాకుం డొక్క తురుష్కుఁ డుద్ధతుఁడు దంభంబూని ఢిల్లీశుతో
వాకొన్నాఁడట తా మరాటుల ననిన్ భంజింపఁ దద్వాహినుల్
చీకాకయ్యెనటంచు నింక భయమే లే దంచు వాదించుచున్. 68

విని నీవాయపురజ్జువులను బాజీరావు దండులను బంపి మొగల్
మొనలను గనుమొఱఁగి చలమ్మున డిల్లీచుట్టుపట్లు బూదియొనర్చెన్.
ఎల్ల విధంబుల డిల్లీవల్లభుకడఁ బగ్గెలాడి వచ్చినదొర యా
పల్లాయనంబువాఁడు సముల్లాసము గోలుపోయి ముచ్చుముడింగెన్. 70

అదరి ముక్కంటినొసటిచిచ్చైనఁగాని,
కడిదిమగఁటిమిఁ బిడికిలించెడిమరాటు
లుక్కుతునియలు డిల్లీపురోపకంఠ
మల్లకల్లోల మొనరించి యరిగినారు. 71

గడగడ వడంకె మొగలాయి పుడమిఱేఁడు, దద్దఱిల్లిరితద్రాజధానిప్రజలు
తురకకూటువమూఁకఁదుత్తుమురు చేసిసాగిపోయె మహారాష్ట్రసైన్య మెల్ల

దక్కె బాజీప్రతిష యీదాడియందు,
నేల నఱచేతికిం దేరఁ జాలునట్టి
దండిమగఁ డితఁ డని కీర్తి నిండె భరత
ఖండమున వానివైరులగుండె లదరె. 73

'గట్టిసచివుఁడు లేమియే కారణమ్ము
మొగలుసామ్రాజ్యమున కిట్టియగడు గలుగు
టకు మరాటులకతమున వికలితారి
నొకని మహనీయు నాయమాత్యుగ నొనర్తు.' 74

అంచు ఢిల్లీప్రభుండు యోజించి తనకుఁ బ్రెగ్గడను జేసి రావించెఁ బెద్దపేరు
గాంచినట్టి 'అసఫ్ జా'ను—కాలనేమియంతవాఁడాతఁడహితభయంకరుండు

ఆతఁడు పెక్కుయుద్ధములయందు జయమ్మును గొన్నజెట్టి ని
ర్భీతిఁ జరించి దండ్లు నడపించెడిదిట్ట యుదగ్రసాహసా
న్వితుఁడు నైపుణమ్ము వొగణింప నిలాతల మేలఁజాలు ధీ
నీతి విశారదుం డుగవణించెను నాటిమొగల్ ప్రధానియై. 76

పేరఁగ 'నైజాముల్ ము' ల్కనుబిరుదు వహింపఁగలిగి యగ్గలికన్ ద
క్కనమునకు రాయఁ డన దక్కొనినట్టిసమ్రాట్ఁ డుత్సుకుం డాతండే. 77

ఆయన పీష్వాబాజీరాయని సదమదముసేయ రాయిడి వెట్టన్
నైపుణ్యాత్వముతో నడపెన్ బ్రాయేటుం బోని బిరుదుపోఁజులబారున్.

తురకదముదార్ల జండ ముందుగ గ్రహించి
మూఁగి బాజీమొనలు చుట్టుముట్టి కూల్చి
ముచ్చుతో డేళ్ల గమిని గార్చిచ్చు గలిసి
చెదరిపోనీక రూపఱఁజేసినట్లు. 79

వెరవులావు నెఱయ వెలిఁగె బాజీరావు
సేన విరిసిపోయి దీనదశను
బొరసె మొగలుఫౌజు 'భోపాలు'సనుగ మీఁ
యోజఁ గడుఁబ్రసిద్ధయుద్ధ మయ్యె. 80

అలబాజీ కేబదిలక్షలరూప్యము లిచ్చి సంధి గావించుకొనెన్
బలియుండయ్యుఅసఫ్ జాపౌలికలనునఁదూలియోడిపోయినకతనన్

నీపెకొని మాదికాదు మాళవరాష్ట్రి మనుచు దానపత్రమును లిఖించి
మొహరు పొందుపఱచి మొగలాయిదర్బారువారు బాజికడకుఁబంపినారు

మించినసుప్రతిష్ఠ గల మేటిమరాటుల కిట్టు లౌదలల్
వంచనివారు లేరయిరి బాజి యిలన్ మనసింతకాలమున్ :
గ్రించుతనమ్ముతో బుడుతకీచుగవర్నరు వానితో విరో
ధించి పరాభవింపఁబడి తెట్టగిలంబడి కోల్పడెన్ సిరుల్. 83

మూఁడు కరవాకపురములు పోర్చుగీసువారు
బాజీమహామంత్రివశము జేసి
యైదు పదిసేయవలసె రత్నాకరుండు
వసుమతికిఁ దోఁడువచ్చెఁ బీష్వాను గొల్వ 84

మంజుఘోషమాట మఱచితి బాలకమిత్రులార! నను క్షమింపరయ్య జనన మొందె నొక్కతనయుఁ డాసతికి, బీష్వాకువానియందు బ్రాఁతి మెండు బాజిరావుధర్మపత్ని కాశీబాయి కరయ నలువు రుండి రాత్మభవులు వారిజాతిగౌరవము మంజుఘోషసూనునికి రామి యెఱిఁగివనరె నతఁడు

కలిగె వైమనస్యములు నిజానుజునితోఁ
గ్రందుకొనియె హృదయమం దశాంతి
స్వీయజనులకుట్రచేత బాజీరావు
నెలవు జొచ్చుకొనియె నెగులుచిచ్చు. 87

చిత్తంబం దిటు హత్తుకొన్నవగ బాజీరావు పో జోపుకో
నెత్తెన్ నాజరుజంగుపై, గెలుపుచేయిం జాపి జాగీరు లు
ద్వృత్తిన్ గైకొనెఁ గాని తీర్పఁగలవే యీజోగిజాగీర్లు దద్
హృత్తాపంబును? దాని కౌషధము ధాత్రిన్ జ్ఞాన మొక్కండె కా!

తమ యథార్థస్వరూపబోధంబు లేక
బహువిధము లైన పుణ్యపాపము లొనర్చి
సుఖము దుఃఖము ననుభవించుటకు భవము
లందుచుందురు జీవు లీయవనియందు. 89

నదియందుం బడినట్టికీటములు తూర్ణం బై నవాఃపూరపున్
ముదియారంబున జొచ్చునొక్కసుడియందున్ దానిలోనుండియు
న్నదితోద్వేగముతోడఁ గ్రొత్తసుడిగుండానన్ బడున్ వీనియొ
ప్పిదముల్ గాదె నరుల్ జనించి మృతులై వే పుట్టుటల్ గిట్టుటల్.

జ్ఞానమే ధరిత్రి నరులకు నిర్వృతి సంతరించు పరమసాధనంబు
అదిలభింపదీశ్వరానుగ్రహము లేక వెలయ నెన్ని జన్మములకొ కాని.
మొనసి మానసిక క్లేశములకు దోడువచ్చె శారీరకవ్యథాభరముగూడ
పోయిఁ గోల్పోయె బాజీమహాశయుండు తారసిల్లినసన్నిపాతజ్వరమున.

గ్రహము లతనికిఁ బ్రతికూలగతుల నూని
నడచుచుండిన కతమున బెడద మయ్యె
గదము- వెజ్జులపూనికల్ పిదిలిపోయె,
వ్యర్థమయ్యెఁ దదీయ వైద్యంబు లెల్ల. 93

ఆయన నలుబదిరెండవహాయన మది-తనువుఁ దొరఁగి యాతఁడు దివికిం
జోయె నిల నుండనొల్లక ప్రేయసియగు మంజుఘోష వెన్నంటిచనెన్
సహగమన మాచరించెన్ మహిళామణి మంజుఘోష నాథునితోడన్
తుహినద్యుతితో వెన్నల మిహిరునితోఁజాయ యనుగమించెడి జాడన్.

---

## వేమన విషయ మేమి

శ్రీ ఓరుమళ్ళ కామేశ్వరరావు

(గత సంచికతరువాయి.)

ఆ. వె. నిక్కమైన మంచినీల మొక్కటి చాలు
తళుకుబెళుకురాళ్ళు తట్టెడేల ?
చదువ పద్య మరయ చాలదా యొక్కటి !

### గ్రంథాది పద్యము

కొన్ని తాటాకు ప్రతులలో వేమనశతకములోని మొదటి పద్యముగా నీ క్రిందిపద్యము కనబడుచున్నది.[4]

క. శివకవులకు, నవకవులకు, శివభక్తికి, తత్త్వమునకుఁ, జింతామణికిన్
శివలోకప్రమథులకును, శివునకు, గురువునకు శరణు సేయర వేమా!

---

4. వంగూరి సుబ్బారావుగారి వేమన, పుట. 95

వేమన యాటవెలదులలో తనశతకమును కూర్చుచు, దాని ముఖమున కందమునుఁ దగిలించునా! కాబట్టి యిది వేమనవ్రాసిన శతకములోనిది కాదని నిరాక్షేపణగా జెప్పుకొనవచ్చును. దాని నెవడో వేమయ్య తాను కూర్చిన కందపద్యశతకములోని మొదటి పద్యముగా వ్రాసికొన్నాడు. వేమనపేరిట నొకటికాదు, రెండుకా దేడువందల కందపద్యము లున్నవి. అవన్నియు వేమయ్యలు సృష్టించి నవే!

కాని పై పద్యములోని శివకవులు, నవకవులు నను పదబంధము లను గురించి కొంత చర్చింపవచ్చును. దీనిలోని శివకవు లనుపదము నకు నర్థము తెలిసినదె. కాని నవకవు లను సమాసమునకుమాత్ర మర్థమేమి? దీనికి క్రొత్తకవులు, తొమ్మండుగురు కవు లనునర్థములను లాగుచున్నారు కొందఱు. తెలుగులోఁ దొమ్మండుగురుకవు లని యేకవి గుంపునకు పేరు లేదు. కాబట్టి యాయర్థము సరిపడదు. ఇంక నూతనకవు లను నర్థముకూడ పొసగదు. అయితే దానియర్థ మేమై యుండును?

తెలుగులో నాదికాలమునుండి వచ్చుచున్నవారు శివకవులు; తరువాత చాలకాలమునకు బౌద్ధకవులును, జైనకవులును. అట్టి స్థితిలో శంకరభగవత్పాదులవారు (క్రీ॥ శ॥ 788–820) అవతరించి, ముఖ్యముగా హిందూమతములోని భిన్నమతసంప్రదాయములను, బౌద్ధజైనాదులను ధ్వంసముచేసి,యద్వైతమతమును స్థాపించిరి. కాబట్టి కవులలో వెనుకటి గుంపులకు తోడుగ నద్వైతకవులగుంపు చేరినది. వీరిది గాని, శైవకవులది గాని, హిందూమతమే కదా! శివకవులు శివకవులే కాగా, క్రొత్తగ బయలుదేరిన యద్వైతకవులు నవకవు లని పిలువబడెడివా రని చెప్పవచ్చును. ఇట్టియూహా క్రిందిపద్యము బలపఱచుచున్నది. 1950 ప్రాంతపువాడైన తురగారాజకవి,

అయ్యలంకి బాలసరస్వతి యను జంటకవులు నాగగఖండ మను తమ తెలుగు ప్రబంధములో కవుల నిట్లు స్తుతించినారు.—

సీ. ప్రాచేతసు, పరాశరతనూజు గాళిదా
సు, మయూరు, భవభూతిఁ, జోరు, దండి,
బాణు, ధనంజయు, భారవి, జయదేవు,
భానుని, శ్రీహర్షు, ప్రవరసేను,
మల్హాణు, బిల్హాణు, మాఘు, మురారిని,
క్షేమేంద్రు, నటమూలు, సోమనాథు,
శివతత్త్వు, శివదేవుఁ, జిన్నయు, భవదూరు,
శరభాంకు, రాజశేఖరుని, వేము,

తే. గీ. నన్నపను, దిక్కమఖి, ప్రబంధపరమేశు,
సాఘనాధర్వణాచార్యుఁ, జందరిమాళి,
భాస్కరుని, నల్ల శ్రీనాథభట్టు, భీము,
సోము, నమరేంద్రు దలతు నుత్సుకత నాత్మ.

ఆకవులలో వరుసగా మూడుగుంపులవా రున్నారు. సంస్కృత శివకవులు, తెలుగు శివకవులు (వీరశైవకవులతోఁ గూడ), నితరులు. ఈ యితరులే నవకవులు. వీరు నన్నయభట్టు (అథర్వణుని విషయమ ట్లుండనిండు) మొదలైనవా రిక్కడ స్తుతింపబడిరి. వీరిని నవకవు లని వీరశైవకవులు చెప్పుచుండిరి. వెనుక నుదహరించిన కందపద్య చరణమునకు 'శివకవు లగు నవకవులకు' ననుపాదాంతరముకూడ గలదు. కాని యిటీవలికవు లెవరును నన్నయభట్టాద్యద్వైతకవులను స్తుతింపకపోలేదు. కాబట్టి పాఠాంతరము సరియైనది కాదు.

అయితే నవకవు లను సమాసమునకు నన్నిచోటుల నదియె యర్థము పొసగదు. పింగళి ఎల్లన్న (1590–1620) తోభ్యాచరిత్రలో.

సీ. భక్తిమై రేణుకప్రమథోత్తము నుతించి,
మాయదేవాహ్వాయుమహిమ పొగడి,
చెలగి యథావాక్యముల నన్నమయగారి
భజియించి మ్రొక్కిడి, పాలకురికి
సోమన్నగారి బ్రస్తుతిచేసి ప్రియమంది,
శివదేవముఖ నవకవుల నెంచి,
గణపతిదేవునిఘనత సన్నుతిచేసి,
వేమన గీర్తించి విమలమతిని,
తే. గీ. వ్యాస, వాల్మీకి, కాళిదాసాదిఘనుల,
నన్నపార్యుని, దిక్కనయజ్వ, నెఱ్ఱ
ప్రెగడ, ధూర్జటిc, బోతన. భీమకవిని,
చెలగి శ్రీనాథముఖకవిశ్రేణిc దలచి.

యని తెలియజేసెను. శివదేవయ్య కాకతీయరాజుల కాలమువాడు. ఆనాడు నవకవు లనిప్రసిద్ధిచెందినగుంపు చరిత్రలో కనబడదు. కాబట్టి శివదేవు డని తరువాతకవులని యర్థమును జెప్పుకొని తృప్తిపడ వలసివచ్చుచున్నది.

## ఫ ల శ్రు తి

వెనుకటిగ్రంథములలో గ్రంథాంతమందు ఫలశ్రుతి చెప్పుట యాచారము. పుస్తకమున కొక ఫలశ్రుతి పద్యము చాలును. పది యక్కరలేదు. అందులోను నేవిషయమునైనను బహుసంక్షిప్తముగా జెప్పెడివేమన పది ఫలశ్రుతిపద్యాలను వ్రాయడు. అట్టి సందర్భములో వేమన వ్రాసిన ఫలశ్రుతిపద్యము లనిచెప్పబడుచు, సుమారు పదిపద్యములు చలామణిలో నున్నవి. పైగా వానిలో నాటవెలదులు, తేటగీతులు, కందాలు, ఇత్యాదు'లున్నవి. ఆటవెలది పద్యమునకు తేటగీతి కాని, కందముకాని రూపాంతరము కాదుకదా! అవన్నియు వేమన వ్రాసిన ఫలశ్రుతిపద్యములేనా! కాబట్టి వేమయ్య, లెన్ని ఫలశ్రుతి

పద్యములున్నవో యన్నిగ్రంథములను వేమనపేరు పెట్టి సృష్టించినా రని నిస్సందేహముగాఁ జెప్పఁగొనవచ్చును. ఇట్లు వేమన మొదటి నూఱుపద్యములును కాలము గడవను వేలసంఖ్యకుఁ బ్రాకినవి.

## వేమన ప్రసిద్ధి

ఎప్పటివాఁడో యయిన వేమనకవిని పదునైదవ శతాబ్దియంతము వరకును బొగడినవారు కనబడరు. పూర్వకాలములో నెవరిమతము తాలూకు కవులను వారు పొగిడేవా రని చెప్పవచ్చును. శైవులు శైవకవులను, బౌద్ధులు, జైనులు తమతమ కవులను, నద్వైతు లద్వైతకవులను మెచ్చుకొనువా రని చెప్పవచ్చు. మొదట శైవులు శైవపారమ్యతనుమాత్రమె యంగీకరించెడివారు. పిమ్మట నద్వైతము శైవవైష్ణవముల భేదముల నంతరింపజేసినది. కాని రామానుజా చార్యులు బయలుదేరి యద్వైతములోని యైకమత్యమును సడలగొట్టి వైష్ణవపారమ్యమునుగురించి చెప్పుచు, వీరవైష్ణవమును బ్రచారము చేసెను. అది వీరశైవస్థాపన కవకాశ మిచ్చినది. కాబట్టి బసవేశ్వరుడు వీరశైవమును బోధించెను. అట్లు శైవము రెండువర్గములైనది; శైవ కవులతోబాటు వీరశైవకవులుకూడ తయారైనారు.

అద్వైతమతస్థాపనతో కవులకు సంస్కృతరచనతో నెక్కువ సం బంధమేర్పడినది. పురాణేతిహాసముల నాంధ్రీకరించుట ప్రబంధరచన ముఖ్యములైనవి. దేశిరచన ద్విపద యుదాహరణము యక్షగాన శత కాదుల నిర్మాణమును వారు ఘనకార్యముగా నంగీకరించలేదు. ఈ రచనలు బసవేశ్వరునితర్వాత వీరశైవకవుల పాల బడినవి అటువంటి స్థితిలో ముందే దేశీయలక్షణమును గ్రహించి శతకమును రచించిన వేమనకవి గొడవ లెవరికి కావలెను! పైన జెప్పినబిగువు లన్నియు పదు నైదవ శతాబ్దాంతానికి సడలినవి మతసంప్రదాయభేదములనుండి కవి త్వమును వేరుచేసి మెచ్చుకొను నుత్తమస్థితి యేర్పడినది. కావ్యరచనలో నుత్తమ క్షుద్రభేదములు తగ్గిపోయినవి. పైగా ప్రజలలో వేమన

పద్యములకు జనత విస్తార మైనది. అట్టికారణములవలన వేమనను కవి స్తుతులలో పేర్కొనినారు.

## స్వస్థల మేది?

వేమనస్వస్థలమేది యనువిషయముమీద విమర్శకులు చాల చర్చ చేసిరి. (1) "వేమనసమాధి కడపజిల్లాలోని కటారుపల్లెలో నున్నది" అనువిషయము సాంప్రదాయకముగా వచ్చుచున్నది. కాబట్టి యతఁడు కడపప్రాంతమువా డనినారు కొందఱు (2) వేమన గుంటూరు జిల్లాలోని కొండవీటికాపురస్తుడు పైగా రెడ్డిరాజుల వంశము లోని వాఁడు అనువారుకూడ నున్నారు. రాయవరపు పూర్ణయాచార్యులు వేమనసూక్తిరత్నావళి యనుతనగ్రంథములోను ఖాసింఆలీషా కొండవీటిచరిత్ర (1924) యను చిన్నపుస్తకములోను అట్లు వాదించిరి. మద్దులపల్లి గురుబ్రహ్మశాస్త్రి కొండవీటి సామ్రాజ్యము (1920) అను తన పుస్తకములో నావాదన కేమియు నాధారములే దని వ్రాసినాడు. చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్ర మూడవభాగములోని రెడ్లచరిత్ర (1920) లో వేమన నెత్తుకొనలేదు ఆంధ్రేతిహాసపరిశోధక సంస్థవారి రెడ్డిసంచికలో వేమనకవి ప్రసక్తి లేదు. (3) వేమన చరిత్ర మను చిన్న ద్విపదగ్రంథము (తాటాకుప్రతి) ఉన్నది. ఇది 820 ప్రాంతపురచన యని వంగూరు సుబ్బారావుగారు వేమన యనుతమ పుస్తకములో తెలిపినారు. ఈ ద్విపదగ్రంథములో వేమన మార్కాపురములో జన్మించి కటారు పల్లెలో సమాధిచెందె నని కలదు. పై మూడు వాదనలను కొంచెముగా పరిశీలించవలసియున్నది.

వేమన కొండవీటినివాసి యనువాదమునకు నీ క్రిందిపద్యము ముఖ్యాధారము.

ఆ.వె. ఊరు కొండవీడు, ఉనికి పశ్చిమవీధి,
మూగచింతపల్లె మొదటియిల్లు
ఎడ్డిరెడ్డికుల మదేమని తెల్పుదు. ॥విశ్వ॥

మొదటివిషయము వేమనది రెడ్డికులముకాదు. దానిని ఇటు పిమ్మట వివరించెదను. కులగోత్రములమీద నమ్మకము లేనివేమన తననుగుఱించి యట్లు బట్టబయలుగా చెప్పుకొనడు. కాని వేమన మతసంప్రదాయము ననుసరించిన వేమయ్య లెందరోయున్నారు. వారిలో వేమారెడ్డి యొకడు. వీనినిగుఱించి యిటుపిమ్మట కొంచె ముగా చెప్పబడును. ఆపద్య మాతని యాత్మఘోష కావచ్చును.

వేమన కటారుపల్లెలో సమాధిచెందె నని చెప్పుచు నతని మత సంప్రదాయము ననుసరించు వేమయ్య లందు గలరు. వారు వేమన యుత్సవాదులను జరుపుచుందురు. వేమనకవి యాస్థలమందు సిద్ధి బొందుటనుబట్టియె యచ్చట నట్టిసంప్రదాయ మేర్పడినదని నమ్మక ముతోఁ జెప్పవచ్చును. ఆ ప్రాంతపువాడైన చౌడప్పకవి స్థానికాభి మానమును జూపుచు, వేమనను గుఱించి—

క. వానను దడియనివారును, పూనుక వేమన్న చేత పొరయనివారున్
నానాదిక్కుల వెదకినఁ, గానముర నెంతవాని కవిచౌడప్పా!

అని చెప్పినాడు. అతఁడు వేమనవలె నాత్మసంబుద్ధిగా శతకమును కూర్చినాడు. అట్టి యుపపత్తులతో వేమనకవి కదిరి ప్రాంతపువాడని సమర్థింపవచ్చును. అతని కవిత్వపుభాషను పరిశీలించినవారు దానినె సమర్థించుచున్నారు.

## కాలము

వేమనకాల మెద్ది యనునది పెద్దసమస్య. వేమన్నను కొందఱు కవిస్తుతులలోఁ జేర్చుటనుబట్టి యతని కాలనిర్ణయమునకు నొక దిగువ హ ద్దేర్పడు చున్నది. ఆ మహాకవిని 1520 ప్రాంతపువాఁ డైన ఎడపాటి ఎఱ్ఱయకవి తన మల్హాణచరిత్ర యనుపద్యకావ్యములోని కవి స్తుతిలోఁ జేర్కొనెను. కాబట్టి వేమన 1520కి పూర్వపువాఁ డని నిశ్చయమగుచున్నది.

ఎవడో యొక వేమయ్య వ్రాసిన దీ క్రిందిపద్యము.

ఆ. వె. పరగ రాయనికుల బాచని ధన మెల్ల
భట్లపాలు, కవులపాలు తలప
నొనర హీనకులునిధనము దాయాదుల
పాలు, జారకాంతపాలు వేమ!

దీనిలోఁ జెప్పబడిన ప్రముఖు డైన రాయనిబాచఁడు శ్రీనాథ మహాకవిచేత కాశీఖండప్రబంధములోని యవతారికా పద్యములలో స్తుతింపబడెను. అప్పటికి రాయనిబాచఁడు క్రీ॥శ॥ 1400 ప్రాంతపువాఁడుకదా! ఆకాశరామన్న పేరువలె వేమన పేరు నందఱు నుపయోగించుకొనువారె! బాచనికి సమకాలికుఁ డైన యొక వేమయ్య పై పద్యమునకు వేమన యను సంబోధనను చేర్చుటనుబట్టి, వేమనకవి 1400 కి పూర్వపువాఁ డగుచున్నాడు. అట్లయినచో నతఁ డెప్పటివాఁడు?

1160 ప్రాంతపువా డైన మల్లికార్జునపండితుఁడు వ్రాసిన శివతత్త్వసారములో వేమన పద్యములలోని భావములు గలవు. మల్లికార్జునపండితుని భావములను వేమన యనుకరించె నని వంగూరి సుబ్బారావుగారు[5] వ్రాసిరి. పరమోపజ్ఞతతో పద్యములను వ్రాయువాఁడు వేమన యనువిషయమును నట్లుంచెదము. వేమనకవియె యాపండితునికంటె ముం దున్నవాఁ డని నిశ్చయ మగు పక్షములో, నట్టియభిప్రాయములు దారుమా రగునుకదా!

ఈపట్టున తెలుగు కవిత్వముయొక్క ప్రాచీనతనుగుఱించి టూకీగా చూడవచ్చును. మనకు దొరికిన తెలుగుపద్యశాసనములు క్రీ. శ. 850నుండి కలవు. దానినిబట్టి తెలుగుకవిత్వ మంతకుపూర్వమె కొన్నిశతాబ్దములనుండి యున్న దని మనము గ్రహించుటలో నే యిబ్బందియు లేదుకదా! అది య ట్లుండనిండు.

5. వంగూరి సుబ్బారావుగారి వేమన, పుట 76.

నన్నయ్యభట్టు తన మహాభారతములోని, కవిత్వములో నారు యతులను వాడినాడు. అంతకుపూర్వపువాడైన రేచనకవి తనకవిజనాశ్రయములో నాలుగు యతులనుమాత్రమె పేర్కొన్నాడు. రేచన నన్నయభట్టునకు పూర్వపువాడనుసంగతి స్పష్టమయినదికదా! రేచన క్రీ.శ. 850 ప్రాంతపువాడని నేను సోపపత్తికముగాఁ దెలియజేసినాను[6].

వేమన వాడినయతులసంఖ్యకూడ నాతనికాలనిర్ణయమునకు నాధారమగును[7] తమగ్రంథములో—"ఇతని (వేమన) పద్యముల నచ్చటచ్చటఁ జేతికివచ్చిన యొకనూఱుపద్యాలు తీసి పరీక్షించితిని. యతులు సాధారణముగా నతిసులభమైనవి. స్వరయతులు, వర్గయతులు యెక్కువ......రెండు మూఁడు విధములైన యతులను మాత్రమె తఱచు వాడినాడు"అని తెలియజేసినారు. యతులు నాలుగని చెప్పిన రేచన క్రీ. శ. 850 వాఁడుకాగా రెండో మూఁడో యతులను మాత్రమె యుపయోగించిన వేమన యంతకు పూర్వపువాడని నిర్బాధకముగా నిర్ణయించవచ్చును. కాబట్టి యిప్పటికి గల యాధారములను బట్టి వేమన క్రీ. శ. 800 ప్రాంతపువాఁడని చెప్పుకొనవచ్చును. అప్పటికి శంకరాచార్యుల వారు, వేమనమహాకవికూడ సమాకాలికులయ్యెదరు.

వేదాంతములో మాయావాదమునుగుఱించి నొక్కిచెప్పినవారు శంకరాచార్యులవారు. వేమనను గుఱించి వేమన శిష్యుఁడొకఁడు చెప్పిన యీక్రింది పద్యములోని మాయయనుమాట యీమహామహుల సమకాలికత్వమును రుజువుపరచుచున్న దనవచ్చును—

క. తామరయందునసీర్వలె, వేమనజరియించుచుండెవెదకుచు శివునిన్
ఈమాయ నమ్మగారాదీమనమునఁ దెలియరాదు యీశుని వేమా!

6. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం 52, సంక 3, 4
7. వేమన, పుట 114

## బ్రాహ్మణ కులము

వేమనకుల మేమి యనుప్రశ్ననుగుఱించి—వేమన బ్రాహ్మణుఁడనియు, రాజనియు, జంగ మనియు నిత్యాదులుగాఁ జెప్పబడుచున్నాడు. వేమన పద్యములనుఁ గొన్నిటినిఁ జూడగా నతఁడు బ్రాహ్మణుఁ డను విషయము విశదమగును. ఈ పద్యములను గమనించుము—

ఆ. వె. ద్విజకులమ్మునందు తేజరిల్లుచు బుట్టి,
తాఁ దరించి, యొరుల దాటజేయ
లేనియాత డున్న లేకున్న నొక్కటె ॥విశ్వ॥

ఆ. వె ద్విజుల ఖేదబెట్టి, తిట్టదొడగువాడు
మృతినిబొంది, తాను వెతలబడగఁ
గాలుదరిని జేరుఁ గడతేఱలే డయా॥విశ్వ॥

అని శపించుచున్నాడు. ఇట్టిపద్యములను జూడగా నతఁడు బ్రాహ్మణకులములో బుట్టి శంకరాచార్యులవారిలాగె సన్యాసియై లోకోద్ధరణకు పాటుబడె నని చెప్పవలసివచ్చుచున్నది.

అతడు మకుటములోకూడ నాభావము నె చేర్చినాడా? విశ్వదుడు అనగా జగత్తునిచ్చిన (సృష్టించిన) వాడు. అనగా బ్రహ్మ. అట్టివాని కభిరాము డనగా ప్రియమైనవాడు. అనగా బ్రాహ్మణుఁడు. అట్లాతని కులము మకుటములో గర్భితముగా కనబడుచున్నది.

పూర్వకవులలో బ్రాహ్మణేతరకవులు పేరునకుండవచ్చును. వర్ణాశ్రమధర్మాలను విధిగా పాటించిన యాకాలములో కవిత్వము చెప్పెడికులమే యొకటయినది కదా! ఇతరవర్గాలవారికవిత్వము తగిన ప్రమాణముల నందుకొనుట సామాన్యముకాదు. కావున నట్టివారి కవిత్వ మడుగున బడియుండును. ఎక్కడనో యేచక్రవర్తియో యితర కారణములనుబట్టి యీ నిబంధనకు మినహాయింపు కావచ్చును. అట్టి కారణములవల్ల నాకాలములో కవులు తమ కవిస్తుతులలో పేర్కొన్న

కవులు బ్రాహ్మణకవులే కాని, తదితరులుకా రని యంగీకరించవచ్చును. అట్టిస్థితిలో వేమన పేరును కవులు తమ కవిస్తుతులలో పేర్కొనుటను బట్టి వేమన బ్రాహ్మణు డనువిషయమును గ్రహించవచ్చు.

అయితే వేమనకు కులభేదాలలోగాక, కులనాశనములో నమ్మక మధికము. కాబట్టి—

ఆ.వె. ఉర్వివారికెల్ల నొక్కకంచము బెట్టి
పొత్తుగుడిపి కులము పొలయఁజేసి
తలను చేయిబెట్టి తగనమ్మ జెప్పరా ॥విశ్వ॥

అని బోధించెను. ఈ తత్త్వమనాదిగా వచ్చుచున్నది.

వేమనచరిత్ర (1820) యను ద్విపదకావ్యములో వేమన కాపు కులమువా డని చెప్పబడినది. ఇది వేమనచరిత్రగాక మార్కాపురములో జన్మించి, కటారుపల్లిలో గురువుగారిచెంత శివసాయుజ్యమును చెందిన యొక వేమయ్యచరిత్ర మాత్రమె.

వేమన మతసాంప్రదాయికులలో నన్నికులములవా రున్నారు. వారు తమపద్యములలో నొక్కొక్కప్పుడు తమకులమును చెప్పుకొన్నారు. వేమారెడ్డి యనునది యట్టిసంబోధనమాత్రమె. యోగిరాయడు వేమా, దేవరవేమా అను మకుటములుకూడ గలవు. వేమన్న దేవుడిగా నెంచబడినపిమ్మట దేవరవేమా యని సంబోధింపబడె నని చెప్పవచ్చును.

## వే మ న జ న న కా ల ము

వేమన పుట్టినసంవత్సర మని చెప్పబడెడి పద్య మొకటి కనబడుచున్నది.

క. నందనసంవత్సరమున పొందుగ, కార్తికశుద్ధపున్నమినాడున్
వింధ్యాద్రిసేతుబంధన, సందున నొకవీరు డేలు సరగున వేమా!

ఆట వెలదులు గల వేమనశతకములో నీకందపద్యమునకు తావు లేదు కాబట్టి అది వేమనవ్రాసినది కాదు పైగా దీనిలో మూడవ చరణములో ప్రాసస్థానము తప్పు ఇట్టితప్పు పద్యము వే రెవరిరచన ?

పై పద్యమునుబట్టి కాలనిర్ణయము చేయుట యసాధ్యము. ఎందుచేత ననగా, దీనిలో వారము పేరు చెప్పబడలేదు. వేమన క్రీ. శ. 800 ప్రాంతపు వాడని చెప్పుకొనునప్పుడు, నందన సంవత్సరములు క్రీ. శ. 752 లోను, 812 లోను వచ్చినవి వేమన క్రీ. శ. 752 న జన్మించెను. అని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పుట కాపద్యమె యాధారముకా నవసరములేదు.

ఆపద్యము వేమనరెడ్డిపద్యాలు అను పేరుగల తాటాకుప్రతిలో [8] నున్నది. వేమన మతసాంప్రదాయికుడైనయొక రెడ్డికులస్థుడు తన్ను గురించి చెప్పుకొన్న యహంభావపద్యము కావచ్చును.

## వేమన జీవితము

వేమన జీవితములోని ముఖ్యఘట్టములు, ఘటనలు మనకుఁ దెలియవు. అతనిభావాలుమాత్రము తెలియుచున్నవి. అతఁ డెప్పుడు పుట్టెను? తలిదండ్రు లెవరు ? ఏమిచదివెను? పెండ్లియైనదా? సంసారము చేసెనా? కుటుంబజీవిత మేమి? వృత్తియేమి? ఎప్పుడు శివైక్యమును జెందెను? మొదలైనవిషయములు మనకుఁ దెలియవు.

ఆ.వె. కామి గానివాడు కవిగాడు, రవిగాఁడు
కామిగాక మోక్షకామి గాఁడు
కామియైనవాఁడు కవియగు, రవియగు.

అని చెప్పినభావమునుబట్టి యతఁడు కొంతకాలము సంసారికాబోలు నవచ్చును. పిమ్మట విరాగియై యవధూతగా సంచరించి యుండవచ్చును.

---

8. వంగూరి సుబ్బారావుగారి వేమన, పుట 39.

ఆ. వె. తల్లిగర్భమందుఁ దా బుట్టినప్పుడు
మొదట బట్టలేదు, తుదను లేదు
నడుమ బట్ట కట్ట నగుబాటు కాదొకో ॥వి॥

అనునవి యవధూత పలుకులే కదా!

వేమనకవి మొదట జారుడై పిమ్మట విరాగి యైనా డను నపవా దొకటి కలదు. దీనికి నొక్కటె యాధారముగా కనబడు చున్నది. వేమన యాటవెలదులలో పద్యములను వ్రాసెను కదా! ఆటవెలది యనుపదమునకు వెలయా లను నర్థమును గ్రహించిన పామరులు వేమనమహాయోగినిగురించి పుక్కిటికథలను పుట్టించిరి. అంతకంటె నిజము లేదు.

## వే మ న మ కు ట ము

వేమనవ్రాసినమాటలలో కాఠిన్యమెక్కడనైన నున్న దన్నచో నది యాత డుపయోగించిన 'విశ్వదాభిరామ వినుర వేమ' యను మకుటములోనె దానికి చాల వ్యాఖ్యానములు బయలుదేరినవి. ఏవిషయమునైన బహుసరళముగా వేమన చెప్పెను. అట్టిసందర్భ ములో నాతఁ డేర్పరుచుకొన్నమకుటములోకూడ సారళ్య మున్న దని భావించవచ్చును.

అతడు తాను బ్రాహ్మణుడ నని మకుటములో తెలియజేసి కొన్నా డని యిదివరకు వ్రాసితిని. అట్లె మరొక యర్థమునుకూడ గ్రహించవచ్చును. వేమన శివాద్వైతి యనువిషయ మెల్ల రెరిగినదె ఆయర్థముకూడ మకుటములో గనబడుచున్నది. విశ్వదుఁ డనగా జగత్కర్త, విశ్వనాథు డైనశివుడు. అట్టివానికి నభిరాముఁ డనగా ప్రియమైనవాడు. కాబట్టి శివునికి ప్రియమైనవాడా వేమా యని మకుట మును వ్యాఖ్యానించవచ్చును. ఇది యశోకచక్రవర్తి వాడిన దేవా నాంప్రియశబ్దమువంటి దని చెప్పవచ్చును.

## వే మ న క వి త్వ ము

వేమన యెంతపెద్దభావమునైన కొద్దిమాటలలో కుదించి చెప్ప గలడు. దానినె పాల్కురికి సోమనాథుడు—

అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయకాదె కవివివేకంబు.

అనెను.

వేమనచెప్పెడిభావము తేటగా, సూటిగా, ఘాటుగా నుండును. జుగుప్స కలిగించెడిస్త్రీవర్ణన లతనివి కాదు, వేమయ్యలవి! అతని మాటలలో మోటుదనము లేదు. అతనిభావము లెంత గొప్పవో భాషకూడ నంతె. అన్నివిషయములనుగుఱించి సూత్రప్రాయముగా చెప్పెడి యలవాటు. కాబట్టి యాతనివాక్యము లెన్నియో సామెతలై వ్యాపించినవి.

సీసపద్యముకొస నుండెడియాటవెలదిపద్యమునకు ప్రత్యేకప్రతిపత్తి నాతఁడు గల్గించెను. కందపద్యానకి తిక్కన యైతే, యాటవెలదికి వేమన.

వేమనశైలి కవులకుసెరవడి, అతని సులభశైలిని గంభీరభావమును, వివేకమును మనకవు లలవరచుకొనియున్నచో, మనవాఙ్మయము నానాటికి గుంటపువ్వులు పూచి, కుక్కమూతిపిందెలను కాచియుండదు. దైవభక్తికి శత్రువు మూఢభక్తికదా!

### ఉపమానములు

వేమన చెప్పెడియుపమానములు చాలచిత్రముగా నుండును. బహుసామాన్యమైనవస్తువులతో పోల్చి యతఁడు వింతగా చెప్పును. మనము నిత్యమును జూచెడినీటిచుక్కలె, తెల్లవారుజామున సూర్యోదయమప్పుడు, గడ్డికొనలనుండి వ్రేలాడుచు ముత్యములుకాని వేరేమియు కావనిపించును. అట్లె వేమన యుపమానములను; అట్టివె కాళిదాసమహాకవివె కూడ.

వేమనయుపమానములకు నుదాహరణలు కావలసినన్ని—

పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనె
కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా
పుట్టమీదగొట్ట భుజగంబు జచ్చునా
పుట్టలోనచెదలు పుట్టవా గిట్టవా
పంది పిల్లలీను పదియు నైదింటిని
చెప్పు దినెడికుక్క చెఱకుతీ పెరుగునా
మేడిపండుచూడ మేలిమై యుండును.

చీకటిలోనువస్తువునుఁ జూపించుటకు దీప మేలాగుసాయపడునో, నా లాగె యొకసూక్తియొక్క భావమును నుపమానము విశదపరచును.

## నీతి; అచలమతము

వేమన సంఘమును, ప్రపంచమును, తరచిచూచినవాడు. సాంఘికాచారములు మతసంప్రదాయములు మున్నగువాటిని బాగుగా పరిశీలించినవాడు అఁతడు సంస్కరణాభిలాషి కాబట్టి సంఘములోని దుష్ప్రవర్తనను మోమోటవీడి విమర్శించినారు. తాఁను జెప్పెడిదాని నొకరు మెచ్చుకొనిరా లేదాయనునది యతని ప్రశ్న కాదు. రోగి యెక్క యనారోగ్యమును నిర్మొగమాటముగా తెలియజేయు వైద్యునివంటివాడు వేమన.

వేమన కేవలము నీతిపద్యములనుమాత్రమె వ్రాయలేదు. మనమతములోని దురాచారములను ఖండించినాడు.

ఆ. వె. ఆత్మశుద్ధి లేనియాచార మదియేల?
భాండశుద్ధిలేని పాక మేల!
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా ?

అని నేరుగా ప్రశ్నించినాడు. తలలు బోడు లైన తలపులు బోడులా యని లోపలిమలినమును జూచుకొ మ్మనినాడు.

కర్మకాండకును, మంత్రోపాసనకును మించినది దైవోపాసన యని యెలుగెత్తి చాటినాడు—

ఆ.వె. కల్లగురుఁడు కట్టు నెల్లకర్మంబులు,
మధ్యగురుడు గట్టు మంత్రచయము
ఉత్తముండుగట్టు నొక్కసామ్రాజ్యంబు ॥విశ్వ॥

అద్వైతము నతఁడు వల్లించుచు—

ఆ. వె. నిన్నుఁజూచెనేని తన్ను దా మరచును
తన్ను జూచెనేని నిన్ను మరచు
ఏవిధమున మనుజు డెరుగు నిన్నును దన్ను ॥వి॥

అని ప్రపంచకమును విడనాడని తత్త్వమును బోధించినాడు. అతఁడు వ్రతాదులను నిరసించినాడు.

ఆ. వె వ్రతము లెన్నియైన వట్టిచిక్కులె గాని
ఆత్మ చిక్కగాన నలవిగాదు.
ఆత్మచిక్కు బాపునతడె పో ఘన యోగి ॥ విశ్వ ॥

అనినాడు. విగ్రహారాధన యన నతనికి బొత్తిగాసరిపడదు. రాళ్ళు దేవుడైన రాసులు మ్రింగవా యని ప్రశ్నించినాడు.

ఆ. వె. శిలలు జూచి నరులు శివు డని భావింత్రు
శిలలు శిలలుగాని శివుడు కాదు
తనదులోన శివుని తా నేల తెలియడో! ॥విశ్వ॥

అని విస్తుపోయినాడు.

వేమన గురువు, బ్రహ్మచర్యము, నడత, జ్ఞానము, శివాద్వైతము ముఖ్య మనెను. శంకరభగవత్పాదు లద్వైతమును బోధించగా, సమకాలికు డైనవేమన సంఘమును, మతమును విమర్శించుచు జ్ఞానమును బోధించినాడు. వేమన తనప్రచారము నాంధ్రదేశమునకె పరిమితము చేయగా, జగద్గురువు లైన శంకరాచార్యులువారు హిందూదేశ మున్నమూలలను వ్యాపింపజేసిరి.

వేమన బోధించిన వేదాంతమున కతనిశిష్యు లచల మతము లేక బయలు మతము నని పేరు పెట్టుకొనిరి.

వేమన మనసంఘమున కొకపెద్దమేలును జేసెను. అదేమనగా-సంఘములోగాని మతములోగాని విమర్శదృష్టిని గలిగించెను. ఎవరేది చెప్పినను నమ్మినయెడల నది మూఢభక్తి యగును. అందువలననె యాకాలములో నర్థములేని యంతములేని మతసంప్రదాయము లున్నవి. దీపమునకు మసి పట్టిన దోమ్ ఎటువంటిదో మతమునకు మూఢభక్తి యటువంటిది. ఈనాడు మనకు సంఘములో కొంతయైన విమర్శదృష్టి యున్నదనిన నదికొంతవరకు వేమనబోధనలవల్లనె యని భావించవచ్చు.

## కూటవేదాంతము-అవినీతి

కూటవేదాంతము గమ్మత్తుపద్యములను వేమన సృష్టించెనా? దానినిగుఱించియైన వేమన ఢంకామీద దెబ్బకొట్టినట్లు చెప్పును. అంతియేగాక యతనిభావము నిర్మలమైన గాజుపలకలోనుండి చూచిన ట్లుండును. కాబట్టి దీనిభావమేమి తిరుమలేశ' వంటికవిత్వము వేమయ్యదది, గంజాయి బైరాగులదికాని, యతనిది కాదు.

బ్రహ్మచర్యమును, సత్ప్రవర్తనను బోధించిన వేమన మోటైన పద్యములను వ్రాయుడు. ఆ చెత్త యంతయు బైరాగి వేషధారుల బండసృష్టి.

## వేమన యనంతరము

ఆ మహాకవి ఎంతకాలము జీవించి నిర్యాణము చెందెనో మనకుఁ దెలియదు. బాగుగముసలివాడై ప్రపంచమును వదలియుండును. ఆతని యనంతర మాతనిశిష్యు లిట్లు వర్ణించినారని చెప్పవచ్చు—

క. తామరయందున నీర్వలె
వేమన జరియించుచుండె వెదకుచు శివునిన్
ఈ మాయ నమ్మగా రా
దీమనమునఁ దెలియరాదు యీశుని వేమా!

క. వేమన్నా ! నీమహిమల
వేమన్నా! తెలియ వింక నెటువలె నన్నా !
వేమన్నా ! నీచిత్తము
వేమన్నా ! నీవె మాకు, నెవరు గ తన్నా !

అని యాక్రోశించిరి పాపము

వేమన్న మహిమాన్వితు డనినా రామతసంప్రదాయికులు అతఁడు దేవు డనుటాక విడిచిపెట్టలేదు. అయితే యిటువంటి మాటలను వేమన యొప్పుకొోన డనునది వేరువిషయము.

క. ఆమడ కామడ కడవులు
గ్రామంబులు, చెరువు, నదులు, కర్మము నెంతే
తా మెందులోన దిరిగిన
వేమన తోడగుచు వచ్చు వెంటనె వేమా !

ఈ పద్యమునకు బ్రౌన్ దొర తననిఘంటువులో నుదహరించి వేమనయనగా దేవు డనునర్థమునుఁ జెప్పినాడు. పామరుల జ్ఞానము పతాకనందుకొన్నది పాపము !

## నూతన ముద్రణ

వేమనపద్యముల నచ్చువేయువా రకారాదిగా గాని, వర్గీకరించి గాని యచ్చువేయుటకంటె యీ క్రిందిక్రమమును పాటించుటమేలు—. ఆటవెలదులు—ఉపమానములుండి చివర విశ్వదాభిరామ వినురవేమ యను పూర్తిమకుటము గలవి. 2. ఆటవెలదులు—ఉపమానములు లేకుండ పూర్తిమకుట మున్నవి. 3. ఆటవెలదులు— కడపట నేదో సంబోధన యున్నవి 4. గీత పద్యములు ఉపమానములున్నవి. 5. గీత పద్యములు—ఉపమానములు లేనివి 6. కందపద్యములు7. సీసాసుదులు 8. వృత్తాదులు 9.పదములు 10. ఇతరములు. అవసరమైనచో ప్రతి భాగము క్రిందను నీతి వేదాంతము మొదలైనవిగా వర్గీకరించు కొోన వచ్చును.

## ముగింపు

సుమతీశతకమునకు తెలుగుదేశములో గొప్ప ఘనత యున్నది. దానిని మించినది వేమనశతకము. వేమనయొక నూఱు పద్యములను మాత్రమె వ్రాయగా, నవి వైెదువేలుగా పెరిగినవి. అమితాశ్చర్యము! ఈ మాదిరిగా గ్రంథము పెరిగినకవి ప్రపంచములో మరియొక్క డున్నాడో. లేడో!

వేమన వ్రాసిననూరుపద్యములు గల శతకము పరిశోధకులు శ్రమపడి బైటపెట్టెదరుగాక!



శ్రీః

## చీనా దురాక్రమణము

[యక్షగానము]

శ్రీ దామెర రాజగోపాలరావు.

గతసంచిక తరువాయి

సీ॥ ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచంబునందలి
నిఖిలాప్త రాజ్యాధినేతలార!
శాంతికాముకులార! సౌహార్దమతులార!
సౌజన్యవరులార! సౌమ్యులార!
ఏరాజ్యకూటమిఁ జేరఁబోమను మా వి
ధానంబు మన్నించి, తగ నెఱపిన
మీసానుభూతికి, మీదుసాయమునకు
మాయెడ మీ యభిమానమునకు,
గీ॥ సర్వదా కృతజ్ఞుల మేము; సమ్మదమున
భారతీయుల యెల్లరపక్షమునను,
నాహృదయపూర్వకాభివందనము లివిగో,
స్వీకరింపుఁడు, మీకు నర్పించుచుంటి.

వ॥ అంతట చీనానియంత భారతదేశమునకు సాహాయ్యము సందించుచున్న పాశ్చాత్యరాజ్యాధిపతుల నెల్లరఁ గనుకట్టుఁదనమున దిసంతుకొట్ట వారేమనుచున్నారు.

ఏ ల లు—

మంచిచెడ్డ లెంచకుండ, సంచరించుచుంటి వీవు,
వంచన యది నీదురూపురా, ఓ చీనివాఁడా! క్రించుఁదనమె నీకుజూపురా!
లగ్గు కూర్చినట్టివారి, కెగ్గును దలపెట్టినావు;
సిగ్గుకలదా, యింతకంటెను? ఓదుండగీఁడా!, తగ్గు, తగ్గు, నేఁటికైనను॥

వ॥ చైనీయుల ననేకుల హతమార్చి యసువులఁ బాసిన యొక దళాధిపతి తండ్రి ప్రతాపుఁ డనువృద్ధుఁడు తన్ను నోదార్పవచ్చిన యిరుగుపొరుగువారితో నే మనుచున్నాఁడు.

శా॥ కాలంబెల్లను జెల్లి చచ్చుటయొ, రోగగ్రస్తమై చచ్చుటో,
యాలోగండమువచ్చి చచ్చుటగొ, తథ్యంబెమ్మెయిం బ్రాణియీ
నేలం బుట్టినదొట్టి, యట్టి తుదికంటెన్ మాతృదేశార్థమై
యాలంబందునఁ జచ్చినన్ యశము స్వర్గావాసముం దక్కెడున్॥

శా॥ నా పీరాత్మజుఁ డేగె స్వర్గమునకుం, దచ్చింత లే దింతయున్;
నే వృద్ధుండను నైతి, యుద్ధమునకున్ సిద్ధంబు కాజాల; న
య్యో! వైరిన్ మనగడ్డనుండి తఱుమన్ యుద్ధానకుం బంపలేఁ
డే వేఱొక్కడు పుత్త్రుఁడంచు, నివు డెంతేఁ జింతలోఁ దోఁగితిన్.

వ॥ సంగ్రామరంగంబున నున్నమగనికి శశిరేఖ యనుజవరాలు వలపువక్కాణకమ్మ వ్రాసె నఁట యెటువలెను.

ప్రాణేశ్వరుల పాదపద్మములకు నమస్కారము. మిము మఱి మఱి తలఁచుక వ్రాయున దేమన- నిచ్చట నేను సేమంబు, మీ సేమంబు తెలుపవలెను. నే నేమిచిక్కులు పడుచుంటినో యన్నవంత సుంతయయిన వలదు మీకు. అన్నివిధంబుల నన్నుఁ బ్రభుత్వంబు సాకుచున్నది కన్నతల్లివోలె, నాకు నేలోపమును లేదు, మీరు చెంత

లేనిలోప మొక్కటివిడక్క యింతవఱకు మీరు విజయంబుసేకొని యింటి కెపుడువత్తు రని వేయికనులతో వేచియుంటి. చీనివానివలె నీమారుఁడు క్రూరుఁడు, తరుణముఁ గనిపెట్టి దండువెడలినాఁడు; సర్వజ్ఞునికే యపచారము తలపెట్టినాఁడంట! ఇట్టివాని కింక మనబోఁటి వారల కొక లెక్కయా? వానియాగడ మేమివ్రాయుదాన? ఆచీనివాని ఫిరంగిమ్రోఁతలరీతిఁ గోయిలకూఁతలు వచ్చిపడెను. మఱియుఁ దురకల దుష్ప్రచారమువోలె మలయుచున్నవి కమ్మతెమ్మెరలు, అమ్మరునకుఁ దోడయినాఁడు తారాపిప్రియుండు. అల్లతురకల దైవము కాఁడె వాఁడు? వీరిబారినుండి మనలఁ బ్రోవుమనుచు, నిత్య మేను ముక్కంటికి మొక్కుచుంటి. ఎదురుచూచు మీకోసము ముద్దులు, ప్రియ!

ఇట్లు,
భవదీయచరణదాసి,
శశిరేఖ.

వ॥ ఈవైఖరి నాశశిరేఖ లేఖ యొండు వ్రాసి, యంతట వాకిటఁ బురివిప్పి నాట్యమాడుచున్న నెమలిని జూచి యేమనుచున్నది.

ఓ మయూరమా! భారతజాతీయవిహంగమవు, దేవతాసేనా నికి వాహనుండవు. వాగ్దేవతకు నభిమానపాత్రుండవు, కళాకుశలుండ, వని నిన్ను నొక్కసాహాయ్యము యాచించుచున్నాను. యాచన విఫలమయ్యు, గుణాఢ్యుని యాచించుట మేలు; సఫలమయ్యు నధముని యాచింపరా దందురు.

నీ యజమాని సిపాయిద్ధరంగములో నున్నారఁట. పోయి వారికి భద్రమ్ముగా నీకమ్మ యిచ్చిరమ్ము. నీపా నీకుఁ దెలుసునా? తెలియదు అట్లయినఁ జెప్పెద విను—

తూరుపుదిక్కుగాఁ బోయినచో మనసీమ కావల నుత్కళ దేశము. అచ్చటఁ బూరీపట్టణమ్మున జగన్నాథస్వామి వేంచేసి యున్నారు. వారిని దర్శించుకొని మఱిపొమ్ము నీకు శుభము కలుగును.

ముంగల వంగభూమి. అందు గంగాజలంబునఁ బరిశుద్ధుడవై కొంతసేపు విశ్రాంతితీసికొని బయలుదేరుము.

తదుపరి ముష్కరు లైన తురుష్కుల రాజ్యమువారు మన యెడల ద్వేషభావముతో నున్నారు. నీకు హాని తలపెట్టెదరు. జాగరూకుఁడవై వేగముగా నచ్చోటుదాటి పొమ్ము.

పిమ్మట నస్సాము రాష్ట్రము. అందు మణిపురి యనుపురము కలదు. అచ్చట మచ్చెకంటు లొయ్యారమొలుకబోయుచు నాట్యములు సేయుచుందురు. నాట్య మన్నంతనే మేనుమఱచిపోవు నీ వయ్యెడనాలస్యము సేసెదవేమోసుమా! అప్పులకార్యము తీర్పఁ బూనినవారు జాగుసేయరుగదా!

ఏకతాళము—

వచ్చెను నత్తఱి నెచ్చెలి యొక్కతె, యచ్చెలువతోడ ముచ్చటలాడ॥

వ॥ వచ్చి యచ్చిగురాకుఁబోఁడితో నామె యే మనుచున్నది.

జంపెతాళము—

వినలేదె యిటువంటి విడ్డూరమీనాఁడు వనజాక్షి!వలవంతపలిసెనీ తెలివి

వ॥ అన విని శశిరేఖ యామెతో నేమనుచున్నది.

శశి :— ఎప్పుడు వచ్చితివి? ఒప్పులకుప్ప! ఒయ్యారిభామ! విశేషము లేమైనఁ జెప్పవా!

చెలి :— ఓ వన్నెలాఁడి విన్నావటే? కాళిదాసమహాకవి యేమన్నారో?

శశి :— ఏమన్నారే ?

చెలి :— 'కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు' అన్నారు.

శశి :— అంటే ?

చెలి :— అంటే కామార్తు లయినవారికి యుక్తాయుక్తజ్ఞాన ముండదు అని దానితాత్పర్యము.

శశి :— ఆమాట యిప్పు డెందులకే ?

చెలి:- ఎందులకా ? నీపాసంగరరంగ మెక్కడ ? నీవలపువక్కణకమ్మ నీనెమ్మి పట్టుకొనిపెళ్లుట యెక్కడ ? చందమామగుక్కిళ్లుగాక యెక్కడి కెక్కడే ?

వ॥ అనుటయు శశిరేఖ యే మనుచున్నది.

ఆటతాళము —

మందెమేళములాడc బోవక, సుందరాంగి! చెప్పుమ!

ముందుగా, మనవైరులుండినచంద మిపుడు.

వ॥ దానికి నెచ్చెలి యేమనుచున్నది.

చెలి:- మిత్రులన్నవారుసైతము తన్నాడిపోసికొనc, జీనానియంత కొలంబో ప్రతిపాదనముల నంగీకరింపను లేక, నిరాకరింపను లేక తబ్బిబ్బు పడుచున్నవాcడే.

శశి :- అట్లయిన మనవా రేమిసేయుచున్నారే ?

చెలి :-వినలేదా ? ఆసంగతి మొన్న మనప్రధాని సెలవిచ్చియున్నారు.

శశి :- ఏమని సెలవిచ్చియున్నారే ?

వ॥ అచ్చెలి వాక్రుచ్చెనcట యెటువలెను.

త్రిపుటతాళము—

త్యాగశీలురు, ధైర్యశాలురు, నైన భారతపౌరులారా !
జాగరూకుల మై మెలంగుట బాగుసుండీ !॥
వైరివెనుకకుc దనకుc దానుగc, బోరు మానుకపోయినాcడని,
యూరకుండుట తగదు; మోసమె యుండనోపు॥
శక్తికొలcదిని నెల్లరును మనసైనికులకై ధనము సాయము,
రక్తదానము సేయవలె నను రక్తి మీాఱ॥
కనక మిత్తురుగాక, మీాగలు ఘనముగ, విదేశముల వద్దను,
మనకు లేనివి యాయుధంబులు కొనుటపొంటె॥

గీ॥ అవిరళంబుగ సాగుచున్నది మన సక
లప్రణాళికల్ నేఁడు జయప్రదముగ :
హాలికుల్ కృషి చేసి యాహారధాన్య
ములను బండించుచున్నారు పుష్కలముగ ॥

గీ॥ సరగున నితరోత్పత్తులు జరుగుచుండెఁ ;
గోట్లకొలఁది సైన్యము సమకూడె; మేటి
యాధునికయుద్ధసామగ్రి నప్పు పెట్టి
చాల తెచ్చితి మగ్రరాజ్యాలనుండి॥

క॥ కర్మాగారములు మనవి
నిర్మాణ మొనర్చుచుండె నిఖిలాయుధముల్ ;
దుర్మతు లీచైనీయుల
నోర్మివహించిన విడువక యుడిగింతు మిఁకన్ ॥

వ॥ అనవుడు శశిరేఖ నెచ్చెలితో నే మనుచున్నది.

ఆటతాళము—

మానుగ మనప్రధానిమాటలు వీనులకు విం దాయెఁ
జానరో! నాయుల్ల మిప్పుడు చల్లనాయె॥

చెలి:—ఈముచ్చట నీకుఁ జెప్పుటకే వచ్చితినే నెచ్చెలీ !

శశి :— రావే భరతమాతకు ధవళంబులు పాడుదము.

వ॥ అని యద్ధవళాక్షులు ధవళంబులు పాడిరఁట యెటువలెను

ధవళములు—

జయజయ పావనధాత్రీ ! జయ భారతజనయిత్రీ !
జయజయ దేశమతల్లీ! జయ ప్రియకల్పకవల్లీ !

వ॥ మఱియు నప్పుణ్యాంగనలుమంగళహారతులిచ్చిరఁట! యెటువలెను.

జంపెతాళము —

మంగళము నిస్తులామలభారతావనికి,
మంగళము సద్ధర్మమాణిక్యఖనికి
మంగళము కమనీయమహనీయసుచరితకు,
మంగళము మునితపోమహిమాభరితకు,
జయ మంగళమ్ నిత్యజయమంగళమ్.

— భరతవాక్యము —

ద్విపద—

అని నీలనీరదశ్యాముని వేగ,పనరారు వైకుంఠధాముని వేరఁ,
బొనరారు చిత్రాడపురిని వెలసిన మొనలేని శ్రీ వేంకటేశ్వరుని వేరఁ,
బేర్చినభక్త్యమైఁ బెంపెసలారఁ, గూర్చె దామెర రాజగోపాలరావు
హావణుగాఁ జీనాదురాక్రమణ మను నవనవయక్షగానం బొకటి; యది
యాచతురబ్ధిధరా చక్రమందు, నాచంద్రతరార్కమై కాలుఁగాక !!

[ఆకాశవాణి విజయవాడ కేంద్రము సౌజన్యముతో]



'ఆంధ్ర శిల్ప కళామతల్లి అమరావతి అచ్చటి ఖననపరిశోధనలు'
(శ్రీ) ఇంగువ కార్తికేయశర్మ.

గతసంచిక తరువాయి.

కానరాదు. అట్లే "ఇధ" కూడ చాలమార్లు "గీర్నారు", ధౌలి రాతి శాసనములలో కానసగును. దీనినిబట్టి యశోకుడు స్వహస్తముచే శాసనమును వ్రాసి దానిని శిల్పులచే రాతిపై చెక్కించెడివా డన్న మాట.

వరుస 3 :- జనో బహుని - అనగా జనోబహూణి- 'సకల జనానికి' యన్నమాట. ఈ ప్రయోగము గీర్నారు, షాహబజ్ గార్హి మొదలగుచోట్ల శాసనములలో కానసగును.

వరుస 4 :- "అనుసుయంతిస-", ఆఖరి 'స' తరువాయి యొక యక్షరపు 'హ్ర' స్వము కానసగును. ఇది "యె". అట్లయిన "అనుశ్రూయంతి తత్ మయా," యగును. "అనుసుయంతి" అనుపద మశోక శాసనములలో లేదు. కాని వరుసయొక్క శైలినిబట్టి, యర్థమునుబట్టియు బౌద్ధధర్మములకు వర్తింపజేయుటచే నిది తప్పక యశోకశాసనమే యని నిర్ణయింపనగును. "ధర్మపర్యాయము" లనుగూర్చి యశోకుని, కలకత్తా - బేరట్ చిన్నరాతిశాసనములలో మిగుల ప్రస్తావించి యున్నది.

వరుస 5 :- రచ్ఛిజితి విజయె- "ఛిద్యతే విజయే లేక విజయః" ఛేదింపబడినవిజయము. ఈ "విజయః" అనుపద మశోకుని 13వ రాతి శాసనములో పలుమార్లు చెప్పబడినది. ఈ శాసనములో ప్రత్యేకించి యశోకచక్రవర్తి "విజయ మనిన మానవహృదయాలను ధర్మబోధచే జయించుటయే కాని బాహుబలసామర్థ్యముతో లొంగదీసుకొనుటగాదని" వ్యక్తము చేసినాడు.

వరుస 6 :- "రమ మెపి-" అభిఘ మమపి ఆతర్వాత మరల నేనుకూడ — అసంపూర్ణముగా నున్నది. ఏడవవరుసలో మూడక్షరముల భాగములు కానబడుచున్నవి. కాని చదువ నలవికాదు.

శాసనము పూర్తిగా నెన్నివరుస లుండెడిదో ప్రకృతములో లభించిన యీ భాగముద్వారా యూహించుటకసాధ్యముగా నున్నది. మన దురదృష్టవశాత్తు లభ్యమయిన యేవరుసకూడ పూర్తిభావము నిచ్చుటలేదు. పైగా వరుసలలోని యక్షరములు సంపూర్ణముగా లేవు. కాని యీశాసనములోని యక్షరముల చెక్కడమునుబట్టి ప్రాకృతశబ్దప్రయోగమునుబట్టి పదములవాడుకనుబట్టి యిది యశోక చక్రవర్తియే యుండనగు నని ధృడ మగుచున్నది. ఇదివరలో బర్గెస్, శాసనములనుబట్టి స్తూపనిర్మాణకాలమును క్రీ॥పూ॥ 2వ శతాబ్దమగు నని యూహించెను. కాని మరొకశతాబ్దము, ముందుగ నుండె నని తెలియుచున్నది.

చైనీసుయాత్రికుడు "హ్యుయన్‌త్సాంగ్" (Watter's on yuan chwang's travels in India, vol II. PP. 214, 216, 226.), ధరణికోటకు వచ్చె ననియు, నిది మహాంధ్రము (తఅన్‌తోలో) లోని (తయెనచెక) యనియు చెప్పియున్నాడు. కాని యశోకస్తూప మున్నట్లు చెప్పలేదు. కాని యీతడు (పింగికోల), పింగిపులో ననగా వెంగిపుర అను 'అంతోలో'కు పట్టణ మైనచోట నశోకస్తూప మున్నట్లు పేర్కొనియున్నాడు. ఇంకను మరొకటి "చూలియ" దేశము, అనగా మన "తెలుగుచోళ" ప్రాంతమున నున్నట్లు చెప్పినాడు. ఈ స్తూపము బహుశః కళింగదేశరాజధానియైన "కళింగనగరము" అదేమన నిప్పటి "ముఖలింగ మని చెప్పవచ్చును. ఈ యాత్రికుడు "శాలి హుండము"లోని యశోకస్తూపమునుకూడ చూచినట్లు కనబడదు. ఇచటకూడ నశోకస్తూప మున్నట్లు ప్రతీతి. పైగా క్రీ॥ పూ॥ 1-2 శతాబ్దములకు చెందిన యొకశాసనము "ధమ్మమారాజో అశోక సిరినో" (ధర్మమహారాజ్ఞో అశోకశిరిణో) యని 'అశోకుని' పేరుతో స్పష్టముగా చెప్పుచున్నది. (Epigrapica Indica, Vol XXXI PP. 88-89.)

# కవిమూర్ధన్యుని వాణి

శ్రీ శిష్ట్లా బాలకోటీశ్వరరావు.

తే. గీ. అస్మదనుదినపనితకార్యక్రమమ్ము
కమ్రగంభీరకావ్య ప్రకల్పనమ్ము
కాకవీశ్వర దుర్జనాఖర్వసర్వ
గర్వనిర్వాపణక్రియా ధూర్వహమ్ము.

(దివాన_క్తము)

అని యమంతితాహంభావముతో, దుగ్ధ(?)వర్షారంభవిజృంభమా ణాపర్జన్యమువలె గర్జించిన కవికంఠీరవుఁ డనితరసాధ్యప్రతిభావ్యుత్పత్తు లతో నాంధ్రగీర్వాణధీరగంభీరశారదారాధన మొనరించుచు నాధుని కాంధ్రపండితకవులలో మూర్ధన్యుఁడయ్యె ననుట స్వభావోక్తియే యగును. తుల్యారామేశ్వరమునందు జన్మించి తండ్రిగారయిన వేంకటరాయమనీషివర్యుని చెంత విద్యాభ్యాసము చేసి నియమబద్ధుఁ డైనకవియై—

శా॥ ఏ నేలా కృతకేతరామలపథం బీక్షించి చూపింపరా
దానందించినఁ గోపగించినఁ గరం బగ్గించినన్ దూఱినన్
మానంజాల గుణాగుణంబులను సంభావింతు దూషింతు స
న్మానంబో యవమానమో కురియనున్నన్ సత్కవుల్ కాకవుల్

(కవి - 4వ పద్యము)

అని మోమోట మించుకయును లేకుండ సాహసముతో వక్కాణించిన యీయన యారామద్రావిడశాఖీయుఁడు. కాశ్యప గోత్రుఁడు. కాకరపర్తివంశమణిమండనుఁడు. కృష్ణశాస్త్రినామధేయుఁడు. అద్వైతవిద్యామగ్నజ్ఞుఁడు. ఆయురాగమరహస్యవిదుఁడు కవిమూర్ధన్య ప్రౌఢ కవిచంద్ర బ్రాహ్మీభూషణాదిమహాబిరుద శోభితుఁడు. హరిహర దేవపాదపద్మోపాసకుఁడు—

చ॥ నలినభవావరోధవదనగ్రథనప్రథమానపీటికా
కలహిమవాలుకామలసగంధసుగంధనిబంధురమ్ము లు
జ్జ్వలితతదీయనర్తనవిభాసురనూపురమంజుశింజితా
వళిమిళితమ్ము లంచితభవత్కవనప్రచురప్రసారముల్.

(కంచుఢక్క)

అని యేతత్కృతిభర్తచే గొనియాడఁబడినట్లు చెప్పుకొని తదుచితప్రౌఢకవితాచమత్కృతి బాహిరించిన శాస్త్రిగారు కౌశికాభ్యుదయాదిమహాప్రబంధనిర్మాణము గావించిరి. స్వర్గీయు లగు నాంధ్రప్రదేశాస్థానకవులు, కవిసార్వభౌములు నగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి నాకర్షించిన వీరి భారతి నిరుపమానము, మనోహరము.

శా॥ భావశ్రీపరిపాకసంకలనహేవాకంబు, సత్కల్పనా
ప్రావీణ్యంబు, సురాపగాతులితధారాశుద్ధి యత్కావ్యమం
దావేశించునొ తత్కవీంద్రులను ...... (కౌశికాభ్యుదయము, 16వ పద్యము) రుంద్రానందముం బొంది సంభావించుచు—

శా॥ ఛందోభంగము సంతరించి యతులం జక్కాడి యశ్లీలమున్
జిందంజేయుచు భాష గూల్చుచు విసంధిన్ లీల సంధించుచున్
గ్రిందు మీఁదును గాన కాదికవులన్ నిందించుచున్ సంతతా
మందానందము నందు ప్రస్తుతకవింమన్యాళి.........

(కౌశికాభ్యుదయము 17ప)

ని గర్హించుచు సుమారునలుబదియైదుసంవత్సరములనుండి సాహితీకృషి సలుపుచున్న కవిమూర్ధన్యుని ముద్రితకృతులలోని సరస్వతీస్తుతులు పరిశీలించినచో రసజ్ఞులైన పాఠకులకు వీరి కాచదువులతల్లిపై గలభక్తి గౌరవములు, నామెస్వరూపస్వభావములకు సంబంధించిన నిర్దుష్టాభిప్రాయము తేటతెల్ల మగును.

తే. గీ. సకలనిగమవిశారద, శారదశశి
హాసభాస్వర, భాస్వరవ్యపగతరస
శుకవితతి, సుకవితతివక్త్రకనివాస
లోల, లోలవిలోచనం గేలుమోడ్తు.

(సంయుక్తాకల్యాణము, 6వ పద్యము)

శాస్త్రిగారి మొదటిపద్యకావ్య మిది. లక్ష్మీనరసాపురసంస్థానాధీశ్వరి కీకృతి యంకితము చేయఁబడినది. నూనూగుమీసాలనూత్నయౌవనముతో నుప్పొంగు వీరియుత్సాహవిజృంభణ మీ శారదాస్తవమున నక్షరాక్షరరూపము తాల్చినది. పూర్వకవిప్రబంధబంధచిత్రకవిత్వపద్ధతులు కూలంకషముగా జీర్ణించుకొని శబ్దాడంబరముపై గల యాసక్తి నణచుకొనజాలని యీయన నాటిమనస్థితి యిందు స్పష్టమైనది. అయిన నీపద్యమునందలి ముక్తపదగ్రస్తాలంకారశోభ సుజనస్తవనీయము. ప్రయోగింపఁబడిన శబ్దార్థసారస్యము నవగాహించుకొనగలిగినచో శారదామధురరూపస్ఫూర్తి చక్కగా సాక్షాత్కరించును.

సంగీతసాహిత్యములు భారతీస్తనద్వయ మను నార్షభావము నూతగ గ్రహించి వీరు తమ రెండవ ప్రబంధ మగుచంద్రహాసవిలాసమున వాణి నీవిధముగ నాశ్రయించిరి.

మ. చనుదోయిం గడు చేపువారి కెరలన్ సంగీతసాహిత్యముల్
తను రేయింబవళుల్ భజించు నరు వాత్సల్యంబు సాకల్యమై
తనరారం జరితార్థునిం బొనరుపన్ ద్రావించు లోకత్రయీ
జననిన్ భారతి నాశ్రయింతుఁ గవితాసారస్యసంసిద్ధికిన్.

శారదావల్లభాదిబిరుదములు కించిత్ప్రయోజనాపేక్షతో స్వీకరించుటకు సంసిద్ధులై మాతృపతు లగుటకు జంకనిమహానుభావు లున్న యీకాలములో పాండిత్యము ప్రతిభ లోకజ్ఞానము పుష్కలముగా గలిగినకవిమూర్ధన్యుఁ డీయమ్మను జననిగా భావించి యర్చించుట

కొంత యమాయకత్వమునే సూచించుచున్నను సజ్జనస్తోత్రపాత్రమైన దనుటలో సంశయము లేదు. తల్లిని తల్లిగా పూజించిరి కావుననే శాస్త్రిగారు నేడు మహాకవు లయిరి. అంతేకాదు. కీర్తిశేషులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే మహానందముతో స్వీకరింపఁబడిన వీరిప్రౌఢకృతికన్య కాశికాభ్యుదయమునందు మరింత వినయముతో భారతిని ప్రశంసించిరి.

మ. అనయంబు న్నినుఁగొల్చి నీదుచనుబా లాకంఠముం ద్రావి మున్
ఘనకావ్యాళి రచించి మించిరఁట విఖ్యాతిన్ బురాసజ్జనుల్;
తనుపంజెల్లదె నన్ను సారకవితాధారం బ్రసాదించి నా
జననీ! భారతి! మామకీనకృతి విస్తారోన్నతిం గాంచఁగన్.

దయామయి యైనశారద కవిమూర్ధన్యుని ప్రార్థనము ననుమతించినది. అందుచేతనే కాబోలు! కాశికాభ్యుదయమునం దాద్యంతము వాణి వీణాగానము శ్రుతిపేయముగ నిక్వణించినది. గీర్వాణాంధ్ర వాగ్దేవత యపారశక్తి నెఱిఁగినకవికంఠీరవుఁడు పండితరాయల నాంధ్రీకరించుచు నిట్లనిరి.

మ. సరహాస్యం బగు నాత్మతత్త్వసుధ నాస్వాదించితిన్; కావ్యముల్
పరికల్పించితిఁ బ్రౌఢిమై రసికవిద్వాంసుల్ ప్రశంసింప; మేల్
బిరుదుల్ గొంటిని; ఘంటికాకటక ముద్వేలప్రథం గొంటి నీ
పరమాపారకృపారసైకధుర గీర్వాణాంధ్రవాగ్దేవతా!

(అన్యోక్తిముక్తావళి-3 వ పద్యము)

నిజమే! కాకుండిన బ్రాహ్మీభూషణుఁ డింతవిఖ్యాతిని సాధించు టెట్లు? శాస్త్రిగారికవిత్వము పరిశీలించినచో శ్రీనాథుఁడే మరల నీరీతి జన్మించినాఁ డనిపించును.

ఈయథార్థమును విశదముగా దృఢీకరించుటకో యన కంచుఢక్కను రచించినారు. శ్రీనాథమహాకవి కనకాభిషేకసన్మానము నందుట యిందలి యితివృత్తము. ఆ కవిసార్వభౌముని నేర్పంతయు నీ

ప్రౌఢకవిచంద్రుని లేఖినిలో నిమిడి క్రొత్తసోయగములు ప్రదర్శించి మధురసమధురధారలు కురిసినది. ఈకావ్యములో నాచారము ననుస రించి సరస్వతీస్తుతి నీయన పచరింపలేదు. కథ చెప్పుచు నాయకుం డైనశ్రీనాథునిచే స్తవింపఁజేసినారు.

మ॥ చతురాస్యుం డగుస్రష్టయైన బలుకంజాలం డహో! నీసహా
యత లేకుండిన వేదసంచయము మాతా! వేదముల్ లేక యే
గతి ధర్మం? బది నేరకెట్లుదితమౌ జ్ఞానంబు? తద్జ్ఞానశూ
న్యతచే ముక్తి హుళక్కి; యన్నిటికి మూలాధార మీవే కదా!

శాస్త్రిగారి వైదికవిజ్ఞాన మంతయును నీపద్యమున నిక్షేపింపఁ బడినది. వేదములపై నాయన కున్నగౌరవవిశ్వాసములకు నిదర్శన మీమత్తేభవిక్రీడితము.

ఇంక వీరు దర్శించిన శారద వీణ బలికించి మోహనరాగమరం దము వర్షించుచున్నది గమనింపుడు.

సీ॥ స్వేచ్ఛ నగ్రాంగుళుల్ కచ్ఛపీతంత్రులం
దారోహణావరోహముల నెఱప,
తలమీఁదినెలవంకఁ దులకించు నెలనవ్వు
బొమ్మంచుమోవిపైఁ బొలసియాడ,
మూర్ఛనావేశార్ధముకుళితాక్షులక్రేవ
చిన్నారిలాహిరీ చెంగలింప,
గొజ్జంగిరంగుచెక్కుల జగాజగరాల
తాటంకములు తళత్తళల నీన,
నలక లలికమ్ముపై నచ్చటచటఁ జెదరి
చిఱుచెమటచిత్తడుల నంటసిల్లి మెఱయ
వీణఁ బలికించు పరమేష్ఠిరాణివాస
మాంధ్రకవిచంద్రమునకుఁ బ్రత్యక్ష మయ్యె. (కంచుఢక్క)

తనకు సాక్షాత్కరించిన పరమేష్ఠిరాణివాసమునే శ్రీనాథు నకుకూడ జూపించినారు. ఈపద్యమును పఠించుచో వీణావాదనపరవశ యైనవాణి సుందరముగా సురుచిరముగా మనకన్నులకు గోచరించును. చిత్రకారుఁడు కుంచెతో లిఖించి చూపఁగలిగినదానికన్న మిన్నగా నున్న దీవాక్చిత్రము !!

కృష్ణశాస్త్రిగారు సంస్కృతములో వ్రాసినఖండకృతి వ్యాజ వ్యాహారము. దీనిని వీరు జన్మ మిచ్చిన-విద్య చెప్పిన పితృదేవులు శ్రీవేంకటరాయమనీషికి సమర్పించిరి. ఇందు గీర్వాణవాణి యపూర్వ వైఖరిలో వర్ణింపఁబడి వాంఛింపఁబడినది.

శ్లో॥ ప్రాలేయాచలవ న్మహోన్నతతమా గాంగాంబువ త్పావనా
గంభీ రాంబుధివత్ సురాలయగవీవత్ కామితార్థప్రదా
శౌరే ర్దర్శనవ త్సదార్చనకలాలభ్యా భ్రవ ద్వ్యాపినీ
స్వర్భూవ ద్విబుధాశ్రితా వసతు మే గీర్వాణగీ రాననే.

పూజ్యము లైనయుపమానముల నెన్నుకొని వానియందలి సామాన్యధర్మములు గుర్తించి యుపమేయములో సొగసుగా మేళ వించి వాచింపఁగలనైపుణి శాస్త్రిగారి సొమ్మని యీశ్లోకము నిరూ పించుచున్నది. కనుకనే గీర్వాణవాక్కు వీరియెడల సుప్రసన్నమైనది.

కవిమూర్ధన్యుని మఱియొకరసవత్తరకృతి దివానక్తము. అని దంపూర్వమైనపద్ధతి నవలంబించి యద్భుతకల్పనాచాతుర్యము వెలా ర్చుచు దివాభాగమును వచనమున- నక్తంభాగమును పద్యములలో చెప్పి రసికావతంసులను మెప్పించినారు. దానిలో—

సీ॥ ఫ్రెంచిభారతవిశ్వవిద్యాలయము కవి
కంఠీరవాఖ్యాక ఘనబిరుదము,
కవిసార్వభౌమాంకకలితుఁ డాంధ్రాస్థాన
కవి కవిమూర్ధన్యఘనబిరుదము,

కాకినాడపురీంద్రకవిమణిగ్రామణుల్
కవిఘంటికాస్వర్ణకంకణమ్ము,
నల గౌతమీయవిద్యాపీఠము సువర్ణ
పదక విద్వత్కవివర బిరుదము
లొసఁగి న న్గౌరవించుట యుష్మదీయ
పరమకరుణామృతాసారవర్షణమునఁ
గాక నాప్రజ్ఞ యిం దేమికలదు జనని!
వనజభవురాణి! యాంధ్రగీర్వాణవాణి!!

ఎంత నిరాడంబరశీలము! ఒండు రెండు పద్దెములల్లి 'వాక్యం రసాత్మకం కావ్య'మను నాలంకారికోక్తి నుదహరించుచు మహాకవుల మని యుద్ఘాటించుచు వ్యవహరించు నధునాతనకవిమ్మన్యుల కీ సీసము విద్యుదాఘాతమే!! ఎంతయో చదివి నిష్ణాతుఁడై యెంతయో వ్రాసి యెన్నియో సన్మానములు వడసి బిరుదముల నెనసి తుద కిదంతయు నీప్రజ్ఞయే నాది కా దనఁగల వాఁ డెంత పరిణతమనస్కుఁడై యుండ వలయును?!

మఱియొక విశేషము; సర్వజ్ఞభూపాలుని యాస్థానమున శ్రీనాథుఁడు చెప్పిన సీసపద్యము (దీనారటంకాల దీర్థమాడించితి,...) నిది స్ఫురింపఁజేయుచున్నది. అందులో వ్యక్తమగు కాంక్ష దీనియందు లేదు. వాంఛాశూన్యత్వము వ్యక్తిత్వాధిక్యమును హెచ్చించును కదా!

ఇప్పటికి కవిమూర్ధన్యునివాణిని సాకల్యముగ పరామర్శింపఁ గల్గితి నని భావించుచున్నాను. సఫలీకృతుఁడ నైతినో లేదో నిర్ధరింపఁ గలవారు విజ్ఞులు.

అర్వాచీరెండు లలితవసంతముల సొబగుబెడగు లాస్వాదించి చెదరని గాంభీర్యముతో బెదరని యాత్మవిశ్వాసముతో నన్నయాది కవులు నిర్దేశించినమార్గమున ప్రయాణించుచు నాంధ్రగీర్వాణవాణికి

మణిమకుటముగా భాసించుచున్న కవిమూర్ధన్యుని సందేశము నాఁటి నుండి నేఁటివఱకు నిదియే!—

శా॥ పోరాటంబులు జాఱఁగా నవకవుల్
పూర్వానుసారుల్ కవుల్
సారాలాపము లూరఁగా విషయముల్
చర్చించి నిర్ధారితో
దారాపారమనోహరైకసరణిన్
ధన్యాత్ములై మెట్టి మీ
రారాధింపుఁడు కావ్యసూనములతో
నాంధ్రీయ వాగ్దేవతన్.

( కవి, 100 వ పద్యము )

## ఆంధ్రీకరణ సమస్యాపూరణములు

1. (శ్రీ) శిష్టా వేంకటశాస్త్రి, B. A, B. T. S, సికిందరాబాద్.

చ॥ దివమువలెన్ బుధాశ్రితము;
దివ్యగవింబలె కామదమ్ము; జా
హ్నవివలె పావనమ్ము; సత
తార్చనలభ్యము శౌరివోలె; నిం
గివలె విశాల; మబ్ధివలె
నిమ్నము; తుంగతమమ్ము మంచుగొం
డవలె; సమస్తవాణి కరు
ణన్ నివసించుత నాదుమోమునన్

ఉ॥ బాలక! శైవచాపమును
భగ్నమొనర్చితి వంట! వైష్ణవా
భీలశరాసన మ్మిది నవీనము
పూనుము చేతగానిచో

వ్రాలుము మామకీనపద
పద్మములం గరుణింతు నంచు కా
తాళము సాళగింప వడి
దాకెను భార్గవు డంత రాఘవున్.

2. శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి (విద్వాన్)

జగన్నాథపురము, కాకినాడ.

చ॥ హరిగతి ధ్యానలభ్యము, హిమాద్రివిధాన మహోన్నతమ్ము, ని
ర్జరనిలయమ్ముటుల్ విబుధసంశ్రిత; మబ్ధిబలెం గభీరమున్
సురభివలెన్ వరప్రదము, శుద్ధము గాంగజలమ్ము వోలె, నం
బరమటువ్యాప్త;మయ్యమరవాణి వసించుత! నాదుమోమునన్.

ఉ॥ వైళము భర్గుచాప మటు భగ్నమొనర్పఁగ దండతాడిత
వ్యాళమునా మహోగ్రగతి నక్షము వచ్చి కుఠారధారకుం
దాళుదు వేని నిల్వు మని ధైర్యము, శౌర్యము,దోర్బలమ్ము కాం
తాళము సాళగింప వడిఁ దాకెను భార్గవుఁ డంత రాఘవున్.

3. శ్రీ బి. యస్. మూర్తి, (ఖురదారోడ్డు)

సీ॥ శ్రీనాథదర్శన శ్రీవోలె నశ్రాంత
బహుళతబోధనప్రాప్త మగుచు,
స్వర్గధేనువువోలె వాంఛితార్థద మౌచు,
వారిధివోలె గంభీర మగుచు,
మానితమధురసమధుర మందాకినీ
పుణ్యతోయమువోలె పూత మగుచు,
ప్రాలేయగిరివోలె పరమోన్నతం బౌచు,
నమలినాభ్రమువోలె వ్యాప్త మగుచు,

తే.గీ. దివ్యవైభవభాసురదివమువోలె
చతురబుధరాజరాజి కాశ్రితము నగుచు
వెలుఁగు గీర్వాణభారతివింత చెలువ
మస్మదీయాస్యకమలమం దలముగాక.

ఉ॥ లీల తురంగలింప నవలీలగ శంకరువిల్లు త్రుంచి సీ
తాలలితాంగిఁ గొంచుఁ బ్రమదాన నయోధ్యకు నేగుచుండఁగా
నైళమ యడ్డగించుచు నవాచ్యము లాడుచు మస్తరించి కాం
తాళము సాళగింప వడిదాకెను భార్గవుఁ డంత రాఘవున్.

4. ద్విభాషి వెంకటరాయశాస్త్రి, నరసారావుపేట.

చ॥ దివివలె వైబుధాశ్రయ; మతీతపవిత్రము గంగభంగి; స్వ
ర్గవిగతి వాంఛితార్థద; మగాధము నీరధిరీతి; వ్యాప్త మ
భ్రవిధి; మహోన్నతమ్ము హిమవన్నగ వైఖరి; శౌరిదర్శనం
బువలె సదార్చనాప్త; మయి బొల్చు సరస్వతి మన్ముఖస్థయై॥

ఉ॥ శూలిని మద్గురూత్తముని జుల్కనసేసి యగౌరవించె భూ
పాలసుతుండు దాశరథి భంగమొనర్చి తదీయచాప మి
ల్లాలికినై; తదీయదురహంకృతి గూల్చెద నంచు మించుకా
తాళము సాళగింప వడి దాకెను భార్గవు డంత రాఘవున్.

5. కాకరపర్తి వెంకటరావు — ఇంజరం.

చ॥ హిమగిరివోలె తుంగము; రమేశుగతి న్నిరతార్చనోపల
భ్యము; విబుధాశ్రయంబు దివమట్లు; పవిత్రము గంగరీతి;వ్యా
ప్తము నభమట్లు; కామగవివైఖరి సంతతవాంఛితార్థదం
బమితగభీర మబ్ధిగతి; నొసురవాణి మదాస్య మందుతన్.

ఉ॥ కాలగశాగ్రహస్తచిరకాలగతంబును మైథిలేశభూ
పాలకపీఠికోపరివిభాసిత, మాత్మగురుప్రదత్త మౌ
శూలిధనుస్సునే విఱిచె; జూడుడు మామకశక్తి నంచు కా
తాళము సాళగింప వడి దాకెను భార్గవు డంతరాఘవున్॥

6. శ్రీ శిష్టా బాలకోటీశ్వరరావు – బోడసకుర్రు.

చ॥ హిమగిరిరీతి నున్నత; ముపేంద్రునిభాతి సదార్చనోపల
భ్యము; విబుధాశ్రితమ్ము దివిభంగి;గభీరము వార్ధిమాడ్కి, వ్యా
ప్తము నభమట్లు; కామదము స్వర్గవికై వడి; గంగవోలె పూ
తము;నగుసంస్కృతమ్ము సతతమ్ము వసించుతనాదుమోమునన్.

ఉ॥ తాళగలాడవే నృపవిదారణదారుణ మైన నాదుకా
తాళి మనన్యసాధ్య మగు త్ర్యంబకుజాపము నెత్తినావె కాం
తాళపడన్ సభాసదులు నమ్రత వీడి–యటంచు రోషపా
తాళము సాళగింప వడి దాకెను భార్గవు డంత రాఘవున్.

7. అల్లమరాజు లక్ష్మీపతి – పెద్దాపురము.

చ॥ వనధివలెన్ గభీరము; నభమ్మటు వ్యాప్తము; గంగవోలె పా
వనమును; వాంఛితార్థదము స్వర్గవిలీల; సదార్చనాప్త మ
బ్జనయనురీతి; నాకమటు వైబుధసంశ్రిత; మున్నతంబు శీ
తనగము భాతి;సంస్కృతము దాను వసించుత నామొగమ్మునన్.

ఉ॥ ఆలికినై పవిత్రతమ మౌ జనకావనిజానిపూజ్య మౌ
కాలగళోగ్రచాపమును ఖండితముం బొనరించెనంట భూ
పాలకబాలకుం డొకడు వాని వధింతు నటంచు నేగి కాం
తాళము సాళగింప వడి దాకెను భార్గవు డంత రాఘవున్.

8. ద్విభాష్యం వేంకటేశ్వరరావు – ఎలమంచిలి.

సీ॥ జలజవిలోచను సందర్శనంబట్లు
సంతతార్చనకళాసాదితంబు
కామధేనువువోలె కామితార్థప్రదం
బమితోన్నతంబు హిమాద్రివోలె

నాకాశమ ట్లతివ్యాప్తంబు త్రిదశాల
యంబువై ఖరి విబుధాశ్రయంబు
పరమపవిత్రమ్ము భాగీరథీవారి
వలెను గంభీరమ్ము వార్ధిపోలె
తే॥గీ॥ నగుచు భాసించుచున్నట్టియబ్జభవుని
రాణి పల్లవపాణి గీర్వాణవాణి
మామకీనాననాంభోజసీమయందు
స్థిరతమంబుగ సతము వసించుగాత.

9. శ్రీ పాలెపు నరసింహము, B. Sc., (వెలమపాలెము, ద్రాక్షారామము)

సీ. సంతతార్చనకళాసాధ్యంబు శంఖచ
క్రగదాబ్జధరుని దర్శనము పగిది,
అమితోన్నతతమంబు హిమగిరీంద్రముభంగి,
నఖిలదిగ్వ్యాపితం బభ్రమట్లు,
పరమపవిత్రంబు భవ్యభాగీరథీ
రసవదుదారనీరమ్ము భాతి
కామితార్థప్రదం బామరగవిపోలె,
కమ్రగంభీరమ్ము కంధికరణి,
తే. అతులితజ్ఞానసంపన్నమై రహించు
విబుధమణిగణాశ్రితము స్వర్విపులమాడ్కి;
రుచిరగీర్వాణవాణి కారుణ్య మూని
మామకీనాననమ్మున మలఁగుగాక.

ఉ. బాలిశుఁడై స్వయంవరసభన్ నృపబాలుఁ డొకండు జాహ్నవీ
లోలుని చాపము న్విఱిచి లోకువ జేసె సహింతునే మహా
కాలుని శిష్యమౌళిని నఖండపరాక్రమశాలి నంచు కా
తాళము సాళగింప వడి దాకెను భార్గవుఁడంత రాఘవున్.

# శ్లోకము - సమస్య

శ్లో॥ దక్షస్తే జనక స్త్వం
హైమవతీ సర్వమంగళా పర్ణా
శక్తిధర శ్చ కుమారః
కిము పతిభైక్ష్యం నివారితం నార్యే ?

చ॥ కిలము సుధారసమ్ము నొలి
కించెను కాకవి కోపగింపఁగన్.

"పై శ్లోకము నాంధ్రీకరించి సమస్యను పూరించి ప్లవంగవత్సర చైత్రమాసాంతము దాటకుండ బంప మా యాంధ్రకవివరుల నర్థించుచుంటిమి."

సంపాదకుఁడు.

గ్రామ్యస్య బిరుదాదీనాం వర్ణనే అప్రయుక్తస్య ఏకాక్షరాదా వ్రీడాదాయినో రభేదే అమంగళస్య శత్రువర్ణనే జుగుప్సితస్య విరహోక్తౌ నిహతనిరర్థకయో ర్యమకాదా వనుచితార్థస్య గర్హణే అపుష్టార్థస్య విశేషప్రతీతౌ శ్రుతికటుత్వాదీనా మపి రౌద్రాదావదోషః. త్రివిధానా మ ప్యేతేషాం దోషాణాం మధ్యే కతిపయానా మన్యోన్యభేదస్య దుర్ఘటత్వా త్తన్నిరూపణ మస్మాకం నాంతరంగ మాలింగతే తథాపి పూర్వసరణి మనుసృత్య తావంత ఏవ సముదాహృతాః.

ఏవం త్రివిధానా మపి దోషాణాం స్వరూప ముదాహృత్య తదపవాద మాహ సర్వ ఇతి. అనుకరణేన కోపి దోష ఇత్యర్థః. వ్యవస్థాంతర మాహ నేతి. ఏవ మపవాదవిధిం నిరూప్య తేషాం పరస్పరవైలక్షణ్యస్య దుర్వచత్వా త్తన్నిరూపణే సారస్యాభావేపి వృద్ధపరంపరాయా తత్వా దుదాహృతా ఇత్యాహ త్రివిధానా మపీతి.

ఇతి శ్రీమద్భారద్వాజ గోత్రావతంస శ్రీ మచ్చావలివంశ

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

సాహిత్యచింతామణినా మ్న్యలంకారశాస్త్రే
దోషప్రకరణం సమాప్తమ్.



## గుణప్రకరణమ్

అథ గుణాలంకారసంయుతా విత్యుద్దేశక్రమేణ గుణా నిరూప్యంతే. సమవాయవృత్త్యా రసోత్కర్షాపాదకా గుణాః. ఏతేన సంయోగవృత్త్యా రసోత్కర్షాపాదకే ష్వలంకారేషు నాతివ్యాప్తిః. రసా వక్ష్యమాణరసప్రకరణే నిరూప్యంతే.

ఏవం యథాసంభవం దోషా న్నిరూప్య సంప్ర త్యుద్దేశానుసారేణ గుణ నిరూపణం ప్రతిజానీతే అథేతి. అథ దోషనిరూపణానంతరం కావ్యలక్షణనిరూపణావసరే గుణాలంకారసంయుతా విత్యుద్దిష్టక్రమేణ గుణా నిరూప్యంతే. గుణసామాన్యలక్షణ మాహ సమవాయవృ త్త్యేతి. సమవాయవృత్త్యా రసోపస్కారకా గుణా ఇత్యర్థః. రసోపస్కారకత్వావిశేషా దలంకారాతివ్యాప్తిం నివారయతి ఏతే నేతి. గుణాలంకారయో రసోపస్కారకత్వస్య సమవాయసంయోగవృత్తిభ్యాం నైకరూపత్వా దలంకారేషు నాతివ్యాప్తిరిత్యర్థః. రసారసప్రకరణే నిరూప్యంత ఇత్యాహ రసా ఇతి.

గుణాశ్చ

శ్లో॥ బీజః ప్రసాదమాధుర్యా, వ్యక్తికాంతిసుశబ్దతాః
గాంభీర్యం భావికం రీతి, రితి ప్రోక్తా గుణా నవ॥

ఏవం గుణసామాన్యలక్షణ మాఖ్యాయ గుణా నాహ బీజ ఇతిం నను మాధుర్యౌజఃప్రసాదా స్త్రయ ఏవ గుణా ఇతి. భామహాదయః శ్లేష సౌకుమార్యార్థవ్యక్తిసమతౌదార్యకాంతిసమాధయ స్సప్తపూర్వోక్తా స్త్రయ శ్చ దశేతి వామనాదయః. "శ్లేషః ప్రసాద స్సమతా మాధుర్యం సుకుమారతా అర్థవ్యక్తి రుదాత్తత్వం తథాకాంతి రుదారతా బీజ స్సుశబ్దతాప్రేయ ఔర్జిత్య మథ విస్తరః సమాధి స్సౌక్ష్మ్యగాంభీర్యే సంక్షేపో భావికం తథా సంమితత్వం తథా ప్రౌఢి రుక్తి రీతి స్తథా గతి"రితి చతుర్వింశతిగుణా ఇతి భోజరాజాదయః

అత్ర స్తేషు ఏకోఽపి న వేతి నోదాజహారేతి చే ద్వ్యచ్యతే భామహేనోక్తా త్రయోఽపి సర్వసంమతా ఏవ. అత్రాయం వివేకః.

అర్థవ్యక్తిః

అర్థప్రతిపాదనే వాక్యస్య నిరాకాంక్షత్వేన పరిపూర్తా శీఘ్రసుఖావబోధకత్వ మర్థవ్యక్తిః.

ఔదార్యమ్

వికటాక్షరబంధత్వ మౌదార్యమ్.

ఉదాత్తత్వమ్

శ్లాఘ్యవిశేషణయోగ ఉదాత్తతా.

ఔర్జిత్యమ్

గాఢబంధత్వ మౌర్జిత్యమ్.

ఏతేషా మోజస్యంతర్భావః.

ప్రౌఢిః

వైచిత్ర్యవిశేషవత్యుక్తిః ప్రౌఢిః.

ఉక్తిః

విదగ్ధభణితి రుక్తిః.

సంక్షేపః

సంగ్రహార్థస్య ఉక్తి స్సంక్షేపః.

సూక్ష్మతా

అనేకార్థశబ్దోక్తి స్సౌక్ష్మ్యమ్.

విస్తరః

ఉక్తార్థసమర్థనోక్తి ర్విస్తరః.

సంమితత్వమ్

యావదర్థపదోక్తి స్సంమితత్వమ్.

ప్రేయః

అతిప్రియవస్తూక్తిః ప్రేయః.

గతిః

ఆరోహావరోహాభ్యా మతిరమ్యోక్తి ర్గతిః

సమతా

అవైషమ్యేన పాదచతుష్టయే ప్యర్థకథనం సమతా. ఏతేషా మష్టానా ముక్తిరూపత్వా ద్వైచిత్ర్యవదుక్తిగుణేంతర్భావ ఇతి న తేషాం పృథగ్భావః.

సమాధిః

అన్యధర్మ స్యాన్యత్రారోపణం సమాధిః.

అస్య ఆరోపగర్భరూపకాది ష్వంతర్భావ ఇతి న గుణత్వమ్.

శ్లేషః

అనేకపదానా మేకపదత్వప్రతీతివిషయత్వం శ్లేషః.

అయం చ శబ్దశ్లేషేంతర్భావ్యత ఇతి న గుణః.

కాంతిః

బంధోజ్జ్వలతా కాంతిః.

సుశబ్దతా

శబ్దసాధుత్వం సుశబ్దతా.

గాంభీర్యమ్

గూఢార్థత్వం గాంభీర్యమ్.

భావికమ్

భావాద్యా వాగ్వృత్తి స్తద్భావికమ్.

రీతిః

ప్రక్రమనిర్వాహణం రీతిః.

ఏతే పంచాపి పృథగ్గుణాః.

సౌకుమార్యం

సానుస్వారకోమలవర్ణతా సుకుమారతా.

అస్యా మాధుర్యేంతర్భావ ఇత్యతో నిష్కృష్టగుణాన వేతి రమణీయమ్.

తేషాం క్రమేణ లక్షణోదాహరణాని ప్రదర్శ్యంతే॥

ఏతేషు కేషాంచి ద్దోషపరిహారకత్వేన కేషాంచి దుత్కర్ష హేతుత్వేన చ ఆవస్యం గుణనిరూపణ మితి సిద్ధవత్కృత్యతే చ న వేతి నిష్కృష్యచ తేషాం లక్షణోదాహరణాని క్రమేణ వక్ష్యంత ఇత్యాహ తేషా మితి.

ఓజః

ఓజ స్సమాసభూయ స్త్వమ్.

ఓజోగుణం లక్షయతి ఓజ ఇతి స్పష్టమ్ :- యథా

శ్లో॥ రింఖత్తుంగమదద్విపేంద్రరటితప్రాగ్భారసంవర్గిత
స్ఫాయద్విక్రమ మాణభద్రతురగప్రక్రాంతహేషోద్భటాః
ఖడ్గాఖడ్గిహతాహితావళిశిరోరుంద్రప్రచండక్రమై
శ్చిత్రం వేంకటసూర్యరాయసుభటా మోదం వితేనుః పరమ్॥

ఉదాహరతి రింఖ దితి. రింఖంత శ్చలంత స్తుంగా మహాంతో మదద్విపేంద్రా మత్తగజశ్రేష్ఠా స్తేషాం రటితానాం బృహితానాం ప్రాగ్భారాణా మతిశయానాం సంవర్గితేన సముదాయేన స్ఫాయద్భి ర్విక్రమమాణై ర్భద్రతురగైః ప్రక్రాంతహేషాభి రుద్భటాః వేంకట సూర్యరాయసుభటాః ఖడ్గైః ఖడ్గై శ్చ ప్రవృత్తం యుద్ధం ఖడ్గా ఖడ్గి తత్రహతానా మహితానా మావళీనాం శిరసాం రుంద్రై రురుభిః ప్రచండక్రమై ర్మోదం వితేను శ్చిత్రం. అత్ర సమాసభూయస్త్వ మస్తీ త్యోజోగుణః.

ప్రసాదః

శ్లో॥ వస్త్రం జల మివ స్వచ్ఛమ్, వసంత ఇవ కాననమ్
వ్యాప్నోతి శ్రోతృచిత్తమ్ యత్ ప్రసాదో గుణో మతః॥

ప్రసాదం లక్షయతి వస్త్ర మితి. :—యథా

శ్లో॥ కీర్తిప్రతాపరుచిభి ర్జగతీ విభాతి
శ్రీసూర్యరాయనృపతే తవ కేలితేయమ్
ఉత్ఫుల్లజాతికుసుమావళిభూషితాంగీ
లిప్తాంగరాగరుచిరా రమణీమణీవ ॥

ఉదాహరతి కీర్తీతి. హే సూర్యరాయనృపతే తవకీర్తిప్రతాప రుచిభిః కేలితా భూషితా ఇయం జగతీ ఉత్ఫుల్లజాతికుసుమావళిభి ర్భూషిత మంగం యస్యా స్సా. ఏతేన కీర్తిసాదృశ్యానుగుణ్యం వ్యజ్యతే లిప్తాంగరాగేణ రుచిరా చ. ఏతేన ప్రతాపసాదృశ్యాను గుణ్యం చ ద్యోత్యతే రమణీమణీవ విభాతి.

## మాధుర్యమ్

శ్లో॥ యాపృథక్పదతా వాక్యే, మాధుర్యం పరికీర్త్యతే॥

మాధుర్యం లక్షయతి యేతి.పృథక్పదత్వ ప్రయుక్తాహ్లాదకత్వంమాధుర్య మిత్యర్థః. యథా

శ్లో॥ జానాసి కిం ఖలు లతాంగి కి మద్య వేద్యమ్
శ్రీసూర్యరాయనృపతిః క్వను వర్తతేత్ర
కిం కిం కరోతి స లిఖన్ ప్రతిమాం ప్రియాయాః
కాన్యాభ్రమం రమణి మా కురు సా త్వ మేవ ॥

ఉదాహరతి జానాసీతి. ఇదం సఖీనాయికయో ర్నిష్కుట స్థితయో రుక్తి ప్రత్యుక్తికరూపం వచనం హే లతాంగి జానాసి కిం ఖల్వితి వాక్యాలంకారే అద్య ఈదృశసమయే వేద్యం కి మస్తి. అత్ర నిష్కుటే శ్రీసూర్యరాయనృపతిః క్వను వర్తతే. స వేంకట మహీపతి సూర్యరాయసార్వభౌమః ప్రియాయాః ప్రతిమాం ప్రతికృతిం విలిఖన్ కిం కిం కరోతి ఇతి నాయికావచనం. హే సఖి కాన్యా త్వత్తోఽన్యా ప్రియా కాస్తి? న కాప్యస్తీ త్యర్థః. హే రమణి! భ్రమం సందేహం మా కురు. కుత ఇ త్యత ఆహ సాప్రియాత్వ మేవ ఇతి

సఖీవచనం. అత్ర పాఠసమయేఽపి బాహుళ్యా త్పృథ_క్త్వప్రతీతే ర్మాధుర్యమ్.

ఉ_క్తిః

శ్లో॥ విదగ్ధః ఫణితి ర్యా స్యా, దు_క్తిం తాం కవయో జగుః॥

ఉ_క్తిం తాం లక్షయతి విదగ్ధేతి :- యథా

శ్లో॥ రాజ్ఞః పద్మానురాగ స్తే, దృశ్యతే సతతం బుధైః
త్వ మర్యమాపి కుర్వాధే, చిత్రం కువలయప్రభామ్॥

ఉదాహరతి రాజ్ఞ ఇతి. హే వేంకటమహీపతిసూర్యరాయ మహారాజ రాజ్ఞ స్సార్వభౌమస్య చంద్రస్య చ తే తవ పద్మానురాగః రాజ్యలక్ష్మ్యా మనురాగః పద్మే ష్వనురాగ శ్చ సతతం నిత్యం బుధై ర్దృశ్యతే, కించ త్వ మర్యమాపి ఇయ_ర్తి గచ్ఛతీతి వ్యుత్పత్త్యా సర్వవ్యాపకోఽపి త్వగ్ధః. యద్వా సాధ్యవసానలక్షణయా సూర్యోఽపి వా యద్వా సాక్షా త్సూర్యవంశసంభవోఽపి వా కువలయపరిభాం భూవలయశోభాం కుముదకాంతిం చ కుర్వాధే చిత్రం. విరుద్ధయో ర ప్యనురాగదర్శనప్రకాశన మేవ చిత్ర మితి భావః. అత్ర రాజ్ఞ శ్చంద్రస్యాపి పద్మానురాగః. అర్యమ్ణోఽపి కువలయ ప్రకాశన మితి విదగ్ధఫణితే రు_క్తిః.

కాంతిః

శ్లో॥ అత్యుజ్జ్వలత్వం బంధస్య, కావ్యే కాంతి రి తీష్యతే॥

కాంతిం లక్షయతి అత్యుజ్జ్వలత్వ మితి. యథా

శ్లో॥ శాణోద్భాసితహీరహారవిబుధా హారాంబరహ్రాదినీ
తారాహారమహీధరామరకరిన్యక్కారిశోభాకరా
కీ_ర్తి స్తే శరదభ్రచంద్రకరసంస్ఫూ_ర్తి ర్హ్వ_తా_ర్తిః పరమ్
శ్రీమ ద్వేంకటసూర్యరాయనృపతే చక్రే దిశ స్స్వాదృశః.

ఉదాహరతి శాణేతి. హే శ్రీమ ద్వేంకట సూర్యరాయనృపతే శాణేన వజ్రనికషేణ "శాణస్తు నికషః కష ఇత్యమరః. ఉత్భాసితః

ప్రకాశితః హీరో వజ్రం హారా ముక్తాహారాః విబుధహారా స్సుధా అంబరప్రహోదినీ వియద్గంగాప్రహోదినీ కులిశే నద్యాంతటే విప్రౌఢయోషి తీతి నిఘంటుసారే. తారానక్షత్రాణి హారో హారసంబంధీ మహీధరః పర్వతః కైలాస ఇతి యావత్. అసురకరీ సురగజః ఏతేషాం న్యక్కారిణ్యా స్తిరస్కారిణ్యా శ్శోభాయాః కాంత్యా ఆకరా శరదభ్రచంద్రకరాణాం సంస్ఫూర్తి ర్యస్యా స్సేతి వ్యనధికరణ బహువ్రీహిః. యద్వా సంస్ఫూర్తి రివ సంస్ఫూర్తి ర్యస్యా సా ఉపమానపూర్వపదే త్యాదినా బహువ్రీహి ర్వాచ్యో వోత్తరపదలోప శ్చేతి బహువ్రీహిర్వా అత ఏవ హాతార్తి రపమాతతిమిరా ఆర్తిః పీడాతిమిరయో ధనుష్కోట్యాం చ కథ్యతే" ఇతి భట్టచంద్రః. దిశః పర మత్యంతం సాదృశ ఆత్మసమా శ్చక్రే. అత్ర అత్యుజ్జ్వలత్వ మస్తీతి కాంతిః.

సుశబ్దతా

శ్లో॥ సుపాంతిజాం చ వ్యుత్పత్తి, స్సౌశబ్ద్యం పరికీర్త్యతే ॥

సౌశబ్ద్యం లక్షయితి సుపామితి.ఇదముదాహృతే ష్వేవ ద్రష్టవ్యం.

గాంభీర్యమ్

శ్లో॥ ధ్వనిమత్తా తు గాంభీర్యమ్, గుణవిద్భి ర్నిగద్యతే.

గాంభీర్యం లక్షయతి ధ్వనిమత్తేతిధ్వనిమత్త్వం గాంభీర్యమ్యథా

శ్లో॥ మిత్రానందకర శ్రీమ త్సూర్యారాయ మహీపతిః
జ్యారవై రేవ చాపస్య, దిగంతా న్నయతి ద్విషః.

అమిత్రానందకరస్య రిపుభంజనద్వారా మిత్రమండల భేదనమయుక్త మితి దిగంతా న్నయతీతి ధ్వని మత్త్రియా గాంభీర్యమ్ ఉదాహారతి మిత్రేతి.మిత్రం సుహృత్ సూర్య శ్చ"మిత్రంసుహృదిమిత్రోర్క-ఇతి విశ్వః. ధ్వనిం యోజయతి అత్రేతి.

భావికమ్

శ్లో॥ భావతో వాక్యవృత్తి ర్వా, భావికం త దుదాహృతమ్ ॥

భావికం లక్షయతి, హార్దభావవశా త్ప్రవృత్త వాగ్భావిక మిత్యుచ్యతే యథా

శ్లో॥ శ్రీసూర్యరాయేంద్ర యశశ్శ్రియం చ
వహస్వ నిత్యం జనరంజనాయ
దేవి ప్రసాదం మయి దర్శయ త్వ
మస్యైవ భూపస్య గుణాన్ ప్రవక్తుమ్.

ఉదాహరతి శ్రీ సూర్యరాయేంద్రేతి. హే దేవి జనరంజనాయ శ్రీ సూర్యరాయేంద్రస్య యశశ్శ్రియం వహస్వ. హే దేవి త్వం మయి ప్రసాదం దర్శయ. కిమర్థ మిత్యత ఆహ అస్యభూపస్యైవ గుణాన్ ప్రవక్తుం వర్ణితుం అత్ర దేవి త్వం ప్రసాదం దర్శయేతి వాగ్వృత్తే ర్భావికమ్.

రీతిః

శ్లో॥ యథోపక్రమనిర్వాహో, రీతి రి త్యభిధీయతే

రీతిం లక్షయతి యథేతి ప్రక్రాంతశబ్దవర్ణాదే ర్నిర్వాహో రీతిఃయథా

శ్లో॥ త్రిదశేంద్రసమైశ్వర్య, శ్శక్తిత్రితయనైష్ఠికః
త్రి ష్వర్థేషు మహా న్భాతి, సూర్యరాయమహీపతిః.

అత్ర పాదత్రయేపి త్రిశబ్దోపాదానా ద్యథోపక్రమనిర్వాహేణే యం రీతిః

ఉదాహరతి త్రిదశేతి. త్రిదశేంద్ర ఇంద్రః. ప్రభుమంత్రోత్సాహాశక్తయ స్త్రిస్రః ధర్మార్థకామాస్త్రయోర్థాః యోజయతి అత్రేతి.

శ్లో॥ ఏవం నవగుణాః ప్రోక్తాః, పరే నమనసః ప్రియాః
తత స్తల్లోలుపా ధీరాః పశ్యం త్వన్యసుధీకృతీః.

ఏవం గుణనవక ముదాహృత్య పరా నుదాహరణే ప్రియత్వం వదన్ తద్దర్శనలాలసా స్త్వన్యత్ర పశ్యం త్విత్యాహ ఏవ మితి పరే భోజరాజాదిభి రుక్తాః.

ఇతి శ్రీ మద్భారద్వాజగోత్రావతంస

..........................................

సాహిత్య చింతామణి నామ్న్యలంకారశాస్త్రే
గుణప్రకరణమ్
సమాప్తమ్.

# శబ్దాలంకార ప్రకరణమ్

ఏవం కావ్యముఖ్యార్థభూతస్య రసస్య సమవాయవృత్త్యోపస్కారకాన్ గుణా న్నిరూప్య సంప్రతిసంయోగవృత్త్యా తదుపస్కారకానలంకారాన్నిరూపయతి గుణాలంకారసంయుతావితి కావ్యసామాన్యలక్షణే గుణాలంకారేతి విశేషణోపాత్తానాం గుణాలంకారాణాం మధ్యేప్రథమోపాత్తతయా గుణానిరూపితాః.సంప్రత్యవశిష్టానామలంకారాణాం నిరూపణమంతేవాస్యవధానాయప్రతిజానీతే ఏవమితి కావ్యస్య ముఖ్యార్థభూతస్య ముఖ్యవస్తుభూతస్య రసస్య ఉపస్కారకాన్ శోభావహాన్ ఏవంచసంయోగవృత్త్యా రసోపస్కారకత్వ మలంకారత్వ మిత్యలంకార సామాన్యలక్షణం సిద్ధం వైద్యనాథ దీక్షితస్తు అలంకారత్వం నామరసాది భిన్నవ్యంగ్య భిన్నత్వేసతి శబ్దార్థాన్యతరనిష్ఠాయా విషయితా సంబంధావచ్ఛిన్నాచమత్కృతి జనకతా వచ్ఛేదకతా తదవచ్ఛేదకత్వ మనుప్రాసాదివిశిష్టశబ్దజ్ఞానా దుపమాది విశిష్టార్థ జ్ఞానాచ్చ చమత్కారోదయా త్తేషు లక్షణసమన్వయః. శబ్దార్థయోర్జ్ఞాననిష్టచమత్కృతి జనకతాయాంవిషయితయావచ్ఛేదకత్వేనతద్విశేషణీభూతానుప్రాసోపమాదేస్తన్నిష్టావచ్ఛేదకత్వాత్ రసవదాద్యలంకారసంగ్రహాయ వ్యంగ్యోపమాది వారణాయచ భేదద్వయగర్భసత్వంతోపాదానమితి

అలంకారవిభాగః.

అలంకారా ద్వివిధాః శబ్దగతా అర్థగతా ఇత్యేకేతదుభయగతత్వేన త్రివిధా ఇత్యన్యే.

ఏవమలంకారత్వం లక్షయిత్వా తేషా మవాంతరభేదేన బహువిధత్వేపి ప్రథమం ద్వైవిధ్యమాహఅలంకారా ఇతి.అలంక్రియంతే ఏభిరిత్యలంకారాః.అకర్తరిచకారకే సంజ్ఞాయా మితి కరణార్థేఘఞ్ప్రత్యయఃమతాంతరేణ త్రైవిధ్యమాహ తదుభయగతత్వేనేతి శబ్దగతాఅర్థగతా ఉభయగతా ఇత్యలంకారాస్త్రివిధా ఇత్యర్థః.తత్రశబ్దాలంకారావృత్త్యనుప్రాసాదయః అర్థాలంకారా ఉపమాదయః ఉభయాలంకారా లాటానుప్రాసాదయ ఇతిబోధ్యమ్.

తత్ర తావదర్థప్రతీతేశ్శబ్దప్రతీతిపూర్వకత్వాత్ప్రథమం శబ్దాలంకారాన్ విలక్షయిషు ర్నైరంతర్యేణ వ్యంజనద్వయావృత్తిమూలం ఛేకానుప్రాసం లక్షయతి.

ఏవ మలంకారాన్ విభజ్య శబ్దాలంకారాణాం నిరూపణే బీజం వదన్ తత్ర తావదాదౌ ఛేకానుప్రాస నిరూపణేయుక్తిం దర్శయతి తత్ర తావదితి. అర్థప్రతీతేశ్శబ్దప్రతీతి పూర్వకత్వాత్ అర్థజ్ఞానస్య శబ్దజ్ఞాన పూర్వకత్వాదిత్యర్థః. నైరంతర్యేణ నిరంతరావృత్త్యాశబ్దార్థోభయగతత్వేన త్రివిధం పౌనరుక్త్యం తత్రప్రథమే కేవలస్వరపౌనరుక్త్యస్య అచారుత్వాద్వ్యంజన మాత్రపౌనరుక్త్యం స్వరవ్యంజనసముదాయపౌనరుక్త్యంచ చారుతాహేతు స్తత్రాద్యమపి సంఖ్యానియమే ఛేకానుప్రాస స్తద్వ్యపరిత్యేవృత్త్యనుప్రాస ఇత్యలంకారసర్వస్వకారః.

ఛేకానుప్రాసః

శ్లో. నైరంతర్యేణ యత్ర స్యా ద్ద్వయో ర్వ్యంజనయు గ్మయోః
ఆవృత్తి శ్శ్రూయతే తత్ర చ్ఛేకానుప్రాస ఉచ్యతే.

యత్ర అవ్యవహితయో ర్వ్యంజనయు గ్మయో ర్ద్వయోరావృత్తి స్తత్ర ఛేకానుప్రాసః.

ఛేకానుప్రాసంలక్షయతినైరంతర్యేణేతి.ద్వయోరత్ర వీప్సాద్రష్టవ్యా తేన యత్రవ్యంజన యుగ్మయో ర్నైరంతర్యేణా వృత్తిరవ్యవహిత పౌనరుక్త్యం తత్ర రసాద్యనుగతః ప్రకృష్టోన్యాసోనుప్రాసః.తథాచోక్తం ప్రకృష్టోవర్ణవిన్యాసోరసాద్యనుగతోహియఃసోనుప్రాసశ్చఛ్ఛేకవృత్త్యుపాధిగతోద్విధేతి ఛేకాగృహచరాః పక్షిమృగాదయ ఇత్యేకే విదగ్ధా ఇతిసర్వస్వకారాదయః తదుపలాలితోనుప్రాసచ్ఛేకానుప్రాస ఇత్యన్వర్థోయ మలంకారః.

యథా

శ్లో. విభవభవనజయభవతి శ్రీకరకరసూర్యరాయవిభో
నిర్వృతివిజితా మర్త్యామర్త్యావజ్యంతి ముదిముదితాః.

ఉదాహరతి విభవేతి. విభవానాం సంపదాం భవనం నివాసభూతః యద్వావిభవైస్సహభవతీతి విభవభవనః ఆగర్భశ్రీమాన్. యద్వా విభవ యుక్తాని భవనాని మందిరాణి యస్యసః. యద్వా వేరత్రిచక్షుషః భవతీతి విభవశ్చంద్రః. విశ్చక్షుషివ్యోమ్ని వాత ఇతిరత్నమాలాయాం. తద్వద్భవనం వదనం యస్యసః భవనంనిలయే భావే జననే వదనేపిచేతి క్షీరస్వామీ. ఏతస్యసంబుద్ధిః శ్రీకరాసంపత్కరాకరాహస్తాయస్యసః యద్వా శ్రీకరః కరోబలిస్సామంతానీత పారితోషికం యస్యసః తస్య సంబుద్ధిః నిర్వృత్యాభోగేన విజితాం అమర్త్యాస్సురాయేషాంతే తథోక్తాః మర్త్యా మానవాః ముది ఆనందే ముదితాస్సంతః హే సూర్యరాయవిభో! భవతిత్వయిరజ్యంతి అనురక్తాభవంతీత్యర్థః. అత్ర పాదచతుష్టయేపి వ్యంజనయుగ్మయో ర్ద్వయోర్ద్వయోరవ్యవధానేనా వృత్తే శ్ఛేకానుప్రాస ఇతిద్రష్టవ్యం.

యథా వా

శ్లో॥ కందర్పదర్పవిజయీ బిభర్తి శ్రీకరే కరే
కువత్కువలయమ్ సూర్య సూర్యరాయమహీపతిః.

ఉదాహరణాంతర మాహ కందర్పేతి. కందర్పస్సమదస్య దర్పం గర్వం విజయతీతి తథోక్తః. మదనాదపి లోకోత్తర సౌందర్యశాలీత్యర్థః. సూరైస్సశయోరభేదేనశూరైస్సహితస్సూర్యః. సచాసౌసూర్యరాయ మహీపతిః. కువత్సువర్ణపుష్పం కుస్త్రీ భువికుత్సాయాం కనకేవారణేం హాసీతి ప్రతాపః.కువలయం భూమండలం శ్రీకరే కరే బిభర్తి అత్రాపి వ్యంజన యుగ్మానాం నిరంతరావృత్తేః చ్ఛేకానుప్రాసః.

వృత్త్యనుప్రాసః

శ్లో॥ ఏక ద్విత్ర్యాది వర్ణానా, మావృత్తి ర్యాయతే యథా
సంఖ్యానియమ ముల్లంఘ్య, వృత్యనుప్రాస ఇష్యతే.

అత్రఏకస్యసకృదా వృత్తౌవైచిత్ర్యా భావాత్సామర్థ్యా దసకృదావృత్తి ర్లభ్యతే. ద్వయోస్తు సకృదేవ అన్యథా ఛేకానుప్రాసత్వప్రసంగాత్

వ్యవధానే త్వసకృదావృత్తి రపి న విరుధ్యతే|త్ర్యాదీనాం తు సకృద సకృద్వా వ్యవధానే నవావృత్తి. ద్రష్టవ్యా కైశిక్యాద్యన్యతమోప లక్షితో నుప్రాసో వృత్త్యనుప్రాస ఇత్యన్వర్థసంజ్ఞా. అత్ర పూర్వాత్ర చస్వర సాదృశ్య మానుషంగికం.

సంఖ్యానియమే చ్ఛేకానుప్రాస ముక్త్వా తద్వైపరీత్యేన వృత్త్యను ప్రాసం లక్షయతి ఏకేతిలక్షణం వ్యాకరోతి అత్రేతి.ఆదిశబ్దేన చతురాది సంగ్రహః నను విభవ భవనేత్యత్ర చ్ఛేకానుప్రాసే యుధిష్ఠిరం ద్వైతవనే వనేచర ఇత్యాదా వేకదా సాదృశ్యలక్షణే వృత్త్యనుప్రాసేచస్వరపౌనరుక్త్య సంభవా త్కథం తత్ర వ్యంజనమాత్రపౌనరుక్త్య మితిచే దుభయత్రాపి ఆనుషంగికం స్వరపౌనరుక్త్య మిత్యవగంతవ్యమ్. యథా

శ్లో॥ శ్రీమద్వేంకటసూర్యరాయవసుధాచక్రక్షిదధ్యక్షకో
రింఖత్ప్రేంఖదశంఖపుంఖవిశిఖన్యాంభోరుబాణాసనః
శస్త్రాశస్త్రివిఖండితాహితశిరఃకాండః ప్రచండోరణే
త్వంగత్తుంగతురంగమై ర్విజయతే నిర్భంగరంగక్రమైః.

ఉదాహరతి శ్రీమదితి. రింఖంత శ్చిత్రంగచ్ఛంతః ప్రేంఖం తశ్చలం త శ్చాశంఖాస్సంఖ్యారహితా అమితా ఇత్యర్థః. పుంఖవిశిఖాః పుంఖిత స్త్రైణాబార్యాన్యంభోద్భుతఉరుర్మహాన్ బాణాసన శ్చాపోయస్యసతథోక్తః శస్త్రిణిశస్త్రీయుద్ధే విఖండితః అహితశిరః కాండో యేన స తథోక్తః అతఏవ రణే ప్రచండః శ్రీమద్వేంకట సూర్యరాయ వసుధాచక్రక్షిదధ్య క్షకః వేంకటమహీపతి సూర్యరాయరాజాధిరాజః నిర్భంగా నిరుపద్ర వారంగక్రమా యేషాంతై రితి తురంగమవిశేషణం విజయతే. అత్ర తత్రక్షకారాదే రేకైకస్య అసకృదావృత్తే ర్వృత్త్యనుప్రాసః. ఏవం ద్విత్ర్యాదీనా మప్యావృత్తి రున్నేయా.

## లాటానుప్రాసః

శ్లో॥ తాత్పర్య మేవ భిన్నం స్యా న్నతు శబ్దార్థయో ర్భిదా
తయో ర్యా పునరుక్తి స్స్యా, ల్లాటానుప్రాస ఉచ్యతే॥

వ్యంజనపౌనరుక్త్యమూల మలంకారద్వయం నిరూప్య తదుభయపౌనరుక్త్యమూలం లాటానుప్రాసం లక్షయతి తాత్పర్యమితి. యత్ర శబ్దార్థయోః పౌనరుక్త్యం ప్రరూఢదోషః తద్వ్యవచ్ఛేదార్థం తాత్పర్యమేవ భిన్న మితి. ఏతేన యమకవ్యావర్తకశబ్దార్థయో స్స్వరూపభేదాభావః ఫలితః లాటజనోపలాలితః ప్రాసో లాటానుప్రాసః. న తు లాటదేశజన్యః కశ్చిదుపకారః కావ్యస్యేతిగోపాలః.

యథా

శ్లో॥ భవతికలారసికమణౌ, దాతరి వర సూర్యరాయవిభో
అధునాకవయః కవయో, భాసంతే బత భువన మభితః॥

ఉదాహరతి భవతీతి. హేవర సూర్యరాయవిభో భవతి త్వయి కలారసికమణౌ విద్యారసికాగ్రగణ్యే దాతరి చ సతి అధునాభువనమభితః సర్వస్మి న్నస్మిన్ లోకే అభితః పరిత ఇత్యాదినాద్వితీయా కవయః కవయో భాసంతే. బతేత్యాశ్చర్యే అత్రద్వితీయకవిశబ్దస్యముత్కృష్టరూప స్తాత్పర్యభేదః శబ్దార్థపౌనరుక్త్యా ల్లాటానుప్రాసత్వం. అయంచ పదాశ్రయః ప్రాతిపదికాశ్రయశ్చేతి ద్వేధా లాటానుప్రాసఇతి సర్వస్వకారః ఉద్భటేనా ప్యుక్తం, స్వరూపార్థ విశేషేపి పునరుక్తిః ఫలాంతరాత్ శబ్దానాం ప్రకృతీనాం లాలాటానుప్రాసఇష్యతే ఇతిఅత్ర శబ్దానాం సవిభక్తీనాం ప్రకృతీనాం లుప్తవిభక్తీనాం ప్రాతిపదికానామిత్యర్థః. ఏతద్విస్తరస్తు కావ్యప్రకాశాదౌ ద్రష్టవ్యః. నను సూర్యారాయేంద్ర తేకీర్తి స్త్వత్కీర్తిరివ శోభత ఇత్యత్ర ఏకస్యైవ ఉపమానోపమేయత్వలక్షణే నన్వయేపి శబ్దార్థ పౌనరుక్త్య సంభవా ల్లాటానుప్రాసత్వమేవ కిం నేష్యత ఇతిచేత్సత్యం. యద్యప్యనన్వ యేర్థపౌనరుక్త్య

మాత్రం లక్షణం తథాపి నిర్దేశప్రతినిర్దేశయో రైకరూప్యాభావే పర్యాయప్రక్రమ దోషప్రసంగా దానుషంగికం శబ్దపౌనరుక్త్యం. అత్ర తూభయపౌనరుక్త మప్యావశ్యక మేవేతి విషయభేదా న్నకోపి విరోధః. తదుక్తం అనన్వయే చశబ్దైక్య మౌచిత్యా దానుషింగికం అస్మింస్తు లాటానుప్రాసే సాక్షా దేవ ప్రయోజక మితి.

పునరుక్తవదాభాసః

శ్లో॥ పునరుక్తవదాభాతి, యత్రార్థో న తు తత్వతః
పునరుక్తవదాభాస, స్సనామాఖ్యాతగో ద్విధా ॥

శబ్దపౌనరుక్త్యాశ్రితానలంకారా నుక్త్వార్థపౌనరుక్త్యాశ్రిత మలంకారం లక్షయతి పునరుక్తవ దితి. యత్రాలంకారేర్థః పునరుక్తవత్పునరుక్తేన తుల్యమాభాతితత్వతస్తునతథాపర్యవస్యతిసపునరుక్త వదాభాసోలంకారః అత్రార్థ పౌనరుక్త్యస్య ప్రరూఢదోషత్వా త్తన్నివృత్తయే నతుతత్వత ఇత్యుక్తమ్.తంవిభజతేస ఇతినామగత ఆఖ్యాతగతశ్చేతి ద్వివిధఇత్యర్థః

నామగతో యథా

శ్లో॥ రాజరాజోపి ధనద,స్సూర్యరాయమహీపతిః
విరాజతే మహాసేనశ్శక్తిమా నపి భూతలే.

నామగత ముదాహరతి రాజరాజ ఇతి. సూర్యరాయమహీపతిః రాజరాజః రాజాధిరాజః ధనదః ధనప్రదాతా మహాసేనః అధికసైన్యః శక్తిమాన్ ప్రభుమంత్రోత్సాహ శక్తిత్రయవిశిష్టః అత్రరాజరాజాదిశబ్దానాం కుబేరాదిపర్యాయప్రయోగేణ ప్రముఖేభాసమానస్యపౌనరుక్త్యస్య ఉక్తప్రకారే ణాన్వయవేళా య మన్యథాపర్యవసితేః పునరుక్తివదాభాసః, రాజరాజేత్యాదిపదానాం నామత్వా త్తద్గత శ్చేతి బోధ్యమ్.

ఆఖ్యాతగతో యథా

శ్లో॥ శ్రీమతస్సూర్యమహారాయ, సార్వభౌమ గుణోదధే
త్వత్తేజసా మందతేజ్యా,ద్యుమణి ర్దివి మందతే॥

ఉదాహరతి శ్రీమదితి. త్వత్తేజసా త్వత్ప్రతాపేన త్వత్ప్రకాశేన చ ద్యుమణి స్సూర్య శ్చంద్రశ్చ మందతేజా మందప్రకాశః దివి మందతే సంచరతి మదిగతా విత్యాత్మనేపదం. అత్ర మందతే మందతే ఇత్యాఖ్యాతస్య పునరుక్తవదాభాసత్వా దాఖ్యాతగతః.

అత్ర కేచి త్పున రేవమాహుః. భాతి సదానత్యాగస్థిరతాయా మిత్యత్ర సత్పురుషప్రమాణామేన ప్రకాశతే స్థైర్యే పర్వతభూత ఇతర స్యార్థస్య దానత్యాగశబ్దపరివృత్తౌ అసంభవా చ్ఛతాలంకారోఽప్యయం తనువపురిత్యత్ర కృశాంగ ఇత్యస్మిన్నర్థే తనుశబ్దపరివృత్తౌనాలంకారత్వ త్యహాని రిత్యార్థాశ్రయత్వం అత ఉభయాలంకారోఽయ మితి తదుక్తం కావ్యప్రకాశే పునరుక్తవదాభాసో విభిన్నాకారశబ్దభాక్ ఏకార్థతైవ శబ్దస్య తథా శబ్దార్థయో రయ మితి.

యమకమ్

శ్లో॥ యమకం పౌనరుక్త్యే తు, స్వరవ్యంజనయుగ్మయోః
అర్థభేదేన త దిదమ్, బహుధా ద్యంతమధ్యగమ్.

స్వరవ్యంజనపౌనరుక్త్యాశ్రయ మలంకారం యమకం లక్షయతి యమక మితి. స్వరసహితవ్యంజనయుగ్మయో రితి మధ్యమపదలోపీ సమాసః. తస్య కియంతో భేదా ఇత్యత ఆహ తదితి. తద్యమకం ఆదిమధ్యాంత్యపాదగతత్వేన బహువిధం భవతీ త్యర్థః. ఏతచ్ఛ్లోకార్థ పాదయమకానా మప్యుపలక్షణం సర్వే ప్యేతే భేదా శ్చిరంతనై రేవ బహుధా ప్రపంచితాః, నేహ విస్తరభయా దితి.

యథా

శ్లో॥ సూర్యరాయమహీనాథ, ధనంజయ ధురంధర
కవిభ్యో దిశతా న్నిత్యమ్, ధనంజయ ధురంధర॥

# సంపాదకీయము

ప్రౌఢగతి నాంధ్రానువాద సమస్యాపూరణముల గావించి పంచిన కవివరుల కెంతయు గృతజ్ఞత నివేదించుచుంటిని. శార్దూలవిక్రీడిత మంతటి పెద్దశ్లోకము బహునియమబద్ధ మగునాంధ్రపద్యానువాదమున కై యిడుట కవివరులకు గాసంతశ్రమ గల్పించు గావున నాంధ్రాను వాదార్థ మించుక చిన్న శ్లోకములిచ్చుట తగునేమోయని కొందఱు నామిత్ర సత్తములు సూచించుటచే నీపరి నొక చిన్న యార్యావృత్తమే యొసంగబడినది.

గద్యపద్యముల మా పరిషత్పత్త్రికకు బంపు రచయితలు మాపరిషన్నిబంధనముల నాకళించుకొని వ్యావహారికభాషాదూర మును, గ్రాంధికరసవత్తమభాషాబృందిష్ఠంబును నగునట్లు వ్యాస రచనల గావించి,పనుప. బునఃప్రార్థితులు,విసంధుల,మిశ్రమసమాసముల విదేశీయభాషాపదమేళనముల బర్యుదాసింప బ్రార్థితులు.

పురాతనాధునాతన గ్రంథవిమర్శలకు మీ పత్త్రికలో దావు గలదా? యని కొందఱు లేఖల బనిచినారు.

శాస్త్ర సమ్మతముగ, సయుక్తికముగ, కవి జాతిమతదూషణ మణుమాత్రమైనను లేకుండ గావింపబడిన గ్రంథవిమర్శనవ్యాసముల స్వీకరించి మాపత్త్రిక ప్రచురింపగల దని వారికి సమాధానించుచుంటిని.

ప్లవంగనామకనూతనసంవత్సరమున చైత్ర మాసాంతము దాటకుండ వ్యాసముల వ్రాసి పంప రచయితలు సంప్రార్థితులు.

నియమబద్ధము, పురాతనకవితానుసరణము, నాంధ్రదేశీయ గౌరవోద్ధరణకారణము నగు మా యాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికాభి వృద్ధికి పండితకవిమండనమండలి సాయమొనరింప గోరుచుంటిమి. ఆంధ్రపండితకవుల సత్కవితారాధనకలనవలన బ్రాహ్మీదేవత యా నందించి యాంధ్రదేశము నభివృద్ధి నందించుగాక.

సంపాదకుడు : కాకరపర్తి కృష్ణశాస్త్రి

(కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర, బ్రాహ్మీభూషణాదిబిరుదాంకితుఁడు)

| | |
|---|---|
| బాలరామాయణము | 0-25 |
| మాధ్యమిక కారికలు-సంస్కృతము-నాగరిలిపి | 2-50 |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1-00 |
| రఘునాథరామాయణము (ప్రథమభాగము) | 1-00 |
| రాధికాసాంత్వనము- సముఖము. వేంకటకృష్ణప్పనాయకుఁడు | 1-50 |
| రాఘవయాదవీయము | 1-00 |
| రెడ్లనాఁటి రెండుశాసనములు | 0-50 |
| లక్షణసారసంగ్రహము | 2-00 |
| విప్రనారాయణచరిత్రము- చదలవాడ మల్లన్న | 1-25 |
| శతకసముచ్చయము (ద్వితీయభాగము) | 1-25 |
| శాసనపద్యమంజరి (మొదటిభాగము) | 1-75 |
| ,, (ద్వితీయభాగము) | 0-75 |
| శివరాత్రి మహత్యము- శ్రీనాథకవి | 2-50 |
| షోడశకుమారచరిత్రము- వెన్నెలకంటి అన్నమయ్య | 1-25 |
| సర్వేశ్వరశతకము- యథావాక్కుల అన్నమయ్య | 0-25 |
| స్వప్నవాసవదత్త- భాసకృతి కనువాదము | 2-00 |
| సింహాసనద్వాత్రింశిక- కొఱవి గోపరాజు | 1-50 |
| ,, (ద్వితీయభాగము) | 1-50 |
| సీతారామచరిత్రము | 1-00 |
| హ్రాస్వరంగములు | 0-50 |
| 42 - వార్షికమహాసభ - వ్యాసములు - 250 పుటలు | 1-50 |
| పరిషత్పత్రిక చందా | 3-00 |
| సూర్యరాయాంధ్ర నిఘంటువు 3,4,5,6,7 | 75-00 |
| లక్షణసారసంగ్రహము | 2-00 |
| సీతారామ చరిత్రము | 1-00 |
| బాలరామాయణము | 0-25 |

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | | | | |
|---|---|---|---|---|---|
| * 1 | సంపుటము | ... | ... | ... | 15-00 |
| * 2 | ,, | ... | ... | ... | 15-00 |
| 3 | ,, | ... | ... | ... | 15-00 |
| 4 | ,, | ... | ... | ... | 15-00 |
| 5 | ,, | ... | ... | ... | 15-00 |
| 6 | ,, | ... | ... | ... | 15-00 |
| 7 | ,, | ... | ... | ... | 15-00 |

* పునర్ముద్రితములు గానున్నవి.


ప్రకాశకులు :

**ఆంధ్ర సాహిత్య పరిషత్తు**

రామారావుపేట

కాకినాడ

తూర్పుగోదావరిజిల్లా.

*Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Gopalam at Republic Press MainRoad, Kakinada*

శ్రీ శారదాంబాయై నమః



"దేశభాషలందు తెలుఁగు లెస్స."

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

ప్లవంగ - చైత్ర వైశాఖములు

సంపుటము 56 సంచిక 1



సంపాదకుఁడు

కవిమూర్ధన్య. కాకరపర్తి కృష్ణశాస్త్రి.

# ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

| | |
|---|---|
| అకారాద్యముద్రిత గ్రంథసూచిక | 0–50 |
| అమరుకము—జయంతి రామయ్యపంతులుగారు | 1–25 |
| అన్యదేశములందలి ఆంధ్రవాఙ్మయము— ఆ. ఉమాకాంతముగారు | 0–25 |
| అన్యభాషావిభాగము | 0–50 |
| ఆంధ్రసాహిత్య పరిషద్వృత్తాంతము | 0–50 |
| ఈశానసంహిత | 0–50 |
| ఉత్తరరామచరిత్రము—జ. రా. పంతులు | 2–50 |
| ఉన్మాదసహస్రము (వెఱ్ఱివేయివిధములు) కొత్తపల్లి సూర్యారావు | 0–75 |
| కవిజనోజ్జీవని – సమస్యలు – శ్రీ కోటిరఘునాథతొండమాన్ | 0–50 |
| కవిజనాశ్రయము | 2–00 |
| కాళిందీకన్యాపరిణయము—అహోబలపతి (ప్రథమ భాగము) | 1–50 |
| డిటో (ద్వితీయ భాగము) | 0–75 |
| చంపూరామాయణము (ఆంధ్రము) జ. రా. పంతులు | 1–50 |
| చాటుధారాచమత్కారసారః – (సంస్కృతము) | 0–75 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0–25 |
| జ్యోతిశ్శాస్త్రసారము—కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0–50 |
| నమస్కారములు—కొత్తపల్లి సూర్యారావు | 0–25 |
| పరిషత్పుస్తకభాండాగారము 2వ భాగము | 1–00 |
| 3వ భాగము | 1–00 |
| ప్రాకృతభాషోత్పత్తి— శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0–75 |
| ప్రాస్తావిక పద్యావళి | 0–75 |
| బాలభారతము (అగస్త్యకృతమునకుఁ దెలుగు) | 2–50 |
| బాలరామాయణము | 0–25 |

శ్రీ శారదాంబాయై నమః



"దేశభాషలందు దెలుఁగు లెస్స."

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

ప్లవంగ - చైత్ర వైశాఖములు

సంపుటము 56 సంచిక 1



సంపాదకుఁడు

కవిమూర్ధన్య. కాకరపర్తి కృష్ణశాస్త్రి.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు—కాకినాడ

అధ్యక్షులు

"విమర్శకాగ్రేసర" 'ఐతిహాసికసమ్రాట్'

శ్రీ బండారు తమ్మయ్యగారు.

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

"అభినవభోజ"

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయకార్యదర్శి :—

"కవిశిరోమణి", "ఉభయభాషాప్రవీణ" A

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు :—

1. శ్రీ కోకా శివరామశాస్త్రిగారు
2. "బాలవ్యాస" శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. "భాషాప్రవీణ" "వ్యాకరణ విద్యాప్రవీణ"
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. "కవిమూర్ధన్య" "ప్రాఢకవిచంద్ర"
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు (బి. ఏ)
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ చిరువోలు కోటీశ్వరరావుగారు
8. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ.
9, శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, (ఎమ్, ఏ. ఆనర్సు)
10. "సాహిత్యవిద్యాప్రవీణ" "ఉభయభాషాప్రవీణ"
    శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రిగారు
11. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు. (బి. ఏ. బి. ఎల్.)

# విషయసూచిక

ప్లవంగ — చైత్రవైశాఖములు

సంపుటము ౫౬ — సంచిక ౧

హరిహర దేవాయ నమః

## సరూపః—నీరూపః

### (శ్రీ)రామస్తుతిః

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్లో. సకలసుగుణశాలీ సర్వధర్మప్రతోళీ
భయదసమరకేళీ ధ్వస్తదైతేయపాళిః
నిపతితఘనవాలీ, రాఘువాంభోజహేళి
స్సమవతు వనమాలీ, రామభూపాలమౌళిః. 1

శ్లో. హే దేవ! మే దేహి పదం త్వదీయం
యాచే న తే మాంసలచారుహస్తం
దదా పదం య న్మనయే గృహీత్వాం
హస్తో ఒరిదారాన్ విధవా శ్చకార. 2

శ్లో మందోదర్యా ఏకభుక్తం
పథ్యం కల్పయసి ప్రభో!
విధాయ విధవాం రామ!
కిము వైద్యో భవాన్ మహాన్ ? 3

శ్లో. వక్షోభాగ ముపాశ్రితా తవ రమా దాక్షిణ్యసంవేదినీ
దైత్యధ్వంసమిషేణ భూతలగతం రామాభిధం త్వానుగా
సీతాఖ్యాం సముపేత్య నీచవచసా తత్రోఽపి నిష్కాసితా
నీతారణ్యధరాంతరం బత విభో! దాక్షిణ్య మేత త్తవ.! 4

శ్లో. జటాజూటే గంగావిమలతమభంగాంతరచర
న్మరుత్ప్రేతవాశ్రిత ప్రచురతరసంశీతలతలే
ధృత స్తారాదారః ప్రమథపతినా భో! రఘువిభో!
త్వయా తారాదారో హత ఇతి కథా దుస్సహావిధా. 5

శ్లో. యస్యా దుర్నయతో హత స్తవ పితా కాంతారచారీ భవాన్
తస్యా ఆత్మభవస్య మూర్ధ్ని నిహితం ప్రాజ్యం తు రాజ్యం త్వయా
హిత్వా మాతర మంగనాం బత! సదాసేవాపరో లక్ష్మణః
కిం లబ్ధో? హి శిలాహతామ్రమహీజో దాతా ఫల స్యారయే. 6

*

శ్లో. అహో! భాగ్య మహో! భాగ్యం
మహాధన్య ఇహా స్మ్యహం
గాఢాజ్ఞా నాంధతమసాత్
ప్రబుద్ధో భవతః ప్రభో! 7

శ్లో. జ్ఞానీ భవాన్ తవ కదాపి న నామరూపే
కర్మాణి జన్మమరణాని గుణా స్త్వ మాత్మా
త్వం జానకీధవ ఇ వాఖిల దైత్యలోక
ధ్వంసీవ రామ ఇవ జాత ఇ, వాజ్ఞ దృష్టః. 8

శ్లో. జాతో న; సీతోపయమో న; యానం
వనేన; దారాపహరణం న; సఖ్యం
సుగ్రీవరాజేన న; సేతుబంధో
న వా, దశగ్రీవహృతి ర్న; భూమన్! 9

శ్లో. అజ్ఞానజ్ఞానదృగ్భ్యాం భవసి జనకజా
తాధినేతా ద్వయాత్మా
కాంతారాంతః ప్రచారాకులితనిజమనా
నిశ్చలో నిర్వికారో
లంకాలంకారఘోరాసురవరనృపతే
స్తస్య హర్తా న కర్తా
రామో భూమాగమాంతా అపి తవ చరిత
నేత్థ మి త్యుచ్చరంతి. ౧౦

శ్లో. మాయా నాస్త్యేవ; తద్ధేతో
ర్మాయాకార్యం జగ న్నహి;
కగ న్నోచే న్న సాక్షిత్వ
మేకస్య తవ రాఘవ! 11

శ్లో. బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా
నాస్త్య స్త్యేవ త జ్జగత్
అస్త్యపి బ్రహ్మ నాస్త్యేవ
భాసతే మాయయా సదా. 12

*

(నాస్తి-అస్తి అనునై జగ న్నిష్ఠమునుండి)

## వరణ ఏన్డి శాసనము

(శ్రీ ఓరుమళ్ళ కామేశ్వరరావు బి. ఏ. బి. ఇడి.)

తూర్పుచాళుక్యరాజైన మూడవఅమ్మభీముని తామ్ర శాసనమైన వరణఏన్డిశాసనము (భారతి ఏప్రిల్ 1965) ప్రకటింపబడినది. దానిలో వరణఏన్డి అనునది గ్రామనామముగా జెప్పబడినది. శాసనము దొరకినస్థలమందె వేడిమంగళ మను పేరుగల పుంత యున్నది. ఆప్రాంతమందె తుల్యానది కలదు.

వరణఏన్డి అనునామ మె ట్లేర్పడినదో విచారింపవచ్చును. పై శాసనములోనె యాంధ్రదేశమునకు శకటమంథనవిషయ మనుపేరున్నది. అది సంస్కృతపదసంపుటి. దానిని తెలుగులో చెప్పవలెనన్న "బళ్ళదారినాడు" అగును. తొలుత నుండిన యట్టిపదమునకె శకటమంథనవిషయ మనునది సంస్కృతానువాద మని విశద మగుచున్నది. బళ్ళరస్తాకు నడ్డుగా నెన్నియో వాగులు, వంకలు నుండును. ఆప్రాంత

మున నున్న తుల్యానది యట్టివానిలో నొకటి. దానితీరముననె వరణ ఏన్జిగ్రామ మున్నది. బండ్లు తుల్యానదిని దాటవలెనన్న పాటిరేవో, వారధియో, యవసరము. 'వరణము' అను సంస్కృతపదమునకు వంతెన యని తెలుగున నర్థము కాబట్టి వరణఏన్జి అనుపదసంపుటిలో 'వరణ' 'ఏన్జి' యను రెండుమాట లున్నవి. వరణము లేక వంతెన ఏన్జి అనుగ్రామమువద్ద నున్నది. ఆవంతెనమూలముగా ఏన్జి అను గ్రామము ప్రసిద్ధికి వచ్చినది. వంతెన ఏన్జియనుదానిసంస్కృతానువాదము వరణఏన్జి యని మనము గ్రహింపవచ్చును.

ఏన్జిగ్రామ ముండినస్థలమునకె వేడిమంగళము నను పేరు వాడుకలో నుండినది. ఏన్జి అనుమాటయె పామరజనులనోళ్ళలో బడి 'వేడి' యైన దనుట స్పష్టము. అయితే యీ 'మంగళ' శబ్ద మేమి? పూర్వకాలము తెలుగుదేశములో మంగళశబ్దము వాడుకలో నుండి, క్రమముగా నంతరించినది. ఆపద మిప్పటికిని తమిళదేశములో మిగిలినది. తెలుగులో నగ్రహారమున కేమియర్థమో, తమిళములో మంగళము నకు నదే యర్థము. 'మంగళ' మను నంతము గలగ్రామనామములు తమిళదేశములో కొల్లలుగా నున్నవి. ఏన్జిగ్రామ మొకప్పుడె బ్రాహ్మణాగ్రహారముగా నుండినది. ఆవిషయమె మంగళ మను పదము రుజువు పరచుచున్నది.

ఏన్జి పూర్వకాలమందు పట్టణముగానుండి, క్రమముగా దాని ప్రాముఖ్యత తగ్గగా, నదీతీరమున నున్న భాగము సిక్తస్తు నై యుండవచ్చును. లేక తుల్యానది పొంగి నదీతీరమున నున్న భాగము నాశనము కాగా, మిగిలిన గ్రామమె యిప్పుడు ఏడిద అను పేరున నున్న దనవచ్చును. అదియునుగాక నదీతీరమున నున్నగ్రామము నదీపాతము కాగా, గ్రామస్థులు కొంత మెగువ ను అదేపేరున గ్రామమును నిర్మించుకొని, దానికి వెనకటిపేరే పెట్టుకొన్నా రని చెప్పవచ్చును. ఏదయినను ఏన్జి అనుపదమె ఏడిదగ మారినది. దానిలో క్రొత్తగ

'ద' అక్షరమొకటి చేరినది. దీని పదవిభాగ మిట్లుండవచ్చును, ఏడి+ఇది+అ. ఏన్డి వద్దనున్నవంతెన నశించినది కాబోలు, కాబట్టి గ్రామ మిదే నని తెలుపుటకు నీకొ్రత్త పేరు పుట్టి యుండవచ్చును. అంతేకాని ఏన్డిగ్రామపామమె మారి యిప్పటి మునలేక మురమండ యైయిన దనుటకు రెండుపేర్లలోని సాదృశ్యమును చాలదు. మండ పదము సాధారణముగా మందయె, అదియె ఆలమంద. మునలేక ముగ అనువానిని నాలమంద యున్నతావు మున లేక మురమండ యైనది.

వరణఏన్డి గ్రామమును దానముగా గ్రహించినవాడు చంద్రన రాజు. అతడు నరశిరోదర్పణ ధ్వజుడు. ఈ వింతసమాసమున కర్థము కొరక బడుట లేదు. చంద్రన రాజు హైహయ వంశజుడు. కార్త్తవీర్యాసి కుమారు డైనఅర్జునుడును హైహయవంశజుడే. కాబట్టి నరు డనగా (కార్త్తవీర్య) అర్జునుడు దర్పణ మను మాటకు జి, వి. దేవస్థలిగారి సంస్కృతనిఘంటువులో 'నయనము'(=కన్ను)ననునర్థమున్నది. ప్రత్యేక ముగా శిరమునందు కన్ను గలవాడు శివు డని దీనిభావము కాబోలు ఇది నిజముగా వింతప్రయోగమె! అట్లు చంద్రనరాజు ధ్వజము మీద కార్త్తవీర్యార్జునుడును, శివుడు నున్నారు.

తొలివాయి లేక తుల్యానదిని గురించి ఏమనగా—తొలుత నాంధ్రదేశములో వేలాదివేలసంవత్సరములనుండి యున్నవారు తెలుగు జాతివారు. అటుపిమ్మట నిటీవలికాలములో వచ్చి చేరినవారు ఆర్యులు, ప్రాకృతులునుకాబట్టి స్థలముల, నదుల, కొండల,యూళ్ళపేర్లు తెలుగు లోనే పుట్టినవి.ఆర్యాదులునిచ్చటప్రవేశించినపిదప పై పేర్లలోకొన్నిటిని వారభాషోచ్చారణకు ననుకూలముగా (ఇదియే క్రొత్తజాతినైనను చేసేవనే) మార్చుకొన్నారు. మరికొన్నిటి ననువదించుకొన్నారు.

గోదావరీనది యేడుపాయల్లుగా చీలి సముద్రములో కలియు చున్నది. వీటిలో తొలిపాయకు తెలుగుపేరు తొలిపాయ యనియె. మిగిలినపాయలయొక్క తెలుగుపేర్లు తెలియుటలేదు.పిమ్మటకాలములో

వచ్చినయూర్వాదు లీనదుపాయులకును సప్తర్షులయొక్క యేడు పేర్లను తగిలించుటకు బహుననుకూలముగా నుండినది. అయితే తొలిపాయ అను పేరు ఇదివరలోనే బహుప్రచారములో నుండుటచేత దానిని కదలించుట సులభము కాలేదు. కాబట్టి 'తొలి'ని 'తుల్య' అని సంస్కృతీకరించుకొన్నారు. అయిననుతమపట్టు విడువక దానికికూడ మహర్షి నామమును తగిలించినారు. అట్లు తొలిపాయకు మూరు పేర్లు పుట్టినవి. అంతే కాక చిల్లలదేవతలు పుట్టినట్లై, స్థల, మల, శిల, జల ఇత్యాదులకు మాహాత్మ్యములు బలిసినవి.

అయితే పై శాసనములో తొలివాయి అను పేరుకనబడుచున్నది. ఉదా:-పాయ+గొమ్ము=పాయగొమ్మువలెనె, తొలి+పాయ=తొలివాయ యని యాదేశముతో వచ్చినది. అంతేకాక పాయ, పాయి యను రెండు రూపములును శాసనకాలమునాటికె యుండుటచేత తొలివాయయె తొలిపాయి యనుపేరున శాసనములోనికి నెక్కినది.

తొలివాయిని యొకవాగుగా నెంచినవారు, దానిని 'తొలివాగు' అని పిలుచుకొన్నారు. 'వాగు' శబ్దమునకు సంస్కృతీకరణము 'భాగ' కాబట్టి తొలివాగు 'తుల్యభాగ' యనుసంస్కృతనామమునుగూడ ధరించినది. పేర్లు ప్రజలనోళ్ళలో నెన్నియో యాభాసరూపములను బొందుచుండును, కాబట్టి యితరరూపములు గూడఁ బుట్టినవి. మహమ్మదీయుల యాంగ్లేయుల ప్రభావమున మనదేశములోని పేర్లలో నెన్నిమార్పులు వచ్చినవో మనకు ననుభవములోనున్న విషయమే కదా!!

ooooooooooooo

శ్రీ రామాయ నమః

# కౌ శి కా భ్యు ద య ము – ర ం భ

## శ్రీ శిష్ట్లా బాలకోటీశ్వరరావు.

"చినిపూవుఁ దేనెకు నెనవచ్చు నీకవిత్వము కవిత్రయసమ్మతము మృదుల"మని శ్రీకృష్ణభారతాదిమహాకావ్యప్రణేతలు, మహామహోపాధ్యాయులు నగు స్వర్గీయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే ప్రశంసింపఁబడి "ధన మీయఁజాలఁ దృప్తిగ మన మీయంగలను, దాని మన్ననమీఱం గొని నీ వాకసత్కృతి నేర్పొనరఁగ రచియించి నాకు నొసఁగుము సుకవీ!" యని యర్థింపఁబడి కవిమూర్ధన్యబిరుదప్రదానము వడసినప్రౌఢకవిచంద్రులు కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు పదునెన్మిది సంవత్సరములకుపూర్వము కౌశికాభ్యుదయ మనుపేర గాధేయుని సంపూర్ణగాథ ప్రబంధముగా విరచించి "ఎందఱు లేరు సత్కవు లహీనకళాంచితు లాంధ్రభూమిలో? నందఱ మాని నాదుకృతి నందుకొనెన్ గవిసార్వభౌముఁ డానందము మీఱ మత్కృతిఘనమ్మొ మదీయపురాభవక్రియామందఫలమ్మొ లేక లసమానతదీయదయాస్వభావమో!!" యని భావించి యాశ్చర్యానందామోదములు పాళగింపఁగా సంకితము గావించిరి. పిదప 1952లో నఁగా ఖరసంవత్సర మాఘమున నిది ముద్రింపఁబడి ఛందోబద్ధమైనసత్కవిత నాకళించుకొనఁజాలు రసజ్ఞాంధ్రవిబుధపుంగవుల నలరించి వారిచే 'వహ్వా! మాయురే! బాపురే!' యని కొనియాడఁబడి యాంధ్రీయవాగ్దేవత కంఠమున మాణిక్యహారమై నిలిచినది.

'రామాయణాదిమహాకావ్యాంతర్గతశతానందసానందకథితగాధినందనచరితము ప్రధానాధారంబుగ' కృష్ణశాస్త్రిగారికౌశికాభ్యుదయము సంసృజింప నుద్యోగించి కృతార్థు లయిరి. శ్రీమద్వాల్మీకిరామాయణమున బాలకాండమున మిగులక్లుప్తముగ నున్నవిశ్వామిత్రచరిత్రము వీరిచేతఁబడి యయిదాశ్వాసముల మహాకావ్యముగ

పరిణమించినది. కృతిభర్త "కభ్యుదయపరంపరాభివృద్ధియు, నాయురారోగ్యభోగైశ్వర్యసమృద్ధియు, హరిదంతదంతురితవిశదయశోవిలాసవిశేషప్రసిద్ధియు నగునటులు" పురవర్ణనముతో కథ ప్రారంభింపఁబడినది.

మహితార్యావర్తదేశరాజధానియగుకన్యాకుబ్జము శ్రీకాంతావరణీయధామ మఁట! రాశీభూతశోభాదిదృక్షా కేంద్రీకృతనైజలోచనసహస్రస్థాపితాసూయితావ్యాకీర్ణామరలోకనాయక మఁట!! వెన్నెలరాత్రులందు మందమందానిల మానుకోరికతో నానగరాగ్రహర్మ్యములయందు నడయాడు పడంతులసోయగమ్ములను కనుఁగొననెంచిన నాకవిటులు వాతధూతానుపమానకేతన పటాగ్రచపేటపటుప్రహారములను చవిగొందురఁట!! అప్పురీవరమున ప్రతినిశావసరములందు ధీరమలయధరాధరాధారస్మారసారపాటీరగంధఘుస్మరసమీరవారవిస్తారకార్యములలో చాల పైసరముల నోలాకుపడినవారిని బునారతికిఁ బ్రేరేచుట యొకటియంట!! ఆనగరమున నెసంగుకారాగృహములు నారెకులు వధ్యశిలలు న్యాయసభలు శిక్షాస్మృతులు సార్వభౌమలక్షణార్థమే కాని నిరుపయోగము లఁట!!

ఈవిధముగ నతిశయోక్తిరూపకోత్ప్రేక్షోపమాదినానాలంకారపరమమాధుర్యవైభవము యథేచ్ఛముగ చవిజూపించుచు మహాకవులకుమాత్రమే సాధ్య మనఁదగిననిగ్రహముతో నీప్రబంధరాజమును శాస్త్రిగారు కొనసాగించిరి. ఇం దేఘట్టమున నేపద్దెమును శీలించినను సురాపగాతులితధారాశుద్ధి, భావశ్రీపరిపాకసంకలనహేవాకము, సత్కల్పనాప్రావీణ్యము గోచరించి పఠితలను శ్రోతలను రుంద్రానందమానససరసిలో నోలలాడించును. ప్రాగ్జన్మసంస్కారలబ్ధ మైన యౌచిత్యవిచారవివేకముతో దీపించు శాస్త్రిగారిధీబలము మనలను ముగ్ధులఁజేయును. ఈపద్యమును మానసింపుఁడు.

సీ. వేలుపుగాణీలపెదవు లెండుటఁ బాయ
 వాయెఁ బంచాలి నవస్వరములు
పల్లవావళి యిష్టపడదాయె భంగింపఁ
 గాంతాకుచాశ్లేషగౌరవంబు
గంగోదకమున మున్కలు వెట్టుటే కాని
 రాదాయెఁ దటికి నైరావతంబు
తడి నారనీకున్నఁ దల లెత్తవాయె నం
 దనవనాంతరనవ్యనవ్యలతలు

తే. గీ. కౌశికాఖండతమతపోగాఢవహ్ని
 సంజ్వరం బూర్ధ్వగామియై సంక్రమింప;
 వేయికన్నులఁ బలుమాఱు విచ్చి కాంచె
 స్వర్గదుర్గతి నా శచీప్రాణవిభుఁడు.

ఇది పంచమాశ్వాసములోనిది. "కనులఁ దెఱిచినాఁడు గాధేయసంయమి, టక్కులాడి! నీకుఁ జిక్కఁ డింక నరుగు మరుగు మంచు" వచ్చియొడలిబాలెంతరా లగుమేనకాకాంతను తిరస్కరించి యామడ యడుగుగా నడిచి యుత్తరాద్రి జేరినవిశ్వామిత్రుఁడు ఘోరదీర్ఘ తపఃపరిపాకంబున బక్కటిల్లియు బ్రహ్మర్షి కాలేక రెండింత లైనపట్టుదలతో తపించుచుండఁగా నుప్పతిల్లినయుపద్రవ మిది! మనసునకు హత్తుకొనునట్లు చెప్పఁబడినది. గాధేయుని తపోగాఢవహ్నిసంజ్వరము స్వర్గమున మండువేసవి సృజించినదఁట! గ్రీష్మర్తుప్రభావము నీరీతిగా కథలో నతుకునట్లుగా శాస్త్రిగారు వర్ణించినారు. కాంతాకుచాశ్లేషగౌరవము భంగించుటకు పల్లవావళి యిష్టపడలే దని వ్రాయుట కాయురాగమరహస్యవిదు లైనవీరే సమర్థులు!! దుర్భర మైన యీయుపద్రవము గమనించి తల్లడిల్లి ప్రాంచితవై జయంతభవనాయత జాలసకాశవాసియై దీని నడఁగించుటకు యోచించుచున్న యాదితేయ

నెత దృష్టిపథమున మానివర్యధైర్యదళనచతురతా నితాంతా రంభయు, నూరువిజితరంభయు నగురంభ తోఁచినది. వెంటనే పిలిపించలేదు. తొందరపాటు నుజ్జగించి మరల మరల నాలోచించి నిగ్రహించుకొని రంభాచలాక్షిని తోడ్కొని రమ్మని యొకసురాంగన నంపినాఁడు.

రంభ మనపురాణములలో కావ్యములలో చాలప్రసిద్ధి నందిన దేవవేశ్య. ఆమెను పలువురు పలు తెరగుల తీర్చి దిద్దినారు. రావణునిచే నడ్డగింపఁబడినరంభ, నలకూబరుని ప్రియతమయై వాసి గన్నరంభ, శ్రీనాథునిచాటువులలో ప్రకాశించినరంభ—ఎవరి కనువైనసరణిలో వారు చిత్రించి రంభను చిరంజీవినిని జేసినారు. ఇంత సుప్రతిష్ఠ నాచుకొన్నరంభను కృష్ణశాస్త్రిగారుకూడ వాల్మీకము ననుసరించి యౌచిత్యము పోషించుచు వర్ణించి యాంధ్రకావ్యకళాప్రపంచమున నామె కొకస్థిరత ప్రసాదించినారు.

శృంగారరసస్నిగ్ధలావణ్యవతి యైనరంభ రెండుపర్యాయము లీకావ్యమునమనకు సాక్షాత్కరించును. తొలుత తృతీయాశ్వాసమున గురుపుత్త్రులచే శాపింపఁబడి చండాలుఁడై గాధిసుతు నాశ్రయించి తదీయామితతపోబలసహాయుఁడై దివికి సశరీరుఁడై యేగిన త్రిశంకు నృపాలుఁడు రంభాగృహమును సందర్శించినట్లు చెప్పఁబడెను. అమర ధారణిలోని వేశవాటికయం దగ్రగణ్యమై వెలుగు లీను రంభయిల్లు— "ఇనశశిదృగంచదచ్యుతాననము వోలె,నశనిపానీయయుతబలాహకము వోలె, వ్యాఘ్రవాతాయులసదరణ్యాని వోలె రజస్సత్వరాజిత"మ్మఁట! వీరపాణంబుచే విసివినవీరులును, సోమపానంబుచే సొగసినయాజులును ననూనరంభాధరాధరపానము కాంక్షించి యాగృహద్వారముచెంత రొదాళము సేయుచురాయి డించుచున్నారఁట. అది చూచి త్రిశంకుఁ డబ్బురముతో

క. అక్షీణాలంకృతిఁ గృతి
దక్షిణనాయకు లిఖించి తనిసిరి, రంభన్
వీక్షించినచో వ్రాయరె
దక్షిణనాయికనుగూడఁ దమ గ్రంథములన్?

అని యభిప్రాయపడినాఁడు. త్రిశంకునినోట నీమాటలు వెలువడినను కొంచె మాలోచించినచో నివి కృష్ణశాస్త్రిగారివే యగును. వ్రాసినదే వ్రాసి యాయాసపడి యహమహమికలు పెంచుకొనుచున్న తెలుఁగు కవులకు వైవిధ్యపరిపూర్ణ మైనక్రొత్తనాయిక నందించి నవ్యమార్గ దర్శకులు నైరి. ఎంత హృద్య మైనచమత్కృతి నిమిడ్చిరి !!

ఇప్పుడు వాసవునిమాతి చేరినగంభయింటిచెంగట నట్టిసందడి యేమియును లేదు. ఏదో వచ్చిగా పరిచయించి నిజాశయములను లిఖించి నలకూబరుఁ డంపినప్రణయలేఖ ననురక్తితో పఠించుచున్న రంభను చూచి యామె రాజనియోగము విన్నవించినది. "కనకా నూనమనోజ్ఞగాత్రి! యట కీకొందారిమాదారిప్రొద్దున నేతెంచెదఁ దప్పకుండ" ననుపంక్తులు మాటిమాటికి మననము గావించుకొనుచు నుప్పొంగుచున్న రంభయుత్సాహమును వజ్రిమేల్పనుపులు భంగించె నఁట.

రంభ మిగుల తెలివి గలది. ఇంద్రుని యాహ్వానము మన్నించుట కిష్టములేని దయ్యును తామసించుట తిరిఁపొనరించుట ప్రమాద కరము లని యెంచి యథోచితవేషము నూని వలనుక న్నదరుచుండగా మది జల్లుజ ల్లనుచుండఁగా గమించినది.

తే. గీ. రంభ మరియాదఁ బాటించి రాచనగరి
కంతదవ్వున నే చతురంతయాన
మవతరించి. . . . . . . . . . .

శాస్త్రిగారిలేఖినికి మర్యాద తెలియును. ఏ పాత్రము నెట్లు నడుపవలయునో యెఱిఁగిన ప్రజ్ఞావంతు లాధునికులలో నరుదుగా నున్నారు. వారిలో శాస్త్రిగా రొక రనుట సమంజసము.

అసమయమున రాజసౌధమునకు వచ్చినరంభను విస్మయముతో తత్తరముతో కనుఁగొనుచుంగనల జగాజిగిచూపులతో పూవనవ్వులతో బహూకరించుచు చని యాసురవారముఖ్య యాచనార్థురిని మునుఁ గుచుఁ దేలు చున్ననాకభూవిభుని సమీపించి దోయిలించినది. స్వకీయ యత్నసాఫల్యమతితో శచీపతియుచితాధికాదరముప్రదర్శించినాఁ డఁట.

శివతపోభంగ మొనరించుటకు మన్మథుని పిలిచి ప్రోత్సహించిన కాళిదాసుని యిందుఁడే యీయింద్రునిలో కాన్పించును. కుమార సంభవమున కవికులగురు వాఘట్టము నెంతమధురముగ రచించెనో యంతమనోహరముగ నీసన్నివేశమును పౌఢకవిచంద్రుఁడు రచించెను.

చ. వలపులదీవివై వెలయుభామిని వీవును వజ్రముం గడుం
గలుగుటచేతనే త్రిభువనంబులు హాయిగ నేలుచుంటి నో
జలరుహగంధి! వ్యర్థ మగుసంయమివర్యులపట్ల వజ్ర;మా
వెలితియుఁ దీఱుఁ దావకనవీనమనోహరచాతురీధురన్.

నిజాశయపూరణసుప్రవీణుఁ డైనపురందరుఁడు రంభను పొగడ సాగినాఁడు. 'అగ్నిజ్వాలలు, వరుణపాశము, యమదండము పావనశక్తి గిరివిపాటనదక్ష మైన నాకులిశము చేయలేనికార్యము తావకచంచలే క్షణకటాక్షకిరణం బొకఁడే చేయఁగల' దని యామె నాకాశమున కెత్తినాఁడు. 'చక్కఁదనమున, నెఱజాణతనమున, గానసత్కళయందు ప్రఖ్యాతి లేనిమేనకకే దానుఁ డైనకౌశికుని సాధించుట నీకొక మహాకార్యమా?! నిలింపులకు ప్రియ మాచరింపు' మని మృదువుగ శాసించినాఁడు. ఆతనియానతి విన్నరంభ కోపనమునిమూర్తి నొక్క పరి భావనసేసి 'హతాస్మి' యంచు పరికంపితాంగియై రెండుచేతులతో కనుఁగవను కప్పుకొన్నది. నిలుచుటకుగూడ నశక్తయై తుద కింద్రుని పాదములచెంత నిలువునఁ గూలి సొమ్మసిల్లినది. దానియవస్థను జూచి స్వార్థలోలుఁ డైనబలదమనుఁడు నవ్వుకొనె నఁట! భయదైన్యశోక విచలిత యైనరంభ, కాఠిన్యము మూర్తీభవించిన దేవేంద్రుఁడు నిక్కడి

శాస్త్రిగారి రచనము చదివినంతనే కన్నులకు గట్టుదురు. మూర్ఛనుండి మేలుకని కాతర తాచలితాక్షియై యేమియు వాకొనలేని యానిర్జర చకోరవిలోచనతో "కనికరము వేయికన్నులఁ దొనుకులాడఁ బలుకు పలుకునఁ గ్రొందేనె లొలుకుచుండ హరిహయుండు"—'కౌశికుఁడు కాంతలకౌఁగిలింతల సుఖంబు నెఱుంగనివాఁడు గాఁడు; తలవంపు వేశ్యజాతికి ఘటిల్లినది; నీకొలమందలివా రిది విన్నచో వికవిక నవ్వరే?' యని యనునయించి

చ. నెలఁతరో! సూనసాయకుఁడు నీకనుసన్నలనే మెలంగు; రా
చిలుకలు గండుకోయిలలుఁ జెంత వసించు; వసంతుఁ డావనిం
గలయఁగ నావహించు మునుగాఁ జని; పున్నమచందమామ వె
న్నెలఁ గురియించు; బాసటగ నేనును నీసరసం జరించెదన్.

అనినాఁడు. దీనిమూల మిటు లున్నది.

శ్లో. కోకిలో హృదయగ్రాహీ మాధవే రుచిరద్రుమే
అహం కందర్పసహితః స్థాస్యామి తవ పార్శ్వతః.

(వాల్మీకిరామాయణము, బాలకాండము, చతుష్షష్టితమస్సర్గము 6)

ఆదికవి వాల్మీకిహృదయము చక్కఁగ గుర్తించి భావమును పెంచి వ్రాసి శాస్త్రిగారు సన్నివేశస్ఫూర్తిని పెంపొందించినారు.

ఉ. మానససీమ నూనుననుమానము మానుము కామినీమణీ!
పూనుము పూనికం దమి నపూర్వవిలాసము లావరింప నె
మ్మేను నలంకరించుకొనుమీ కొనుమీ సురగాయనీజనా
నూనమనోహరాధరసముచ్చరితస్తవభాగధేయముల్.

అని హెచ్చరింప మాఱుపల్క నోడి యంగీకరించి రంభ యుల్లు చేరినది. పిమ్మట జరుగవలసిన దంతయు జరిగినది.

"అత్యాంతలతాంతనితాంతకాంతమై, సరసరసాలపల్లవకషాయ రసైకనిషేవణక్రియా పరిణతపంచమ స్వరవిభాస్వర పైకవిజృంభణాంకమై" వసంతము కౌశికుని యాశ్రమప్రాంతమున నవతరించినది.

సీ. వనజరజోహారివారిఁ గరేణుపైఁ
బుంవారణేంద్రమ్ము పుక్కిలించె
కొదమతుమ్మెద చానఁ గూడి పూగిన్నెలో
నచ్చంపుఁగ్రొందేనె లారగించె
మెసవఁగా మిగిలినబిసము నోటం బెట్టి
జక్కవ తనయాలి సత్కరించె
దాడిమ్మగింజ లెంతయు నొల్చి రాచిల్క
ముద్దారఁ జెలినోటఁ బోషణించె
తే. గీ. లాహిరీ గ్రమ్మ హరిణ మిల్లాలి మేను
కొమ్ముకొన గోకి మాటికి గుస్తరించె
సురచిరోన్నత తరుల వల్లరులు పెనఁగె
సారశృంగారలీల వాసంత వేళ.

ఈ మంజుల భావసంపదలో చాలభాగము కుమారసంభవము లోనిది. కనుఁడు—

శ్లో. మధుద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః
శృంగేణ సంస్పర్శ నిమిలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః (3 వ సర్గము 36 వ శ్లోకము).

శ్లో. దదౌ రసాత్ పంకజరేణుగంధి
గజాయగండూషజలం కరేణుః
అర్థోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాఙ్గనామా. (3వ సర్గము 37వ శ్లోకము).

ఈ శ్లోకములనే కవిరాజశిఖామణి యగునన్నెచోడుఁ డిట్లాంధ్రీకరించెను. చూడుఁడు!

సీ. కరి యిచ్చె నర మేసి కరిణికి సల్లకీ
పల్లవ మ్ముల్లంబు పల్లవింప,
మృగ మర్థిఁ గబళించి మృగి కిచ్చె నంచు ద
ర్భాంకురంబులు చిత్త మంకురింప,
హంస పెక్కువ నిచ్చె హంసకి నోర్నోర
నెలదూఁడు మొగముల నెలమి మిగుల,
భృంగము దావితో భృంగికి దయ నిచ్చె
మధుధార ముఖరాగముదము దలఁక—(ఆ 4, ప 113)

ఈ రెండనువాదములలో నేది కాళిదాసునిగౌరవము నందునో సాహిత్యసారస్యవేత్త లగుపాఠకులే నిర్ణయింతురుగాక! ఆధునికులలో పెక్కురాంధ్రకుమారసంభవములను సంతరించిరి. కాని నేను పరికించి నంతవఱకు శాస్త్రిగారి యనువాదమున గమగమించు గాంభీర్య మాధుర్యములను తోసిరా జనఁజాలునాంధ్రీకరణము తటస్థింపలేదు. భవిష్యత్కాలము తీర్చునేమో!

సంక్రందనశాసనము ప్రతికూలింపలేనిరంభ కౌశికుని మన్మరింపఁగోరి—

సీ. కొమరారు చెక్కిళ్ల గొజ్జంగిరంగుతో
రవలదుద్దులడాలు రాయిడింప
త్రైక పీలఁగఁ బొంగు రారాపుచన్నుల
బన్నసరంబులు తన్నియాఁగ
మాటికి మీఁగాళ్ళ మాందాలికుచ్చెళ్లు
వింతవింతగఁ గుప్పిగంతు లొనఁగ
వెన్నానుకొని లీల వ్రేలాడువాల్జడ
పిక్కలతోడ డీడిక్కులాడ
తే. గీ. పదపదంబునఁ గాంచీవిభాసమాన
కింకిణీగణ మురియాడి గిలుకు మనఁగ
పయ్యెదం జక్కపఱుచుచు వచ్చెఁ బ్రౌఢ
భామినులఁ గూడి తత్తపోవనికి—

ఇట్టి యనన్యసామాన్యసౌందర్యము మేళవింప నేతెంచినరంభ విశ్వామిత్రుని సంచలింపఁజేయలేకపోయినను రసికపాఠకశ్రోతృలోకమును విభ్రాంతిలో ముంచఁగలదు. వ్యామోహమున తూలించఁగలదు. ఎంత ప్రఖ్యాతచిత్రకారుఁడైనను కవియగుట యసంభవము కావచ్చును. కాని పరిణతి జెందినప్రౌఢకవి జీవము తొణికిసలాడువాక్చిత్రములు నిర్మింపఁగలఁ డని కృష్ణశాస్త్రిగారు చాటినారు. కవికి కళాకారులనడుమ నగ్రపీఠమును సాధించినవీరిని యాంధ్రు లభినందింపఁగల రని నావిశ్వాసము.

మ. సరళానోకహమూలమందు నొకపాషాణంబుపై ద్వీపిము
ష్కరచర్మంబున మేనువంప కుభయాంసమ్ముల్ గడు న్వంచి భీ
కరదృష్టి న్నిజనాసికాగ్రమునఁ జక్క న్నిల్పి పాణిద్వయిం
గర ముత్తాన మొనర్చి ఘోరతపముం గావించు నక్కౌశికున్—

తిలకించినది రంభ. నాఁడు మన్మథుఁడు వీక్షించినశంకరుఁడు కూడ నిట్టివాఁడే!

శ్లో. స దేవదారుద్రుమవేదికాయాం
శార్దూలచర్మవ్యవధానవత్యాం
ఆసీన మాసన్నశరీరపాత
స్త్రియంబకం సంయమినం దదర్శ

శ్లో. పర్యఙ్కబన్ధస్థిరపూర్వకాయ
మృజ్వాయతం సన్నమితోభయాంసమ్
ఉత్తానపాణిద్వయసన్నివేశాత్
ప్రఫుల్లరాజీవ మివాఙ్కమధ్యే.

(సంస్కృతకుమారసంభవము, 3 వ సర్గము, 44, 45 శ్లోకాలు.

ఇప్పట్టున కాళిదాసు ననుసరించి శాస్త్రిగారు ధన్యులైరి. పూర్వసంస్కృతకవుల యుదాత్తభావములను పరిగ్రహించు అలవాటు శ్రీనాథాదుల కున్నది. అది వీరికిని నబ్బినది. మూలముతో సమముగా

రచించి మెప్పింపఁగలశక్తి శ్రీనాథున కుండినట్లు మఱియొకరికి లేదు. ఆ చాకచక్యము మరల వీరిలో ప్రకాశమాన మయినది,

కౌశికుని యుగ్రమూర్తిని కనుఁగొన్న నలకూబరుసాని హృదయమున భయసందేహము లంకురించినవి. కాని సుమాంబక భీషణ నిస్వనధనుష్టంకృతులు పురందరవిశంకటశాసనము తలంచుటతోడనే యవి నశించి పురాధికసారధీరతలు జనించినవి. కెంజిగురుకొమ్మల మాటున నక్కి యొకకోయిల 'కో' యని కూసినది. రంభ దాని నను కరింపసాగినది. 'హా' యని గాధేయుఁడు కనులు దెఱచినాఁడు.

మ. అఱచేతన్ నునుఁజెక్కిలి న్నిలిపి స్మేరాంకూరముల్ సారెకుం
జెరలాడన్ శిర మంసమం దొరఁగ నిక్షేపించి పెంపారుపై
సరమందు న్మ్రియ మందుచందములు మించన్ గన్నుల న్మోడ్చి యు
న్సురనన్ వేలుపుసాని, దాని మునియుం జూచెన్ యదృచ్ఛాగతిన్.

లంజెలలో నెఱజాణ యగురంభ తననైజమును వెల్లడించినది. భయసంశయములనే కాదు లజ్జనుకూడ పరిత్యజించి ప్రణయపారవశ్యముతో వీణెఁ జేకొని యారాజసంయమి వినునట్లు జావళులు పాడినది. కిలకిల నవ్వినది. చెలులను గేలిచేసినది. పయ్యెద జక్కదిద్దుకొను నెపమున చన్గవసొరు చూపినది. మలఁగి మలఁగి చూచినది. సుమాళేము నందుచు నావులించినది. ఇంక నెన్నియో విచిత్రవైఖరులనడయాడినది. అయినను రంభ పేరాస ఫలించలేదు. ఆమె లావణ్యవిలాసము విశ్వామిత్రు నీషణ్మాత్రమును కదలించలేదు. "ఒఱపులం బుక్కిలించు రంభ యొక్క పెన్‌పిఱుఁదు" కూడ జడధారిమదిని రాకింపలేకపోయినది.

"కనలక సంచలింపక వికాసముజూపక పక్ష్మలింపక" స్థాణువు వోలె నున్నమునిని డాసి యొయ్యారముతో నవ్వుచు పృథివీతల మానఁగ వంగి వినతి నొనర్చినది. ఆసమయమున నామె పైఁటతోఁ బాటు శ్రవణకలితసుందరకుందకుట్మలము జాఱి మౌనిపాదయుగళిపై బడినవి. అప్పు డయ్యమరకాంత యొకవింత జూపినదఁట. కామము

నెన్నడో జయించినవిశ్వామిత్రు నావింత సుంతైన నాకర్షింపలేదు. ఆగ్రహము రేకెత్తినది. "ఓసీ! రాకాసి! శైలివయి వసింపు మని శాపించినాఁడు.

రంభవిజృంభణము ముగిసినది. మదనుఁడు వసంతునితో చెప్ప కుండఁగనే వెడలినాఁడు. సఖీజనావళి పికాపికలై పఱచినది. 'ఇంత కో పించి కొల్లవోయితిఁ దపంబునెల్ల నీలీల నా తెల్వి తెల్లవాఱె' ననుచు కౌశికుఁ డలమటించినాఁడు.

శా. శైలాటంబున నన్ను లోఁగొనఁగ సంకల్పించినా వీవు శా
పాలాపంబుల పాలె యైతివి మదీయాపారకోపంబునం
దూలెన్ మత్సముపార్జితామితతపోఽస్తోకప్రభావంబు లో
బాలా! నీకును నాకు నాకవిభుఁడే పై చేయి యీచేఁతలోన్.

అని యప్పుడే మేల్కనినరంభతో వాచించినాఁడు. ఆ సుర రూపాజీవ యాందోళించుచు మోకరిల్లినది. అనుకంపామయుఁ డైన గాధేయుఁ డు"లే లెమ్ము రంభా! తపోధని భూదేవుఁ డఖండతేజుఁ డొకఁ డుత్పాటించు నీశాప" మని యాశ్వాసించినాడు. అలసగమన ముతో రంభ బయలుదేరినది. కౌశికునిశాపము విక్రమించినది—

లయగ్రాహి :

కాలఫణిరాజమున వాలుజడ, మేలిమగ
రాలఁ బలుచాలును, బ్రవాళమున మోవిన్
నాలినడలన్ మదమరాళముల, మంజులక
పోలముల నద్దముల; లోలనయనంబుల్
బాలహరిణంబుల, గయాళిచనుదోయిఁ గన
కాలుకలలోన, నలకాళి నళులందున్
గేలు బిసమందు, నుడుపాలకునియందు మొగ
మోలి నిడి రంభ వడి శైలిగ వెలింగెన్.

ఈ తీరున కృష్ణశాస్త్రిగారు కౌశికాభ్యుదయమున రంభ నొక ప్రత్యేకదృష్టితో మనస్తత్వశాస్త్రమున కనుగుణముగా మెఱపించి యంగీకారము కాకున్నను మూలాతిక్రమణదోషము సంధిల్లు నను భీతితో కాబోలు పాషాణమును జేసినారు. సాటిలేని యామెయందము నెల్లఁ బకృతికి, ధారవోసినారు.

"డిగ్రీలు లేనిపాండిత్యంబు వన్నెకు రాని పాడుకాలానఁ బుట్టి నశాస్త్రిగారిని వారిపాండితీశౌండీర్యమును గుర్తించుట కాయన రచించిన కబ్బములే యాధారములు. సహృదయ హృదయాహ్లాదకరముగ సభ్యతకులొంగిశృంగారరసపోషణము సలిపినకవివతంసులలో శ్రీనాథుఁ డగ్రతాంబూల మందుకొనుట కర్హుఁడు. ఆయనయడుగుజాడలలో పయనించి యంతరసవత్తరముగ ప్రౌఢముగ సత్కృతులు నిర్మించిన యధునాతనులలో కృష్ణశాస్త్రిగారిస్థానమసదృశము, చిరస్మరణీయము.

"అదోషమనోహరసారధోరణీ భాసురసత్కవిత్వ పరిపాక నిరంతర లాలసు" లై వీరురచించిన యీకౌశికాభ్యుదయ మహాప్రబంధము పఠించిన నేరికైనను సుకవితాయ ద్వస్తి రాజ్యేన కిమ్మని యనవలెనని యనిపించుట తథ్యము!!

ooooooooooo

## పదభావ విచారణ

శ్రీ పలగాని గోపాలరెడ్డి, M. Sc.

క. కురిసెం బువ్వులవానలు, పరిచిత తత్పరిమళానుపతదళికుల ఝుం
కరణములుసంగడింపగ, సురదుందుభిగణము మ్రోసెఁజోద్యముగాగన్

దోసూరి కోనేటినాథకవి విరచిత బాలభాగవత ప్రథమాశ్వాసము (62 వ పద్యమున భీష్ముఁడు విష్ణుసాయుజ్య మిచ్చుట వర్ణింపబడినది. శ్రీ వేంకటేశ్వరప్రాచ్యపరిశోధనసంస్థపక్షమున శ్రీ వంగనామల బాలకృష్ణమూర్తిగారిచే సవరణపూరణాదులు చేయబడి ప్రచురిత మైన పుస్తక మిది. అందులో వారు "సంగడింపగ" యనుభాగమును "సందడింపగ" యని మార్చినారు. కాని యిది యనవసర మైనమార్పు. అందుచే కలుగగలభావ మిది. "జాఱెడిపూవుల ననుసరించిన భ్రమర ఝుంకరణములు సందడిజేయుగ దేవదుందుభులు మ్రోగెను". ఇచ్చట శబ్దకల్పనపునరుక్తము. పూర్వపాఠ్యభాగ మున్న నింతకంటె రమ్యమగుభావము పొందనగును. సంగడి యనగా నిఘంటువులో జత యను నర్థము జూడనగును. "తుమ్మెదల ఝుంకరణములతో జతగూడి దేవ దుందుభులు మ్రోగె" ననుభావ మెంతేని సబబగును.

ఇట్టిక్రియాప్రయోగము పిడపర్తిసోమనాథునిచే చేయబడెను. (చూడుము :—32వ పద్యము పద్యబసవపురాణపీఠిక)

ఆ..............................
లింగముద్రయెడ్ల సంగడింబి
కూడగట్టినట్టిగూడారు బండిపై
కదలిపోయి రోరుగంటిపురికి.

పాల్కురికిసోమనాథుని యోరుగంటిప్రయాణసందర్భ మిది. ఇది "సంఘటించి" యని యుండవలె ననువారును లేకపోలేదు.

రెండు గుల్ల చేయబడినత్రాటిమానులను కలిపి కట్టిన విశేషమును సంగడియందురు. పశ్చిమగోదావరిజిల్లాలోని కొల్లేరుసరస్సునందు చేపలు పట్టుటకు, గుంటూరుజిల్లాలో బకింగుహాంకాలువనుదాటుటకు

వీనిని వాడుచుండుట యీనాటికిన్నీ కనగలము. వీనిని నడపెడి పల్లె కారులయింట్ల పేస్లుకూడా "సంగడిషా రని" కాలక్రమమున స్థిర పడినవి.

ద్విపదభల్లాణచరిత్రమున వర్ణిత మైనసంగడిభావులన ప్రక్కనే యున్నజంటజీవులు. "సంగడి" యనుపదము పలువిధములుగా ప్రయోగించుట యీక్రింద కాననగును.

(1) కూచిమంచి తిమ్మకవియొక్క రాజశేఖరవిలాసమున శివుని వర్ణించుచో

తే. సరవి జక్కులయెకిమీడు సంగడీడు

..............................

(2) దోనూరుకోనేటినాధకవి విరచిత బాలభాగవతమున కృష్ణా ర్భకుని వసుదేవుడు వ్రేపల్లెకు గొనిచనుచో వెంబడించినయాదిశేషుడు "సంగడిశేషుడు దోడయి జనుదేర యని వర్ణించబడెను.

(3) పిడమర్తిసోమనాధుని పద్య బసవపురాణము (4వ యాశ్వా సము) నమిరు మిండని కథలో విటుడగునంబి సంగడికాండ్రితో విలా సము గా నడచిన ట్లున్నది.

(4) సింహాసనద్వాత్రింశిక (7వయాశ్వాసము) కలహాకంటకుడను బంటువాడు కొందరుసంగడీలతో గూడి యుండె ననిగలదు.

(5) భారతము (ఆది-5 ఆశ్వా) నందున ద్రుపదుడు భీష్ముని సంగడికాడుగా గుర్తించక నిరాకరించుటగలదు.

యీ విచారణద్వారా "సంగడి" యనుపదము పెక్కుచోట్ల పెక్కురూపములలో ప్రయోగింపబడి యున్నది "సమానస్థాయిలో జత" యనుభావము గల యీపదమును తొలగించి బాలభాగవతమున మార్పుచేయవలసినయవసరము లే దని నామనవి.



# శృంగారనాయికలు

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

1. స్వాధీనపతిక :-

"ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా"

(ప్రతాపరుద్రీయే)

1. రాగము–కేదారగౌళ–తాళముజంపె

పల్లవి :– తొలిజన్మమందు నేఁదో పూజ సల్పితి నే॥ తొలి॥

అనుపల్లవి:– చెలియా! రసజ్ఞజన–శేఖరుఁడౌ నావిభుడు
కలనైన నను బాయ–గా నెంచబోఁడతఁడు ॥ తొలి॥

చరణము:– అల రంభయైన మన–సారగా గామించి
నిలుచున్న గట్టెదుట–దల వంచుకొను గాని
వలపూర గాంచడే–పలుకైన పలుకడే
పలుమాట లేల ? నా–భాగ్యమ్ము పండెనే ॥ తొలి॥

2. వాసకసజ్జిక :-

ప్రియాగమనవేళాయాం, మండయంతీముహుర్ముహుః
కేళీగృహం తథాత్మానం సాస్యా ద్వాసకసజ్జికా.

(ప్రతాపరుద్రీయే)

2. రాగము తాళము ఆది

పల్లవి :–జడను వేయవె చెలీ! వాల్ ॥జడను॥ క్రొ
మ్ముడి మనోహరుని–మదికి రుచింపదు ॥జడ॥

అనుపల్లవి:–తొడిమ లిట్లు దీయకుండ పాన్పున
గడు! నమర్పదగునె జాజిపూవుల
పడకలోన నాదునాథు మెత్తని
మొగ్గలు కందిపోదశే తొలుత వాల్ ॥ జడ॥

చరణము:—వీడె మహుడె సిద్ధపరుపబోకుము
వాడి వత్తు లానె యాకుమడపులు
తోడితేవె వీణె నిటకు శ్రుతులకు
దోష మున్న యెడల జక్కజేసెద
మూడు నెలలనుండి దూరదేశము
పోయి వచ్చుచున్నవాడు శ్రమపడి
నేడు మధురగతుల బాడి యలయిక
వీడజేసి యతనుసుఖము గూర్చెద ॥జమ॥

## వ్యాసరచనము

డా. (శ్రీ) బి. వి. కుటుంబరాయశర్మ.

వ్యాసము—దాని నిర్వచనోత్పత్తులు.

(౧) నైఘంటిక నిర్వచనాదికము :—

"ఎస్సై"[1] యనఁబడు ఫ్రెంచిభాషాపదమునుండి యాంగ్లభాషాపదము "ఎస్సే"[2] నిష్పన్న మైనది. "ప్రయత్నము" అని దీని కర్థము. శబ్దతః లభించు నర్థప్రకారము (అభిదార్థమున) నిజముగ నిది యొక ప్రయత్నమే కదా!

(1) "సర్వసాధారణముగ వచనములో నేవిషయమునుగూర్చి గాని సంగ్రహరూపమున కూర్పఁబడిన సారస్వతపర మగురచనము వ్యాసము" అని ఆక్స్ఫర్డ్ సంగ్రహనిఘంటువు[3] చెప్పుచున్నది.

(2) "వివరింపఁబడువస్తు వించుమించుగ పరిమితదృష్టిపథమునో, వైయక్తికదృష్టిపథమునో కలిగి శైలీవిధానములలో తగు స్వేచ్ఛ నొందిన విశ్లేషణాత్మకమైనట్టి గాని వ్యాఖ్యానాత్మక మైనట్టి గాని సారస్వతరచన మేదైనను వ్యాస మగును" అని వెబ్స్టర్[4] మహనీయుని నిర్వచనము.

---

1. Essay; 2. Essay; 3. Corciae oxford Dictionary; 4. Webster's New International Dictionary, Second Edition, unabridged.

క్రమపద్ధతియందును రూపరేఖలయందును గ్రంథముకంటెగాని ఉపన్యాసముకంటెగాని యూనమగుటచే సాధారణముగ వ్యాసముపై వానినుండి భిన్నమైనసారస్వతప్రక్రియగా భావింపఁబడుచున్నది; అట్లే ఒకపద్ధతిబద్ధమైన వాదప్రవారమునకు సాధారణముగ కట్టుపడనికారణముచే నిది (వ్యాసము) సిద్ధాంతగ్రంథముకంటెకూడ భిన్నమని భావింపనగును. సర్వతోముఖపరిశీలనశీలము లేనిదై యేకాంశవ్యగ్రమైనహేతువుచే నిది (వ్యాసము) యితిహాసమును జీవితచరిత్రమును వంటివానికంటె కూడ భిన్నము.

వ్యాసములు సర్వసామాన్యముగ నొక్కబిగువున కూర్చుండి చదువుటకు తగినంత సంక్షిప్తములై యున్నను "వ్యాస"మను పదము భిన్నభిన్నాంశములను శీర్షికాపరంపరలలో పరామర్శించుచు క్రమప్రకారము కూర్పఁబడిన పుస్తకములకును[1] చెల్లుచున్నది. ఎడనెడ కావ్యవిమర్శనాదిక సాహిత్యగ్రంథములకును[2] నీపేరు పెట్టఁబడును.

(3) ఒకవిధముగ నియమరహితమును వైయక్తికమును నగు విధానము ననుసరించుచు నేదేని యొక యంశమును గూర్చి కూర్పఁబడు సాహిత్యకరచనము వ్యాసమని "మెర్రియం" నైఘంటికుని యభిప్రాయము.[3]

(4) "చిన్నగ్రంథము" వ్యాసమని "వెస్ట్" నిఘంటుకర్త మతము.[4]

(5) "ప్రత్యేకాంశమునుగూర్చి వ్రాయఁబడు నొకానొక రచనము వ్యాసమని "ఇజబెల్ మేరీ మెక్లీన్"[5] చెప్పెను.

---

1. Lockes "Essay Concerning Human Understanding;" 2. Pope's "Essay on Man" (1733) and "Essay on Criticism" (1711); 3. The Merrium webster Pocket Dictionary; 4. vest pocket Webster Pocket Dictionary." 5. "A siceepal Dictionary for boys and girls" Complied by Isabal Marry MeLean, M. A.

(6) "ఒక ప్రత్యేకవిషయమునో యందలివిభాగమునో గూర్చి పరిమితపరిధిలో రచింపఁబడెడి రచనముపేరు వ్యాస" మని ముర్రే నిఘంటువు[6] నిర్వచించుచున్నది.

(7) "వ్యాస మనఁగా నానావిధమగు మానసికోద్గమము (మానసికోల్బణము); నియమబద్ధమును సంగ్రహమునుగాని రచనాలేశము. ఒక నియమమును క్రమమును లేనిది" అని డా॥ జాన్సన్ పండితుని మతము.[7]

కాని తదాధునికకాలములో పరిపూర్ణ వికాసము నొందిన ప్రక్రియ యగు వ్యాసము విషయములో డా॥ జాన్సన్ మహాశయుని నిర్వచన మంతగాపొంది పొసఁగి యుండఁజాలదు.

"లాకే" పండితుఁడు కేవలము నమ్రతను ప్రకటించుటకో అకే తన గ్రంథమును[8] "వ్యాస" మనివాఁడు. వ్యాసమని చెప్పఁదగినది దఱుచుగ సంగ్రహముగ నుండును. కొందఱు విమర్శకులు పదునైదు నుండి యిరువదినిమేషముల కాలములో నది పఠనయోగ్యమై యుండ వలెననికూడ నిర్ణయించిరి. వ్యాసములో నేవిషయమునుగూర్చియు సర్వతోముఖ పరిశీలనము నెవ్వరు నభిలషింపరు.

(8) "వ్యాసము జనాదర మధికముగఁగల రచనావిధాన" మనియు, "తాను పరిశీలించు నంశములలో సామగ్ర్యముగాని లోఁతుపాఁతులకుఁ జోవలెననెడి యభిలాషముగాని లేనట్టి రచయితలకు యుక్తమైన దని"యు క్రెఫే"[1] పండితుని యూహ. ఇది యౌదార్యములేని సంకుచితాభిప్రాయము.

(9) "బహుకష్టసాధ్యమైన సాహిత్యప్రక్రియలలోనది (వ్యాసము) యొకటి" యని "సెయింటుబెవ్"[2] మహాశయుఁడు చెప్పెను.

(10) "మిక్కిలి యాహ్లాదకరమును భావనాబలసంయుతమును నగు భావములుండెడి రచన" మనియు తన నియత సంకుచిత సీమకు పరిమితమగు సాహితీసారస్య సర్వస్వమును నుదాత్త బుద్ధివై శారద్య

6. Murray's Dictionary; 7. Dr. Johnson's "English Dictionary; 8. "Essay Concerning Human understanding".
1. Craffe ; 2. Sainte Beuve.

యావత్స్వమును వెల్లడింపఁగల రచనాప్రకార మ"నియు వ్యాసమును గూర్చి "ఆర్లో విలియమ్స్" మహోదయుఁడు తన గ్రంథములో[3] నగ్గించినాఁడు.

(11) ఏదేని ప్రాస్తావికవిషయమ్మును యుబుసుపోకకు రచింపఁబడు నొకలఘురచన మ" ని వ్యాసమును గూర్చి "ఒస్‌బరెన్"[4] మహాభాగుఁడు పలికెను.

(12) వ్యాసమనఁగా రచయితృమూలభూతమైన కర్తృహంకార మున కచ్ఛమైన యభివ్యక్తి చమత్కారపూర్వకమై చిరస్థాయియగు ప్రసంగ మని జె. బి. ప్రీస్ట్లీపండితుని పలుకు. ఈ నిర్వచము ప్రముఖ ముగ సర్వసాధారణమో వ్యక్తిపరమో యనఁబడు వ్యాసవిశేషము[6] న కన్వయింపఁగలదు.

(13) "ఏదేని సాహిత్యవిషయమును గూర్చిగాని, తాత్త్విక సాంఘికాది విషయములను గూర్చిగాని రుచయిత తన వైయక్తికదృ క్పథమునుండియో నైతిహాసిక దృక్పథమునుండియో చేయునట్టిప్రసంగ లేశమే వ్యాసరచన"మని "లోబ్బన్"[7] పండితుని యుద్దేశము. ఇదియు నొక నిర్దుష్టమైన నిర్వచన మనరాదు.

2. వ్యాసము—దానియుత్పత్తి.

ఫ్రెంచి దేశీయుఁడగు "మాంటేగ్" మహనీయుఁడు పదునాఱవ శతాబ్ద్యంతమున నీ వ్యాసమును సాహిత్యప్రక్రియను తొలుదొల్తగ నిర్మించిన పుణ్యమునఁబోయెను. అతఁడు తనరచనల సంపుటిని "ఎస్సే ఇస్"[2] అని వ్యవహరించినాఁడు ఆ సంపుటి విషయవైవిధ్యము కలది. అందలి వ్యాసములన్నియు కేవలము వైయుక్తిక దృక్కోణమ్ము నుండి పరిశీలింపఁబడి పరామర్శింపఁబడిన రచనలు యెన్నినిర్ణీతవిషయములు వ్యక్తిగతాభిప్రాయములను బట్టి యీసంపుటిలో ననుశీలింపఁబడుటకు ప్రయత్నముజరిగిన దన్నమాట. (సశేషము)

---

3. "The Essay" by Orlo williams4.Osbourne; 5. I. B. Priestley: 6. Fansiliare or peraonal essay; 7. "Essays" (a book) by & H. Lobban.

1. Monteigna; 2. Essais.

# ఆంధ్రీకరణ సమస్యాపూరణములు

1. శ్రీ కల్లూరి త్రిమూర్తికవి, తల్పకూరు (West Bengal)

తే. గీ. కొడుకు శక్తిగలాఁడు దక్షుండు తండ్రి;
మఱియు నీ వన్ననో సర్వమంగళవును
హైమవతివి నపర్ణవు నయ్యు నార్య!
మగని భిక్షరంపువృత్తిని మాన్ప వేల?

చ. ఖలకవినోక్తులన్ శ్రుతుల గాఱియ వెట్టుట గాదు; మేల్బళా
బళి!యని సద్ద్విజాళి వినఁబల్కుట లెన్నని మాధవప్రియం
బలవడఁ గావ్యగీతికలు,హాయిగఁ బాడి మహాకవీంద్రకో
కిలము సుధారసమ్ము నొలి, కించెను గాకవి కోపగింపఁగన్.

2. శ్రీ నేమాని కుటుంబశర్మ B. A, B. Ed, జట్ని (Post) ఒరిస్సా

తే. గీ. మాతరో! శక్తిధరుఁడు కుమారుఁ డరయ
నీకు; జనకుఁడు దక్షుఁడు నీవు చూడ
సర్వమంగళాపర్ణవై సాకునట్టి
హైమవతి వమ్మ; యార్య! యదేమొ కాని
భర్తృభైక్ష్యమ్ము వారింపఁబడ దదేమి?

చ. తెలియని వన్ని తప్పులని, తెల్పకుమంచును హెచ్చరించితాఁ
గిలకిలనవ్వుచున్ మఱియు, దేలిరొమ్ముర్చుచు రామలింగఁడా
పలికినవాని ప్రేమాల రస బంధురకైతల దివ్యభావపం
కిలముసుధారసంబు నొలి, కించెను కాకవి కోపగింపఁగన్.

3. సభ్యుఁడు–సాహితీసమితి–యలమంచిలి.

క. పిత కడు దక్షుఁడు దక్షుఁడు;
సతి శుభకరి సర్వదాంబ శాంకరి హేమా!
సుతుఁ డతిశక్తిసమన్వితుఁ
డతివా! పతిభైక్ష్యవృత్తి నణప వదేలా?

చ. ఇలను రసజ్ఞులెల్ల మది. నెంతయు మెచ్చ కుహూకలమ్ములన్
దెలుప శుభోదయమ్ము; కడు, డెంపరులై చల మూనుకాకపిం
డ్రిలను గణింపఁబోక శుభ, రోచితదృక్కులఁ జూడుఁ డంచు కో
కిలము సుధారసమ్ము నొలి, కించెను కాకవి కోపగింపఁగన్.

4. శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వరరావు, ఎలమంచిలి.

ఆ. వె. దక్షుఁడు పిత శక్తిధరుఁ డాత్మజుఁడు, నీవు
హైమవతి వపర్ణ వరయ సర్వ
మంగళవు గదమ్మ! మగని భిక్షాటనా
పూతవృత్తి మాన్పఁ బూన వార్య!

చ. తెలియక గ్రుడ్లఁ దాఁ బొదుగు, తీరును గోకిల కాకిగూటిలో
వల దిగనాడి గ్రుడ్డు చనె, భ్రాంతి స్వకీయ మటంచు గాకి దా
నలరుచుఁ బిల్లగా బొదిగి, యారుపు నేరుప కో యటంచుఁ గో
కిలము సుధారసమ్ము నొలి, కించెను గాకవి కోపగింపఁగన్.

5. శ్రీ కాకరపర్తి వెంకటరావు, ఇంజరం.

తే. గీ. నీదు జనకుండు దక్షుండు, నీసుతుండు
శక్తిధరుఁ డీ వపర్ణవు సర్వమంగ
ళవు తలఁప హైమవతి విదేలా త్వదీయ
ప్రియునిభిక్షాటనంబు మాన్పింప వార్య!?

చ. నిలయమునందు గ్రుడ్లిడక, నెమ్మదిగా జని కాకిగూటిలోఁ
పలఁ బ్రసవించి కోకిలము, పారె;నిజాండ మటంచుఁ గాకి చా
పలత రోహింపఁగాఁ బొదిగె, వర్ధిలి కో యని కూసి బాలకో
కిలము సుధారసమ్ము నొలి, కించెను కాకవి కోపగింపగన్.

6. శ్రీ భళ్లమూడి నరసింహమూర్తి (కవిసుధాకర) B. A; ఖురదారోడ్డు

క. భామా! జనకుఁడు దక్షుఁడు;
హైమవతీ! సర్వమంగళాపర్ణవు నీ
వేమొ, సుతుఁడు శక్తిధరుఁడు;
సామి తిరిపె మెత్త మాన్పఁజాల వదేలా?

చ. కలికలుషప్రభావమునఁ, గోకవి! భావకవిత్వతత్త్వమున్
గిలికిన క్రైత యాసె వరి, కింపుము తద్గతి నం చనంతవం
తులకవి నిగ్ఘరోత్పతన, తుల్యకవిత్వముఁ గమ్రిభావవం
కిలము సుధాగసమ్ము నొలి, కించెను కాకవి కోపగింపగన్.

7. అల్లంరాజు లక్ష్మీపతి (పెద్దాపురము)

ఆ. వె. శక్తిధరుడు సుతుడు; జనకుండు దక్షుడు;
హైమవతి వపర్ణ వరయ సర్వ
మంగళవుగదమ్మ మాన్పవేమిటి కార్య!
నేడు భర్త్రభైక్ష్యనీచవృత్తి.

చ. అలరుచు గాకిఘూట నొక, యుండము వెట్టి పరిక్రమించె గో
కిల మది నేర కల్లబొడి, గెన్ తన గ్రుడ్డని కాకి; యావు కే
ఖల దెలియంగలేక కల, కంఠముతో వడి గూసి చిన్నకో
కిలము సుధారసమ్ము నొలి, కించెను కాకవి కోపగింపగన్.

8. శ్రీ చక్రవర్తుల వేంకట శాస్త్రి : చింతలూరు.

చ. తలచి నిజాండ మంచు బిక, దత్తము బిల్ల నొనర్చి యాకృతిన్
దెలియుక లేక వృద్ధిగను, తీరు గనుంగొని కాకి "కావు"మన్
పలుకులు నేర్పబోవునెడ, వాకొని "కో"యని యుల్ల చిన్నకో
కిలము సుధారసమ్ము నొలి, కించెను కాకవి కోపగింపగన్.

ooooooooooooo

# ఆంధ్రప్రభుత్వాస్థాన కవి నిర్యాణము

## ఆంధ్రసాహిత్యపరిషత్సంతాపసభా తీర్మానము

ఆంధ్రప్రభుత్వాస్థానకవి, మహామహోపాధ్యాయ విద్యావారిధి కళాప్రపూర్ణావధాని శిరోమణీ త్యాదిబిరుద విరాజితులగు శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు ప్లవంగ సంll చైత్ర శుద్ధ నవమీ బుధవారము (19-4-1967) తేదీని తమ తొంబది యారవయేట పరమపదించి నందున మా యాంధ్రసాహిత్య పరిషత్పక్షమున తత్సభ్యవర్గ మెల్ల దమ విషాదమును బ్రకటించుచు వారికుటుంబమునకు సానుభూతి నివేదించుచు శ్రీవారి పవిత్రాత్మకు సాలోక్యసామీప్య ముక్తుల బ్రసాదింప శ్రీకృష్ణపరమాత్మని. బ్రార్థించుచు తీర్మానించడమైనది.

కాకినాడ
22-5-1967

ఇట్లు
ఆంధ్రసాహిత్య పరిషత్సభ్యులు.



## గ్రంథసమీక్షలు

శ్రీ శిష్ట్లా బాలకోటీశ్వరరావు.

### ౧. పద్యలక్ష్మీనృసింహస్తోత్రము

దీనిని శ్రీ కట్టా త్రిమూర్తికవి గారు జగద్గురు శ్రీ మహాది శంకరభగవత్పాదుల సంస్కృత లక్ష్మీనృసింహకరావలంబ స్తోత్రము ననుసరించి తెనుఁగున రచించినారు. వీరు పశ్చిమవంగరాష్ట్రమున నివసించుచున్న ఆంధ్రులలో నొకరు. అచట నాంధ్రసాహితీప్రచారసభో పాధ్యక్షులలో నొకరై సరస్వత్యారాధన మాచరించుచున్న సుకవులు.

వీరి స్వేచ్ఛానువాద మొడిదుడుకుల నెఱుఁగని గోదావరీ స్రవంతి. ఉత్పలమైనను సీసమైనను శార్దూల మత్తేభములైనను మొదటినుండిచివరివఱకు నొక్కశైలిలో బింకముగ సాగించుటలో వీరి నేర్పురుచిరము. అనువదించుటలో ననేక నిష్ఠుర కష్టములున్నవి. మూలములోనిసొగసు బిగువు ననువాదమునందు గూడ గోచరింపవలెను. ఈ విషయము గుర్తించుటచే త్రిమూర్తికవిగారు స్వేచ్ఛానువక్తలయిరి. అనగా మాతృకలోనున్నదానిలో తమకు గావలసినది పరిగ్రహించి మిగిలినది పర్యుదాసించుట—ఈనియమము వీరీ లఘుకృతియం దెల్లెడల పాటించిరి.

శ్లో. ప్రహ్లాద నారద పరాశర పుణ్డరీక
వ్యాసామ్బరీషశుక శౌనక హృన్నివాస
భక్తానురక్త పరిపాలన పారిజాత
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్.

మ. ప్రకటార్థాశయ! నారదా త్రిపురహా ప్రహ్లాద ధౌమ్యాంజనే
యకవి జ్యేష్ఠమతంగ సాత్యవత భీష్మాక్రూరముఖ్యాంతరం
గిక సద్భక్త జనావళీ హృదయపంకే జాసనాసీన దే
శిక! లక్ష్మీనరసింహ! నాకొసంగుమీ చేయూఁత నెప్పట్టునన్.

'భక్తానురక్త పరిపాలన పారిజాత' మనువాదమున నేడను లేదు.

శ్లో. బ్రహ్మేంద్రరుద్ర మరుదర్క కిరీటకోటి
సంఘట్టి తాంఘ్రి కమలామల కాన్తికాన్త
లక్ష్మీ లసత్కుచ సరోరుహ రాజహంస
లక్ష్మీ నృసింహ! మమ దేహి కరావలమ్బమ్

మ. వరలక్ష్మీ లతికాతనూ మృదుల సద్వక్షోజ నీరేజల
పరజో రంజిత రాజహంస! వినమద్బ్రహ్మేంద్ర చంద్రాది ని
ర్జర శీర్షస్థ కిరీటకోటి ఘృణిరాజ త్పాదపద్మా! గిరి
స్థిర! లక్ష్మీ నరసింహ! నాకొసఁగుమీ చేయూఁత నెప్పట్టునన్.

బ్రహ్మేన్ద్రరుద్ర..."అని శంకరులనఁగా "బ్రహ్మేంద్రచంద్ర" అని వీరనుటలో సౌందర్య మేమున్నదో పఠిత లరయుదురుగాక! 'ఏకాకినం పరవశంచకితం...' అన్న జగద్గురుని గీర్వాణవాణిలోని స్ఫూర్తి శ్రీమూర్తికవిగారి 'ఊనిన భీతితో నొడలి నోమక యొంటిగ నున్ననన్' లో సాక్షాత్కరించుటలేదు.

శ్లో. శ్రీమన్నృసింహ విభవే గరుడ ధ్వజాయ
తాపత్రయోపశమ నాయ భవౌషధాయ
తృష్ణాది వృశ్చిక జలాగ్ని భుజఙ్గరోగ
క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే.

ఈశ్లోకము నీయన కఠినాతికఠినముగ సంస్కృతమునందే సీసపద్యములో చెప్పినారు. ఔచిత్య మేమియునులేదు.

ఇదంతయు వీరెన్నుకొనిన యాంధ్రీకరణ పద్ధతినిగూర్చి చర్చ. ఎవరెఱిఁగిన మార్గమునవారు పయనింతురు. లోకోభిన్నరుచిః! శక్తిమంతముగ శబ్దప్రపంచము నీయువకవి గమనింపఁగలైను. సమాసకల్పనమున సిద్ధహస్తుఁడు. ప్రతిభకు వ్యుత్పత్తికి తావలమగు నీయన లేఖిని స్వతంత్రమై మనోహర నవ్యకావ్య పాయసము నాంధ్రవిద్వజ్జన లోకమున కర్పించునని విశ్వసింపవచ్చును.

ముప్పదియాఱు పుటలు కలిగిన దీని మూల్య మరువదియైదు పైసలు. "కార్యదర్శి, ఆంధ్రసాహితీ ప్రచారసభ, కెల్విన్‌లైన్ 1/4 తాల్పుకూర్ పోస్టు 24 పరగణాలు, పశ్చిమబెంగాల్"—అని వ్రాసిన లభించును.

# ౨ శ్రీ సత్యసాయీశ్వర స్తుతి తరంగిణి

## (స్తోత్రార్చా తరంగములు)

'అపారభక్త్యావేశము, సమధికోత్సాహము' పుష్కలముగ గలిగిన కవులనఁబడెడు పద్యరచయిత లీకాలమున నెందఱోయున్నారు. నమ్మిన వేల్పులనుగూర్చి యోగులనుగూర్చి సంస్థలనుబోలు వ్యక్తులను గుఱించి మహామహిమాన్వితులనుచు ననన్యసామాన్యులనుచు ననుభవించినది యూహించినది కలిపి పద్యములలో గేయములలో నిమిడ్చి యసంఖ్యాకములుగా ముద్రింపించి యవలీలగ విరజిమ్ముచున్నారు. హృదయము నాఁచికొనఁగల భావము దానిని సుస్పష్టముగ విశదీకరింపఁగల శబ్దసముదాయ మీారకపు రచనలలో మృగ్యములు! ఈస్తుతి తరంగిణికూడ నీతెగకు చెందినదని చెప్పవచ్చును. దీని ప్రణేత ఉప్పాడ రాజారావుగారు. ప్రణేత భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా

అంతర్దర్శనము, మధూదయము మున్నగు నుద్గ్రంథములను వ్రాసిన రాజారావుగారు తమ నలువదిరెండేండ్ల కవిజీవితమునందు వెలువడిన ప్రథమ వీచికగా దీనిని వాకొనుచున్నారు. పోతనామాత్యుని పగిది వీరును పలికించెడివాఁడు సత్యసాయీశ్వరుఁడని నమ్మిరి, వీరి విశ్వాసము ప్రశంసనీయము! ఇందు సంస్కృతమునకొంత తెలుగున మఱికొంత వ్రాయఁబడినది.

(శ్రీ)యీశ్వరాంబా సంభూత! ప్రాతస్సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ వరసత్యేశ! కర్తవ్యం దివ్యమాహ్నికమ్.

సుప్రభాతస్తోత్రమున మొదటిదీ శ్లోకము. నవవ్యాకరణములలో దేనినాధారము చేసికొని యీాయన (శ్రీ)యీశ్వరాం బాసంభూత' అనిరో తెలియదు. కరావలంబ స్తోత్రము వజ్రకవచము, క్షమాంజలి మొదలగున వనేకములున్నవి.

"సర్వేశ! సర్వవిద శాశ్వత..." "నిత్యానపాయి జగదేక శరణ్యా హరే..." "భక్త్యా పఠంతి మనుజాః లభతే..."

అనునవి విచార్యములు, మణిదీపికలు, సుగంధులు, పంచచామరములు, మానినులు, మత్తకోకిలములు, కరిబృంహితలు సాయిబాబా లోకోత్తర ప్రాభవవైభవములు చాటుచున్నవి.

"కూడి మెలఁగుచు భక్తజనులకు కొంగునిడియెడి బంగరై" "నామకీర్తన తత్పరా" "జగత్ప్రణమ్య మహామతీ" "విపత్పరంపర సంహారా" – ఇట్టి వైచిత్రి యీ పొత్తమున నెల్లెడలగలదు.

ఏదో రచింపవలెనను కాంక్ష యొక్కటియే చాలదు. తాను వ్రాసినది తరులవగాహించుకొనవలెనను కోరికకూడ యుండవలెను. అది యీ కావ్యమున లేదు. ముద్రారాక్షసములు మాత్రము కోకొల్లలు. ఢిల్లీనగరములోని ముద్రణాలయముల ప్రత్యేకత నీపుస్తకము జగద్విదితము గావించును! "భక్తవర్యులన్వహము స్తోత్రార్చా తరంగములందు శ్రీ సత్యసాయి భగవాను నోలలాడించి ధన్యజీవనులై తరింప ప్రార్థించుచున్నా'నని శ్రీ రాజారావుగారు మున్నుడిలో తెలిపిరి. మేమును వారి యభ్యర్థనముతో నేకీభవించుచున్నాము.

దీని వెల నూఱుపైసలు. నలుబది పుటలిందున్నవి. ప్రాప్తిస్థానము: మేనేజరు: 'సనాతనసారథి' ప్రశాంతి నిలయము పోస్టు అనంతపూర్ జిల్లా ఆంధ్రప్రదేశ్.

oooooooooooo

# నా శం క లు

(శ్రీ) "సుధీః"

ఉదారమానసులారా!

నేను కేవల గ్రాంథికవాదిని పూర్వకవీంద్రుల కావ్యముల పఠించి కొంతసాహితి సంపాదించినవాఁడను. నేఁజదువుకొనిన కొన్ని పూర్వప్రబంధములలో నా స్వల్పబుద్ధికిఁదోఁచిన సందేహములు విన్నవింతును. ఇటు నేనొనరించుట నాశంకలు బాపుకొని సాహితి సభివృద్ధి పఱచుకొనుటకే కాని మాపండితకవిశేఖరులయెడ నాకానంతయు విశ్వాసవిధేయతలలో లోపములేదని మనవి.

నేనాదియందు చదువుకొనిన "స్వారోచిషమనుచరిత్ర" మహాకావ్యము గైకొందును. ఏకార్యమునకైనను తొలుత "విఘ్నేశ్వరు" స్వీకరించుట మన భారతీయాచారమైయున్నది. నా సంశయములఁ బొ హరించినందుల కన్యథా భావింపవలదని నా సంప్రార్థనము.

## వి నా య క స్తు తి

ఉ. అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్ట తొండమున నవ్వలిచన్గబళింపఁ బోయి యా
వంక గుచంబు గానకహి వల్లభహారము గాంచివే న్మృణా
ళాంకుర శంకనంటెడు గజాస్యునిగొల్తు నభీష్టసిద్ధికిన్.

ఆంధ్రకవితా పితామహామహా బిరుదాంకితుఁడగు నల్లసాని పెద్దన కవీంద్రుని యీపద్యభావ మీక్రింది విధమని నా భావము.

"అర్ధనారీశ్వరుని యంకతలమును జేరి యుండుపవిష్టుఁడై కుమారుఁడగు గజాననుఁడు పార్వతీ స్తన్యము గ్రోలును. బాల్యస్వభావముచేఁ దనకరమునఁ దానుపానముసేయు స్తనమునకావలివక్క-నున్న కుచమును కూడబట్టి త్రావబోయి యాదెస కుచంబు లేమిచే సర్పహారము గనుంగొని వడిగ దానికి గజాహారమగు తామరతూఁడుగ భ్రాంతినంది దానిని స్పృశించు గజముఖుని (బాలగణపతిని) నామనమందలి కోరికలు సిద్ధించుటకై యారాధింతును"

అని పెద్దనార్యుఁడు వినాయక ప్రార్థనము గావించియున్నాఁడు. ఏతత్కవివరుని యీయుత్పల మాలికావృత్తములో 'అంకము, చేరి, శైలతనయా స్తనదుగ్ధము, కబళింపబోయి, అహివల్లభహారము, మృణాళాంకురము, శంక; అభీష్టసిద్ధి,' అను పదములు విచారించుదము.

"అంకము జేరి"— ఎవరి యంకమునను ప్రశ్నయుదయించును. తరువాత 'శైలతనయా స్తనదుగ్ధము లాను వేళ" యని యుంటచే పార్వతీదేవి తొడపై నెక్కెనని యూహింపవచ్చును. కాని 'అవ్వలి చన్గబళింపఁ బోయి యావంకకుచంబు గానక' యని లిఖించుటచే నర్ధనారీశ్వరుని తొడనధిరోహించెనని నిర్ధరింపవచ్చును. గజాస్యుఁడంకము జేరినాఁడు. మృణాళాంకుర శంకతో ఫణిహారమును దాకినాఁడు. స్తనదుగ్ధము లానినాఁడు. అను వాక్యములు బాలగణపతి వయసును సూచించుచున్నవి. బాలవిఘ్నేశ్వరుఁడింకను తల్లిపాలు త్రావుటమానలేదు. మృణాళ చర్వణముగూడ నారంభించినాడని యూహించి యాతని వయస్సు నిర్ణయింపవచ్చును.

కవితాపితామహులు ప్రయోగించిన శైలతనయా స్తనదుగ్ధములను సమాసముచే క్షీరశూన్యత స్ఫురించును. అందుచే శైలతనయా స్తనదుగ్ధము లనుటకు మాఱుగ దక్షతనయా స్తనదుగ్ధములని లిఖించిన సమంజసముగ నుండునేమో! శైలతనయాశబ్దమునకు బదులుగ దక్షతనయాపదమే కథానకము ననుసరించి లిఖింపవలయునని తోచుచున్నది. కారణమేమన—ఈశ్వరి తొలుత దాక్షాయణి పిమ్మట శైలతనయగదా దక్షాధ్వరధ్వంస సమయముననే గణపతి దేవుడు జనించియున్నాడు. తల్లితో వచ్చి దక్షగేహమున మధురోపాహారముల భుజించుచున్నట్లు పూర్వరచనలలోనున్నది. అప్పటికే నాతఁడు పాలుద్రావుట వీడి మంచి భోక్తయైనాడు! అపుడేకదా దాక్షాయణి మరణించి పిమ్మట శైలతనయగ జనించినది? దుగ్ధపానమువీడి మంచి భోక్తయైన వయోధికుడైన గజాస్యుడు పార్వతీ స్తనదుగ్ధము లానెననుట యంత

సమంజసముగాఁదోపదు. అంకము జేరియని కవివర్యుఁడు లిఖించుటచే తల్లిచే నధిరోహింపబడక గణపతి తానే ప్రాకుచువచ్చి తల్లితొడనెక్కి కూర్చుండెనని చెప్పనగును. పాలుగుడువబెట్టు తరిబిడ్డనడ్డాలలో వైచుకొనుట లోకసహజము. గజాస్యుఁడర్ధనారీశ్వరుని కుడితొడపై గూరుచుండెనో వామాంకమధిరోహించెనో తెలియవలసియున్నది తల్లికుడి తొడపై గూర్చుండి యెడమవైపును – వామస్థితుడై దక్షిణ స్తన్యపానమాచరించుటయు లోకసహజస్థితి. బాలురు తల్లితొడపై నెక్కెదరుగాని పాల్ద్రావ తండ్రి యంకమధిరోహింపరు. అర్ధనారీశ్వరుని వామభాగస్థయగు పార్వతి స్తన్యముగ్రోల గణేశుడు జననియంక మధిష్ఠించిన నడ్డాలలో బిడ్డడుకాక ప్రకృతి విరుద్ధగతి – వామభాగస్థయగు పార్వతి తొడనెక్కి యెడమచనుబాలే త్రావెననుట యస్వభావోక్తి పోనిండు అట్లాచరించు కొందఱు తల్లులు నేడులేకపోలేదు.

గజాస్యుడు జనని పాల్ద్రావుచు సర్వశిశు ప్రకృతిసిద్ధముగ నావలివైపునున్న ద్వితీయ కుచమును కరమున గ్రహించెనని లిఖించుట పరమస్వభావోక్తిగ నెఱింగిన పెద్దనకవీంద్రుడు తొండమున గణపతి యవ్వలి చన్గబళింప యత్నించి యనిలిఖించెను. చన్గబళింపబోయియను ప్రయోగమంత చక్కగనున్నటులు దోపదు. కబళించుపదము గ్రోలబోయియను విమలార్థ మొసగుచున్నదా? ఆవంక కుచంబు గానకయను కవిరచన విచారణీయము.

పెద్దనకవీంద్రుని గజాస్యుడు పాల్గుడుపునింకను విడువక మృణాళభక్షణముగూడ జేయుచున్న వయసువాడు, పుట్టిననాటినుండియు నేటిదనుక తన జనయిత్రికి ద్వితీయకుచము లేదని తెలియకున్నదా? అతడవ్వలి చన్నేల కబళింప నుద్యోగించినాడు? ఒక్కనిముసమైజన్మించిన గోశాబకము ప్రపంచమున నపుడే యవతరించినదయ్యును వెనుకటి కాళ్లకడకు పయఃపానమునకై చనునుగాని గంగడోలుపట్టి నమలుచున్నదా! పశువునకున్న జ్ఞానము భగవానుఁడగు పార్వతీ తనయు

నకు లేకపోయెనా? పుట్టి పాలుగ్రోలుచు పదార్థభక్షణము నెఱుఁగనెది గిన గజాస్యుఁ డవ్వాలి స్తనము లేదని యెఱుంగఁడా! ఆవంక కుచంబుగా నక యనుటచే నంతదనుక నర్ధనారీశ్వరరూపమున కుచద్వయముండి దాని ననుభవించెనా? స్తనమునకై యన్వేషించు గణనాథుని కరమున కహివల్లభహారసంస్పర్శము కల్గినది. తన కన్నుల కత్యంత సమీపస్థితమగు నాసగ్ర్పహారమునుగూడ నిదమిత్థమని తెలియనేరక దానిని మృణాళాంకురశంక నంటినాడు. ఇచట శంకాశబ్దముకంటె భ్రాంతి శబ్దార్థద్యోతకమగు పదము ప్రయోగించుట యుక్తమేమో! ఇట్టి బాలవిఘ్నేశ్వరుని పెద్దనామాత్యుఁడు నైజాభీష్టసిద్ధికై కొల్చెదనని వ్రాసినాడు.

తల్లిదండ్రుల యేయంక భాగమున గూర్చుండి పాలుగ్రోలదగునో తెలియని బాలమూర్తి, యంతవయసువచ్చినను అర్థనారీశ్వరునకేక స్తనము మాత్రమే కలదని యెఱుగని మందబుద్ధిశాలి యగువాఁడు, కనులయెదుటనున్న సర్పహారమును గుర్తింపనేరక దానిని తామరతూడుగ భ్రమించిన దృష్టిబుద్ధిమాంద్యుఁడు - మహాధీశాలియు గంభీరహృదయుఁడు ప్రౌఢతముఁడునగు పెద్దనకవిమణియొక్క యభీష్టముల నిగూఢములై హృదయనిలీనములగు కోరికల దెలిసికొని వానిని సిద్ధింపజేయగలఁడా? గజాననునకు కుడివైపున నహివల్లభహారము కన్పట్టినది. దానిని మృణాళాంకురశంక నంటినాడు. అహివల్లభ శబ్దములో వయోరూపప్రౌఢతగలదు, కాని మృణాళాంకురములోనా గంభీరత యేది ?!!

ఈ విధముగ నెంతయైన వ్రాయుటకీ పద్యమనేకావకాశము లిచ్చుచున్నది. వ్యాసవిస్తరభీతిచే నింతతో ముగించుచున్నాను.



సీ. చిత్తగింపుము రాజు శృంగారశేఖర
క్షితివర్యు డొకపని మతిదలంచె
ననఘుపాఠీన విద్యాధర ప్రభుతనూ
జాతుడై తగు పుష్పకేతునకును
దనముద్దుపట్టి నిత్తరుణిఁ బెండ్లియొనర్తు
నిక్కమెల్లియటంచు నిశ్చయించె
నేనుగార్యాలోచనా మానమతి గాన
నెఱిగివచ్చితి మీకు నెఱుక పరుప
ననినవిని రాజు భీత భీతాత్మునట్లు
దరుణిరో యోగ్యకార్య చింతనమొనర్చి
వార్తలన్నియు నెఱుగగా వలయు ననుచు
సఖుని బురినుండ నియమించి సరభసమున 18

సీ. సతత మానసగతి స్ఫుత్వైభవము గాంచెఁ
బ్రకటింప రాజ మరాళ మేమొ
దేవమణి ప్రభాదీపితం బై యొప్పె
దర్కింప నభ్రమాతంగ మేమొ
జవసమాహృత తీవ్రపవనమై యలరారె
దర్వీకర కులావతంస మేమొ
తేజోవిధిత్వ సంస్థితి బ్రకాశముగాంచె
ఢంబైన తీవ్రాంశు బింబ మేమొ
యనగ దనరు మనోజవం బనుతురంగ
మంబుపై నెక్కి మగువతో మనుజవిభుడు
తత్పురంబున నుండుట తగదటంచు
విక్రమ క్రమశక్తిని వెడలె నపుడు. 19

శా. ఆరీతిం బురి నిర్గమించి వసుధాధీశుండు గాంచెన్ ఘనో
దారక్ష్మారుహజాలమూలలతికాంతర్గేహ సంచారవ
న్నీరే జాతముఖీవిభూత మధుపోన్మీలత్ప్రసూనావళీ
సౌరభ్యస్ఫుట మందమారుత మనోజ్ఞంబైన వింధ్యాటవిన్. 20

క. ఘనమై తరుశాఖావృత
ఘనమై వరఫలనికాయకల్పిత మునిజీ
వనమై పుణ్యనదీ పా
వనమై నుతిగాంచు వింధ్యమయ్యెడలన్. 21

సీ. చండప్రతాప వేదండ శుండాదండ
ఖండిత శ్రీఖండ మండలంబు
వల్లీగృహాంత రోద్యల్లతాంగీ సహో
ల్లాసన్నవ భిల్లపల్లవంబు
రేవాతరంగిణీ సేవాగతానేక
దేవాంగనానీక దీపితంబు
చంచద్గజగ్రహా కుంచితగ్రీవాగ్ర
పంచాననప్రభో దంచితంబు
చటులబలపటుతర సముద్భట కిటీంద్ర
కుటిల దంష్ట్రా విదారితక్షోణితలము
శిశిరు రుగ్గాన లోహితసిక్తఘన వృ
కాననంబైన నవ్వింధ్య కాననంబు. 22

వ. మఱియును సురవరాస్థానంబునుంబోలె గౌశికానంద కరంబై సత్పురుష సేవయుంబోలె నగణ్య శ్రీఫలంబై భారతసమరంబునుంబోలె విజృంభితార్జునంబై సంవర్త సమయంబునుంబోలె ననేకార్క ప్రకాశదీపితంబై సత్సంపదయుంబోలె వికసితాశోక పున్నాగంబై శిశువిలాసంబు నుంబోలె బ్రకటితధాత్రీకృత విభవంబై లంకా

నగరంబు నుంబోలె బహుపలాశాలంకృతంబై సుగ్రీవసేనా నివేశం
బునుంబోలె బనసనల భాసురంబై సువాసినియుం బోలె సిందూర
తిలకాలంకృతంబై కురుసేనయుంబోలె నులూకద్రోణ శకుని సనాథ
ధార్తరాష్ట్రానీకంబై యనింద్యజాతి కలితంబయ్యు విరుద్ధవంశంబై ఘన
పథ్యాభినుతంబయ్యు బ్రభూత గుల్మంబై షట్పదాకులంబయ్యు ద్విపదా
వృతంబై ద్విజకులవిరాజితంబయ్యు నకులీన సమాకులంబై యొప్పునవ్వి
పినంబుజొచ్చి యప్పుడ మిఱేడనేకదూరంబఱిగి కుసుమకిసలయవి సర
సు మనోహరంబగు నొక్కతరువుక్రింద హయావతరణం బొనరించి
తరుణియుం దాను లతానికుంజంబున కిసలయశయ్య మేనుజేర్చి యధ్వ
జాయాస భరభరితుండై నిద్రింపుచునుండ నప్పటి రేయిగడచు సమ
యంబున. 23

గీ. కాలకైవర్తకుండంత గగనసరసి
జెలగి చీకటి వలవేయ జిక్కినట్టి
శఫర జాలములన దెల్పి సన్నగించి
ఋక్షముల జాడగనుపట్టె నాక్షణంబ. 24

గీ. కలికి రేచాశప్రత్యూష కాలమనెడు
ముసలము వహించి నివరాంక బిసరుహారి
మండలోలూఖలమున నామని గదంచ
నొలుకు తండులముల బోలెనుండె నడులు. 25

క. కమలిని పూజ యొనర్పగ
సమకట్టి దివాకరునకు సద్భక్తిని
ధూపము లొసగెననగ దనరెం
గమలములను దిరుగు తేటిగము లయ్యెడలన్. 26

ఉ. వాసరవానరుండు సురవర్త్మము పేరిటి భూరుహంబుపై
డాసిన పువ్వులో యనగ.....................
.........................................
....................గుంతితలీలఁ దనర్చె దారకల్ 27

గీ. భవ్యశతపత్రి పుస్తకపాణు లగుచు
సరసులోఁగి మాధుకరవృత్తి సంఘటింప
గాల యోగీంద్రుఁడరుణాంశు కమునుఁబూని
నచ్చెననఁదూరు పెద్దన వన్నెనలరె. 28

సీ. ఉదయభూధర తటాభ్యుదయ విభ్రాజిత
పద్మరాగ ప్రభాపటలి యనఁగ
ప్రాఙ్మహీధర నితంబ ప్రస్రవద్ధాతు
ధారాంకుర ద్యుతి స్తబక మనఁగ
ప్రాచీన పర్వతారణ్య కుంజాంతర
వికసజ్జపావిభా విసర మనఁగ
పూర్వక్ష్మాభృత్ప్రభూత సింహకిశోర
దళితేభగళదసృగ్ధామ మనఁగ

నైంద్రదిక్కుంభి కుంభ జృంభాతిరేక
లలితసిందూర రేఖావిలాస మనఁగ
వరుణతరుణాంశు కందళ స్ఫురణఁదనరి
తూర్పుదిక్కున గెంజాయ దోఁచెనంత. 29

సీ. ప్రాఙ్నగధాతు ధారాయుతాఖండలు
దంతినిష్ఠుర పాదతల మనంగ
పౌరుహూతీన వాంభోరుహాక్షీ ఫాల
లలితకుంకుమ బిందు తిలకమనఁగ
గగననామక పురాగ్రద్వార సంస్థిత
పటురత్న పూర్ణకుంభంబనంగ
ప్రాగ్దిశా సుందరీ ప్రకట కాంచీలతా
సంగతదీనార చక్రమనఁగ

గమలములునిక్క జక్రివాకములు చొక్క
దొరకలు జార భృంగ సంతతులు గేరఁ
బూర్వగిరి బాలసుందార పుష్పవిభ్రి
మంబు తోఁదరుణారుణ బింబమలరె. 30

సీ. పద్మినీ వ్రతపరిపాకలబ్ధ ఫలంబు
లోకత్రయీ దివ్యలోచనంబు
పద్మజాండ కటాహ భవన ప్రదీపంబు
కుముదినీ భోగసంకోచ కరుఁడు
కాంతి విభ్రాజితాకాశ మాణిక్యంబు
చక్రిద్వయీ మనస్తాప హరుఁడు
ధ్వాంతసంతతి పర్వతచ్ఛిదా వజ్రంబు
భవభయాపహలోక బాంధవుండు
వేదమయుఁడు రణాహత వీరలోక
దివిజ మార్గంబు గ్రహకులాధీశ్వరుండు
కర్మసాక్షి త్రిమూర్తి బుగన్మయుండు
భానుమంతుండు తూర్పున గానవచ్చె. 31

గీ. గోపతిత్వముగాంచె శక్రుండొ తార
కాకృతి యడంచిమించె షడాననుండొ
యనుగతచ్ఛాయుడయ్యె నిత్యాధ్వగుండొ
యనగ నొప్పారె బంకేరుహాప్తుడపుడు. 32

సీ. పౌరుహూతీ కుచాభ్యంతరాంతరలిప్త
కుంకుమద్యుతుల నలంకరించి
దండధరాంగనాధమ్మిల్ల ఘటితచాం
పేయ ధామప్రభల్ ప్రేమనొలసి

కంఘివల్లభ బాలికా కరస్థలలోల
లీలాబ్జ రోచుల గేలిచేసి
ధనద కాంతాకటీ తటనట న్మాంజిష్ఠ
వసన కాంతులకు మేల్వన్నె యొసగి
త ప్తహాటక ధగధగద్ధగిత రుచుల
జలధరచ్ఛేదముల నింద్రచాపశకల
విభ్రమంబు ఘటింపుచు నిన్నుబ్రాకి
యలరెనవ్వేళ బాలారుణా తపములు. 33

శా. భూవిఖ్యాత ఘనాతపావృతి సముత్ఫుల్లా కృతిం బర్వగా
నావేళన్ ధరణీ తలేశ్వరుడు మార్గాయాస ఖిన్నాత్ముడై
తావుల్ గ్రమ్ము లతాంతశయ్యపయి నిద్రాముద్ర జాలించియొం
తే వేగంబున లేచియందు నృపపుత్రీ రత్నముంగానకన్. 34

క. కాంతామణి గానక కుం
జాంతరమున వెదకి దిక్కులరయుచు ధరణీ
కాంతుడు తోచక నచ్చటి
కాంతారంబెల్ల నరసి కడు వివశుండై. 35

వ. ఇట్లు చింతింపం దొడంగె, 36

ఉ. ఎందు వసించితే శశిముఖీ నమవంచనజేయ జెల్లునా
మందగతిం జెలంగి కుసుమంబులు గోయగడాయ నేగితో
కెందలిరాకు బొంపములక్రిందునడాగితొ వేగరాగదే
మందమరాళయానయని మాటికిమాటికి బిల్చునచ్చటన్. 37

క. నీకైరాజ్యము వదలియ
నే కాయాసములు వడితి నీవెఱుగవనే
డే కరణి నన్ను విడుచుట
యోకలికీ నీకు జూడనుచితమె చెప్పుమా. 38

ఉ. హా సఖి నిన్ను బాసి క్షణమైన భరింపగ నోపనక్కటా
దోసపుదైవ మీగతిని దూరము చేసె నికేమిసేతు పే
రాసల జెందిచెంది ఫలమందె దనంచు దలంచితిన్ మదా
వాసము సేరకున్కి తగవా మగువా నగువారికై నకిన్ 39

మ. మునుదా జేసిన దుష్కృతంబు ఫలమో ముందేను రారాగ గ్రో
వను గన్పించిన దుర్నిమిత్రముల కే వంకన్ ఫలంబయ్యెనో
వనితా నిన్నెడబాసి యుండుమని దైవంబిట్లు గావించె హా
యనుచున్ రాజకుమార శేఖరుడు చింతాక్రాంతుడయ్యెన్మదిన్.

క. గురు శుశ్రూష యొనర్చిన
శరణాగత వితతి బ్రోవజాలిన విద్వ
త్పరి చర్యలు చేసిన దు
ష్కరమగు విధివ్రాత గడువగా వశమగునే. 41

సీ. మునిపత్ని గామించి మోసపోయెను వజ్రి
గురు దారకై కందె సరసి జారి
మహిపురూరవుడు బ్రాహ్మణ ధనాశ నశించె
నూసరవిల్లియైనుండె నృగుడు
దశరథుండణిగెను దరుణి మాటవిని
నలరాజు గలిచేత జలకనయ్యె
ఘనపురోహిత కన్యగని చలించెయయాతి
శంతనుండధిక వ్యసనతం గుందె
గానగణుతింప మూడులోకముల యందు
నిష్కళంకుండు లేడని నిశ్చయించి
తనుపరిత్యాగ మొనరింప దలచియపుడు
ధారుణీపతి గహనమధ్యంబు వెడలి. 42

వ. ఇట్లు వెలువడి దక్షిణాభి ముఖుండై దూరంబరిగి ముందట. 43

మ. కనియెన్ దక్షిణదిక్తటంబున బలత్కల్లోల హల్లీసక
స్వాన విఘార్జిత నీరమున్ మకరమత్స్యవ్రాత దుర్వారమున్
జనతాఘౌఘ విదారమున్ వృతమరుత్సంచారముంబుణ్య సా
రసదీ మోహనవారమున్ లవణపారావారమున్ వేడుకన్. 44

క. కనుఁగొని కృతాపరాధుని
ననుబుణ్యుని జేయదలచినాడీ యనఘుం
డని భయభక్తులు గదురఁగ
జనపాలుఁడు వార్ధినిట్లు సంస్తుతి సేసెన్. 45

సీ. అహిమకర ప్రకాశానందకర దేహు!
డనుపమ సుగుణ రత్నాకరుండు
కంకణ సూర్మికాలంకార సహితుండు
భూవిశ్రుతోన్నత జీవనుండు
వర్ణిత శతకోటి వాహినీ నాథుండు
లావణ్య గాంభీర్య లక్షణుండు
ఘనతర శ్రీజన్మ కారణస్థానంబు
జగదభిస్తుత మహాసత్వశాలి

భూమిభృత్తుల భరియించు భూరికీర్తి
బుధుల కాకలి దీర్చిన పుణ్యమూర్తి
దినదినము వృద్ధిగాంచిన ధీవరేణ్యుఁ
డెంచదగిన మహామహుం డితడె దెలియ. 46

సీ. ఈతని గాంభీర్య మెట్టిదో కవ్వమై
దిరిగిన మందరగిరి యెఱుంగు
నీతని యౌదార్య మెట్టిదో యజరామ
రత్వంబుగను సురత్రతతి యెఱుగు

నీతని సంపత్తి యెట్టిదో సిరిగూడి
యిల్లరికమున్న సర్వేశు డెఱుఁగు
నీతని ప్రాభవం బెట్టిదో వజ్రిని
గణన సేయని నగౌఘం బెఱుంగు
గాక నీతని నొరుల శక్యంబె తెలియ
నప్పు లెక్కువ భంగముల్ సెప్పదరుచు
లోనిచి చ్చార్చగా నోపలేనివాడు
నిక్కమని కొంద ఱాడిన దక్కువగునె. 47

వ. అని యివ్విధంబున నవ్వాన నిధిం గొనియాడుచుం జని చని యమ్మనుజవిభుండు ఖరనఖరనఖముఖ విదారితపృథుల పృథులోమ శకల సమాకులంబును నదికలజలనకులకుళీరసంచారసమంచితంబును నతితరళ జలలవలులిత శఫరశిశు కబళననిభృతబకనికరధవళిత పరిసరంబును ఘనపవన మర్మరిత తరళతర తాళీవన దర్శన చకితజల మానుషమిథునపదతలమృదితబాలశైవాల జాలంబును ధరణీ తరుణీ దర్పణ నిభంబును వరుణ విహారణ మహిత వజ్రకుట్టిమ సమంబును నగు విపులపులినతలంబు పై నధివసించి కించిన్నిమీలిత నయనుండై సూక్తసంకల్ప మార్జనాఘమర్షణ దేవర్షి తర్పణ పూర్వకంబు గా గృతసముదాప్రవ గాహుండై శరీరపరిత్యాగబుద్ధిన్ జలంబులలో నికిం జనచన గచ్ఛపంబుల నిచ్చం బ్రవర్తించుటయు నక్రంబు ల వక్రంబులై యుండుటయు క్షుద్రాడంబు లక్షుద్రంబులగుటయు గ్రాహంబుల నుగ్రహంబు సేయుటయు వారిపూరంబు తీరంబు జేర్చుటయుంజూచి విస్మితుండై యుండె నప్పు డశరీరవాణి యో కందర్పకేతు భూకాంతా సీకాంతారత్నంబగు వాసవదత్తతో సమాగమంబచిరంబ నీకునయ్యెడు నింక మరణోద్యోగంబు జాలించు మనిన విని విస్మితస్వాంతుండై మరణ వ్యవసాయంబు చాలించి తత్కచ్ఛోపాంత కాంతారంబునం గొంతకాలంబు గడపి వ్యర్థకాలక్షేపంబు తగదని తనతరుణి నిం గను

దనుక పుణ్యక్షేత్ర నిరీక్షణంబు గావింతు నని నిశ్చయించి కాశి కానగర దిదృక్షా తత్పరుండై సముద్రతీరంబు వెలువడి కాననంబులు గడచి గిరిగహ్వరంబులుదాటి వాహిను లుత్తరించి పట్టణంబులు పరీక్షించి బహుదూరం బఱిగి యంతట. 48

సీ, నివసించె నేవీట నిజపదాబ్జానతో
మాధవుం డగు బిందుమాధవుండు
ప్రవహించె నేవీట భవబంధ విచ్ఛేద
కరవారి సంగ యాకాశగంగ
దయసేయు నేవీట తారకం బఖిల దే
హులకు విశ్వేశ్వరుం డెలమితోడ
సిద్ధించు నేవీట జీవకోటికి శంభు
సారూప్యముక్తి నిస్సంశయముగ

నరసి యేవీట ప్రతిదినం బన్నపూర్ణ
యతిథులకు నమృత దివ్యపాయస మొసంగు
నట్టి కాశీపురంబు ప్రత్యక్షమైన
గాంచి ముదమందె నా రాచకలువ రేడు 49

సీ, అభ్రంకషాదభ్ర విభ్రమ స్ఫూర్జిత
గోపురోన్నత రత్నగోపురములు
మందాకినీతీర బృందావన ప్రభా
వానూన పరమ హంసాశ్రయములు
దివ్యసంభూత ప్రతిష్ఠిత శివలింగ
సంగతప్రాసాద సముదయములు
చంచల చంచరీ కాంచిత ప్రసవాభి
రామ నానావిధా రామములును

గలిగి చెలువొందు నలకాశికాపురంబు
జేరఁజని నృపతి యచ్చటి వారివలన
దత్ప్రభావంబు దెలిసి సంతసముమీఱ
జాహ్నవిని గాంచి యిట్లని సన్నుతించె. 50

స్ర గ్ధ ర ము.
నీరస్మేరాబ్జ భృంగే నిరుపమ కరుణోన్నద్రి భద్రాతరంగే
తీరప్రోద్యత్కుడుంగే దివిజముని కృతోదీర్ణవాక్య ప్రసంగే
ధీరవ్రాతాను షంగే ధృత పవనము ఖోద్గీర్ణరంగత్తరంగే
పారావారాంగసంగే భవభయచకితం పాహి గంగే శుభాంగే.

క. అని గంగను గొనియాడుచు
జననాథాగ్రేసరుండు శాస్త్రోదితరీ
తిని గ్రుంకు లిడి ముదంబున
దినకృత్యము దీర్చి తాన స్థిరతరలీలన్. 52
గీ. పౌరులనుగూడి సంతోష భరితుఁ డగుచు
నాదికేశవమూర్తి దేవాలయంబు
జేర జనుదెంచి గుడిజొచ్చి చేతులెత్తి
హరి బరం జ్యోతి నిట్లని యభినుతించె. 53
మ. జయగోవింద రమామనోహర శరత్సంపూర్ణ చంద్రాననా
జయ వైకుంఠ నికేతనా నరసఖా చక్రీ జగన్నాయకా
జయ నీరేరుహ పత్రలోచన నిరీశా దైత్యలోకాంతకా
జయ శక్రాది సురార్చి తాంఘ్రియుగళా శౌరీ మురారీ హరీ 54
సీ. జయ దీనమందార సకల లోకాధార
భక్తచిత్తవిహార భయవిదూర
జయఖగేంద్ర తురంగ శయనీకృతభుజంగ
కరుణాలసదపాంగ ఖలవిభంగ

జయ మునిస్తుతపాత్ర జలద సన్నిభగాత్ర
సజ్జన వనచైత్ర శంభుమిత్ర
జయ సురస్తుతనామ సమదాసురవిరామ
శతకోటిరవిధామ సుతనుకామ

జయరమాపీనకుచయుగస్థగితగంధ
సార భాంకిత సద్వక్ష సారసాక్ష
జయ మురాసుర శిక్షణ చణ కరాగ్ర
శోభిత రథాంగ గోపకన్యా భుజంగ. 55

శా. శ్రీకాంతాయ నమోనమో బుధగణ జ్యేష్ఠాయ పాదానత
శ్రీకంఠాయ నమోనమో మునిమనస్సేవ్యాయ నీలాంబుదా
భాకారాయ నమోనమో దనుజసంహారాయ మాయూరబ
ర్హాకల్పాయ నమోనమో యనుచు నిన్నర్చించెదన్ శ్రీహరీ. 51

ఉ. మ్రొక్కెద సర్వదేవమునిముఖ్యనమస్కృత పాదపంకజా
మ్రొక్కెద నీలమేఘనిభమోహనదేహవిభా విరాజితా
మ్రొక్కెద దుష్టదానవసమూహవిదారణ మూలకారణా
మ్రొక్కెద నన్ను గావుము సరోరుహలోచన శ్రీశ కేశవా. 57

మ. అని యద్దైవత సార్వభౌముని సపర్య ల్భక్తి గావింపుచున్
దనజన్మంబు పవిత్రమయ్యెనని మోదంబంది నర్తింపుచున్
జననాథాగ్రణి రాజమార్గమున సంచారంబు గావించు స
జ్జనులంగూడి సమస్త దైవతదిదృక్షాదక్షుడై యంతటన్. 58

సీ. శ్రీకాశికాపురీ సింహాసనాసీను
మునివంద్యు విశ్వనాథుని భజించి
యమరీ కచభరిచు ద్భరిమరీ హితపదాబ్జ
నన్నపూర్ణా విశాలాక్షి గొలిచి

యాఖువాహనుని లోకారాధ్యు ఘను డుంఠి
విఘ్నేశదేవుని వినుతిసేసి
శాతమన్యు వమణిస్తంభ గంభీర వా
హుని భైరవస్వామి గని నుతించి
దండపాణిని బాగడి వందనమొనర్చి
త్రోవలోనున్న లింగమూర్తులకు మ్రొక్కి
విపులమైనట్టి ముక్తిమంటపము గాంచి
మునిమఠంబులు చూచె నజ్జన విభుండు. 59

వ. అంత. 60

శా. నీలాంభోధరమున్ నభస్సులిని రాణించెన్ మయూరాళి పిం
ఛాలంకారతనాడె జాతకము లత్యానందముం బొందె వా
త్యాలోలాకృతి సన్నగించె గుసుమప్రాలంబలోలంబ వా
చాలంబై గనుపట్టె జాతితతి వర్షాకాలమయ్యెన్ ధరన్. 61

సీ. ఆకాశపద్మాకరాభ్యంతరస్థితా
సంగలాక్షాచిత్రినౌక యనగ
నంబుదమార్గ హర్మ్య ద్వారసంబద్ధ
మణిమయతోరణ మాలికయన
గగనలక్ష్మీ కటీఘటిత చిత్రాంశుక
కాంతి సంగత హేమ కాంచి యనగ
ద్యు సరోరుహాక్షి పయోధరస్థనిదాఘ
కాంతసంతత సఖాక్రాంతి యనగ
నింద్రచాపంబు పడమట నేపుజూపె
నుత్తరంబున చంచలాభ్యుదయ మయ్యె
దూరుపుననుండి చనుదెంచె నూరుతములు
దక్షిణంబున మేఘసంతతులు దనరె. 62

మ. శరధిన్నీరము గ్రోలుచో నతివృషన్ శంఖబులుంబగ్రోలి వా
ర్ధర సంఘాతము వానకాలమున దత్తచ్ఛంఖ సంఘంబు దు
ర్భరమైనన్ వమనంబొనర్చె న న నభశ్రేణికిం జేరువం
గన మొప్పం జరియించె నయ్యెడ బలాక ల్గర్భమున్ దాల్చుచున్.

క. ఘనసనుయం బని యెడు కాం
చనకారకు డపుడు నీలజలద కషశిలం
గను దొనరొరవట్టిన కాం
చన రేఖయనంగ దనరి చంచలయొడమెన్. 64.

మ. ఘనకాలప్రియ సంగమస్ఫుటిత దిక్కాంతేక్షణా హారమో
హనముక్తా మణులో యనంగ జటుల భ్రాంతీకభీకృద్విఘ
ట్టన సంచూర్ణిత తారలో యనగ జూడన్ వేడు కై య భ్రవీ
ధిని వర్షోపలముల్దొలంగెను ధరిత్రీభాగముం గప్పుచున్. 65.

క. పరహిత వృత్తిం దిరిగెడు
విరహుల గుండియలు చండ వేయుదు ననుచున్
మరుడొనరించిన బంగరు
కరపత్రం బనగ గైతకచ్ఛదమలరెన్. 66.

గీ. శార్ద్వలస్థతి గనన్నొప్పె బూరులీల
నిందగోప తనుద్యుతి సాంద్రమగుచు
బుడమి చేడియ తనమేన బూని నట్టి
నీలలోహిత వర్ణాంక చేలమనగ. 77.

వ. మఱియు మధురస్వర ఘణితియుంబోలె రజఃప్రసరాపహార
ణక్షమంబై తాపసహస్తంబు నుంబోలె సజలకరకాలంకృతంబై క
ల్పాంత సమయంబునుంబోలె దర్శితానేక తరణి విభ్రమంబై రావణ
పౌరుషంబునుంబోలె మేఘనాధ జనకంబై యొప్పునప్పటి వర్షాకాలం
బవిముక్త క్షేత్రంబున గృహమేధిని కేతనంబుల గడిపి యంతనచ్చో
వెడలి ధరిత్రీవల్లభుం డుల్లసితాంత రంగుండై క్రమక్రమంబున గయా

ప్రయాగంబులు సేవించి తత్తదుచిత కృత్యంబు లొనరించి శ్రీజగన్నా
యక సేవాతత్పరుండై కతిపయ ప్రయాణంబు లఱిగి ముందట. 68

శా. పారావార తటాంతర స్ఫుటవటో పాంథాధ్వ విశ్రాంతనా
నారాష్ట్రాగత మర్త్యదర్శిత జగన్నాథ ప్రభావాంచితా
కారక్షోణి సురావళీ వినుత ముఖ్యక్షేత్రమాహాత్మ్య వి
సారంబౌ పురుషోత్తమంబు గనియెన్ క్ష్మావల్లభుం డంతటన్. 69

ఉ. ఏవుట భేదనంబు దివిజేంద్ర నమస్కృత మేపురంబుల
క్ష్మీపతి దారుమూర్తికి నికేతన మే నగరీవరంబు వి
ద్యాపరిపూర్ణ భూసుర వితాన పరస్పర బోధనియ్యౌ మా
శ్రీపురుషోత్తమంబునకు జేరువ జేరి నృపాలు డంతటన్. 70

మ. క్షితినాథుండటు కొంతదవ్వరిగి వీక్షించెన్ బదాంభోరుహా
నతసంఘాత విముక్తిదాయక జగన్నాథాలయాగ్రస్థిరో
న్నతి వీక్షామతి కాంత శాంత జనసంతానావనావక్రమున్
దితిపుత్రాంతక రూపరక్షిత ధరిత్రీ చక్రమున్ జక్రమున్. 71

వ. తదనంతరంబ.

సీ. తతధూప ధూమ విస్తారితాంభోధర
పటలోన్నట ధ్వజ జటయుతంబు
హరినీల మరకత కురువింద విద్రుమ
కృతమణి స్తంభ సుశ్రీపదంబు
తప్తహాటక నిర్మిత ద్వారబంధ బం
ధుర వజ్రకీలితా ర్రకయుగంబు
నఖిలదిగ్దేశా గతానేక మానవ
మహితసింహద్వార మంటపంబు
విశ్వకర్మ తపోబలా విష్కృతంబు
సర్వగీర్వాణ సంఘాత సన్నుతంబు
నగు జగన్నాథదేవు దేవాలయంబు
గాంచియారాజు కృతనమస్కారుడగుచు. 73

మ. వటభూజాతము నీడజేరి విబుధవ్రాతంబుతో గూడియ
చ్చటి తీర్థంబుల నోలలాడియు పునర్జన్మాభిలాషా విశం
కటబుద్ధిం జని భక్తిపూర్వముగ మార్కండేయ శంభున్ శివున్
బటువాక్ప్రౌఢిని బ్రస్తుతించి జనిసాఫల్యమ్ముగా నంతటన్. 74

సీ. హరిపాదయుగ చింతనాత్యంత నిర్మల
స్వాంతులు వేదాంత సారవిదులు
భుజలతామూల విస్ఫుటలక్ష్యమాణము
ద్రిత శంఖచక్ర సుశ్రీసమేతు
లనుపమ తులసీ దళాంచిత నలినాక్ష
మాలికాధారణా లోలమతులు
ద్రావిడగ్రంథ సందర్భ విజ్ఞాన ధీ
చతురులు సకలశాస్త్ర ప్రవీణు
లఖిలలోకైక సమ్మతు లార్యహితులు
నైన వైష్ణవరాజుల నాశ్రయించి
శ్రీజగన్నాథ దేవుని జేరి మ్రొక్కి
పార్థివోత్తము డిట్లని బ్రస్తుతించె. 75

గద్య:—

జయ జయ పారావార సమీపాంచన్నీలాచలకృత నిజమంది
ర జయ జయ ధీరామర మునిచేతస్సరసీరుహ సంచర దిందిందిర జయ
జయ బలభిన్మణి నీలాంబుద సన్నిభ శోభాకలిత సువిగ్రహ జయజయ
నిజపదసరసిజసేవాసక్త జనావన విలసదనుగ్రహ జయజయ నంద
యశోదా మందిర శైశవలీలాజన సంసేవిత జయజయ చక్రగదానంద
కధర శార్ఙ్గాద్యాయుధ రుచిసంభావిత జయజయ కధృత గోవర్ధనధర
సంరక్షిత పశుగోపకుమారక జయజయ జగదాభీల జ్వాలాచటులద
వానల భీతినివారక జయజయ గోపనితంబవతీ కుచసంశ్రితచేలగ్రహణ

# సంపాదకీయము

మహాశయులారా !

విసంధులు లేకుండ, గ్రామ్యభాషాపదములు ప్రయోగింపకుండ శ్లోకములుగాని, పద్దియములుగాని పదికిమించకుండగ ( 2 పేజీలు ) వ్యాసములు నాలుగు పేజీల కధికముగాకుండగ మాత్రమే గ్రాంధిక భాషలో లిఖించి పంపించుచు నాంధ్రగీర్వాణ భాషాకోవిదులు, పలు వురి కవధిగల్పింపగోరితిని. ఇంతదనుక పంపిన కొందఱి వ్యాసముల లోని పై విషయములు ముద్రించుటలో మాకమిత శ్రమను గల్గించు చున్నవని మనవి చేయుదు, గత విధమున నేయున్న వ్యాసాదికము పరిగ్రహించి ముద్రించుటకు వీలులేదని విన్నవించుచుంటిని. ఆంధ్ర సాహితి నభివృద్ధిచేయు గద్యపద్యరచనలకే యిందు ప్రధానస్థానము గలదని నా విజ్ఞప్తి.

## ఆంధ్ర ప్రభుత్వమున కొక వినీత విజ్ఞాపనము

ఆంధ్రప్రదేశముతో బాటుగ భారతదేశమందలి యితర రాష్ట్ర ప్రభుత్వములుగూడ నాస్థానకవుల నెన్నుకొనియుండిరి. కాని బహు రాష్ట్రప్రభుత్వములు కవులవిడనాడి రని వింటిమి. ఆంధ్రప్రభుత్వము మాత్ర మాస్థాన కవిస్థానము నంతర్హితము గావింపలేదు. వయోజ్ఞాన భాషావృద్ధులగు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి; శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి కాశీ కృష్ణాచార్యులవారిని నేటివఱ కాస్థాన కవీంద్రులుగ నిర్ణయించి గౌరవించియున్నారు. మువ్వురును పరమపదించియున్నారు. సహస్ర మాసజీవులకు మించినవారినే యాస్థానకవి స్థానమున నుంచుటచే త్వరిత కాలముననే నూతనకవీంద్రు నెన్నుకొనవలసి వచ్చుచున్నది. ఆంధ్ర గీర్వాణభాషాధికతగల్గి, బహుళగ్రంధరచయితలునగు పండిత మండనులే యాస్థానకవిస్థాన మలంకరింపనర్హులు, కీర్తిశేషులగు గత కవీంద్రులకు స్థానమొసంగుటయే కాని వారికి భాషాభివర్ధక స్థితిగాని,

యార్థికమైశేష్యముగాని, కల్పింపబడలేదు. విద్యాశాఖామాత్యుల తో సంపర్కముగాని, విశ్వవిద్యాలయసంపర్కముగాని వారికి గల్పింపబడలేదు. ఇతర సాహితీ పరిషత్తులతోగూడ ననుబంధము లేదు.

కావున విద్యాధికులగు నిట్టి మహాత్ములకు తగిన కర్తవ్యమును గల్పించి యార్థికముగ గౌరవకల్పనము గావించి యాంధ్ర దేశము నుద్ధరింప నాంధ్రప్రభుత్వము నర్థించుచుంటిమి.

సంపాదకుఁడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య,

ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర, బ్రాహ్మీభూషణ,

**కాకరపర్తి కృష్ణశాస్త్రి.**

సంపాదక సహాయులు

1. సరస కవితావతంస, శిష్టాబాలకోటీశ్వర రావు
2. విద్వాన్, గున్నేపల్లి అక్షయలింగకవి

# ఆంధ్రీకరణ సమస్యా పూరణార్థము

శ్లో. మశకా మత్కుణా రాత్రౌ;
మక్షికా భిక్షుకా దివా;
పిపీలికా శ్చ భార్యా చ
దివారాత్రం ప్రభాధతే.



సమస్య

మ. కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
కాంతారసంవాసమున్



# వ స ం త ఋ తు వు

## (చైత్ర - వైశాఖములు)

### లయగ్రాహి

కమ్మనిలతాంతములకుమ్మొనసి వచ్చుమధు
　　పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిముకు
　　శమ్ములను నానుచు ముద మ్మొనర వాచా
లమ్ము లగు కోకిలకులమ్ముల రవమ్ము మధు
　　ర మ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా
రమ్ముల నశోకనికరమ్ములును జంపకచ
　　యమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్.



చందనతమాలలతలందు నగరుద్రుమము
　　లందుఁ గదళీవనములందు లవలీమా
కందతరుషండములయందు ననిమీలదర
　　విందసరసీచయములందు వనరాజీ
సందళితపుష్పమకరందరసముం దగులు
　　చుం దనువు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితులడెందము లలందురఁగ
　　మందమలయానిల మమందగతి వీచెన్.



"వాగను శాసనుఁడు"

| | |
|---|---|
| మాధ్యమిక కారికలు–సంస్కృతము–నాగరిలిపి | 2–50 |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1–00 |
| రఘునాథ రామాయణము (ప్రథమ భాగము) | 1–00 |
| రాధికాసాంత్వనము–సముఖము. వేంకటకృష్ణప్పనాయకుడు | 1–50 |
| రాఘవయాదవీయము | 1–00 |
| రెడ్డినాటి రెండుశాసనములు | 0–50 |
| లక్షణసారసంగ్రహము | 2–00 |
| విప్రనారాయణచరిత్రము – చదలవాడ మల్లన్న | 1–25 |
| శతకసముచ్చయము (ద్వితీయ భాగము) | 1–25 |
| శాసనపద్యమంజరి (మొదటిభాగము) | 1–75 |
| (ద్వితీయ భాగము) | 0–75 |
| శివరాత్రి మహత్యము – శ్రీనాథకవి | 2–50 |
| షోడశకుమారచరిత్రము – వెన్నెలకంటి అన్నమయ్య | 1–25 |
| సర్వేశ్వరశతకము – యథావాక్కుల అన్నమయ్య | 0–25 |
| స్వప్నవాసవదత్త – భాసకృతి కనువాదము | 2–00 |
| సింహాసనద్వాత్రింశిక – కొఱవి గోపరాజు | 1–50 |
| ,, (ద్వితీయ భాగము) | 1–50 |
| సీతారామచరిత్రము | 1–00 |
| ప్రాస్వరంగములు | 0–50 |
| 42 – వార్షికమహాసభ – వ్యాసములు – 250 పుటలు | 1–50 |
| పరిషత్పత్రికచందా | 3–00 |
| సూర్యరాయాంధ్ర నిఘంటువు 3,4,5,6,7 | 75–00 |
| లక్షణసారసంగ్రహము | 2–00 |
| సీతారామచరిత్రము | 1–00 |
| | 0–25 |

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | | | | |
|---|---|---|---|---|---|
| * 1 | సంపుటము | ... | ... | ... | 15-00 |
| * 2 | ,, | ... | ... | ... | 15-00 |
| 3 | ,, | ... | ... | ... | 15-00 |
| 4 | ,, | ... | ... | ... | 15-00 |
| 5 | ,, | ... | ... | ... | 15-00 |
| 6 | ,, | ... | ... | ... | 15-00 |
| 7 | ,, | ... | ... | ... | 15-00 |

* పునర్ముద్రితములు గానున్నవి.

ప్రతులకు :

ఆంధ్ర సాహిత్య పరిషత్తు

రామారావుపేట

కాకినాడ

తూర్పుగోదావరిజిల్లా.

*Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Gopalam at Republic Press MainRoad, Kakinada.*

శ్రీ శారదాంబాయై నమః




# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## ప్లవంగ - జ్యేష్ఠాషాఢములు

సంపుటము 56 సంచిక 2



సంపాదకుడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీ శారదాంబాయై నమః




# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక


ప్లవంగ - జ్యేష్ఠాషాఢములు

సంపుటము 56 సంచిక 2




సంపాదకుడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర,
బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి.


సంవత్సరమునకు చందా రు 3/-

విడిప్రతి 0-60 పైసలు

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)
కా కి నా డ

అ ధ్య క్షు లు

విమర్శకాగ్రేసర ఐతిహాసికసమ్రాట్
శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అ భి న వ భో జ
శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)
శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ చిరువోలు కోటేశ్వరరావుగారు
8. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
9. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
10. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓలేటి వెంకట సుబ్బరాయశాస్త్రిగారు
11. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;

# విషయసూచిక

ప్లవంగ ♦♦♦ జ్యేష్ఠాషాఢములు

సంపుటము ౪౬ సంచిక ౨

# గ్రీష్మ ఋతువు

(జ్యేష్ఠాషాఢములు)

క. ఆవిర్భవించె నీల గ్రీవాలికకేలికేలికేవలసఖ మై
పూవులకా రడివోవంగా వేసవి హాసవిపులఖరకర మగుచున్

—తెనాలి రామకృష్ణుఁడు.

* * *

మ. దవధూమంపుఁదమంబులోఁ దమరస ద్రవ్యంబుఁ బంకేజబాం
ధవు భానుప్రతతుల్ హరింపఁ గుయివెంట న్వేళ్లుశూన్యోరుకూ
పవితానం బనఁ జూడఁ జూడఁ బుడమిన్బ్రాటిల్లి పై విప్పులై
యవసం బంచుల నాడఁగా నెగసె వాత్యాళి న్రజశ్చక్రముల్.

సీ. పవలెల్ల దీర్ఘికాంబువు చల్లుపోరాట
నలసి, మృణాళికాజడము లైన
బాహువు ల్తమదుకూర్పరముల కెదురుగా
మలఁచి మూఁపులఁ గరతలము లునిచి,
ప్రాల్మాలి మిగుల నార్పనికమ్మక్రొమ్ముడిఁ
దనిమొగ్గ విరవాది దండ విరియ,
ధౌతగంధామోదిశీతలస్నానములు
వాందఁ గౌగిళ్లతో బోరగిల్లి,

తే. నారికేళాసవపుఁ దీపుటూరు పొలయ,
వలిపెయొంటొల్లెతో నురస్థ్సలులఁ గూర్కు-
ప్రియల వేకువఁ దొడ నెచ్చరించి కలసి
రెలమి ధన్యులు దఱపి వెన్నెలబయళ్ల.

శా. తారుణ్యాతిగచూతనూత్నఫలయు
క్తైలాభిఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబుహ్రాతమా
త్స్వచ్ఛేదపాకోద్గతో

ద్గారంపుంగనరార్చుభోగులకు సం
ధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థితహిమాం
తర్నారికేళాంబువుల్.

—శ్రీకృష్ణదేవరాయలు

* * *

చ. మలయజవారిసేకములు
మౌక్తికనూతనహారలీలలన్
వలిపెపుసన్నకావులను
వారిరుహాక్షుల వీఁగుచన్నులన్
గలిగిన చల్విరిం బ్రదికెఁ
గాక జనావళి యిట్టివేసవిన్
గలదె శరణ్య మన్యమనఁ
గాఁ గడుఁ బేర్చె నిదాఘదాహముల్.

మ. హరి యంభోనిధి సొచ్చె శంభుఁడు తుషా
రాద్రీంద్రముం బ్రాకెవా
గ్వరుఁ డుద్యన్మకరందదుర్దినసమ
గ్రం బైనయుత్ఫుల్లపం
కరుహంబున్ భజియించె దీని మును గ
ల్గం గాంచియే కాక యె
వ్వరి నింకేల సహించు గ్రీష్మ మనఁగా
వర్ధిల్లెఁ దాపోద్ధతుల్.

—ప్రబంధపరమేశ్వరుఁడు

* * *

# వ్యాసరచనము

డా. బి. వి. కుటుంబరాయ శర్మ

(గత సంచికానుబంధము)

మొత్తముమీద "ఎస్సేయ్"[3] అను పదమును వాడుక చేసిన వారిలో మాంటేగ్ ప్రప్రథముఁడు. "ప్రయత్నము, కృషి యని యాతఁడు దానిని నిర్వచించినాఁడు. ఆంగ్లమున నాపదమును నేఁటికిని విశేషముగను క్రియగను కూడ వాడుకచేయుదురు. అనగా "ప్రయత్నము ప్రయత్నించుట" యను రెండర్థములయందును దానికి వ్యావహారము కలదు. ఈ "ఎస్సేయ్" అను పదమునకు "ఎగ్జ్యాజియమ్"[4] అను ల్యాటిన్[5] పదమునుండి నిష్పత్తి చెప్పుదురు. (విషయములను) "తులతూఁచు" (పర్యాలోచనముచేయు) సరి తూఁగునట్లుచేయు అని యా ల్యాటిన్ పదమున కర్థము.

(1) ఎరిస్టాటిల్[6] పండితుఁడు తననీతిశాస్త్రములో[7] నాదర్శమానవుని చిత్రించినాఁడు. ఆ చిన్నచిత్రణము, లేక రేఖాచిత్రము వ్యాసమే! కాని, దానికెవ్వరు నట్లు పేరిడఁ జూడలేదు; ప్రయత్నింపలేదు.

(2) క్రీ.శ. 287లో స్వర్గస్థుడైన "థియోఫ్రేటస్"[8] తన "క్యారక్టర్సు"[9] అను గ్రంథములో శతాబ్దులు దాఁటిన తర్వాతకూడ ఎరిస్టాటిల్ పద్ధతినే యనుసరించి భిన్నభిన్నవ్యక్తి విశేషములను విశ్లేషించి పరీక్షించినాఁడు.

(3) బేకన్[10] మహనీయునకు సమకాలికుడైన "ఓవర్ బరీ"[11] పండితుడు కూడ ఎరిస్టాటిల్ మార్గమునే యనుసరించెను.

(4) "సెనికా"[1] మహోదయుఁడు రోమ్‌దేశపు మహాతత్త్వజ్ఞాని ఇతడు "మోరల్ ఎపిసిల్స్"[2] అనుపేరిట కొన్ని నీతిదాయకలేఖలను రచించినాఁడు. క్రీ. శ. 1612 కూర్పులో తన వ్యాసముల పీఠికయందు

---

3. Essai; 4. Exagium; 5. Latin;6. Aristotle; 7. Ethics; 8. Theophrstus; 9. "Characters" 10. "Bacon"· 11. "Overbury".

1. Seneca; 2. Moral Epistlse (Epistles to Lucilias);

"బేకన్" పండితుఁడు "సెనికా" రచించిన లేఖలను వ్యాసములని పేర్కొనెను.

పరిశీలింపగా పిండితార్థ మిట్లు తేలుచున్నది. మాంటేగ్ మహనీయుఁడు పాశ్చాత్యప్రపంచ వాఙ్మయములో ప్రథమవ్యాసకర్త క్రీ. శ. 1533 నుండి 1592 వఱకు నీతని జీవితకాలము సువ్యాప్తము. పుట్టుకచే నీతఁడు ఫ్రెంచిదేశస్థుఁడు. ఆఱేండ్ల బాలుఁడగువఱకు నీతఁడు "ల్యాటిన్" భాష వినా తదితర భాష లేమియు మాటాడియెఱుఁగఁడు పెరిఁగి పెద్దవాఁడైన పిదప నీతఁడు న్యాయశాస్త్ర మధ్యయనము చేసెను. రెండవ ఫ్రాన్సిస్ [3] రాజు కాలములో నతని న్యాయస్థానము నందీతడొక రాజోద్యోగి; రాజశయనాగార రక్షక దళాధికారి. ఇతఁడు క్రీ. శ. 1571లో "స్కాటుదేశపు మేరీరాణిని" ప్రశంసించినట్లు తెలియుచున్నది.

ఇతనికి నిర్వురు జ్యేష్ఠసోదరులు. వా రీతనికంటె ముందుగనే మరణించిరి. ఉద్యోగవిరమణానంతర మితఁడు తమ కుటుంబమున కున్న "భూవసతి" ననుభవించుచు కాలముగడిపినట్లు విదితముకాఁగలదు. ఉద్యోగమును విరమించుదశలో తన మాన్యక్షేత్రములోని గృహమునందు విశ్రాంతిగ కూర్చుండి మాంటేగ్ మహనీయుఁడీ వ్యాసప్రక్రియను రచించినట్లు తొలు దొలుతగ కొందఱిపలుకు. ఇటలీదేశమునఁ బుట్టియునాంగ్లేయుడుగానంగీకరింపఁబడిన "జాన్ ఫ్లోరియో" [5] యనునతఁడు క్రీ. శ. 1593 ప్రాంతమున తొలిసారిగ "మాంటేగ్" వ్యాసావళిని వ్యావహారికాంగ్లములోని కనువదించినాఁడు.

"మాంటేగ్" పండితుని ఫ్రెంచిభాషాశైలి పరిణతమైనది; కాని జాన్ఫ్లోరియామహాశయుని యనువాదములోని వ్యావహారికాంగ్లము మాత్ర మట్టిదికాదని టి. యస్. ఇలియట్ [6] విమర్శకునివంటి తజ్ఞులందురు.

---

3. Francis II; 4. "Gentleman of the bed-chamber";
5. John Florio 6. T. S. Eliot.

"వ్యాస" మనెడియీ నవీనసాహిత్యప్రక్రియ పాశ్చాత్య లోకమునందు సరిగ నేనాఁ డవతరించినదో చెప్పుట దుస్సాధము సత్యమున కించుక సన్నిహితముగ దీనికాలమును నిర్ణయించుటకు ప్రయత్నములు తఱచుగ జరిగినవి కాని యవి యంతసఫలీకృతములు కాలేదు.

ఐనను క్రీ. శ. 1571 మార్చి నెలలో నీవ్యాసమనెడి సాహిత్య రూపము సృష్టింపఁబడినదనవచ్చును. మాంటేగ్ పండితునిశిథిలసౌధమున[1] రెండవయంతస్తులో నిదిజరిగినది. ఆయంతస్తునందు మనతాత్త్వికుడైన మాంటేగ్ మహోదయుని పఠనాగారము కలదు. చదువుకొను నిమిత్తమై బహుగ్రంథసంకీర్ణమగు నాగదిలోని కాతఁడు ప్రవేశించుట పరిపాటి అది తమ (క్రైస్తవుల) చిన్నగుడికి సమీపమున నుండుట వలన జనబాహుళ్యముచే సంకుల సమ్మర్దమగు లోకమున కించుక దూరముగ నేర్పడియున్నది.

"ఎడ్వర్డు గాస్"[2] ప్రభృతులనుబట్టియు వ్యాసమను ప్రక్రియ ఫ్రెంచిదేశస్థుఁడగు మాంటేగ్ తత్త్వజ్ఞుని మేధాజనితమే! ఈమాంటేగ్ పండితుఁడు విద్యావ్యాసంగము నిమిత్తమై యుద్యోగవిరమణకాలము రాకమునుపే బుద్ధిపూర్వకముగ నుద్యోగమునుండి విరమించుకొని సాహితీవిశ్రాంతి పఠన నిమగ్నుఁడై వ్యాసరచనావ్యవసాయము మూలమున రానున్న తరములవారికి తన వ్యక్తిత్వమును వెల్లడిచేయ నుత్సహించినట్లు విదితము కాఁగలదు. అనర్ఘమైన యీ సాహిత్య ప్రక్రియను ఫ్రెంచిభాషలో సృజించి తన్మూలమున తన ముగ్ధమనోహరవ్యక్తిత్వము నాతఁడభివ్యక్తము చేసినాఁడు.

బేకన్ :—

ఆంగ్లమున వ్యాసరచనకు పితృవ్యుఁడనఁబడిన[3] బేకన్ పండి

1. Old Tower of the Castle of Montaigue; 2. Edward Gosse; 3. The Father of the English Essay;

తుడు, మాంటేగ్ తత్త్వజ్ఞుని వ్యాసరచనము నాంగ్లములో మొట్ట మొదట ననుసరించెను. కాని బేకన్ తత్త్వతః వ్యాసకర్తలలో నుత్తముడు కాడు. అతడు మహాతత్త్వజ్ఞాని; ఉదాత్తశైలీ (రీతి) నిర్మాత; మాంటేగ్ పండితునంతటి భూతదయామయుడు మాత్రముకాడు.

కౌలే :—

ఎడ్వర్డ్ గాస్ మతమున "అబ్రహింకౌలే" 4మహనీయుడు యథార్థముగ ప్రప్రథమాంగ్ల వ్యాసకర్త. అతడు కొంతగ మాంటేగ్ మహాశయుని మానవత్వము వంటి (a) మానవత్వమును, బేకన్ పండితుని శైలివంటి (b) నిర్దుష్ట శైలియు, తనయాకర్షణీయములైన వ్యాసములలో పొందుపఱచెను. అతనికి వ్యాసకర్తకుండవలసిన లక్షణములన్నియు నుండితీరిన వనరాదు. (c) పరిహాసకుశలత యాతని రచనలో నిప్పచ్చరము; (d) ప్రసన్నత పూజ్యము; (e) సరళమైన గాన మాధుర్యము కలదు; (f) ఆత్మాభివ్యక్తియు నున్నది. వ్యాసరచనమునకు సంబంధించి సంతవఱకు "రిచ్చర్డ్ స్టీల్" 1గ్రంథములలో పదునేడవ శతాబ్ది, పదునెనిమిదవ శతాబ్దిలో నంతర్లీన మగుట పొడగట్టును. అతని రచన లన్నిటిలోను మానవత్వ సౌరభము గుబాళించుటకలదు. తన సమకాలీనుల యందఱియందు కంటె నీతనియం దెక్కువ (a) సానుభూతి పరతయు, (b) లోకవ్యవహార పరిచయజ్ఞానమును (c) పొంగారు హాస్యకౌశలమును గలవు.

ఎడిసన్ :—

"కౌలే" పిమ్మట నెన్నదగినవాడు "ఎడిసన్" మహనీయుడు. ఇతడు పదునెనిమిదవ శతాబ్దియందు పత్రికా సంపాదక వ్యాసకర్తలలో నగ్రగణ్యత్వము వహించెను.

పదునెనిమిదవ శతాబ్ద్యంతమున నాంగ్ల వ్యాసరచన తాను, తనకు ముందు వెనుకల నెన్నడు నందుకొని యెఱుగని యొక పరి

---

4. Abraham Cowly. 1. Richard Steele;

పూర్ణదశ నందుకొన్నది. కాని, చక్కని వ్యాసములు రచించిన వారా శతాబ్దిలో చాల తక్కువ. ఐనను "ల్యాంబ్"2 హ్యాజ్‌లిట్,3 లీహంట్,4 డీక్వెన్సీ,5ల" వంటి మహనీయులప్పుడు వ్యాసరచయితలుగా వన్నెకెక్కి వర్ధిల్లక పోలేదు.

పైనల్వురిలో "లీహంట్" మనోజ్ఞముగ వ్రాయఁగలఁడు కాని, మూయింపు గొలుపు రచనలలో మిక్కిలి యసాధారణమైన విశేష మని చెప్పఁదగిన దేదియు నుండదు. "డీక్వెన్సీ"యచ్ఛమైన వ్యాసకర్త అయినను నట్టి స్వచ్ఛతాశోభితములగు వ్యాసముల నాతఁడు రచించినదే యరుదు. అతఁడు తన వచన రచన నంతయు తీక్ష్ణమగువిమర్శనలదెసగా మరలించెను. అందును చాల భాగములలో చోద్యములగు కల్పనలున్నవి.

"హ్యాజ్‌లిట్" వ్యాసములు చాలవఱకు స్వచ్ఛములగురచనలు వ్యాసమునకుఁ బ్రధానభూతములగు సౌలభ్యమును సుందరగమన లాఘవమును నను రెండు లక్షణములలో నవి సంకు తేలినవి. పై రెండంశములయందును హ్యాజ్‌లిట్ పండితుఁడు ల్యాంబ్ మహనీయుని కంటె కూడ పరిపూర్ణుఁడన్నచో తప్పుకాదని కొందఱి వాదము. ల్యాంబుమహోదయుని, ప్రతిభామూర్తిభవ మనవచ్చును. అతని రచనలలోని సహనగుణమును, సానుభూతియు, నుల్లాసకరత్వమును, ప్రసన్నతాగుణమును, చతురోక్తి సామర్థ్యమును, మార్దవానుగతియు, ఆశక్తి ప్రేరకత్వమును. శ్లాఘనీయములైనవి. ఆతనిది కేవల మసాధారణమైన మేధాశక్తియే కాదు; అది యనర్ఘమైనదియు, నపారమగు వ్యాకోచ సామర్థ్యమును గలదియు ననవలెను.

ల్యాంబుపండితుని వ్యాసములను విమర్శించుటబహుదుస్సాధము అవిశైలీ సారళ్య లాలిత్యములకు పేరు మోసినవి. వాని శిల్ప సౌందర్యము ప్రౌఢమైన పరిణతిఁగలది. అట్టివ్యాసరచన మనన్య సాధ్యమని

2. Lamb; 3. Hazlitt; 4. Leigh Hunt; 5. Dequincy,

పించును. వాని పరిపూర్ణతను దృష్టాంతీకరింపఁ జూచుట యపాయకర మైన పని. ఏలన నందుల కాతని ప్రతివ్యాసమును నుదాహరింపవలెనని పించును. ఆ వ్యాసములనన్నిటిని పృథక్కరించి వాని వాని శ్రేష్ఠతల నేర్చి తీర్చుటలో నెంతవారికిని దిగ్భ్రమ తప్పదు. వానిలో వెలుఁగు నీడల యంతరము లనంతములై యున్నవి. పాఠకుల నతఁడేభావస్థితిలో మంత్రముగ్ధుల నొనర్చునో నిర్ణయించి చెప్పుట కడు సాహసము. అత నికె బూర్వాపరములలో నున్న వ్యాసకర్తలు కొన్ని ప్రశస్తగుణములలో, నతనితో సాటివచ్చిరి. కాని, సర్వతోముఖ సంపూర్ణతలో నతఁడు ద్వితీయుఁడే యనఁదగును.

ల్యాంబ్ తర్వాతఁబూర్తిగ నతనితో సరిపోల్చ యోగ్యుఁడని చెప్పఁదగిన వ్యాసకర్త యొక్కఁడును లేఁడనవచ్చును.ఎవ్వరేనియొక్క "స్టీవెన్‌సన్" పండితునిజూపి, యతఁడున్నాఁడని యనవచ్చునేమో కాని యతఁడు "హ్యాజ్‌లిట్" తెగలో జేర్పఁదగిన రచయిత, పందొ మ్మిదవ శతాబ్ది, మెకాలే, ఆర్నాల్డ్, కార్‌లైల్, రస్కిన్, వాల్టర్ పేటర్, జె. ఎ. సైమండ్స్" వంటి వ్యాసరచనా ప్రవీణుల నెందఱనో యవతరింపఁజేసిన దైనను, వారిలో నొక్కరిని గూడ సల్లక్షణలక్షితు డైన వ్యాసకర్తయని మనము నిష్కర్ష చేసి చెప్పలేము.

ఎడనెడ విరుద్ధములగు తళుకు బెళుకుల తోడను నైంద్రజాలిక వైభవములతోడను కొనసాగునట్టి మెకాలే మహనీయుని చారిత్రక ములును సాహిత్యకములును నగు విపుల విమర్శనలు, మానవ జ్ఞాన భాండారమునకుఁగూర్చునవిఁ కావు. "కార్లైల్, రస్కిన్" పండితుల విషయము నిట్టిదే! వారి వాగ్ధాటిగల ప్రసంగ ములనుసందర్భ సంబ ద్ధములుగానివచన కావ్యములనవలెనుగాని వ్యాసరచన లనరాదు.

"స్టీవెన్‌సన్" పండితునిలో వ్యాసకర్తకు కావలసిన సత్తా నిశ్శంకముగ నున్నది. విశాలహృదయమున కుండు నట్టి యార్ద్రతయు, నపారజిజ్ఞాసయు నతనికిఁగలవు. మిక్కిలి శ్రద్ధతో పరిష్కృతమైనను

అతని శైలిలో నిరుత్సాహకము దుర్బోధకము ననిపించునదియుండదు. ఆతని యుత్తమవ్యాసములు పఠించుటకును స్మరించుటకును గూడ నుల్లాసము గొల్పుచుండును. "వాకింగ్ టూర్స్[1]" గాని, "ట్రావెల్స్ విత్ ఏ డాంకీ"[2]లోని కొన్ని భాగములుగాని, యాంగ్లవ్యాస కర్తలలో నతనిని ప్రథమశ్రేణికిఁ జెందినవాఁడని నిరూపింపఁగలవు. అయ్యు నితఁ డెల్లప్పుడు నాయుదాత్తతనే నిర్వహించునని చెప్పలేము. వినసింపుఁ గొల్పియు, జ్ఞప్తిలో నిలువని వ్యాసము లాతనివి కొకొల్లలు.

ఆధునికవ్యాసకర్తలలో "మాక్సబీర్ బోమ్"[3] "జార్జిస్ట్రీట్"[4] "జి. కె. ఛెస్టర్టన్"[5] "బెలాక్"[6] "ఇ. వి. లూకాస్"[7], "ఛార్ల్స్ విబ్లే"[8] "వెర్నన్ లీ"[9] ప్రభృతులు పేర్కొనఁదగినవారు. వీరిలో ప్రథముఁడగు "బీర్ బోమ్" మహాభాగునకు వ్యాసకర్తృ గౌరవమును నిరాకరించువారుండరు. అతని రచనలు మెఱుఁగు లీనెడికళా ఖండములు. అందు మనోజ్ఞమైన మైక్యమనుగుణము సర్వత్ర గుబాళించును. సుందరమైన భావశబలతకూడ నాతని రచనాలక్షణములలో ప్రత్యేకతఁగన్న లక్షణము. "స్ట్రీట్" మహాశయుని వ్యాసములకువలె సాహిత్యకముతో గౌరవము గలవగుటకూడవానివిశిష్టత. "బెలాక్" "ఛెస్టర్ టన్" పండితులు గంభీరతరచింతనాపరులగుట సత్యము.

"ఛెస్టర్ టన్" నకు విరోధాలంకారములు ప్రత్యేక వరప్రసాదములు. దేశద్రిమ్మరి తనములో వ్యక్తమగు విషయముల వర్ణనము నందు "బెలాక్" అద్వితీయుఁడు. చదువరులలో గిలిగింతలనంటుగొల్పు పరిహాసకౌశల మిర్వురకును వెన్నతో బెట్టిన విద్య. "లూకాస్" రచనలు, ల్యాంబ్ మహనీయుని కొన్ని భావభంగిమల సౌరభమును విరజిమ్మును. తన వాక్యముల పరిసమాప్తి విషయమునందు కూడ శ్రద్ధధానతఁ జూపిన సందర్భములలో "విబ్లే" నైపుణ్యము సుస్పష్టము.

1. "Walking Tours;" 2. "Travels with a Donkey;" 3. Max Beerbohm; 4. "George Street; 5. G. K. Chest erton;. 6. Belloc; 7. E. V. Lucas; 8. Charles Whifley; 9. VernonLee.

దీర్ఘ నిశ్వాసములతో నభినందనములలోనికి దిగినప్పుడు తప్ప, తక్కిన సందర్భములలో తన విశిష్టమార్గమున "వెర్నన్‌లీ" సతి కించిదూన ముగఁబరిపూర్ణురా లనిపించుకొన్న వ్యాసకర్త్రి.

'ల్యాంబ్,[1] హ్యాజ్‌లిట్,[2] హంట్[3], గోల్డ్‌స్మిత్[4], స్టీవెన్‌సన్[5]' ప్రభృతుల వ్యాసము లాత్మాశ్రయములు. బేకన్[6] మహాభాగునియందట్లుకాదు. కాని యాతఁడు వ్యాసరచనము నొక నీతివాక్యమాలారచనముగా జేసివేసినాఁడు. "బేకన్" కొన్నిరీతులలో "మాంటేగ్" మహనీయు ననుసరించెను. "మాంటేగ్" తఱచు స్వవిషయమునే వ్యాసవస్తువుగా స్వీకరించితినని చెప్పుట కలదు. ఆత్మానుభవ జ్ఞానములను ప్రపంచించుటకై "బేకన్" బహుధా చాటూక్తిచాతుర్యచణమైన శైలి నవలంబించినాఁడు.

పదునేడవ శతాబ్ది వ్యాసకర్తలలో "ఓవర్‌బరీ"7, "కౌలే"8, "టెంపుల్"9, "డ్రైడన్"10, మొదలగువారుప్రసిద్ధులు. "ఎడిసన్"11, "స్టీల్"12, "గోల్డ్‌స్మిత్" వంటివారి చేతులలో వ్యాసరచనము, వినోద విజ్ఞానములకు సాధకమయ్యెను. అంతేకాదు. గరువతనముతోపాటు నైపుణ్యమునుగూడ నది సంతరించుకోలేదు.

పందొమ్మిదవ శతాబ్ది వ్యాసకర్తలగు "హ్యాజ్‌లిట్, ల్యాంబ్, హంట్" వంటి మహానుభావులు, వ్యాసరచనకు గాంభీర్య మలవరచిరి. "కార్లైల్, మెకాలే, ఫ్రౌడ్,13, ఆర్నాల్డ్, రస్కిన్" ప్రభృతులు దాని విషయ విస్మృతికి తోడ్పడి బహుదైర్ఘ్యవైపుల్యములచే దానిని భారవహమొనర్చినారు.

"డీక్వెన్సీ"14, తన్ను తాను పోలును. అతనికి తన యాలంకా

---

1. Lamb; 2. Hazlitt; 3. Hunt; 4. Gold smith; 5. Stevenson; 6. Bacon 7. "Overbury" 8. "Cowley" 9. Temple; 10. Dryden; 11. Addison; 12. Steel; 13. Froudi; 14. Dequncy.

రికశైలి తనకున్నది; తన దాంభికవచస్సందర్భముగల సాహితీశైలి తనకున్నది; వీరాభాస మనదఁగు తన హాస్యధోరణి తనకున్నది.

ఇఁక "హంట్, హ్యాజ్ లిట్, ల్యాంబ్" వంటి వారి వ్యాసరచనమునకును కొన్ని విశిష్టలక్షణములుకలవు. జీవితనిత్యానుభవసన్నిహితత్వమును, స్వీయ చరిత్రవైఖరియు, సంవాదశైలీపరిపోషణము, నుల్లాసకరత్వమును, ఖేలాతుల్యత్వమును, సారస్యమును, చమత్కృతియు, కరుణాస్ఫోరకత్వమును వెల్లడించుటయే గాక, వారి వ్యాసములు ముచ్చటఁగొల్పు కొన్ని కొన్ని పరికథలవంటి వానిని గూడ కూర్చుకొనును.



---

## శ్లోకము

గోష్ఠం తే విషమావనీవిగచితం
త న్నాపరోధాయ తే
నాంభః పల్వలసంగతం కలుషితం
కుబ్జాకనీరాయ తే
భర్తా తే న నృపాయతే హి మహిషీ
నామైకసంధారణాత్
హృష్టా కిం కితవే పశో! హృది సదా
గర్వాయసే నిర్భరమ్.
[కవిమూర్ధన్య కృతవ్యాజవ్యాహారే]

## సమస్య

"మామ నీక్షించి కడుదూఱె భీమతనయ"

---

* శ్లోకము నాంధ్రీకరించి సమస్యను బూరించి శ్రావణమాసాంతము దాటకుండ బంపగోరుచున్నాము.

—సంపాదకుఁడు.

శ్రీరామాయ నమః

# శివ!

శ్రీ శిష్ట్లా బాలకోటీశ్వరరావు

మ. శివ! పోఁగాలము దాపురించినపుడే శ్రీకంఠ! సర్వేశ! భ
క్తవితానావనతత్పరా! పురహరా! గంగాధరా! యంచు భా
గ్యవిపర్యాసము గుండెగాల మయి పర్యాటింప రోదింతు రీ
భవవారాన్నిధి నీఁదలేక మనుజు ల్వ్యామోహము ల్వీడుచున్. 1

మ. శివ! క్షేమంకర తావకీనకరుణాక్షీరమ్ముఁ గోరిలంగ యో
గివరేణ్యుల్ నిరతమ్ము సమ్మదమునం గీర్తింతు; రస్మాదృశుల్
భవితవ్యం బెఱుఁగంగ నేరక కుటుంబం బంచు నల్లాడి నీ
రవులై రక్షకుఁ డేడి? యెక్కడని యారాటింతు రస్వస్థతన్. 2

మ. శివ! సంసారము స్వర్గతుల్య మని సూచింపన్ హితాకాంక్షు లా
నవు నంచుం దలయూఁచి నమ్మితి; దురాశావేశభూతమ్ము లా
త్మవికారమ్మును బ్రోత్సహింప నరకద్వారమ్మునం జిక్కితిన్;
జవసత్వమ్ములు సన్నగిల్లె; నిఁకనైనం బ్రోవ రారా వెసన్. 3

మ. శివ! యేమందును నిన్ను? నేడుగడవై చేయూఁత నందించు వే
ల్పువు; నాజీవనజీవనమ్మునకుఁ గర్పూరంపుసౌరభ్యముల్
సవరింపన్ జతనించు నేర్పరివి; యేలా నేఁ డుపేక్షించి న
న్నవమానంబులపా లొనర్తువు? పరీహాసమ్మె నీలక్ష్యమా?! 4

మ. శివ! కాపాడఁగలాఁడ వీ వని కదా చిత్తమ్ము నర్పించి రే
బవ లర్చించితి! తోడుదొంగ వయి దైవమ్మున్ సమర్థించి హ
ర్తవు గాఁబోకుము; భర్తవై నను విషాదగ్రస్తునిం గాచి పం
డువు గల్పింపుము నాదునింటఁ బరువుండు న్నీకు నీవారికిన్. 5

మ. శివ! నీ నామజపమ్ము సంతతము గాంక్షింతున్; హరిబ్రహ్మవా
సవవైశ్వానరభాస్కరాదిదివిజుల్ శ్లాఘించు త్వత్ప్రాజ్యవై
భవసర్వస్వము నా కొసంగు మని యభ్యర్థింప; నన్నింత లోఁ
కువగావించినదుర్విధి న్దునిమి సంక్షోభంబు వారింపుమా! 6

మ. శివ! నీసుందరమందహాసరుచికై జీవించి సేవించుమా
నవుఁడన్;మాయలు మర్మముల్ తెలియ నేనాఁ జేసియు న్నిన్ను డా
యువిధానమ్మును సంగ్రహింతును మదాయుర్భాగ్యమున్క్షీణమై
న;విరాజిల్లుదు వెండికొండపయి నీనాట్యంబు దర్శించుచున్. 7

మ. శివ! నీమానము నోపఁజాలను; మహాచిత్రంబు నీతీరు-దా
నవుఁడైన న్నినుఁ గొల్చుచో నతఁడు నానాప్రాభవోపేతుఁడౌ;
నవురా!! యెంతదయామయుండ విపు డేమాయెం ద్వదీయాద్భుత
స్తవనీయస్పృహణీయదివ్యదురువాత్సల్యామృతం బింకెనా ?! 8

మ. శివ! నీప్రాకటదర్శనాసనము నాశింతున్ సదా; దాసబాం
ధవ!! యీ నీ బిరుదమ్ము సార్థకము గాదా? కాదు కాఁబోలు నై
న విషం బెందుల కారగించితివి? పుణ్యస్త్రీ శిరోరత్నమై
న'విశాలాక్షి'ని రచ్చకీడ్చుటకు నౌనా! గుండె పాషాణమా ? 9

మ. శివ! కైలాసమనోజ్ఞసానువులలోఁ జిన్నారిపొన్నారివా
యువు లామోదముఁ బుండలింప సతి నేదో చేసి మెప్పింపనే
ర్తువు! నిన్నే యిలువేల్పుగాఁ దలఁచుభక్తుల్ పిల్వ రక్షింపనే
రవు!! వహ్వా యిది యెంతవింత? ఫణిహార(శ్రీ)ప్రభావంబొకో!!! 10

మ. శివ! సామేనునఁ బార్వతి న్నిలిపి యాక్షేపించు గంగం గృపా
ళువవై యాదలమీఁద నిల్పి వలపుల్ పూరించి జాబిల్లి నా
మె వినోదార్థము లంచమిచ్చితివి! తాల్మి న్నిన్ను గా దన్నవాఁ
డెవఁ డున్నాఁడు రసజ్ఞలోకమున? నీయెత్తుల్ ప్రశంసార్హముల్ !!11

మ. శివ! ముక్కంటివి; వ్యాఘ్రచర్మ మొక కౌశేయమ్ము నీ! కంబికా
ధవ!! భూతమ్ములు నీదుసేవకులు; ప్రేతావాసమే మందిరం
బవునా? నీలగళుండ వేరికిని నీ యాంతర్య మర్థమ్ముకా
దు;విచారింతునుపూజనీయుఁడవొ కాదో యంచునశ్రాంతమున్. 12

మ. శివ! నీపాదము లాశ్రయించితిని నాశ్రేయస్సు సుంతైనఁ గో
రవు, కాపాడవు; చూడ నస్మదతిఘోరప్రాగ్భవాఘౌఘసం
భవపైశాచికధూర్తనర్తనకళోన్మాదప్రమాదమ్ము మూఁ
డవకంటన్ – విడనాడు మింక నుబలాటం బేల నన్నోమఁగన్? 13

మ. శివ! క్రోధం బుపసంహరింపకుము దాక్షిణ్యంబు వర్జింపు మా
టవికుం బ్రోచిన నాఁటి నీదు మొగమోటం బంబుధిం గల్పి పా
శవికాభీలనిరంకుశప్రబలరోషద్వేషదావాగ్నిప
ర్యవసానం బగుమృత్యుదేవత కరాళాలింగనం బీయుమా!! 14

మ. శివ! నీవైఖరి తెల్లమాయెను సుమా! చేయూఁత నిమ్మన్న జం
కవు పల్రీతులఁ దర్కకర్కశపరీక్షం జేయు; నాబోఁటి కం
దవు; వేదాంతవిశాలవీథులఁ బ్రయాణం బాచరింపంగ దా
గవు; కించిజ్జ్ఞుల కీవు లోఁగ విదియే కాదా నిజం బారయన్. 15

మ. శివ! భక్షించితి వీవు హాలహాల ముత్సేకించి పార్థుండు గాం
డివముం బూని శిరమ్ము మోఁద వరము న్జెల్లించి దీవించినాఁ
డవు; తిన్నం డనుకంపతో నిడిన కండ ల్మెక్కి యుప్పొంగినాఁ
డవు; నీలీలలు నే నెఱుంగుదు నె మూఢగ్రామణి న్బాలుఁడన్. 16

మ. శివ! నీయున్కినిఁగూర్చి యే నెటులు వాచింతున్? బుధోత్తంసు లే
వ్యవహరింతురు శైవవైష్ణవముల న్వ్యత్యాసముల్ రేపి; యి
ట్టి విభేదమ్ముల కాటప ట్టయినమట్టిం బుట్టితిన్; వేదశా
స్త్రవిదుల్ కట్టిరి నీకె పట్టమును నిర్ధారించి యాధిక్యమున్. 17

మ. శివ! నాలోఁ గల నీస్వరూపమును వీక్షింతు న్నితాంతమ్ము; హే
తువు లేనైనను నీవె దిక్కనుచు నెంతుం గామితార్థప్రదా
తవు నాపన్నజనావనవ్రతవినీతస్వాంతవిఖ్యాత నే
తవు నిత్యుండవు నిర్వికారుఁడవు సత్యజ్ఞాత వందు న్నినున్. 18



# కావ్యములందలి వారకాంతలు—
# వారికట్నములు

శ్రీ పలగాని గోపాలరెడ్డి M. Sc;

రెండు దశాబ్దములక్రితము దేవోత్సవములం దుండిన దేవదాసి నృత్యాదులు దేవదాసిచట్టముతో మఱుగైపోయినవి. "మేజువాణి లేని పెండ్లి యుప్పులేనికూర" యన్నది నాటి నుడి. కాలానుగతముగా వారుకూడ కులవృత్తి వదలుకొని గౌరవోపాధుల జేసికొని నవజీవనమున కలవాటుపడిరి. వేదకాలమున వీరి దొక గౌరవప్రద మైనజాతిగా పరిగణింపబడెడిది. విజయనగరమును దర్శించిన విదేశయాత్రికులు వేశ్యానివేశనములు నగరమునందలి మధ్యవాడలలో గల వని వారివీథు లలంకరణములతో నొప్పెడి వని వ్రాసియున్నారు.

స్కాంధపురాణమునుబట్టి "పంచచూడ" యను నచ్చరలేమ సంతతి వేశ్యాజాతిగా నెలవొందినదని తెలిసెడిని. యాజ్ఞవల్క్యస్మృతిలో వెల తీసుకొని మారుగా నుత్తమ లేక సమజాతిపురుషుని గూడునది వేశ్యయని తెలుపబడియున్నది. తత్సంభోగసంజాతస్త్రీలు రాజాజ్ఞాబద్ధు లని కౌటిల్యుని యర్థశాస్త్రవాదము. వేశ్యలను మున్నూఱుకులము వారనుట కొకయైతిహ్యము కలదు. విక్రమార్కుని సోదరుడు భర్తృహారి స్త్రీకుత్సితములకు రోసి మున్నూఱుభార్యలను విడచి తమ్మునిపై రాజ్యభార ముంచి వనముల కేగెను. అట్టిచో

క. అన్నరనాథుడు విడచిన
యన్నులు మున్నూఱు లతనియనుమతి గలుగన్
మున్నూఱుచేసుకొని ధర
మున్నూఱుకులం బనంగ మొనసిరి సిరులన్ (సిం.ద్వా. 1ఆ-104వ

కీ॥ శే॥ సురవరము ప్రతాపరెడ్డిగారు తమయాంధ్రుల సాంఘిక చరిత్రలో (పుట 165) భీమవరమున నుండిన పెద్దమున్నూఱు చిన్నమున్నూఱు తెగలవేశ్యలు బహుశః పెద్దకమ్మ-చిన్నకమ్మ-పెద్దకాపు

చిన్న కాపులవలె సంతస్థుతారతమ్యమైయుండనోపు నెల్లూరు ప్రాంత మున నటునిటు చిక్కుక మాటలాడు జాణలను నిందావాచ్యముగా ముస్నీటికూటిదానా యనుటకలదు. నెలకునై దురోజులు విసర్జించి సంవత్సరమున మిగిలిన మున్నూఱు దినములలో నంతమందితోఁగలసి ధనార్జన జేసెడివారు కాన నీపేరు సార్థకమై యుండవచ్చును.

ప్రజావినోదమునకై వీరు దేవాలయములందు నాట్యములు చేసెడివారు. రాజాస్థాన నర్తకీగాయినులు లంతఃపుర స్త్రీలకు పైరం ధ్రులుగను నృత్యగానవిద్యావిషయికబోధకులుగ నుండుటయు గలదు. ఇవిగాక వారికి దండులో స్థానముండెడిది. ఈ యాచారము పాశ్చాత్యులలోనుండు. (Epigraphica carnatica 8వ వాల్యూం-104వ పుట లోని) 1283 నాటి యొక శాసనమును బట్టి Rice గారిట్లు వ్రాసియున్నారు. "యుద్ధములలో వీరోచితపోరాటము సల్పిన వారిని వేశ్యలుపుష్పమాలాలంకృతులనుజేయుచుండిరి.తద్గౌరవమునకై వీరులు సాహసమును ప్రదర్శించెడివారు"

విజయనగరపుదండులో వేలాది వీరకాంతలుండినట్లు న్యూనిజ్, బార్బోసా ఫరియాలు వ్రాసి యున్నారు.

"వీరుల నుత్సాహపరచుటకై రాజు అందమైనవేశ్యలను దండులోనుండ నియోగించెను. వారసంతృప్తిచే దండు వదలకుండ జేయుటకై వారికి చాల డబ్బు ముట్టజెప్పబడెడిది. వీరు యుద్ధము చేయరు కాని వీరిప్రియులు వీరోచితముగా పోరాడెడివారు. శత్రు సైన్యములనుండి కొందఱు వీరులు వీరిచే నాకర్షింపబడి రాజుదండులో చేరెడివారు. వీరు సంస్కారసంపదయుతులు........." బార్బోసా

Jehun nama విశ్వదర్పణములో ఖాతిబ్ చెలబీ యిట్లు వ్రాసియున్నారు. "విజయనగరపుదండులో చాలమంది భాగ్యవంతులైన వేశ్యలుండిరి."

sewell గారి A Forgatten Empire లో గూడ నిట్టి వివరములే గాన నగును.

రాజాజ్ఞమీరిన వేశ్యలకు 1000 కొరడా దెబ్బలుగానీ 5000పణములజరిమానా గానీ విధింపవచ్చునని కౌటిల్యు డర్థశాస్త్రమున తెలిపియున్నాడు.

గౌరవముచే నైననేమి లేక చట్టబద్ధులైననేమి వేశ్యలుదండులో నుండి వీరుల నుత్సాహ పరచెడివారు. శారీరకసౌఖ్యప్రసాదమునను నృత్యగానవినోదప్రదర్శనమునను నిది జరిగెడిది. చతుర్విధదేశ్యరాగముల క్రియాంగరాగము లొక కోవకు చెందినవి. ఇవి రతులందు స్థాయీభావకపోషకములుగను యుద్ధాదిమహోత్సవోద్యోగులకు నింద్రియోత్సాహజనకములు. నాట, గౌళ, కేదారగౌళ, కిత్తిగౌళ నారాయణగౌళ, వరాళి, సారంగ, ఆహిరి శ్రీరాగాదు లివి. (దేవోత్సవములందు శ్రీ పాదతాంగులు(మోయువారు) పులకితాంగులై శ్రమ లెఖసేయకుండుటకై మేళగాళ్ళు ప్రత్యేకమైన బాణీలతో సులహరి, నాటరాగములు, రథోత్సవమున ఒడయు, ఎత్తిరికలను వినిపింతురు. శక్తిజాతరలందు వీరంగమేళము లీకోవలోనివే.

ఇటుపై వారికట్నముల గూర్చి తెలుసుకొందము. రాజవాహన విజయము (2వ ఆశ్వా–72 ప) లో నిట్లున్నది.

చ. కిలకిల నవ్వి తానె పరికించుపురిన్ విటునట్టి వీధికా
తలచరదల్పవారవనితామణి పిల్చినసీటు వెట్టుచుం
బలుకదు తొంటిపైడి తన పాతికమాడకు మాటలాడరూ
కలుపదున్నైదు నిద్దురకు గట్టి వరాయను సట్టిదండునన్.

పైపద్యమునకు లఘుటీక యిట్లున్నది. "సాధారణముగా నగరులోతనకు తానై పిలుచు నాసిగకవు వేశ్యదండులో నీటు వెట్టుచు తనకు నిచ్చెడిడబ్బుతో పాతికవంతు మాటలాడుటకు ముందుగనే యివ్వవలెననెను." నిఘంటుకారులు "పైడి" యనుపదమునకు (1) బంగారు (2) ధనము (3) నొకవిధమగు నాణెము (4) ఆభరణము (మూడవ

మఱియు నాల్గవయర్థములు సూ. రా. ని. లోనే కలవు) నను నాలుగర్థములు సూచించియున్నారు. ఇంకొక యర్థము వేశ్యకు నొక నాటినిదురకిచ్చెడి కట్నము." అట్టిచో పైపద్యభావ మిట్లుండును. "తనకుతానై నగరులో కిలకిల నవ్వుచు పలుకరించెడి నాసిగకపు గణిక (దండులో గిరాకిపెరుగగా) పిలచినపలుకదు. తన మునుపటిపైడి పాతికమాడను కాదనును. ఒకనిదురకు పదునైదురూకలు కట్టుమని కోరును."

ఈ పైడి పదప్రయోగము వేశ్యాప్రసక్తిగల పలుచోట్లగలదు. క్షేత్రయ్యపదములలో

(1) మటుమాయలను జాలించు మాకియ్యవలసిన పైడి
అటుబెట్టిమాటాడు ఆదివరాహ ॥ అంద ॥ (1)

(2)............................
వేరొక తెవలెనే పొందుకు పైడి తెమ్మంటినా
............................ (95)

(3) మువ్వగోపాలుని వెదకితోడ్తేరబోయిన కుంటెనగత్తె వెదకి వెదకి చెలితోననినపలుకు లివి.
పరగేవానిచేతి పైడిబట్టిన దానవా యింటి
గురుతు చెప్పవద్దా.................

........................
యిచ్చినపైడిచేతికివచ్చినదే చాలునటవే
హెచ్చుకొద్దు లెరుగవలదా............... (116)

(4) తోటివారకాంతలతో చెలిప్రాధేయపడుట;
పదరివానిచే పైడి బట్టుకొనకుడీ...... (155)

(5) బాల్యక్రీడలందు మువ్వగోపాలుడు;
......విరిబోణిరో! రమ్మని విరులుజడనుజుట్టి
పరువమైననాటికి పైడి యిదేననుచు
...................... (158)

కన్నెఱికమునకు సంచకరము నిచ్చుముచ్చటయిది. ఇట్లేశుకసప్తతి–కామసేనకథలో

చ. తనచెలికానితో పసిడి దార్చక యే నల కామసేనతో
నెనసితి నిన్న నంచువచియించిన నాతను దాని యింటికిన్
జన మదినిల్ప జాలక ప్రసంగవశంబున సోమదత్తుడా
డిన వచనంబు లెల్ల బ్రకటించినచో వెలముద్ది యుగ్రమై (3ఆ–28ప)

సోమదత్తుని యొద్దకుపై డివసూలుచేయుటకరిగెను. అదేకథలో శివలింగము వెనుకజేరిన చిలుకపలికిన మోసపుమాటలు నమ్మి తనకు నిత్యయౌవనసంప్రాప్తమాయెననితలంచి వేశ్యాజరభియలంకరించుకొని

..................

నింటికెవ్వారువచ్చిన నెనయుదనకు
నదిగొ బైడియవచ్చిరటంచు లేని
బింకమెక్కించుకొని........—— (3ఆ–78ప)

వైజయంతీ విలాసకర్త యీపదమును రెండుచోట్లమాత్రమే వాడెను. వేశ్యాజీవితపు రోతలను దేవదేవి తెలిపెడిచో నిట్లున్నది.

ఉ. ఒక్కని బిల్వబంపి మఱియొక్కని చేత బసిండి బట్టివే
ఱొక్కని యింటికేగుచు మఱొక్కని నానకుచక్కినొక్కచో
బొక్కలి దాల్చుకూడు భ్రమబొంది విటుల్ తెలియంగ లేరుగా
కెక్కడి సత్యమేడ వలపెక్కడినేయము వారకాంతకున్ (2ఆ–77ప)

రుక్మాంగద చరిత్రమునందు

....................

కాంత కొక్క తెకిచ్చె కనకంబు క్రియనింట
భాసిల్లు సరిగోవపళ్ళెరంబు.

.................. (4ఆ–104ప)

"కనకంబు క్రియ" ప్రయోగ మిచ్చుటనే కన నగుచున్నది. తొలుత వారకాంతలకు స్వర్ణాభరణములనిచ్చెడి వాడుక యుండినది (చూడుము–బసవపురాణము–ముగ్ధసంగయకథ) క్రమముగా వారి శుల్కము నాణెములలో వసూలగుచున్నను నిదిపైడి, పసిండి, కనకంబు ఇత్యాదినామంబుల వ్యవహరింపబడు చుండెడిది.

(సశేషము)

# శృంగార నాయికలు

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

(3) విరహోత్కంఠిత

'చిరయత్యధికం కాంతే, విరహోత్కంఠితోన్మనాః' (ప్రతాపరుద్రీయే)

రాగము: ; తాళము : సంకీర్ణ జాతి

పల్లవి :—కనుగొనదేల చెలి కాంతుడు వచ్చునని
అనుమానము వలదు నను మఱచినాడే ॥ కను

అనుపల్లవి :—కనులకాటుక కఱఁగును నీరు నింపకు
మనదేరికొఱకే తనుసింగారము
మనజాలనే మించినపిదప నిం కిట
వినరానిమాటను వినగలడే యతడు ॥ కను

చ. మగువలకే వలపు మఱిమఱి గల దమ్మ
మగజాతికి గలదె మాయయొకటె తప్ప
పగవారికిని నా పాటులు వల దమ్మ !
పగ మాత్రమే మిగిలె గద వలచుటచే
నగుబాట్ల పాలైతి నలుగురిలోపలను
తెగగోసెనె వలపు తీవియ మొదలంట
జగతిలో ఆఁడిగ జనియింపజేయక
భగవంతు డేలనో పాపినిగ నన్ జేసె ॥ కను

(4) విప్రలబ్ధః "క్వాచిత్సంకేత మావేద్య దయితే నాథ వంచితా
స్మరార్తా విప్రలబ్ధేతి కళావిద్భిః ప్రకీర్త్యతే॥ (ప్రతాపరుద్రీయే)

రాగము : పూరికళ్యాణి— తాళము : జంపె

పల్లవి :—నేడేల నాథ నీజాడ లిట గనుపడవు ॥ నే

అనుపల్లవి :—నీడలందున నెచటనో డాగియున్నావో
ఆడుదానిని యింత యలయించి చంపెదే ॥ నే

చరణము :—కటికిచీకటి బెనగు కారుమబ్బులలోని
కిటికీలలోనుండి చిటుకవైచినలోన
మటుమాయ మౌ మెఱుపు చిటిదివ్వెసాయమున
నిటు నడచి వచ్చిచెడియే వచ్చినప్పటికి ॥ నేడే

# నా శంకలు

శ్రీ 'సుధీః'

ఉ. ఉల్లమునందు నక్కటిక
    మూనుట మీకులమందు గంటి మం
చల్లన మేలమాడు నచ
    లాత్మజమాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁగిరీటిఁ బాశుపత
    దివ్యశరాఢ్యుని జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల క
    భీష్టశుభప్రతిపాది గావుతన్.

"అర్జునునకు పాశుపతమహాస్త్రము గటాక్షించిన శాంబరీ భిల్లుఁడవు నీవు! సహజముష్కరములగు మీకిరాతకులీనుల హృదయముల గరుణారసము గలుగుట నేఁడు చూచితి"నని పర్వతరాజకుమారియగు భవాని శంకరుని జూచి మృదుగతిఁ బరిహాసవాక్యముఁ బలుకఁగా శంకరుఁడామె నెట్లును బరిహసింపఁజాలక చిఱునవ్వు నవ్వి మౌనముద్ర వహించినాఁడు. అట్టి శివుఁడు కృతిభర్తయగు శ్రీ కృష్ణదేవరాయల మనోభిలషితములకు శుభమును గలుగఁజేయుఁగాక యని పెద్దనార్యుడు శివుని సంప్రార్థించి యున్నాడు.

ఈ పద్యమందలి నాయల్పశంకలను వాకొందును. శంకరుఁడగు తనపతిని పైరీతిగ మేలమాడిన యామెత యచలాత్మజ. సహజకాఠిన్యమున కాకరమగు హిమవద్గిరిరాజునకు జన్మించినది. ఆమె వంశము మాత్రము నిరవధికకాఠిన్యము గలది కాదా? తన కులము నందలి కర్కశత డాగురించి తాత్కాలికముగ కిరాతవేషము మాత్రము ధరించి యర్జును నెదిరించి పాశుపతాస్త్రము నొసంగు దయాస్వభావుఁడు శివుఁడు సహజకఠినస్వభావుఁ డగునా? ఈ దంపతులలో సహజకఠినులెవ్వరు? సహజదయాళువయ్యుఁ బార్థుని బరీక్షింపగోరి

కైరాతకవేషధారణ మొనరించిన పరమేశ్వరుఁడు నిజముగ కర్కశుఁడా!? ప్రౌఢయగు గిరిజ నైజసహజకర్కశత నాచ్ఛాదించి భర్తను పరిహసించుట పేలవముగ లేదా? శంభుఁ డమాయికుఁ డగుటచేత కాఁబోలు నవ్వి మౌనము బూనినాఁడు. ఆతఁడసాధ్యుఁడైనచో "నీవుఱాతి గుట్టలో బుట్టిన కఠినాత్మవు. అదియుఁగాక నాతోబాటుగ కైరాతకీవేశధారిణివై నీవు మాత్రము నన్ననుసరింపలేదా!" యని యెదిరించి పరిహసింపలేదేమి? సర్వజ్ఞబిరుదధారియగు నప్పరమశివుఁడింత యలౌకికతఁబ్రదర్శించినాఁడేమి? మౌనము వహించుట యర్ధాంగీకారము సూచింపదా! ప్రాపంచిక జ్ఞానము, జ్ఞప్తిశక్తి, సద్యస్సమాధానచాతురీప్రసక్తి లేని పశుపతి తన కృతిపతి కభీష్టశుభప్రతిపాది కాఁగలడా?

శివులగు సతీపతుల సరససంభాషణచమత్కృతులఁ దమ కావ్యములలో విచిత్రగతి రచించిన పూర్వకవివరు లెందఱో యున్నారు. అట్టి మహాశయుల వఱకెందులకు? ఆధునికుఁడగు కవి మూర్ధన్యుఁ డాంధ్ర స్థాన మహాకవి సార్వభౌమునకంకితమిడిన కాశీకాభ్యుదయ కావ్యమున కృత్యాది పద్యములలోని యొకదానిలో గల పార్వతీపరమేశ్వరుల సరసపరిహాససమన్వితము లగు నుత్తర ప్రత్యుత్తరములు దిలకింపుడు—

ఉ. ఉన్నత గోత్రసంభవత
యున్నది లేకఠినత్వ మెట్లు పో
వు న్నిను వీడి? యంచు నభ
వుండు హసించుచుఁబల్క నార్యయున్
దిన్నగఁ దోఁచునే విషమ
దృష్టి కనం జెలిచెక్క నొక్కుచున్
మన్నన సేయు శంకరుఁడు
మాకృతినాయకుఁ బ్రోచుఁగావుతన్.

* * *

శా. శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ
జెన్నొందఁ విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీ
తి న్నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజభ
క్తశ్రేణికిం దోఁచురా
జీవాక్షుండు కృతార్థుఁజేయు శుభదృ
ష్టిం గృష్ణరాయాధిపున్.

ఆంధ్రకవితాపితామహుని మధురకావ్యము నందలి యీ యాదిమపద్యమును గూడ కాసంత బరిశీలించుట యుక్తము! "నిటాలమునఁదిలకమును, కపోలములందు మకరికాపత్రములను, కుచయుగళిపై లేపనము సింగారించుకొను పురాతనరాజపత్నుల నెఱిఁగిన పెద్దనామాత్యుఁ డీవిధముగ లిఖించినాఁడు.

నిజస్తనయుగిపై కస్తూరిలేపనము గావించుకొని రమాదేవి పతిని కౌఁగిలించుకొనునపుడు గాని, పతిచే నాశ్లేషింపఁబడి నపుడుగాని విష్ణుదేవుని వక్షోభాగముననంటుకొని యది నల్లగ ప్రకాశించినది. ఆ కస్తూరికానీలము దాఁపార్శ్వముననే లక్ష్మీదేవి పతి యురముపై గూర్చుండినది. ఆసమయముననే హరిభక్తాగ్రేసరులగు సనకసనందన సనత్కుమారసనత్సుజాతు లను బ్రహ్మర్షులు మొదలగువారు దేవతాపదార్చనార్థము వెల్లకిలశయనించి యున్న హరిపాదపంకజముల కడకు శయ్యాసమీపమునకు వచ్చి నిల్చినారు. వారికిని విష్ణువక్షస్థలికిని దూరమెుక బారెడైన నుండదు. పదయుగికి నమస్కరింప వచ్చిన బ్రహ్మర్షుల మనోదృష్టులు తామువచ్చిన పనిపై బడకుండ ముందున కెగ బ్రాకి లక్ష్మీరమణీమణి దెసకు బ్రసరించినవి. ఆమెసరగున నున్న మృగీమదముద్రపై గూడ వ్రాలినవి. ఆ బ్రహ్మర్షుల దృష్టిలోపమో

మనోవైకల్యమో కాని యూచేరువనున్న కస్తూరిముద్రకూడ నొక కామినిగా భ్రాంతిచే గన్పట్టినది. వా రానీల ముద్రను భూదేవిగ భావించి సవతుల పొత్తును గూర్చి యాశ్చర్యపడుచు నిలిచినారఁట!

విష్ణుదేవునివక్షముపై నింతకుమున్నే నల్లని మచ్చ యొకటి శాశ్వతముగనున్నదే! ఆ చెంతనే లక్ష్మీనివాసమే!! ఇంతకు మున్ను వారి కా భ్రాంతియేల కలుగలేదు? దీని నటుండనిండు. ఆ బ్రహ్మర్షుల ధ్యేయము భగవానుని పాదయుగ్మైకార్చనకార్యమేగదా! ఆవని ద్రోసిపుచ్చి యాసద్భక్తుల ధారాళ దృష్టి స్త్రీల దెస కేల పరుగిడినది? భ్రాంతి కవకాశమొసంగని సామీప్యము వారికి భ్రాంతి కల్పించినదా! సనకసనందనాదులు భక్తులా? బ్రహ్మవేత్తలగు మహాజ్ఞానులా?

"మరీచ్యాదీన్ సృష్ట్వాప్రవృత్తి, ధర్మం గ్రాహయామాస-సనక సనందనాదీ నుత్పాద్యనివృత్తి ధర్మంగ్రాహయామాస"-అనుసిద్ధాంత మున్నదే!! సనకాదులఁ గేవల హరిభక్తులుగ కవిమణి లిఖించుటలో నర్థమేమి? దృష్టి లోపముగల కాంతల దెసఁగను నభిలాషగల భక్తులుగల రాజీవాక్షుఁడు కృష్ణరాయల దెస శుభదృష్టి బఱపి యభీష్టసిద్ధి నను గ్రహింపవలెనా !!

ఆంధ్ర కవితాపితామహాబిరుదశోభితుఁడు, శ్రీకృష్ణదేవ రాయలవంటి మహారాజ కవిచే ననేకాపూర్వాద్భుతసన్మానములు పడసిన పండిత కవిమణి, భువనవిజయసభా భవనమున నిలిచి రాయల నలరించు నష్టదిగ్గజముల నగ్రగణ్యుఁడు నగు పెద్దనామాత్యుని కవన మింతలోప భూయిష్ఠమా!? ఔచిత్యమే తెలియని సామాన్యునివలె నీతఁడు మను చరిత్రమునందలి మొదటి పద్యములనే తడబడు నడకల వ్రాసి నాఁడేల? నేను బాహిరించిన సంశయములు సత్యములే యైన నింతకాలము స్వారోచిష మనుసంభవ మేల జీవించినది?



# ఆంధ్రీకరణ సమస్యాపూరణములు

గతసంచికలో మే మొసఁగిన శ్లోకము, సమస్య :—

"మశకా మత్కుణా రాత్రౌ;
మక్షికా భిక్షుకా దివా;
పిపీలికాశ్చ భార్యా చ
దివారాత్రం ప్రబాధతే".

"కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
కాంతారసంవాసమున్"

---

1. విద్వాన్, గున్నేపల్లి అక్షయలింగకవి, కాకినాడ.

తే. గీ. నల్లులును దోమలును రేయి నలియఁజేయు
బిచ్చగాండ్రును నీఁగలు వేఁచుఁ బగలు
పవలు రేలును వేదనపాలుసేయు
భార్యయుఁ బిపీలికలును విశ్వమున నవుర !

మ. తలఁపన్ మున్నొనరించు కర్మఫలముల్
దప్పింప శక్యంబె ? వే
ల్పులకున్ సైతమసాధ్యమన్న నబలల్
పూఁబోండ్లకున్ సాధ్యమే ?
కలిచేతన్ నిషధేంద్రుపత్ని గనియెం
గాంతారవాసమ్ము, చాఁ
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెం
గాంతారసంవాసమున్.

*

2, (శ్రీ) కావూరి పూర్ణచంద్రరావు, విజయవాడ-2.

తే. గీ. నిశల బాధించు మత్కుణామశకములు; ది
వముల మక్షికాభిక్షుకాబాధ చెలఁగు;
నాలిబాధయును బిపీలికాలిబాధ
తెలియనగుచుండుగాదె ! రాత్రింబవళ్లు.

మ. పలికించె న్విధి తా బలీయమయి దు
ర్భాషల్ ధరాజాతపై
నొలికించె న్విషధార మత్తుఁడగు నేఁ
డో యొక్కమూఢాత్ముచేఁ !
దిలకింప న్విధి దప్పునో వశమె ? తా
దేవుండెయౌఁగాక ! చాఁ
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
గాంతారసంవాసమున్.

*

1. భాషాప్రవీణ-రాష్ట్రభాషావిశారద, రేగిళ్ల సత్యనారాయణశర్మ,
పిఠాపురము.

తే. గీ. మశకమత్కుణంబులు రేసమయమునందు
భిక్షుమక్షికాళి పగటివేళయందు
కరగృహీతి పిపీలికల్ సరభసమున
పవలు రేలనక జనుల బాధపెట్టు !!

మ. అల లంకేశ్వరునాలయాన చిరకా
లావాసముంజేసె మై
థిలి; ధర్మప్రభుడౌ రఘూద్వహుడు సా
ధ్వీరత్నమీసీత నా

బలుకన్ స్వీకృతిసేయ బాడియగునే!
వత్సా! సెబాసన్న చాఁ
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
కాంతారసంవాసమున్.

*

4. శ్రీ "కార్తికేయ" ఆంధ్రసాహితీప్రచారసభ, పశ్చిమబెంగాల్.

తే. గీ. దోమయును, నల్లియును రేయి నేమొ కుట్టు;
ఈఁగయు బికారి విసిగింతు రేమొ పగలె;
చీమయును జేసికొన్నట్టి లేమయు నటు
గాక రేయింబవళ్లు చీకాకు గూర్త్రు !

మ. అల లంకేశ్వరు పంచనున్న తనభా
ర్యం దెచ్చికొన్నట్టి వెం
గలిజేజేఁడగుమూగ రాముఁడను నేఁ
గా నెన్నఁడున్; నిన్నుఁకన్
గులటా! యొల్ల—నటంచుఁ బ్రేలు నొకఁ డ్రా
గుంబోతుమైమత్తు చాఁ
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
గాంతారసంవాసమున్.

*

5. శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వరరావు, ఆనందాయుర్వేద నిలయము, ఎలమంచిలి.

తే. గీ. మశకమత్కుణములు రేయి, మక్షికములు
భిక్షుకావళియున్ దివావేళయందు
పవలు రేలు పిపీలికల్ భార్యయు నతి
బాధపెట్టుచునుందురి భూవలయమందు.

*

6. (శ్రీ) శిష్లా వేంకటశాస్త్రి, B. A; B. Ts; సికింద్రాబాద్.

తే.గీ. మాపు బాధించు మశకము ల్మత్కుణములు;
పవలు మక్షికభిక్షుకవ్రతతి నొంచు;
నప్పుడిప్పుడు ననక భార్యయునుఁ జీమ
లహముఁరాత్రమ్ముఁబీడించు నతిశయించి.

మ. కులికెన్ రక్కసికొంపలో విడిచి సం
కోచమ్ముఁగొన్నాళ్లు; ని
వ్వాలలో దూఁకెఁబతివ్రతాతిలక మ
బ్బో! యగ్నిచల్లారె; రా
జులకున్ రాజఁట! రాముఁడంట!! పతితన్
శోధించినాఁ డన్నచోఁ
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
కాంతారసంవాసమున్.

*

7. (శ్రీ) కోగంటి దుర్గామల్లికార్జునకవి, పామఱ్ఱు.

తే. గీ. రేయి నల్లులు దోమలు చేయుబాధ
పగలు యాచకుఁడీఁగలు బాధగూర్చుఁ
జెట్టపట్టినకాంతయుఁ జీమలెల్లఁ
బగలు రేయును మిక్కిలి బాధ పెట్టు.

మ. అలుకంబూని కరమ్ము రాఘవుఁడు లం
కాధీశునిన్ రావణున్
బలుబాణంబులు వేసి చంపి యెలమిన్
బద్మాక్షికిన్ సీతకున్

గలుగం జేయుచు రాజ్య మేలుచును దాఁ
గా రాముతో నుండఁ, జాఁ
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
కాంతారసంవాసమున్.

*

8. శ్రీకట్టా త్రిమూర్తికవి, ఆంధ్రసాహితీప్రచారసభ, పశ్చిమ బెంగాల్.

తే. గీ. మలసి నల్లులు దోమలు మాపులంటె
రేపులనె జోగు లీఁగలు వేపుఁగాని
యాలుఁజలిచీమచాలును జాలిమాలి
రేపుమాపును నొప్పించి యేపుమాపు.

మ. అలరుందొట్టెల ముద్దుగాఁబెరిగి ధై
ర్యస్థైర్యగాంభీర్యసం
కలితున్ రాఘవుఁ జెట్టపట్టి గిరిదు
ర్గప్రాంతముల్ మెట్టి తె
క్కలిరాకాసి శపించి పావకపరీ
క్షన్మించియున్ చీకుచా[redacted]
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్
గాంతారసంవాసమున్.

* * *



# మహాకవి కాళిదాసుని వ్యాకరణలోపములు

శ్రీ అయ్యగారి నరసింహమూర్తి.

సాంపర్క్యసమారాధనము, సూక్ష్మపరిశీలనాకౌతూహలము గల కాళిదాసు కాలగతిచే బ్రకృతితత్త్వములోఁ గలుగు పరిణామములను సమ్యగ్దృష్టితోఁ బరిశీలించి యాకళింపుచేసికొని తద్వర్ణనముచేఁ గలిగిన యానందమునకుఁ బరవశుఁడై శాస్త్రాధ్యయనమువలనఁ గలిగిన ప్రతిభావ్యుత్పత్తులతో 'ఋతుసంహారము' పేర తన రచనకు శ్రీకారమును జుట్టినాఁడు.

సమ్యగ్దృష్టి, సమగ్రపాండిత్యము, రచనాపాటవము భావనాచణత్వము, సంపాదించినపిమ్మట రఘువంశమహాకావ్యరచన కుపక్రమించుటకు ముందు బహువారములు 'ఆదికవి' వాల్మీకి రామాయణమును జదివి యాకళింపుచేసికొనినవాఁడగుటచే నాతనికి ధర్మమార్గమును, వినయసౌశీల్యాదిసుగుణసంపదలు పట్టుబడినవి. కనుకనే యాతఁడు రఘువంశమున 'మన్దః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్ । ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహురివ వామనః' అని తన వినయగుణమును బ్రదర్శించినాఁడు. రిక్తస్సర్వో భవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ' యనుసూక్తి కనుగుణముగాఁ బ్రకృతితత్త్వమును శాస్త్రములను నధ్యయనము చేసి పూర్ణత్వమును సంపాదించుటయే గాక తన కళయందు గౌరవము, తన విద్యయందు దృఢశక్తి, యాత్మవిశ్వాసము గలిగినవాఁడగుటచే భంగ్యంతరమున తన కవితను గూర్చి తననాఁడు, తనయనంతరము తనకు సాహిత్యక్షేత్రమునఁ గలుగు స్థానమును రఘువంశమహాకావ్యముననే వివరించినాఁడని పఞ్చదశ, సప్తదశసర్గలయందుఁగల యీక్రిందిశ్లోకములనుబట్టి మన మూహించుకొనవచ్చును.

"సాఙ్గంచవేద మధ్యాప్యకించి దుత్క్రాన్తశైశవా । స్వకృతిం గాపయామాస కవిప్రథమ పద్ధతిమ్" (రఘు 15-53). నేటికిని సంస్కృతము జదువువారికి ప్రథమమున రఘువంశము నేగదా యారంభించుట.

"ప్రవృద్ధౌ హీయతే చన్ద్రః సముద్రోఽపి తథావిధః। సతు తత్సమ వృద్ధిశ్చ నచాభూత్తా వివక్షయిః" (రఘు 17-71). ఈవాక్యము లాతని జ్ఞానసంపత్తికి నాత్మవిశ్వాసమునకు, క్రాంతదర్శిత్వమునకు నిదర్శన ములు. కావుననే గాళిదాసుని గూర్చి "కాళిదాస గిరాం సారం కాళిదాస స్సరస్వతీ। చతుర్ముఖోఽథవా సాక్షా ద్విదు ర్నాన్యేతు మాదృశాః" అనుసూక్తి మల్లినాథుని ముఖపద్మమునుండి బహిర్గతమైనది.

మాళవిక రచనాకాలమునకు కాళిదాసునకుఁ బండితసంఘమున మంచి గౌరవప్రతిష్ఠలు లభించియుండుటయే గాక తన గ్రంథములకు మంచి ప్రచారముగూడ జరిగియుండును. ఆకారణముననే మాళవిక నాటకప్రస్తావనలో సూత్రధారుఁడు "అభిహితోఽస్మి విద్వత్పరిషదా కాళిదాసగ్రథితవస్తు మాళవికాగ్నిమిత్రం నామ నాటక మస్మిన్ వసంతో త్సవే ప్రయోక్తవ్య మితి" యని పలుకగనే పారిపార్శ్వకుఁడు "మాతా వత్ ప్రథితయశసాం భాసకవిపుత్రసౌమిల్లకాదీనామ్ ప్రబన్ధానతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాంబహుమానః కథంపరిషదో బహుమానః" అనిచెప్పగా దానికి సూత్రధారుఁడు "పురాణమిత్యే వ న సాధుసర్వం నచాపి కావ్యం నవ మిత్యవద్యమ్। సన్తః పరీ క్ష్యాన్య తర ద్భజన్తే మూఢః పరప్రత్యయ నేయబుద్ధిః" అని సమా ధానము చెప్పినాఁడు. తదనంతరరచనమైన 'విక్రమోర్వశీయము'న సూత్రధారుఁడు "మారిష, బహుశస్తు పరిషదా పూర్వేషాం కవీనాం దృష్టాః ప్రయోగబన్ధాః సోఽహమద్య విక్రమోర్వశీయం నామనాట కమపూర్వం ప్రయోక్ష్యే। తదుచ్యతాం పాత్రవర్గః స్వేషు స్వేషు పాఠేష్వవహితై ర్భవితవ్యమితి" దానికి పారిపార్శ్వకుఁడు "యథాజ్ఞా పయతి భావః" అని మిన్నకుండును.

కాళిదాసునకు తననాటకములు పలుచోట్ల ప్రదర్శింపబడినంత మాత్రమునఁ దృప్తి కలుగలేదు. విద్వజ్జనప్రశంసలనంది నాటివారిలో నద్వితీయుఁడను కీర్తి నందవలెననెడి యాకాంక్ష యభిజ్ఞానరచనా

కాలమునాటికి మిక్కుటమైయుండియుండును. ఆకారణముననే తన్నాటకప్రస్తావనలో సూత్రధారునిచే "ఆపరితోషా ద్విదుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్ బలవదపి శిక్షితానాం ఆత్మన్యప్రత్యయంచేతః"(నానేర్పును బండితులు కని మెచ్చునంత వఱకు నేను సరియగునని నమ్మఁజాలను. లోకములో నెంతప్రయత్నముతో నేర్చిన వానికైననుదనయభిప్రాయముంబట్టియేతననేర్పుననమ్మకముకుదుఱదు) అంతటి పట్టుదల, దానికనువగు పరిశ్రమతో రచించిన రచన యగుటచే నా "యభిజ్ఞానశాకున్తలము" నాటకరాజమున కభిజ్ఞానమై ప్రపంచసాహితీవేత్తలచే బహుధా ప్రశంసింపఁబడుచున్నది.

'తగిదం చిత్రం విశ్వం బ్రహ్మజ్ఞానా దివోపమాజ్ఞానాత్ జ్ఞాతం భవతీత్యాదా నిరూప్యతే నిఖిలభేదసహితా సా' (అర్థచిత్రమీమాంస-అప్పయదీక్షితులు).

కాళిదా సట్టి బ్రహ్మజ్ఞానమును బ్రకృతిశాస్త్రాధ్యయనముల మూలమున సాధించి రచనకుపక్రమించినవాడగుటచేఁదన రచనయందు సఫలీకృతుడై 'ఉపమా కాళిదాసస్య'యని 'దీపశిఖా'యని బిరుదముల నంది నాటినుండి నేటివఱకు స్వదేశమునందే గాక ఖండాంతరముల యందును విశిష్టమైనఖ్యాతి నార్జించి సాహిత్యలోకమున 'దీపశిఖ'గా విరాజిల్లుచున్నాఁడు.

బ్రహ్మజ్ఞానముగాఁబరిణతిచెందు జ్ఞాన ముపమాలంకారతత్త్వ జ్ఞానము చేతనేయుదయించును. ఈ యుపమాజ్ఞానము విభిన్నమైన రెండు వస్తువులలోఁబోలికనుజూడఁ గలిగిన వ్యక్తి కలవడును. బ్రహ్మజ్ఞానముగాఁబరిణతిచెందు నుపమాతత్త్వజ్ఞానమును సంపాదించుటలో కాళిదాసు పారమునుముట్టినవాడగుటచేఁ దనరచనలలోఁ బెక్కు శాస్త్రవిషయముల నుపమానములుగా గ్రహించినట్లే వ్యాకరణాంశములను గూడ నుపమానములుగా నైదాఱు స్థానములలో గ్రహించినాఁడు. దానికిఁగారణము కాళిదాసే యీశ్లోకమున భంగ్యంతరముగా సూచన చేసినాడని చెప్పనొప్పును.

"చక్షుష్మత్తాతు శాస్త్రేణ సూక్ష్మకార్యార్థ దర్శినా" (రఘు. 4-13) ఆతఁడు చర్మచక్షువులకు గోచరింపని దురూహకార్య మార్గములను శాస్త్రముచే నెఱుంగుచుండెను. కాని యాతని యందు చర్మచక్షువుకన్న శాస్త్రమే ప్రధాన చక్షువుగా నుండెను.

ఈతని వ్యాకరణోపమలను జక్కఁగాఁబరిశీలించినచో నాతని బుద్ధినైగనిగ్యము, వ్యాకరణశాస్త్రపారంగతత్వము, తెలిసిన విషయమును గేవలపాండిత్యప్రకటనార్థముగాక సందర్భోచితముగఁ బ్రదర్శించు వివేచనాదక్షత తెలియఁగలదు. ఈ యుపమానము లాతని యక్షరజ్ఞానమునకు నిదర్శనములు. 'శ్రుతస్య యాయాదయమన్త మర్భకస్తథా పరేషాం యుధి చేతి పార్థివః। అవేక్ష్యధాతోర్గమనార్థ మర్థ విచ్చకారనామ్నా రఘు మాత్మసంభవమ్' (రఘు 3-21) శబ్దార్థ జ్ఞానము గలవాడయిన యాదిలీపమహారాజు నాకుమారుఁడు (రఘువు) శాస్త్రములయంతమున కేగుట యనఁగా సకలశాస్త్రపారగుఁడగుటకు, నట్లే యుద్ధమందు శత్రువులయంతమందేగుటకు - ననగా శత్రువులనెల్ల రూపుమాపుటకును సమర్థుఁడగును. అను హేతువు వలన 'ఏగుట' అను నర్థము గలదైన 'లఘి' ధాతువునుండి నిష్పన్న మయిన రఘుశబ్దము నాకుమారునకుఁబేరుగా నిడెను.

ధాతువనఁగా వ్యాపారమును దెలుపునది. 'అఘి, వఘి, లఘి' యను నీధాతువులు గత్యర్థకములు (గమనార్థకములు). ఈధాతువులలో 'లఘి' యను ధాతువునకు గమనరూపమైన యర్థమును జూచి 'లఘి' యను ధాతువునకంటె 'కు' (క్+ఉ) అను ప్రత్యయమును జేయగా (లన్ఘ్+ఉలఙ్ఘుబంహ్యోర్నలోప శ్చేత్యు ప్రత్యయే) తరువాతనున్న లకారమునకు రేఫమురాగా 'రఘు' అని యగును. రఘుశబ్దమునకు వేగమనియర్థము. రఘువనఁగా నన్నిటను బారముజూచినవాడని యర్థము. ఈయర్థమును గ్రహించియే దిలీపుడు తన కుమారునకు రఘు

వ'ని నామకరణము చేసినాఁడు. 'ధాతు'వనునది వ్యాకరణ పారిభాషికము. రఘు శబ్దరూపనిష్పాదనము శబ్దార్థము నిందు దెలిపినాఁడు.

2. తానరాధిపసంతా నృపజాత్మ జై స్తై చ తాభిరగమ న్కృతార్థతామ్।
సోఽభవద్వరవధూసమాగమః ప్రత్యయప్రకృతియోగసన్నిభః(రఘు. 11-56).

సందర్భము:—సీతారామాదిస్వయంవరములు. (ఆవరులతో వధువులు నావధువులతో వరులు కృతార్థతను జెందినారు. ఆ సమాగమము ప్రకృతి-ప్రత్యయ సమాగమమువలె సార్థకమైనది.) ఇందు ప్రకృతి-ప్రత్యయము-ననునవి వ్యాకరణపారిభాషికములు. ప్రక్రియతే ఆదౌ క్రియతే ఇతి ప్రకృతిః। ప్రతీయతేఽర్థోఽనేనేతి ప్రత్యయః (లేక) స్వాతంత్ర్యేణ ప్రయోగానార్హత్వాత్ ప్రత్యయః (నాగేశభట్టు)న కేవలా ప్రకృతిర్ప్రయోక్తవ్యానాపి ప్రత్యయః-ఇతి శాస్త్రమ్.

లోకమున కేవలప్రకృతికిఁగాని కేవలప్రత్యయమునకు గాని ప్రయోగములేదు. ప్రకృతిప్రత్యయసముదాయమునకే లోకమునఁ బ్రయోగముగలదు. ఉదా:-'రామ' యనునది ప్రకృతి (ప్రాతిపదిక). సు అనునది ప్రత్యయము. కేవల ప్రకృతియైన 'రామ' యను దానికి లోకమున ప్రయోగములేదు. కేవల ప్రత్యయమగు 'సు' అనుదానికి లోకమున ప్రయోగములేదు. ఈరెండును కలిసిన రామ+సు-రామః అనుదానికే లోకమున వ్యవహారము గలదు.

రామ+స్-రామ+ర్-రామ+ః-రామః;లోకమునఁబ్రయోగింపఁబడునది రామః-ఇదియే సుబన్తము. ఇట్టి సుబన్తమునకే పదమని పేరు. సీతారామాదివివాహములు ప్రకృతిప్రత్యయసంయోగము వలె నున్నదని కాళిదాసు చెప్పినాఁడు. లోకమున ప్రకృతిప్రత్యయములు సంయోగరహితమైనపు డర్థ (వంతము)ము, ప్రయోజనము లేకుండినట్లే లోకములో స్త్రీ పురుషులు విడివిడిగానుండిన ప్రయోజనములేదు. సృష్టిప్రయోజకత్వము స్త్రీ పురుషుల సమాగమమే.

సృష్టికి హేతుభూతము స్త్రీ పురుషసమాగమము. శబ్దసృష్టికి మూలభూతము ప్రకృతిప్రత్యయయోగము. ఈ ద్వంద్వములచేతనే లోకవ్యాపారము జరుగుచున్నది. వధూవరుల యోగమును వివరించుటకు లోకమున దీనికి సాటిరాదగిన యుపమానము వేఱొకటి యుండదు. ఈయుపమానమొక్క వ్యాకరణశాస్త్రమునందక్క వేఱొకచోట దుర్లభముగనుక నీతఁడు వ్యాకరణాంశములనుపమానములుగా గ్రహించినాడు.

మొదటి యుపమాన మాతని శబ్దవ్యుత్పత్తికి నిదర్శనము కాగా నీ యుపమానము సందర్భోచితపాండిత్యప్రదర్శనమునకు నిదర్శనము. ఆతని యితరోపమానము లొకయెత్తు. ఇదియొకటి యొకయెత్తు. మల్లినాథులు నుడివినట్లు 'సాక్షాత్ చతుర్ముఖుఁడే' యగు నీ కాళిదాసు. కాకున్న నిట్టి ఘటనలు దుర్లభములుగదా !

3. "సహత్వా వాలినం వీరస్తత్పదే చిరకాంక్షితే। ధాతోఃస్థాన ఇవాదేశం సుగ్రీవం సంన్యవేశయత్ (రఘు 12-58; వాలిని చంపి చిరకాలముగాఁ గోరుచున్న వానరరాజ్యపదవిపై సుగ్రీవుని నభిషిక్తుని చేసినాఁడు. (శ్రీ)రాముఁడు ధాతుస్థానములో నాదేశమును వలె రాజ్యములో నాతని ప్రతిష్ఠించినాఁడు)

ఇట ధాతువు; ఆదేశము ననునవి వ్యాకరణసాంకేతికములు. ఆదేశమనఁగా నొకానొక శబ్దముయొక్క స్థానమున విధింపబడు మఱియొక శబ్దము. ఉదా ...'అస్' అనునది ధాతువు. ఈధాతువు 'లట్టు'లో (వర్తమానకాలములో) 'అస్తి' యగును. 'లిట్టు'లో (పరోక్షభూతము) 'బభూవ' యని యగును. ఇచట 'అస్' అను ధాతువు స్థానమున "అస్తేర్భూః" అనుసూత్రముచే 'భూ' అనునది యాదేశముగావచ్చును. 'లిట్టు' నకు చేయవలసిన ప్రక్రియచేయఁగా 'బభూవ' యని యగును. ఆరీతిగనే శ్రీరాముఁడు వాలి స్థానములోసుగ్రీవు నుంచెను. అనఁగా వాలిని లేకుండగఁజేసి (చంపి) వాని స్థానమున సుగ్రీవుని స్థాపించెనని

యర్థము. ఎట్లన 'అస్' ధాతువు స్థానమున 'భూ' అనునది యాదేశ ముగ ప్రాప్తించిన విధమున.

4. యః కశ్చన రఘూణాం హి పర మేకః పరంతపః। అపవాద ఇవోత్సర్గం వ్యావర్తయితు మీశ్వరః (రఘు 15–7)సందర్భము:–యమునా తీరవాసులైన మునుల యాగక్రియలకు లవణాసురుఁడనురాక్షసుఁడు విఘాతము కల్పించుచుండ వారు రాముని శరణువేడగా వారికి రాముడభయమిచ్చి లవణాసురసంహారమునకై రాముడు శత్రుఘ్ను నాదేశించుట.

అపవాదము : ఉత్సర్గ–ఇవి వ్యాకరణపారిభాషికములు.

ఉత్సర్గయనఁగా సామాన్య శాస్త్రము. దానికి బాధక మపవాదము. బహువ్యాపకము సామాన్యమని, యల్పవ్యాపకము విశేషమని చెప్పఁబడుచున్నది. భూయోదర్శనముత్సర్గో బాధస్తస్యైకదేశగః। అపవాదః సవిజ్ఞేయో మృగ్యోవ్యాకరణాదిషు–హేమాద్రి. సామాన్యశాస్త్రమును విశేషవిధి బాధించునట్లుగనే శత్రువులను దపింపఁజేయుట రాజులందఱి సామాన్య లక్షణమైనను 'పర మేకః పరంతపః' అనుమాటలచేఁ దానొక్కఁడే శత్రువులను దహింపఁజేయఁగల శక్తిసామర్థ్యములు గలవాడని తెల్లమగుచున్నది. ఉదా:–(శ్రీ)+ఈశః అని యుండగా నిట 'ఇకోయణచి' అనుసూత్రముచేత ని కారమున కచ్చు పరముగా నున్నపుడు'య'(యణ్)కారమాదేశముగ వచ్చునను శాస్త్రముచేత యణాదేశము ప్రాప్తించుచున్నది. ఇది సామాన్య శాస్త్రములేక ఉత్సర్గ. అకస్సవర్ణేదీర్ఘః అనుసూత్రముచేత అక్కు–(6, ఇ ఉ ఋ ౠ)నకు సవర్ణమైన యచ్చు పరముగానున్నపుడు దీర్ఘమే కాదేశముగా వచ్చునను శాస్త్రము చేత (శ్రీ)+ఈశః అను చోట సవర్ణదీర్ఘము ప్రాప్తించుచున్నది. కాని యిట ఇకారమునకు కే యచ్చుపరముగానున్నను యణాదేశమువచ్చుటకు బాధలేదు. కాని సవర్ణదీర్ఘము రావలెనన్న ఇకారరూపాచ్చునకు సమానరూప

మగు నికారము పరముగనున్నపుడే వచ్చును. అందుచే బహువ్యాపకత్వము కలిగిన ఇకోయణచియను శాస్త్రమును అల్పవ్యాపకమగు అకస్సవర్ణేదీర్ఘః అను శాస్త్రము బాధించును. ఇది యపవాదము.

కుమారసంభవద్వితీయసర్గలో నిదే యుపమానమును వాడినాఁడు.

లబ్ధప్రతిష్ఠాః ప్రథమం యూయం కిం బలవత్తరైః అపవాదైరివోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః (2-27; సామాన్యశాస్త్రవిధి విశేషశాస్త్రవిధిచేతను సంకోచము చేయఁబడినట్లు శత్రులచే పరాభవము నొందితిరా ?) దీనికి వ్యాఖ్యానమునందీయఁబడిన మఱియొక యుదాహరణము. గోవును చంపకుము. సామాన్యశాస్త్రము గోయాగమున గోవునుచంపుము. విశేషశాస్త్రము ఇపుడు యజ్ఞస్థలములలో సామాన్యశాస్త్రము సంకోచింపఁబడెను.

5. రామాదేశాదనుగతా సేనా తస్యార్థ సిద్ధయే। పశ్చాదధ్యయనార్థస్య ధాతోరధిరివాభవత్ (రఘు 15-9)రాముని యాదేశముతోనాతని వెనుక సేనావారమును గదలినది. 'అధి' యను నుపసర్గ లేకున్నను ధాతువున కర్థసిద్ధి సిద్ధమే. ఆవిధముగనే యీసేన లేకున్నను ఆయన పని సాధింపఁగలఁడు. అయినను ఔపచారికముగ సేనకూడ కదలినది. సందర్భము వెనుకటిదే.

ఇఙికావధ్యుపసర్గం నవ్యభిచరితః ఇతిన్యాయః. ఉపసర్గను విడచి ధాతువుండవచ్చును. కాని యుపసర్గ ధాతువును విడిచియుండదు. ధాతువేయర్థమునుగలిగి యుండగా నుపసర్గ యాధాతువుయొక్క అర్థమునే ద్యోతనచేయును. ఉపసర్గ ధాతువుయొక్క యర్థమునెన్నడును చెప్పదు.

ఉపసర్గలేకుండగనే ఇఙ్-అధ్యయనే అగు ధాతువునకర్థము గలదు. అయినను స్వయముగా నర్థసాధకమగు ఇఙ్-అధ్యయనే యను ధాతువునకు 'అధి' యను నుపసర్గ సమీపము నందుండి యుపకరించుచున్నది. ఆరీతిగనే శత్రుఘ్నుడొక్కడే యుద్ధమొనర్చి శత్రువులను

నాశనము చేయఁగల శక్తిమంతుడై నను నాతని వెనుక సేన యలంకార ప్రాయముగ వెడలినదని చెప్పినాఁడు. ధాతువే తీరున స్వయంబోధకము శక్తిమంతము నగునో యట్టి యుద్ధవిశారదు డీ శత్రుఘ్నుఁడు.

ఈ తీరున కాళిదాసు డనర్ఘము, అనర్గళము, ననవద్యము నన శ్వరమునగు తన వ్యాకరణపాండిత్యము నుచితరీతిని తన గ్రంథము లందు ప్రదర్శించి తన యక్షరజ్ఞానమును సార్థకము చేసికొనినాఁడు.

# రామలింగేశ్వర శతకము

కీ. శే. వద్దిపర్తి నాగరాజు

శా. శ్రీ మీరంగ నగేంద్రకన్య గొలువన్ జిత్తంబు రంజిల్ల నా
వామాంగి న్మదిమెచ్చి భక్తజనము ల్వాంఛించుభోగంబులన్
వేమారున్ దగ నిచ్చి ప్రోచుచు మహావిస్ఫూర్తి రామేశ్వర
గ్రామావాసగరిష్ఠత న్వెలసితౌరా! రామలింగేశ్వరా! 1

శా. శ్రీ రంజిల్లఁ బయోధిఁ గట్టి సురవైరి న్ద్రుంచి సీతాన్వితుం
డై రాగా నిట యేల బంపయును తుల్యాఖ్యానదీ శ్రేష్ఠమున్
జేరంగాఁడి పయోధి జొచ్చిన మహాక్షేత్రం బటం చిచ్చటన్
శ్రీ రాముండు ప్రతిష్ఠ జేసెను మిమున్ శ్రీ రామలింగేశ్వరా! 2

మ. శతమన్యుప్రముఖామరుల్ నిను మదిం జర్చించి పూజించి యా
నతులై వేడిన వారివారి మనముల్ నందించు నట్లా మహో
న్నతసామ్రాజ్యపదంబు లిచ్చితివి శ్రీ నాగేంద్రసత్కుండలా!
శ్రితసంరక్షణ! పాపశిక్షణచణా! శ్రీ రామలింగేశ్వరా! 3

మ. నిగమంబుల్ నుతిసేయనేరవు భవానీనాథ! నీసత్కథల్
దగఁ గీర్తింపఁగ మర్త్యు లెంతటివిభునుల్? దైత్యారిసంరక్షణా!
ఖగవాహాంబక! దేవదేవ! యభవా! కంసారిసంపూజితా!
జగదారాధ్య! కృపాసముద్ర! నిఖిలేశా! రామలింగేశ్వరా! 4

మ. కనకాహార్యము చాపమున్ కడు జగత్కల్యాణుఁడౌ విష్ణుఁడున్
ఘనబాణంబును నారి వాసుకియుఁ గాఁగ న్భూమి తేరౌచునుం
దనరన్ చక్రయుగంబు నబ్జహితునిం దారాధిపుం జేసి నీ
ఘనశక్తిం బురముల్ జయించితివి పీఁకన్ రామలింగేశ్వరా! 5

మ. కరుణాసాగర! శంకరా! భవహరా! కామారి! విశ్వంభరా!
గిరిచాపా! హరిరోప! పాహి యని ని న్గీర్తించు సద్భక్తులన్
పరమాహ్లాదముతోడ జూచి సరగన్ బాలించి రక్షించు నీ
నెరకారుణ్యరసంబు నెన్నఁ దరమా నే రామలింగేశ్వరా! 6

మ. మదలిప్తుండగు నగ్గజాసురుఁడు దుర్మాదంబుతో దేవతా
సదనంబుల్ దెగఁజూచి దేవతల సత్సౌఖ్యంబులన్వాపి శు
క్రుదుఁడై యుండఁగ దేవతల్ శరణు సాంబా! పాహియన్నంతవా
రి దయన్ దేలిచి దైత్యు ద్రుంచితివిగా శ్రీరామలింగేశ్వరా! 7

మ. కరుణాసాగర! శర్వ! సాంబ! యని యక్కాంతేయుఁడౌ నర్జునుం
డురు మోదంబున నిన్నుఁగూర్చి తప మత్యుగ్రంబుగాఁ జేయ స
త్వరతం బాశుపతాస్త్ర మిచ్చి యతనిన్ ధన్యాత్ముగాఁ జేసి నీ
చిరకారుణ్యపయోధిఁ దేల్చితివిగా శ్రీరామలింగేశ్వరా! 8

శా. కాలం దన్నితి సోము నంచును మహాకారుణ్య మేపారఁగా
లీలన్ వానిని నెత్తిఁబెట్టుకొను నీ లీలల్ కృపాలోలతల్
వీలోకించి పొగడ్త సేయఁదగమా విశ్వేశ్వరా! దేవ! మా
శ్రీలోలార్చితపాదపద్మయుగళా! శ్రీరామలింగేశ్వరా! 9

మ. భవ! లోకేశ్వర! భక్తరక్షణకళాపారీణ! విశ్వంభరా!
స్తవనీయాఖిల దేవపాపలతికాదాత్రా! కృపాసాగరా!
భవబంధోగ్రవనీకుఠారచరితా! భక్తార్తిసంహారకా!
శివ! నారాయణమిత్ర! ప్రోవఁగదవే శ్రీరామలింగేశ్వరా! 10

మ. శతమన్యుండు భవత్ప్రసాదమునఁ దా సైన్యాధిపుం గోరి యా
శతపత్రాంబకు జీరి నీపయినిఁ జంచస్ఫూర్తిఁ బుష్పాస్త్రముల్
శతముల్గా నిగుడించి మోహపఱుపన్ సారించి దృక్కీలి ని
ర్జితుగాఁ జేసి యనంగుఁ జేసితివిగా శ్రీరామలింగేశ్వరా! 11

శా. చేతోవీథిని నిన్ను నిల్పుకొని నిశ్చింతాత్ముఁడై భక్తితో
చేతోజాతహరా! హరా! భవహరా! శ్రీసాంబ! సర్వేశ! నీ
గీతంబుల్ పఠియించునట్టి జనుల స్కీర్తించు సద్భక్తసం
ఘాతంబు న్నుతియింప ముక్తి గలుగుంగా రామలింగేశ్వరా! 12

మ. శరణన్నం గరుణించువేల్పు వని యో చంద్రార్ధచూడామణీ
పరమాహ్లాదముతోడ భక్తులు నినుం బ్రార్థింపఁగా వారికిన్
బరమాశ్చర్యముగా నిహంబు బరమున్ బ్రాపించు నీ దివ్యసు
స్థిరపాదాబ్జయుగంబు గోరెద నెదన్ శ్రీరామలింగేశ్వరా! 13

మ. కమలాభర్త భవత్ప్రసాదమును నిక్కం బాత్మలోఁగోరి దాఁ
గమలంబుల్ పదినూర్లు దేఁ గొదువ కాగా నొండు నీక్షించి యా
విమలుం డాత్మను రోసి నేత్ర మెలమి న్వేదీసి పూజించినన్
కమలాక్షుం డను నామమిచ్చితివి వేడ్కన్ రామలింగేశ్వరా! 14

శా. బాణుం డెంతటి పుణ్యుఁడో మిము మదిం బ్రార్థింపఁగా వాని న
క్షీణోదారబలుండు గాఁగఁ గృప రక్షింపంగ నూహించి యా
క్షోణిం దద్గృహవాటి నిల్చితట యక్షుద్రప్రతాపంబునన్
శ్రేణుల్గట్టి సురల్నుతింపఁగ మిమున్ శ్రీరామలింగేశ్వరా! 15

శా. లంకాధీశుఁడు రావణుండు దగ నీ లావుం బరీక్షింపఁగా
శంకంబొందక వెండికొండఁ గదలించంబూని జృంభింపమీ
యంకస్థాయినియైన గౌరి యిది యేమన్నంతలో స్రుక్కి ని
శ్శంకం గావు మటన్నఁ గాచితి వుమేశా! రామలింగేశ్వరా! 16

శా. కాంతారత్నము సర్వమంగళ జగత్కల్యాణి యీ దుర్గ నీ
శాంతంజేరి భజించు భక్తులకు నిస్నేమస్థితిం గోరికల్
సంతోషంబున నిచ్చుచుండఁ గుమతుల్ స్వామీ!శివా! యంచునీ
చెంతం జేరఁగలే రదేమొకో సదా శ్రీరామలింగేశ్వరా! 17

మ. సతియా నీ సతి సర్వమంగళ జగత్సన్మాన్యచారిత్ర సం
తతమున్ భక్తుల బ్రోచు గంగ దన సత్తామాత్రచే దాసులం
జితపాపాత్ములఁ జేయు విఘ్నపతి నిర్జించున్ సదా విఘ్నముల్
శితికంఠా! నినుఁజేరి భక్తిఁ గొలువన్ శ్రీరామలింగేశ్వరా! 18

మ. తతహేమాచలచాప! భక్తజనసంతాపార్తినిర్వాప! యా
తతవిభ్రాజపటుప్రతాప! నిగమాంతస్వైరసంచారరూ
ప! తమోపఘ్నకలాప! ధూతమదనప్రాగల్భ్యసద్రూప! ని
ర్జితబృందారకశత్రురూప! సురపా! శ్రీరామలింగేశ్వరా! 19

మ. సురసంఘంబులు గూడి యో పురహరా! సోమార్ధసచ్ఛేఖరా!
శరణోహో మము గావు మంచునుభవచ్చారిత్రముల్ బాడుచున్
కరమర్థిన్ నినుఁజేరి మ్రొక్క విష మాకర్షించి భక్షించి సు
స్థిరత న్వారలఁగాచి బ్రోచితివిగా శ్రీరామలింగేశ్వరా! 20

శా. పాపారణ్యకుఠారరూప మసి త్వత్పాదంబు లిద్ధారుణిన్
రూపింపంగల మర్త్యు లెప్పుడు సదారోగ్యస్థిరాయుష్య స
ద్రూపైశ్వర్యము లంతకంత కభివృద్ధుల్ బొంద సన్మార్గులై
దీపింపంగలవారలై ప్రబలలేదే? రామలింగేశ్వరా! 2

శా. కామక్రోధముఖోగ్రశత్రుచయమున్ ఖండించు నీ నామమున్
వేమారాత్మల నెంచు జాపకులకున్ వేయేల నిర్ధారుణిన్
కామం బాత్మహితంబు గోరి తిరుగు న్కైవల్య మెల్లప్పుడున్
శ్రీ మీరన్ వెనువెంట నంటి తిరుగున్ శ్రీరామలింగేశ్వరా! 22

శా. నీ సాధుత్వము నీ మహామహిమయున్ నీ సత్యసంధత్వమున్
నీ సామర్థ్యము నీ మహావిభవమున్ నీ మూర్తిసద్రూపమున్
ఓసామీ! వినుతింప నా తరమె యో యుగ్రాక్ష! విశ్వంభరా!
శ్రీసాంబా! కృపఁజూచి బ్రోవవలె నన్ శ్రీరామలింగేశ్వరా! 23

[ సశేషము ]

# గ్రంథసమీక్ష

శ్రీ శిష్టా బాలకోటీశ్వర రావు

1. ఉత్కళశ్రీ- సాక్షి గోపాలము; అర్వదినాలుగు
పుటలు వెల రు 1–00

2. ఉత్కళశ్రీ- శ్రీ జగన్నాథము; ఎనుబదియారు
పుటలు వెల రు 1–50

3. ఉత్కళశ్రీ- కోణార్కము; ఎనుబదినాలుగు పుటలు వెల రు 2–00

ప్రాప్తిస్థానము: బి. యస్. మూర్తి, బి. ఏ; సి. టి; టీచరు,
ఆగ్నేయరైల్వేహైస్కూలు,
ఖురదారోడ్డు
పూరీ జిల్లా (ఒరిస్సా)

ఈ మూఁడు పొత్తములు కవిసుధాకర బిరుదము నార్జించిన భళ్లమూడి నరసింహమూర్తి, బి.ఏ; సి. టి; గారిచే గ్రాంథికవచనమున రచింపఁబడినవి. ఉత్కళరాష్ట్రమునఁ గల సాక్షిగోపాల జగన్నాథ కోణార్కక్షేత్రములు సుప్రసిద్ధములు. ముముక్షువు లగు భారతీయులకు దర్శనీయములు. ఈ పుణ్యస్థలత్రయమునుగూర్చి యపురూపమైన చరిత్ర నెంతయుఁ బరిశోధించి పండితపామరులకు సంయుక్త మగు నటులు వ్రాసి యాంధ్ర దేశీయుల కందించిన మూర్తిగారి యభిలాష యుగ్గడింపఁదగినది. వీరీగ్రంథములను వ్రాయుటకు కొంత పరిశ్రమ గావించిరి. ఈ క్షేత్రములను గుఱించి తెలియఁజేయు ననేకగ్రంథములను చదివి చర్చించి నిశ్చయించుకొన్నపిదపనే మూర్తిగారు వీనిని రచించి రనుటకు తమ పుస్తకములయం దిచ్చిన ప్రముఖరచనల పట్టికలే నిదర్శనములు.

సాక్షిగోపాలమునందలి ప్రస్తావనలో 'యథార్థబాహ్యము, విశ్వాసదూరము నగు నభిప్రాయము కొన్ని పాఠ్యపుస్తకములలో గూడ వ్రాయఁబడియున్న' దని నుడివి తాము వెల్లడించు కథల నరసి నచో సత్యము స్ఫురింపఁగలదని మూర్తిగారు తెల్పిరి. సత్యాన్వేషణా

సక్తి ప్రశంసనీయమే! సత్యము గ్రాహింపవలె నని ప్రయత్నించిన వీరి 'సాక్షిగోపాలము' పఠించినచో లభించునది నిరంతరాయముగ వినిపించుచున్న మహాశ్చర్యకరకథాపరంపరయే! నిక్కువమేదో విస్పష్టముగ చూపఁగల యాధారము లేమియును లేవు.

ఇట్టి రచనలు చేయునపుడు భావావేశము కల్పనానురక్తి సుదీర్ఘ సమాసములు నుపయోగింపవు. సులభశైలిలో స్పష్టముగ వ్రాయఁగల నేర్పు మాత్రమే పాఠకులను రంజించును. "మంజులమంజుళకుంజ మంజరీమధురసధారలచే" "మానితమానినీమణీసుధాపూరవచో విలాసములచే"— ప్రౌఢముగ నారికేళపాకమున రచింపవలెనని యాశించి ప్రారంభించిన "వృద్ధయిలవేలుపు, వృద్ధమహీవేలుపుపెద్ద, ప్రగాఢనమ్మిక అల్పాతియల్పుడు, స్వర్ణకన్నె గేదఁగి, ద్వితీయనాడు, తృతీయనాటికి, దక్షిణబెంగాలు వంగలవంగులు, రాజబందుగులు" మున్నగునవి సంభవించి రచనను వికృత మొనరించును. ఆహారించు, బాహించు వంటి ప్రౌఢప్రయోగములందు వీరికిగల కాంక్ష శకటరేఫాద్యానుస్వారాదుల యందెందులకు లేదో తెలియదు. నియమబద్ధ మైన భాషలో వ్రాయవలె ననిన సనాతనుల ననుకరించుట యొక్కటే చాలదు. ఆ యనుకరణముల నోరులు కనుఁగొనకుండఁ జేయఁగల పాటవము గూడ సంపాదింపవలెను.

ఏమైనను కవిసుధాకరులైన వీరు రచించిన యీ మూఁడు పుస్తకములు పఠితల నాకర్షించును. సుదూరమున నున్న క్షేత్రత్రయముయొక్క ప్రఖ్యాతిని చదివి మోదించు కోరికగల 'పండితపామరుల' కివి యవశ్యపఠనీయములు. అచ్చటచ్చట సందర్భానుసారముగ ఛాయాచిత్రము లున్నవి. పుస్తకప్రాశస్త్యమును వెలార్చు పీఠికలు, రెండు మాటలు గూడ నున్నవి. "నిష్కళంకహృదయముతో నిర్వ్యాజభక్తితో" నిట్టి కృషి చేసి కృతార్థులైన భళ్లమూడి నరసింహమూర్తిగారు సమధికోత్సాహముతో ననల్పగద్యపద్యకావ్యములు నిర్మాణించి వాణి నర్చింతురని మా విశ్వాసము.

# సంపాదకీయము

ఆంధ్రీకరణసమస్యాపూరణవిషయమున మేమిదివరలో సూచించి నిర్ధారించిన వ్యవధి పరిగణింపకుండ నింకను గొందఱు విలిఖించి పంపుచున్నారు. వానిని సక్రమపద్ధతిలో ముద్రింపించుటకు మాకు వీలు కలుగకున్నది. కష్టించి కవి రచించినయవి ప్రచురింపఁబడకున్న నతఁడుపడు మానసికవ్యథ నెఱుంగుటచే ప్రస్తుతము సంపాదకీయము విరమించి యకాలాగతము లగు నీ రెండాంధ్రీకరణసమస్యాపూరణముల నీదిగువ ప్రకటించుచుంటిమి. ఇటుపై మన మీవిధానమును విడనాడుట తప్పదు.

శ్రీ వారణాసి శ్రీహరిరావు, సాహితీసమితి, ఎలమంచిలి.

ఆ. వె. పరఁగ నల్లి దోమ బాధించు రేలను,
యాచకులును నీఁగ లెన్నఁ బవలు;
ఎఱ్ఱచీమ, భార్య యేప్రొద్దు పీడించు
శ్రీశవారణాసి శ్రీహరీశ.

మ. చెలి తా నన్యగృహంబు జేరుటను సచ్ఛీలంబు గోల్పోవె నీ
పలుగాకిన్ భరియింప; రావణునికొంపం జెడ్డ స్త్రీ నేలు వెం
గలియా రాముడ నేనుగాననుచు బల్కాడ్యాడ్తలం గూయు చాఁ
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్ కాంతారసంవాసమున్.

"సాహిత్యవిశారద" డా. మల్లిబాబు, నరసాపురము.

తే. గీ. రేయి దోమలు నల్లులు రేఁగి బాడువ
పగలు నీఁగలు యాచకుల్ వ్యథ నొనర్ప
రేబవళ్లొక్కరీతిగా రేఁగి మూఁగి
భార్యలున్ జీమలు మిగుల బాధ గూర్చు.

మ. కలిచేతన్ గొనిపోయె రావణుఁడు భూకాంతాత్మజన్, రాముఁడున్
గలిచేతన్ గొని తెచ్చె సీతను ప్రజాకళ్యాణకాంక్షారతీ
కలిచేతన్ సతి నంపె కారడవికిన్ గాంతుండు శ్రీరాముఁ డా
కలిచేతన్ జనకాధిపాత్మజ గనెన్ కాంతారసంవాసమున్.

సంపాదకుఁడు
ప్రౌఢకవిచంద్ర, కాకరపర్తి కృష్ణశాస్త్రి.
సంపాదకసహాయుఁడు
శిష్ట్లా బాలకోటీశ్వరరావు.

కుతూహల జయజయ కాళీయఫణిఫణారంగస్థలపటునటనాకృత
కోలాహల జయజయ నీలాలకభృంగావృతజలరుహనిభముఖజితశశిమం
డల జయజయ సుభ్రూమదనశరాసనసంధీకృతసుమశరనిభలోచన
జయజయ కాంచనకోరకవంచనచంచుసునాసాంచిత భవమోచన
జయజయగోపీతాపనివారణసాధుసుధాపూరిత మధురాధర జయజయ
కంఠవిడంబితకాంబవసౌభాగ్య మురాంతక ధృతభూధర జయజయ
కమలాకుచతటకుంకుమచర్చాలంకృతవక్షోరాజిత జయజయ కలనిక్వాణ
మణికంకణచారుకరాంబుజ దివిషత్పూజిత జయజయ మృదుతరనవ
బిసలతికాసంకాశభుజాస్తంభవిభాసుర జయజయ దామాంకితపటు
రేఖాసందేహదవళిభంగజితాసుర జయజయ నగనసమానవలగ్నా
శ్రయరశనాధృతకింకిణిభూషణ జయజయ నిశ్చలవిద్యుల్లతికాసమచేలక
టీతటమృదుభాషణ జయజయ దిగ్గజకరగురుశోభాచారూరుద్వయ విన
తాఖండల జయజయ జానూన్నతినిర్జితకాంచనకాహళ సంహృతరిపు
మండల జయజయ హరమకుటాంచద్గంగాజని కారణనిజపాదసరో
రుహ జయజయ వైకుంఠాలయభక్తాశ్రియఫలవినమత్కల్పమహీ
రుహ జయజయ దీనత్రాణపరాయణ శాశ్వత పురుషోత్తమ జగదీశ్వర
జయజయ దారోసబలసుభద్రాసహిత హరే మాం పాహి నిరీశ్వర. 76

చతుర్విధకందము.

సారసదళాక్ష జలదా
కారా నిహతారిజాల ఖగరాజహయా
ధీరాగ్రగణ్య జగదా
ధారా యహిశయన జలధితనయాసహితా. 77

త్రివిధకందము.

కరివరదా మునిదరదా
హరసఖ నరజనక యసురహర గిరిభర సా
గరతనయా ఘనకుచభూ
ధరపరశయ వనజనయన దరకర యభవా. 78

గీ. పతితపావన పరమేశ పరమపురుష
నతజనాదర నరసఖ నారసింహ
నీలగిరివాస నిరుపమ నిర్వికార
జయ జగన్నాథ జనగేయ జననరహిత. 79

లయగ్రాహి.

సారసదళాక్ష సురవారపరిరక్షణవి
చార నరకాసురవిదారక త్రిలోకా
ధార యఘసంచయవిదూర పదతాడితమ
హోరగ భవాంబునిధితారక వ్రజస్త్రీ
జార మునిమానసవిహార జలదాంచితశ
రీర గళశోభిమణిహార నవనీతా
హార ముఖకాంతిజితశారదశశాంక యదు
వీర జలరాశితనయారమణ శౌరీ. 80

శా. నీవే దైవతచక్రవర్తివి సభన్ నిన్నే ప్రశంసింతు నీ
చే విశ్వం బలరారు నీకొఱకు నే జేతున్ నమస్కారముల్
నీవల్లన్ భవము ల్దొలంగు నెవరు న్నీకున్ సము ల్గారయా
యావిర్భావము నందు లోకములు నీ యందేగదా యో హరీ.

క. అకలుషభక్తి జగన్నా
యకునిం బూజించి యాత్రియం బొగడుచు రా
జకుమారుఁ డందు దిరుగుచు
నొకనాడు ప్రయాణసముచితోద్యోగుండై. 82

గీ. అమృతగుండిగలును మనోహరపుటుండ
లిడ్డెనలు ఖండచక్రింబు లిష్టగంధ
భరితహరిసుప్రసాదముల్ భక్తి మెసగి
మును తరుణి గోలుపోయిన వనికి జేరి. 83

క. చని వని గని మునివృత్తిన్
దినములు గడపుచును దిరిగితిరిగి యొక శిఖా
వనతానోకహమూలం
బున గనదగు రాతిబొమ్మపొలుపు గని మదిన్. 84

ఉ. ఈ సిగ యీ మొగంబుసిరి యీ మధురాధర మీకుచద్వయం
బీ సునితంబమండలము లీ చరణాబ్జము లీ స్థిరాంగకం
బీ సొగ సెల్ల నా మదికి నెంచిన నిక్కము గాగ దోచె న
వ్వాసవదత్తరూపవిభవంబు సమం బగునంచు ఖిన్నుడై. 85

ఉ. తప్పక జూచి యా ప్రతిమ డగ్గరబోతో నృపాలశేఖరుం
డప్పుడు కేల నంటుకొన నమ్మహనీయశిలాలలామ తా
గప్పురగంధియై సభయకౌతుకవృత్తిని మ్రొక్కి సిగ్గుతో
నెప్పటియట్ల యుండ దన యింతిగదా యని సంభ్రమంబునన్. 86

గీ. అమృతపూరంబు గన్న తృష్ణార్తు నట్ల
బెన్నిధానంబు బొడగన్న పేద కరణి
సుందరీమణి నెమ్మోము జూచి ధరణి
పాలకుం డంత సంతోషభరితు డగుచు. 87

ఉ. ఎచ్చటి కేగితే జలరుహేక్షణ యిట్టి శిలాత్వ మేటికిన్
వచ్చె నికుంజగేహమున నన్విడనాడ గతం బదేమి నా
కచ్చెరు వయ్యెడిం దెలుపుమా యన రాజుమొగంబు జూచి దా
నచ్చిగురాకుబోడి తెలియందగు దెల్పెద నంచు నిట్లనున్. 88

సీ. అటు నిద్రవోవు నీకన్న ముందుగ లేచి
ఫలసంగ్రహము జేయఁదలచి దూర
మరిగితి మీకు నభ్యవహార మొసరింతు
నను బుద్ధిబూని యో జనవరేణ్య

కిలకిలార్భటులతో గలయవచ్చు కిరాత
సేనల గని యందు మాని వచ్చి
వేరొక సేనానివేశంబు గని భీతి
వెనుకకుజని బిల్వ వెఱచి నన్ను

బట్టి తెమ్మని మాయయ్య పంపినట్టు
సేనలో గానలో మిమ్ము జేరునట్టి
యాపురిలో యని యూహింప నా క్షణంబ
యుభయసేనాధిపతులు నా యునికి దెలిసి. 89

క. ఏకామిషసంప్రాప్తికి
దీకొను గృధ్రంబు లట్లఁ దీవ్రగతులచే
నా కలుషాత్మకు లిద్దరు
నా కొఱకై ఘోరరణ మొనర్చిరి కడకన్. 90

క. వీరభటారభటీదు
ర్వారశరాసారఘోరవర్ష ధనుష్టం
కారపదాతిచమూఘీం
కారముల నజాండ మెల్ల గంపము నొందెన్. 91

సీ. తవతురంగమపదోద్ధతి చేత జనియించి
ధూమ్రపరాగంబు మేఘ మన దనరె
ధూమ్రపరాగంబు మేఘచ్ఛాయ దనరార
బ్రబలమై బాణవర్షంబు గురిసె
బ్రబలమై బాణవర్షము విరాజిల్లిన
గలహాభుక్చాతకక్షామ మెడలె
గలహాభుక్చాతకక్షామంబు దీరిన
నమరకాంతావివాహంబు లయ్యె

నట్ల యద్భుత మొదవె యూథాధిపతులు
పరశుపట్టసముద్గరప్రాసచక్ర
భల్లకరవాలఫలకవిభ్రాజమాన
హస్తులై డాసి చెలగి పోరాడునపుడు. 92

చ. విఱుగు రథంబులుం బాడలువెట్టుక బంధములున్ ధరిత్రి బె
ట్టొఱగు గజంబులుం బదము లూదగ దోఁచక భీతి దిక్కులం
బఱచు హయంబులున్ శరనిపాతతనూద్గతరక్తవర్షము
ల్గొఱల నటించు వీరభటులుం గలుగన్ రణ మొప్పె నయ్యెడన్.

సీ. చలనీలభూధరసంకాశవేదండ
కాండముల్ మేఘసంఘములు గాఁగ
జితవర్ణాంకవిశేషితధ్వజనూత్న
పటకాంతు లింద్రచాపములు గాఁగ
బటురవోద్భటవీరభటసింహనాదముల్
రమణీయగర్జారవములు గాఁగ
కరవాలచకచకస్ఫురితదివ్యపరిభ
ల్లలితసౌదామనీలతలు గాఁగ

వరధనుఃప్రేరణంబున జొరచునట్టి
శరపరంపర ఘోరవర్షంబు గాఁగ
ప్రావృడారంభసంరంభభరిత మనుచు
బోల్ప నొప్పారె నమ్మహాద్భుతరణంబు. 94

సీ. హరిహరి యనుచు నంబరవీథి నానంద
భరితుడై సురమానివరుడు దిరిగె
దగు భూషణములు నూతనములై కనుపట్ట
భూతనాథుండు సొంపుగ నటించె

నభినవప్రియసంగమాత్యంతరతి జెంది
యప్సరస్త్రీనికాయంబు పొదలె
నాకలి దీర నొయ్యారంబుతో భూత
బేతాళగణములు పేర్చి యార్చె
గొండలై యున్న యామిషఖండములును
దొఱగు రక్తస్రవంతులు ద్రుళ్లు తలలు
దెగిన భుజములు ధారుణి ద్రెళ్లు కాళ్లు
ద్రోవులై పడ్డ ప్రేవు లద్భుతము సేయ. 95

వ. అట్లు. 96

గీ. ఉభయబలములు పోరాడుచుండు నంత
నచట కేతెంచె యోగవిద్యావిశేష
కరతలాంచితజపమాలికామనోజ్ఞ
మూర్తి యై యొప్పి యొక సిద్ధమునివరుండు. 97

సీ. పటుజటాజూటంబు భసితత్రిపుండ్రంబు
గండలంబితతామ్రకుండలములు
ధవళయజ్ఞోపవీతంబులు గాంచన
యోగపట్టికయు శాతోదరంబు
దీర్ఘకూర్చం బనిందితతనూవిభవంబు
బదముల మణిమయపాదుకలును
కరమున జలకుండికయు నాగబెత్తంబు
శ్రుతితలద్విగుణాక్షసూత్రకంబు
గలిగి యడుగిడి యడుగిడి నలిననాభ
చక్రహస్త మురాంతక శ్యామలాంగ
కృష్ణ కేశవ పాహి లక్ష్మీశ యనుచు
నమ్మునీంద్రుండు వనికి డాయంగ నరిగి. 98

క. చారణవినుతుం డమ్ముని
మారణకృత్యంబు లొదవె మద్వనిలో నే
డీ రణ మొనరించుటకుం
గారణ మీ సారసాక్షిగా యని కడకన్. 99

క. అంతేవాసులు గొలువఁగ
నెందే తన యాశ్రమమున కేగుచు రోషా
త్యంతకషాయత చలనే
త్రాంతుం డై నన్ను జూచి యలుకం బలికెన్. 100

మ. రమణీ యెవ్వ తె విద్వనస్థలికి జేరం గారణం బేమి యీ
సమరం బంతయు నీ కతంబునగదా జన్మించె నస్మద్వనాం
తము నీ రాకనె భగ్న మయ్యె నిక సౌందర్యంబుతోడన్ శిలా
త్వము గై కొ మ్మని శాప మిచ్చినను జింతంజెంది యే నంతటన్.

మ. అనఘా మత్పతి నిద్రవోవ ఫలమూలాన్వేషణార్థంబు నీ
వనికిన్ వచ్చితి నన్ను జూచి జనితవ్యాపాదు లై పేర లీ
ఘనయుద్ధం బొనరింపఁగా దొడఁగి రో కారుణ్యపూర్ణాత్మ యిం
కను శాపావధి దెల్పి నన్ను గృపతో గావంగ దే వేడెదన్. 102

గీ. అనిన విని యమ్మునీంద్రుండు గినుక మాని
నన్ను దయజూచి యి ట్లను నలిననయన
నీ ప్రియుం డిందు జనుదెంచి నీ శరీర
మంటికొనఁ గల్గు చైతన్య మప్పుడు నీకు. 103

శా. ఆ రీతిన్ మునిరాజు వల్కె చనె దా నల్లైతి నంతన్ నృపుల్
పోరాటంబులు మాని యిద్దఱును దత్పుణ్యాటవీవాటికా
దూరక్షోణికి బోయి రెంతయును నిర్ఘాతాశు లై తావక
శ్రీరమ్యాంఘ్రులు చూడగంటిని ధరిత్రీవల్లభా నేటికిన్. 104

వ. అని యవ్వనిత తన వృత్తాంతఁ బెఱిఁగించిన విని రాజు వికసిత నేత్రారవిందుండును బ్రమోదమేదురస్వాంతుండును నై యున్న యెడ నచ్చోటికి మకరందుండును తత్ప్రియసఖులునుం జనుదెంచి నంత నమ్మహీకాంతుండు నిజపురాభిముఖుండై జనుచుండె నటమీఁది వృత్తాంతంబు. 105

మ. శమితస్వాంతరమిత్ర మిత్రనిభ తేజఃపుంజప్రతా
పమహత్వస్థిరగాత్ర గాత్రిఘుహరప్రఖ్యాతిమత్పుణ్యభా
గ్యమితోద్యద్గుణపాత్రి పాత్రిధికసద్వ్యాపారబాహాగ్రసం
భ్రమలీలాధృతగోత్ర గోత్రరిపుపౌరశ్రీలసచ్ఛాత్రివా. 106

క. నీలఘనాఘనగర్జా
కోలాహలవాక్ప్రచండ గురుగుణకాండా
లీలావతీమనోభవ
లీలాదండోడుమండలీకరగండా. 107

పంచచామరము.

సరోరుహాక్ష పాదసారసద్వయీవిభావనా
ధరానురాగ తుల్యదాన ధారుణీ ధురంధరా
సురాపగా పటీరహీరశుభ్ర కీర్తిభాసురా
చరప్రికాండ దండితారి జాల సద్గుణాంచితా. 108

గద్య

ఇది శ్రీ వక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర భాస్కర
సుకవిపుత్రి విద్వజ్జనవిధేయ వీరభద్రినామధేయవిర
చితం బైన వాసవదత్తాపరిణయం బను మహా
ప్రబంధంబు నందు చతుర్థాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు.

# వాసవదత్తాపరిణయము

## పంచమాశ్వాసము

శ్రీలావణ్యావతికరు
ణాలబ్ధైశ్వర్యధుర్య నగధైర్య దిగం
తాలంకృతనిజగుణమణి
జాలా మాధవనృపాల జననుతశీలా. 1

వ. అవధరింపు మనంతరకథాక్రమం బట్టియెడ గుసుమపురంబులోన. 2

క. చందనకవాటవరసం
క్రందనమణికుడ్యవజ్రికమనీయధరా
వందనమాలాంచిత మగు
కుందనపుంబనుల కొలువుకూటములోనన్. 3

సీ. ఒకచెంత వీరరాహుద్గణంబుల లోవ
వందిబృందంబులు సందడింప
నొకదండ దండనాయకులలో బరమన్నె
రాయబారులు ఘనప్రతిభ మెఱయ
నొకచెంత బంధురాజకుమారవితతిలో
హితపురోహితచమూపతులు మెఱయ
నొకపజ్జ శాస్త్రజ్ఞనికరంబులో మహా
కవిసార్వభౌములు కడక నమర
గనకకంకణఝుణఝుణత్కార మెసఁగ
రమణు లిరుచక్కియల చామరములు వీవ
జెలువుమీరంగ శృంగారశేఖరుండు
హాళి బేరోలగం బున్న యవసరమున. 4

చ. ముఱిపెపు నెన్నడన్ జరణముల్గనుపట్ట నితంబమండలిన్
మెఱయు సువర్ణమేఖల సముజ్జ్వలమై దనరార జెక్కులం
దొఱగెడు ఘర్మబిందువులతో వదనాబ్జము వాడుజూపగా
బిఱబిఱ నేగుదెంచె నొక బిత్తరి యత్తరి దత్తరించుచున్. 5

ఉ. వచ్చిన కొల్వుసాలపెదవాకిలిచెంత నృపాలశేఖరుం
డచ్చిగురాకుబోణి వదనాబ్జము గన్గొని యింగితజ్ఞుఁడై
యచ్చటివారి నేగు డని యంతిపురంబున కేగి గుంపులై
యచ్చెరు వొందు సుందరుల నందఱ గన్గొన వారు రాజుతోన్. 6

క. ధరణీశ యెవఁడొ యంతః
పురమున కేతెంచి నిఖిలమోహనమాయా
గురుబలుఁడై జలజాస్యం
దరుణిం గొని చనియె నీసుతన్ నిర్భీతిన్. 7

ఉ. చిత్రము పోటుటీగయిన జేరగనోప దటంచు దెల్పగా
వృత్రహుఁడో మహేశ్వరుఁడొ విష్ణుఁడొ ధాతయొ గాక భూమిభృ
న్మాత్రున కిందు జేరదగునా యని యద్భుత మంది యందఱున్
నేత్రములందు నశ్రువులు నించి వచించిన జంచలాత్ముఁడై. 8

చ. కుసుమపురీశ్వరుండు దన కూతువిధం బవరోధభామినీ
విసరము దెల్ప శోకభరవిహ్వలుఁడై కడుజింత నొంది తా
దెసలకు బంపువెట్టె నతిధీరుల ధీరత మీఱి నేడు మీ
రసదృశభంగి పట్టి నరయందగు నంచు వచించి యంతటన్. 9

క. చారుగుణయుతులు విమలా
చారులు చారులు నృపాలుచరణంబులకున్
జేరి నతిజేసి యపుడు ర
యారూఢమనస్కు లగుచు నరిగిరి కడకన్. 10

సీ. వైజయంతీసముజ్జ్వలమణిప్రాసాద
బహుళనానాదేశపట్టణములు
శుకపికశారికానికరకోలాహల
ప్రకటితకాననాభ్యంతరములు
గంధరామందిరాంగణనటత్కిన్నర
గానమనోహరక్ష్మాధరములు
మల్లికావల్లికావేల్లితసుమకుంజ
మదభృంగతతనదీనదతటములు

వెదకివెదకి వింధ్యవిపినమార్గంబున
జనిన రాజకన్యజాడ లచటి
వారి వలన నెఱిగి వార లంతట గొన్ని
దివసములకు రాజుసవిధమునకు. 11

గీ. చేరి ముకుళితహస్తులై వార లపుడు
ధారుణీనాథ మీ పట్టి దారి పట్టి
చని కనుంగొంటి మవ్వింధ్యశైలనికట
గహనపథమున నిజచమూసహితు డగుచు. 12

క. కందర్పకేతునృపసం
క్రందనుడు భవత్తనూజ గైకొని హృదయా
నందంబున సఖు డగు మక
రందుని తోఁగూడి నిజపురంబున కథిపా. 13

క. చనుచున్నవాడు తథ్యం
బన విని యమ్మేదినీశు డనుమోదించెన్
ఘనహితబాంధవలలనా
జనములు సంతసము గాంచి సరసత మెఱయన్. 14

సీ. బాంధవం బొనరింప భాషింప సములకే
తగుగాని యొరులకుదగదు గాన
రారా జతండు నే రాజ నాతనితోడ
సముడ గా నను లజ్జ సంభవింప
జర్చింపనైతి వాసవదత్త గంధర్వ
కేతునకును బెండ్లి సేతు ననుచు
మత్పురాకృత పుణ్యమహిమచే నతనికి
సుత నిచ్చి ఘనుడనై చూడగంటి

నిపు డటకు బంపవలె బురోహితుల ననుచు
ధరణిపతి మంత్రితో మంతన మొనర్చి
హితుల కెఱిగించి నీతిసంయుతుల విప్ర
పుంగవుల బిల్వబంపి యుప్పొంగి యపుడు. 15

గీ. విప్రులార వింధ్యవిపినమార్గంబున
మత్తనూజ గొనుచు జిత్త మలరి
చనెదు రాజమౌళి జనమాన్యు బాటలీ
పుత్త్రవిభుని కడకు బోయి మీరు. 16

మ. రమణిన్ వాసవదత్త మత్తనయ శాస్త్రప్రోక్తరీతిన్ వివా
హముగావించెద మెల్లి లగ్న మని మే మన్నట్లుగా బల్కి చి
త్తమురంజిల్లగ జేసి మాయెడ నితాంతప్రీతి పుట్టించి నే
రము లెల్లన్ క్షమియించుమా యని నృపుం బ్రార్థించి ధీచాతురిన్.

క. నా విన్నపంబు తగ న
బ్భూవిభునకు దెలిపి కుసుమపురిని వివాహ
శ్రీవిభవము గైకొనుటకు
రావలె నని తోడుకొనుచు రావలె నిటకున్. 18

మ. అనినన్ వేడుకతో బురోహితులు వింధ్యక్షోణిభృత్ప్రాంతభూ
వనమార్గంబున కేగి కాంత గొని శేవన్ బాటలీపుత్రద
ర్శనబుద్ధిం జనుచున్న రాజు గని ధీచాతుర్య మేపారగా
వినుతుల్ సేయుచు డాయగా జనిన యవ్విప్రోత్తమశ్రేణికిన్. 19

ఉ. మ్రొక్కి బహూకరించి నృపముఖ్యుడు నిల్చి మహాత్ములార మీ
రెక్కడనుండి వచ్చితిరి యేగెద రెచ్చటి కన్న వారలుం
గ్రక్కున మంత్రపూర్వకముగా గయి దాల్చిన యక్షతంబులన్
మిక్కిలి వేడ్క చే నృపునిమీద ఘటించి కరంబు లెత్తుచున్. 20

గీ. త్క్ష్మాపతిని పెల్లి కొడుకవు గ మ్మటంచు
దీవన లొసంగి తమ రాక దెలిపి కుసుమ
పురివిభుడు విన్నవించినకరణి బల్కి
దమ పురికి దెచ్చి లభిపు నద్ధరణిసురులు. 21

వ. అప్పుడు.

సీ. మకరందుడు నిజానుమతిని సంతస మంది
తగ బాటలీపుత్ర నగరమునకు
ఘణిహారులను బంపి బాంధవభటమంత్రి
హితచమూపతిపురోహితుల నెల్ల
రావించుటయు దూర్యరవ ముల్లసిల్లంగ
వందిబృందము మోద మంది పొగడ
గరితురగాందోళికాచ్ఛత్రచామర
ధ్వజముఖ్యలాంఛనతతులు మెఱయ
గుసుమపురపుష్పితోద్యానకుంజమంజు
పరిసరక్షోణికల్పితపటగృహాంత
రాళమున బ్రాభవం బలరంగ విడిసె
ఖ్యాతచరితుండు కందర్పకేతువిభుడు. 23

ఉ. రాజితకీర్తిశాలి మకరందుడు వేడుకతోడ నయ్యెడన్
రాజవివాహ మెల్లియగు రావలె మీ రని బిల్వఁబంచినన్
రాజకుమారశేఖరులు రమ్యవిభూషణభోజ్యుల న్మణీ
రాజుల గాన్కఁగొంచు నెదురం జను దెంచిరి సంతసంబుతోన్. 24

క. సమధికమతు లవ్విప్రో
త్తము లవ్విభునాజ్ఞ జని ముదంబలర నను
క్రమముగ దెలుపగ విని సం
భ్రమమున శృంగారశేఖరప్రభుడంతన్. 25

క. మది ముద మొదవగ సుదతుల
సదనము లలరింపబనిచె సరభసగతితో
త్రిదివప్రభునిభు డై యపు
డెదురుగ జన దలచియున్న నెలమిదలిర్పన్. 26

సీ. శ్రితు లమాత్యులు బంధుతతులు పురోహితుల్
దైవజ్ఞులు సమాన ధరణిపతులు
శృంగారవతులు తురంగమారూఢులు
వేత్రిహస్తులు దొరల్ వీరభటులు
నాందోళికాగజస్యందనవాహనుల్
చామరధ్వజసితచ్ఛత్రకరులు
వీరకాహళభేరికారవప్రకటిత
తూర్యనిస్వనసముద్యోగచణులు
వెలగి తను గొల్వ శృంగారశేఖరుండు
మదిని వెలరేగి పెండ్లికుమారు బిల్వ
నెదురుగా నేగుటయు బురోహితులు పెండ్లి
వారితోడ నెదుర్కొనవలయు ననిన. 27

అంత నవ్విధంబున నవ్వైవాహికు లిరుగెలంకులం దల్లంకక నిలిచి పటహఝర్ఝరఝల్లరీభేరికాభీరకాహళాదివిరావంబు బధిరీకృత హరిదంతదంతావళంబై రోదోంతరంబు నిండి ప్రావృడారంభ వేళాసముజ్జృంభితాంభోధరఘోష ననుకరింప నొండొరులు చండకరమండలతేజః పిచండిలమణికుండలమండితగండద్వయీచాకచక్యహారకేయూరాదిభూషావిశేషభూషితులును భూషితాశేషవస్తువాహనసంపత్ప్రశస్తి విస్తారితనిస్తులాస్తోకమహిమాభిరాములును మహిమాభిరామసామర్థ్యసమాసాదితసామంత సీమంతినీ విరచితోపచారసౌభాగ్యదురంధరులు నై గంధసింధురబంధురమంథరగమనంబులతో మందమందచందనాచల మరుత్కందళకాందిశీకశ్రమబిందుసుందరవదనేందు కందళితమందహాసవిలాసభాసురలీల నలరుచు సుగంధబంధురగంధచూర్ణంబులు జల్లులాడుచు సల్లలితసరససల్లాపంబుల నృత్తగీతవాద్యహృద్యవేణువీణారవాకలనంబుల నానందింపుచు నెదుర్కొను సమయంబున నస్తాచలాగ్రప్రత్యగ్రపద్మరాగ దేదీప్యమానరుచిరరుచిరచ్ఛాయావల్లభుండును పూర్వాచలసౌధాగ్రసముత్తుంగమంగళవజ్రకలశసంకాశకాంతి నోషధీకాంతుండును దదీయభవ్యప్రతాపమంజులకీర్తిపుంజంబులుమూర్తిభవించిన చందంబున దన్మహోత్సవవిలోకనసముత్సుకులవిధంబునం గొంతసేపు నిల్చుటయునంత సమస్తమహీభృదంగీకృతాంబరమణిమండలంబును నరుణాంగరాగరంజిత ఘనాభిరామంబును దరుణతమస్స్ఫురణంబును దారావిరాజమానంబును సముద్దీపితచంద్రజ్యోతిఃప్రకాశంబును నై యంబరంబు నవనీతలంబు నొక్క విధంబున నుండ గరదీపికాసహస్రసముద్దీపిత చిరత్నరత్ననూత్నప్రకాశంబును దురంగతరంగసంగతంబును గరటిఘటానీకప్రకరంబును శతాంగనౌకాసంగతంబును శిబికారూఢవైవాహికసాంయాత్రికంబును నై యబ్బలాంబురాశి పురేందిరావిలోకన కుతూహలంబునం జనుదేర శ్రీవత్స

లాంఛనలాంఛితుండును విశేషాంచితనిజవిగ్రహుండును శ్రీలాలోల
లీలాలాలితుండును వాహినీప్రభుమధ్యసంస్థితుండును నగు నవ్వార
పుండరీకాక్షునిపై ప్రాసాదాగ్రంబులపై నిలచి పుణ్యాంగనావతం
సంబులు చల్లు లాజవ్రజంబు సౌధయూథమందరశిఖరపరాహత
నాసీరపారావారపయోబిందుసందోహంబు చందంబున నందం బై
సముత్ఫుల్లమల్లికానుకారంబుతో దోరంబుగా సేనాపరాగవారివా
హాకరకావర్షంబు ననుకరించ నాశీర్వచన పూర్వకంబుగా నుర్వీసు
పర్వసార్వభౌములు సర్వసర్వంసహాధూర్వహుం డగు నమ్మనుజ
వల్లభునిపై సమ్మదంబున నార్ద్రార్ద్రహరిద్రాముద్రితాక్షతంబులు
రుప్పిన నవి దెప్పరంబుగ నుప్పరం బెగసి కుప్పకుప్ప లై యొప్పా
లకుప్ప యగు నప్పుడమిరేనిపై గప్పిన దుప్పటంబుపై గప్పి తదీయ
సౌవర్ణచ్ఛాయామోదాయాదంబు లై యంబరంబున నిలిచి తన్మహోత్సవ
వీక్షాదక్షు లై వచ్చి వియచ్చరు లిచ్చ మెచ్చి విచ్చలవిడిం గురియిం
చిన కాంచనకుసుమవర్షంబుడంబు విడంబింపుచు నప్పు డావిభుండు
పురాభ్యంతరంబునం జను నవసరంబున. 28

చ. ప్రమదముతోడ నే నెతగు భామిని నీతనికన్నరీతి సం
భ్రమమునడాసి యొండొరులుపై బడుచుందమి హెచ్చనయ్యెడన్
రమణులు పద్మరాగమణిరాసులుమీదికి నెక్కి నిక్కి భూ
రమణుని జూచుచుండిరి పురస్థమణీవిఘణిస్థలంబులన్. 29

చ. ధళముగ నీలరత్నములు దాచినవిప్పగు మేడమీదటం
గలికియొకర్తు భూవిభునిగన్గొన సోరణగంటిచెంగట
న్నిలిచిన దద్గృహాంబలరె నిశ్చలవిద్యుదురుప్రకాశతం
బొలిచిన నీలమేఘమున బొల్పగుపట్టణరాజవీధిలోన్. 30

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | |
|---|---|---|
| * 1 | సంపుటము | 15-00 |
| * 2 | ,, | 15-00 |
| 3 | ,, | 15-00 |
| 4 | ,, | 15-00 |
| 5 | ,, | 15-00 |
| 6 | ,, | 15-00 |
| 7 | ,, | 15-00 |

* పునర్ముద్రితములు గానున్నవి.

ప్రతులకు :

**ఆంధ్ర సాహిత్య పరిషత్తు** (రిజిష్టర్డు)

రామారావుపేట

కాకినాడ

తూర్పుగోదావరిజిల్లా.

*Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Gopalam at Republic Press MainRoad. Kakinada.*

శ్రీ శారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

ప్లవంగ - శ్రావణ భాద్రపదములు

సంపుటము 56 సంచిక 3



సంపాదకుడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీ శారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

ప్లవంగ - శ్రావణ భాద్రపదములు

సంపుటము 56 సంచిక 3



సంపాదకుడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర,
బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంవత్సరమునకు చందా
రు 3/-

విడిప్రతి
0-60 పైసలు

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

## ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)
## కాకినాడ

అధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అభినవభోజ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ మల్లావఝల సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు. బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ చిరువోలు కోటీశ్వరరావుగారు
8. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
9. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
10. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
    శ్రీ ఓలేటి వెంకటసుబ్బరాయశాస్త్రిగారు
11. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
12. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు

# విషయసూచిక



ప్లవంగ ♦♦♦ శ్రావణ భాద్రపదములు

సంపుటము ౩౬ సంచిక ౩

# వర్షఋతువు

(శ్రావణభాద్రపదములు)

తే. పశ్చిమంబున నింద్రచాపంబు వొడిచె
నిండునెలఁ జుట్టెఁ బరివేషమండలంబు
గగనమార్గంబునందు నాగడప లెగసె
నంబుధరమాలికలు దక్షిణంబు నడచె.

క. ఉఱు ముఱిమి మూలగాడ్పులు
సఱచి విసరఁజొచ్చె మదనసంహారుదెసఁ గ్రొ
మ్మెఱుఁ గుద్భవించెఁ గప్పలు
గఱరవరట్కుర్రరవవరరగ ట్టని యఱచెన్.

ఉ. తూనిఁగ లాడఁజొచ్చె దివి దూఁటి భ్రమింపఁగఁజొచ్చెఁ బిచ్చుకల్
మానక యుబ్బి గబ్బిలుఁగు మాటికిమాటికిఁ గొల్చెఁ గొమ్మపై
వాన యవశ్య మింక బహువాసరముల్ జడివట్టునం చొగిన్
వానికి వాని కాడిరి యవారణఁ బౌరులు గంచిలోపలన్.

మ. గ్రహసిద్ధాంతకళావిదుల్ సలిలనక్షత్రంబు నీహారరు
క్సహవాసంబున నభ్రవీథిఁ బరివేషస్థాయియై యుండుటన్
బహుబాధల్ వడఁగల్గు నంచుఁ దమలోఁ భాషింపఁగాఁ గంచిలో
గృహమేధుల్ భయమంది రింధనతృణక్లేశంబు చింతించుచున్.

చ. తటిదభిఘాతవేగమున ధారలు జోరున జాఱుచుండఁగాఁ
బిటిలుపిటిల్లనం బ్రిదిలి ప్రేలిపడం దొడఁగెం జతుర్దిశా
తటముల మండుచుం బిడుగుతండము కాంచిపురీజనంబుహ్రా
త్పుటములు జల్లన న్మఘవపుత్రుని పేళ్లు పదిం జపింపఁగన్.

—శ్రీనాథుఁడు



# కావ్యములందలి వారకాంతలు-
# వారికట్నములు

శ్రీ పలగాని గోపాలరెడ్డి, M. Sc;

(గతసంచిక తరువాయి)

రోవెలకు నేనెయిచ్చితి
నీవెలదికిగిన్న వేశ్యకిచ్చినయది గై
కోవచ్చునె మఱలగనా
యీవికి తిరుగెందుగలదె యిండది మఱలన్ (వైజ 4 ఆ-126 ప)

రోవెలనిచ్చుటకు రోయిడుట, రోవెట్టుట, రోవాటిడుట యనియూ పుచ్చుకొనుటకు రోవట్టుట యనియు నందురు.

సాధారణముగా వృద్ధవేశ్యమాత యీ కట్నమును నిర్ణయించి వసూలుచేసెడిది.

అదినెమ్మది వదలని చల
మొదవగ తనసుతకు బైడి యొకనిద్దురకుం
బదివేల మాడలీయక
కదియగనీ దెట్టివిటశిఖామణినైనన్. (శుక-3 ఆ-24 ప)

యీపద్యమున బైడి పద భావము స్పష్టముగా నున్నది. రూప వయో విలాసాదులను బట్టి నిర్ణయించ బడున దీకట్నము కాన ఫలాన స్త్రీ కెంత బైడియో తెలిసికొన గోరుచో తాంబూలాదులు బంపి తెలుసు కొనవలయును. దేవ దేవి చోళాధీశుని ముందు నాట్యము జేయగా

నాయకుడు బాపురే బాపురే యటంచు
కట్నములు పైడి కోర బాగాలు నంప (వైజ-1ఆ-129ప)

(పోక ఫల భాగములు=బాగాలు, వాని వ్రక్కలు=వక్కలు పోకఫలపు చెక్కలు=చెక్కలు)

పైడినిరాత్రి గాకముందే వేశ్యయింటికి పంపవలసియుండును. మధురా పురపుష్పలావికలను శ్రీకృష్ణదేవరాయలు వర్ణించుచో

చతురవచన విలాసాంగ సౌష్ఠవముల
బసిడి దా నిచ్చినట్టి యప్పణతియ అవ
బతికి కైదువలందిచ్చు రతివిధమున
విటులకిత్తురు మరివారు విరులుపురిని (ఆము—2 ఆ—22 ప)

రాజవాహన చరిత్రములో పూలబేరమున "పైడి-ముడిపూవులు" శ్లేషతో వాడబడియున్నవి.

.................................
పైడి యీముడిపువ్వులకోసగదగదె
.................................(1 ఆ—57 ప)

పైడిముందుగనే వేశ్య తీసికొనెడిదన్న విషయము క్షేత్రయ్యపదముల (116) వలననూ తెలియనగును. రోవాటిడుటను నన్నెచోడుడిట్లు వర్ణించెను.

ఉ. రోయిడబంచువారు దగరోసి లతాంగులజూచి మెచ్చుచున్
రోయిడువారునగ్గలవు రోయిడ లంజలనప్పురంబులో
రోయుచువచ్చువారు గనిరోయుచితంబుగనిచ్చి గ్రమ్మఱం
బోయెడువారు రోయిడగబొల్తుల గానగ రోయువారలన్
(కుమా—8 ఆ—133 ప)

పైడినితెచ్చినవారిని వేశ్యలు గౌరవించు విధమిది

జాలవల్లికతోడ బాగాలుదెల్ల
నాకులును గైరవళ్ళు గంధాక్షతములు
గప్పురము బైడిచెరగుల దుప్పటియును
నెదుటబెట్టిన (నవ్వీటు డిట్టులనియె) (వైజ—4 ఆ—7 ప)

వృద్ధవేశ్యవాకిట శునకంబువోలె వాకిటకాపుండి రోవెల వసూలు చేసెడిది.

తే. అవలరోవట్టి యెంతరేమైన నిద్ర
కూతుబోనీదు బోకాకుగొఱుకు కొఱకు
నాడవశ్యంబు బిలిపించు ననుపువిటుల
దల్లియల్లుండ్రబెదబూచి ధనపిశాచి (వైజ-2 ఆ-83 ప)

పాతబాకీలను నిష్ఠురోక్తులాడి నిక్కచ్చిగా వేశ్యమాత వసూలుజేయు విధము శుకసప్తతిలో గలదు.

క. ఇయ్యెడగలిగిన రోవెల
యియ్యక నాకెఱుకలేక యిటనేనింటం
దయ్యమువలె నుండగ మా
తొయ్యలితో నెట్లుగూడితో నేనెఱుంగన్.

క. పైడేమిభ్రాంతి యిదిగో
నేడిచ్చెదు ముచ్చువగల నెలత రమింపం
బోడిమి చెడదే మఱి బురి
కాడవు దగకొదవలేజగంబు లెఱుంగున్

తే. నిన్న నేనన్న యొఱగి నాచిన్నదాని
నక్కటా యోడ రేవున నమ్మికొందు
వేమిటికి కొజాఱవిడచితి విం తెకాని
యంతదబ్బఱకాడ వీవౌదొకావొ.

తే. మంచిమణులకు వెల బొసగించువేళ
హెచ్చు వెలలకు సొమ్ము జేయించు చోట
నగరి జాలెలు నీ యింటివి గిడియున్న
వింత మాకేల మా రొక్కమిచ్చి పొమ్ము (శుక-3ఆ-35నుంచి 39)

నాట్యాది సమయముల నానంద సూచకములుగా నిచ్చుదోపుల ప్రసక్తి వైజయంతీ విలాసము ఆముక్తమాల్యదలలో నున్నవి. దైవము, రాజు, బాలురు, వేశ్యలను చూచుటకు శూన్యహస్తములతోగాక దర్శనమును కానుకలతో పోవలయునన్నది లోకోక్తి.

.....పాండ్యభూపాలుండు
కొలువున్న వేళను కొమరొప్పనొక్క—
జలజరాగంబు దర్శనమిచ్చి కాంచి
యతనిమన్ననచేత నచటగూర్చుండి
......................(చొక్క—నాథ చరిత్రము-4వ లీల)

యీకానుక వేశ్యలకిచ్చుట రుక్మాంగద చరిత్రములో గలదు.

తే. దర్శనంబిచ్చె తాతలతరమునాటి
కట్టుబండియొక త్రైకు నెట్టవముగ
బరువుతోగూడు నూటయెల్ల పట్టెమంచ
మర్పణముజేసె నొక్క—శీతాంశు ముఖికి. (4 ఆ-104 ప)

మైసూరుప్రాంతమున వేశ్యనుజూడబోయిన దర్శన మిచ్చుకొనవలయు నన్న యాచార మిప్పటికిని గలదట. ప్రతిఫలములేని ఖర్చునకు దర్శించుకొనుట యను వాడుక యింకనుగలదు. నెట్టనమను కానుక వివరములు తెలియరాకున్నవి. మఱికొన్ని కానుకలు—

1. కోరికోరి చేధనములిచ్చి వేడుకొన్నాడా...(క్షేత్ర-132)
2. ..................................
తేంకణకొంకణ ద్రవిడదేశనృపాలకు లంటుకాండ్రలై
కంకణముద్రికాళికయి కానుకలిచ్చి వసింతురింట...
(వైజ-2 ఆ 71 ప)

(3) ఆళీవచః కార్పణ్యం
బాలేమల చెవులసోకిదధమాన్వయజీ
ణ్ణాలావణ్యుల పిలుపున
కై లాభము డెలిపెనేని నవి శ్రీలగుటన్.

కరదము, చేదరిశెనము, చేకానుక లీతరగతికి చెందినవి. ధనపు (జాలె) సంచులనిచ్చుట శుకసప్తతిలో గలదు.

... ... ... ... ... ... ...
... ... ... ... ... తనదు సెట్టి చొత్తులకేమో
బాసలటు బండికండ్లట ... ... (2 ఆ-112 ప)

సెట్టితొత్తులన సంగజ కేళీవ్యాపారులు, బండికండ్లన చక్రాంకిత నాణెములని యర్థము. శ్రీ పి. గణపతిశాస్త్రిగారి విశాలనేత్రాలులో శ్రీరంగమున నివి చెలామణిలో నుండెనని తెలియగలము. మైసూరు రాజులు దిండిగల్లుపై దండయాత్రజేసినప్పుడు తిరుమలనాయకుడు పాలెగాడైన రంగననాయకుని సైన్యపు ఖర్చులక్రింద 16000 చక్రపణములు కోరుట దానిని చెల్లింపలేక రంగననాయకుడు ప్రాధేయపడి 7000 లకు తగ్గించుకొనుట William Taylor తన Oriental Historical Manuscripts in the Tamil literature (2 వ వాల్యూం-171 వ పుట) లో తెలిపియున్నాడు.

ఆదాయముతక్కువైన పూర్వవిటోచ్చాటన వృద్ధవేశ్య చేయించు విధము: చదలువాద మల్లనకవి రచించిన విప్రనారాయణచరిత్రము నందు నిరంకుశోపాఖ్యానమునందు వర్ణించబడియున్నది.

విటులిచ్చెడి ధనేతరములందు చీరలు ముఖ్యమైనవి.

మాటలిక వేయునేటికి నేటిరాత్రి
చీరబుత్తెంచె నుడిగాలవారిచేత
నూరియేలిక రాజకుమారుడల్ల
పెద్దజొకల్ల పోవులపిల్లవాడు (నిరం-2ఆ-138 ప)

నేటిరాత్రి చీర బుత్తెంచుననిగాక నేటిలాత్రిచీర బుత్తెంచెనని యున్నందున పైడివలెనే "నేటిరాత్రిచీర" సంచకరముగా భావించవలసియున్నది.

వేశ్యమాతకు జెందిడివానిలో రెంటి నిట దెలిపెదను. వృద్ధవేశ్యల వెట్టినీటికై నిచ్చుకానుక ముంతవాటు విటుడురాగానే యాతని తలనుంచి పాదములవరకు రెండుచేతులతో తీసి తలపై నెటికలు విరుచుకొన్న పాదదక్షిణ ముట్టెడిది.

వేశ్యలతివైభవముగా జరుపుకొనెడి పండుగ శరత్కాలమున వచ్చు లక్ష్మీదేవి పండుగయని వైజయంతీ విలాసములోగలదు. భాగవతమున శరదృతు వర్ణనలో

క. వాజుల నీరాజనములు
 రాజుల జయగమనములును రాజితలక్ష్మీ
 పూజలు దేవోత్సవములు
 రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా.

యిట్టివర్ణనే సింహాసనద్వాత్రింశికలోననుగలదు. గుజరాతుప్రాంతములో దీపావళిప్రాంతమున లక్ష్మీపూజలు చేసెదరు. ఈపండుగకై విటులు నానాబాధలుపడి గొజ్జెలు, కోకలు, చిల్లరవెచ్చసచ్చములు, మధ్యము మొదలగునవి సమకూర్చెదరు. పొట్టేలు సమర్పించుకొనుట బసవపురాణమందలి కిన్నెరబ్రహ్మయ్య కథలోనున్నది. లక్ష్మీదేవి పండుగయని పేరేగాని ఆరోజున దుర్గాపూజలు వేశ్యలుచేసి బలులిచ్చి మధ్యమానెడివారు. లక్ష్మీదేవిపండుగ యాశ్వయుజశుద్ధదశమి(విజయదశమి) నా డగునని నెల్లూరుజిల్లా శాసనములలో నొకటైన (N. D. 1-A-29) కామిరెడ్డిపాడుగ్రామదేవత దుర్గమ్మగుడియందుగల శిలాశాసనమునుబట్టి తెలియగలదు. (శాసనపాఠము:స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర నానెదేవ మహారాజులు నెల్లూరను సకలసామ్రాజ్యము జేయుచుండి సుఖసంకథావినోదంబుల రాజ్యంబుచేయుచుండగా రాజునకు నిజభృత్యుండైన హాదపమునులుంక్కరాజు సుఖానుంను శ్రీ జయాభ్యుదయ శకవర్షంబులు ౧౧౯౭ నేటి యువసంవత్సరమున ఆశ్వయుజశుద్ధ ౧౦ లు ఆదివారమున మహాలక్ష్మీదేవి పండువునం దనకు పుణ్యాంబుగా దుర్గాపరమేశ్వరికి నైవేద్యంబునకు తం...ని కిరువది...తమ...వాలు......పూర్వకమున స్వామికిని ననుయూరిప్రభువులు దుర్గయందు దీనిని తమరెడి మారతోయధారా పూర్వకముచేసిరి. ఇదమఱపు ఆచంద్రార్కస్థాయిగా జెల్లించువారు. ఇదమఱపునకు

నెవ్వరు విఘ్నముడలంచినను గంగకఱుతం గవిల వధించిన పాపానం బోవువారు) లోపభూయిష్ఠమైనను సీశాసనము విజయదశమినే మహాలక్ష్మిపండుగయని ఒరగెడివనియు నారోజుదుర్గకు బూజలు సేయుట యాచారమనియు తెలియజేయుచున్నది. నెల్లూరు ప్రాంతమందలి పోట్లపూడిలో గ్రామదేవతకు జరిపెడిపూజలే మహాలక్ష్మమ్మకు నేకకాలములో జరిపెదరు. కాని యేడాదిలో నిర్ణీతమయినదినముండదు.

వేశ్యావిషయమై యాజ్ఞవల్క్యస్మృతిలో నిట్లున్నది.

ప్రసహ్య దాస్యభిగమే దండోదశపణః స్మృతః
బహూనాం యద్యకామాసౌ చతుర్వింశతికః పృథక్
గృహీత వేతనావేశ్యా నేచ్ఛంతీ ద్విగుణం వహేత్
అగృహీతే సమందాప్యః ప్రయానస్యైవ మేవచః.

పురుషసంభోగమే జీవనముదాగలదానికి శుల్కమీయక బలాత్కరించినవానికి పదిపణములు, పలువురుకూడిన నొక్కొక్కనికి నరువదినాలుగు పణములు దండనయు. మొదటశుల్కము దీసికొని యారోగ్యవతియైన పడతి విటుని నిరాకరించిన ద్విగుణీకృత శుల్కమీయవలెను. పురుషుడిచ్ఛగించనిచో నది వేశ్యకే జెందునని నారద సూక్తము.

వేశ్యమాత కూతుండ్రకు హితవుజెప్పెడితీరు కాళహస్తి మాహాత్మ్యములో నిట్లున్నది.

జిహ్వనాలుక జలము రాజీవదళము
నడుముగుమ్మరిపురువు దేహంబు గ్రచ్చ
కాయబూడిద ధారయని కరణి విటుల
గలసియును గలియకుండంగ వలయు లలన

యిట్టి సామ్యములుగల హితబోధ వైజయంతీ విలాసములోనను గలదు. పరమయోగి విలాసములో

... ... ... ... ... ... ... ...

ముదిసినగోరయేనె ముంజలంజయును

వయసునం గడియింప వలయుగా కరుగ

వయసురమ్మనినను వచ్చునే మగుడి......

చిన్నన్న ననుకరించిన చదలువాడ మల్లన తన విప్రనారాయణ చరిత్రములో నిట్లు వ్రాసెను.

నెటకెలుదీసి యిచ్చకము నేర్చి ప్రసంగముదీసి యప్పట
ప్పటికి నుతించి మాటలను బందిరివెట్టి నటల్ ఘటించి ము
చ్చటలెరిగించి బాస సహజంబుగ నందఱ కన్నిరూపులై
విటుల గలంచి దీయదగు విత్తము లుత్తమవారకాంతకున్.

వచ్చిపోయెడివారు వలయునర్థములు
తెచ్చియేమిచ్చినను దే తెమ్మటంచు
గోరి వేవేగగొనుటెల్ల లంజ

వారికిదగ వె......నను చిన్నన్నవర్ణన యట్టిచో నెంతో సహజముగా నున్నది.



శ్రీమజ్జగద్గురవే నమః

# మమ దేహి కరావలంబమ్

"హైమ"

శ్లో. శ్రీ శేషశైల శిఖరోజ్జ్వల మందిరాంత
ర్మాణిక్యరత్నరుచిరాసిన భాసమాన !
పద్మావతీ తనుపరీమళవాసితాంగ !!
శ్రీ వేంకటేశ ! మమ దేహి కరావలంబమ్. 1

శ్లో. వందారుభక్తజనరక్షణమప్రశస్త
ప్రావీణ్యనిష్ఠులవిశంకట చక్రహస్త !
కారుణ్యమోహనవిలోకనలోకవంద్య !!
శ్రీ వెంకటేశ ! మమ దేహి కరావలంబమ్. 2

శ్లో. మంగామనోహరసుగంధిలదేహమోహ
వ్యామోహసంచలదచంచలమానసాబ్జ !
త్రైలోక్య మంగళశుభంకర చిద్విలాస !!
శ్రీ వేంకటేశ ! మను దేహి కరావలంబమ్. 3

శ్లో. నీరంధ్రనిష్ఠుర దురంత మహాంతరాయ
ప్రాచుర్యజృంభణవిపాటనయుక్తియుక్త !
మానాభిమానకలితాశ్రిత పారిజాత !!
శ్రీ వేంకటేశ ! మమ దేహి కరావలంబమ్. 4

శ్లో. కాశ్మీరచందన మృగీమద సౌరభశ్రీ
సంప్రాపితప్రథిత భోగవిరాజమాన !
ప్రావృట్పయోధరసమంచిత కాంతికాంత !!
శ్రీ వేంకటేశ ! మమ దేహి కరావలంబమ్. 5

శ్లో. బ్రహ్మాండభారవహ వైభవరాజరాజ
ద్బ్రహ్మాదిదైవత సదార్చన కీర్తనీయ !
మాసీంద్రనిశ్చల నిబద్ధమనోభిరామ !!
శ్రీ వేంకటేశ! మమ దేహి కరావలంబమ్. 6

శ్లో. సాకల్యకల్యఘనివారణ సుప్రసీద !
దైన్యాంధతామసవిఘాత కళాధురీణ !!
దారిద్ర్యభూతపటుతాండవ కంఠపాశ!
శ్రీవేంకటేశ! మమ దేహి కరావలంబమ్. 7

శ్లో. దుగ్ధాబ్ధినిర్మథనలబ్ధ రమాధినాథ !
ఆఖీలదానవవిదారణ కార్యదీక్ష !!
రాజీవలోచన ! నిరంతర దర్శనీయ !!
శ్రీవేంకటేశ ! మమ దేహి కరావలంజమ్. 8

శ్లో. సామాన్యజీవన సమగ్రవికాసలక్ష్య
ప్రక్షాళితాఖిల జగన్నుత ! దేవదేవ !!
మందానిలోపమగుణాలయ ! వేదవేద్య !!
శ్రీవేంకటేశ ! మమ దేహి కరావలంబమ్. 9



ఓం తత్సత్ శ్రీరామాయ నమః.

# ఖండముల నామములు

శ్రీ నేమాని కుటుంబశర్మ.

భూగోళమున ఆసియా, ఐరోపా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా యను నైదు ప్రసిద్ధికెక్కిన ఖండములు గలవు. పూర్వకాలమున నాయా భూభాగముల కున్న సంస్కృతనామములే ప్రస్తుతము వాడుకలోనున్న హూణనామములుగ మార్పుచెందినట్లు తోచుచున్నది. అదెట్లన :—

1. ఆసియా :— నరపతులు, గజపతులు, అశ్వపతులనెడి మూఁడు తరగతుల నరేశ్వరులు గలరు. వారిలో చంద్రవంశజులును, దేవమీఢుని సంతతివారలునైన "అశ్వ"యనుజాతివారు కలియుగ ప్రారంభమున పంచనదీదేశమునందుగల సింధునదియొక్క రెండు తీరముల నాక్రమించి తమ భుజబలముచే గొప్పభూభాగమును జయించి, యాభాగమునకు "అశ్వ" ఖండమని నామ ముంచిరి. తరువాత నది క్రమముగ 'అసియా' 'ఆసియా', 'ఏషియా' యనుశబ్దములుగ మారినది. కాలక్రమమున నుచ్చారణలయందలి మార్పులచే ప్రస్తుతహూణ శబ్దముగ మారియుండవచ్చును.

2. యూరప్ లేక ఐరోపా :—అసలు "సురూప"యను నదియే యురూపగ మాఱెను. సంస్కృతమున 'సు' కెంతయర్థసంజ్ఞ కలదో యాంగ్లమున 'యు' యనగా నంతయర్థముగలదు. కావున 'సురూప' యనునదియే ముందు 'యురూప' క్రిందమారి పిదప "యూరప్" 'ఐరోపా' ఖండమని పిలువఁబడుచుండెను. ఆఖండము చాలభాగము మంచుప్రదేశమగుటచే మిగుల తెల్లగా గనుపట్టును, వర్ణములయందు ధవళవర్ణము మిగుల సుందరమై మనసున కానంద మొదవును.ఆకారణమున మనవారలు దానికి 'సురూప' ఖండమని నామమొసగిరి. దానికే 'శ్వేతద్వీప'మనికూడ వాడుక.

3. ఆఫ్రికా :—అసలు సంస్కృతశబ్దము "అః+పరి+అఖ" కలసి 'అఫర్యఖ' యనునది'ఆఫ్రికా'యను హూణశబ్దముగ మారెను. అః=సూర్యరథాశ్వము; అఖ (ధా) శప్-అ-అఖగతౌ-అజ్గతే=నడచు చున్న; పరిమార్గముగలది. అనగా సూర్యునిరథ మేమార్గముగుండ వెడలునో యామార్గము కలది కాన నాఖండమునకు ఆఫ్రికాయను పేరు ప్రసిద్ధమైయుండవచ్చును. భూమధ్యరేఖ ఆఫ్రికాఖండము మధ్య నుండి పోవుచున్నది. కర్కటు, మకరరేఖలుగూడ యీఖండముగుండా పోవుచున్నవి. సూర్యుడు కర్కటు, మకరరేఖలమధ్యనే ప్రయాణము సాగించును. దానివలననే యయనము లేర్పడుచున్నవి. భూమధ్యరేఖ, కర్కటమకరరేఖలుగల ఖండమగుటచే దానికి ఆఫ్రికా యను పేరు సార్థకమైనట్లు కనబడుచున్నది.

4. అమెరికా :—'అమరిక' యనుపదమునకు నివాసమున కను కూలము. అందమని యర్థముకలదు. మంచినీటి కాకరంబులగు తటాకం బులు, నెడతెగని ప్రవాహముగలిగి మండువేసవియందైన నెండిపోని నట్టి నదులు, అనేకరకములగు ఫలవృక్షములచే నొప్పి పంటలకాల వాలమైయుండి యుంటచే మిగుల వాసయోగ్యముగను, చూపునకు సుందరముగను, గనుపట్టుటంబట్టి యీఖండమునకా పేరు సమంజసము గనున్నది. అదియే 'అమెరికా' యనుపదముగ రానురాను మార్పు చెందినది. ఆఖండము దక్షిణోత్తరదిశలకు వ్యాపించియుండుటచే "దక్షిణోత్తర అమెరికా' లని పిలువఁబడుచుండెను.

5. ఆస్ట్రేలియా :—"అస్త్ర+ఆలి+అయః" యను మూఁడు పదములు గలసి "అస్త్రాల్యయః"అనునదియే క్రమముగ 'ఆస్ట్రేలియా గ మారెను. "అయః (ధా)అనగా-అయగగతౌ" లేక 'గతాగతౌ'= వెడలి వచ్చేటటువంటి, అస్త్రః=బాణముయొక్క ఆలి=సమూహము గలవారచట నుండుటచే నాఖండమునకు 'అస్త్రాలియః'యను నామము పెట్టియుందురు. ఆస్ట్రేలియా ఖండవాసులవద్ద'బూమెరాంగు'లను నాయు

ధములుగలవు. వారు శత్రువులపై నాబాణమును బ్రయోగించినచో నది శత్రువును సంహరించి తిరిగి ప్రయోగించినవానివద్దకు బోవును. అట్టి పక్షి జాతి లాఖండమున నుండుటచే దానికి 'ఆస్ట్రేలియా' యను పేరు క్రమముగ కలిగియుండవచ్చును.

పరిశీలింప ప్రస్తుతఖండనామములు పూర్వసంస్కృతి నామములనుండి కాలక్రమమున నుచ్చారణాది మార్పులచే కొలది మార్పులను చెంది వాడుకలోనికి వచ్చినవని తోచుచున్నది.



# రామలింగేశ్వర శతకము

కీ. శే. వడ్డిపర్తి నాగరాజు.

మ. ఘనమౌ సూకరరూపధారి యగుచుం గాంక్షించి మీపాదముల్
గనఁ బాతాళముఁ జొచ్చి కేశవుఁడు దాఁ గానంగలే కెయ్యెడన్
సనకాద్యాఖిలమౌనివందిత ! శివా! సర్వేశ! యంచు న్నినున్
వినుతుల్ సేయ వికుంఠ మిచ్చితివిగావే రామలింగేశ్వరా! 24

మ. సుర లాయబ్ధిజ మావిషానలముచే శోషించి యోయీశ్వరా!
కరుణం జూడు మటన్నఁ దద్విషము మ్రింగ న్గర్భమం దున్నను
స్థిరలోకంబులు గ్రాగునంచు గళమందే తాల్చి రక్షింపవా
చిరకీర్తిం బొలుపొందునట్టులుగ నో శ్రీరామలింగేశ్వరా! 25

మ. కలధౌతాచలవాస! శంకర! జగత్కల్యాణచారిత్ర! ని-
ర్మల తేజోవిభవాభిరామ! జగదారాధ్యా! శశాంకార్కమ
జ్వలనాక్షిత్రయభాస్కరా శుభకరా వారాశితూణీర భా
సిలు నీ పాదయుగంబు గోరెద నెదన్ శ్రీరామలింగేశ్వరా! 26

శా. కాలుం డుద్ధతి నమ్మృకండుసుతునిం గాలంబు నొందింప ను
ద్వేలంబౌ తనకోపవార్ధి నిగుడ న్దీపింప నో శర్వ! నన్
గేలిం జేయక బ్రోవుమన్న జమునిన్ స్రుక్కించి యత్తాపసున్
శీలం బాత్మఁ దలంచి బ్రోచితివిగా శ్రీరామలింగేశ్వరా! 27

మ. నతమందార తపంబు నీవు హిమవంతంబందు సేయంగ గో
తరి యెంతో మిము డాయ వాటిపయి నుద్దామాధికాక్షప్రసా
రత జేయంగ దదగ్ని గందినపశుల్ రాజిల్లెడున్ కాపిల
త్వతతో నంచు వరం బొసంగితివిగాదా రామలింగేశ్వరా! 27

మ. నతియో శంకర! దండ మోపురహరా! నారాయణాస్త్రా మహో
న్నతిసాష్టాంగము లంజ లిచ్చెద మహానందస్వరూపా! సదా
నతి గావించుచు నీకు మ్రొక్కెదను నన్నుం బ్రోచి రక్షింపవే
శితికంఠా! గిరిజాహృదబ్జమధుపా! శ్రీరామలింగేశ్వరా! 9[illegible]

శా. ఓకారుణ్యపయోధి! యోకరటిరక్షోదగ్రశత్రుక్షయా!
యోకామాద్యరివర్గషట్కవిజయా! యోచంద్రసచ్ఛేకరా!
యోకంజేక్షణమిత్ర! భక్తవరదా? యోపార్వతీవల్లభా!
శ్రీకంఠా! కృప నన్నుఁ బ్రోవఁగదవే! శ్రీరామలింగేశ్వరా! 30

మ. నెపమెన్నన్ వల దంటి నే నిఁకఁ దగన్ నీవాఁడ నంటిన్ సదా
కపటాత్ముండ నటంటిఁ గ్రూరుఁడఁ ననుం గాపాడుమంటిన్ భవా!
చపలాత్ముండను బాపకర్ముఁడ దురాశాబద్ధు డేనంటి నో
యి పరేశా! కృపఁ జూచి మేలుకొనవోయీ! రామలింగేశ్వరా!

శా. నీవే దాతవు దేవసంఘములలో నే యాచకుండన్ సదా
నీవే దిక్కని మ్రొక్కు భక్తులకు నెంతే వేడ్క నే మ్రొక్కెదన్
దేవా? నాదురితం బణంచి కృప నన్ దేలించి రక్షింపవే!
శ్రీవిభ్రాజితపాదపద్మయుగళా! శ్రీరామలింగేశ్వరా! 32

శా. నీ రాజత్సతి సర్వమంగళ గదా! నీమిత్రుఁ డుద్యన్మహో
దారుం డౌ ధనదుండు గా, సఖుఁడు శ్రీదారుండుగా నొప్పు నీ
చారిత్రంబు భజించుభక్తులకు సత్సౌఖ్యంబు చేకూరదే?
శ్రీరాజార్ధకిరీటభక్తవరదా! శ్రీరామలింగేశ్వరా! 33

శా. బాలుల్ నేర్చిన నేరకున్న జనకుల్ బావింతు రెచ్చంగులన్
లీలన్ తద్దురితంబు లెన్నక జగన్నాథా! కృపం జూచినన్
బావింపంగదె! దేవదేవ! యభవా! ఫాలాక్ష! విశ్వంభరా!
శ్రీలోలాంబక! భోగికంకణ! శివా! శ్రీరామలింగేశ్వరా! 34

శా. పాపారణ్యకుఠారమై సకలసంపత్సారవంతంబులై
తాపౌఘాహిసుపర్ణమై విపులవేదాంతైకసంవేద్యమై
రూపింపందగియున్న నీమహిమ లీదూషిన్ బ్రశంసింపగా
రేపున్ మాపును గోరుచుందు నెదలో శ్రీరామలింగేశ్వరా॥ 35

శా. నీమంత్రంబు జపించెదన్ భవహరా నీరూపు చింతించెదన్
సేమంబొప్పగ నీపదాబ్జములు సంసేవించెదన్ వేడ్కతో
వేమారున్ దగ నీచరిత్రములు నే వింటున్ ననుం బ్రోవవే
శ్రీమచ్ఛంకర భక్తలోలవరదా శ్రీరామలింగేశ్వరా. 36

మ. దినము న్నీవు ప్రదోషకాలమున నెంతే వేడ్కతో నృత్యమున్
దనరం జేయగ నబ్బిరించి మొదలౌదైవంబు లచ్చోట నీ
ఘనకీర్తిం గొనియాడుచున్ శివశివాగా మారి శర్వా గజా
జినచేలా యని మ్రొక్కుచుందురు నినున్ శ్రీరామలింగేశ్వరా. 37

శా. వ్యాసుండొక్కెడ విష్ణుకన్న పరదైవం బింక లే డంచు స
ద్వ్యాసంగంబున భక్తితోడ వచియింపన్ వానిబాహాయుగం
బాశక్తిన్ గుదియించవా శివ మహాహ్లాదంబుతో దేవదే
వా సర్వేశ్వర యన్న బ్రోచితివిగావా శ్రీరామలింగేశ్వరా. 38

శా. లోకాధ్యక్షుడు దక్షు డొక్కతరి నాలోకించి తా యజ్ఞమున్
నీకున్ బ్రీతి ఘటింపరానిది మహానిందాత్ముడై చేసినన్
వీకన్నాసవనంబు ద్రుంచి యతనిన్ వే శిక్షనొందించినన్
శ్రీకంఠా యని వేడ బ్రోచితివిగా శ్రీరామలింగేశ్వరా. 39

శా. నీకుం బుక్కిటబట్టు వారుణి దగన్ నిండారగా మజ్జనం
బాకల్పించుచు మాంసఖండము నయంబారంగ నైవేద్యమున్
గా కల్పించుచు బోయకన్నడు నినుం గైసేసి పూజింపగా
శ్రీకైలాసము వాని కిచ్చితివిగా శ్రీరామలింగేశ్వరా. 40

శా॥ నీ రాజద్గుణచర్యల న్నిజముగా నెన్నంగలే డచ్యుతుం
డా రాజీవభవుండునున్ త్రిదశులున్ నాకాశకేశా శివా
గోరాడ్వాహన నాతరంబె వినుతుల్ గూర్పన్ సదా నీవె నన్
శ్రీరంజిల్లెడునట్లు బ్రోవవలయున్ శ్రీరామలింగేశ్వరా. 41

శా॥ ధ్యానం బాత్మని మేషమాత్రమయినన్ ధైర్యంబుతో నెట్టిదు
ర్మానుండైన ఖలుండునైన నథికోన్మత్తుండు డా నైన యా
తనిమన్నించి

శా॥ నిన్నావాహనజేసి మానసమునన్ నిండార బూజింపుచున్
గన్నారం గనుగొంచు నీమదికి నెంతే బ్రీతి గావింపుచున్
విన్నాణంబుగ గొల్చుమానవులకున్ వేవేగ నిర్ధారుణిన్
జెన్నొందన్ సిరు లేమి యబ్బుటరుదో శ్రీరామలింగేశ్వరా. 43

శా॥ పంచాస్యానన మిత్తు దేవ యని నిన్ బ్రార్థించి తా నాత్మలో
జంచద్భక్తిని నీదు పాదములు సంస్థాపించి త్వద్రూపమున్
ఏచంగల్గినయట్టి మానవు డొగిన్ హేలాగతి న్మించి రా
జించున్ బాతకకోటిముక్తికరుగున్ శ్రీరామలింగేశ్వరా॥ 44

శా॥ నీ కర్పించెద బాద్య మంచు మిగుల న్నేర్పొప్పగా సన్మతిన్
జేకో శంకర భక్తరక్షణకళాశీలా యటంచు న్నరుం
డాకల్పోక్తవిధిప్రకారమున బూజాయత్తుడై యిచ్చి నన్
శ్రీకంఠా కృపజూచి బ్రోచెదుకదా శ్రీరామలింగేశ్వరా॥ 45

శా॥ అర్ఘ్యం బిచ్చిన దేవదేవ యని నిన్నాసక్తి బూజించుచున్
దీర్ఘక్రోధనుడైనవా డయిన నిన్ గీర్తించి సద్భక్తితో
దైర్ఘ్యం బొప్పగ సాగి మ్రొక్క నరుదందన్ వాని రక్షించునీ
దైర్ఘ్యం బైనకటాక్షవీక్షణమె కాదా రామలింగేశ్వరా॥ 46

శా॥ దేవా యాచమనంబు నీ కొసగెదన్ దిక్పాలకాభీష్టదా
వేవేగన్ గరుణించుమంచు వినుతుల్ వేసేయుపుణ్యాత్ములన్
గావన్ బ్రోవను కర్తవై జగములన్ గాపాడుచున్నట్టి నిన్
సేవింతున్ నను బ్రోవు వేడ్క లలరన్ శ్రీరామలింగేశ్వరా॥ 47



శ్రీరామాయ నమః.

# అనౌచితి

"ముక్కంటి"

ప్రవర్ధమానకవి యొకఁ డుద్దాలకునిగాథను పద్యములలో వ్రాయుచు నామహర్షి శిఖను గర్భవతి చనుమొనతో నుపమించినాఁడు; అది కాళిదాసుని దీపశిఖకు దీటైన దని యాతనితలంపు కాఁబోలు !! అట్లనాలోచితముగ వ్రాయుటలో నౌచితి యేమున్నది ? అనౌచితి కాటపట్టయిన కవిత ఛందస్సుందర మైనను వ్యాకరణపాండిత్యప్రకర్షా స్పదమైనను మనోహరాలంకారవిభాసుర మైనను సదుదాత్తకథా మధుర మైనను నిరుపమవర్ణనాకర మైనను దాని నెవఁ డాస్వాదించి మోదింపఁగలఁడు ? ఔచిత్యహీన మైనకార్యము సుగుణము లెన్ని కలిగియున్నను పఠనయోగ్యము కా దని, యది నిర్జీవసుందరీమణివంటి దని లాక్షణికుల యభిప్రాయము. సభ్యత నెఱిఁగినసాహిత్యాభిమాను లందఱినిశ్చితాభిప్రాయము నిదియే ! కావుననే సకలవిద్యాసనాథుఁ డగు శ్రీనాథుఁడు శృంగారనైషధమున "ఔచిత్యం బాచరించియు నన్నౌచిత్యంబు పరిహరించియు" నని వ్రాసికొనినాఁడు. ఎట్టిదోసము నైనను సహింపవచ్చునుగాని యనౌచిత్యదోషమునుమాత్రము సైరింపగూడదు. సమాజము నమలినాదర్శములతో నకుటిలమార్గమున నడిపింపఁగలిగినది సాహిత్యము. పాక్షికబుద్ధిని వర్జించి కించిత్కాఠిన్యము మాని యందలిదోషములను నిశితముగఁ బరిశీలించి ఖండింపఁగలవారు పండితులు. ఈ సముచితకార్యము సర్వసమ్మతముగ నేనాఁ డారంభింపఁ బడునో యానాఁడు మనభాషాసంపద కళంకరహితమై కళాపరిపూర్ణమై ప్రపంచభాషలలో తలమానిక మగును.

దోషములం దగ్రగణ్యమైన యీ యనౌచిత్యదోషపిశాచము సుప్రసిద్ధాంధ్రమహాకావ్యప్రబంధములలో స్వైరవిహారము గావించినది. ఆయా గ్రంథములను నిర్దాక్షిణ్యముగ శోధించి దానిని గుర్తించి పరిహరించుట యుక్తము.

నన్నెచోడదేవుఁడు

క్రీ. శే. 1130-50 ప్రాంతమున నన్నయకుఁ బిమ్మట తిక్కనకుఁ బూర్వము జీవించి సారస్వతసేవ సల్పినవాఁ డని విమర్శకులలో నత్యధికసంఖ్యాకులచే విశ్వసింపఁబడుచున్న యీతఁడు మొదటి యాంధ్ర కుమారసంభవమును స్వతంత్రముగ రచించి ఖ్యాతిఁ గన్నవాఁడు. టెంకణాదిత్యుఁడు, కవిరాజశిఖామణి యనుబిరుదములు పొందినవాఁడు. వీరశైవుఁడు. తనగురుదేవుఁ డగు జంగమమల్లికార్జునునకుఁ గైలాస వాసి యగుపరమశివునకు నభేదము గల్పించి మురిసినమహాభక్తుఁడు. ఈతఁడు వ్రాసిన కుమారసంభవమహాకావ్యము నాఁటినుండి నేఁటివఱకు పలువురు విద్వత్కవివతంసులచే శ్లాఘింపఁబడినది. ముఖ్యముగా వీరశైవు లగుపండితులకు గవులకు విమర్శకులకు నీతనినామము పంచాక్షరివంటిది. ఈతని కావ్యము సాక్షాచ్ఛివసందర్శనమే !!

"దేశిమార్గపద్ధతులను దేశీయములుగా నొనర్చి మహాకావ్య లక్షణములను దెలిపి, యాంధ్రవాఙ్మయమున ప్రత్యేకవిశిష్టత బడసిన ప్రబంధవాఙ్మయమునకు శ్రీకారము చుట్టినకవిరాజశిఖామణి నన్నెచోడకవి" యని వావిళ్లవారిచే 1953 లో ప్రకటింపబడిన కుమారసంభవపీఠికలో శ్రీనిడుదవోలు వేంకటరావుగారు ప్రశంసించిరి. స్పృహణీయ మైన యీ పొగడ్తను కాదని వాదించుటకు ప్రయత్నించువా రెందఱు ? కా దనినంతమాత్రమున ముగియుట కిది సాధారణ మైన కార్యమా ? కర్త కవిరాజశిఖామణి. కావ్యము "వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" యని మహాకవికాళిదాసునిచే నుతింపఁబడిన యాదిదంపతుల పరిణయ వృత్తాంతముతో నిండిన లోకోత్తర రమణీయతాప్రతిపాదకకుమార సంభవము. అందుచేతనే యీ కావ్యరత్నమును దోషజ్ఞదృష్టితో పరామర్శింపక కేవలము గుణజ్ఞదృక్పథము నవలంబించి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు నన్నెచోడుని ప్రతిభావ్యుత్పత్తులు నసమానము లని

భూషించి పలితల నానందింపు డని కోరినారు. వారికోరిక ప్రాచీనకవిత్వాభిలాషుల కనుసరణీయమే. కాని కవిరాజశిఖామణి నిర్మాణించిన మహోత్తమకుమారసంభవమును పఠించుచున్నప్పు డక్కడక్కడ దుర్నిమిత్తములవలె తోచు నధికపదసంగములు నప్రస్తుతవర్ణనములు ననౌచిత్యపరిపూర్ణపాత్రపోషణము నేపాఠకుని బాధింపకుండును? తిక్కనాదికవీంద్రులకు మార్గదర్శకుఁడైనయీతఁడిట్టితప్పులను చేయునా? చేయఁదగునా? అయిన నీ శ్రవణకఠోరములైనదోషములు కావ్యగర్భమున నెట్టు లెందులకు దాఁగియున్నవి?

నిరక్షరాస్యులకుఁ బామరులకుఁగూడ జుగుప్స గలిగింపఁగల యీ సన్నివేశము నించుక సూక్ష్మదృష్టితోఁ బరికింపుఁడు. పార్వతి తపస్సు జేసినది. శివుఁ డామె దీక్షాదక్షతకు సంతోషించి సాక్షాత్కరించి మెప్పించినాఁడు. గిరిజను పెండ్లాడుటకు నిర్ణయించుకొని సప్తర్షులను రావించి తననిశ్చయము నెఱిఁగించినాఁడు. సప్తర్షులు హిమవంతుని దర్శించి పరమేశ్వరునకు బార్వతి నిచ్చి వివాహము గావింపుమని కోరినారు. శీతభూధరనేత హర్షముతో నంగీకరించి పుత్రికను మహర్షులకు జూపించినాఁడు. వారామెసౌందర్యము నాకళించుకొని దీవించి తిరిగివచ్చిరి.

—"హరిపరమేష్ఠిపురందరాధీశ్వరుండైనపరమేశ్వరునకు నగజ సమస్తప్రశస్తలక్షణలక్షితాంగోపాంగవిశేషంబులు వర్ణించి వెండియు (అష్టమాశ్వాసము, 4.)

సమస్తప్రశస్తలక్షణలక్షితములైన పార్వతియంగములు నుపాంగములు తద్విశేషములు నిశితపరిశీలనము సలిపినవారగుటవే నెచ్చటను తడవుకొనక శ్రవణపేయ మగునట్లు లీశ్వరునిసమక్షమున వర్ణించి రనఁగా హిమగిరిరాజతనయ శరీరమునందలి సర్వరహస్యములను పుట్టుమచ్చలను గూడ శర్వునకుఁ దెలియఁజెప్పిరి. బళిరా! నన్నెచోడదేవమహాకవీ! తావకలేఖిని సర్వజ్ఞము !!

అనావిద్ధరత్నమువంటి యుమను, జగత్పిత యగుశంకరుని భార్యయై జగన్మాత కాఁబోవు పరమపవిత్రమానవతిని సర్వమంగళ యని భవిష్యత్తున స్తవింపఁబడఁగల సద్వర్తనాంచితను తపోవ్యాపారనియమబద్ధులు, సకలశ్రుతిస్మృతివేత్తలు ధార్మికులు, సత్యసంధులు త్రిలోకీపూజ్యులు నగుమహర్షులు హద్దుల నతిక్రమించి వర్ణించి రనుట క్షంతవ్యము కాదు. పోనిండు ఏమనివర్ణించిరో వ్రాయలేదు కావున నీయపరాధము క్షంతవ్యమే కావచ్చును. కాని యంతటితో నన్నిచోడుఁడీయసభ్యతకు స్వస్తి జెప్పలేదు. పార్వతియొక్క మేనిసొబగును మహర్షులు వాచించుచుండఁగా లభించును దేకము శూలపాణి యొక్కఁడే యనూభవించిన బాగుగనుండ దని యీయసహ్యమానసికవ్యాధిని పాఠకులకు శ్రోతలకుగూడ ప్రసాదింపవలె నని యెంచి వెండియు నని వచనమును ముగించినాఁడు. ఎంతసదుద్దేశము ? పదునాలుగుపద్యములలో మరల జగదీశ్వరికుచములను, జఘనమును, తొడలను స్పృసించి పరవశించినాఁడు.

క. నెఱి గలుగునాఁడు నాఁటికి
నుఱి గడవగ బెరుఁగుజఘనకుచకచభరముల్
సిఱుఁదొడలు నడుము నట్టును
విఱిగెడినో యనుచు గిరిజ వెఱచుచు నడచున్.

(అష్టమాశ్వాసము, 7 వ పద్యము)

సీ. — — —

తే. తావి పొంపిరివోవు నెత్తమ్మివలన
నెలయుకంపారి తెమ్మెర ల్వీచునట్లు
కమ్మవాతెఱవాసన గలసి కలయ
సోడుముట్టుచు నూర్పులు నుడియుచుండు. (9 వ పద్యము)

కన్యార్థులై చనినపెద్దమనుజులు కన్య సౌందర్యవతి యా కాదా యని పరిశీలింతురు. నిజమే ! కాని యింత పచ్చిగా జఘనవిస్తృతి,

కుచసౌభాగ్యము తాఁసులో నుంచి తూచునట్లు తిలకింపరు. అట్లు పరీక్షించువారు గౌరవనీయులు కారు. కామాంధులు. ఆస్థితికి దిగ జాఱిన నన్నెచోడుని సప్తర్షులకు గిరిజ మందగమనమునకు కారణ మనగత మైనది. యౌవనసంపదవలన నగజ జఘనకుచకచభరములు పెరిగిన వఁట. ఆ భారము సైరింపఁజాలనితొడలు నడుము నట్టు విఱు గునేమో యనుభీతితో నామె మెల్లగ నడచునఁట! ఉత్ప్రేక్షించుటకు కవిరాజశిఖామణి మునుల కింతకంటె మంచిఘటితి గోచరింపలేదు. మితభాషు లగుసప్తర్షులు వాచాలురై యలంకారములు పొదిగి మాటాడుటగూడ నభ్యసించి చతురు లైనారు. అంతే కాదు. పార్వతి కమ్మవాతెఱవాసన, దానితో గలసి పోడుముట్టుచు సుడియుచుండు నూర్పులు నాఘ్రాణించినారు. పరిమళకలిత మైననెత్తమ్మినలస కంపును పోగొట్టుకొని వీచు తెమ్మెరలతో నామెయూర్పులను పోల్చి చెప్పిన ఋషులమనసులు నిశ్చలము లని యెవ్వ రనఁగలరు? ఇంక పరమేశ్వ రుఁడు పార్వతి యూర్పులనుగూర్చి శంకింప నవసరము లేదు.అవి సువా సనా విభాసురము లని సప్తర్షులు నిర్ధరించిరికదా !!

క. త్ర్యంబక ! నగనుతనిబిడకు
చంబులపొలు పెన్న మాకు శక్యమె ? నీడెం
దంబునకు వచ్చునట్టె భ్రు
వంబుగ వేఱొండు దగినవర్ణన గలదే ? (14 వ పద్యము)

కం. —

———

ధరణీధరవరనందన
గురుజఘనవిశేష మొరులకొలదియె పొగడన్? (15 వ పద్యము(

“శీతగిరీశ్వరుపాలి కేఁగి మత్పరిణయకార్య మోజగొనఁ బల్కి— వంబున రండు గ్రమ్మఱన్” (సప్తమాశ్వాసము, 84); మహేశ్వరు

నానతి యిది. అంతియే కాని నాకు భార్య కాఁబోవుగారిని చూచి యామె సౌందర్యమును శీలించి యావగలాడి తనువునందలి ప్రత్యణువును శోధించి పరిమాణములు నిర్ణయించి వచ్చి నాకు విన్నవింపుఁడనలేదు. శివునాజ్ఞకు సంబంధించనివిషయములనుగూడ సేకరించుకొని వచ్చిన మహర్షుల సమయస్ఫూర్తి యనంతము.

నగసుతనిబిడకుచంబులపొలుపు నెన్నుటకు మేము చాల మనివాకొనుట యెందులకు? ఆపొలుపు దెలుపుఁ డని భర్గుఁ డర్థించినాఁడా? లేదు. "సింధురకుంభాలసయానపూర్ణకుచ"యని తొలుత వక్కాణించినారు. మరల గౌరీకుచకుంతలవక్త్రము లిట్టు లొప్పు నని నుడివినారు? సంతృప్తి ఘటిల్ల లేదు. వీఁగారుచనుఁగవ వ్రేఁగున నని మఱియొకసారి కుచప్రశంస జేసినారు." ప్రణయాతిశయమునఁ బాయనిజక్కవకవయు నెవ్వలిసన్నఁగవయఁగవయొ యనఁగఁ జనుకట్టుగిరిజ కమరు" నని శ్లాఘించినారు. "తనుమధ్య యోప దీగురుఘనకుచభారంబు దాల్పఁగా" నని నూఁగారుదీఁగ గుఱించి పలుకుచు వాపోయినారు. సమస్తవ్యసనపరాఙ్ముఖులైనమహర్షుల కీకండూతి యేల? ఇఁక నెన్నిమాఱులు కుచశబ్దస్మరణము పచరించిన నది నశించును? నన్నెచోడునకే తెలియదు! మన కెట్లు తెలియును? త్ర్యంబకపదప్రయోగముచే నీ పద్య మెంతశోభావిహీనమైనదో చదువరులే యూహింపఁగలరు.

ధరణీధరవరనందన గురుజఘనవిశేషము పొగడుట కొరలకొలఁదియె యని నీరసింపవలసిన యావశ్యకత మహర్షులకు లేదు. పార్వతిపిఱుఁదుల వైశాల్యము నరయవలసినవాఁ డీశ్వరుఁడు. ఆబాధ యేదో యతఁడే పడును. ఇంతయైనపిదప నింకను లౌల్యమును విడనాడనేరక మునులు, మఱియొకపరి నగజసమస్తప్రశస్తలక్షణలక్షితాంగోపాంగవిశేషంబులు వాకుచ్చిరి. గమనింపుఁడు.

సీ. అలికేశిల క్తపాదల పాదతలములు
నమృతాంశుముఖశు క్తి కాంఘ్రియుగముఁ
గంబుకంధరవ్రీహి గర్భాభజంఘలు
బిసహ స్తరంభోరులసితరుచియుఁ
బూర్ణకుంభ స్తన పులిననితంబంబు
హరిమధ్య వేది మధ్యాభినుతియుఁ
గుంభికుంభనితంబ కోక స్తనంబులు
కరభోరుమృదుల తాకరయుగంబుఁ
ఆ. వె. గామశరధి జానుకరిముకకంఠంబును
గమఠపాద వికచకమలముఖముఁ
బల్లవాంఘ్రితలసుబర్హిణాలకములు
నజునకైనఁ బొగడ నరిదిగాదె ?

(18 వ పద్యము)

అజుఁడైనను పొగడుట కశక్తుఁ డని నిర్ధారించినారు. అప్పు డాయజుఁ డెక్కడ నున్నాఁడు? అక్కడే యున్నాఁడు. అక్కడున్నవాఁ డాతఁ డొక్కఁడే కాఁడు. హరిసురపనిలింపాసురనరాహిపతుఁ లెల్లరు నాసభయం దున్నారు. ఆ మహాస్థానమునం" దపర్ణారూపవర్ణ నాకర్ణన దత్తకర్ణుం" డైనపశుపతి మన సెఱింగి స్పష్టులింతమధురముగ మనో జ్ఞముగ బ్రహ్మ విష్ణువు వాసవుఁడు మున్నగుమహోన్నతు లాలకించు చుండ నుమావయవవిస్ఫూర్తి వెల్లడించుటలో నౌచిత్య మెంతయున్న దో యేమున్నదో సంస్కారవంతు లరయఁగలరు. ఆవేశమునకు లోఁ బడినప్పు డిట్టియుత్పాతములే యుప్పతిల్లును. నన్నెచోడుఁ డిట్లు జుగు ప్సాకరముగ పార్వతియౌవనము విశృంఖలనైపుణితో వర్ణించు టిది మొదటిసారి కాదు.

తృతీయాశ్వాసమున 42 నుండి 78 వఱకు (ముప్పదియేడు గద్య పద్యములలో) శక్తిస్వరూపిణి యైనగిరిజ సర్వాంగములను వర్ణించి

వర్ణించి వదలినాఁడు. స్మరమందిరమును, బాహుమూలములను గూడ ప్రస్తావించినాఁడు.

క. స్మరమందిరమ్ము శోభా
కరముగ మెఱుఁగారుపసిఁడికంబము లనఁగాఁ
గర మొప్పునగతనూజకుఁ
గరభోరులు వొలుచు మదసకరికరలీలన్.

(ఆ, 3; ప, 48.)

క. కేళీవర్తము లన రతి
కేళీసదనంబు లనఁగఁ గింశుకకళికా
మూలము లనఁ గామలతా
మూలము లన గౌరిబాహుమూలము లమరున్.

(ఆ, 3; ప, 55.)

కవి చెప్పుచున్నాఁడు కనుక, నాయికాసౌందర్యమునం దవియును చేరియున్నవే కనుక సహింపవచ్చు నని కొందఱివాదము. దీని నామోదించి యచ్చట నౌచిత్య మున్న దని భావించినను, మునులు పవిత్ర సభాంగణమున నాయకునితో నాయికనుగూర్చి యింత నికృష్టముగ చెప్పుటలో ననౌచితియే స్ఫురించుచున్న దని సిద్ధాంతీకరింపక తప్పదు. కవిరాజశిఖామణి కవనమునం దెంతప్రీతి భక్తియున్నను నీ సన్నివేశమును సమర్థింపలేము. ఏవియో కుతార్కాణములు చూపి సమర్థింప యత్నించుట శశవిషాణము సాధింప శ్రమించుటయే యగును.

అతిహేయ మగు నిట్టియనౌచితి యీ ఘట్టమున నెందులకు సంభవించినదో యాలోచింపవలెను. కవి యశక్తుఁడా ? మూఢుఁడా ? శాస్త్రజ్ఞానము లేనివాఁడా ? ఔచిత్యానౌచిత్యముల తారతమ్యము గుర్తింపఁజాలని మందబుద్ధియా? కాఁడు. గొప్ప పండితకవి. సదాచార సంపన్నుఁడు. శివపూజాధురంధరుఁడు. లోకజ్ఞుఁడు. మహారాజు. కవిత్వ మర్యాదల నామూలచూడముగ శోధించి సంగ్రహించినప్రోడ. మనో

హార మైననూతనరీతిని కనుఁగొని యర్వాచీనులకు ప్రబంధధోరణి నందించిన స్వతంత్రుఁడు. అయిన నిదెట్లు సంధిల్లినది ? ఈ పద్యములు నన్నె చోడునివి కాకపోవచ్చును. ఎవరో మహానుభావులు పరోపకార పారీణులు తమ ప్రావీణ్యమును వెలార్చి రచించి యిందు జేర్చియుండ వచ్చును. ఏమైయుండునో నిర్ణయింపవలసిన బాధ్యత విమర్శకాగ్రేసరు లగుపండితప్రకాండులది. ఈ పద్యరత్నముల కర్త నన్నెచోడుఁడు కాఁడని తేలినచో వెంటనే కుమారసంభవకావ్యమునుండి వానిని తొలఁగించి పునర్ముద్రించుట వివేకవంతులలక్షణము. కవిరాజశిఖామణి వే దైనచో ప్రాచీనకవులలోని కొందఱి యసభ్యశృంగారకవిత్వమును తీవ్రముగ నిందించుచున్న నవీనాంధ్రసారస్వత పవిత్రలోకమున నాతని కావ్యమణికాంతి హీనమై మూలఁ బడుట తథ్యము.

ఈ సందర్భమున కవికులగురు వగుకాళిదాసుని కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుని స్మరించుటయం దనౌచితిఁ యావంతయు నుండదు.

శ్లో. తే హిమాలయ మామన్త్ర్య పునః ప్రాప్య చ శూలినం
సిద్ధం చాస్మై నివేద్యార్థం తద్విసృష్టాః ఖముద్యయుః.

(6 వ సర్గ, 94]

"మునులును వినిశ్చితకార్యులై వివాహతిథి నేఁటికి నాలవనాఁడని ముహూర్తనిశ్చయంబు సేసి సారుంధతీకులై హిమాచలంబు నామంత్రించి చని సిద్ధం బైనకార్యార్థంబు విన్నవించి యమ్మహాదేవుం డనుప నిజస్థానంబుల కరిగిరి."

(హరవిలాసము, 4 వ యాశ్వాసము 72)



# శృంగారనాయికలు

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

(5) "ఖండిత"

శ్లో॥ నీత్వాన్యత్రి నిశాం ప్రాత రాగతే ప్రాణవల్లభే
అన్యాసంభోగచిహ్నై స్తు కుపితా ఖండితా మతా॥

(ప్రతాపరుద్రీయము)

రాగము:- గంభీరనాట—తాళము:- ఆది

పల్లవి :— తెలిసికొన్నానురా-నే (పలు)
పలుకులేల? యల చెలిని గలిసి తని॥ తెలి।

అ.ప :— నిలుకడం గనని-నీదుచూపులే
తెలిపె నీదు నీ-తిలేనట్టిపని॥ తెలి।

చ :—దారిదప్పి యిటు-దయచేసితివా।
లేరు నీవలచు-వార లీయెడల
సారెసారె కిటు-జాలిగ్రాల గనె
దార!పో పోర-యచటికే శఠుడ!॥ తెలి।



(6) "ప్రోషిత భర్తృక"

శ్లో. దేశాంతరగతే కాంతే ఖిన్నా ప్రోషితభర్తృకా॥

(ప్రతాపరుద్రీయము)

రాగము :— తాళం :—చతురశ్రగతి

ప॥ పర దేశంబుల-బడియుండిన నీ
గరిత యింక నే-గతి బ్రదుకునురా॥ పర।

అ. ప॥ కరవుదీర నిం-కను సరిగా మవ
మురిపెపుబ్రేమల-చిరజిమ్మితిమా
అరసడలిన ల-జ్జావేశములో
కొరతయె నామెక-కురితాౖ డాయెర॥ పర।

చ॥ కనుక నీ రొలుక-గా దుఃఖించుచు
ననపాన్పున శ్రిమ-మున గనుమోడుప
వనిత యొక తెతన-వలలో వైచుక
మన యనుబంధము-మాట నీకు దల
పునకు రానీక-ముఁజినివై చె చెం
గునకు ని న్ననుచు-కనియొక కల నె
మ్మనసు చివుక్కు-రు-మన దుర్భ్లి పడితి
గనిన పాడుకల-కై కలగెద నెద॥ పర।



(7) "ప్రివత్స్యత్పతిక"

"పతి రగ్రిమక్షణే దేశాంతరం యాస్య త్యేవ సా ప్రవత్స్యత్పతికా"

(రసమంజరీ)

రాగము :—సారంగ—తాళము:—రూపకము

ప॥ పతివియోగజలధి నే
గతి తరింపగలనె చెలీ!॥ పతి।

అ. ప॥ బతిమాలితి గాని నా-పలుకు చెవిని బెట్టకుండ
నతిశీఘ్రముగాను నే-నరుగవలయు ననుచు బలికె॥ పతి।

చ॥ తేటతేనె లొలుకుపలుకు-తీరు లరసి మురిసిపోతి
మాటలేల?జగతిలోన-మగవారల ప్రేమగతులు
నీటిపై నవ్రాతలనుచు-నేటి కెరుకపడియె నమ్మ
ఏటి కింక నే గీచిన-గీటు దాట డనుకొంటిని॥ పతి।



(8) "అభిసారిక"

శ్లో. "కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సా భిసారికా"

(ప్రతాపరుద్రీయము)

రాగము:— —తాళము:— మిశ్రజాతి

ప॥ నీ నామము నె-ధ్యానింపుచును
నే నీ రేయి-ని స్వైరితిని॥ నీ॥

అ. ప॥ పోనీ కాపురంబైన కా
నీ నెత్తిబడనీ నింద లీ
మానం బేలరా నీయురము
పై నన్నుంచి భయ ముడుపరా॥ నీ॥

చ॥ ఇరుకుసందుల బడి నడచి వెన్
దిరిగి మఱిమఱి యరసి కొనుచును
పిరికితనమున నాదునీడ నె
బరికించి మది జల్లుజ ల్లన
సరిజేసి క్రమ్మర ధైర్యమును
పరమేశ్వరునిపై భరము నిడి
త్వరితంబుగా తడబడ నడక
లరుదెంచుచుం గర మెడదలో॥ నీ॥



# శ్లోకాంధ్రీకరణ సమస్యా పూరణములు

1. శ్రీ కార్తికేయగారు—ఆంధ్రసాహితీ పరిచారసభ-

పశ్చిమబెంగాల్.

1. మ. నిలయంబా? యువరోధశూన్యముగదా!
నిమ్నోన్నత స్థానమేన్
జలమా? పల్వలకశ్మలం బెగద! కు
బ్జాకాచ్ఛనీరం బాకో
చెలువుండో? నరపాలుఁ డౌనె మహిషీ
శ్రీ సంజ్ఞ నీ వొందినన్
గులుకేలా? మది నెవ్వ నీకుఁ బశువా!
కొండంత గర్వంబ చే॥

(2) తే. గీ. కలివశంబున నల వియోగపరిచండ
వహ్ని గూలిన తనయందు వగపుగాక
నెఱపు శారదపూర్ణిమ నిండుచంద
మామ నీక్షించి కడుదూరె భీమతనయ.

2. శ్రీ పరిణవశ్రీగారు— కలకత్తా

1. వసతి దుర్గమెకో! రాణివాస మేది?
జలము కుబ్జకా సవమె? పల్వలమలినము
మహిషి వనిపించుకొన్న నీ మగడు ఱేడె?
ఎడదపొంగేల? పశువ! నీకింతపొగరె?

2. చెనటి కలిమాయఁ బ్రియునకు దనకు నడుమ
గల వియోగాగ్ని వలపు పెందలపు సెగల
రేపు నామని పున్నమ రేయి చంద
మామ నీక్షించి కడుదూరె భీమతనయ.

3. శ్రీ కల్లూరి త్రిమూర్తికవిగారు—ఆంధ్రసాహితీ ప్రచారసభ-
పశ్చిమబెంగాల్.

(1) సీ. మెఱికపల్లంబుల మేరనేకాని నీ
స్థిరనివాసం బంతిపురినిఁ గాదు
ముఱికిగుంటలలోని బురదనీటనె కాని
నీదు స్నానంబు పన్నీట గాదు
గడ్డిగాదము తోడి గంజియేకాని నీ
సాపాటు భక్ష్యభోజ్యములఁ గాదు
మడిదున్నలేని సోమరిపోతెకాని నీ
మగడు మేల్గలమంది మగడుగాడు

తే. గీ. మహిషియనుపేరు గల్గిన మాత్రముననె
మిన్ను మన్నునుగానక మిడిసిపడుచు
రాణివాసపురీవి కారాటపడెదు
పసరమా! నక్క శివుడౌనె? భ్రాంతిగాని.

2. హంససందేశమాలించి హంసగమన
రాజహంసను నలమహారాజు వలచి
తోటదిరుగాడు తఱి నటదూరు చంద
మామ నీక్షించి కడుదూరె భీమతనయ.

4. శ్రీ "సాహిత్యవిశారద" డా॥ మల్లిబాబు (R. M. P) నరసాపురం.

1. తే. గీ. నలుని బెండ్లాడినది మొదల్గలిగినట్టి
కష్టములగుంది పుట్టింటికడ వసించి
యందుగోడపై జిత్తరువందు మామ
మామ నీక్షించి కడుదూఱె భీమతనయ.

5. శ్రీ విశ్వనాథకవిగారు, సభాపతి- ఆంధ్రసాహితీప్రచారసభ,
పశ్చిమబెంగాల్.

(1) శా. నీయావాసము మెట్టపాలయగు గా
నీ, రాణివాసమ్మటే!
నీయభ్యంగము పల్లపుంబురదకా
నీ,కుబ్జికానీరమే !
నీయిష్టాభిధమాత్రిమే మహిషి గా
నీ, నీమగండేలికా!
నీయాత్మన్ సత ముబ్బదేల? పశువా!
నిర్వార్యగర్వంబునన్.

(2) తే. గీ. శ్రీనలన్నృపాలపతి విరహానలమున
గుటిలకలి దృష్ట్యనిలహతి గూలి సోలి
నట్టితనయెద జలిచిచ్చు పెట్టుచంద
మామ నీక్షించి కడుదూరె భీమతనయ.

6. శ్రీ బి. అప్పలస్వామిగారు- శ్రీ గణేశాంధ్రగ్రంథాలయం,
శ్రీరామపూర్- పశ్చిమబెంగాల్.

తే. గీ. ఎగుడుదిగుడుల నేలపై నెగడియున్న
పూరిపాకయె కాక నీకూరనీడ
రాణమేడయటే ? నీకు దాన మాడ
బురదపడియల నిలిచిన మురుగునీటి
గుమ్మలుండ గులాబీల కమ్మతావి
చలువయత్తరుపన్నీటి కొలను వేడ ?
కోరిపడసిన నీపెట్టుపేరు మహిషి
గాని నీపతియొడలు వంగక వరిమడి

దున్నబోని సోమరిపోతు దున్నపోతు
పుడమి తేడొకో ! పదిమంది కొడయడొక్కో ?
ఆరయం బేరుగడుగొప్ప యూరుదిబ్బ
యున్నతీరున నీతీరు నున్ననీవు
జంకుగొంకుల గ్రుంకక హుంకరించి
దారి తెన్నుల జూడక దాట్లువైచి
నేల నింగినిగానక తూలి తుళ్ళి
పడెదవేలనె? పసరమా! పగులఁగ్రొవ్వి.

(2) తే. గీ. పతి నిమథపతితో నెడబాటుతనకు
కలుగ జేసిన దుష్కాలిం గసరువేళ
వెకిలినవ్వులన్ వలవంత వెట్టు చంద
మామ నీక్షించి కడుదూఱె భీమతనయ.

7. శ్రీ చతుర్వేదుల ప్రభాకర శాస్త్రి, యల్లాయపాలెము.

(1) సీ. మిట్టపల్లములగు కొట్టానవాసంబు
బాధగల్గింపదా ! పశువ ! నీకు
త్రాగ్రానసీరంబు పడియలందల్పమై
కల్మషయుతమాచు గ్రాలుగాదె
మహిషినామం బొందు భాసిల్లుకతమున
నీపతియెప్పుండు నృపతిగాడు
కాన దేనినిగాంచి కడు మురియుదు వీవు
యరయ నీమది నిరంతరము గర్వ

తే. గీ. నిర్భరంబాచు వెలిగెడి నీచబుద్ధి
నిన్నుబోలుచు నొప్పెడి నీచులెపుడు
తమదు స్థితులెఱుంగక నిరంతరము గర్వ
పడుచు దుర్భరకష్టముల్ పడుదురెపుడు.

(2) తే. గీ. నలుని గుణరూపచింతన సలుపుచుండి
చిత్తమంగజవేదనా యత్తమైన
తనదు విరహంబుపెంచుచు దనరుచంద
మామ నీక్షించి కడుదూరె భీమతనయ.

8. శ్రీ ఈమని వేంకటకృష్ణశర్మ, యల్లాయపాలెము.

(1) సీ. నిమ్నోన్నతంబైన నేలయువాసంబు
బాధాకరముగాదె పశువ నీకు
పడియలలోని నీ పానోదకంబెన్న
కలుషమై స్వల్పమై వెలయుగాదె
నృపతిత్వమాలేదు నీ భర్తకెప్పుడు
నొండు మహిషనామమొప్పుకతన
పై కారణము లున్నవన్న భీతియులేక
యానందమొందెదో యల్పబుద్ధి

ఆ. వె. కనగనీదుమనము గర్వంబుతోనుండు
నెల్ల వేళలందు నిర్భరముగ
గర్వయుతులకెప్డు గలుగును నాశంబు
ఎరిగికొనుము సుంతయెఱుక గలిగి.

(2) తే. గీ, పాలసంద్రింబులోన సుప్రభవమంది
రెండవవిషంబు పోల్కిని గండుమిగిలి
విరహిజనతాపకరమగు వెల్లచంద
మామనీక్షించి కడుదూరె భీమతనయ.

9. శ్రీ పి. వి. చలపతిరావు, విద్యాప్రవీణ- పరిషత్ హైస్కూలు - పామఱ్ఱు.

1. చ. అలరుచు నీదుశాల విషమావని నంతిపురం బదెట్లగున్
కలుషితపల్వలోదకము కమ్రనిగొజ్జగి నీరెయౌనె? కే
వల మహిషీపదంబున భవత్ప్రియుడెన్న నృపాలుడౌనె యెం
దుల కిటు గర్వమందెదవు ఛీ! పశువా!నగరేబుధోత్తముల్.

(2) తే. గీ. ద్యూతమున రాజ్యసర్వస్వ మోటువడిన
కారణంబున బతివియోగంబునంది
ఒక్కరాతిరి నుదయించుచున్న కంతు
మామనీక్షించి కడుదూరె భీమతనయ.

10. కవిసుధాకర, బి. యస్. మూర్తి, B. A. C. T.
S. E. Rly—M. H. School-Khurada Road.

(1) చ. అరయగ నీదుకోష్ఠమసమావనితోడ ననావరోధమై
వరలును పాడొనర్చెదవు పల్వలవారిని నీదునాథుడున్
నరపతిగాడు నీవభిదకున్నై మహిషీత్వము దాల్చినావు ని
ర్భరతరగర్వమేటికి నిరంతరమందెద వోలులాయమా!

(2) తే. గీ. కర్ణ పేయమ్ముగా హేమఖగముదెల్ప
నలసమాగమ వివశాప్తి నలగిమలగి
యుండ విరహానలంబేచు నిందుచంద
మామ నీక్షించికడుదూరె భీమతనయ.

11. శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునకవి - పామఱ్ఱు.

2. తే. గీ. గురువుదగ్గర విద్యను గఱచుచుండి
గురువుసతియగుతారను గూడియుంట
యనుచితంబగు పనిగాదె యనుచుచంద
మామనీక్షించి కడుదూరె భీమతనయ.

12. శ్రీ వి. వి. జోగయ్యగారు- యలమంచిలి.

1. చ. సమతలశూన్యగోష్ఠమును సద్భవనంబనిపొంగి నీచనీ
రములను దానమాడుచును రమ్యసుగంధజలంబులందు నా
మమహిషమైన నీమగడుకాడు మహీవరిపాలకుండు గ
ర్వము నెటులన్ గడించితివి రయమునన్ వినిపించుకక్షమా !
*ఇది యతిఛందోదూరము.

2. తే. గీ. నిలువుటద్దము దీసికొని గడపన, ని
లిపి, శశిప్రతిబింబమున బలమునకొట్టు
మ చెలులార యని పలువిధములచంద
మామ నీక్షించి కడుదూరె భీమతనయ.
*అర్థమగుటలేదు- దోషభూయిష్ఠము.

13. సహస్రావధాని, శ్రీరామ్ వీరబ్రహ్మకవిగారు, మచిలీపట్టణము.
2. తే. గీ. నలు వరించిన దమయంతి మలయపవను
మరుని దూషించి విరహాగ్ని గరముమ్రగ్గు
చున్నతఱి వెన్నెలలుగాయుచున్న చంద
మామ నీక్షించి కడుదూరె భీమతనయ.



# వ్యాసలక్షణము–నిర్మాణాదికము

డాక్టర్. బి. వి. కుటుంబరాయశర్మ.

## I లక్షణాదికము :—

ప్రధానముగ నీక్రిందివి వ్యాసలక్షణము లని కొందఱమతము:–

1. వ్యాస మొక సంగ్రహరచనము; వ్యవహారవ్యాపార నిర్వహణములయందు గలుగు విశ్రాంతివేళలలో సైతము చదువుటకు వీలుగ నుండునది. స్థూలమైన దాని తాత్పర్యము సులభముగ మన మనస్సునకు పట్టునట్లుండవలెను.

2. వ్యాసము వాదోపవాదముల ప్రబంధముగ నుండరాదు. దాని నొకనియతికృతనియమధర్మము గలదానిగా గాని,నియమసిద్ధాంతము గలదానిగా గాని, నిర్మింపఁగూడదు. చిత్రమున కావశ్యక మగు విశదరేఖ లం దుండవలయును; విశదత్వముద్రకూడ నుండుట సమంజసము.

3. అం దొకప్రరూఢ మైనపరిపూర్ణత లేకపోయినను నొక శిల్పసమగ్రత యుండక తీరదు.

4. దాని రచనావిధానము సరళముగ నుండవలయును. అది యయత్నకృతమై స్వేచ్ఛాపూర్వక మైనసంభాషణమువలె నుండుట యుక్తము. అప్రయత్నపూర్వకముగ నది యగపడవలెను.

5. దాని శయ్యాసౌభాగ్య మాకర్షణీయముగ నుండుట ప్రశస్తము.

6. అతిచమత్కారయుతమును హాస్యజనకమును కరుణాస్ఫోరకమును నై యుండుటకూడ నావశ్యకము.

మఱి కొందఱమతమున నీదిగువ నీయఁబడినవి వ్యాసమునకు ప్రధానభూత మగు లక్షణములు :–

1. తగినంత సంగ్రహత వ్యాసము లన్నిటికిని సాధారణ లక్షణము.

2, ఈ సంగ్రిహతకు సమగ్రితకూడ తోడుపడుట శ్రేష్ఠము.

3, నాతిదీర్ఘరచన మగుటచే నిది మితియారినప్రయత్నములకు బోరాదు, అనఁగా దీనిపై మోపరానిబరువు మోపకూడదు.

4, వ్యాసములో నొక్కి వక్కాణింపఁబడు నంశములు యథాస్థానస్థితములై యుండుట ముఖ్యము.

5, తన్నుగూర్చి చదువరి కొకగక మగుపరిపూర్ణత్వానుభూతిని గలిగించుట వ్యాసరచనాధర్మము.

6, వ్యాసమున క్రిమబద్ధమును తర్కబద్ధమును నైన యొక నియతవిధానము సంగీకరింపము. ఇతర సాహిత్యప్రక్రియలకంటె నిది కొంతగ క్రిమవిధానరహితము.

"మాంటేగ్" తన వ్యాసరచనలో పరంపరగా నొంటికాలితో దుముకుచున్నట్లును నుండి యుండి గంతుచున్నట్లును కప్పదాటులు వేయుచున్నట్లును దోఁచును.

ఇతరు లెవ్వారును వరింపని వస్తువును వ్యాసీకరణమునకై తాను వరించినప్పు డొకవరుసగాని యొక క్రమవిధానముగాని లేనిరీతిగా దానిపై భావములను ప్రితిఫలింపఁజేయుదు నని "ఎడిసన్" మహోదయుని నుడి.

కాని తర్కశాస్త్రపూర్వకముగ తమ హేతువాదములను వ్యాసములో నిబంధించు "మెకాలే" పండితునివంటివారును లేకపో లేదు.

7, అచ్చమైనవ్యాసరచనము తత్ కర్తృ వ్యక్తిత్వమునకు నభివ్యక్తి. వ్యాసములో తన్ను తానే చిత్రించుకొందు నని "మాంటేగ్" మహాశయుని పలుకు.

8, వ్యాసము గేయకవిత్వమునకువలె వ్యక్తిత్వాభివ్యక్తి సాధనము. అది ప్రధానముగ నాత్మాశ్రియము.

ఎ.సి. బెక్సన్[1] మహాశయుని మతమున వ్యాస మొకరకముగ నాత్మానుసంధానము; రచయిత తనకుఁ దాను చెప్పుకొనునట్టి దగు స్వగతమనఁదగు నొక భావస్థితి.

రచయితృ మనశ్శీలసంపదలచే వర్ణ్యవస్తువు ప్రభావిత మగుట యనునది యచ్చమైన వ్యాసరచనలో కేంద్రస్థితి వహించునట్టి ప్రధాన విషయము. ఇది హడ్సన్[2] పండితుని యుద్దేశము. దీనినే యాతఁ డిట్లు వివరించినాఁడు :-

మునుముందుగ మనము రచయితృవ్యక్తిత్వమును దృష్టిపథమును బరిగణింపనగును. అతని వ్యక్తిగతగుణగణములును నతఁడు చేయుజీవితవ్యాఖ్యయు గమనార్హములు. అతని భావక్రమవికాసమును.కూడ మన మనుసరింపవలయును. వ్యాసవస్తువిన్యాసవిధానమునందే యేయంశములపై నాతఁడు దృష్టి కేంద్రీకరించెనో కూడ మనము గమనింపవలెను. వ్యాసరచనారంగమున తనభావముల నాతఁడెట్లు ప్రవేశపెట్టెనో; యెట్లు వాని నమర్చి, పరిశీలించి పరిష్కరించి, పరిణత మొనర్చెనో గ్రహించుటకూడ మన విధాయకము. వ్యాసవస్తువు నుపసర్పించుచు దానిని బ్రదర్శించుటకుఁ జెప్పునుపోద్ఘాతమునందును, చేయు వ్యాఖ్యానమునందును, జూపు నుపపత్తులయందును మన మాతని కళానైపుణ్యమును బరీక్షింపనగును. పైఁ జెప్పిన వీనిని బట్టియే యాతని రచనకు సార్థకత నిర్ణయము కాఁగలదు. వ్యాసమునకుఁ గూర్పఁబడిన శయ్యా (శైలి) సౌభాగ్యమును బరామర్శించుట విమర్శకుని కట్టకడపటి ధర్మము. ఏలన. శయ్యారచనలలో సుదృఢమైన వ్యక్తిగతతత్త్వ మిమిడి యుండును. వ్యక్తిత్వస్పర్శవ్యాసమునకుఁ బ్రాణభూతము.

9. వ్యాస మాఖ్యానసిద్ధాంతగ్రంథముల వంటిది కాదు. అది యొక చిత్రము. సంగ్రహరూపము గల దగుటచే నది యేవిషయమునుగాని యిద మిత్థ మని నిర్ణయింపఁజాలదు.

---

1. A. C. Bexson; 2. Hudson;

10. భావతూలికలను చిందరవందరగ విరజిమ్ముట వ్యాస మనిపించుకొనదు. అది యేకైకభావమున కొక కళాసమన్విత మైన వికాసము. "ల్యాంబ్"[3] మహనీయునివంటి వ్యాసకర్తలు కొంద ఱీవి షయమున కపవాదము వఠింతురుగాక!

11. వ్యాసకర్త తన యుద్దేశమునే యనుసరింపవలె నని పాఠ కుని నిర్బంధింపఁడు. కాంతాసమ్మితముగ బోధించుటయే కాని వాద బలము చూపుట యాతనిమతము కాదు.

12. వ్యాసకర్త రసభావములను బ్రేరేఁచునే కాని బుద్ధి నున్న రున్న రనిపింపఁడు.

13. పుష్పమువలె వ్యాసము తన నూతనశోభావికాసముచే బఠిత నాకర్షింపవలెను.

"తన రచనావిధానముచే బాఠకుల కాహ్లాదము గొలుపవలె ననుటకు మించి యెక్కువగ వ్యాసమునుండి యేప్రయోజనమును మన మపేక్షింపరాదు. మనకు మన పరిసరములను గూర్చిన యించుకజిజ్ఞాస గలిగించుటకూడ దాని విధేయధర్మము. వినోదకరముగ విజ్ఞానమును సముపార్జించుటకొఱకే మనము సాధారణముగ నుదాత్తవ్యాసము లను జదువుదుము. ఆ విజ్ఞానము, బుద్ధిసంబంధి గావచ్చును; లేదా హృదయసంబంధి గావచ్చును." అని రాబర్టులిండ్ పండితుని యుద్దేశము.

తమ వాదమును నిర్దుష్ట మగు నొకయనుక్రమమున నిర్మించుచు నప్రతిరోధవిధానమున పర్యవసింపజేయుచు కొందఱువ్యాసకర్తలు తర్కశాస్త్రానుసారముగ రచనసాగింతురు. ఇతరులు చపలచిత్తాను సారులై యథేష్ట మగుప్రసంగపద్ధతి నవలంబింతు రని ప్రిఛర్డ్ మహాశ యుని యభిప్రాయము.

---

3. Lamb;

ఆధునికసాధకుల ననుసరించి వ్యాసకథనవైఖరి నవలంబింప వచ్చును; ఏదేని దృశ్యమును వర్ణింపను వచ్చును; సిద్ధాంతమును బ్రతిపాదింపను వచ్చును; కాని ధర్మోపదేశము చేయరాదు; పాఠకులకు హెచ్చరిక చేయరాదు. అది యాలంకారికరచనముగ నుండుటయు సమంజసము కాదు; బోధన కుపక్రమించుట కూడదు; మతబోధకు ముందే పూనరాదు. ఉపన్యాసధోరణీ గంధము గాని పాఠశాలాబోధనా గంధము గాని మతబోధనాగంధము గాని దాని కుండరాదు. వ్యాసకర్త తా నొక యుచ్చస్థితి నాక్రమించి పలుకుచున్నా ననుకొనుట పొరపాటు. ఆతఁ డొక మతగురుపీఠమునుండి గాని యాచార్యపీఠమునుండి గాని బోధచేయుచున్నా ననుకొనఁగూడదు. తాత్కాలికముగ నాతఁడు కాంతాసమ్మితపద్ధతిలో పాఠకులను తన కాంతరంగికులుగా భావించి తా నెఱిఁగినవారికిఁ (తన పాత్రలకు బరిచయము చేయును. ఏదేని యొక స్వీయానుభూతిని పాఠకుల కందించుటయే వ్యాసకర్తృధర్మము. ఏదేని విజ్ఞానలేశమును గఱపుటయే యాతనికి విధి; జీవితమును గూర్చి నూతనవ్యాఖ్యానమును బ్రసరింపఁజేయుటయు నాతని విధాయకము. అట్లు చేయుటలో నతని వ్యక్తిత్వము కొంత బయల్పడును. అన్నిటికంటె నాహ్లాదము గొల్పి చదువరుల నుల్లాసపరచుట వ్యాసకర్తకుఁ బ్రధానాశయము. అనఁగా కేవలము పాఠకుల యూహలకు చక్కిలిగింతలు గొల్పుట యని యర్థము కాదు. వ్యాసరచన ముబుసుపోనివారికొఱకై జరుపునట్టి కేవల సత్కాలక్షేపకార్యక్రమమును గాదు.

వ్యాస మొకమధురగీతము వంటిది; నాతివిస్తరక్షేత్రము గలది; అందు వస్తువైవిధ్య ముండవచ్చును; దాని రచనావిధానము నిర్నిబంధము గావచ్చును; ఆచారము సంప్రదాయము ననువానినిగూడ నది త్రోసిరా జనవచ్చును. కాని (౧) యొకనిర్మాణవిధాన మనియు (౨) నంగాంగిసాంగత్య మనియు (3) సందర్భశుద్ధి యనియు వ్యాస

మున కుండవలయును. (౪) దాని కొకప్రత్యేక భాషావేష మనియు (౫) నితరసాహిత్యప్రక్రియలవలెనే యొకవిశిష్టరూప మనియు నుండుట యావశ్యకము. (౬) అది రచయితృకర్తృహంకారమును సూచించుచు (౭) విసుగు గొల్పని రచనగా నుండనగు నని జెప్సన్[1] సంపాదకుని యభిప్రాయము.

తన యాదిపదముతో జదువరిని సమ్మోహితు నొనర్చి యంత్య పదముతో సేద తీర్చుదాని పేరే వ్యాసము. ఈ మధ్యలో నతఁ డుల్లాసమును గాని యాశ్చర్యమును గాని యాసక్తినిగాని యాగ్రహమును గాని కొలువు విభిన్నానుభూతులకు నెలవు గావచ్చును; చోద్య మైన కల్పనాజగత్తున కెగసి విహరింపవచ్చును; విజ్ఞానగంభీరసముద్రనిర్మజ్జన దీక్షఁ గైకొనవచ్చును; కాని మేల్కొనమాత్రము మేల్కొనరాదు. ఇది శ్రీమతి వర్జీనియాఉల్ఫ్[2] ఉద్దేశము.

బేకన్[3] పండితుని వ్యాసములయందు కొన్నిపుటలలో వ్యగ్ర మైన విజ్ఞానము ఘనీభవించి యుండును; భావముల వివరణ మీషత్తు కూడ నుండదు.

మాంటేగ్[4] మహనీయుని వ్యాసములు భావసాంకర్యముతో నుదాహరణములతో గాథలతో నొప్పుచుండును.

ఎడిసన్[5] మహోదయుని వ్యాసములలో భావ మల్పిష్ఠమై పటుత్వరహితమై యుండును; కొన్నియెడల లఘువుగ ధర్మోపదేశ మును మఱికొన్నియెడల నాత్మఘోషయు నుండుట పరిపాటి.

II నిర్మాణాదికము :—

1. సౌలభ్యము, సౌందర్యము, సుఖప్రసూతి :—

వ్యాసము సులభసుందరమై సుఖప్రసూతి కలిగి యాకర్షణీయముగ నుండుట యుక్తము. వ్యాసకర్తృవ్యక్తిత్వము రచనలో నంతః

1. Jepson; 2. Virginia woolf; 3. Bacon; 4. Montaigne; 5. Addison.

ప్రవాహముగ వెల్లిగొనును. వ్యక్తిత్వముద్రారహిత మైనచో నా వ్యాస మొకసాహిత్యకలాఖండముగ ననర్ఘ మనిపించుకొనఁజాలదు. మనోహరమై యుల్లాసము గొల్పుచు వ్యక్తిత్వచిహ్నిత మైన ప్రాయికముగ రచయితృ ప్రత్యేకభావస్థితి సూచక మైన) ప్రశస్తవ్యాసము, ప్రయత్నపూర్వకమైన యొక సాహిత్యసృష్టి.

2. అంగాంగి సాంగత్యాదికములు :—

అన్ని సాహిత్యప్రక్రియల నిర్మాణసామర్థ్యమువలెనే వ్యాస నిర్మాణ సామర్థ్యముకూడ నంగాంగిసాంగత్యమును సందర్భసమన్వయమును సమతను సుషమను పూర్వాపరసమన్వితిని నిర్వహించినప్పుడే వ్యక్తము కాఁగలదు.

శ్రేష్ఠ మగువ్యాసము వస్తుసంవరణమునందును వస్తువిన్యాసమునందును కొంతసామర్థ్యమును బ్రకటించి తీరును. అట్లే భావప్రకటనయందును పదజాలపదబంధముల వినియోగమునఁ జూపు ప్రామాణికతయందును నుద్దిష్టతాత్పర్య స్ఫూర్తియందును కూడ రచయితృ సమర్థత సువ్యక్తము కావలయును. కటువుగాక సుపరిచితమును నాడంబరము లేక సరళసుందరమును నగు నాంగ్లభాషాశైలి నలవరచుకొనవలయు నన్నచో "ఎడిసన్" మహాశయుని వ్యాససంపుటముల నెట్లో మన మాంధ్రభాషాశైలి నలవరచుకొనవలయు నన్నచో కీ. శే. కందుకూరి, చిలకమర్తి ప్రభృతుల సంపుటముల నట్లహోరాత్రములు మననము చేయక తప్పదు.

ఒక సుసంఘటితపరిచ్ఛేదమును కొన్ని వాక్యములుగ విభాగించినట్లే యొక సుసంఘటిత వ్యాసమునుగూడ కొన్ని పరిచ్ఛేదములుగ విభాగింతుము. ఒక పరిపూర్ణకలాఖండ మనిపించుకొనుటకై వ్యాసమునందు భావైక్య మెట్లావశ్యకమో యంగాంగిసాంగత్యము కూడ నట్లే యావశ్యకము. ఏకైకవిషయవ్యగ్ర మైనచో వ్యాసమున

కీ యైక్య మనుగుణ మలవడును. అధికారికవృత్తముతో పొంది పొసఁగి యుండనియంశముల నెల్ల వ్యాసములో బరిహరింపవలెను.

3. సందర్భశుద్ధి :—

ఇందు వ్యక్తము లగుభావము లన్నియు తర్కయుక్తములై సందర్భశుద్ధిచే సుసంఘటితములై యుండుట యావశ్యకము. అనఁగా వ్యాసకర్త తనభావముల నొకక్రమపద్ధతిలో నేర్పాటుచేసికొనుట యందు శ్రద్ధ వహింపవలెను. లేనిచో వ్యాసము క్రమతారహిత మై సందర్భశూన్యమైతోఁచుట సిద్ధము. భావము లొకదానినుండి యొకటి వెలువడి మాలాపరంపరితములుగా నుండవలెను. పరిచ్ఛేదములుకూడ తర్కశాస్త్రానుసార మైనయనుక్రమణికఁ గలవై యుండుట ముఖ్యము. ఇంతకు, వ్యాసకర్త విస్పష్ట మైనయాలోచనాశక్తియు భావముల క్రమసిద్ధమైన రచనాశక్తియు తన వ్యాసములో ప్రకటింపవలె నన్న మాట.

4. ఆనుగుణ్యము- సమత (తూఁగు)

అవయవసౌష్ఠవము నపేక్షించువ్యాసములో భిన్నభిన్నభాగముల పరస్పరసంబంధ మాయాభాగములు వివరించు విషయముల ప్రాధాన్యనివృత్తిలో నుండుట యుక్తము. ఒకానొకభావమును విస్తరించుటకు వినియోగింపఁబడు స్థల మితరభావములకంటె నీ భావమునకుఁ గల ప్రాధాన్యనివృత్తినిబట్టి యుండును. అనఁగా నాయా యవయవముల విస్తరణము వానివాని ప్రాధాన్యమునుబట్టి జరుగు నని భావము. ప్రాధాన్యమున కనుగుణముగా గాని యవయవ విస్తృతివలన వ్యాసములో సమతాగుణము లోపింపఁగలదు, అట్టి తూఁగు లేనివ్యాసము వ్యాసమే యనిపించుకొనదు. అందుచే వ్యాసకర్త ప్రాధాన్యానుగుణ్యముగల భావవిస్తరణమునందే దృష్టి నిలుపవలయును. అల్పవిషయమున కధికప్రాధాన్యము నిచ్చుటగాని ముఖ్యవిషయమున కల్పీకర

ణముగాని జరుగరాదు. భిన్నభిన్నాంశములకు వ్యాసములలో నర్హమైన ప్రాముఖ్యము నొసఁగుట సమంజసము.

5. ప్రారంభోపసంహారములు :—

చక్కని యారంభ మాసక్తిప్రేరకమై చదువరుల నాకర్షించుటయే కాదు; వ్యాసమునకు పాఠనసామర్థ్యము నొసఁగుచున్నది.అది కావ్యార్థసూచనము చేయుటయే కాదు;వ్యాసము సాధించు'కార్యము' నుగూడ స్ఫురింపఁజేయును.

మంచి యుపసంహారము వ్యాసములో వ్యాసకర్త చేయుసమస్త కృషికిని పరాకాష్ఠ. అది యొకయంశమును స్థాపనచేయును. అందుచే నొకముద్రపై నది తిరిగి ముద్రవేయు నన్నమాట.

ప్రారంభము ప్రధానాంశమునకు దారితీయుచుండగా నుపసంహారము తత్ప్రధానాంశమునకు గ్రమపరిణామ మగుచుండును.

6. ప్రారంభములు :

కొన్నికొన్ని వ్యాసముల కీ క్రిందియారంభవిధానము లుండును:—

(అ) ఏదేనికథ లేక ఘటన. ("ముఖస్తుతిని గూర్చి"[1])

(ఆ) ఒక యుదాహరణము. ("మేల్కొని పరుండుట"[2])

*(ఇ) ఒక సమస్య. ("సర్ రోజర్ ......"[3])

(ఈ) సూటిగ నారంభము. ("నిద్రనుగూర్చి"[4])

*(ఉ) అసంగతము గానియసంగతము. ("గారడివాండ్రు, లేక మాంత్రికులు"[5])

(ఊ) ఆకస్మికారంభము. ("రైలందుకొనుటనుగూర్చి"[6]); ("చెవులనుగూర్చి"[7])

---

1. Steel "On Flatery"; 2. Dickens., "On Lying Awake"; 3. Addison, "Sir Roger at the Assizes", 4. Hurt, "On Sleep"; 5. Lucas, "The Congurers"; 6. Gardener, On catching the Train"; 7. Lamb, "On Ears";

7. ఉపసంహారములు :—

కొన్ని కొన్ని వ్యాసముల క్రిందియుపసంహారవిధానము లుండును :

(అ) ఒక సూచన. ("షేక్స్పియరునుగూర్చి"[8])

(ఆ) ఒక మలితలంపుతో, లేక ప్రాంత ముగించినపిమ్మటప్రాంతతో ("నిద్ర"[9])

(ఇ) ఒక యుదాహరణము. ("భావనాహ్లాదములు"[10])

(ఈ) ఒక హెచ్చరిక. ("నగరములోరాత్రిలపరిశాంతత"[11])

(ఉ) అంతర్లాపివిశేషము. ("గారడివాండ్రు, లేక మాంత్రికులు"[12])

(ఊ) ప్రథమపరిచ్ఛేదభావ పునశ్చరణము ["భూగోళశాస్త్ర పరిశోధనము"[13])

(ఋ) దృష్టాంతీకరించుకథతో లేక,ఘటనతో } "ముఖస్తుతినిగూర్చి"[1]

(ౠ) హఠాదుపసంహృతి } "రైలందుటనుగూర్చి"[2]; లేక "నాతొలియాకాశయానము"[3]

ఆకస్మికముగ భావము మాఱుటతో నిట్టియాకస్మికోపసంహార మేర్పడుట సర్వసాధారణము.

8. రచనాఫణితి :—

వ్యాసవిభూతి, రచనాఫణితినిబట్టి యుండును. సంభాషణమున కుండునట్టి ధారాశుద్ధిని స్ఫురింపఁజేయుట వ్యాసమందలి భాషాసౌలభ్యమున కుండవలసినధర్మము.ఏదోష మున్నను వ్యాసమున వితండవాద మనుదోషము మాత్రి ముండరాదు; పాండిత్యగర్వప్రకర్ష కందులో స్థానము లేదు.

---

8. Johnson, "On Shakespeare"; 9. Hunt, "Sleep"; 10. Addison, "The Pleasures of Imagination"; 11. Gold Smith, "A City Night Peace"; 12. Lucas, "The Congurers"; 13. Milne, "Geographical Research."

1. Steel, On Flattery;" 2. Gardener, "On Fatching the Train"; 3. Wells, "My first Elight".

సాధారముగ వ్యాసకర్తృ-వ్యక్తిత్వమున కందలిశైలి సూచిక వంటిది. వ్యాస మాత్మాధివ్యక్తి(ప్రతిబింబము)గల సాహిత్యశాఖకుఁ జెందినరచన. అది వ్యక్తిగతము, నాత్మాశ్రయము ననందగును.

### రి వి ధ ము లు :—

వ్యాసములను స్థూలముగ రెండువిధము లని(తెగలని) విభజింపవచ్చును. వానికి (౧)భావనాపరవ్యాసము లనియు.(౨)"ననుభూతి పరవ్యాసము లనియు పేళ్ళు.

1. భావనాపరవ్యాసము :—

సాధారణముగ నిది విజ్ఞానాత్మకరచనమై నిష్కృష్ట మగురూప రేఖలతో నుండును. వ్యాఖ్యానపూర్వకములును తాత్త్వికములును వాదోపవాదయుతములును విమర్శనాత్మకములును నైతిహాసికములును జీవితచరిత్రసంబంధులును ననఁదగు నట్టివి భావనాపరము లైన వ్యాసముల తెగలోనివి.

2. అనుభూతిపరవ్యాసము :

భావనాపర మైనవ్యాసమువలె నంతగా నాలోచనాశక్తిని పెంపొందింపక యనుభూతిపర మైనవ్యాసము రసభావములను బ్రేరేఁచును. విజ్ఞానప్రథానము దీనిప్రథానోద్దేశము గాదు. వినోదము గూర్చుటయే దీని ప్రధానోద్దేశము. పై దాని యంతటిరూపరేఖలు దీని కుండవు. దీనిలో భాషయు నెక్కువధారావాహికగా నుండును.

వర్ణనాత్మకములును కథనపరములును చాపల్యయుతములును హాస్యజనకములును ననఁ దగునట్టివి యనుభూతిపరము లగువ్యాసముల వర్గమునకుఁ జెందఁగలవు.

3. వీనివీని విభేదములు .—

మొదటికోటికిఁ జెందినవ్యాసములు నిర్దిష్ట మగునుద్దేశమును గలిగి ప్రయోజనకర్మబద్ధములై యుండును. రెండవజాతివి యూహా

హోహాములపై నాధారపడి రచయితృభావశబలతనుబట్టియు చిత్తచాపల్యమును బట్టియు కొనసాగఁగలవు.వీనివీనిశైలులుగూడవిభిన్నములు.

కాని యొక్కొక్కప్పు డొకానొకపద్ధతికిఁ జెందినవ్యాస మిఁకొకపద్ధతికిఁ జెందినవ్యాసలక్షణముల నవలంబింపవచ్చును.అనఁగా పరధర్మావలంబనము గలవ్యాసము లుండుటయుఁ గలదు.

కథనాత్మక మగువ్యాసమును హాస్యజనకమగుధోరణిలో గాని చాపల్యయుత మగుధోరణిలో గాని రచింపవచ్చును.[1] ఐతిహాసిక వ్యాసము, కథనఫణితలో నడిచిన నడువ వచ్చును [2] అట్లే వర్ణనాత్మక వ్యాసము తాత్త్వికపర మగుటయుఁ గలదు.[3]

వ్యాసకర్తకు వ్యక్తిత్వ మొక్కటే కాని భావశబలత లనంతములు.ఆ భావశబలతనుబట్టి వస్తువిన్యాసమున వైవిధ్య మేర్పడుట సహజము. ఒకనిర్దిష్టప్రయోజనము గలవిధాన మనియు,హాస్యజనక, చాపల్యసంయుత,వాదయుక్త, కారుణిక, మార్గదానుగతిక భావనాత్మకాదు లనియు నాయావిధానములను వర్గీకరింపవచ్చును.

చక్కనివ్యాసము, రచయిత మనస్సునకు ముకురము (అద్దము) వంటిది.అతనిభావములు నుద్దేశములు ననుభూతులు నాశయములు మున్నగునవియాతనివ్యక్తిత్వమునువ్యాసములోముద్రింపఁగలవు కొంద ఱుత్తమపురుషములో రచనము సాగించి చదువరులకు సన్నిహితు లగుదురు.'ల్యాంబ్,'[1] 'గార్డినర్',[2] 'లూకాస్'[3] వంటివారి నిందుల కుదాహరింపవచ్చును.ఈపద్ధతిలో మనము వ్యాసకర్తకు సన్నిహితమిత్త్రముల మనెడిభావము నొందుదుము. ఇట్టిపరిచయ ముల్లాసకరముగ నుండును.

---

1. Dickens, "Lying Awake"; 2. Macauley, "The Revolution"; 3. Gold Smith, A City Night Peace".

1. Lamb, 'on ears', 2. Gardener, 'on catching the Train' 3. Lucas, 'the condurers'.

వ్యాసకర్త వ్యాసములో నంతర్వాహినిగ తనవ్యక్తిత్వము నెంతగా ప్రవహింపఁజేసిన నంత మంచిది. గ్రొంగ్రొత్త లైనయాలోచనామార్గములనుగూడ నాతఁ డలవరచుకొనుట యావశ్యకము. పదునేడవశతాబ్దిలో నాంగ్లసాహిత్యమునందు 'ఓవర్ బరీ'[4], 'కౌలే'[5] 'టెంపిల్'[6] 'డ్రైడన్'[7] ప్రభృతులు కొంతవఱ కిట్టిమహనీయులే!

ఇంతకు నేసాహిత్యమం దైనను వ్యాసముకొంతకొంతగా సంక్షిప్తము రేఖామాత్రము నసమగ్రము నసంపూర్ణము నిష్కృష్టక్రమ విధానవిరహితము నగురచన మని చెప్పి సంగ్రహముగ నిప్పటికి విరమించుట చాలును.

---

4. Overbury; 5. Cowlay 6. Temple; 7. Dryden.



# విజ్ఞప్తి

ఈ దిగువ నొసంగబడిన నాల్గునాల్గు పదములను పద్యరూపమున రామాయణభారతభాగవతాంతర్గతగాథ లాధారముగ గైకొని దత్తపదులు మాయాంధ్రకవులెల్లరును లిఖించి యాశ్వయుజకార్తిక సంచికలో బ్రచురింప సకాలమున బంపఁ బ్రార్థితులు.

(1) రణము–గుణము–చణము–గణము

(2) నన–నన–నన–నన.

విజ్ఞాపకుఁడు
పత్రికాసంపాదకుఁడు

# గ్రంధస్వీకారము - సమీక్ష

(శ్రీ బండారు తమ్మయ్యగారు)

1. మహాజన చరిత్ర (ప్రథమ భాగము) కర్త విమర్శకాగ్రేసర కొత్త భావయ్యచౌదరిగారు క్రౌను. పుటలు 24 వెల 0—50.

2. పద్మలేఖావళి (రెండవ భాగము) కర్త శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు. క్రౌను. పుటలు 24 వెల 0—50.

ప్రకాశకులు — శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు
కార్యదర్శి భారతీ సమితి, పామర్రు. కృష్ణాజిల్లా.

1. ఇందు మొదట ఆంధ్రప్రభ పత్రికలో ప్రచురితములై యిప్పుడు గ్రంథరూపముదాల్చిన

1. బొల్లిని మునిస్వామినాయుడు
2. రఘుపతి వెంకటరత్నమునాయుడు
3. పానుగంటి రామారాయణింగారు
4. గాజుల లక్ష్మినరుసులు శెట్టి

యను నలువురు దేశభక్తుల జీవిత సంగ్రహములు కలవు. మునిస్వామినాయుడు, రామారాయణింగారలు బ్రిటిషుప్రభుత్వపు హయాములో జస్టిసుపార్టీ నాయకులుగానుండి ప్రభుత్వమువారి మంత్రులుగా సమర్థతతో దేశసేవ గావించినవారు. వెంకటరత్నమునాయుడుగారు బ్రాహ్మమతావలంబులై, బందరు. కాకినాడ కళాశాలలందధ్యాపకులుగను, మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగను చిరకాలము విద్యాశాఖలో సేవయొనర్చిన మహనీయులు. దేవులపల్లి కృష్ణశాస్త్రి మున్నగు పలువురకు గురుదేవులు. లక్ష్మినరుసులుసెట్టిగారు ఈస్టు-ఇండియా కంపెనీ పరిపాలనకాలమున మదరాసు రాష్ట్రముననుండి దేశీయులకు పలువిధముల సేవగావించినవారు. పరవస్తు చిన్నయసూరి గారికి ఆశ్రయులై, వారి యభ్యున్నతికి గారణమై, యాంధ్రభాషాభిమానులకెల్ల నభివంద్యులైనవారు. కాలతారార్వా పద్యమున వీరి

చరిత్ర మొదటనే యుండదగినది. ఈ గ్రంథమునందందు భాషాదోష ములు హెచ్చుగనేయున్నవి. పత్రికలలో బ్రకటితములైనప్పుడెట్లున్నను, గ్రంథరూపమున వెలువడినప్పుడవి సంస్కరణమందవలసినది.

2. మల్లికార్జునరావుగారు తమ బంధుమిత్రులుకొందఱితో. పద్యరూపముననే యుత్తర వ్యవహారములొనర్చు పరిపాటికలవారు. ఇట్టి లేఖలుకొన్ని యింతకుమున్ను ప్రథమభాగమున ప్రకటించెను ఇది రెండవది. ఈపద్ధతి కేవల మపూర్వముకాదు. బొబ్బిలి సంస్థాన కవీశ్వరులు కీ. శే. మండపాక పార్వతీశ్వర శాస్త్రి మున్నగువారు తమ కాలములో పత్రికలలో ఉత్తరవ్యవహారములు, వివాదములు పద్యమాలికా రూపముననే కావించెడివారని వినికి.



సీ॥ స్వాహాస్వధావధూమోహనాకారుభూ
మ్యమరసేవ్యుని జగత్ప్రాణసఖుని
సప్తజిహ్వుని మహారాజస్సమన్వితు మేష
వాహను సర్వగీర్వాణవదన
సంకాశమూర్తి వైశ్వానరు బాదత్రి
యోపశోభితు వీతిహోత్రు సుచిని
జాతవేదుని ధనంజయు గౌరవర్ణుని
శక్త్యాదిసాధన సప్తహస్తు

గీ॥ నగ్ని దేవుని విధ్యుక్త మగువిధమున
నిలిపి సమిదాజ్యచరుతృప్తి సలిపి రవుడు
క్షత్రియోక్తసదాచారసరణి మెఱసి
సర్వజనసమ్మతంబుగ సతియు బతియు. 67

క॥ నిగనిగ కనుగవ కాటుక
దిగజారగ గంధఫలకదీప్తులు మెఱయన్
మగునకు నగుమొగ మలరెన్
భుగభుగమను హోమధూమపుంజం బొదవెన్. 68

మ॥ చతురంతోన్నతవేదిపై మణిగణాంచత్స్వర్ణపీఠంబునం
దతిమోదంబున బొంగి దంపతులు దారాసీనులై బ్రాహ్మణ
ప్రతతుల్ దీవన లియ్య గొంతలు హరిద్రాముద్రరంజిల్లున
క్షతముల్ సల్లగ నుల్లసిల్లిరి సదాచారంబుతో నంతటన్. 69

మ॥ ధరణీనాథ కులావతంసము జనస్తవ్యుండు శృంగారశే
ఖరు డత్యంతము భక్ష్యభోజ్యముల దత్కాలంబునం బంధుభూ
వరులం దృప్తుల జేసె నాల్గుదినముల్ స్వప్రాభవం బేర్పడన్
వరు డంతన్ గృతశేషహోమవిధియై వామానమాయుక్తుడై. 70

ఉ॥ బాలికలజ్జరాగముఖభవ్యమణుల్ సమకూర్చి వేడుకన్
బోల్లిలు రచింప చిత్రసుమపుంజము లొప్పసరోవరంబు శుం
డాలము వేవశావశత.డాయువిధంబునఁజొచ్చె నంగనా
జాలము నాగ వెల్లివరుసన్ సమకూర్పగ సంతసంబునన్. 71

వ॥ ఆ సమయమున. 72

సీ॥ గజపతిమదిని సఖ్యం బెంచి పంపె మో
దంబుతో భద్రదంతావళములు
మలయాద్రి నేలుభూతలనాథు డర్పించె
ఘనతరశ్రీఖండ ఖండవితతి
దామ్రపర్ణీతీర ధరణీశ్వరుడు దెచ్చె
హురుమంజిముత్యాలసరులు గొన్ని
ద్వీపాంతరపురాజు దెచ్చిచ్చె ననుపమ
చీనిచీనాంబరశ్రేణు లెల్ల

గీ. మఱియు దగురాజు లెల్ల సమ్మదముతోడ
మణితురంగమసుందరీ మణిసువర్ణ
భూషణంబులు తగుకట్నములుగ నొసగి
రతిముదంబున బొంగి ధరాధిపతికి. 73

వ॥ ఇవ్విధంబున నవ్వివాహమహోత్సవంబు సమగ్రింబగుటయు ననం
తరంబ. 74

క॥ కందర్పకేతు డమ్మక
రందునితో వేగ నిజపురంబు ప్రవేసిం
పందగు ననుటయు సేనల
నందఱ నడపించె నట్ల యాసమయమునన్. 75

క॥ జననీజనకులు గారా
మున బెంచినగోల గాన ముందుగన త్తిల్
గసబడుటకు దలగెడున
వ్వనితామణి గని యనంగపతి యి ట్లనియెన్. 76

క॥ బాలా యత్తిలు జూచెద
వేలా యీలాగు దలక హృదయేశుడు నిన్
లాలించును వగ పేటికి
చాలించుము చింత వికచసారసనయనా. 77

ఉ॥ అత్తకు నాడబిడ్డ కెదురాడకు మమ్మ నిజేశు డల్గినం
దత్తర మందకమ్మ పతి దైవము నిక్కువ మమ్మ యెప్పుడుం
బత్తి యొనర్చునాథుడని పల్కరు నిక్కకు జుమ్మ యమ్మ నీ
వత్తిలు చొచ్చి బాంధవుల నందఱ బ్రోపగదమ్మ యిమ్ముగన్.

చ॥ చెలువుని చిత్తవృత్తి గని సేవయొనర్పుము తల్లి యత్తమా
మల భయభక్తులం దనుపు మాన్యమహీసురబాంధవాశ్రితా
వళులకు నిష్టవస్తువు లవారితలీల నొసంగు మెప్పుడుం
బాలతి యశంబు దేగలవు పుట్టినయింటికి జొచ్చినింటికిన్. 79

ఉ॥ పంకరుహాక్షి నిన్ బిలువబంపెద బక్షములోన నెమ్మదిన్
జంకగ నేల సర్వజనసమ్మతరీతిని యత్తవారిలో
బొంకముగా మెలంగు నినుబోటులు సంతసమంది చూడ నే
ణాంకకరావతంసు నుమయట్ల భజింపుము ప్రాణవల్లభున్. 80

గీ॥ తల్లి! చింత యేల తలయెత్తి ననుజూడ
వమ్మ నమ్మ గన్నయమ్మ యనుచు
వరుసతో ననంగవతి యిట్లు బహుభంగి
పట్టి నూరడించి పలికె నంత. 81

సీ. శృంగారశేఖరక్షితినాథు డవ్వేళ
వరుసతోడ ననంగపతికి దనకు
దగినసమస్తబాంధవులకు మొక్కి వా
సవదత్త బరికించి సరభసమున

నూరడించి యనేకధారుణీసురమంత్రి
భటహితయాచక ప్రతతులఁ
గందర్పకేతు భూకాంతుండు పాటలీ
పుత్రంబునకు జన బూను టెఱిఁగి
గీ॥ యల్లునిని మాటికిని గొనియాడి యాడి
యుస్సురనుచు దనూభవ నొప్పగించె
నాఁడుబ్రతుకు పరాధీన మనుచు నచటి
యంగనలు మాటిమాటికి నాడుకొనఁగ, 82

సీ॥ నవరత్నమయభూషణములు బంగరుకోళ్ల
పట్టెమంచములు పటోంబట్టుపరుపు
లనుపమవర్ణ చీనాంశుకంబులు జాల
వల్లికల్ తబుకులు వ్యజనములును
పటవాసముఖబహు పరిమళ ద్రవ్యముల్
శారికాకీర పంజరచయములు
నిలువుటద్దంబులు వెలలేనిబరిణెలు
జాళువాపావలు చందువాలు
గీ. మొదలయిన పసదనములు నమ్మదముతోడ
నాత్మజకు నిచ్చె నత్తింటి కనుచునపుడు
శ్రీలు మెఱయంగ శృంగారశేఖరుండు
నపుడు బాంధవులెల్ల నౌ నని నుతింప. 83

మ॥ ధరణీనాయకరత్న మయ్యెడ సమస్తబ్రాహ్మణాశీర్వచ
స్ఫురితప్రాభవుఁడై శరత్సమయసంపూర్ణేందుబింబాననల్
వరుసన్ నాట్యము సల్ప దూర్యరవముల్ వ్యాకీర్ణతన్ భూమిఁ గ
బరమున్ నిండఁగ నాత్మపట్టణము శుంభల్లీల జొచ్చెన్ సిరిన్. 84
వ॥ అయ్యవసరంబున. 85

సీ॥ చంద్రశాలాంతర స్తంభజృంభితమర
కతమణితోరణావృతనభంబు
నాగుల్భకీర్ణ నానాసూనసూనవ్రి
తానమానిత నిషద్యానుతంబు
తాయమానాయతముక్తావితానాంకితా
ధ్వవస్తువ్రజంబు
నగరుధూపోద్ధధూమాళీకజలధరో
దయనటద్భవన చంద్రికిరణంబు

గీ॥ రాజబింబాననాకరరాజమాన
రత్నకల్పిత మంగళారాత్రికంబు
నగుచు దనరారె దత్పురాభ్యంతరంబు
రాజురాకకు ముదమున దేజరిల్లి. 86

క॥ ధరణీశ్వరుండు సుదతీ
కరగ్రహమహోత్సవంబు గైకొని కడకన్
గురుబుధబాంధవలలనా
పరివృతుడై వచ్చె ననుచు బట్టణవీధిన్. 87

సీ॥ తురుమున జంగల్వ విరిదండదిగజారు
టెఱుగక జనుదెంచె నింతి యొకతె
దవములు యావకాస్పదములుగా జేయు
మగువ గాదని వచ్చె మడతి యొకతె
విడవిడబారు నీవీబంధ మొకకేల
గీలించి చనుదెంచె బేల యొకతె
కుడికంట కజ్జలం బిడుకొని డాకంటి
దాల్పక వడి జేరె తన్వి యొకతె

గీ॥ సౌధవాతాయన ప్రదేశముల కట్లు
చంద్రముఖులెల్ల కడురభసమున జేర
వచ్చి యవ్వేళ నానందవార్ధి దేరి
తెల్లికొమరుని జూచిరి ప్రేమ మెసగ. 88

వ॥ అప్పుడు. 89

ఉ॥ మంగళగీతముల్ జెలగ మానిను లారతు లీయ వేడుకన్
బంగరుపల్లకీ డిగి నృపాలుడు తూర్యనినాద మొప్పగా
నంగనతోడ నాత్మభవనాంగణవాటిక జొచ్చె పౌరులు
పొంగుచు గొల్చి రా ధరణిపుల్గకు సంతస మంది చూడగన్. 90

వ॥ ఇవ్విధంబున నవ్వసుంధరాతలేశ్వరుండు సతియుం దాను గృహ
ప్రవేశంబు చేసి కృతకృత్యుండై వివిధబాంధవ సందోహయాచక
వ్రాతంబుల యథార్హవస్త్రప్రదానంబునం దనిపి సకలదేశాగతరాజ
వర్గంబున కాజ్ఞ యొసంగి యంతఃపురంబునకుం జని యొక్కనాడు.

సీ॥ కలకలనగు మేలుకట్టురం గెఱిగించు
నీలవురాకట్ట నేలతోడ
గలవరంబుల శారికలపల్కు లాలించు
రాజిల్లగమి పంజరములతోడ
ధళధళ మెఱయు నిద్దపుటద్దముల గాన
నగు వ్రాతబొమ్మల సొగసుతోడ
దలిరాకుగముల గెందమ్మిరేకులు గూర్చి
పన్నిన క్రొన్ననపాన్పుతోడ
సృమరపటవాస ఘుమఘుమం ఘుమలతోడ
గమలమాణిక్యకృత కవాటములతోడ
నమలయానిల వాతాయనములతోడ
నమలయాన్విత కేకి నాట్యములతోడ. 92

సీ॥ ననవిలుకానిమన్నన గన్న వనెకు పూ
గములతోఁ నవ్యపూగములతోఁడ
దళములతో తాంబూలదళముల దగుకరం
కములతోఁ మృగమదాంకములతోఁడ
గదలిక ల్లేని యక్కదలిక ల్మెఱయుద్వా
రములతోఁ సలిలపూరములతోఁడ
నెలరాల నలరుదిన్నెల బొల్చు గంధసా
రములతోఁ నళివిహారములతోఁడ

చకచకల హెచ్చు కాలభంజికలతోఁడ
బ్రమదము లొసంగు నగరుధూపములతోఁడ
బ్రభల వెలిగెడు కేతన ప్రతతితోఁడ
గొమరుమిగిలిన కేళీగృహమున కరిగి. 93

చ॥ పగడపుగోళ్లు చందనపుబట్టెల జెన్నయి పద్మరాగపుం
బొగడల నంటి కెంపుజిగి బొల్పగుద్వారతల మేలుకట్టుతోఁ
సొగసగుపందిరిం గలిగి శోభిలి మానసభూనిధానమై
భుగభుగ తావు లీకొనినపూవుల పానుపుమీద నున్నడన్ 94

సీ॥ గోవజవ్వాదినిగ్గులు బయల్పడకుండ
గలయ గొజ్జగినీట జలకమాడి
తరుణారుణాంశు సుందరతరద్యుతుల జె
న్నలరారు కెంజాయవలువ గట్టి
యగరుధూపంబులచే నార్చి చిక్కు సడల్చి
కురులు చక్కగదువ్వి తురుము దురిమి
నొసల కస్తురినామ మెసగ బాలిండ్లపై
ఘనసారకాశ్మీరగంధ మలది

నవ్యకాంచనమణిభూషణములు మేన
దాల్చి చెలువొందు వాసవదత్తకడకు
నృపవరప్రేర్యమాణయై నెలత యొకతె
వచ్చి యిట్లని బలికె భావంబు దెలియ. 95

మ॥ కలుకుంగుబ్బల కబ్బు వింతలగురంగు ల్నీదు కెమ్మోవికిం
గలుగున్ వేరొకడాలు చెక్కులపయిం గస్తూరి మేలైన చి
న్నెలు నెమ్మేనికి నెల్ల జేరు దగువన్నెల్ నిక్క మెన్నంగ నో
కలికీ నీకు నభీష్టసిద్ధి యగు వేగ న్నమ్ముమీ నెమ్మదిన్. 96

క॥ శంక యిక నేల పదమో
పంకేరుహనయన ధరణిపాలకపరవా
మాంకస్థాయిని వగుదువు
సంకేతస్థానయానసమయ మిది చెలీ॥ 97

చ॥ కమలదళాక్షి నీకు నుపకార మొనర్చువిధంబు దోపగా
గమలహితుండు గ్రుంకె బొడకట్టె శశాంకుడు తూర్పుకొండపై
రమణుడు నీదురాకకును రాగమునం గలిపెట్టి యుండు వే
గమె యటు రాదగుం దెలియ గారణమే మిక జాగుసేతకున్. 98

క॥ అని పలుకుచున్నదూతిక
గని సిగ్గున మోముద్రిప్పి కమలాయతలో
చన జూచి సకియలందఱు
నన విలుతునియాజ్ఞ దెలిపినను జెలి యంతన్. 99

సీ॥ కనకపంజరశారికల ముద్దుగులుకుప
లుకులు విను నెపమున గొంతసేపు
నంచబోదల నడ ల్గాంచి సంతోషించి
కొనువిధం బేర్పడ గొంతసేపు

ఉ॥ ఆసవగంధబంధురములౌ వదనాబ్జము లెత్తి నింగిపై
డాసిన మేడలం దొగి మిటారులు నిల్చి నృపాలు జూడగా
భాసిలె బూలమార్గములు పంకరుహాకరవిభ్రమంబుతో
నాసమయంబునందు. బ్రమదాననపంక్తులె గాననౌటచేన్. 31

చ॥ తరుణి యొకర్తు రేని దమి దప్పక జూచి తదియ్యరూపమో
వరినివిపించి దన్నచట వ్రాయగ దద్విభుండందు జేర న
గ్గురుకుచ నేర్పుతో నృపునకున్ సుమచాపముచేత వ్రాసె న
ద్దిర యది యెంతప్రౌఢసుదతీమణియో పరికించి చూడగన్. 32

సీ॥ అరదంబు లొజసి కస్తురిబెల్లు లురివిన
నరుగులు జవ్వాది నలుకువారు
తురగము ల్ద్రొక్కఁ గప్పురపుదు మ్మెగసిన
సరణుల బన్నీరు జల్లువారు
ధ్వజదండహాతి గందుతలిరాకుతోరణం
బుల హారిన్మణులు గీల్కొలుపువారు
రాజమో మరసి కరంగిన శశిమణి
స్థలముల వజ్రము ల్దార్చువారు

నై జనులు పురి గైసేయు నవసరమున
ఖ్యాతవిభవుండు కందర్పకేతునృపతి
కుసుమపురపతియనుమతి నసదృశగతి
సిరుల కిరవైన విడిమట్టు జేరె నపుడు. 33

క॥ ఆసమయంబున రాజా
జ్ఞాసూచిత యగుచు వేడ్కఁ జలజాతాస్యల్
డాసి కొలువంగ జనకా
వాసము సొత్తెంచుచున్న వాసవదత్తన్. 34

గీ. కని జనని యక్కునను జేర్చి జనకు డంత
బ్రేమ శుద్ధాంతకాంతల బిలిచి యపుడు
చంద్రవదనకు మంగళస్నానవిధులు
సలుపవలె నన మది బొంగి లలన లంత. 35

సీ॥ పగడంపుగుండ్రగంబములపై నెలరాల
నలరారు దూలంబులందు గీలం
గొన్న కెంపులజిగివన్నె పట్టెలమీద
పాపమే పరిపచ్చపలక లలరు
పందిరిలో నవపల్లవతోరంబు
ల కదళీస్తంభములందు కనక
పూర్ణకుంభంబులం బొల్పగు నవరత్న
మయశుభవేదికా మధ్యమునను

గీ॥ బిసరుహాసన లోక పెళ్లిపీట బెట్టి
తలిరుబోణిని వాసవదత్త నునిచి
వరుసతోడుత నిల్చి దీవన లొసంగి
యక్షతము లిడి గౌరికల్యాణ మనుచు. 36

సీ॥ గురుకుచంబుల బెనగొన్న హారావళుల్
బయ్యెదవెలువడి బయలురాక
నరచందమామతో సరివచ్చునిటలంబు
పై కుంతలంబులు పరుగులెత్త
దిటముచాలక గిటకిటమను కౌదీగె
యంబరావృతి నసియాడుచుండ
శ్రమ సముద్భూత నిశ్వాసానిలము తావి
గొన భృంగములు గుంపుగూడి చేర

గీ॥ జెలగి నెమ్మోగమున జిరుచెమట లూర
గలితకంకణ ఝణఝణత్కార మెసగ
మానవతి యోర్తు సంపెంగనూనె యంటె
నతిముదంబున బాంగి యయ్యతివ కదుపు. 37

సీ॥ కపురంపుజవ్వాది కమ్మకస్తురి హరి
దళియు గూర్చి నలుగిడె రమణి యొకతె
గమ్మన వలచుచొక్కపు మంచిగంధంపు
టటకలి పెట్టె వామాక్షి యొకతె
సలిలశాలకు దెచ్చి కలువరాపలకపై
నిలిపె మక్కవతోడ లలన యొకతె
బంగారుబిందెల బన్నీరు దొరలించి
జలక మార్చె గడంకనెలత యొకత

గీ॥ జలుగుదువ్వలు కెంగేల నలువరిం-
కదసి తడియొత్తె నొక్క పంకజదళాక్షి
వాతిచరగుల చెంగావివలువ గట్ట
నిచ్చె నొక బాలికామణి యిందుముఖికి. 38

చ॥ నళినదళాంతవృంత పవనంబులచే దడియార్చి పెన్నెరుల్
గలయగ దువ్వుచుం గుసుమగర్భముగా జెలి యోర్తు కైశికం
బలవరపం బయోజముఖి యాస్యము చూడగనొప్పె నయ్యెడన్
లలిత మిళిందబృందపరిలక్షితఫుల్ల సరోజమో యనన్. 39

ఉ॥ పంకరుహాక్షికి న్నిటలభాగమునం గొనగోర దీన్నగా
గుంకుమరేఖ దిద్దె నొకకుంజరయాన సరోషచిత్తమీ
నాంకధనుర్విముక్త దళితాఖిలపాంథశరీరశోణితా
లంకృతివిభ్రమాశుగసులక్షణలక్షితలీల బొల్పుగన్. 40

క॥ ఉడురాజ బింబవదనకు
గడకం గడకన్నులందు గజ్జల మిడె న
య్యెడ నొకపడంతి చెలు వల
రెడుచాతుర్యమున సొగసు రెట్టింపంగన్. 41

చ॥ పొలతు లమూల్యదివ్యమణిభూషణ పేటిక దెచ్చి యందులో
గలమణిభూషణావళులు గన్గొని కాంచనపద్మపత్రిమం
జుల మగులేమమై సొబగుజూచి సఖీమణి మేనికాంతితో
దులగన వౌ విభూషణతతుల్ నిజమంచు వచించి రయ్యెడన్. 42

క॥ అద్దము జూపెను చెలి కొక
ముద్దియ సఖ నీదు ముద్దుమోము పనుమనం
గద్దరి శశిదెచ్చితి నీ
వద్దికి నిదె చూడు మనుచు వచియించుగతిన్. 43

సీ॥ ముంగరజేర్చుక్క ముత్తియంబుల జల్లి
బలిరెలు గమ్మలు బావిలీలు
పతకముల్ గొలుసులు బన్నసరంబులు
గ్రైవేయకంబులు నేవళములు
కడియంబులును నూడిగంబులుం గరము లం
గదములు గంటలకాంచికయును
యందియలును మట్టియలు పీరమట్టెలు
గళుకులబొబ్బిలి కాయబొళ్లు

గీ॥ ననగ బేరెన్ని కైనట్టి కనకరత్న
ఖచితభూషావిశేషముల్ గ్రమముతోడ
మించుబోణికి మై నలరించి రపుడు
చంచలాక్షులు మది బొంగి సరభసమున. 44

వ॥ అంత నక్కడ. 45

ఉ॥ అంగన యోర్తు పీట యిడె నంబుజలోచన యోర్తు రాజమౌ
ళిం గడువేడ్క నందునిచె లేమ యొకర్తు నృపాలరత్న ర
త్నాంగద ముఖ్యభూషణము లందుకొనెం గలకంఠి యోర్తు తె
చ్చెం గనకస్థసారభవశీకృతతైలము బైడిగిన్నియన్. 46

చ॥ కులుకుమిటారి గబ్బిచనుగొండల హారలతల్ నటింపగా
గలనినదంబుతోడ గరకంకణము ల్మ్రోయుచుండగ జూర్ణకుం
తలములు ఫాలభాగమున దాండవమాడగ సంతసంబుతో
నలికులవేణి యోర్తు శిర సంటె నృపాలకచక్రవర్తికిన్. 47

చ॥ గిటగిట బేదకౌను వడకింపుచు గస్తురి నల్గువెట్టె ను
త్కటకటకధ్వనుల్ జెలగ గామిని యోర్తు శిరోరుహంబులం
దటకలివెట్టె గందమున నంగన యోర్తు గటీతటీనట
త్పట యగుచున్ రయంబున నృపాలకమౌళికి సంతసంబుగన్. 48

క॥ కైదండ యొసగె నపు డొక
పైదలి నడిపించె సలిలభవనంబునకున్
వేదండయాన యొక్కతె
యాదరమున నవ్వసుంధరాధీశ్వరునిన్. 49

చ॥ అనుపమరత్నపీఠమున నద్ధరణీవిభు నుంచి యొక్కమా
నిని మణిపూర్ణకుంభముల నించినగొజ్జగినీరు ముంచి మ
జ్జన మొనరించె నొక్కనవసారసలోచన జిల్గుదుప్పటం
బున దడియొత్తె బెన్నెరులు భూపవరాగ్రణికిన్ రయంబునన్. 50

క॥ జలజాస్య యొకతె జిలుగుం
జలువలు దెచ్చిచ్చె నొక్కసతి గద్దె యిడెన్
గలకంఠి యొకతె కస్తురి
తిలకము గొనగోర దిద్దె ధీరాగ్రణికిన్. 51

సీ॥ తనుకల్పతరు సుమ స్తబకంబు లన తెల్వి
బొలుచు ముత్తియముల పోగుజోళ్లు
గ్రహము లన్నియు ననుగ్రహము సేయగ డాసి
నట్లున్న నవరత్నహారములును
హస్తపద్మములపై నంటినయళులు నా
రంగైన నీలంపుటుంగరములు
నుదయాచలంబుపై గదలనిజాబిల్లి
బొలుచు వజ్రపుశిరోభూషణంబు

గీ॥ దాల్చె నప్పుడు ధారుణీధవుడు మఱియు
దగినభూషావిశేషముల్ దలిరుబోండ్లు
మేన గైసేయ వలరాజుమేనమామ
రిక్కగమిలోన జెలువొందురీతి నలరి. 52

ఉ॥ నిద్దపుమించు నించు బురణించు జిగందళుకించు మేలుడా
లద్దము జూపె నొక్కముకురాస్య నృపాలునిముందటన్ నృపా
యద్దపుసారు గేరుగనుమా యనుమానము వద్దు వద్దు నా
ముద్దుమొగంబుతీరు తుదిముట్టగ నంచు వచించువైఖరిన్. 53

వ॥ అయ్యవసరంబున. 54

చ॥ తడు వెడలేదు లగ్న మిదె తారసిలెం గద యంచు బ్రాహ్మణుల్
బడిబడి బల్కుచుండ నరపాలకు డందల మెక్కి తూర్యముల్
గడలుకొనంగ సద్భటనికాయము గొల్వగ వేట్క వచ్చి య
వ్వాడు శుభవేదికానికటభూమి వసించెను సంభ్రమంబునన్. 55

ఉ॥ బంగరుగద్దె వెట్టె నరపాలవరేణ్యుని కొక్కహేమగా
రాంగి మృగాక్షి యొక్కతె రయంబున గెంపులగిండి నీరుబో
యం గడిగెం బదంబు లొకయంగన రంగలరంగ భీతసా
రంగవిలోలదృక్చలతరంగములం గడు వెల్లి దెల్పుచున్. 56

క॥ ఆరతిపళ్లెరములు దై
వారఁగఁ గై సేసి వారిజాస్యలు వేడ్కన్
నీరాజనము లొసంగిరి
యారూఢిగ నమ్మహీతలాధీశునకున్. 57

క॥ కుసుమపురవిభుఁడు రయమున
ససమప్రాభవసమేతుఁడై యచటికి నిం
పెసఁగ దనూభవ దెమ్మని
బిసరుహలోచనల బంపువెట్టిన నంతన్. 58

సీ॥ కంకణఝణఝణత్కారంబు రెట్టింప
సుందరీమణి యోర్తు సురటి వీవ
నూర్మికామణి సుపరిభోర్మికల్ మెఱయ నో
మలి యోర్తు తెలనాకుమడపు లొసఁగ
సరిపేదకా నసియాడుచుండఁగ నొక్క
చాన పయ్యెదకొంగు చక్కసేయ
జిగుచూపు నిగుడించి మగువ యొకర్తు పై
బడుసుందరుల బరాబరులు సేయ

గీ॥ రమణు లిరుచక్కియల ధవళములు పెండ్లి
పాటలను బాడుచుండ వైభవముతోడ
వచ్చి జనకునిదరి నొప్పె వనజనయన
తెరమఱుంగున క్రొమ్మించుదీవె యనఁగ. 59

వ॥ అప్పుడు. 60

సీ॥ కులుమదామంబులు ఘుమఘుమసౌరభ
శ్రీగంధమును హేమచేలములును
గణ్ణభూషణములుం గరము లంగదములు
బచ్చలకడియముల్ బతకములును

బంగారుగొడుగులు బల్లకు లశ్వజా
తంబులు భద్రదంతావళములు
నాందోళికలు మణిస్యందన బృందంబు
లార్యవర్ణితగోసహస్రములును
గీ॥ మొదలయినపారితోషికములు ముదమున
నొసగి శాస్త్రోక్తముగ ధారవోసె స్వతను
జాత నప్పుడు పత్నీనమేతు డగుచు
జెలగి వరునకు శృంగారశేఖరుండు. 61

మ॥ అలరుంజప్పర ముప్పరం బలమి సొంపార న్మణిస్ఫూర్తిమం
జుల మా కౌతుకవేదిమీాన సుజనస్తుత్యాకృతిన్ నిల్చి మం
గళసూత్రంబు నృపాలశేఖరుడు వేట్కం దత్పయోజాననా
గళసీమన్ ఘటియించె బంధుజనవర్గం బాత్మ నుప్పొంగగన్. 62

వ॥ అంత. 63

క॥ పతి సతిపై సతి పతిపై
నతులితచతురతల జల్లులాడిరి ధవళా
క్షతమౌక్తికములు దల(బా
లతికుతుకిత లగుచు సుమతు లభినందింపన్. 64

చ॥ చెలువయు జెల్వు డొండొరుల జేరి ఘనాక్షతమౌక్తిక వ్రజం
బులు నిజమస్తకాగ్రముల బూనుప జిందరవంద లైననే
సలు కర మొప్పె దత్కరవిసారివిభాకచదేహసుప్రభా
కలన విచిత్రరత్నములకై వడి జూపర కద్భుతంబుగన్. 65

క॥ పతియనుమతి మతిబూనిన
సతి గుణవతి గతి విజితవశాప్రతతి నరుం
ధతి గని మ్రొక్కె ధరణీ
పతియును మదవతియు శ్రీవిభాసురలీలన్. 66

# సంపాదకీయము

పాఠకమహాశయులారా!

ఇయ్యది శ్రావణభాద్రపదముల వర్ష ద్రుపత్రిక. గత పత్రికలలో శ్లోకాంధ్రీకరణ సమస్యాపూరణ విషయము లొసంగబడి పలువురు కవులచే పూర్తిగావింపబడినవి. వారికి మాధన్యవాదములు. గతసంచికకు బంపినవారి రచనలలో యతిభంగములు, విసంధులు, పదదోషములును గొన్నిగలవు. రచయితల సంఖ్యాయమితమై యన్యరచయితల వ్యానాదికముల కాతంకముగల్గుచున్నది. కావున గీర్వాణాంధ్రీకరణ సమస్యాపూరణముల నింతటితో జాలించి యీ మూడవ సంచికలో నష్టావధానమున నొండగు దత్తపదిరచనార్థము ద్వివిధములగు రెండు ప్రకటించితిమి. మా కవివరు లీరచనల సకాలమున నుత్తరసంచికలో బ్రచురింప బంపెదరుగాక-

సంపాదకుఁడు
కవికంఠీరవ, కవిమూర్ధన్య,
ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర
కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంపాదక సహాయకుఁడు
విద్వాన్, గున్నేపల్లి అక్షయలింగకవి

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | |
|---|---|---|
| * 1 | సంపుటము ... ... ... | 15-00 |
| * 2 | ,, ... ... ... | 15-00 |
| 3 | ,, ... ... ... | 15-00 |
| 4 | ,, ... ... ... | 15-00 |
| 5 | ,, ... ... ... | 15-00 |
| 6 | ,, ... ... ... | 15-00 |
| 7 | ,, ... ... ... | 15-00 |

* పునర్ముద్రితములు గానున్నవి.

Note:-7వ సంపుటములో ననుబంధము (శ, ష, స, హ)లు ముద్రితమగుచున్నవి.

ప్రతులకు :

ఆంధ్ర సాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

రామారావుపేట

కాకినాడ

తూర్పుగోదావరిజిల్లా.

Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Bhaskara Rao at Republic Press Main Road, Kakinada.

శ్రీ శారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

ప్లవంగ - ఆశ్వయుజ కార్తికములు

సంపుటము 56 సంచిక 4



సంపాదకుడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీ శారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

ప్లవంగ - ఆశ్వయుజ కార్తికములు

సంపుటము 56 సంచిక 4



సంపాదకుఁడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర,

బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంవత్సరమునకు చందా

రు 3/-

విడిప్రతి

0-60 పైసలు

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

కాకినాడ

అధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అభినవభోజ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ చిరువోలు కోటీశ్వరరావుగారు
8. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
9. శ్రీ వేదుల రామచంద్ర కీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
10. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
    శ్రీ ఓలేటి వెంకట సుబ్బరాయశాస్త్రిగారు
11. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
12. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు

# విషయసూచిక



వంగ　　　　　　　　　　　ఆశ్వయుజ కార్తికములు

ంపుటము ౫౬　　　　　　　　　సంచిక ౪





# శరదృతువు

(ఆశ్వయుజ కార్తికములు)

ఉ. భూసతికి న్దివంబునకు బొ ల్పెసఁగంగ శరత్సమాగమం
బ్బాసకలప్రమోదకర మై విలసిల్లె మహర్షి మండలో
పాసితరాజహంసగతిభాసి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు నబ్జజయానముతో సమానమై.

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె; వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై.

(నన్నయ భట్టారకుడు)

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్

శా. ధ్వానాంభఃపటలంబునం బృథుపయోధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నాఁ
గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్.

(ఎఱ్ఱాప్రెగ్గడ)



శ్రీరామాయ నమః

# నాస్తి - అస్తి

శ్రీ శిష్లా బాలకోటీశ్వరరావు.

శ్లో. నైకాకీ నృపతే ర్యాతి దేహ స్సహచరం వినా
ప్రవిశంతిస్మ హా!పౌరా స్సరయూం భవతా సహ.

నేఁటి కైదుసంవత్సరములకుఁ బూర్వము కవిమూర్ధన్యుని లేఖిని నుండి వెలువడిన నాస్తి-అస్తి యనుగీర్వాణలఘుకృతిలోని దీశ్లోక రత్నము. నూటయెనిమిదిశ్లోకములలో లోకారాధ్యుఁ డగు శ్రీరామ చంద్రుని మధురమనోహర వ్యంగ్యరీతిలో స్తవించి యద్వైతతత్త్వము విశదీకరించిన కాకరపర్తి కృష్ణశాస్త్రిగారి కవిమూర్ధన్య ప్రౌఢకవిచంద్ర కవికంఠీరవ బ్రాహ్మీభూషణాది బిరుదములు సార్థకములైనవి. ఈవ్యాస పారంభమున నుదహరింపఁబడిన శ్లోకము గమనింపుఁడు. రాచపీనుగు తోడు లేకుండ బో దనుసామెతను స్వీకరించి రాముఁడు సరయూజల ప్రవేశ మొనరించి యాత్మహత్య గావించుకొన్నాఁ డని చమత్కరించిరి అంతయు నైనపిదప విరక్తుఁడైన రఘురాముఁడు నతనివెంట రాజ భక్తు లగునయోధ్యాపౌరులు సరయూనదిలో మునిఁగి పరమపదించిరి. ఈసత్యము నిక్కే వచించుటలో కవిత్వము లేదు. ప్రౌఢకవిచంద్ర బిరుదలక్ష్మీసమేతుంగస్తనపులకితగాత్రు లగుటచే తెలుగుదేశమున సుప్ర సిద్ధ మగు సామెతను జోడించి ప్రశస్తకవితాలోలుపు లగునాంధ్ర విద్వజ్జనులకు సంతోషము సంతృప్తి సంధించిరి. ఛందోబద్ధముగ విర చింపఁగలవారు పలువు రున్నారు. వారెల్లరును కవులే యని వాకొనుట ప్రబలసాహసమునకు నిర్దోషదృష్టాంత మగును! చమత్కృతిగర్భితముగ సలక్షణముగ కవనము జెప్పి మెప్పింపగల యాధునికప్రౌఢపండితకవి పీరులలో శాస్త్రిగారు శిరోమణి యనుట కీశ్లోకము చాలును.

ఇం దున్న శ్లోకము లన్నియు నిట్టి వే! అసదృశకవితా వై భవముతో నమలినపాండితీశౌండీర్యముతో ప్రకాశించుచిరత్నరత్నములే!! గీర్వాణాంధ్రభాషలలో ననన్యసామాన్యప్రజ్ఞ నార్జించి బాహాటించిన కృష్ణశాస్త్రిగారి కూలంకషశేముషి యీలఘుకృతిలో నపరిమితస్ఫూర్తి మంతమై భాసించుచున్న దని నే ననుట చంద్రజ్యోత్స్న ప్రకాశవంతము నాహ్లాదకరము నని పలుకుటయే యగును. ఈశ్లోకము నరయుఁడు.

హే దేవ! మే దేహి పదం త్వదీయం
యాచే న తే మాంసలచారుహస్తమ్
దదా పదం యన్మునయే గృహిత్వం
హస్తోఽ రిదారాన్ విధవాంశ్చకార.

దేవుఁడ వైనయోరామచంద్రా! నీ మాంసలచారుహస్తమును నేను యాచించుట లేదు. అదిశాత్రవపత్నులను విధవలను గావించినది. నీపదమును నా కిమ్ము. అది యహల్యాశాపవిమోచనము జేసి మునియగుగౌతమునియొక్క గృహస్థాశ్రమనిర్వహణమునకు దోహదించినది.

ఇంతనిర్భయముగ రామునిఁ గోరఁగలవా రెంద రుందురు? ఈశ్లోకమునఁ దోఁచుచమత్కారము రసజ్ఞుల నలరింపదా ?! కవిమూర్ధన్యుని కలమునకు మోమోటమే లేదు. రాముఁడైనను జగదభిరాముఁడైనను నిక్కువమును నిస్సంశయముగ వెల్లడించుటయే దాని లక్ష్యము. అది సంపూర్ణముగ నీకావ్యమునఁ బ్రతిఫలించుచున్నది. చదువరులను సభ్రమచకితులనుఁ జేయఁగలమహత్తరవక్రోక్తిసంపద విశ్వరూపముతో నిందుఁ బరిమళించినది. మొదటినలుబదియేఁడు శ్లోకములలో నిది లలితలలితముగ విస్తరించి పాఠకుల సమందానంద పరవశుల నొనరించును. మిగిలినశ్లోకము లాద్యంతము. బ్రాహ్మీభూషణు లైనశాస్త్రిగారి వేదాంతవిద్యాపరిశ్రమను బాహిరించును.

రసవత్తమహాస్యచమత్కారములకునద్వయానందాద్వైతతత్వమహా ద్భాగ్యమునకు నీ నాస్తి-అస్తి పుట్టినిల్లు.

శ్లో. మందోదర్యా ఏకభుక్తం పథ్యం కల్పయసి ప్రభో!
విధాయ విధవాం రామ! కిము వైద్యో భవాన్ మహాన్?

ఆయుర్వేదవైద్యసార్వభౌము లగుకృష్ణశాస్త్రిగారికి రాముఁడు భిషగ్వరుఁడుగా గోచరించినాఁడు కాఁబోలు! రావణుని వధించి మందోదరి (అజీర్ణరోగిణి)ని విధవను జేసి దినమున కొకపూటమాత్రమే భుజించు నట్లు పథ్యము గల్పించినరామా! నీవు మహావైద్యుఁడ వనినారు. ఇందు ప్రతిఫలించుచున్న మధురహాస్యము సంస్కృతసాహిత్యమునకే యలంకారము. ఇట్టిదే మఱియొకశ్లోకము.

శ్లో. మార్దంగికో గాయకో వా భవాన్ ప్రౌఢో; న చేత్త్వయా
కథం నిపాతితం రామ! లీలయా తాలసప్తకమ్?

శ్రీరాముఁడు ప్రౌఢుఁ డగుమార్దంగికుఁడో గాయకుఁడో కాకుండిన తాలసప్తకయి నెట్లు పడఁగొట్టు ననుశంక శాస్త్రిగారిలో నుదయించినది. తాలసప్తక మనునప్పుడు రూపమున్నగు నేఁడు తాళములు, నేఁడు తాటిచెట్లు స్ఫురించి పఠితలను ముగ్ధుల నొనరించును. అంతేకాదు! వీరాధివీరుఁడు సత్యపరాక్రముఁడు నగురామచంద్రు నేమని పృచ్ఛించుచున్నారో చూడుఁడు.

శ్లో. స్త్రీ కాకో మర్కట శ్శైవ్యో మహీజా భవతా హతాః
అహో! కోదండపాండిత్యశౌండీర్యము తావకం మహత్!

స్త్రీని కాకమును మర్కటమును శైవుని వృక్షములను గూల్చిన రాముని కోదండపాండిత్యశౌండీర్యము మహత్తరమే యనుటలో నుట్టిపడువ్యంగ్య మసదృశము, ననంతము!

ప్రాచీన సంస్కృతకావ్య నాటకములలో సునిశితము నగు హాస్యము వ్యంగ్య మని పరిశోధకుల యభిప్రాయము. సుప్రసిద్ధు లగు కాళిదాసాదుల రచనలలో శృంగారాదిరసపోషణము గావింపఁబడినట్లు

హాస్యము సాక్షాత్కరింపదు. అందుల కనేక కారణము లుండవచ్చును. లంబోదరప్రహసనము యోగానందప్రహసనము మొదలగునవి వెకిలి హాస్యముతో నిండి యసభ్యసంభాషణములతో జుగుప్సాకరము లాయె ననుటనిర్వివాదాంశము. నేటి శాస్త్రిగారి యీకృతి యాకొఱంతఁ బరిహరింపఁగల దనుట నిక్కువము.

శ్లో. పాకశాలా విశాలాబ్ధి స్సం త్యత్ర బడబానలః
నీరం విసారో లవణం పాచక స్సాయక స్తవ!

దక్షిణమహాసముద్రమే నీకు విశాల మగుపాకశాల. అక్కడ వంటజేయుటకు బడబానలము, నీరము, లవణము, చేపలునున్నవి. నీసాయకమే పాచకుఁడు.

సుధామధుర మైనకృష్ణశాస్త్రిగారిలేఖిని శ్లేషాలంకారసౌరభము లనుగూడ వెదజల్లినది.

శ్లో. ఖరకిరణకులీనశేఖర స్త్వం ఖరనఖరాగ్రవిహంగరాజమిత్రమ్
ఖరతరశరవాన్ న చిత్రమేతత్ ఖరసుర వైరివిదారణైకకార్యమ్.

నీవు ఖరకిరణకులీనశేఖరుడవు. ఖరనఖరాగ్రవిహంగరాజు (జటాయువు)నకు స్నేహితుడవు. ఖరతరశరములు గలవాఁడవు. వైరి యగుఖరాసురుని విదారించినావు. చిత్రమేమియును లేదు. ఖర శబ్దమును గ్రహించి "మోచాఫలోదరసారాకరవాగ్రమామధురిమాధారైకధారాధుర" ద్యోతమాన మగునట్లు శ్లోకమును రచించి వైదుష్యపరిపూర్ణుల నందించిన శాస్త్రిగారి చిత్రకవిత్వధోరణి శ్లాఘనీయము.

శ్లో. చతురాస్యోఽ తనుస్ఫూర్తి శ్శంకరః పురుషోత్తమః
భవాన్ కిం బహునా రామ! భవ త్యంబురుహాంబకః.

రాఘవుని చతురాస్యుఁ డని(చతురుఁ డని, బ్రహ్మ యని)యతనుస్ఫూర్తి యని(మన్మథుఁడని, విలాసకలితుఁడని)శంకరుఁ డని (శివుఁ

డని,శుభదాయకుఁ డని)పురుషోత్తముఁ డని(హరి యని, నరోత్తముఁ డని)శ్లాఘించి తనియక యంబురుహాంబకుఁ డనినారు. అంబురుహాంబక శబ్దమున విరిసిననాలుగర్థములు (పద్మము తల్లియైనబ్రహ్మ, పద్మము-బాణమైన మదనుఁడు;అంబురుహమనఁగా నగ్ని; యది నేత్రమైన శివుఁడు,పద్మము కన్నైనవిష్ణువు)నిస్సంకోచముగ నుపయోగించికొని తనప్రతిభను వ్యక్తీకరించిరి.ఆ యనితరసాధ్యప్రతిభ నిరాటంకము, నిరుపమానము ననుటకు మఱియొక చక్కనిదృష్టాంతము.

శ్లో. జ్యేష్ఠం త్వా దయితం, వనం పితృవనం పుత్త్రం తు సింహాసనం
కైకేయీ కుటిలానయత్; త్వపినృపో రక్షోనృప స్సంహృతౌ
సామ్రాజ్యే పరిషేచితౌ తదనుజౌ వక్ష్యామి కిం భో స్త్వయా
యాష్మాకీనకులక్రమాగతసదాచారః కి మీదృగ్విధః?

కైకేయి పతిని పితృవనమునకు జ్యేష్ఠుఁ డగు రాముని వనమునకుఁ బంపి రాజ్యమును తనకొడుకున కిచ్చినది. రాముఁడు నాపద్ధతినే యవలంబించి జ్యేష్ఠు లగువాలిని రావణుని వధించి సుగ్రీవవిభీషణులకు సామ్రాజ్యదానముఁ జేసినాఁడు.రామగాథలో సంభవించిన యీరెండు సంఘటనలను చేర్కొని యాష్మాకీనకులక్రమాగతసదాచార మని యీమహామహుని వెటకారింప సాహసించిన శాస్త్రిగారి నేమనఁ గలము?

శ్లో. యస్యా దుర్ణయతో హత స్తవపితా కాంతారచారీ భవాన్
తస్యా ఆత్మభవస్య మూర్ధ్ని నిహితం ప్రాజ్యం తు రాజ్యం త్వయా-
హిత్వా మాతర మంగనాం బత!సదా సేవాపరో లక్ష్మణః
కిం లబ్ధో?హి శిలాహతామ్రమహిజో దాతా ఫల స్యారయే.

నీ తండ్రిచావునకు కారణమై ని న్నడవులకు గెంటినకైకను క్షమించి యామెకొడుకునకురాజ్యపాలనాధికారమును బ్రసాదించి, తల్లిని భార్యను వీడి నిరంతరము నీసేవచేయుటకు సంసిద్ధుఁ డయిన సౌమిత్రికే మొసఁగినావు?స్వప్రయోజనాపేక్షయే లేని యాతఁడు

సేవలనం బొందిన దే మున్నది?అని ప్రశ్నించి యామ్రమహిజము శిలలతో గొట్టువానికే ఫల మిడునని చెప్పి లోకసహజప్రవృత్తిని చాటిన కవిమూర్ధన్యునినైరంకుశ్యము కవిలోకమునకే గౌరవప్రదము.

ఇట్టి నైరాఘూటచారుధోరణిలో రాముని చేతలను విమర్శించి యదంతయు నాస్తి యని పర్యుదాసించి, గాఢాజ్ఞానాంధతామసము నుండి వెలువడితి నని వక్కాణించి

శ్లో. జాతో న;సీతో పయమో న;యానం
వనే న;దారాపహరణం న;సఖ్యం
సుగ్రీవరాజే న;సేతుబన్ధో
న వా, దశగ్రీవహ్రుతి ర్న; భూమన్ !

అని నిర్ధరించిరి.నీవు పుట్టలేదు;సీతను పెండ్లాడలేదు;వనమునకుం జనలేదు;నీభార్య యపహరింపబడలేదు;సుగ్రీవునితో సఖ్యము సేయ లేదు;సేతువు నిర్మాణింపలేదు;దశగ్రీవుని వధింపలేదు;నీ వాదిమధ్యాంత రహితుండ వైనపరమాత్మ వని శాస్త్రిగారు ప్రవచించుటతో రామాయణము దబ్బఱ యైనది.వాల్మీకినుండి నేఁటివఱకు విశ్వసింపం బడుచున్న రామశబ్దము భూమశబ్దముగం బరిణమించినది!

శ్లో. త దేవ నిత్యం సత్యం య ద్యత్పూర్ణ మచలం చ తత్
త దేక మద్వితీయం యత్ బ్రహ్మత్వ మసి రాఘవ!

ఏది సత్యమో యది నిత్యమైన దని, యేది పరిపూర్ణమో యది యచల మని, యేది యద్వయమో యది యేక మని వ్రాక్రుచ్చి యట్టిబ్రహ్మము నీ వని రాఘవుని మహోన్నత పదమున నిలిపినారు.

శ్లో. బ్రహ్మ సత్యం;జగ న్మిథ్యా నాస్త్య ప్యస్తీవ తజ్జగత్
అస్త్యపి బ్రహ్మ నాస్తీవ భాసతే మాయయా సదా.

బ్రహ్మ సత్య మనియు,జగత్తు మిథ్య యనియుం దెలిపి,లేనిజగ మున్నదానివలె, నున్నబ్రహ్మము లేనిదానివలె భాసించుటకు మాయయే కారణ మని వెల్లడించి తమ వైదాంతికకృషి సమ్యా

క్సామర్థ్యవంత మని నిరూపించిన కృష్ణశాస్త్రిగారు చమత్కృత్యభిలాషను విడువలేక-

శ్లో. ద్వావేకో రామకృష్ణావి త్యూచు స్తే మానినః పురా
 రామో భవాః నహం కృష్ణో భవా నహ; మహం భవాన్.

అని నుడివిరి. రామకృష్ణులకు భేదము లేదని పురాతనమునులు వచించినారు. నీవు రాముఁడవు. నేను కృష్ణుఁడను. కనుక నీవే నేను, నేనే నీవు.

ఇవి యేదో యుబుసుపోకకుఁ బలికినపలుకులు కావు. ఎన్నో యనుభవములతో నలసి సొలసి, యెంతో జిజ్ఞాసతోఁ బరిశ్రమించి, పరమేశ్వరునితో మానసికముగ నేకీభవించి యాత్మజ్ఞానవేత్తలై సాధికారముగ ముముక్షువులకు పాయనించిన పసిఁడితునకలు. ఆఱుపదులవయస్సును స్థిరచిత్తముతో గీర్వాణాంధ్రవాణీచరణసరోరుహార్చనపరతంత్రులై వెచ్చించి వేరికిని లోఁగక యేరిని నొప్పింపక కవికంఠీరవులై పండితశిరోమణులై వేదాంతిచక్రవర్తులై ధన్యతములై యుభయభాషలలో నసంఖ్యాకసత్కృతులను విరచించి శారద కనర్ఘోపదలను సమర్పించిన కాశరపర్తి కృష్ణశాస్త్రిగారివంటి సుకృతులను వీక్షించినపిదప నెవ్వాఁడైనను "జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః" అని కొనియాడును. కొనియాడలేని కుసంస్కారుల దౌర్భాగ్యమును జక్కదిద్దు బాధ్యత కాలమునకేకాని మనకు లేదు!!



# ఆంధ్రవాణీప్రశస్తి

శ్రీ విశ్వనాథకవిగారు

౧

ఓంకారస్వరజన్యమై ప్రథితవేదోక్తస్వధర్మక్రియా
హుంకారాశయధన్యమై, సుకవితా హోమాగ్నిశబ్దార్థధూ
మాంకూరోద్గత భావసౌరభములో ద్యచ్చిత్కళామాన్యమై
శంకాపంకిలశూన్య మా తెనుఁగుబాసం గొల్తుఁ బత్తీరులన్.

౨

శ్రీనీహారధరాధరాగ్రరజతాద్రి స్వర్ణసింహాసనా
సీనుం, డర్ధసతీశు కైడమరునం జెన్నారు సృష్ట్యాదిమ
ధ్యానంబుంబలె దుష్టభీకరము నై, భక్తప్రమోదప్రదం
బై, నిత్యాద్భుత మైన మా సురుచిరార్యాంధ్రోక్తిఁ గీర్తించెదన్.

3

నలుమోముం దెలిదమ్ములన్ సుమధురామ్నాయస్వరస్వాదు మం
జులమాధ్వీరసధారలం గురియు సుశ్లోకప్రభావాఢ్యు, ము
ద్దులపట్టిన్ నిజనాభిపద్మగృహమందు న్నిల్పి, సృష్టిస్థితుల్
దొలఁకం జేయుముకుందు మంత్రమహిమోత్తు ల్లగ్గు మా తెల్గునన్.

౪

గీర్వాణాంధ్రమనోజ్ఞశబ్దమయమై, గీర్మాతృవీణాక్వణా
పూర్వశ్రావ్యలయ స్వరానునయమై, పూర్వార్ష వేదాంతసూ
త్రోర్వీజాగమశాఖికాగత సుధర్మోదార గంధానిలా
ఖర్వోర్మిరయమై తెలుంగునుడి దిగ్దంతిశ్రవఃపేయ మా.

౫

మురళీమోహనరాగకల్పలతికా మోదప్రసూనాళితోఁ
గరుణాపూర్ణకటాక్షవీక్షణకళా కల్యాణగౌరీశ్వరీ
దరహాసద్యుతిచంద్రికావితతితోఁ దారుణ్యతారళ్యతన్
సరితూఁగంగల సుందరాంధ్రకవితా సౌభాగ్య మగ్గించెదన్.

౭

చిరదారిద్ర్యమహాంధకారపటలీ చింతానిశాకష్ట ని
ష్ఠురదుస్స్వప్నదురంతదాస్యదశ గట్టుల్ ద్రెంచి, స్వాతంత్ర్యభా
స్కరరమ్యోదయ సౌమ్యశాంతికళికా సంపన్మహానంద సుం
దరశోభాదశ్యమై వెలుంగు తెలుఁగుం గావ్యంబు భావ్యం బిలన్ !

౮

చెంగల్వ, త్తెలిదామర, లొప్పగడలుం, జేమంతులు, న్మొగ్గసం
పెంగ, ల్మల్లెలు, మొల్లలు, న్ననుగులాబీ, లొప్పెన్నగన్నేరు గే
దంగు, ల్వావిలిసన్నజాజిగురివెంద, లున్మద్దక్రోంబంతిపూల్
సింగారించిన మేలిచెండ్లుగ గుబాళించుం దెలుంగుంగృతుల్.

౯

పొంగుల్వాఱు వసంతసాంధ్యపవనోర్ము ల్దాఁటుచుం గోర్కె లు
ప్పొంగంగా నెదురీఁత యీఁది, వలపుంబూబోటి యుల్లెల్లఁగొ
ల్లంగొట్టం జని, తేనెపుప్పొడి సిరుల్గాఁజేయు పట్పాదిబు
క్సంగీతస్వరమాధురిం జిలుకు మా శ్రవ్యాంధ్రకావ్యశ్రుతుల్.

౯

స్తుతిపాత్రప్రియమిత్రతన్ బ్రియుకుపూఁదోఁట న్విహారించుచున్
ధృతి నిష్టార్థఫలావళి న్మెసవుచున్ శ్రీశారికాకీరదం
పతు లింపార నొనర్చు సుప్రణయభావస్ఫూర్తి సంభాషణా
ప్రతతుల్ జ్ఞప్తికి వచ్చుచుండు మధురత్రైలింగభాషాకృతిన్.

౧౦

మధువీధిన్ సహకారసౌధమణిసీమన్ మాధవీమంటపం
బధిరోహించి, రసాలపల్లవకషాయం బాని, రాగైకసే
వధి యా కంఠవిపంచిఁ బంచమరుతిన్ వర్షించి, హర్షైకవా
ర్నిధి లోకావళిఁ దేల్చుకోకిలగతిన్ బ్రీణించు నాంధ్రీకృతుల్.

# ఆంధ్రవాణి ప్రశస్తి

౧౧

విలసద్వేదపురాణ పుణ్యభరతోర్వీసాహితీజీవధా
రల నూరించుచు, నారికేళకదళీద్రాక్షాఖ్యపాకత్రియా
కలనన్ గోఘృతశర్కరారుచిరభక్ష్య క్షీరశాల్యన్నముం
బలె సంతుష్టి ఘటించునట్టి తెనుగుంగబ్బంబు ప్రబ్బం దగున్

౧౨

మందారప్రసవాచ్ఛగుచ్ఛ విగళన్మాధ్వీకధారా స్ఫుర
న్మందాకిన్యమరాపగా తటనటన్మాయూరలాస్యాప్సరో
బృందాంఘ్రిక్రమరత్ననూపురఝణత్క్రీడా స్వనశ్రావ్యతా
సౌందర్యోక్తి విచిత్రితాంధ్రకవితాస్వారస్య భ్రూస్వాద్యమా



# మాళవికాగ్నిమిత్రే విద్యాపద్ధతిః

శ్రీ అయ్యగారి నరసింహమూర్తి

యా మానవేభ్యో మనోవికాసం వినయసౌశీల్యాది సుగుణ సంపత్తిం కార్యాకార్యవివేకం చ దదాతి సా విద్యేతి మంతవ్యా. అద్యతనకాలే విద్యార్జనాయ సాధనాని బహూని విద్యంతే. పురాతనే కాలే ఏవం విధ బహుముఖ విద్యార్జనా సాధనాని న హి ప్రచురాణి. యది వయమ్ జనగణసంఖ్యాః ( Figures of census) పరిశీలయామః తదా స్వాతంత్ర్యాధిగమానంతరం భారతదేశే అక్షరాస్యాః అధికతరాః భవన్తి ఇతి జ్ఞాయతే. కింతు ప్రజానాం అక్షరజ్ఞానేన సహ అవినయః అశ్రద్ధా చ మూఢతాపి చ దినేదినే వర్ధంతే. అస్య హేతుః అయమ్ అద్యతనమానవః స్వమానసిక వికాసానుగుణామ్ విద్యామ్ విహాయ పరీక్షాసు కృతార్థతాదాయి అఙ్కాన్ (Marks) సమ్పాదనమేవ ప్రధానలక్ష్యం కృతవాన్ యత్కించిత్ ప్రాప్తవిద్యోఽపి అద్యతనమానవః అనుదినజీవితే ఏతత్ విద్యయా కించిదపి ప్రయోజనం న లభతే. అపి బహుధనవ్యయేన ప్రాప్తవిద్యయా ఈషదపి ప్రయోజనం నాస్తీతి స్వభాగధేయం నిన్దయన్ చిన్తామధిగచ్ఛతి. విద్యాభ్యాసానంతరక్షణే ఏవ జీవికాయై వేతనార్థీభూత్వా యేన కేనాప్యుపాయేన యస్మిన్ కస్మింశ్చిదపి ప్రభుత్వసంస్థాయాం వా పారిశ్రామికశాలాయాం వా ప్రవిశతి. స్వకర్తవ్యే శ్రద్ధా నాస్తు. శక్తిర్నాస్తు. కర్తవ్యపరో భవతు వా న భవతు. మాసాన్తే భృతిమ్ ప్రాప్తుం దినగణనతత్పరో భూత్వా తిష్ఠతి. వేతనప్రాప్తిరేవ విద్యాఫలావాప్తిరితి మహాన్ భాగ్యాతిశయ ఇతి మన్యతే. ఏతద్భ్రాంతిః తస్యైవ న కేవలమనర్థదాయీ. కింతు దేశారిష్టపరా. అద్యతనవిద్యార్థీ భాషాద్వయం వా త్రయం వా పఠిత్వా త్రీణి శాస్త్రాణి అధీత్య తైః సర్వైరపి యుక్తోఽపి కిం కర్తవ్యతావిమూఢస్సన్ అహోరాత్రమ్ అనుద్దిష్టప్రయోజనాభ్యాసయా విద్యయా ధనరూపేణ వా ఆత్మోద్ధరణరూపే

ణా వా ప్రయోజనం కించిదపి నాస్తీతి బుద్ధ్వా ఆత్మనిందా పరనిన్దా స్వభాగ్యవిహీనతాం చ నిన్దతి.

పూర్వస్మిన్ కాలే భారతదేశే వృత్తి(కర్మ)విభాగశః చాతుర్వర్ణ్యం సృష్టం. భిన్నభిన్నకులస్థాః భిన్నభిన్నాః విద్యాః రక్షిత్వా అవర్ధయన్ తస్మాత్ తాః విద్యాః కులవిద్యాః ఇతి భిన్నవృత్తిసంబన్ధతయా వృత్తివిద్యా ఇతి చ వ్యవహృతాః. తా ఏ వాద్య అస్మాభిః సాంకేతిక విద్యాః ఇతి వ్యవహృతవత్యః అద్యతనకాలే ఇవ, తస్మిన్ కాలే వృత్తివిద్యాభ్యాసాయ పాఠశాలాః వా కళాశాలాః వా న స్థాపితాః. వృత్తివిద్యాకోవిదాః వృద్ధాః స్వకర్మశాలా స్వేవ స్వకులబాలకేభ్యః విద్యాప్రదాతారః అభూవన్ అపి చ వృత్తే ర్వంశక్రమానుగతతయా తాసు కౌశలం సౌలభ్యం చ తేషాం అప్రయత్నతయా ఏవ ప్రాప్తం. కులవిద్యాం విహాయ అన్యవిద్యాగ్రహణం కులద్రోహ మితి పరిగణితం. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. తస్మాత్ అన్యధర్మో అనాచరణీయః" ఇతి తేషాం విశ్వాసః.

తత్తత్కులజనానాం స్వవృత్తివిద్యాసు అధికాదరాభిమానౌ చ స్తః సర్వేషాం వృత్తిమతాం స్వస్వవంశైస్సహ స్వస్వవృత్తీనా మపి అభ్యుదయకాంక్షా అతీవ బభూవ. అయ మేన విషయః మాళవికాగ్నిమిత్రే గణదాసేన విశదీకృతః. "కామం ఖలు సర్వస్యాపి కులవిద్యా బహుమతా" యద్వస్తు యదా ఆత్మీయ మితి భావితం తదా తస్మిన్ యత్ప్రేమ వర్తతే తాదృశం ప్రేమ నాన్యత్ర దృశ్యతే.

చతుష్షష్టిషు కలాసు ప్రత్యేకమానవ స్యాపి యస్యాం కస్యాం వా ఆసక్తి మవశ్యం వర్తతే తేషు స్థితాం తాదృశీ మాసక్తిం మాతాపితరౌ వా గురవో వా జ్ఞాత్వా తాన్ సుశిక్షితానాంబోధనాపటూనాం గురూణాం సన్నిధానే యది సమర్పయన్తి తర్హి "సూర్య-సూర్యకాన్తమణిన్యాయేన గురుశిష్యావుభా వపి తేజోవన్తౌ భవతః. ఇయ మే

వార్థం పురస్కృత్య మాళవికాగ్నిమిత్రే గణదాసో మాళవికాం ప్రతి ఇత్థం వదతి. "పాత్రవిశేషే న్యస్తం గుణాంతరం వ్రజతి శిల్పమాధాతుః కథ మితి చేత్ "జల మివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య" ఇమ మేవ భర్తృహరి రపి "స్వాత్యాం సాగరశుక్తిమధ్యపతితం సన్మౌక్తికం జాయతే" ఇత్యుక్తవాన్. అతః శిష్యాభిలాష మనుసృత్య సక్త్యమబోధనపటిష్ఠాః గురవః వాంఛితాః.

"దృశ్యం తమసి న పశ్యతి దీపేన వినా స చక్షు రపి" తథైవ స్వాధీతవిద్యాయాః సక్రమప్రయోగాజ్ఞతయా తద్విద్యావ్యర్థా ఏవ.

పూర్వస్మిన్ కాలే గురూణాం విజ్ఞానజిజ్ఞాసా బహుతరా బభూవ. అద్య తు విద్యాపరమార్థ ఏవ బహుశః వ్యత్యస్తో జాతః. అద్య విద్యాపరమార్థః ధనార్జన మేవ.

పూర్వస్మిన్ కాలే విద్యార్థినః న కేవలం యశస్వినః. కింతు వయం భగవతః అముకగురోః శిష్యాః ఇతి సగర్వం ప్రవదన్తి. అద్య తు తాదృశగురుస్మరణపరాయణాః మృగ్యాః. పూర్వస్మిన్ కాలే ఏతాదృశాః శిష్యాః బభూవు రిత్యస్య కాళిదాసవాక్య మేవ ప్రమాణమ్ "దేవశ్రీయతామ్ మయా సుతీర్థాత్ అభినయవిద్యాశిక్షితా దత్తప్రయోగ శ్చాస్మి దేవేన దేవ్యా చ పరిగృహీతః"

అద్యాపి తాసు తాసు విద్యాసు నిష్ణాతారః బోధనపటవః చ గురవ స్సంతి. కింతు తాదృశానాం సామర్థ్యం జ్ఞాత్వా సమ్మాన దాతారః మేధావిన ఏవ దుర్లభాః.

విద్యావతః శక్తిం సామర్థ్యం చ పరీక్షితుం అపి సమర్థాః పక్షపాతరహితాః చ యదా లభన్తే తదైవ తస్య ప్రజ్ఞావిశేషాః ప్రకటితాః ప్రకాశితా శ్చ భవన్తి. ఇమ మేవార్థం కాళిదాసః పరివ్రాజికాముఖతః ఉక్తవాన్. మాళవికాగ్నిమిత్రే హరదత్తగణదాసయోః విద్యావిషయవివాదే జాతే తయోః అధికత్వనిర్ణయాయ రాజ్ఞా యాచితా పరివ్రాజికా వదతి. "అలం ఉపాలంభేన పత్తనే

విద్యమానేఽపి గ్రామే రత్నపరీక్షా ఇతి. "అపి చ ఏకేన పరీక్షకేణ ఏవ విద్యావతః శక్తేః సామర్థ్యస్య చ పరీక్షణ మపి న సముచితం. ఇమ మేవార్థం పరివ్రాజికాముఖతః ఉక్తవాన్. సర్వజ్ఞస్యాప్యేకాకినో నిర్ణయాభ్యుపగమో దోషాయ ఇతి సమానవిద్యాకయోః మధ్యే యశః స్పర్ధాపి సహజతయా వర్తతే. అత ఏవ సుష్ఠూక్తం "స్పర్ధయా వర్ధతే విద్యా" ఇతి ప్రాయః సమానవిద్యా పరస్పరయశః పురోభాగః ఇతి చ.

తర్హి విద్యాయాం సమానకక్ష్యాం గతయోః కస్య ప్రాధాన్యం దాతవ్యం ప్రశ్నః ఇతి చేత్ కవికులతిలక ఏవ సమాధత్తే "నను సమానేఽపి జ్ఞానవృద్ధభావే వయోవృద్ధత్వాత్ గణదాసః పురస్కార మర్హతి ఇతి. అతః సమానజ్ఞానవృద్ధయోః వయోవృద్ధ ఏవ ప్రథమతాం బూలార్హః"

పరీక్ష్యయోః ఏక మేవ పరీక్ష్య పక్షపాతతయా స ఏవ అధిక ఇతి నిర్ణయకరణ మపి అసమీచీనమ్. అన్యస్య గుణ మపి సమ్యక్ జ్ఞాత్వా వివిచ్య ఏవ విజేతా బహూకర్తవ్యః. అత ఏవ మాళవికాగ్ని మిత్రే "తిష్ఠ తిష్ఠ గుణాన్తర మజానన్ కి మితి త్వమాభరణం దదాసి. ఇ త్యధిక్షిప్తః విద్యావ్యక్తివిశేషేషు కథం విరాజతే? గురు పదార్హః కఃఏతయో రుత్తర మపి కాళిదాసేనైవ పరివ్రాజికాముఖతః దత్తమ్." శ్లిష్టాక్రియా కస్యచి దాత్మసంస్థా సంక్రాన్తి రన్యస్య విశేషయుక్తా యస్యోభయం సాధు సశిక్షకాణాం ధురి ప్రతిష్ఠాపయి తవ్య ఏవ."

ఏకో ముఖ్యవిషయః :— సర్వేఽపి విద్వాంసః గురుత్వా మనాఽఽగ్నన్తి "సుశిక్షితోఽపి సర్వః ఉపదేశదర్శనేన నిపుణో భవతి." అద్యతనానాం విద్యార్థినాం విద్యాస్థాయీ అధఃస్థితా ఇత్యస్య అయ మేకో ప్రధానహేతుః. ఉపాధ్యాయేషు బహూనాం బోధనాపాటవః మృగ్య ఇతి మ మాశయః."

అద్యతనేషు కతిపయాధ్యాపకేషు పరీక్షాసు ప్రథమశ్రేణ్యాం ఉత్తీర్ణేష్వపిబోధనాశక్తిః లోపభూయిష్ఠా ఇతి సర్వసాధారణతయా సర్వైరపి అవగమ్యతే ఏవ. తాదృశగురూణాం యే విద్యార్థినః తే ఆసక్తిహీనాః భూత్వా యేనకేనా ప్యుపాయేన ఇయం పరీక్షా అతిక్రాంతవ్యా పరీక్షాకృతార్థతైవ జ్ఞానా దధికం ఇతిభావయన్తి. విద్యార్థినః ఏకస్మి న్నపి విషయే ఆసక్తిప్రవేశో మాస్తు నామ స గూరుపన్యాసేన ప్రచోదితా భూత్వా "అయం విషయః క్షుణ్ణతయా జ్ఞాతవ్యః" ఇత్యేవం ప్రాయేణ కుతూహలేన తం ఉద్దీప్తం కర్తుం గురు స్సమర్థః అవశ్యం భవితవ్యః. అతః యది విద్యార్థినాం విద్యాప్రమాణాభ్యుదయః వాంఛితం తర్హి ప్రథమతయా యే బోధనాపటవః తే ఏవ ఉపాధ్యాయ పదవీషు పక్షపాతతయా నియోజ్యాః.

కేచన గురవః ఆత్మానాం బోధనాశక్తిహీనతాం జానంతి. తథాపి అన్యత్ర ఆత్మాభ్యుదయమార్గశూన్యత్వాత్ అథవా ఉపాధ్యాయవృత్తౌ స్థితం లాభ మపేక్ష్య వా తత్పదవ్యా మేవ స్థిత్వా ఇత స్స్వీయ మభివృద్ధిమార్గం దర్శయితుం అసమర్థాఃభూత్వా ఉభయమారకాః భవన్తి. యే సంపాదితజ్ఞానాః తేఽపి ఉపాధ్యాయాః అజ్ఞాః ఇవ శతశః సహస్రశః విద్యార్థినాం జీవనస్య నాశకాః భవన్తి. ఏతాదృశాః ఉపాధ్యాయాః అద్య గణనాతీతాః ఇతిచే దుక్తం తర్హి న క్రోధస్య నాశ్చర్యస్య అవకాశః అవసరో వా. కేచన అన్యవిధాః గురవః సన్తి. తేఽపి ఆత్మనః అశక్తి మసామర్థ్యం చ జానన్తి. స్వశిష్యాణాం స్వకృతం అన్యాయం చ జానంతి. తథాపి యదా స్వాత్మజాః యాంకా మపి పాఠశాలాం గత్వా స్వశిష్యా ఇవ అయోగ్యాః జాయన్తే. తదా తత్పాఠశాలాగురవః అయోగ్యాః అసమర్థాః శిష్యవిత్తాపహారకాః ఇతి దూషయన్తి. యుక్త మేవ. "స్వదోష వేత్తా నైకో ప్యస్తి" పరోపదేశవేళాయాం సర్వే వ్యాసపరాశరాః "యది ఉపాధ్యాయాః ఏవ ఏవమ్ వక్తారః. అన్యేషాం విషయం కిం

ప్రష్టవ్యమ్ అతః? ప్రత్యుపాధ్యాయః అపి తత్పదవ్యాం నియమన పూర్వమేవ తస్య బోధనసామర్థ్యే ప్రత్యక్షతయా పరీక్షితవ్యః. అయ మేవ సముచితో మార్గః పురస్థితానాం విద్యార్థినాం బోధనా మేవ యోగ్యతాపత్రం న విశ్వకళాపరిషద్దత్తం యోగ్యతాపత్రం యోగ్య తాపత్రమ్. త ద్దృష్ట్వా ఏవ తస్మై పదవీదానం అయోగ్యం."

ఇతఃపరమ్ గురుశిష్యాప్రతి సువిపులం ఉచ్యతే. యదా పునర్మందా మేధా,శిష్యోప దేశం మలినయతి తదా ఆచార్యస్యదోషోను ఇతిప్రశ్నః గణదాసేన సమ్యక్ ఆక్షిప్తః."వినేతు రద్రవ్యపరిగ్రహోపి బుద్ధిలాఘవం ప్రకాశయతీతి" తథాహి మేధావినే ఉపదేశ స్సులభః అల్పమేధావినం తత్సమానవిద్యావంతం కర్తుం కష్టమ్. అతః ఏకస్య విద్యావిషయే అభిలాషశూన్యత్వే హేతుః న కేవలం తస్య మానసిక స్థితిః, గురుణాం బోధనవిషయికదోషోఽపి.

కాశ్చి ద్విద్యాసంస్థాః మేధావినః ఏవ విద్యార్థినః ప్రవేశం దత్త్వా వయం సక్రమమార్గే క్రమశిక్షణాపూర్వకం సమర్థోపాధ్యాయ సన్నిధౌ యోగ్యశిక్షాం కల్పయామః; అతః అస్మాకీనవిద్యార్థినః ఉత్తమాఙ్కసహితాః పరీక్షాసు కృతార్థాః భవంతీతి ఘంటాఘోషం భణన్తి. యది తద్విద్యాసంస్థాగురవః మాళవికాగ్నిమిత్రోక్తరీత్యా "ధీమంతః బోధనాపటవఃతర్హి సామాన్యవిద్యార్థినాం నిషేధః కుతః? (న జానే?) పూర్వపరీక్షాసు యే విద్యార్థినః ఉత్తమాఙ్కసంపాదకాః విశిష్య యే మేధావినః తేషా మేవ తాసు సంస్థాసు ప్రవేశోదీయతే ఖలు. అత ఏవ తాసాంసంస్థానాం కీర్తిలాభోఽపి. అయమ్ సహజః సాధారణః అనాశ్చర్యకరః ఇతి అజ్ఞాత్వా జ్ఞానినః అజ్ఞానిన ఇవ తాం సంస్థాః స్తుత్వా మక్షికా ఇవ స్వపుత్రప్రవేశార్థం తాసు పతంతి. తాసు సంస్థాసుయాని యాదృశనిబంధనానివర్తన్తే తానియది సర్వాసాం సంస్థానాం కల్ప్యంతే.తర్హి సర్వసంస్థా స్వపి తాదృక్ ఫలమే వలభ్యతే

ఇత్యేవ తావన్మాత్ర మపి ఆధునికాః విద్యాధికృతాః నైవ జానంతీ త్యహో యది తత్కీర్తి మతీషుసంస్థాసు-సామాన్యవిద్యార్థినాం ప్రవేశం దాతవ్యం ఇత్యాజ్ఞా ఏకదా కల్ప్యతే. తదాతాసాం సామర్థ్యం విశదం భవతి, తాదృశవిద్యాసంస్థా స్వపి ప్రత్యేకబోధః. (Private Tution) అస్తీతి ప్రాయశః స్వల్పసంఖ్యాకానా మపి జ్ఞాతపూర్వ మితి భావయామి. యత్ర ప్రత్యేకబోధనాత్మకవాణిజ్య మధిక మస్తి తత్ర కక్ష్యాబోధః (Teaching in a class room) నాస్తీ త్యేవార్థః

విద్యార్థీ బహుమందమతి రేవ అస్తు. తథాపి సజ్జనసాంగత్యేన తస్తు రివ ధీప్రకాశసౌరభ్యం లభతే. కించ" మందో ప్యమందతా మేతి సంసర్గేణ విపశ్చితః పంకచ్ఛిదః ఫల స్యేవ నికషే ణావిలం పయః.

ఇతఃపరం యథార్థపాండిత్యవతః బోధనాసామర్థ్యశాలినః గురూ నధికృత్య వక్ష్యే మాళవికాగ్నిమిత్రే కాళిదాసః వదతి" లబ్ధాస్పదోఽస్మీతి వివాదభీరో స్తితిక్షమాణస్య పరేణనిన్దామ్ యస్యాగమః కేవల జీవికాయై తం జ్ఞానపణ్యం వణిజం వదన్తి. ఏతాదృశాః వణిజః అద్య బహవో దృశ్యన్తే. యదివిద్యాభ్యుదయ ఏవ వాంఛితః ఏతాదృశం వాణిజ్యం సంపూర్ణతయా నిషేధ్యం. ఇద మేవ వాణిజ్య మిదానీం విద్యాసంస్థాసు ప్రచలితస్య అక్రమవర్తనస్య మిత్రం అనేన వాణిజ్యేన ఇవ శిష్యవిత్తాపహారక ఉపాధ్యాయవణిజాం అశ్రద్ధాహేతోః నిర్ధనాః అజ్ఞాః కతిపయవిద్యార్థినః భ్రష్టా భవన్తి. గురూణాం శిష్యాః పుత్రా ఇతి మహాభారతవాక్యం. తేషాం గురుణైవ నిష్పక్షపాతతయా భవిష్యన్మార్గః. నిర్దేశ్యః శిష్యయోగక్షేమవాహకః గురు రేవేతి మాళవికాగ్నిమిత్రే ధారిణీవచనమ్.

కవికులతిలకేన కాళిదాసేన ప్రశంసితః మహాకవి ర్భాసోఽపి స్వీయే పంచరాత్రే శిష్యపాపం గురో రపి" ఇ త్యుక్తవాన్. పుత్ర

స్య ద్వాదశవర్షాధిగమనపర్యంత మేవ తన్మాతాపిత్రోః తస్య గుణదోషౌ ప్రతికర్తృత్వం తదనంతరం తాభ్యాం యది సపుత్రః యోగ్య గురుసన్నిధానర్పితః తస్య పాపం గురో రేవ న మాతాపిత్రోః ఇత్యపి త్రోః ఇత్యపి తేన విశదీకృతం॥

శ్రీరామచంద్రస్య కీర్తిచంద్రికా మివ ఉత్తరామచరిత రచన తయా స్వకీర్తిచంద్రికా మపి చతుర్దశాసు వ్యాపినీం యో మహాకవిః కృతః సః భవభూతిః తస్మి న్నేవ గ్రంథే విద్యాగ్రహణబోధనతత్త్వ మేవమ్ ఉక్తవాన్" వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యద్దైవ చ తథా జడే న చ ఖలు తయో ర్జ్ఞానే శక్తిం కరోత్యపహన్తి నా భవతి చ పున ర్భూయాన్ భేదః ఫలం ప్రతి తద్యథా ప్రభవతి శుచి ర్బింబగ్రాహే మణి ర్న మృదాం చయః.

ఏతేభ్యః విషయేభ్యః జ్ఞాతవ్యం ఇత్థం సంగృహీతమ్. ప్రథమతః యో విషయః విద్యార్థినః అభిమతః ఇతి సంరక్షకైః జ్ఞాతవ్యః తదనంతరం సః తద్విషయబోధనసమర్థగురుసన్నిధౌ అర్పితవ్యః గురువరణే బోధనసామర్థ్యమేవ ప్రమాణమ్. న కేవలం విశ్వకళాపరిషద్దత్తం యోగ్యతాపత్రమ్ కుత ఇతి చేత్ సర్వేషాం విదుషా మపి బోధనా సామర్థ్యం దుర్లభం. బోధనాశక్తిరహితాః ఉపాధ్యాయాః స్వయం భ్రష్టవా అభ్రష్టవాఅనువత్సరంసహస్రశః విద్యార్థీనాం జీవననాశకాః భవన్తిప్రత్యేకబోధన (Private Tution) నామతయాయద్వాణిజ్యం ప్రచలితం తత్ తత్క్షణం నాశయితవ్యం. అన్యశ్చ విశేషః యది యః కశ్చన విద్యార్థి సందిగ్ధం విషయం కక్ష్యాయాం(in the class room) పృచ్ఛతి తస్య సందేహాః యోగ్యోత్తరార్హాః స న నిన్దార్హః ప్రశ్నః న చ అపరాధః. సందిగ్ధప్రష్టారం దూషయిత్వా ముఖపిధానకరణం మహాద్రోహ ఇతి సర్వైరపి ఉపాధ్యాయైః అవగంతవ్యమ్. ప్రస్తుతవిద్యాదృష్ట్యా యది విద్యాప్రమాణాభ్యుదయః వాంఛితః తర్హి ఏతదంశాః అవశ్యాచరణీయాః.



# శివకవి గౌరనమంత్రి—అతని కృతులు

శ్రీ బండారు తమ్మయ్య

శ్రీశైలక్షేత్రమున శ్రీ చెన్న మల్లికార్జునస్వామి సన్నిధిని క్రీ॥శ॥ 1440 ప్రాంతమున విరచితమయిన శ్రీనాథమహాకవి శివరాత్రి మాహాత్మ్యము తరువాత (తత్సమీపకాలముననే యచ్చట వెలువడిన గౌరన మంత్రి శివకృతులు హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్రమునను రెండు ద్విపదకావ్యములు. వీనిలో నవనాథచరిత్రము, శ్రీనాథుని శివ రాత్రి మాహాత్మ్యమువలెనే యప్పటి శ్రీశైలక్షేత్రపరిపాలకులగు వీర శైవభిక్షావృత్తి మఠాధీశ్వరులయి యాస్థానమున శాంతిభిక్షావృత్తి యతీశ్వరు నానతిపయి నయిదాశ్వాసముల రచితమయి యాతని ప్రేరణమున శ్రీమల్లికార్జునస్వామికే యంకితము గావింపఁబడినది. ఇం దాశ్వాసాద్యంతములందు భిక్షావృత్తియతీశ్వరుని వైభవము ద్వేల ముగ వర్ణింపఁబడినది. శైలినిబట్టి చూడ నిది గౌరన మునుముందు రచించిన ప్రాథమికకృతియని తలంపఁదగియున్నది. హరిశ్చంద్రోపాఖ్యాన మింతకన్నఁ బ్రౌఢతరశైలిలో నుండుటచే నది యీ తరువాతనే విర చితమయి యుండునని తలంపనగును. ఇదికూడ శ్రీ మల్లికార్జునస్వామి కంకితము చేసినట్లు గౌరన విస్పష్టముగ నందుఁ బేర్కొనకున్నను నిది యు నా స్వామికే యంకితమయినట్లు మనమూహింపఁదగును. అందలి గ్రంథారంభముగనుడు—

"శ్రీగిరిజాధీశు శ్రీగిరినాథు । నాగచర్మాంబరు నాగకేయూరు
బాణవత్సలుఁ బంచబాణసంహారు । వాణీశవినుతు గీర్వాణీశవంద్యు.
గంధర్వకిన్నర గాంధర్వలోలుఁ । గంధరశ్యామల కంధరోదారు
దారుణాంధకదర్ప దళనప్రచారు । జారుజాంబూనదు శైలకోదండు
గారుణ్యజలధి గంగాధరునభవు । శారదాచందన శారదాంభోద
మల్లికాకర్పూర మాలికాయశుని । మల్లికార్జునదేవు మహితవైభావు
మాపాలనేపట్ల మమ్మేలువేల్పుఁ । బాపాళిఁబాప సద్భక్తిఁ బూజించి

పరమయోగీంద్ర హృత్పద్మసద్మముల। మరగిక్రీడించెడిమాయలఁ దేటి
గడునొప్పభ్రమరాంబికామహాశక్తిఁ। దదయకవరములు దయసేయ
గొలిచి।

మఱియునటు తరువాత "భూతనాయక పాదపూజాభిరతుఁడ।
గౌతమ గోత్రుండ గౌరనాహ్వయుఁడ। సరససాహిత్య లక్షణవిచక్షణుఁడ బిరుదవిఖ్యాతిచేఁ బెంపొందువాఁడ" ననియు గ్రంథాంతమున "భ్రమరాప్రసాద సంప్రాప్తకవిత్వ। సుమహిత సామ్రాజ్య సుఖపరాయణుఁడు। చతురసామాన్య లక్షణచక్రవర్తి। ప్రతివాదిమదగజ వంచాననుండు"అనియు వ్రాసికొనినాడు. ఇందుచే నితఁడు శ్రీమల్లికార్జున స్వామి, భ్రమరాంబికాదేవులకు వంశానుగతముగనే వఱలిన సహజ భక్తుఁడనియు నవనాథ చరిత్రమువలెనే యీ హరిశ్చంద్రోపాఖ్యానముసుగూడ మల్లికార్జునస్వామికే యంకిత మొనర్చెననియు నిరాఘాటముగ నెంచవచ్చును.

శ్రీరంగ మాహాత్మ్యము, రత్నశాస్త్రము,కవిగజాంకుశముననుకృతులరచించి ప్రశస్తిగాంచిన యీతని తనయుఁడు భైరవ కవిగూడ దనకృతులలో

క॥ భ్రమరాంబికా మహావర।
సముదిత నిరవద్యహృద్యసాహిత్యకళా।
క్రమవిమలప్రతిభాసం
క్రమణుఁడ, మతిశాలినైన గౌరనసుతుఁడన్॥

క॥ శ్రీమత్పరమశివానన
తామరసవికాసలీలఁదనరినభ్రమరాం।
బామధుమత్తభ్రమరిక
నామానసరసిరుహము. నన్ వసియించున్॥

అనివ్రాసికొనినాఁడు. ఇందుచే గౌరనయు నాతనిసుతుఁడు భైరవ

కవియు భ్రమరాంబికావరప్రసాద లబ్ధసరసకవితా సంపన్నులనియు నిరువురు మల్లికార్జునస్వామి భక్తులనియు శ్రీశైల ప్రాంత వాస్తవ్యులనియు మనమెంచదగును. గౌరనమంత్రి యీ రెండు ద్విపదకావ్యముల యవతారిక లందును దాను సింగయ మాధవక్షితిపాల మంత్రిపుంగవుం డయిన పోతరాజునకుఁ దమ్ముఁడయిన యయ్యాలమంత్రి తనయుఁడనని చెప్పికొనినాఁడు. వీనినిబట్టి సింగయ మాధవక్షితిపాలుని వివరములు మనకు విస్పష్టముగఁ దెలియరావు. ఈ గౌరనమంత్రి సంస్కృతమున "లక్షణదీపిక" యను ఛందశ్శాస్త్రముగూడ నొకటి రచించెను. అందు "అస్తి ప్రశస్తావనిపాల మౌళిరత్నావళీ రంజితపాద పీఠః। రేచర్లవంశార్ణవ పూర్ణచంద్రా మహాబలస్సింగయ మాధవేంద్రః॥ అని కొంత వివరించినాఁడు. రేచర్ల వంశ్యుఁడయిన యీసింగయ మాధవేంద్రుఁడు గౌరన పెదతండ్రి పోతరాజామాత్యున కేలికయని వెలుగోటివారి వంశచరిత్రమునం దుదాహృతమయిన యొక శ్లోకమునుబట్టి తెలియుచున్నది.

శ్లో. శ్రీమతో మాధవేంద్రస్య రాజ్యాంగైక ధురంధరః।
మంత్రీ పోతననామాసీత్ సర్వశాస్త్ర విశారదః।
యస్యామాత్య శిఖామణేః । కవివరస్తోకై కపాత్రీకృతాం।
మత్వాహాక్పతి రిద్ధనీతి సుభగాఁ వాగ్వైఖరీం లజ్జతే।
సోయం పెద్దన మంత్రివర్యతనయః శ్రీ పోతరాజోన్వహం
దేవస్యాస్య మహోపకార రచనాం సమ్యఙ్మదాచీకరత్॥

రేచర్ల వంశ్యులు, పద్మనాయక వీరులు, తెలంగాణ మండలి రాచకొండ, దేవరకొండ రాజధానులుగాఁ గాకతీయ సామ్రాజ్యపతనానంతరము పరాక్రమోపేతులయి చిరకాలము పరిపాలించినట్లు చరిత్ర ప్రసిద్ధము. ఈ రావువంశ్య సింగయ మాధవనృపాలుఁడు రామాయణమునకు రాఘవీయమను టీకను రచించి యశంబుగాంచెనని యాతని ధర్మపత్ని, రాచకొండ సమీపమండలి నాగార గ్రామములో శాలి

వాహనశకము 1349 (1427 *A. D.*) లో నొక శిలాశాసనము నెల కొలిపెను.

శ్లో. శాకాబ్దేనిధివార్ధి రామశశిగేష్వబ్దే ప్లవంగే శుభే
మాసేష్వాశ్వయుజే రఘూద్వహపదేయో రాఘవీయాహ్వయమ్
టీకామర్థపటు ప్రబోధఘటనా మాణిక్య పుష్పాంజలిం
కృత్వారాజతిరావు మాధవనృపో రామాయణస్య శ్రియే

కావున క్రీ॥శ॥ 1427 సంవత్సర ప్రాంతమునందుండిన సింగయ మాధవ నృపాలుని మంత్రి పోతరాజు తమ్ముని కుమారుఁడయిన మనగౌరనకవి శ్రీనాథమహాకవి కించుమించుగ సమకాలీనుఁడయి హరిశ్చంద్రో పాఖ్యాన నవనాథచరిత్రములను క్రీ॥ శ॥ 1440–1450 ప్రాంతమున రచించియుండునని మనము తలంపనగును.

ఇఁక నీకవివరుని కృతుల పరిశీలనమునకుఁ గడంగుదము.

(1) హరిశ్చంద్రోపాఖ్యానము :—సత్యసంధుఁడని పేర్వడసిఁ భరతఖండమును బాలించిన హరిశ్చంద్ర చక్రవర్తి షట్చక్రవర్తులలో నొకఁడు. ఇతఁడు ఇక్ష్వాకువంశజుఁడు. అయోధ్యాపురము రాజధానిగా నేలినవాఁడు. ఇతని సత్యవ్రత చరిత్రము జగద్విఖ్యాతమయి యాబాల గోపాలముగ భారతదేశమున వన్నెకెక్కియున్నది. వేదములందును, స్కాందపురాణ, మార్కండేయపురాణములందును గూడ నది వర్ణిత మయియున్నది. స్కాంద మార్కండేయ పురాణములందలి కథలలోఁ గొన్ని స్వల్పభేదములున్నవి. ముఖ్యముగా మార్కండేయపురాణములో హరిశ్చంద్రుని భార్యపేరు శైబ్యయని యుండగా స్కాందపురాణమున జంద్రమతియని యున్నది. మార్కండేయ పురాణకథ యుత్తర హిందూస్థానమునను, స్కాందపురాణకథ దక్షిణహిందూస్థానమునను వ్యాప్తములైనవి. స్కాందపురాణమునను సరించియే గౌరనామాత్యుఁడే హరిశ్చంద్రచరిత్రమును మునుముందు పూర్వకథ, ఉత్తరకథయను

రెండుభాగములుగా నాంధ్రభాషలో ద్విపదకావ్యముగ రచించి నాఁడు. దానినిబట్టియేతర్వాత శంకరకవి,కంచిశరభకవి,మల్లారెడ్డియను కవీంద్రులు పద్యకావ్యములు రచించిరి. వీనియన్నిటికి మూలము గౌరనమంత్రి ద్విపదకృతియేయని తలపవచ్చును. ఈతనిద్విపదకావ్య మందలి శైలిమృదుపదసంఘటితమైలోకోక్తిస్వభావోక్తిసంయుతమయి ధారాశుద్ధికలిగి ప్రౌఢతరముగను, హృదయంగమముగను నలరారు చున్నది. వీరశైవ కవిశేఖరుఁడును పాలకురికి సోమనాథుని బసవ పురాణ పండితారాధ్య చరితములను గౌరన బాగుగా బరిశీలించి యాతనివలెనే జానుతెనుంగుపై మక్కువగొని జాతీయత జాలు వాఱుతీయని తెలుగు బలుకు నుడులతో వెలయించిన తావు లీకృతి యందు బలుతావులగాననగును. అందందు సంస్కృత పదబంధముతో దీర్ఘసమాసములు ఘటించినతావులును గనవచ్చుచుండును.

మచ్చునకీక్రింది యుదాహరణములఁదిలకింపుడు.

"మందార మంజరీ మంజుమరంద। నందదిందిదిర నందనారామ।
కమనీయవికసిత కనకారవింద। కమలినీతటలతాగారలతాంత।
రచితశయ్యాతల రతిరయగళిత। కచభరసురపుర గణికాకపోల।
కలితఘర్మోదక కణగణమిళిత। మలయసమీర కోమలకంపితాగ్ర।
మహితచిత్రధ్వజ మాలాసహస్ర। సహితచింతామణి సౌధపాళికల।
నందందడెందంబు నందునెయ్యంబు। పొందొందనీయందు ముఖులతో కూడి॥
వేడుకసలిపెదవేని నీబొంది। తోడనేనిన్నునింద్రుని పురికనుతు॥"

"అరుణారవిందంబులడుగులుగాఁగ। దరులఁగుప్పమ్మరువనదంతావళముల
యురుతరతుండంబు లూరులుగాగ। సరసమైసైకతసీమ.జఘనంబుగాఁగ।
సురుచిరంబగు మేటిసుడినాభిగాఁగ। గరమొప్పుచిరుతరగలు వళుల్ గాఁగ।

నునుదీఁగనాచు లేనూఁగారుగాఁగ । నెనయజక్కవలుపాలిండ్లనుగాఁగ।
జెలువంపు బిసములుసేతులుగాఁగ। వెలివమ్మివదనార విందంబుగాఁగ।
సరవిబెల్లెసఁగెడు జలకణపంక్తు । లరుదార మౌక్తిక హారముల్ గాఁగ।
నవలఁగీడించు రాయంచలరవము । నవహేమనూపురనాదంబుగాఁగ।
బెనుపొంద నెరసిన ఫేనంబు దెలుపు । దనరారుచున్న చందనచర్చగాఁగ।
గూలానసీరుహకుసుమపరాగ । జాలంబు చిత్రవస్త్రంబుగా మెరయ
జనలోకపావని జాహ్నవిగంగ । గనుగొనిహస్త పంకజములు మొగిచి"
"కుఱు వెండ్రుకలకొరకొప్పిడి కావి। యఱపుడుతలనిట్టునట్టునుజుట్టి
జేగురుబొప్పిట్టిచెవి యెసంకుగోడుపు । లాగుగా వేలఁదెల్ల నిముడ్పునిల్పి
తొలులువోయినపాత్రత తోలునుగప్పి । బలుగత్తి మొలనచ్చుపడ
నమరించి।
కడు మైలపీవికఁగాసించినడుము । బడికి వేసినయరపట్టెబిగించి ।
యెడమచేఁబశుమాంస మేర్చినగుదియ । గడమాచేనినుపయుంగరము
లగుదియ ।
గడజాతిగాఁబూనికంిందుసందడిని । జడియుచుశంభశిశంభశియనుచు।
దళముగా మెఱసెడి తన మేనికప్పు। పొలుసక్కజమ్మనిపొలయుమక్షికల
గుంచియతోఁజోఁపుకొనుచుచెన్నలర। మించికందెనూనె మేఁగినట్లున్న।
మొగమునఁజేకట్లుమూడివడఁగల్లు । సగముద్రాఁవినకుండఁజంకలోనిఱికి।
మీఱినమదమున మెయి దేలగిలఁగఁ । భాఱంగ వెడపాటఁ బాడుచు
బయలు।
జారుచునల్లపచ్చనిపోడిమిగ్రింగి । కోరమీసమునుల్చిగుడ్లెఱ్ఱజేసి।
కెలనివారలబూతుగెరలఁవెట్టుచును । దొలగురాజెవ్వడు దొరయెవ్వ
డనుచు।
దాగినరోజుమత్తుగొనియిన్ని । లాగులనల్లనల్లనవృపుగదిసి॥

(వీరబాహుని చండాలరూపవర్ణన)

"వెన్నముద్దకురూపు వెట్టినమాడ్కి । నున్నమెత్తని మేననొప్పెడివాడు ।

ఎన్నడు నెండకన్నెఱుఁగనినిసువు। కన్నులముత్యాలుగారనేఱ్చెడిని
మున్న గుజాతీయములు।
"ఱంతుగానాఁబోతు ఱంకెవేసినను। గంతులుదక్కనేకంఠీరవంబు।
నీరువట్టాఱునే నెయిదాఁకొనిన"। "కాదవిమునిఁదాకుటఁ గాలుదీయ
కుము।"
"ఔడిదంపుబావురుఁబిల్లి వాతికినిఁదోడిబడరాచిల్కదోయుచందమున"
ఇటువంటిలోకోక్తులు, అసంఖ్యాకములుగ నీకృతియందు గానవయి
ముద్దులొలుకుచుండును.

(2) నవనాథచరిత్రము :— దీనిని శ్రీగిరియను కవిరచించిన పద్య
కావ్యమునే ద్విపదకృతి వ్రాసినట్టు గౌరన యుదాహరించినాడు.నను
సరించె కాని యామూలకృతి మనకు లభింపలేదు. ఆశ్రీగిరికవి యెవరో
యని కూటమునకు సరిగాఁదెలియరాదు. పాలకురికి సోమనాథకవి
ప్రత్యర్థియై మతవివాదములలో నాతనిచే నోటువడిన యనంపర
మాతనికి శిష్యుఁడయి వీరదీక్షవడసిన చక్రపాణి రంగనాథుఁడె.
శ్రీగిరినాథవిక్రమయను పేరితో శ్రీమల్లిఖార్జునస్వామి స్తుతులొన
రించిన పిమ్మట శ్రీగిరినామధేయమును ధరించెనేమోయని నేనభిప్రాయ
పడుచున్నాను. నవనాథసిద్ధులు వైష్ణవమునందును శైవమునందును
గూడఁగలరు. గౌరనకృతి శైవనకనాథులకు సంబంధించినది. అందు
వర్ణితులయినవారు (1) శివుఁడు (2) మీననాథుఁడు (3) చౌరంగి
(సారంగధరుఁడు) (4) గోరక్షనాథుఁడు (5) మేఘనాథుఁడు (6)నాగా
ర్జునుఁడు (7) సిద్ధబుద్ధుఁడు (8) విరూపాక్షుఁడు (9) కణికుఁడు. ఇందు
తండ్రిచే సవతితల్లి చిత్రాంగి దుస్తంత్రముచేఁ గాఁలుసేతులు నఱుకు
వడిన సారంగధరుఁడే చౌరంగి. మీననాథుని యనుగ్రహమున మరల
ఖండితావయవముల యథాస్థితిలోఁ బడసినవాఁడు. ఇతని కథ యాంధ్ర
దేశీయులకు చిరపరిచితము. సారంగధరుని తండ్రి రాజమహేంద్రి

వరమునేలిన రాజరాజనరేంద్రుఁడేయని, యీకథ జరిగినది. రాజమహేంద్రవరమునందేయని మనవారి యైతిహ్యము. కాని చామకూర వెంకటకవి రచించిన సారంగధరచరిత్రమునుబట్టి యిది మాళవదేశమునకు సంబంధించినదిగాఁ గాన నగును. ఈద్విపదకావ్యశైలి హరిశ్చంద్రోపాఖ్యానశైలి యంతరసవంతము ప్రౌఢముకాదని యిది గౌరన ప్రాథమిక కృతికావచ్చునని మున్నే చెప్పియుంటిని. ఇందుఁ జెప్పఁబడిన కథలు చాలవఱకు మనోహరములై చదువ నింపుగొలుపుచుండును. అందును వంచకపురోహితునికథ మిగుల బాగుండును.

ఒక బ్రాహ్మణుఁడు రాజపురోహితుఁడు సౌందర్యవతియు, యౌవనవతియునగు రాజపుత్రికను గామించి మాయోపాయముచే దక్కించుకొన నెంచి, యామె రాజమందిరమునందుండుటవలన రాజ్యము, రాజవంశమును నిర్మూలమగుననియు, నట్టియరిష్టములు దొలఁగించుటకై యామెను స్వర్ణాభరణపూరమయిన మందసయందుంచి తలుపులుమూసి దానినొక తెప్పమీఁదఁబెట్టి నదీప్రవాహమున విడువవలెననియు రాజునకు సుబోధగావించి నమ్మించి యొప్పించెను. రాజాప్రకారముగాఁ జేసినపిమ్మట నీటివాలునఁబడి కొట్టుకొనిపోయెడి యాపెట్టెను బట్టుకొని యొడ్డునబెట్టి యొక మఱుఁగుప్రదేశమున దానిని బదిలబరుపుడనిముందుగా నతని శిష్యులకుఁజెప్పి నియమించెను. ఇంతలో నాతనిశిష్యులు దానిని బట్టకమున్నే పరిసరారణ్యమున వేఁటకు వచ్చి డస్సి దప్పిదీర్చుకొన నెంచి యేటియొడ్డునకువచ్చిన రాకుమారుండొకండు చూచి యాపెట్టెను నొడ్డునకుచేర్చి తలుపులు తెరచిచూచి యందున్న రాకుమారినిగాంచి మోహించి. యామెవలన వృత్తాంతమెఱింగి గాంధర్వవివాహమున నామెను బరిణయమయి కొనిపోయి మందసలోఁ దాను వేటాడి పట్టుకొనిన యెలుఁగొడ్డు నొకదానిని బెట్టి తలుపులు మూయించి యథాప్రకారము నదీప్రవాహమున ద్రోయించెను.

పురోహితునిశిష్యులు దానినాపి యొద్దనజేర్చి భద్రపరచి గురువునకు సమర్పించిరి. సంతసముతోనాతడు రాకుమారిని గాన యువ్విళ్ళూరుచు మందసమూఁత దీయింపగానందలి భల్లూకమాతనిసైఁబడి భక్షించి యాతని దుష్కృత్య ఫలితము నావెంటనే యాతని కనుగ్రహించెను.

ఈకథనుండి కొన్ని పంక్తులు నిటనుదాహరింతును.

"చెడితిరా! యికనేమిచేయుదుననుచుఁ । గడుపును బిసుకుచుఁగటకటా యనుచు।
నిలిచినచోనొకనిమిషార్థమైన । నిలువనోపక కూడు నీళ్లు దుబాసి
కడుఁజాలిఁబొంనుచుఁగన్నంబులోన । వడి తేలుకుట్టిన వానిచందమున
వెడఁగురీతినిగడు వేదనఁజాల । నడరుచునొకయుపాయమునుజింతించి

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

విను వినకుండుము వివరించికొనుము । కొనకుండుమనుచును గుటిలాత్ముడతని
చెవిడాసి కూఁతురుచే వ్రాఁతఫలమువివరించి చూచితివినుమీకుమారి
నీయింటనుండిన నీవు నీప్రజలు । నీమేలు దేశంబు నిర్మూలమగుదు
రనవిని భీతితోనతఁడాడుమాట।తనకునంతకుమున్న తారాణయగుట
తలపోని యక్కటా! తల్లిపెంచినవి। యెలమినీబాలికయే గతివిదువ
నెడలుబడుబుద్ధినీయువిదయనాకుఁ। గొడుకైనఁగూఁతైనఁగూర్మినెక్కొన్న

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

వెఱతుమునీమాటవ్రేలెడుగడవ । నెఱిఁగింపుమీపాప నేమిచేసెడిది
నావుడుసిద్ధించెనాకోరికనుచు । భావంబులోపలఁబ్రమదంబుమోపి
యాతఁడిట్లనె వసుధాధిప;మిగులఁ । జాతురిగామందసంబునుజేసి।
యాలోనమణికనకాంబరాభరణ జాలంబుతోడనీచపలాక్షినుంచి।
తలుపులువదలించితగు తెప్పమీఁద । బోలువొందనునుచియుప్పొంగు పెన్నిట।
వెసజాఱవిడిచిన లేకగశుభము । వెసఁగుమీకెల్లను నేలనాగ భాగ్య।

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

నృపతియాకన్యపాణిగ్రహణంబు । విపులసమ్మదమున వెలయగావించి।
మనమార మొదలనమ్మందసనున్న। ఘనమైనవస్తువుల్ గైకొనియందుఁ
బూనితానంతకుమున్న వేఁటాడి । బోనులోఁ దెచ్చిన భూరిభల్లుకము।
జోరగొప్పితలుపులచ్చులు వదలించి।తిరముగాఁదొల్లిటి తెప్పపై నునిచి।
యేటిలోవిడిచియాయింతిదోడ్కొనుచు ఘోటకభటదంతికోటలతోడఁ
దనపురి కేఁగెనుదనంతరంబ । యనువునఁజనుచున్న యామందసంబు
వడుగులుగనియుబ్బివడిఁగుప్పిగంతు ।లిడుచునొండొరులఁబల్విడి
కేకలిడుచుఁ
గొట్టిఱంకెలు వేసికొనుచుఁ జెలంగి । పట్టిమాదసఁ దెచ్చిపరగనయ్యేటి
పొంతబ్రిచ్చినప్రబ్బపొదలలోనునిచి । సంతసంబెసఁగనొజ్జలరాక కెదురు
చూచుచునుండనచ్చోటనువిప్రుఁ । డేచేటుపాటుదానెఱుఁగకదక్కె।
రాచకూఁతురుమనోగధసిద్ధియెసఁగె । నాచపలాక్షి జయ్యనఁబొందకున్న
నేచినయీమనంబెట్లాపవచ్చు?.........................."

తనకృతులరెంటిని శ్రీశైలక్షేత్రముననే రచించి యంబా మల్లికేశ్వరుల కంకితమొసంగిన శివకవివతంసుఁడు, గౌరనమంత్రి సర్వవిధముల ధన్యతముఁడు. చిరస్మరణీయుఁడు. ఆంధ్రసోదరులు వానినాదరముతోఁ జదివి యానందించి తరింతురుగాక!

గౌరనవీరశైవకవిశేఖరుఁడగు పాలకురికిసోమనాథుని మార్గము ననుసరించి తన ప్రధానకావ్యముల ద్విపదలోనే రచించినను సోమనాథుఁడు విరివిగాఁబాటించిన ప్రాసయతిని హరిశ్చంద్రోపాఖ్యానములో నీతఁడు వాడినట్లుకానరాదు. నవనాథచరిత్రమున మాత్రము కొన్ని తావులందు ప్రాసయతులు క్వాచిత్కముగఁ గాననగును.



## "శ్రీరామ పాదుకాస్తవము"—మరింగంటి అప్పల దేశికులు

శ్రీ రంగాచార్య.

కవి విషయము :— శ్రీరామపాదుకాస్తవ మను నీసంస్కృత లఘుకృతికర్త మరింగంటి అప్పల దేశికులు.(ఆచార్యులు)ఈయన ఆంధ్ర భాషాయోషకమూల్యాలంకారములోనగూర్చినసుప్రసిద్ధకవి.పండితుల కాలవాలమైన మరింగంటి కవులలో నొకఁడు. మాకు లభించినంతవఱ కీయనకృతి యొకటే యీ శ్రీరామపాదుకాస్తవము.అన్యరచన లేమైన గలవో తెలియదు.

మరింగంటి కవుల ప్రబంధములతో బాటు లఘుకృతు లెన్నియో అజ్ఞాతముగను అప్రకాశితముగను గలవు. అట్టివానిలో నీ స్తవమొకటి.

చాలాకాలమునుండి మాయింట గలప్రాచీనసంస్కృతాంధ్ర గ్రంథసముదాయమున బడియున్నదీనిని మా తండ్రిగా రుద్ధరించి యుంచినారు. నాకు తెలిసినంతవఱకు దీనిప్రతు లిక రెండు గలవు. అం దొకటి పూజ్యులు డా॥ శ్రీ బిరుదురాజు రామరాజుగారివద్దను వేరొకటి శ్రీ మరింగంటి పురుషోత్తమాచార్యులు (సూర్యాపేట) గారివద్దను గలవు.వానితో నాదగ్గర గల యీప్రతిని సరిజూచునవకాశము కలుగ నందులకు విచారించుచున్నాను.

ఆధునికకాలమున (ఇటీవల) మరింగంటి కవులనుగూర్చి పరిశ్రమించిన శ్రీ. బి. రామరాజుగారు ఈస్తవమునుగూర్చి తెలుపక పోవుటచే నా కీయవకాశము లభించినది—సంతసము;

ఈ 'శ్రీరామపాదుకా స్తవ' రచయిత యైనఅప్పలాచార్యులు నల్లగొండజిల్లా హుజూరునగర్ తా॥'యాదవాకిళ్ళ'గ్రామవాసి. సుమారు 110సం పూర్వుఁడు.ప్రస్తుతస్తవమున పేర్కొనబడిన 'నృసింహపుర మి'చటికి యనగా 'యాదవాకిళ్ల'కు సమీపమున గలదు. ప్రస్తుత మాగ్రామము సూర్యాపేటతా॥ చెందియున్నది; అచట శ్రీరామాలయము గలదు—చిన్నగుట్ట కలదు. అచటిస్వామినిగూర్చి చెప్పినదే యీ 'శ్రీరామపాదుకాస్తవము.'

ఈ మరింగంటికవులు దేవరకొండ తా॥ కనగల్లునందును. దానికి సమీపమున గలఅనుములయందును (మిర్యాలగూడెంతా) అనుములనుండి వెళ్ళి 'యాద(త)వాకిళ్ళ'యందుస్థిరపడినవారు కొందఱును గలరు. వీరేకాక ఓరుగల్లుమండలమందలి 'మల్లంపల్లి'యందును. కొంద రున్నటుల తెలియుచున్నది.

ఈ అప్పలదేశికులనుగూర్చి తెలిసికొనుటకు ఎట్టి ఆధారములు లభించుటలేదు-కాని.ఇప్పటికి 180సం॥ పూర్వుఁడైన మరింగంటి వెంకట నరసింహాచార్య లనుకవివర్యునిచే రచియింపబడిన '[1]గోదావధూటీ పరిణయ మనుప్రబంధకృత్యాదియందు తత్కర్త వారివంశచరిత్రను సమగ్రముగా నొసఁగియున్నాఁడు.అందు అప్పలాచార్యనామధేయులు మువ్వురు గలరు.వారందరును'గోదావధూటిపరిణయ'కర్తకు పూర్వులే పైనచెప్పఁబడిన అప్పలాచార్యత్రయమున నీతనినొక్కనిగా భావింతు మేని 200 సం. పూర్వుఁ డగును; అట్లుగాక తరువాతివాఁడు గావచ్చు నేమో !

శ్రీరామరాజుగారు ఒకమారు నాతో ఈ కవి విషయము (స్తవము)నుగూర్చి చెప్పుచు 'ఈతఁడు సుమారు 100సం॥క్రిందివాఁడు గావచ్చును ? అనిరి.

గోదావధూటీ పరిణయమందు పేర్కొనబడిన అప్పలాచార్యు లలో నొకఁ డందమా! చాలపూర్వుఁడు. శ్రీరామరాజుగారి యభిప్రాయము ననుసరింతమా!ఎట్టిఆధారము కన్పించుట లేదు.కావున నీరెండు కాలములు సంశయాస్పదములే!

1. గోదావధూటీపరిణయము: 1956సం. 'నల్లగొండ మహిళాభక్తసమాజము' వారిచే ముద్రితము.దీనిసంపాదకులు శ్రీ ఆసూరి మరింగంటి శ్రీరంగాచార్యులవారు వీ రటీవలనే పరమపదించిరి. బహువిధ తాళపత్రగ్రంధసంపాదన మొనరించి-తమ స్వగ్రామ మైన'కనకల్లు'నందు 'తాళపత్రగ్రంధనిలయము'ను నెలకొల్పినారు. వీరి వద్ద నెన్నియో యమూల్యగ్రంథము లుండెడివి.

ఈకవి 'గోదావధూటీపరిణయ'కర్త వంశమునకు చెందినవాఁడు గావచ్చును. ఏలనన పూర్వులనామములు తరువాతివారికి పెట్టుట సంప్రదాయము. అట్లే ఈకవివర్యునకును పేరు పెట్టియుండవచ్చును. ఐనచో గోదావధూటీపరిణయకర్త యైన వేంకటనరసింహాచార్యుల తరువాతివాఁడు నగును. ఆవిధముగ చూచిన ఈ అప్పల దేశికులవారు 110, 115 సం॥ క్రిందివాఁడగును.

ఈతనినిగూర్చి సరియైనయాధారములు లభించువరకు నేను నిర్ణయించుకొనినకాల మనియే విశ్వసించుచున్నాను. దీనినిగూర్చి యెవరైన పరిశోధింతురుగాత!

ఇతనికవిత్వము:-అప్పలాచార్యులశ్లోకములు కొన్నిమాత్రమే లభించినవి. వీరి ఇతరరచన లేమైన గలవో! ఆంధ్రకవితావైశారద్యమున్నదో తెలియదు. కాని ఈలభించినకొద్దిశ్లోకములే అప్పలాచార్యుల కవితారచనప్రతిభకు ప్రతీకములుగా గ్రహింపదగిన ట్లున్నవి. సరస మధురమై, గంగాప్రవాహనిభ మైన వీరిశైలిని పరిశీలించినప్పుడు వీరి ఇతరరచన లేమైన నుండి లభింపకపోయినచో మనదురదృష్టమును నిందించుకొనక తప్పదు; వీరి యీ '(శ్రీ)రామపాదుకాస్తవము'లో లేఖకులమూలముగ వచ్చిన ట్లున్నస్ఖాలిత్యము లున్నవి. వాటిని పండితులు పరిష్కరించెదరుగాక!

కవి ప్రథమశ్లోకములో గురువులకు నమస్కరించి తనవినయ సంపద నావిష్కరించినాఁడు, కాని గురువులపేరేమో తెలుపలేదు; గురునామగ్రహణము సంప్రదాయము కాదుగదా!

ఇఁక వీరికవిత్వమునుగూర్చి చెప్పుటకన్న కవిపేర్కొనిన "మరందకదళీసుధామధురసాల" అనుశ్లోకమే వారివిషయములో యదార్థము చెప్పుచున్నది. వీరికవిత్వమున ప్రౌఢత్వముతోబాటు సరసత్వము కానవగును.

"ఇదం దశరథార్జితం భరతలక్ష్మణాభ్యర్చితం
తపోధనమనోధనం సకలసంపదాం సాధనమ్
నృసింహనగరాన్తికే జయతి రామపాదద్వయం
శిలాముకురబిమ్బితమ్ రహసి సీతయా చుంబితమ్॥"

రామపాదవిశేషణములలో అంతగా వైశిష్ట్యము లేనిఈశ్లోకము చరమ విశేషణములతో ఒకనూత్నశోభను పొంది అద్వితీయమై నిలిచినది; వీరికవితాచాతురి కిది నిదర్శనము;రహసి సీతయాచుంబితమ్" అని అనగల్గుట అప్పలాచార్యులకే చెల్లినది. అందుకే వేరొకచోట రామునికి "క్షమాపుత్ర్యా స్సాక్షాదధరదళమాధుర్యవిదుషే" అని విశేషణము వేయగలిగినారు.

'రామాయ క్షితికన్యకావిహరణారామాయ'
'నమో రామాయాస్తు ప్రతిదిశసమేతాసుర'

అనుశ్లోకములు వీరిసరసమధురధారాళమైనశైలికి నుదాహరణములుగా చెప్పనవచ్చును.

ఇంకను 'అస్తు స్వస్తి' అన్నశ్లోకము 'సదయే హృదయే' ఇత్యాదులు శబ్దాలంకారములకు నిదర్శనములు.

ఇట్టి వీరిరచన లింకేమైన లభించినచో గీర్వాణసరస్వతి ఇతోఽధికభూషణాలంకృతయై విరాజిల్లగలదు.

కవినిగూర్చియు-తత్కవితారీతినిగూర్చియు నాకు దోచినవిధముగా దెల్పుటయేకాక శ్రీరామపాదుకాస్తవమునుగూడ లభ్యమైనంతవరకు యథాతథముగా నొసంగితిని-ఇందలి లోపములను తెల్పిన కృతజ్ఞతతో స్వీకరింతును.

నావద్ద గల ఈస్తవమును చదివి ప్రకాశమొనరింపు మని ప్రోత్సాహ మొసంగుటయేగాక నాకు ఎంతగనో సాయపడినమిత్రులు సంస్కృతాంధ్రభాషాపారంగతులు నైన శ్రీభాగవతము రామారావు గారికి కృతజ్ఞతలు.

ooooooooooooo

# రామలింగేశ్వర శతకము

కీ. శే. వద్దిపర్తి నాగరాజు.

శా. స్నానం స్వీకురు చంద్రశేఖర శివస్వామీ కృపం జూడవే
యానందాంబుజగర్భభక్తవరదా యంచున్ నినున్ వేడ్కతో
సానందంబుగ మ్రొక్కుభక్తులకు నిష్టం బిచ్చి రక్షింపవే
శ్రీనాథాదిమునిత్రయస్తుతపదా శ్రీరామలింగేశ్వరా॥ 48

మ. హర! శుద్ధాచమనంబు నిచ్చెద పురారాతీ కృపాదృష్టిచే
గరుణింపందగు నంచు నిన్ను బొగడంగా వానిదుష్కర్మముల్
నురుమై సద్గుణగణ్యుడై నెగడునన్నుం బూజ గావించున
న్నరు నెన్నందర మానె దేవతలకైనన్ రామలింగేశ్వరా॥ 49

మ. మధుపర్కం బిదె నీకు నిత్తు ననుచున్ మన్నింపుచున్ భక్తి నీ
కథలన్ జేర్కొనునట్టిమానవుడు నిక్కం బాత్మలో బొంగుచున్
శిథిలీభూతము లైనపాపచయుడై సేవించు నీసన్నిధిన్
శిథిలీభూతపురత్రయా భవ హరా శ్రీరామలింగేశ్వరా॥ 50

మ. ఘృతమున్ క్షీరములున్ గుడబు దధియున్ గోర్కెన్ వెసంగూర్చి సం
తతమాధ్వీయుత మొప్ప నైదమృతముల్ త్వచ్ఛీర్షమం దాభిషే
కత నొందింపగ గోరుమానవులకున్ కైవల్య మీ విచ్చెదో
శితికంఠా ననుబ్రోచుటల్ కొలదియో శ్రీరామలింగేశ్వరా॥ 51

శా. నీకున్ శుద్ధజలంబు స్నానమునకై నింపొందగా దేరబో
నాకాశంబున నుండుస్వర్నది మహానందంబుతో నీజట
న్నాకల్పంబుగ దాల్చినాడవు శివానందస్వరూపా మదిం
జేకొమ్మా నను భక్తుగాగ నెపుడున్ శ్రీరామలింగేశ్వరా॥ 52

శా. నీకై వస్త్రము లిచ్చెదన్న మునుపే నీ కంబరంబై దిశల్
బ్రాకెన్ దీర్ఘము లౌచు నొప్పదమకొప్పన్ సచ్చిదానందస్వరూ
పా కల్యాణగుణాభిరామ గిరిచాపా దీనులన్ బ్రోచు నా
నీకారుణ్యరసంబునం దనుపవే శ్రీరామలింగేశ్వరా॥ 53

శా. స్వామీ నీ కిదె యజ్ఞసూత్ర మని సత్సంకల్పమున్ చేయగా
నీ మాన్యుం డగుమర్త్యుఁ డిందుపిదపన్ దేవేంద్రలోకంబునన్
దా మర్త్యుం దగ వేడ్కఁ గొల్తురట యింద్రాదుల్ భవానీపతీ
నీమాహాత్మ్యము నెన్ని గొల్వదగమా నే శ్రీరామలింగేశ్వరా॥54

శా. శ్రీగంధం బిదె నీకటంచు సురసంసేవ్యా మహాదేవ యో
నాగేంద్రాంచితకుండలా యనుచు సన్మానంబుతోడన్ మహా
భాగుం డెవ్వ డొసంగు వానికి సుసంభావ్యంబులై భోగముల్
శ్రీగంగాధర చేరి కొల్చుటకు దా శ్రీరామలింగేశ్వరా॥ 55

మ. దృవ మొప్పంగను నక్షతాఘములు నెంతో వేడ్కఁ యోపార్వతీ
ధవ విశ్వంభర భక్తరక్షణసుధాధామప్రభాశేఖరా
భవ యంచున్ నిను పూజచేయునరులన్ బాపంబులన్ బాపుచున్
శివ నీసేవకు జేసి బ్రోచెదుగదా శ్రీరామలింగేశ్వరా॥ 56

మ. సుమముల్ మంచివిగూర్చి స్నాతుడగుచున్ శుద్ధాత్ముడై వేడ్కతో
సుమనోవందితపాదపద్మ యనుచున్ సూరిస్తుతా యంచు ని
న్ను మనంబందున గూర్చి పూజసలుపన్ దుష్టంబు లౌ బాపవ
ర్గములన్ బాపి సుఖంబు లీ వొసగు దౌరా రామలింగేశ్వరా॥ 57

శా. ధూపం బిచ్చెద నంచు మర్త్యుఁ డురుసంతోషంబుతో భక్తి ను
ద్దీపింపం గనునంతమాత్రనె మహాదేవా సురుల్ వానికిన్
బ్రాపై స్వర్గసుఖంబు నీవనుమతింపన్ జూతు రెల్లప్డు నీ
శ్రీపాదంబులు నొల్వ మోక్ష మరుదా శ్రీరామలింగేశ్వరా॥ 58

శా. దీపం బొక్కటి గోహవిర్యుతముగా దివ్యంబుతోనైన ను
ద్దీపింపం దగ నీదుసన్నిధిని జెందింపగ నమ్మానవుల్
పాపంబుల్ దిగనాడి మర్త్యులకు సంతానంబు కానట్టినీ
శ్రీపాదంబులు గొల్చి మ్రొక్కఁమురుగా శ్రీరామలింగేశ్వరా॥59

మ. మధురంబైనసుభక్ష్యముల్ మిగుల సన్మానంబుతో జేసి యా
దధియున్ శర్కర క్షీరముల్ ఘృతము సత్యంతంబుగా గూరలున్
మధువున్ యామ్లరసంబు హైమమగుసత్పాత్రింబునందుంచినీ
కధికప్రీతిని వేడ నిచ్చి దివిజుం డౌ శ్రీరామలింగేశ్వరా॥ 60

శా. దేవా పూగఫలంబు నాగలతికాదీవ్యద్దళంబుల్ సదా
లావౌ ముత్యపుచూర్ణసంయుతముగా లౌల్యత్వమిం పొంద నో
భావాతీత సదాశివా యని నినుం బాటించి దాంబూలమున్
సేకాసక్తి నొసంగ ముక్తి కరుదా శ్రీగామలింగేశ్వరా॥ 61

శా. శ్రీసీహారమహాద్రిజాహృదయరాజీవార్క నీసన్నిధిం
శ్రీనీరాజన మిచ్చునట్టిమనుజుల్ జెన్నొందు నిష్పాపులై
శ్రీ నింపొందుయశం బెసంగుదుది నిన్ జేరున్ భవా సంకరా
శ్రీనారాయణబాణ భక్తవరదా శ్రీరామలింగేశ్వరా॥ 62

శా. నిన్నున్ బూజయొనర్చిమంత్రసుమముల్ నీకిచ్చుమర్త్యుండుసం
పన్నుండై జెలువొందిభక్తజనసన్మాన్యుండునై మిక్కిలిన్
ధన్యుండై తుదినీదుసన్నిధినితాదాసుండునై యుండుచున్
బెన్నొందంగలవాడుగాభవహరా శ్రీరామలింగేశ్వరా॥ 63

శా. నీకై చేయు బ్రదక్షిణంబు లెవడేనిన్ వానిజన్మంబు ని
శ్శోకంబై గతకల్మషం బయి సదాశుద్ధాత్మతన్ సంతతం
బాకర్ణింపుచు నీదుసత్కథలు దేవా మోక్షసంప్రాప్తులై
శ్రీకంఠా నుతికెక్కు లోకములలో శ్రీరామలింగేశ్వరా॥ 64

మ. అతిమోదంబుల నీపదాబ్జముల కానందంబుతోడం నమ
స్కృతి గావించినయట్టిమానవునిను శ్రీయుక్తుగా జూచి స
న్మతితో బ్రోతువు నిన్నటంచు కడుసన్మానంబుతో మ్రొక్కెదన్
క్షితి నన్ మోదముతోడ బ్రోచుటకునై శ్రీరామలింగేశ్వరా ॥65

మ. క్షితిలోనన్ బరదైవ మెవ్వ రనుచున్ జింతింప మౌనుల్ మహా
ద్భుతలీలన్ ఘనలింగమై దిశలు సంపూర్ణంబుగా నిండి యు
న్నతితో నేనె బరాత్పరుండ ననుచున్ వాచించియున్నట్టియో
శితికంఠా నను బ్రోవుమయ్య కరుణన్ శ్రీరామలింగేశ్వరా॥ 66

శా. మేలౌ నీదగుమంత్రరాజమును సంప్రీతిన్ నరుండెవ్వడై
నా లీలాగతినైన నొక్కపరి దా నాలించి యద్దానికిన్
శ్రీ లెల్లప్పు డొసంగి గాతువట యేరీ సాటి నీవంటి జే
జే లేలోకమునందునైన గలరా శ్రీరామలింగేశ్వరా॥ 67

మ. ధరలో నెవ్వడు నొక్కసారి నిను చిత్తంబందున న్నిల్పి శం
కర భూతేశ్వర దేవదేవ యభవా కారుణ్యవారాన్నిధీ
హర యంచుం బొగడంగ నాతనికి నీ వత్యంత భోగంబు సు
స్థిరమొప్పం దయ నిచ్చి బ్రోచెదుగదా శ్రీరామలింగేశ్వరా॥68

శా. స్వామీ పాపుడ క్రూరకర్ముడ దురాచారుండ మత్తుండ నే
కామక్రోధమదాది యుక్తుడను నన్ కాపాడి రక్షించు నీ
నామంబే జపియింపుచుండెద సదానందంబునన్ మేమరున్
శ్రీమచ్ఛంకర నన్ను బ్రోవగదవే శ్రీరామలింగేశ్వరా॥ 69

శా. పాపుండైనను క్రూరుడైనను సురాపానాదిదుష్టక్రియా
వ్యాపారుండయినన్ హృదబ్జమున ని న్నాపాదితంజేసి చి
ద్రూపా శంకర యంచు గేల్మోగిచి నిన్ రూఢంబుగా గొల్చినన్
శ్రీపంచానన వాని బ్రోచెదుగదా శ్రీరామలింగేశ్వరా॥ 70

శా. స్వామీ శంకర వామదేవ యభవా సర్వేశ్వరా యంచు నీ
నామంబుల్ బఠియింపుచున్ వెస మనోనాళీకమం దెప్పుడున్
నీమంత్రాంచితవర్ణరాజముల నే నెన్నం గటాక్షించవే
సేమం బెప్పుడు గల్గునట్టులుగనో శ్రీరామలింగేశ్వరా॥ 71



దత్తపదములు (3 వ సంచికలోనివి)

1. రణము - గుణము - చణము - గణము. (అ)

2. నన - నన - నన - నన. (ఆ)

---

## దత్తపది రచనలు

1. శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునకవి
భారతీసమితి—పామఱ్ఱు.

(అ) కం. రణమున కరిగిన పార్థుఁడు
గుణమును సంధించి తనదు కోదండమునన్
చణమును జూపుచు శాత్రవ
గణము పయిన్ వేసె నిశితకాండచయంబున్.

(ఆ) కం. ననకారున సరసీజా
ననదమయంతియు సఖియును ననవనమందున్
ననలం గోయుతఁటెఁజదలు
ననలువ హరి యుగ్గడించె నలునిచరిత్రన్.

2. శ్రీ కె. వి. ఎల్. పురుషోత్తం
రంగావారివీధి, యలమంచిలి (విశాఖ జిల్లా.)

(అ) కం. రణమున రిపుభీకరముగ
గుణమును సారించి ధేనుగొని బలలీలా
చణమును జూపెద నే సుర
గణములు మదికౌతుకంబు గడకొని చూడన్.

1. "విద్యాప్రవీణ" శ్రీ పి.వి. చలపతిరావు (సంస్కృత పండితులు)
పరిషత్ హైస్కూలు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

(అ) కం. రణమున రఘువరుడు ధనుర్
గుణమును సారించి శత్రుకోటి భయంకృత్
చణమున శరమున దానవ
గణమును దునుమాడె దేవగణము నుతింపన్.

(ఆ) కం. ననవిల్తుడు మాధవుతో
ననవోత్సాహము మెరయత్రినయనుని గెలువన్
ననబోడిని పార్వతిని త
ననవ్యశరము గనుగ్గొ కొనందలఁచె మదన్.

(మరియొక విధము)

(ఆ) చ॥ రణమున రాక్షసేశ్వరుని
రావణు గూల్పదలంచి తా ధను
ర్గుణమును సారెకుం దివిచి
క్రూరనిశాచర శిక్షణక్రియా
చణము శరంబునుం దొడిగి
సర్వసుపర్వ విజేతృసచ్ఛిరో
గణమును గూల్చె రాఘవుడు
కంజగణంబుల దిగ్గజంబునాన్.

4. "విద్వాన్" శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి
జగన్నాథపురము – కాకినాడ (తూ॥ గో॥).

(అ) చ॥ గుణములపోవ్రు, దీనజన
కోటికిఁబెన్నిధి, కర్ణుఁ; డమ్మరు
ద్గణముల లెక్కసేయని య
ఖండ పరాక్రమశాలి, దాతృతా

చణము, మదీయ మిత్రమిటు
స్వర్గతుఁడయ్యె నెవండు పార్థునిన్
రణమునఁ గూల్చునంచుఁ గురు
రాజు తపించె వియోగ వేదనన్

(ఆ) మ. ననవిల్కానికి జిక్కి రావణుఁడు వి
జ్ఞానమ్ము గోల్పోయి కా
ననమం దొంటిగ నున్న వేళ గుణధ
న్యన్, మాన్య, నంభోరుహా
నన వైదేహిని ముచ్చిలించి చెడియెన్
గామాంధకారమ్మునన్
ననబోండ్లన్ వెతవెట్టు పాతకులిలన్
నాశంబు గాకుందురే !.

5. "సహస్రావధాని" శ్రీ శ్రీరాం, వీరబ్రహ్మకవి, బందరు.

(అ) కం. చణమే శివభక్తాగ్రణి
గణమున కగునట్టి సకల కౌతుకముల కా
రణమగు నీదృశమైనను
గుణమే స్థానీయమనుచు గుర్తింపఁదగున్.

* "చణము, గుణము"నను పదంబు లొసంగ "చణమే, గుణమే" యని లిఖించుట తగదు—

(ఆ) కం. ననవిల్తువైరి భక్తుఁడ
ననఁగీర్తి వహించినట్టి యర్జునుడను నే
ననయంబు నిన్నుఁగొల్చెద
ననఁ గలదే సంశయింప ననఘా! కృష్ణా!



# కృ ష్ణ రా య భా ర ము

శ్రీ కాళూరి వ్యాసమూర్తి, విజయనగరము.

కృష్ణుని గౌరవులు సగౌరవముగా సభామందిరమునకు గొనిపోయిరి. కౌరవసభాప్రవేశసమయమున గృష్ణుని జూచి కర్ణదుర్యోధనులు తొలగంగజడిసిరి. తత్సమయమున కేతెంచిననారదాదుల కర్ఘ్యపాద్యాదు లగువిధు లాచరించి యందఱు నాసీనులైరి. అపుడు జలదస్వన గంభీరమున దంతదీప్తు లెసగ శ్రీకృష్ణుడు ప్రసంగించెను. జననాథా! నీ వెఱుంగనిది లేదు. అయినను దనవారికి దగవు పరమహితము చెప్పుట తగు నని యిట వచ్చితిని. కౌరవముఖ్యుడవు నీవు. కౌరవపాండవులు క్షీరోదకగతి గలసి యుండునట్లు నడుపుము' అని పలికెను.

చ॥ భరతకులంబు ధర్మమును బాడియు సత్యము బొత్తు బెంపునుం
గరుణయు గల్గియుండు ననగా నుతి గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుగుదమ్ముడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీ సుచరితక్రమ మిప్పుడు తప్ప నేటికిన్.

ఈపద్యమున 'అనగా' అనుదీర్ఘాంత మగుపద ముచ్చారణయం దెంతయేని భావమును బుట్టించుచున్నది. కృష్ణుడు ధృతరాష్ట్రపాండు భూపతుల వఱకు నేకకుటుంబముగా నుత్తమముగా వంశమర్యాద నుద్ఘాటించి పలికి చివరగా 'నీతనయుల్ యశోధురంధరశుభశీలురు' అని లౌకికముగా బ్రసంగించినాడు. ఇం దితరవిశేషము లేమియు దడవక కేవలము యశోధురంధరత్వమునుమాత్రమే ప్రసంగించుట సాభిప్రాయ మైనది. ఈమాట కౌరవపాండవు లిరువురకు వర్తించు సొగసైనమాటగా జతపడి యున్నది. అమాంత మాజతను విడదీసి పలుకువాడై — అట్లుపలుకుటయే యప్పు డవసరముగాన వెంటనే 'ఈసుచరితక్రమ మిప్పుడు తప్ప నేటికిన్' అనిపలికి కౌరవులను విమర్శించువా డగుచున్నాడు. ఒక్కటిగా నుండినది విడదీయదగునా? విడదీసిన హెచ్చుతగ్గులు కానరానగునుగదా యనునభిప్రాయము లిందు సూచించినాడు. కౌరవులు దుర్నయములు గావించినవా రయినను పాండవులతో జేరి

యుండినంతవఱకు సుచరితక్రమమేవర్తించి యుండగలదు. ఎంతగా విషమించియుండినను నేకీభావమున నాకులగాంభీర్య మెప్పటియట్లే నిలిచి యుండగలదుకదా యను చిత్రమైనసమర్థనమును గృష్ణుడీకులప్రశంస యందే సాధించినాడు. 'ఈవంశంబున కెల్ల నీవ కుదురిం దెవ్వారిచందంబు లెట్లై వర్తిల్లిన గీడుమేలు దుది నీయం దొందెడున్' అని కృష్ణుడనినాడు. కౌరవు లుండునంతవఱకు ధృతరాష్ట్రుడు కీడు నొందుచున్నాడు. ఆపిమ్మట నె యతడు మేలునొందు వాడగును. ఈమాటకృష్ణుడు చిత్రముగా సూచించి పలికినాడు. 'సద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబున్ జనస్తుత్యముల్ గాంవింపందగు నీకునెవ్విధమునన్' అనినాడు. ఇందులోని 'లోనిపొత్తు వెలివృత్తము' అనునది పోత్సాహసమర్థన మగుమాట యగును. కృష్ణునిచే పలుకబడి సాధుపూతగా నందగించుచున్నది. 'కౌరవ్యవంశాగ్రణీ' అని కృష్ణుడిప్పుడు ధృతరాష్ట్రుని సంబోధించుట సాభిప్రాయముగా నున్నది.

చ॥ వినుము సుయోధనాదు లగువీరు సధర్ములుగాక కార్యము
లోనక మహార్థసిద్ధియెడలుం దమ కిట్లన కన్వయంబు వ
ర్తన మిది గాదునాక బెడిదంపుదనంబున బంధుకోటికిన్
మనసులు నొవ్వగా నవగుణంబులకుం బుయిలోడ దేమియున్

ఉ॥ కౌరవపాండవుల్ తెఱగు గైకొని శాంతత బొందియున్కి మే
లౌగయ నాకు నీకు గులమంతకు నీనృపకోటి కుర్వికిం
బోరితమైన నింతకును బుట్టుమహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణుతించి యవశ్యము బొం దొనర్పవే.

ఆనాటివఱకు పాండవులమూలముగా నావంశమున కన్వర్తించి యున్నఘనతను సూచించుచు గృష్ణుడంతటివంశములో బుట్టినకౌరవుల యవగుణంబులను బిమ్మట తడవినాడు. కావుననే యిది ధృతరాష్ట్రుని దలంపునకు దేగోరి కృష్ణుడు 'వినుము' అని ప్రారంభించి "సుయోధ

నాదు లగుపీరు" అని నిర్దేశించి "బంధుకోటికిన్ మనసులు నొవ్వగా ననగుణంబులకుం బుయిలోడ రేమియున్" అని చివరిమాటలు నిశితముగా బలికినాడు.భరతకులము లోకారాధ్యమైనది. లోకపాలకమైనది.కావున వారికి అంతఃకలహము పనికిరాదు. వారిపొందు విశ్వశ్రేయమైనది. దీనినే కృష్ణుడు వరుసగా నిందు వివరించినాడు."కౌరవపాండవుల్ తెఱగు గైకొని శాంతత బొంది యున్కి-మేలారయ నాకు' అని ముందుగా గృష్ణు డనినాడు.కృష్ణుని విశ్వశాంతి నిది సారమొందించుచున్నది.పిమ్మట వరుసగా"నీకు కులమంతకు నీనృపకోటి కుర్వికిన్" అనినాడు.కావున విశ్వశాంతికై వారు పొం దొందుట విశ్వకళ్యాణమని యిందు గృష్ణుడు నిరూపించినాడు.అట్లుగాక పోరితమైన గలుగనున్న ఘోరమును బిమ్మట జేర్కొనినాడు."ఇంతకును బుట్టుమహాపద" అనుమాట లోకక్షయమును అందలితీవ్రతను నెదుట నిలువుచున్నది."కావునన్" —ఇంతటివైపరీత్య మేర్పడనున్నది గావున నదివల దనువాడై కృష్ణుడు ధృతరాష్ట్రుని "ధరిత్రీరమణాగ్రగణ్యా" అని సంబోధించినాడు. ఈసంబోధన మెంతటిసాధుమార్గమునో సాధించుచున్నది.ఇందలి "రమణ" అనుమాటయే సమగ్రమైనది. పిమ్మట నున్న "అగ్ర-గణ్యా"అనునవి పరమసమర్థములై యున్నవి. "గణుతించి"అనునదిఆధరిత్రీరమణాగ్రగణ్యు డగుధృతరాష్ట్రుడు తనపరమోదారహృదయమున నీమేలును గణుతింపదగువాడు అని తెల్లముచేయుచున్నది. 'అవశ్యము పొం దొనర్పవే' అనినాడు కృష్ణుడు. "అవశ్యము" అనునది కృష్ణు డాధృతరాష్ట్రు నిందులకై చేయనున్నబలవంతము నుదారముగా స్పష్టము గావించుచున్నది. "పొందొనర్పవే" అనునది ఉదారు డగు కృష్ణుడు ఉదారు డగుధృతరాష్ట్రుని నుదారముగా బ్రార్థించి పలుకుట నుదారముగా సమర్థించుచున్నది. ధరిత్రీరమణాగ్రగణ్యు డగుధృతరాష్ట్రుడు గణనీయకార్యాచరణ బాధ్యు డని ఫలితార్థము.ప్రపంచము

బాగోగు లాతనియం దపుడు నిలిచియున్నవి. అత డెంతేని నిదానించి ప్రవర్తింపదగువా డని చూపి చెప్పిన ట్లయినది.

తే॥ నీకు వలసినగీర్పంగ నేరవచ్చు
నధిప తెలుగు నీవశమున యదియ కాన
నీకు వీరల దేర్చుట నెదియ కాదె
సిద్ధమెవ్వారి దెలివొంద జేయ నేర్తు.

నిండుహృదయమున దలపెట్టినధృతరాష్ట్రు డింతయు జేకూర్పద గువా డని కృష్ణు డిందు తెల్లము గావించినాడు.పాండవులు తండ్రిని (ధృతరాష్ట్రు)ననుసరించుచున్నవారే. నయమున, భయమున దనపుత్రు లనుసరిచేయవలసినయవసరమే యాతనియందు (ధృతరాష్ట్రునందు)గల దని కృష్ణుడు తెల్పుచున్నాడు.ఆతనితలపైననే యధారపడి సమస్త మేర్పడియున్న దని నిపుణ మొనర్చినాడు.ధృతరాష్ట్రుడు తలంచిన నిది తీరగలదు. అది యాతనికి వశమందున్నవిషయమే.అది సిద్ధమే యని యిందు గృష్ణుడు బహుముఖముల నిరూపించి పలికినాడు.కృష్ణుడు 'అధిప' అని సంబోధించి 'తెలుగు నీవశమున యదియ కాన' అని పలుకుట, "నీకు వీరల దేర్చుట నెఱియ కాదె" అని నిర్ధారించి "సిద్ధ మెవ్వారి దెలివొంద జేయ నేర్తు" అనిపలుకుటయు సాభిప్రాయమైనది. కార్యము ధృతరాష్ట్రునందే యేర్పడియున్న దని యిది సూటి గావిం చుచున్నది.అతనికి వలసిన నది వారిబాగుగా నేర్పడిన దగును. ధృత రాష్ట్రునకు గాదగుచో గౌరవులందు బాగుగా నేర్పడును.)అట్లుగాక యాతనికి వేఱుగా వలసిన(ధృతరాష్ట్రు) డట్లు గానైన నది కీడుగా నేర్ప డును.)కృష్ణు డీతీరున విచిత్రసంభాషణము గావించి ధర్మానుకూలమున నున్నపాండవప్రవృత్తిని ధృతరాష్ట్రునం దెక్కించువాడైనాడు.ఇచ్చట "వలసిన" అనుమాట తలమానికముగా నున్నది.ఆత డట్లు తెలివొంది తనయందు బట్టించునొనినవా డయిన మంచిదగును. "సిద్ధ మెవ్వారి

దెలివొందఁ జేయనేర్తు' అనునది కౌరవులందే సూటియైయున్న మేల్మిని మెఱయించుచున్నది. "నీకు వలసిన దిక్కుంగ సేరనచ్చు" అను మొదటి మాట, "సిద్ధ మెవ్వారి దెలివొంద జేయనేర్తు" అను చివరిమాట ధృతరాష్ట్రుఁడు బాధ్యుఁ డగుటో, అబాధ్యుఁడగుటో యది యాతనియందే నిల్చిన దగుచున్నది. అందఱ దెలివొంద జేయదగువాఁడు ధృతరాష్ట్రుఁ డనియు నందు మాట యేర్పడియున్నది. ఈ పద్యమందలి "సిద్ధము" అనుమాట తలమానికముగా నున్నది.

ఉ॥ అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్నుమా యిచట నీగురుభీష్ముల గెల్చిసేయువా
రెందఱొ వారు వీరు నని నిల్పుటకంటె భవద్విధేయులై
యందఱు గూడుటొప్పు హృదయంబున శాంతి యొనర్పు
మెమ్మెయిన్.

ఉభయపక్షములందు గీడుదీయని ఘనయోధు లున్నా రనిపలుకువాఁడై కృష్ణుఁడు సాభిప్రేత మగువచనములు పలుకుచున్నాఁడు. ధర్మజుఁడు కృష్ణుని గౌరవులందరికి బంపునపుడు "మనమున బక్షపాతగతి మాదెస మానుము" అని పలికియున్నాఁడు. మానరాని దానిని మానుకొనుపలు కిపుడు కృష్ణు డాడుచున్నాఁ డని సారస్యము. ఈమాటలు నిష్పక్షపాతమును, ధర్మముగా బాండవపక్షపాతమును సమర్థించునవి యగుచున్నవి. "అం దున్న భీమార్జునులను, మీఱువా రెందఱొ యెన్నుమా యిచట" అని కృష్ణుఁడు స్పష్టముగా బలికినాఁడు. భీమార్జునులు మీఱరానివా రే యని యిది విచిత్రముగా సమర్థించుచున్నది. పాండవబలసంపదనుగూర్చి యిట్లు స్పష్టముగా బలికి వారిని మీఱువారు కౌరవులందు లేరని కృష్ణుఁడు స్పష్టము గావించినాఁడు. పిమ్మట 'కౌరవబలమునుగూర్చి' 'నీగురుభీష్ముల గెల్చిసేయువా రెందఱు' అనిపలికినాఁడు. 'ఎన్నుమా యచట' అని యిక్కడ లేకుండుట దొడ్డలౌకికముగ నున్నది. కానసిరిని గెల్చిసేయువా రెందఱొ పాండవబలసంపదయందు గల రని యంత

ర్ఖ్యాతముగా నిర్దేశించిన ట్లగుచున్నది. 'క్రేణిసేయువారు' అనుమాటయు బరిహాసాస్పదముగా నేర్పడుట విచిత్రముగా నున్నది.అల్పవిషయముగా భీష్ముని బడవేయువాఁడు శాంతనవాంతకుఁడు శిఖండి, ద్రోణ హంత ధృష్టద్యుమ్నుఁడు పాండవపక్షమం దుండుట నిందు కృష్ణుఁడు చిత్రముగా సూచించినాఁడు.కృష్ణు డిట్లు నిదానించి పలికి ప్రసంగము సమాంతముగ నుభయపక్షములకు సరిదాకఁ జేయువా డగుచు 'వారు వీరు నని నీల్గుట కంటె భవద్విధేయులై యందఱు గూడుటొప్పు' అని యెత్తికొనినాఁడు. 'భవద్బలంబులై యందఱు గూడు టొప్పదె జనాధిప శాంతియొనర్పు మెమ్మెయిన్' అనుపాఠాంతర మిచ్చుట గలదు. 'శాంతి యొనర్పు మెమ్మెయిన్' అని యీపద్య మంతముగావించినాఁడు తిక్కన.ఇందు గృష్ణునకు బాండవపక్షపాత మున్నటుల ధ్వనించుచున్నది.భీష్మాదులను (వారికొలఁదులను)విమర్శించి పలికిన ట్లయినది. కాని యీప్రసంగము ధర్మరూపము యదార్థవిషయమై యొప్పియుండినందున పాండవులం దే యట్లు మాటాడుచుండినను పాండవపక్షపాతమె మానిన ట్లగుచున్నది. భీష్మాదులను విమర్శించినను సజ్జను లగుభీష్మాదులబుద్ధికి వచ్చినపల్కగు చున్నది.ధర్మజుఁడు పల్కినంత మేగకు (3 ఆశ్వా2 3 పద్య)కృష్ణుఁడు పరమోచితముగా గార్యవచనములు పలుకుచున్నాఁ డని యిది నిర్ధారించు చున్నది.

తే॥ జగతి గలజనపతులు నీచరణపీఠ
మర్థిఁ గొలువ సముద్రవేలాకృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లి ప్రజల
యెడ నిరోధంబు వాటించు టెంత మేలు.

ఇచ్చోట కృష్ణుఁడు జగమునంతయు జిత్రించుచున్నాఁడు.బహుముఖములుగా దాని నెదుట నిలుపుచు గార్యజగతి గల్గించుచున్నాఁడు 'జనపతులు' అనిన చాలును.అట్లుగాక 'జగతి గల జనపతు' అని

వివరణముగా బలికినాడు. ఇది స్పష్టీకరణ మగుపలుకై యున్నది.సము
ద్రవేలాకృతోర్వి' అనిననే చాలును.'ఆవృత' అనుమాటతోడనే స్పష్టీ
కరణ మైనదగును.'సముద్రవేలావృతోర్వి యెల్ల' అని సాగించి పలు
కుట మఱియు 'స్పష్టీకరణమై యున్నది.ఈసగానము సముద్రతరంగము
లట్లును, ప్రవాహరూపముగను నేర్పడియుండుట రసవంతముగా
నున్నది.

కం. నరనాథ నీ వుపేక్షా పరుడ వయిన కౌరవులకు పాండవులకు కా
దరయగ భూప్రజకెల్లను దురితం బొనరించుసట్లు తుది కీడుసుమీ.

'నీ వుపేక్ష చేయవలదు.'అని పలుకక కృష్ణుడు 'నీ వుపేక్షాప
రుడ వయిన' అని సాభిప్రాయముగా బలికినాడు.పెద్దవా డగునాతనిని
(ధృతరాష్ట్రునిగూర్చి)గౌరవముగా మాటాడిన దగుచు నిది యాధృత
రాష్ట్రుని స్వభావము నంతయు వెల్లడించుచున్నది. ఆత డుపేక్షాపరుడ
యిన నేర్పడువిషమపరిస్థితి నంతయు గృష్ణుడి కెదుట నిలిపినాడు.
'కౌరవులకు పాండవులకు కా దరయగ భూప్రజకెల్లను' అనినాడు.కౌర
వపాండవులనిం దెదురెదురుగను.సన్నిహితముగను గూర్చుట సాభిప్రాయ
మైనది.వారి కలహము లోకక్షయకారకము.వారిపొందు లోకహిత
కారకము అని యిందు సాధించుచున్నాడు.ధృతరాష్ట్రు డుపేక్షాపరు
డయిన కౌరవులకు పాండవులకుమాత్రమే కాక భూప్రజ కెల్లను దురిత
మొనర్చినట్లే యగు ననినాడు.అంతపెద్దపాప మది యని యనినాడు.
కాగా తుది కీడయినదానియందు బ్రవర్తింపక యాత డుచితముగ బ్రవ
ర్తింపవలసియున్న దనినాడు.ఉభయులకు గుదురుగాన నాతడు (ఆధృత
రాష్ట్రుడు)చక్కనైనచో పాండవులే కౌరవులను సరిదిద్ది లోకశాంతి
గల్గింపగలవా రని యిందు ధ్వనింపజేసినాడు.'భూప్రజ'అనిననే చాలు
ను.దాని నింకను విరివిజేయుచు 'భూప్రజకెల్లను' అని పొడిగించి పలికి
నాడు.ధృతరాష్ట్రుని నిలువరించువాడుగా గృష్ణు డీమాటలు పలికినాడు.

'భూపప్రజకెల్లను దుదితం బొనరించినట్లు తుదిగీడుసుమీ' అనినాడు. 'తుది గీడుసుమీ' అనుదానిలోని 'సుమీ' అనుమాట ధృతరాష్ట్రునిబుద్ధి కెక్కించునెక్కుడుమాటగా నేర్పడియున్నది.

కం. కౌరవపాండవులం దెవ్వారలకుం జాలనొవ్వు వచ్చిన మేలు
ర్వీరమణ చిత్తమున నెట్లారయుమా నీకు దుఃఖ మగు నెట్లైనన్.

'చాలనొవ్వు వచ్చిన'అనునది కలుగనున్న ఘోరపరిస్థితిని దెల్పుచున్నది. మఱియు వంశోన్నతినిగూడ నిదానింపజేయుచున్నది. 'మేలు' అనుమాటతో సందర్భము నదిమిపట్టి కృష్ణుడు సాభిప్రాయమైనప్రసంగమును బిమ్మట సాగించినాడు. 'ఉర్వీరమణ' అని ధృతరాష్ట్రుని సంబోధించినాడు. ఇంతలి 'రమణ'అనుపదము కృష్ణునివాగ్రీతిని తెల్లమొనర్చుచున్నది. 'మే లుర్వీరమణ' అనుసంధిమాటలు రసవంతముగా నున్నవి. 'కౌరవపాండవులం దెవ్వారలకుం జాల నొవ్వువచ్చిన మే లుర్వీరమణ చిత్తమున నెట్లారయుమా'అని పలికి కృష్ణుడు పరిస్థితిని నెదురు చూపించువా డగుచున్నాడు. 'నీకు దుఃఖ మగు నెట్లయినన్' అని చివరగా బలికి ఉభయులకు గుదురైనధృతరాష్ట్రుని సరిగ దెల్పువాడయినాడు.

ఉ॥ వీరును వారు బండితులు విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోని రిత్తబవరంబున నాఅడి బూనబోవ నె
ట్లూరక యుండవచ్చు కడు నొప్పెడుమేనులు వాడి కైదువుల్
గూరగ నాటినం బుడమి గూలుట కక్కట యోర్వవచ్చునే!

ఆ॥ అట్లు గాకయుండ నీరెండుదెఱగుల వారి గాచికొనుము వసుమతీశ!
నీదుప్రాభవంబు నీతియు శాంతియు నిఖిలజనులు బొగడునట్లుగాగ

కృష్ణు డిందు 'వారును వీరు' అనక 'వీరును వారు' అని పలుకుట పరమలౌకికమై యున్నది. వ్యవహారదక్షమై యున్నది. 'లోని రిత్త

బవరంబున' అనునది కార్యస్వరూపమును జక్కఁగా నెదుట నిలుపుచు న్నది. కార్యమా రెండయినది. వారా చేవగల్గినవా రని యభిప్రాయ మును గల్గించి కృష్ణుఁడు 'ఓర్వవచ్చునే కాచికొనుము' అని విశేషాకా రముగా బలికినాఁడు. ఈమాటలు వంశోన్నతిమూలచ్ఛేదమును, వంశో న్నతిపరిరక్షణమును సముద్ధతిగా వెల్లడించుచున్నది. యోగ్యత నిలుపు కొని యఖిలజనులబొగడ్త నొందదగువాఁడు ధృతరాష్ట్రు డని యిందు గృష్ణుఁడు చిత్రించినాఁడు. కృష్ణుఁ డింతవఱకు దాను జెప్పదగుతీరును ముచ్చ టించి యింక పాండవులరీతిని (తీరును) వ్యక్తీకరించువా డగుచు బ్రసం గ మారంభించినాఁడు.

తే॥ పాండవులు తండ్రిసచ్చినపిజలు వారి
నరసి ప్రోచితి శైశవ మాదిగాఁగ
నడుమ నిష్కారణమ దిగవిడువదగునె
పార మొందఁగ రక్షింపు గారవమున.

వ॥ పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతో జెప్పుమని నాకుం జెప్పినవిధంబు వినుము. తన పంపునం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి. పదుమూ డగునేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జరిపితిమి. మాతండ్రిసమ యంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్లునుం బడయుద మని కృత నిశ్చయులమై పడితిమి. తల్లియు దండ్రియు నెల్లచుట్టంబులు నేలుగడ యును మాకు దానమావలన నేరిమి గల్గినం గినిసి యిట్లుగా దట్లని చక్కం బెట్టునది. తన గలపదివేలేండ్లకుం దన్నకాని మఱి యెఱుంగ మెట్టివారమైననుమమ్మును దుర్యోధనాదులనుం దలంపరు. తనయందు దెఱంగు గల్గిన నెవ్వారు నొఱగాకున్నను గులంబుపాడి సెడక చెల్లు నని రని పలికి మఱియు నిట్లనియె.

ఉ॥ సారపుధర్మమున్ విమలసత్యము బాపముచేత బొంకుచే
బారము బొందలేక చెడబాఱినదైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్షసేసి రది వారలచేటగుగాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్

వ॥ అని యీసభ్యులకుం జెప్పుమనిరి. నీవును సభాసదులైన రాజులు నేమనియెద రనుం డేను ధర్మంబును నీతిని మున్నిడుకొని మనోవాక్ప్రకారంబు లేకరూపం బైనసత్యంబుగా జెప్పితి నిత్తెఱంగు మీకు మేలు. క్రోధమానమత్సరంబులు విడిచి యిట్లు సేయుండు.

తండ్రిలేనివా రగుపాండవులను నరసి శైశవమాదిగా బోషించి యిప్పుడు— నడుమధ్యలో నిష్కారణముగ దిగవిడుచుట— ఘోరమైనది. పెద్దదగా యగుచున్నది. కృష్ణు డిట్లు ధృతరాష్ట్రునం దేర్పడిన పక్షపాతవృత్తిని అందలి యకృత్యమును నెదుటబెట్టి, దిగవిడువ దగునే అనుమాటతో దాని నంతయు గప్పిపుచ్చుచున్నాడు. ఈమాట విషయగ్రహణలాఘవ మగుచున్నది. ధృతరాష్ట్రుని విమర్శించునదిగను, ఆతనిస్థానమును సరిబెట్టునదిగను నుభయతః నీమాట సమర్థ మగుచున్నది. కావున నే 'పార మొందంగ రక్షింపు గారవమున' అనినాడు. పాండవుల విహితవిధానమును వివరింపుచు 'పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతో జెప్పుమని నాకుం జెప్పిన విధము వినుము' అనినాడు. కృష్ణుడు పాండవప్రసంగమున నేర్పడిన విధమును తనమాటగా జతగూర్చి యిపుడు పలుకుచున్నాడు. 'మాతండ్రిసమయంబు — అరణ్యాజ్ఞాతవాసములు పాలించి యే మర్ధరాజ్యం బెట్టునుం బడయుద మని కృతనిశ్చయులమై పడితిమి.' అని పాండవులు పలికినా రని కృష్ణు డనినాడు. కృష్ణు డెట్లు పాండవులయొక్క ధృతరాష్ట్రానుసరణమును, పాండవుల నిశ్చయమును నుదారముగా జూపించి ధృతరాష్ట్రునకు పాండవులు వివరించిన స్వకార్యవిధానమును తెల్లమొనర్చినాడు. ఇంక పాండవులు కౌరవసభికులనుగూర్చి ప్రసంగించిన

తీరును వివరించుచు గృష్ణుడు 'సారపుధర్మము, విమలసత్యము జయ రూపమైన వని తనయందు నెలకొనియున్నట్లుగా బాండవులు పలికి రనినాడు. 'దక్షు లెవ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుగాని' అని పలికి పాండవుల నెదిరించిన గల్గనున్న పెద్దచేటును సూచించినాడు. పాండవపరిగముతీరు నిట్లుగా కృష్ణుడు వివరించి ఫలరూప మగుదైవ గతినిగూర్చిన పాండవులవివరణమును దెల్పినాడు.'ధర్మనిస్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్' అనినాడు. కృష్ణు డి ట్లుగా సామాద్యుపాయములు ప్రయోగించి భరతవంశమం దున్నయు న్నతిని, పాండవుల సమర్థతను, ధృతరాష్ట్రుని కార్యభారమును దెల్పి నాడు. ధృతరాష్ట్రు డుపేక్షాపరుడు గాని నాడు త్తరక్షణమున నేర్పడ నున్న లోకశాంతిని బ్రస్ఫుటము గావించినాడు. అట్లు జరుగనినాడు (ధృతరాష్ట్రు డుపేక్ష చేయుట, సభికులు పలురీతులుగా నుండుట గల్గి ననాడు) ధర్మనీతిపథములయొక్క ఊతను గృష్ణుడు పరీశీలించినాడు. ఇందలి 'ఉపేక్షాపరుడు' అనునది ధృతరాష్ట్రునందలిమంచిని చెడ్డను - ఈరెండిటిని నెక్కుడుగా నిరూపించుచున్నది. చేరికతో గూడినఅదపు మాటలు కృష్ణుడు పలికినాడు. 'ఏమనియెద రనుండు ఏను ధర్మంబును నీతిని మున్నిడికొని మనోవాక్ప్రకారంబు లేకరూపం బైనసత్యంబకా జెప్పితి నిత్తెఱుంగు మీకు మేలు. క్రోధమానమత్సరంబులు విడిచి యిట్లు చేయుడు' అని కృష్ణు డనినాడు.

ఆ. పాండవులకు దగినపాలు మేదిని బంచి
యిచ్చుకంటె గార్య మెద్ది గలదు
ధర్మ మెద్ది సముచితంబగువిధ మెద్ది
శక్య మెద్ది చెపుడ కార్యవిదులు

'శక్యమెద్ది చెపుడ కార్యవిదులు' అనుమాటలు కృష్ణు డెంతని శ్చిచ్చిగా గార్యము నెదుట నుంచినది వ్యక్తీకరించుచున్నది. 'చెప్పుడు'

అని కాక 'చెప్పుడ' అని యిక్కడ గలదు. ఇది ప్రత్యుత్తర రాహిత్యమును నిర్ధారించుచున్నది. కృష్ణుడు పిమ్మట 'మహారాజా' అని ధృతరాష్ట్రుని సంబోధించినాడు. ఇది గౌరవమును జూపుచున్నది. మఱియు నిలవరించునదియు నగుచున్నది. పాండవులఘనతను, కౌరవులచెడు తెరువును విశేషాకారమున నెదుట నుంచనెంచి భూపతులెల్ల తెలియంగ, సజ్జనకోటికి బుద్ధికి రాదగినరీతిగా గృష్ణు డిట్లుపలికెను.

కం. ఎఱుగవె యజాతశత్రుని
నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నె
త్తెఱగున ననువర్తించెనొ
యెఱుగనె తగుచేవ గలుగ టెఱుగవె యధిపా

వ॥ నీ వెఱుంగు దైనను జెప్పెద వినుమింద్రప్రస్థపురంబుననుండి పాండవాగ్రజుండు నీకుం బెంపునుం బేరునుం జేయగోరి

ధర్మజునందలి నీతి, ధర్మము, సత్యనిష్ఠ నీ వెఱుగవా అని కృష్ణుడు పలికి 'మిము నెత్తెఱగున ననువర్తించెను యెఱుగవె' అని ప్రత్యేకముగా బలికినాడు. కౌరవులకు మేలు గూర్చునదిగా నంతయు నొప్పియున్నదిసుమా యనురూపము నిందువలన జూపించినాడు. 'తగుచేవ గలుగు టెఱుగనె' అనునది బహుముఖముగా నర్థమగుచున్నది. పాండవులచేవ దెబ్బతీయుటకు వంశోన్నతి నిలుపుటకు పరమసమర్థమైనదని యుభయతః దానిని నిలిపి కృష్ణుడు ప్రసంగించినాడు. 'అధిపా' అనుపద్యాంతమందలి సంబోధన ముచితముగా నున్నది. 'నీ వెఱుంగు దైనను జెప్పెద వినుము,' అని కృష్ణుడు పలుకుట పరమలౌకికముగా నున్నది. నీకు దెలిసి యున్నను దెల్పవలసినయవసరము గల్గిన దని యొక భావము. నీకు దెలిసియున్నను నేనై తెల్పెద నని యింకొక భావము నిందు గలవు. 'నీ వెఱుంగుదైనను జెప్పెద వినుము' అని కృష్ణుడనినాడు. ఇందలి 'వినుము అనుమాట పోషక్కగా నున్నది. ఆపై మాట కొకవిశిష్టసమర్థత నాపాదించుచున్నది. ఇంద్రప్రస్థంబున నుం

డి పాండవాగ్రజుండు నీకుం బెంపునుం బేరునుం జేయఁగోరి' అనునది మేల్మిస్థాన మొందినధర్మజుడు లోకక్షేమమైన గూర్చువా డని యర్థ మిచ్చుచు గౌరవులు పాండవుల నిలువెడలనంపుడ ప్రారభించుకొని రా జసూయాంతమువఱకైన విషయముల నెల్ల నెదుట నిలుపుచున్నది. ఇందు కౌరవుల చెడునడత లున్నవి, పాండవులవృద్ధిపరంపర యున్నది. ఇట్లుగా నీమాటచే పరిస్థితులను బహుముఖములుగా గృష్ణు డెదుట నుంచి పలుకువా డగుచున్నాడు. కౌరవు లెట్టియూహవారైనను, వా రెటు లాచరించినను పాండవాగ్రజుండు ధృతరాష్ట్రునకు బెంపుపేరు చేయుటకై ఘనకార్య మాచరించియున్నా రనుచు దాని నిట్లుగా వివ రించినాడు.

చ॥ మద మడగించి భూపతి సమాజమునెల్లను నిన్ను గొల్వఁ జే
యుదు నని పూని దిగ్విజయ మున్నతి జేసి మహావిభూతితో
మది మదినుండ నీసుతుడు మంత్రులు సౌబలుజూద మార్చి నం
వద గొని యంతపోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే,

పాండవులు వారు బాగుపడి లోకముతీరును జక్కచేసి వృద్ధి నొంది రని కృష్ణుడిందు వెల్లడించినాడు. సంకటములను దీర్చికొని లోకసంకటమును బాపి ప్రభావ మొందినపాండవులు లోకము నదుపాజ్ఞలకు గొనివచ్చి మహావిభూతితో విలసిల్లి రని పలికినాడు. ఆకూడిన రాజలోకమునకు, ధృతరాష్ట్రునకు బుద్ధి గఱప వచ్చియున్నకృష్ణుడు కోరి యిట్టి సత్యరూప మగుధర్మమును బ్రకటించినాడు. 'మద మడగించి భూపతిసమాజము నెల్లను నిన్నుగొల్వఁజేయుదునని పూని దిగ్విజయ మున్నతిజేసి మహావిభూతితో మదమది నుండ' ఇది పాండవప్రవృత్తినంతయు నెదుట నుంచుచున్నది. పాండవులు వంశగౌరవమును నిలుపుచు లోకము నదుపాజ్ఞలకు గొనివచ్చి ధృతరాష్ట్రునిపెద్దరికము ప్రపంచమంతయు సాగునట్లు చేసిరి. అద్దానిని గౌరవులు పాడునకుం

దెచ్చిరి. మద మడగిన యారాజులు మరల తలయెత్తునట్లు చేసిరి. లోకోన్నత మైనపనిగావించి తండ్రికి బెంపు బేరు గల్గించి మహావిభూతితో పాండవులుమదిమది నుండిరి. అది చూచి మదిమది నుండలేని కౌరవులు రచ్చకెక్కిరి. రాజులను రచ్చ కెక్కించిరి. లోకోన్నతిని పాండవు లుండగా లోకాతీతకార్యమునకు గౌరవు లొడిగట్టినారు. కృష్ణు డీయభిప్రాయమునెల్ల క్రోడీకరించి పలికి యిందుకు నిదర్శనముగా జూదమును ద్రౌపదీభంగమును బేర్కొనినాడు. ఈపద్యముముందు భాగము పాండవులు మహోన్నతిని వెల్లడించుచున్నది. చివరిభాగము కౌరవులయనాద్యదుర్నీతిని వ్యక్తీకరించుచున్నది. కౌరవుల దుర్నయమును,అందలి లోకవిద్ధూరమును జూపి చెప్పి యదియెల్ల ధృతరాష్ట్రునియుపేక్షయే యని తగువిధమున నిరూపించువాడగుచు గృష్ణు డిట్లు పలికెను.

ఉ॥ దానికి నీ వొడంబడితి ధర్మజు డంతయు జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు బొంగులుగా బెడచేత గన్న నీ
రూనగ నోర్తుకొంచు జని యుగ్రవనంబున దుఃఖమగ్నుడై
దీనత నుండి పూన్కిదగదీర్చియు గూడి మనంగ నోరెడిన్.

'దానికి నీ వొడంబడితి ధర్మజుడంతయు జూచి' ఈ మాటలు ధృతరాష్ట్రునిపరిస్థితిని, ధర్మజునిపరిస్థితిని తూచినట్టుగా జూపుచున్నవి. ధృతరాష్ట్రు డిష్టపడెను అని కాని, అనిష్టమొందెను అనికాని కాక (మొగమాట మొందెను లేక కోరిప్రవర్తించెను. అని స్పష్టముకానట్టి రీతిగా) 'దానికి నీ వొడంబడితి'వని కృష్ణుడు పలుకుట గమనింపదగినది వెంటనే 'ధర్మజు డంతయు జూచి' అని పలికినాడు. పరిస్థితినంతయు యథాస్థితిని బరిగ్రహించినధర్మజుడు ప్రవర్తించినరీతి నిట్లుగా నుడివినాడు. కృష్ణు డిట్లు వారినిద్దఱను (ధృతరాష్ట్రుని, ధర్మజుని) సరిజూపి పిమ్మట ధర్మజునిసత్యమహిమనెల్ల వెల్లడింపజేయుచు బ్రసంగించినాడు.

'సత్యముం బూనివృకోదరార్జునులు బొంగులుగా బెడచేత గన్ను నీ చూనగ నొత్తుకొంచు జని' అనునవి కరుణకది యెంతటిస్థానమో వెల్ల డించుచున్నవి. జగత్సారభూతులు వృకోదరార్జును లాజగదేకవీరులు బొంగులగుటకు, జగన్నాథుడు ధర్మజుడు కడకంట మానితిసంపద లీను వాడు. కంటినీ రొత్తుకొనుటను బల్కి కృష్ణు డది లోకాసహ్యావిషయ ముగా జూపినాడు. ఇచ్చోట నాధర్మరాజు చూపినపెద్దసహనమును, ఉదారమును గృష్ణుడు విశేషించి యి ట్లనినాడు. 'ఉగ్రవనంబున దుఃఖ మగ్నుడై దీనతనుండి పూన్కి దగ దీర్చియు గూడి మనంగ గోరెడిన్' అనినాడు. ధర్మజునం దున్న పెద్దవిశేష మే యది. దానినే కృష్ణు డిపుడు నిండుసభలో బలికి ధృతరాష్ట్రుని ఉపేక్షచే నెంతయో చెడిపోయి యున్నదుర్ఘటకార్యము నిప్పటికి ధర్మజుడు తన నిండైనప్రవర్తనమున జక్కంజేయువాడుగనే యున్నాడని ధ్వనింప జేసినాడు.

కం. తను దాన పోలుగా కే మనవచ్చు నజాతశత్రు నతిశాంతతయున్
వినయము గౌరవమును నే జనపతులకు గలవు చెపుమ సౌజన్యనిధీ

ఈమాటలు విస్తృతార్థములుగా నున్నవి. లోకవిద్రోహము నకు గడంగురాజు లందఱపైని దెబ్బదీయునదిగా నున్నది. 'తను దాన బోలు' అనుధర్మజునిప్రశంస. 'సౌజన్యనిధీ' అను ధృతరాష్ట్రసంబోధ నము కార్యనిదానమందనువర్తించుచున్నవి.

కం. ఏ నింతాడితి నీసం తానం బిరుదెఱగునకు హితము గోరి భవ
త్సూనునిమతి యతిలోభము మానిచి పాండవుల దెమ్ము మనుజాధీశా

కృష్ణుడు తనకు, ధృతరాష్ట్రున కేర్పడియున్న యుభయబాధ్య తల నిందు సూచించువాడై 'ఏ నింతాడితిని' అనినాడు. ఇంత విస్త రించి పలికితిని. ఇంతగా జెప్పవలసినది చెప్పితిని యనురెండర్థముల నిందు ధ్వనింపజేసినాడు. కృష్ణుడు తనబాధ్యతను దెల్పి ధృతరాష్ట్రుని బాధ్యతనుగూడ దెల్పుచు దుర్యోధనునిమతి యతిలోభము మాన్పు మనినాడు. 'మానిచి' అనునది దుర్యోధనునియతిలోభమునుబడగొట్టియే

పరివర్తింపుము అని సూచించుచున్నది. అది యిరువురకును హితమని నాడు చివరగా 'పాండవుల దెమ్ము' అనినాడు. 'పాండవులకు రాజ్యము పాలుచేయుము' అనికాక, 'పాండవులను బిలిపింపుము' అనికాక 'పాండవులను దెమ్ము' అనిపలుకుట పరమయోగ్యముగానున్నది. వారు నీవారే నీవు వారివాడవే యని నిలువదీసి పలికిన ట్లగుచున్నది. కాగా నీకూడి యున్నవారే పెరవారు, పాండవులను దెచ్చువాడవయిన దుర్యోధనుని లోభము, రాజులమదము తీఱిపోగల దని ధ్వనింపజేసినాడు. కృష్ణుడు చివరగా నిట్లు పలికినాడు.

ఉ. వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వబూని యు
న్నా రటుగాక మీ కది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండు తెఱంగులందు నీ
కారయ బథ్య మేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా.

'పాండవులు శాంతశూరులు' అని పలికి కృష్ణు డాశాంతశూరత్వమునే చక్కగా నిందు వివరించినాడు. పరమసౌజన్యులగు పాండవుల దెప్పుడు నొకేయభిప్రాయము. ధృతరాష్ట్రుని చరణములు గొల్చుట పోరికివచ్చుట రెండును పాండవులు పూనియున్నారు. ధృతరాష్ట్రుని నిశ్చయము దెలిపినపిమ్మట పాండవప్రవృత్తి తెల్లముకాగలదు. కృష్ణు డిట్లుగా బాండవులయోగ్యతను, వారికార్యాచరణమును వెల్లడించి 'ఈరెండుదెఱంగులందు పథ్య మేదియో యది యేర్పడ నిశ్చయింపుమా' అని ధృతరాష్ట్రునితో జక్కగా బలికినాడు.



నీలవేదుల నాటనెరపునెమ్ముల జూడ
గోరుజాడ దలిర్ప గొంతసేపు
హరిణశాబక విలోలాయతేక్షణముల
వింతలు గనురీతి గొంతసేపు

గాలయాపన సెయుచు గాము డపుడు
ముందరికి లజ్జ వెనుకకు మొనసి తిగియ
జెలిమికత్తియ లిరువంక జేరికొలువ
వచ్చె విభు డున్న యావరివలని కతివ. 100

క॥ వచ్చియు జెచ్చెర గదలక
యచ్చిగురుంబోణి మరునియరదముక్రియ దా
నచ్చట నిలిచిన సకియలు
మచ్చికతో నృపవరేణ్యు మందిరమునకున్. 101

క॥ తెచ్చి నరపాలుముందర
నచ్చిలుకలకొలికి నుంచి రతివలు కడకన్
బచ్చనివిలుకా డిద్దర
హెచ్చరిక యొనర్చి దూపు లేయుచు నంతన్. 102

సీ॥ నాగవల్లీదళానయనము గావింతు
నని బయలెక్క గయ్యాళి యొకతె
చిలుకల కాహారము లొసంగవలె నని
యటిగి మెల్లన నీరజాక్షి యొకతె
న న్నెలబిలచెద నలినాక్షి యదె వత్తు
బద వద మని యేగె బడతి యొకతె
తన కొక్కపని గల దని విన్నవించి నే
ర్పున జారె నెలమితో బాలతి యొకతె

నర్మసఖులు దమమనమ్మున లజ్జాభ
రమ్ము తేటపడగ రభసగతిని
జరిగి రట్లు వికచసరసీరుహాక్షి ల
జ్జాసనాథ యయ్యె జకితగతిని. 103

చ॥ అభిమతలీలతో గిసలయంబులశయ్యకు దార్చి భర్త య
య్యిభనిభయాన నాస్యమొగి నెత్తకయున్నవిధంబు జూచి మో
హాభరము గన్పడంగ బరిహాసము సేయుచు బల్కరింపుచున్
రభసవినోదలీల లలరం బ్రమదాంబుధి దేలు నయ్యెడన్. 104

క॥ వెడవెడచూపుల గను నడ,
దడ బడ జను బెనగి శయ్యఁదార్చిన యెడలన్
జిడిముడిపడి విభుకౌగిట
బడి వెడలు లతాంగి ముగ్ధభావాన్వితయై. 105

గీ॥ పలుకరించిన బలుకక బలిమి నలుము
కొనిన జిక్కక బ్రతికూలతను నటించు
నంబుజానన విభున కత్యంతకామ
దోహదసుఖంబె జేసె సంతోష మొదవ. 106

చ॥ కినుక యొకింత బూని గిలిగింతలు మాని నిజేశ్వరుండు పం
చనగనుమూయుచో నిది నిజంబగునో యిక పల్కరింతునో
యని కనువిచ్చి జూచు విభు డంత నెఱింగి దరస్మితంబుతో
గనుగొన గన్నుమూయు గలకంఠి తటిచ్ఛలనంబుకై వడిన్. 107

వ॥ మఱియును. 108

శా॥ నీవీబంధవిమోచనంబునకు నెంతే నాభిదేశంబుపై
జైవేయుం దమకింపుచున్నపతియుచ్చైవ్రుల్ విలోకించి ల
జ్జావిర్భావము దోప దత్కరము ద్రోయన్ సాత్వికస్ఫూర్తిగా
నావేళం బ్రతిషేయగా నెఱుగ లేదయ్యెం గళ స్నీవియై. 109

క॥ అక్షతరదనచ్ఛదనా
లక్షితనఖరాంకరతికళాకేళికి బ
ద్ధాక్షి రెయొడంబడె దాని త
రాక్షుప్రరతోద్యమంబు లవి గాకునికిన్. 110

సీ॥ మొనసి గాఢోపగూహన మొనరించిన
బెదరుచూపులతోడ నె డగియుండు
నధరామృతాస్వాదనాసక్తి గెమ్మోవి
మొనపంటనొక్కిన మోము వంచు
జనుదోయిపై నఖాంచలరేఖ లలరింప
బూనిన నొకవింతబూమె నెఱపు
నీవిపై కేవతో జై వేయ నపుడ మి
క్కిలి పెనుగక కొంత యలుకసేయు

గీ॥ నగము మదనుండు ప్రీడయు నగము దన్ను
జట్టిగా గొన్న విభునియిచ్చనె మెలంగు
మొదలిచైవులు మాని య మ్ముద్దరాలు
మధ్యమాలీల నెరపు సామాగ్రితోడ. 111

చ॥ అదయ కచగ్రహంబు లధరాధరబింబరదక్షతంబులుం
బొదల గుచద్వయీకలితభూరినఖాంకము లుల్లసిల్లగా
మదనకళారహస్యములు మాటికి నంటుచు దృప్తి జెందక
మ్మదవతితో రమించె నృపమాళి మనోహరలీల నయ్యెడన్॥ 112

క॥ అయ్యిరువు రిట్లు మారుని
కయ్యం బొనరించి యలసి కడువేడుకతో
శయ్యాపయి నిదుర జెందిరి
అయ్యెడల ప్రభాతసమయ మయ్యెన్ వేగన్॥ 113

సీ॥ కెందమ్మి రేకుల గేరుకన్నులమీఁద
నిద్దురకొలఁత రాణించి యుండ
విడెపుచేతలకెంపు విడె సొంపు గలమోవి
పై రదక్షతములు బయలుపడగ
జిటులుగండంబుతో జిన్నారిపాలిండ్లు
నఖరాంకములసమున్నతి వహింప
జెదరి ముంగురులు నెన్నుదురుపై దిగజార
వదలినకీల్గంటి వన్నె యొసగ

గీ॥ గ్రుక్కి నెమ్మోగ మొకవింతసొబగు దెలుప
జిక్కువడి తారహారముల్ జిందులాడ
బ్రాణవిభుకోర్కె దీర్చి వైభవముతోడ
బడతి యోవరిలో బయల్వెడలి నిలిచె॥ 114

శా॥ వందివ్రాతము లందు జేరి తగుకైవారంబు గావించి యా
నందం బంది విపంచికావళుల బూర్ణగ్రామవిస్ఫూర్తి నిం
పొందం బాడుచు మేలుకొల్పిరి నిజోద్యోగంబు దీపింపగా
గందర్పప్రతిమాను నమ్మనుజలోకస్వామి ధీరాగ్రణిన్ ॥ 115

క॥ ఈకరణి ననుపమాన
శ్రీకలితుం డగుచు నృపతి చిరకీర్తి గనెన్
బ్రాకటముగ నీసత్కృతి
యాకల్పము వెలయు సుకవు లభినందింపన్ 116

మ॥ ధనధాన్యాఢ్యనిశాంత శాంతజనసంతానావనానందపా
వనధీవైభవకాంతకాంతవపిభావన్నైజలీలాశ్రయ
ఘనకాంతాజనతాంత తాంతవిమతక్ష్మాపాలమాళిప్రఘు
ట్టనధారేయపదాంతదాంతగుణకాండప్రాభవాలంకృతా ॥ 117

క॥ చండకరతేజ! సుహృద్భూ
న్మండలగణనియ్యగుణసమాజగణధరా
ఖండలతనూజ! నానా
పండితసురభూజ! చతురభాషాభోజా! 118

మాలినీవృత్తము.

సతతవిమతజైత్రా! సజ్జనారామచైత్రా!
వితతగుణపవిత్రా! విద్వదాస్యాబ్జమిత్రా!
చతురనుతచరిత్రా! చంద్రభూకాంతపుత్రా!
భృతసమధికగోత్రా! ప్రీతలక్ష్మీకళత్రా! 119

గద్యము

ఇది శ్రీవక్కలంక చంద్రశేఖరమహాకవిపౌత్ర
భాస్కరసుకవిపుత్త్ర విద్వజ్జనవిధేయ
వీరభద్రనామధేయ విరచితం బైన
వాసవదత్తాపరిణయం బను
మహాప్రబంధంబునందు
సర్వంబును
బంచమాశ్వాసము



# సంపాదకీయము

ooooooooooooo

కవివరులారా !

మేమిదివరలో వ్యాసపత్రసంఖ్యాపరిమితిని, పద్యసంఖ్యాపరిమితిని సూచించియున్నారము. మఱియు వానిని రచించి పంపవలసిన కాలమునుగూడ నిర్దేశించితిమి. కాని రచయితలు మాసూచనలను పాటించుటలేదు. ఈమాఱుగూడ West Bengal నుండియు Orissa నుండియు నిరువురుకవులు దత్తపదిపూరణము గావించి మిగిలినవారి పూరణములు ముద్రింపఁబడినపిమ్మట చేరునట్లు పంపినారు. వీనిని ముద్రింపవలసిన వీలుగాని బాధ్యతగాని లేకున్నను కవిగౌరవము బాహిరించుటకై సంపాదకీయమును సంక్షిప్తపఱచి యీక్రింద ముద్రణము గావించుచుంటిమి – ఇటుమీఁదట సకాలమున మీరచనలను బంపగోరుచుంటిమి.

## దత్తపదులు

::::::::::::::::::::

### శ్రీ కార్తికేయ; ఆంధ్రసాహితీప్రచారసభ, West Bengal.

(అ)చ. రణమును గోరికాదె – కురురాజశిఖామణి పాడిదప్పి స
ద్గుణములపోర్వు, లిద్ధచరితుల్, జయభారతసత్యకీర్తనా
చణముఖులైన పాండవుల 1* సంధివచోవళిఁ ద్రోసిపుచ్చి పాం
గణమునఁ జిచ్చుపెట్టికొనె! గర్వము పర్వమె యెట్టివారికేన్ ?

(ఆ)చ. ననవిలుకాని పూములికి నాటులఁ దూటులువడ్డ తీవమే
సన జనియించి, తమ్మిమొద నాడులలోఁ బ్రవహించి, సుందరా
ననమునఁ బ్రస్ఫురించి జని నల్గడలం బ్రసరించి, జీవకా
ననము దహించుమోహదహనప్రళయార్చికిఁ జిక్కె – రాధయున్

(శ్రీ) బి. యన్. మూర్తి, B. A., C.T., ఖురదారోడ్డు, Orissa.

(అ) భారతార్థము—

చ. ననవిలుకానిమార్గణగణమ్ముల కోపగలేకులూచి కా
ననసరసీతటంబున ధనంజయు డొంటిగ నుంటచే బిరా
న ననుపుకాని గొంచు జని 2*నిల్పి నిజాంగణమందు గూర్మితో
ననగి పెనంగె, రాగగస నాయికచైవులు చిత్రమెన్నగన్.

రామాయణార్థము —

చ. నన కెనయైన మేనుగల నాతిని సీతను జెట్టబట్టి త
న్ననయము నోలగించెడినిజానుజు లక్ష్మణుతోడ గూడి కా
ననముల కేగి రాఘవుఁ డు నంతర మాదశకంతు నొంచి పె
న్ననల బరీక్షఁ జేకొనె ధరాత్మజ, నవ్విధి దాట శక్యమే!

భాగవతార్థము —

చ. ననముఖవాసనల్ మలయ నర్మిలి కేళివనమ్ములో గమ
న్ననగుతఁదిన్ గజేంద్రుఁ డొక నక్రముబారికి జిక్కి సుక్కి కా
ననమున నార్తనాదము నొనర్పగ నూకొని తత్తరించి కొ
న్ననఘలుకానితండ్రి చనె నాగముబెంపు దలంపు బెంపగన్.

1* సంధిదోషము

2* యతిభంగము

సంపాదకుఁడు

కవిమూర్ధన్య కాకరపర్తి కృష్ణశాస్త్రి

సంపాదకసహాయులు

సరసకవితావతంస. శిష్ట్లా బాలకోటీశ్వరరావు

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | |
|---|---|---|
| * 1 | సంపుటము | 15–00 |
| * 2 | ,, | 15–00 |
| 3 | ,, | 15–00 |
| 4 | ,, | 15–00 |
| 5 | ,, | 15–00 |
| 6 | ,, | 15–00 |
| 7 | ,, | 15–00 |

* పునర్ముద్రితములు గానున్నవి.

Note:–7వ సంపుటములో ననుబంధము (శ, ష, స, హ)లు ముద్రితమగుచున్నవి.

ప్రతులకు :

ఆంధ్ర సాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

రామారావుపేట

కాకినాడ

తూర్పుగోదావరిజిల్లా.

Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Bhaskara Rao at Republic Press Main Road, Kakinada.

శ్రీ శారదాంబాయై నమః




# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

ప్లవంగ - మార్గశీర్షపుష్యములు

సంపుటము 56 సంచిక 5

సంపాదకుడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీశారదాంబాయై నమః




# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

ప్లవంగ - మార్గశీర్షపుష్యములు

సంపుటము 56 సంచిక 5



సంపాదకుఁడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర, బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంవత్సరమునకు చందా రు 3/-

విడిప్రతి 0-60 పైసలు

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీశ్రీశ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,

జమీందారు, ఉయ్యూరు.

## ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)
## కాకినాడ

అధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అభినవభోజ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
8. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనరుస్)
9. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓలేటి వెంకట సుబ్బరాయశాస్త్రిగారు
10. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
11. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు

# విషయసూచిక



ప్లవంగ *** మార్గశీర్ష పుష్యములు

సంపుటము ౫౬ సంచిక ౫





# హేమంత ఋతువు

( మార్గశిర - పౌషములు )

క. హేమంతము శరదాగమ
సామంతము తుహినకరవిసంజ్ఞితశబరీ
సీమంతము మదనబల
శ్రీమంతము డాసె భువనసీమాంతం బై.

మ. బలుసు ల్పండెను దొండ ముక్కువడియెం బ్రాసంగుచే లొప్పకమో
కలపూబాళల తావి గ్రోలి పొదవెం గౌబేరదిగ్వాయువుల్
ఫలినీవల్లిమతల్లి వల్లరులపై బైపై నలివ్రాతముల్
పొలసెన్ మంచులు రాలె రాత్రికరిణీఫూత్కారవాగ్బిందువుల్.

క. పెనుజలి గడగడ వణకుచు
వనదేవత దంతవీణ వాయించెనొకో
యన మోకపేరింకనంబుల
ననగుత్తుల మొరసె నలిగణము విపినములన్.

తే. గీ. చలి ప్రవేశించు నాగులచవితినాడు
మెఱయు వేసవి రథసప్తమీ దినమున
నచ్చుసీతు ప్రవేశించు బెచ్చుపెరిగి
మార్గశిరపౌషమాసాలమధ్యవేళ.

తే. గీ. ఇనుడు కోదండరాశిమీ దెక్కువేళ
నిక్షుకోదండవల్లి యెక్కిడు మరుండు
సమదవేదండసముమహోసత్త్వ డయ్యు
జనుఁడు కోదండమునుబోలె దనువు వంచు.

— శ్రీనాథుఁడు.



# కంచుఢక్క

## “సరసకవితావతంస” శ్రీ శిష్ట్లా బాలకోటీశ్వరరావు

“ఉట్టంకించినుతింతుఁదావకకవితోద్వేలగంగార్భటీఘట్టాకర్షితసత్కవిప్రకరనైకస్తావవీహారముల్. నిట్టూర్తుర్ పుయిలోడి కాకవులు నీ నిర్ణిద్రపాండిత్యవాగట్టస్ఫూర్తుల కుత్తరింపక కవీశా! కృష్ణవిద్వాన్మణీ!!”—అని యొకబాలకవిచంద్రుఁ డీప్రౌఢకవిచంద్రుని ధీమాచాతురిని ప్రస్తుతింపఁగా విని యించుక సంశయించుచు నవ్వి మీపొగడ్త మిగులరమణీయము, మీ యీ చాటువు ప్రశంసనీయము, కాని యిది యతిశయోక్తులలో తలమానికమై శేషించునేమో యని యంటిని. అప్పు డాబాలకవిచంద్రుఁడు హసించి యయ్యా! మీ రేమియు దిగులుపడనక్కఱలేదు. అతిశయోక్తులప్రాభవము గతించినది. స్వభావోక్తి బంగరుగద్దె నధిరోహించిన యీ కాలమున దాని కెదురీదఁ జాలని నేనును వాస్తవమునే వాచించితిని. నా యీపద్యమున స్తవము లవమైనను లేదు. ఆధునికకవీశుఁ డగుసీకృష్ణవిద్వన్మణి విరచించినకంచుఢక్క నరసినచో మీలో నేస రేఁగినసందేహములు సంపూర్ణముగ సమయు నను విశ్వాసము నాకున్నదని సమాధానించినాఁడు. తానే శ్రమపడి తనవిశ్వాసమున కాధారమైన యాకాంస్యఢక్కాకృతిని తెచ్చి యిచ్చినాఁడు.

అయాచితముగ లభించినకావ్యకుసుమమును మఱలమఱల పరిశీలింప నది మధురపరిమళకలితమైనపారిజాతప్రసవ మని బోధపడినది. ఏకతమున నేననూభవించినయామ్లానకాంస్యఢక్కాకృతిపారిజాతప్రసూనానూనసౌరభ్యసౌందర్యము నేకొంచెమైన నీవ్యాసమున వెల్లడించి రసపిపాసువుల యుల్లములను రంజిల్లఁజేయ నెంచుట దోషము కా దనుకొందును.

“పగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్క” యని వైమనశతాబ్దములకు పూర్వము ఘనాఘనము ననుకరిం

చును శ్రీనాథుఁడు గర్జించినాఁడు. "కవీశా! కాంస్యఢక్కావిపాటనగాథం గవిసార్వభౌమునరణిన్ డాకొల్పి కల్పింపు"మన్న ప్రతివాదిభయంకర పార్థసారథిగారి యభ్యర్థనమును తిరస్కరింపలేక —

సీ. ప్రతిపదాక్షరమిథఃప్రచురసాజాత్యంబు
పాత్రానుగుణ కృతభాషితంబు
శాబ్దవిరూపతా సంధానకౌశల్య
మహోపసర్గ నియోజనాతిశక్తి
గంభీర తరనిరాఘాట ధారాధుర
ధాతునామేంచుగ్విధానచణత
ఓజః ప్రసాదరసోదిత సంసక్తి
విషమైక కథన నవీనఫక్కి
సంస్కృతాంధ్ర భాషాద్వయీ సాహితీ ప్ర
పంచ వాచాప్రయోగ హేవాకరక్తి
కొసరు శ్రీనాథసుకవి పుంస్కోకిలమును

హృదయ ఫలకమ్మునందు ముద్రింపవలయు"—నన్న శాసనమును మన్నించి యీదశాబ్దారంభమున కృష్ణవిద్వన్మణి యని సంబోధింపఁబడి చరితార్థు లయిన కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు పండితాఖండలులకు పరమాన్నసదృశ మైన యీ కావ్యము నుపాయనించిరి. ఇది యీ పది సంవత్సరములలో వెలువడిన యుత్తమపద్యకావ్యములం దత్యుత్తమ మని నిర్ణయించుట పాక్షికదృక్పథమునకు దృష్టాంతము కాఁబోదు.

అద్వితీయ మగు నీ నవ్యకావ్యమును ప్రౌఢరసభావబృందిష్టమని జగతీహిత మని కృష్ణశాస్త్రిగారే వ్రాసికొనిరి. పరిపూర్ణాత్మకవిశ్వాస బంధుర మైన సంస్కృతి యందు కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడు గౌడడిండిమభట్టు నోడించి ప్రౌఢదేవరాయల ముత్యాలశాలలో సువర్ణాభిషిక్తుఁ డగుట చిత్రింపబడినది. ఇంతకుముం దీకథనే యొకరిద్దఱు

కవులు సందర్భము ననుసరించి కొలదిపద్యములలో కమ్మగా వినిపించి లబ్ధప్రతిష్ఠు లయిరి. ఇపుడీయన సుదీర్ఘశ్రమను భరించి యీ ప్రఖ్యాతేతివృత్తము నొక లోకోత్తర కావ్యముగా సంతరించి యాధునికకవిచంద్రులలో ప్రౌఢులై తరించిరి. ఈ గాథకు చరిత్రకారు లొసఁగిన రూప మొకటి కాఁగా శాస్త్రిగా రిచ్చిన యాకృతి మఱియొక టైనది. ఇటు లీవిచ్ఛేదము పొడసూపుటకు వీరికి చరిత్రపరిశోధకుల యెడలగల వైముఖ్యమే ప్రధాన కారణ మని నా యభిప్రాయము. దీని కీ రెండు పద్యములును జీవము వోయుచున్నవి.

మ. కవికాలాదుల భిన్ననిర్ణయములం గావించుచున్నారు సే
తువు లేవో ప్రవచించి నేటి మతిమంతుల్ ప్రాచ్యపాశ్చాత్యపుం
గవు; లం దెయ్యది గ్రాహ్యమో మది నెఱుంగన్ లేక; నా నేర్చుతీ
రు వెలార్తుం గథనంబునందు నిది మీరున్ మీరు మన్నింపుఁడీ!!

మ. ఇదిముందియ్యది వెన్క యంచు ననకే యిక్కావ్యముం జక్కఁగా,
జదువుం డా కవిసార్వభౌముని సమాసప్రక్రియల్ గూఢస
త్పదసంయోజనరీతులున్ సరసభావం బొండె సూచించు ని
య్యది; చారిత్రకదృష్టిఁ జూడవల దయ్యా! మీగ లావంతయున్.

వీరి యీ వైముఖ్యము కూడ కొంతవఱకు గౌరవనీయమే యనఁదగును. శ్రీనాథుడు నియోగి యొకఁ డన వైదికి యని వేఱొకఁ డనెను. ఆయన జన్మస్థాన మగు కాల్పట్టణము నెల్లూరుమండలాంతర్గతమని యొక పరిశోధకుఁడు వక్కాణింప తూర్పుగోదావరిజిల్లాలోని నీలపల్లియే యీ కాల్పట్ణ మని మఱియొక ప్రబుద్ధుఁ డుద్ఘాటించెను. ఇట్టి వింతవివాదములతో విజృంభించి సత్యమును తమకు తోఁచిన వైఖరిలో భూస్థాపితము జేయ యత్నించు వై తండుకులున్నంతవఱకు నిస్వార్థముగ రేబవలు పరిశ్రమించి యాంధ్రులచరిత్ర మందలి మెఱుఁపులను వెలికిదీసి చూపుట కసువు లర్పించిన మహాత్ములపై గూడ నిటువంటి యక్షరాక్షతలు పిడుగులవలె పడకమానవు.

పలువురు పండితకవివరులకు వలె నాకును శ్రీనాథుని యందు భక్తిగౌరవము లున్నవి. ఆమహాకవినిగూర్చి నేనును కొంత వింటిని, మఱికొంత చదివితిని, మిగిలిన దూహించితిని. అదంతయు నీ కావ్యరచనావసరమున నాకు కావలసిన ధోరణిలో నుపయోగించుకొందును. నా యీ ప్రబంధమున కథను కథనపద్ధతిని చర్చింపక కవిత్వమును పాండిత్యమునుగ్రహించి సజ్జనులామోదించుటయే యభిమతించుచున్నా ననిన శాస్త్రిగారి వాంఛితము సదయహృదయుల కాదరణీయమే యగును. నామార్గమిదిసాగసుగనున్నచో నాస్వాదింపుఁ డనికోరుటలో ననౌచితియేమున్నది ?

వీరు జగ మెఱిఁగిన విద్వాంసులు. కావుననే ఫ్రెంచిభారతవిశ్వవిద్యాలయము కవికంఠీరవబిరుద మొసఁగి శ్లాఘించినది. కవిసార్వభౌమాంకకలితులు నాంధ్రాస్థానకవులు నగు స్వర్గీయశ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు కవిమూర్ధన్యా యని పిలిచి మురిసిరి. కాకినాడపురీభవ్యకవిమణిగాయనులు కవిఘంటికాస్వర్ణకంకణము బహూమానించి తమ కృతజ్ఞతను బాహాటించిరి. రాజమహేంద్రవరగౌతమీవిద్యాపీఠము సువర్ణపదకమును విద్వత్కవివరబిరుదమును సమర్పించి సమర్చించినది. ఇన్ని సత్కారములను పడసిన శాస్త్రిగారు తాము పొందిన గౌరవమును తెల్పి తుదకు వనజభపురాణి యాంధ్రగీర్వాణవాణి! యిదంతయు యుష్మదీయపరమకరుణామృతాసారవర్షణమునఁ గాక నా ప్రజ్ఞ యిందేమున్నది జననీ?! యని వాకొనినారు. ఈ నిరాడంబరశీల మర్యాచీను లెల్లరు నలవఱచుకొనఁదగినది. తమ కైతకు లభించిన యనర్ఘసన్మానములకు సంస్కృతాంధ్రవాగ్దేవతాకారుణ్యమే కారణ మని పల్కిన పిదప నే మనుచున్నారో యరయుఁడు.

మ. కవిమూర్ధన్యుఁడు సత్కవీంద్రుల నమస్కారాళిఁ బ్రీణించుఁ గా
కవిలోకావళిఁ జీవరించుచు వినిస్కాసించు; వాగ్దేవతా

స్త్రవపూర్వంబుగ వారణాననుఘనుం బ్రార్థించు మాహేశకే
శవదేవానిశసేవనాచరణవిశ్రావప్రసన్నాత్ముఁడై.

మ. కవితాంతర్గుణదోషశీలనకళాకౌశల్య మాత్మీయసం
స్తవనై ముఖ్యము ధీరచారుకవితాసారస్వతాస్వాదన
ప్రవణత్వంబును స్మేరపూర్వకవచోవైయాత్యమున్, సాహితీ
సువిశాలత్వముఁ గల్గువారల వరించున్ మత్కృతంబుల్ కృతుల్.

మోమోట మించుకయైనను లేకుండ నింత కఠినముగ చెప్పుట కెంతయో గుండెనిబ్బర ముండవలయును. అది వీరికి పుష్కలముగా నున్నది. ఈయన సృజించిన శ్రీనాథుఁడు గూడ నిట్టి ప్రాగల్భ్యవంతుఁడే!

సీ. ఆహారించెను విస్సనామాత్యు సహపంక్తిఁ
గలమాన్నములఁ గనకాలుకాళి
స్వీకరించెను బ్రీతి వీరభద్రారెడ్డి
యర్పించు రత్నపట్టాంబరముల
నంగీకరించె స్మేరాస్యుఁడై మైలార
విభుఁ డంపుకొను దినవెచ్చములను
గ్రహియించెను దెనుంగురాయరాహుత్తుండు
దరిసించు కమ్మకస్తురి జవాది
ధారవోసెను దర్శనదర్శనైక
దీక్షితంబుల నిజపావనేక్షితముల
దక్షపురవారకామినీస్తనయుగళికి
నాఁడు కవిరాజవిధుఁడు శ్రీనాథబుధుఁడు.

దక్షపురవారకామినీస్తనయుగళికి దర్శనదర్శనైకదీక్షితములైన నిజపావనేక్షితములను ధారవోసిన శ్రీనాథబుధుఁడు కవిరాజవిధుఁడు మాత్రమే కాఁడు. పదునైదవ శతాబ్దమున నాంధ్రిని విశ్వ

విఖ్యాతను జేసిన రాజన్యుల నడుమ రేకెత్తిన స్పర్ధలను సర్వనాశనము గావించుటకు నిరంతరప్రయాణము లొనరించి సఫలీకృతుఁడైన గొప్ప నయశాలి. ఈ నీతికోవిదుని కేవలము శృంగారిశేఖరునిగా పేర్కొనిన శాస్త్రిగారి కాతని వని చెప్పఁబడి కొందఱి నాల్కలపై నర్తించుచున్న బూతుపద్దెములే యాధారము లైనవి కాఁబోలు దివంగతులైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, కందుకూరి వీరేశలింగము పంతులుగారు మఱికొందఱు సుప్రసిద్ధులు గూడ శ్రీనాథుని విశృంఖలవేశ్యాలోలుఁ డని నిర్ధరించుటకు పాటుబడిరి. చరిత్రపరిశోధకుల మని చాటుకొనినవారే యేవో కొన్ని వెట్టిమొట్టిపద్యముల నుదాహరించి యిట్టి యసంబద్ధవ్యాఖ్యానము లాచరించి యా మహామనీషి నిష్కళంకజీవితమును కలుషితము జేయఁగా చారిత్రకదృష్టితో నా యీ కావ్యమును పరిశీలింపవల దని యర్థించిన కృష్ణశాస్త్రిగారి వ్రాత నేమనఁగలము ?! స్వర్గీయచిలుకూరివీరభద్రరావుగారినంటి ప్రతిభాశాలురు శ్రీనాథుని మనుగడ యాదర్శప్రాయ మని ఘోషించి పెక్కు నిదర్శనములను చూపిరి. అయినను పండితపామరుల దృష్టిలో నా మహాకవి వారకామినీస్తనోపాసకుఁడే యైనాఁడు. విధివిరామ మన నిట్టిదే కావచ్చును.

సీ. బ్రాహ్మీదయస్సుధాపాన మాకంఠంబుఁ
　　　　ద్రావి నరించి గట్టుగట్టునను దేరిచె.
విద్యాధికారియై వేమభూపాలభో
　　　　గాభోగసుశ్రీ లనూభవించె;
రాజమహేంద్రవరప్రసిద్ధతార్కికా
　　　　వేశసర్వస్వ మాపోశనించె.
భావభాషాద్వయీపరిపుష్టిఁ బూరించి
　　　　ప్రౌఢప్రబంధముల్ పరిఢవించె;
ప్రౌఢదేవేంద్రరాయసభాప్రసిద్ధ

గౌడడిండిమభట్టఢక్కావిభేద
నైకకృతి సల్పి హైమాభిషేక మందె
నాఁడు కవితావిహారి శ్రీనాథసూరి.

ఈ విధముగా విజయలక్ష్మీపరిష్వంగవిభ్రాజమానుఁ డైన శ్రీనాథమహాకవి కనకాభిషేకగాథ యీ కంచుఢక్కలో నిట్లు ప్రారంభింపఁబడినది.

శా. నానారాజసభాంతరస్థలుల శ్రీనాథుండు భీమాంబికా
సూనుం డాత్మకవిత్వతత్వగమ సంశోభింప నెంతేని స
న్మానింపంబడి కొండవీటిపెదవేమారెడ్డి యాస్థాని కా
హ్వానింపం జని యావసించె నట సింగామాత్యుసౌధమ్మునన్.

౨

మామిడిసింగనమంత్రి యింట నుండిన శ్రీనాథుని సందర్శించి కృతార్థత గడింపఁగోరి తార్కికులు ముముక్షులు కవిపుంగవులు వైయాకరణులు తండోపతండములుగ కొండవీటి కాగమించుచుండిరఁట. ఒకనాఁ డచ్చట ప్రౌఢదేవరాయల కొలువులో నున్న గౌడడిండిమభట్టారకుని గూర్చి కొందఱు చెప్పఁగా ననవద్యకవితాశ్రీనాథుఁడగు శ్రీనాథుఁ డాలించి యేకాగ్రతను సంధానించి మానసమును తదాస్థానీ నైజసుఖప్రవేశకలనా సమ్యఙ్మహోపాయచింతానిర్మగ్న మొనర్చినాఁడఁట. "ఢక్కికన్ జిమ్రిపలు సేయకున్న నెటు చేకురు శాంతి మదంతరాత్మకున్ ?" అని ప్రశ్నించుకొని

ఆ.వె. కలరు పండితప్రకాండు లుద్దండులు
భూమితలము గొడ్డువోవలేదు
విపుల- విపుల; శాస్త్రవిధి- విశాలము; వీని
మొగము నందె ప్రోద్దు వోడువలేదు.

క. గండుకొని శాస్త్రశస్త్రిక
డిండిము దండించినప్పుడే నోటికి మేల్
తిండి రుచించును, హాయిగ
గుండెలపైఁ జేయి వైచుకొని కనుమోడ్తున్.

శా. ఏదే నొక్క యుపాయమేఁ గలుగఁబోదే! గౌడభట్టారకో
న్మాదైకారభటీపటుత్వగతి డిందన్ మాకు వాగ్దేవి వీ
వాదప్రౌఢి నొసంగదే! జయరమాబాహాపరీరంభను
ర్యాదాభోగ మనుగ్రహింప ననుకంపాసార మేపారఁగన్.

అని సమాధానించుకొని కర్ణాటక్షితిపాలుని సుగంధద్రవ్యభాండార కాధ్యక్షుఁ డగు వల్లభమహాభాగుఁడు తన పక్ష మూనఁగలఁ డని యాశించినాఁడఁట. విజయనగరాస్థానవిద్వన్మణియగు ముమ్మయను ముందే భూరికవితాధారనిరాఘాటతచేత, నిస్తంద్రవిద్యావైపుణ్యము చేత, సుధామధురిమాధారైకసల్లాపసంధానప్రజ్ఞలచేత వశీకరింపవలె నని యెంచి భావిగతుల నంచించి యంచించి, యచటి దేశవిధుల నాకళించి యొక్కనాఁటి సుముహూర్తమందు—

శా. దక్షారామనివాసు నీశు నెదలో ధ్యానించి నిశ్చింతమై
నిక్షేపించి తదీయమూర్ధముపయి న్నిశ్శేషభారంబు న
ధ్యక్షించెన్ రహి సింగనాగ్రసచివేంద్రాజ్ఞాసమాయత్తమున్
సాక్షాన్మాధవు మాదిరిన్ శకటి శ్రీనాథుండు సన్నద్ధుఁడై.

కన్నడావనీధవుని పేరోలగమున ప్రతిభావ్యుత్పత్తులను ప్రద ర్శించి యరుణగిరినాథునకు శృంగభంగము గావింప గోరిన శ్రీనాథుఁడు తన వెంట చెన్నమరాజాన్వయభవుని చెన్నమరాజాఖ్యుని నైజశిష్యాత్మ భవుని సన్నిశితధీనిధిని రసవన్నవబహుళప్రబంధపటునిర్మాతను తీసికొని వెడలినాఁడఁట. అతని కా ప్రయాణమున కర్ణాటతాటంకినీజనతాశాత కటాక్షవీక్షణకళాసంరంభములను గనుఁగొను నదృష్టము పట్టినది.

విద్యానగరీవనీసుమవిహారిసమీరకుమారిక లాంధ్రకవీశానునకు స్వాగతికత్వము సంతరించినవి! ఐనతురంగములు ఖురపుటాగ్రముల నస్తధరాధరో చ్చకైస్సానుతటాంచలస్థలిని జక్కఘటించి శ్వసించి నిల్చినవి!! ఇప్పట్టున శృంగారరసధుని యగు కృష్ణశాస్త్రిగారి లేఖిని నిరంకుశముగ నర్తించినది. నిదాఘీయఘస్రముల నేమని వర్ణించుచున్నారో కనుఁడు.—

శా. జోఘుష్యత్పరపుష్టదంపతిసమాజుష్టామ్రవీథుల్ దివా
ద్రాఘిష్ఠంబులు సుస్తనీదృఢపరీరంభైకశుంభత్క్రియా
వ్యాఘాతంబులు మందమందవిచరద్వాతాంకురంబుల్ జన
శ్లాఘాపాత్రదినావసానములు ఘస్రంబుల్ నిదాఘీయముల్.

శకటాధిరూఢుఁడై చనుచున్న శ్రీనాథునికన్నులు తిలకింపఁగూడనివి తిలకించెను. మానము వహింపఁజాలక శతపత్రేక్షణ లిందుసుందరతరాస్యలు కుంభికుంభస్తనులు నతనాభులు మధురాధరాధరలు హేలాహాసినులు సూనృతానృతశంకాకరమధ్యములు సరసవాణీకలు వినీలాలకలు రతికాంతప్రియదూతికలు అని రసికకర్ణాటీయపణ్యాంగనలను కొనియాడి కొనియాడి వారిని కనుఁగొనుటకు వెనువెనుకకుఁ దిరిగి వితథేక్షితములను పరపిధన్యుఁడైనాఁడు. చివరకు విలసన్మయభవనసన్నిభ మగు మున్మయభవనము జేరినాఁడు. శ్రీనాథునకును చెన్నమరాజునకును మున్మయ స్వాగత మాలపించి సమయోచితముగ గౌరవించి కమ్రనమ్రోచితవాక్చమత్కృతులను చిమ్ముచు నిట్లు కుశల మడిగినాఁడఁట.—

ఉ. ఏ యవనీధవేంద్రసభ యీ భవదీయవియోగదీనయై
పాయుచు నున్నదో కళల వర్ణము లేయవిగ్రాతమే పవి
త్రాయతసుస్థితింగనెనో యంచితతావకనామసక్తిచే;
మాయిలు నేఁడు పావనము మాన్యము మీపదధూళిఁ గ్రాలుటన్.

ఉ. ఏన శుభప్రభావిభవ మల్లయులూక మెఱుంగ నేర్చునే!
మీ నసమాననామమును మీ నుతిభాజనసాధువృత్త మిం
తేనియు నా కెఱుంగఁదర మే? పరికింపఁగఁ గూపభేక మే
నైన శ్రవోగసాయనతకై నితరా మభిలాష నందెదన్.

వినయనమితాంగుఁడైన ముమ్మయమనస్విని గుర్తించిన శ్రీనాథుఁడు

తే.గీ. అర్చనలఁ గంటి, విజయపత్రికలఁ గొంటిఁ
గాకవుల గెంటి ఢాకాల గండపెండె
రమ్ముఁ దొడిగించుకొంటి సాయమ్ముగాఁగ
నబ్ధభవురాణి మాసంస్కృతాంధ్రవాణి యని ప్రారంభించి

శ్రోత సంభ్రమాశ్చర్యమగ్నుఁ డగునట్లు మహోద్దండగాంభీర్యముతో—

శా. కర్ణాటీపటువిస్తులస్తనయుగీకాఠిన్యముల్ పర్వవే
ఘార్ణోరాశిఘుమంఘుమారభటికువ్యత్తుంగభద్రానదీ
తూర్ణోదీర్ణత లంగనాహసనమాధుర్యం బెసంగన్ మహో
ఘర్ణాజానికృపాధునిన్ సుకవిత ల్వాసించు శ్రీనాథుఁడన్.

అని ముగించినాఁడు. అప్పుడు ముమ్మయ మాటరాక తెప్పపాటు లేక
విరాకుసోఁక కదలఁబోక చూచిచూచి తల రవంతవంచి తటకా పరి
హరించి పులకరించినాఁ డఁట.

చ. తెలుఁగున గైత సెప్పెదను తీయఁగ బ్రిన్ననిచిన్నిపూవుఁదే
నెల నెలకొన్న చక్కెరల నిద్దపుఁబల్కుల గుల్కుపల్కులన్;
పలికెద సంస్కృతమ్మున నభఃపరిచుంబితుపారభూధర
స్థలదలఘూచ్చలత్కలితగాంగతరంగఘుమంఘుమార్భటిన్.

అని శ్రీనాథుఁ డన్నపిదప విన్నగసజ్ఞుఁ డెవ్వడైనను పులకరింపక దుల
ల్లరించునా? అట్లు పులకరించినముమ్మయ యిట్లు పలుకరించినాఁడఁట.—

శా. ఏమేమీ ! కల గాదుగాదె యిది స్వామీ ! చక్కఁగా వింటినా
నామంబున్ ? గవితాసనాథుఁ డగుశ్రీనాథుండె వేంచేసెనా ?!
సీమాంతమ్ములు దాఁటి దాఁటి కరుణాశ్రీ మీఱ మాయింటికిన్;
ఈ మాకంటె నదృష్టశాలు రిల లేనేలేరు ముమ్మాటికిన్.

ఈరీతి నత్యంతభక్తి ప్రదర్శించుచు తనసంతోషమును వ్యక్తీకరించి యణకువతో నల్లభరాయలవారు పనిఁగొని యెటకో యేఁగినారు. వారు వచ్చుదాక మత్కృతసపర్యలు గ్రహించుచు నీకుటీని పావన మొనరింపుఁ డని యర్థించినాఁడఁట. "కరము పరాభవించి కవిగౌడుని దత్కవిసార్వభౌమసద్బిరుదము బల్మి నాఁచికొనవే కొనవే కనకాభిషేకముల్"— అనికూడ కోరినాఁడఁట. కొండఱ కీకథనవిధానమబ్బురము కలిగింపవచ్చును. కొండవీటివిద్యాధికారికి విద్యానగరమున నింత ఘనస్వాగతము లభించునా యనుశంక కిచ్చోటావే యుండకూడ దని నాయభిప్రాయము. అప్పటికే శ్రీనాథభట్టోపాధ్యాయుఁ డార్జించినయశస్సౌరభమహత్త్వ మట్టిది !! జిగీషతో కొండవీడు వీడి విజయనగరము జేరినకవిరాజు రొట్టె విరిగి నేతిలో పడినది. ఆస్థానీసత్కవిశాసనాళి యనపాస్త మని వాచించి యస్తుంకారించినాఁడఁట. తోరపుఁజన్ను లున్నతొయ్యలి యొకర్తుక ఉపాహారపుఁబళ్ళెరముఁ గొని యచటికి వచ్చినదఁట. శ్రీనాథుఁడు రసికుఁడు. ఆతనిచూపులు లడ్డువములపై నిలువక యయ్యాలికులవేణితుంటరిగయాళిపిసాళిమెఱుంగుచన్నవను పరామర్శించినవఁట ! పలుచనిపూఁతరేకుగమిపైఁ జెఱలాడుట వీడి యక్కలకంఠిచెక్కులపై పాతరలాడినవఁట. ఫలాహారానంతరము ముమ్మయ సూచింపఁగా శ్రీనాథుఁడు చెన్నమరాజుదాపున గలవిప్రగృహమును ప్రవేశించిరి. అక్కడ భోజనము. ఇక్కడ నిద్ర. కొన్ని దినము లీవిధముగా గతించినవి.

శ్రీనాథునిమానసమున గౌడడిండిముని జయింపవలె ననునుత్కంఠ యతిశయించుచున్నది. దైవవశమున లభ్య [మైనవ్యవధాన

మును వ్యర్థము జేయక యెన్నఁడో చదివిన దంతయును చెన్నమరాజుతో గలసి ధీమత్ప్రతివాదధిక్కారరతితో రోమంథ మాచరించుచున్నాఁడఁట. ఆస్థితిలో నామహాకవి స్తైమిత్యమునే కోల్పోయినాఁడఁట!! “డండడడండడండడడఢఢమ్మని డిండిమభట్టచండదోర్దండనిరంతరాయబహుధాపరితాడితకాంస్యఢక్కాఖండరవంబు” తత్సుకవిశ్రవోయుగిని నిండినదఁట. సాక్షాత్కాలునిలీల బాహుదండమును విక్షేపించుచు గౌడడిండిమకవివ్యాఘ్రము ప్రత్యక్షమయ్యెనఁట. మనస్థైర్యమును రూపుమాపుటకు దోహదించునట్టిచిత్రవిచిత్రదృశ్యపరంపరస్వప్నములు సంభవించుచుండ నాతఁడు మఱికొన్నిదినములు వ్యగ్రుఁడై గడిపినాఁడఁట.

ఒకనాఁటియుదయమున వల్లభరాయలు ముమ్మాయ, చెన్నమరాజుతో వచ్చి శ్రీనాథుని దర్శించి మారాయలతో తనుగురించి చెప్పినాము; డిండిమపండితునిదో దలపడి మీరు పరాభూతు లగుదురనునమ్మకముతో చక్రవర్తి యంగీకరించినాఁడు. సౌఖశాయనికుల సౌస్నాతికుల మంత్రిసహితగతుల హితుల స్వాగతికుల రేపు గాంతురీరు రేపాడి యని పల్కిరఁట. భావికార్యగతులు భాషించి, యంధ్రకవిని భూషించి, గౌడు నపహసించి యెటకో యరిగిరఁట. చిరకాలికేప్సిత మైనవాగ్వాదావకాశము చేరువ కేతేరఁగ హర్షసంభ్రమసమారూఢిచే నిరుద్ధాత్ముఁడైన శ్రీనాథుఁ డన్యమనస్కుఁడై నాఁడఁట.

శా. ఒబ్బట్లొక్కఁడు స్వీకరింపుఁ డనఁగా నూకొంచు వడ్డింపఁగా
నబ్బా! యేటికి నైచినా రనును; క్షీరాన్నంబునుం గూరలుం
దబ్బిబ్బుం బొనరించి నోట నినుచున్; దధ్యన్నముం గల్పుచున్
డబ్బా తేఁగును లేచి చిత్తమున నన్యం బెద్దియో హత్తుటన్

ఉ. తమలంపున్మడుపుల్ రచించి యిడ హస్తంబందుఁ గర్ణావతం
సముగా మస్తుగ గుస్తరించు నవి; సెజ్జన్ గొజ్జఁగుల్ చల్లగా
విమనస్కుండయి వానిఁ జర్వణముఁ గావించున్ కవిస్వామి పా
ర్శ్వమునం బయ్యెద నోట గ్రుక్కుకొని నవ్వన్ దాసి దాసిగ్గునన్.

అప్రతిమాన శేముషీధురంధరుఁడగు శ్రీనాథున కిట్టియవస్థ దాపు రించినది. చీకటి పడినది. లోకమున పండువెన్నెల యమృతమును వర్షించుచున్నది. కర్పూర తాంబూలచర్వణ మాచరించుచు కవిరాజు తూలికామలమృదుతల్పమున శయించి సుమాళము నందుచు నిట్లు మానసించినాఁడఁట. ఎక్కడనో యున్న గౌడదేశమునుండి కన్నడరాజ్యమునకు చనుదెంచిన డిండిమభట్టుపాండితీప్రాభవము గ్రహించియే దేవరాయలాస్థానవిద్యాధికారిపదవి ననుగ్రహించియుండవచ్చును. అతనిని భూపాలునితోఁబాటుగా తత్పాలితులుగూడ ప్రోత్సాహింతురుగాక! అస్మత్సామర్థ్య మొకఁడే చాలును. మాపాండిత్యమే యఖండమో యతని శుంభచ్ఛాస్త్రవైదగ్ధ్యమే ప్రశస్తమో యే రెఱుంగుదురు? ఏపుట్టలో నేపా ముండునో నిర్ధరింపఁ దరమౌనా! ఏమయినను దక్షనగరీవేశ్యాభుజంగుఁడగు భీమేశుఁడే మమ్ము పాలింపఁగలాఁడు. డిండిమమును ప్రతాడించుచు తాతపాదవిబుధానీకమును గెలిసేయు నని చెప్పబడుచున్న యరుణగిరినాథునిదురహంకారము సత్యమా? లేక కల్పితమా?! అంతయో యింతయో నిజ ముండకుండునా! మా కాతనిపై నీర్ష్యాగ్రహారంభ మించుకయు లేదు. అతఁడు మా కాపరి కాఁడు. కర్ణాటకక్ష్మాజానిని ప్రౌఢకవితచే సంతసపెట్టి సన్మానసనాభోగము లందుటయే మాలక్ష్యము. ఉద్దండుఁడైనడిండిముఁడు మాకు స్వాగత మిచ్చి సంభావించునో లేక లోకు లనుకొనునట్లుగా మా హృదయ మాలోడించునో చూచెదను.

చ. శివ మగుఁగాక; మంగళము చేకురుగాక: వరించుఁగావుతన్
భవికము; లబ్బుఁగావుత శుభమ్ములు తన్నిరవద్యవిద్యకున్;
బ్రవిమల శేముషీ రమకు; వాదపటిష్ఠతకున్; జయోదయో
త్సవకృతి; కావ హేళనవిధానము లేకరణిన్ క్షమాగ్రామముల్ ?

సీ. పాణినీయంబు నాభాష్యంబుఁ జదివితి
మాహేశకళ్యాణమంటపమున
బ్రహ్మసూత్రంబు లావర్తించితిని వ్యాస
కాశికానగరోపకంఠవనుల
వల్లెవైచితి నాక్షపాదీయమును ఢుంఠి
గణనాథపీఠవై కటికజగతి
కంఠస్థ మొనరింపఁగంటిఁ గాణాదంబు
లోలార్కుఁ సముల దేవాలయమున
శైవవైష్ణవశాక్తేయసౌరసౌగ
తాదినానామతాంతర్య మరసినాఁడ
హర్ష ఖండనఖాద్యంబు నాహరించి
నాఁడ మణికర్ణికాఘట్టనవవితర్ది.

తే. గీ. అరుణగిరినాథపండితు నభిభవించి
ప్రథితతత్కాంస్యఢక్కికం బగులఁగొట్టి
బల్మిమై నాఁచి కవిసార్వభౌమబిరుద
మందెదన్ ప్రౌఢదేవరాయలసపర్య.

శా. సాధ్యంబా యట నల్పపండితున కుష్ఛైచ్చర్విద్వద్గరిసనం
బధ్యక్షించి గ్రసించి వాదము మదీయంబుం దదీయంబుఁ దా
మాధ్యస్థం బొనరింప ? దిట్ట యొకఁడున్ మాదృష్టిలోఁ లేఁడు;త
ద్విధ్యర్థాంగియె మాజయాపజయనిర్దేశంబు శాసించుతన్.

ఈపగిది నాకవిరాజు పూర్వపక్షములను సిద్ధాంతములను చేయుచు న స్తిమితుఁడై యారాత్రియంతయు కాలుకాలినపిల్లికరణి గడపి

నాఁడఁట. "సమయ మానన్న మగువేళ సాజ; మెట్టికరమసుశిక్షిత-సర్వశాస్త్రప్రవీణుఁడైన సందేహమందుట లాత్మకీనపాండితీశౌండతా ఖండపాటవమున" అని యూతనిని కృష్ణశాస్త్రిగారు సమర్థించిరి. సత్యమే కావచ్చును! అప్పుడు—

మ. ఇది హాస్వం దిబి దీర్ఘ మిద్ది ప్లుతమం చెంతేని బోధింపఁగా
సదయుండై చనుదెంచెదో పరితనూజస్వామినాఁ గుక్కుటం
బుదయల్లీలఁ దిభంగిగా మొఱసె నత్యుచ్చైస్వరుతిన్; సుఁతయున్
గదలంబోవఁడు బాల్యపాఠ మిది నాకానాఁ గవీందుడు తాన్.

సీ. పుంస్కోకిలస్వామిపోలఁతి నాహూతించె
గొంతెత్తి యెత్తి కోకో యటంచు
కొదమతుమ్మెదతేఁడు కులసతీసహితుఁడై
జుట్టెఁ గొందేనె జుంజు మ్మటంచు
జక్కవయిల్లాలు జతగానిఁ గనుఁగొంచుఁ
గవిసి కూసెను కవకవ యటంచు
మలయాచలనివాసి మందగంధవహుండు
జిలికె విరుల్ జలజల యటంచు
తరుణదాసిక యక్కవితాసనాథు
మేలుకొలుపంగ వీచెఁ గొంబూలసురటి
జాణతనము దువాళింప సరససరణిఁ
గనకమణికంకణములు ఘుల్ ఘుల్లు రనఁగ.

తెల్లవాఱినది. అరుణరేఖావిరాజమానుఁడైనయాంధ్రసుకవిరాజు లోచనయుగళి నిద్రావిలుప్తివలన ద్విగుణితారుణ్యము భజించినదఁట. అరుణకిరణసంపర్కలబ్ధిచేత త్రిగుణిత మయి వఱలెనఁట. కాల్యకృత్యులు తీర్చి సంధ్యాభివందనము సల్పి యుమామనోహరుని హరుని ధ్యానించి పంచాక్షరి జపించి దైహికమనఃకాలుష్యనిస్సంగుఁడైన

శ్రీనాథుఁడు హస్తమున రక్షాబంధమును దాల్చి దక్షారామవారాంగనావక్షోపరివాసయోగ్యదీవ్యన్మృగకస్తూరీతిలకలలితనిటాలుఁడైనాఁడఁట. చంపకతైలవాసనలపెంపులు గుబాళించుచుండఁగా నెఱినెఱులు చక్కఁగా దువ్వుకొన్నాఁడఁట. పిమ్మట—

సీ. జాళువాసరిగంచుమేలిరంగు లెసంగు
పలుచయౌ జిలుఁగుదోవతి ధరించె,
చిలుకతెక్కలచాయఁ జిదిమెడుమదురాకు
పచ్చహొంబట్టుకబాయిఁ దొడిగె;
పూవుఁబోఁడులనవ్వుఁ బ్రోవుపెట్టినతీరు
గా సౌరుమీఱు పాగాను జుట్టె;
హరిచాపరుచు లంచులైనకాశ్మీరంపుఁ
బట్టుసాలువు వల్లెవాటు వైచె;

గండపెండార మునిచె డాకాలియందుఁ
దాల్చె ముంగాముురారితోఁ దాకి మొఱయఁ
గనకమయకవిఘంటికాకంకణమ్ము
సాధుకవినాథవిధుఁడు శ్రీనాథబుధుఁడు.

ఈ తీరున రాజపరిషదుచితరమణీయవేషమును సవదరించు కవిరాజు చెవులకు వేణువీణామృదంగశృంగారమధురధీరధీరరవము విందొనర్చి నదఁట. కర్ణాటనాథావరోధనదాసీజనతావృతము నవిరళోద్యద్వేణువీణాదివాదనభద్రమును. పురస్సరన్మహీసురోక్తస్వస్తివాదప్రతిధ్వనితము నగు నలంకృరపల్యంకిక రాఁగా ముమ్మాయతో వల్లభరాయలతోఁ గలసిడాసి యధిరోహించినాఁడఁట. విద్యానగరరాంగనాజనవితానము ప్రోవపడి యామత్తకాశినీసూనశరుని సాంగవికస్వరాక్షుల నీక్షించిరఁట.

మ. ఇతఁడేనా కవిలోకచందిరుఁడు, బ్రాహ్మీసత్కృపాపూరితుం
డితఁడేనా! నితరాంశివార్చనకళాహేవాకధన్యాత్మకుం
డితఁడేనా! సకలాంగనాంగకమహాశృంగారసంభాషణో
చ్చతురుం? డంచు సహాసలజ్జితపురస్త్రీణంబు భాషింపఁగన్.

ఎన్నఁడో గౌడడిండిమభట్టును జయించినపిదప వరింపవలసిన ప్రశంస లన్నియు నిప్పుడే లభించుచుండఁగా శ్రీనాథుఁ డధివసించిన చతురంతయానము నాగరఘంటాపథమున నరిగి యరిగి సరస స్వాచ్ఛనమాత్యపుంగవునియాజ్ఞాబద్ధమై మహితప్రాకారసంవేష్టితాంతరభూమధ్యగతావరోధనపురస్తాద్భాగభాగుచ్ఛ్రితైః పరిషన్మందిరసుందరాంగణమున దింపఁబడినదఁట. కన్నడమహీంద్రుఁడు సపరివారముగ నేగురు దెంచి స్వాగత మిచ్చినాఁడఁట. చక్రవర్తి వచ్చినపు డొకసామంతరాజుపరిస్థితి యెట్లుండునో య ట్లున్నది దేవరాయలపరిస్థితి. తనయాస్థానవిద్యాధికారిని జయించుతలంపుతో విచ్చేసిన కొండవీటివిద్యాధికారియం దింతగౌరవము ప్రదర్శించినాఁ డనుట కొందఱిదృష్టిలో నతిశయోక్తి కావచ్చును గాని "యతిశయోక్తిస్వభావోక్తులందుఁ కవులకెల్ల దుల్యాదరోన్నతి పల్లవించుఁ గాని మాకు స్వభావోక్తికలనయందె విపులతరపక్షపాతధీ వెల్లివిరియు"నని ముందే యుద్ఘాటించినశాస్త్రిగారి యెడఁద నవగాహించుకొన్నచో నిది స్వభావోక్తి యనియే తోఁచును. ఏమైన నేమి? శ్రీనాథుఁడు చక్రవర్తిసహితుఁడై సభాప్రవేశము జేసినాఁడు. సభ్యులందఱును ప్రమోదస్నిగ్ధవిభ్రాంతులై లేచి నిల్చిరఁట. కాని డిండిమభట్టు లేవలే దఁట, భద్రాసనాసీనుఁ డైనయాతఁడు వారిదెసకు వాలారుబల్చూపులను బరపినాఁడఁట!!

ప్రౌఢదేవరాయలు శ్రీనాథునిగూర్చి యెంతయో చెప్పఁగా డిండిముఁడు "నమోనమ" యంచు నిగదించినాఁడఁట. త్రిలింగవాసియును కమ్మగ నవ్వి 'వో నమో' యన్నాఁడఁట. పిదప మహారాజు

నానతి నెనసి సచివమాళి యుభయులను పారిషదులకు పరిచయించినాఁడఁట. అంతలో మధ్యాహ్నశంఖధ్వనులు భంభభంభ మనుచు నాసభలో మలసినవఁట. రాజాజ్ఞ యిట్లు ప్రకటింపఁబడినది. "మధ్యాహ్నమం దుభయులు నిందు వాదముల కుద్యోగింతురు. మీ రెల్లరును శుభదృష్టితో శ్రవణింపఁగా నగును". సభ చాలింపఁబడినది. అబ్బురముతో సభ్యులు గమించిరి. కవిరాజును చెన్నమరాజును విందు కుడుచుటకై యమాత్యసౌధమును చేరిరఁట.

తే. గీ. సభ జరిగెనంట మధ్యాహ్నసమయమందు
వాదము సమాప్తిఁ గనదఁట పంచవాస
రములు దాఁటెనదనుకఁ; బౌరజన మెల్లఁ
జెప్పుకొని రిట్లు పరిషద్విశేషములను.

"తొలుత విద్యాధాంగిని సంస్మరించి యీవిద్వన్మణు లిరువురు నేమేమియో సంభాషించిరి. మధ్యపీఠికను భూవిభుఁడే యధ్యక్షించినాఁడు. ఆపైన జరిగినదంతయు మా కగమ్యము. ఆశాస్త్రీయచర్చార్థము లారయుటకుఁ దెలియుటకు బ్రహ్మకైనను దుస్సాధ్యమే! ఆబ్రహ్మజ్ఞానసముద్రలవాదము మాకు బ్రహ్మారణ్యమే యైనది.

సీ. శ్రీనాథకవికృతస్మేరంబు డిండిమ
భట్టాట్టహాసితం బపాకరించె!
త్రైలింగ్యసుకవీంద్రరచితభ్రుకుటి డిండి
మార్యబాహాక్షేప మపనయించె!
ఆంధ్రపండితనిశ్చలాక్షిప్రసారంబు
గౌడఢక్కార్భటీగతి నదల్చె!
కవిరాజమధురోష్ఠకంపమ్ము గౌడీయ
గర్వోన్నతాననకళల దుల్చె!
అరుణగిరినాథవిద్వాంసు నఖిలదంభ
మొక్కపలుకైన బలుకకే జక్కలించి
నాఁచికొనె నాద్యజయము శ్రీనాథసూరి
కేవలము వాక్ఖికవిలాసఖేలనముల.

పిదప వా రిరువురినడుమ వాద ముదగ్రముగ నడచినది. చివరకు భీక రుఁ డగుగౌడదేశకవి గర్వము నుజ్జగించి శిరమును వంచినాఁడు. కవి సార్వభౌమబిరుదము నర్పించినాఁడు. ఆత్మకీనకరధృతఘంటికాకనకకం కణమును దరిసించినాఁడు. అప్పుడు శ్రీనాథభట్టు పరమానందముతో సమీపించి కరుణరసము కెరలుచుండఁగా "నీ జయాపజయములు దై వాధీనములు. ఇర్వురును సంగ్రామమున గెల్తురా? మిముబోఁటిఘ నులకు ప్రతివాదిగ నిల్చిన నాజన్మము ధన్యమైనది. నాదువిద్య సార్థక మైనది. మీకును మాకును బ్రాహ్మీదేవతామూర్తియే మాతృపీఠము. తత్పయోమృతము లాకంఠముగఁ ద్రావి యిట్లు కలహించుట నామె సైరింపదు నేఁటినుండి యన్నదమ్ములవలె స్నేహింత" మని యనున యించినాఁడు.

తే. గీ. పాకశాసనుపటుధాటి భంగపడక
సాధుగతి నోడినాఁడు శ్రీనాథుచేత
నరుణగిరినాథుకంటె ధన్యాత్ముఁ డెవ్వఁ
డనుచు. . .డిండిముఁడు పరాజయము నంగీకరించినాఁడు. సావేశ

సానందసావలేపధీరధీయుక్తిసుంతుఁ డైనపృథ్వీధవుఁడు ప్రౌఢ్యకర్ణాట దేశసామ్రాజ్యకటకవనజవనహేళి శ్రీనాథభట్టమౌళి యని మురిసి నాఁడు. ముమ్మరయాదు లానందించుచుండఁగా శ్రీనాథుఁడు కనకాభి షిక్తుఁ డైనాఁడు.

సీ. సంధించె సానందగంధబంధురదృష్టి
శ్రీనాథకవినాథ శేఖరుండు;
సారించె మందాక్షసహితకుంచితదృష్టి
నరుణగిరీంద్రనాథార్యమౌళి;
మలయించె మోదసంభ్రమవిమిశ్రితదృష్టిఁ
బ్రౌఢదేవేంద్రభూరమణశౌరి;
కులికించె విస్మయాకులచలాచలదృష్టి
ధిషణావిశేషపారిషదజనత;

బహుళశాస్త్రీయవివాదభరపరిణత
పరిషదంతిద్విజిహ్వాభయదగాఢ
ఖండితాఖండలాఖండచండవైరి
ఖండితోద్దండడిండిమఖండవీథి.

నన్ను శిక్షించిన యీమహాంధ్రకవినేత ప్రౌఢదేవరాయలవారివలన నేను వడసినకవిసార్వభౌమబిరుదమును నేటినుండి ధరించి యలరుఁగాక యని యుచ్చైఃకంఠముతో తన బాహువు నెత్తి డిండిముఁ డుద్ఘోషించినాఁడు. పిమ్మట దక్షిణాధీశుని ముత్యాలశాలలో దీనారటంకాలఁ దీర్థమాడిన శ్రీనాథకవిసార్వభౌముఁడు ప్రౌఢదేవరాయలపై నిట్లు సంస్కృతాంధ్రాక్షరాక్షరమధురసము వర్షించినాఁడు.

శ్లో. దోషాకరః కలంకీ కన్యాపకారీ నదీనబంధుశ్చ
కింరాజా కిం రాజా? రాజా శ్రీప్రౌఢదేవ ఏ వాసౌ.

శ్లో. రక్షితశిక్షితదక్షౌ పురపోషణహరణకారణౌ, కర్తా
హర్తా యాగస్య, సమా సమదృష్టీ, రాజశేఖరౌ చిత్రమ్!

శా. రక్షాశిక్షణదక్షదక్షములు సంరక్షించు నో ప్రౌఢదే
వక్షోణీధవ! భీమదేవసకృపాపాంగప్రభాభోగముల్
దక్షారామపురీవరాంతరవసద్గాణిక్యమాణిక్యస
ద్వక్షోజద్వయభారతోలనకళాప్రావీణ్యపారీణముల్.

తే. గీ. ప్రౌఢదేవేంద్రభూపాలబాహులీల
కారణంబుగ నేరులై పాఱు ధరణి
భూరిదీనార్థిజనదావవారిధార
వైరిశుద్ధాంతకాంతాశ్రువారిధార.

మ. ప్రతికారం బొనరించి తృప్తిఁ గనువారల్. ప్రౌఢదేవేంద్రభూ
పతికౌక్షేయభుజంగదష్టు లగుభూపగ్రామణుల్ నందనాం
కితకుంజాంతరభాసురామరభుజంగీవారసారాధరా
తతదంతక్షతమాలికోద్ధురచనాధౌరేయతారంభులై!”

ఈ వార్తలన్నియును సమీరవేగోన్నతితో దేశదేశములకు ప్రాకినవఁట. రాజమహేంద్రపట్టణమున పౌరులు తమనృపాలుని యనుచిమతి గైకొని శ్రీనాథునిప్రతిమను భద్రేభమం దుంచి యూరేఁగించిరఁట. పుణ్యాంగనలు కర్పూరహారతు లిడిరఁట. శ్రీనాథుని విజయవార్త డిండిముని పరాజయవార్త వినుటతోడనే వేమారెడ్డిశరీరము గగుర్పొడిచినదఁట. వీరభద్రారెడ్డిదక్షిణపాణి మీసము మెలిద్రిప్పినదఁట. సింగనామాత్యుని యంసములు పొంగి గరువమును పుక్కిలించినవఁట. అవచితిప్పయసెట్టియాననమింతయై పటుతరామోదము బాహించినదఁట. "కొసరుసహాసాట్టహాసమ్ము గోడగింపఁ బ్రెగడపెగ్గడ హర్ష మావిష్కరించినాఁ"డఁట !!.

3

నాయీవ్యాఖ్యానప్రాయమైనవిమర్శ యింకను ముగియకున్నను కథముగిసినది. ఇంతవఱకు పఠించినరసజ్ఞపాఠకమహాశయులు దీనిపై నిప్పటికే యొకయభిప్రాయ మేర్పఱచుకొని యుందురు. అది యెట్టిదైనను నాయభిప్రాయముమాత్ర మిది.

ఎనిమిదిప్రకరణములుగ వింగడించి మొత్తము రెండువందల ముప్పదితొమ్మిదిగద్యపద్యములలోఁ వచనములు రెండుమాత్రమే కలవు. శాబ్దవిరూపతాసంధానకౌశల్యము, సౌపసర్గనియోజనాతిశక్తి, గంభీరతరనిరాఘాటధారాధుర, ధాతునామేంచుగ్విధానచణత, నోజఃప్రసాదరసోచితసంసక్తి, సంస్కృతాంధ్రభాషాద్వయీసాహితీప్రపంచవాచాప్రయోగహేవాకరక్తి కొసరి తమదురవగాహకర్కశపాండిత్యప్రకర్షను ప్రదర్శించినకృష్ణశాస్త్రిగారు పండితప్రకాండులకు చిరస్మరణీయులు.

నే నీకావ్యము నత్యంతాసక్తితో పరిశీలించుసమయమున నాకు తోడ్పడిన యొకసుప్రసిద్ధవిబుధవిధుఁ డన్నమాట లిక్కడ నుట్టంకింపకుండ నుండలేను—"ధన్యాస్తే నితరా ముదాత్తకవితాదర్పోద్ధతాః

కేచన” అనునట్లు సముదాత్తకవితాదర్పముచే నుద్ధతులైనవారే కొంద ఱున్నను వారు ధన్యులే! అట్టిధన్యులలో నీయన ధన్యతముఁ డని నుడువవచ్చును. వీరి యీకంచుఢక్క కవిత్వవిషయములోఁ బ్రథమశ్రేణికిఁ జెందినయుత్తమగ్రంథము. “రసాలంకారసంపన్నం, యది వా సద్వచోయుతమ్; కవిత్వం తన్నవాగ్రాహ్యా మౌచిత్యరహితం బుధైః” అనునాలంకారికోక్తి నౌచిత్యవిచారణసందర్భమున స్మరింపక తప్పదుగదా? “ఔచిత్యం జీవాతుః కావ్యస్య” అను లాక్షణికోక్తి ననుసరించి యౌచిత్యపోషణము సర్వదా సర్వథా యెల్లకవులకు నవశ్యాచరణీయము. మఱియుఁ గథాకథనమున యాథార్థ్యము మఱుఁగుపడరాదు. కవికాలాదులభిన్ననిర్ణయము లెట్లున్నను నాటిదేశకాలపరిస్థితులను చక్కఁగఁ జిత్రించుచు, వేమారెడ్డి యాస్థానమున విద్యాధికారి యగు శ్రీనాథుఁడు విద్యానగరమునకుఁ బోవలసివచ్చుటకుఁ గల కారణములు, నానాఁడు దక్షిణభారతావనిలో ప్రసిద్ధములైనస్వతంత్రరాజ్యస్థితిగతులు సూచింపక తప్పదు. ఈకథలో ప్రతినాయకుఁడైన గౌడడిండిమభట్టారకుని విద్యావైదుష్యము, విద్యానగరసామ్రాజ్యములో నాతని కున్ననిరంకుశమహావైభవము కన్నులకు గట్టునట్లు చూపింపవలెను. అట్టి డిండిమభట్టారకుని జయించుపొంటె శ్రీనాథున కొనగూడినయవకాశములు చరిత్రకు సంబంధించినంతవఱకు యథాతథముగఁ గొంతవఱకైన చిత్రించుచు నాయాసందర్భములలోని విశేషవిషయములను కొన్నిటినైనను పేర్కొనుచుఁ గావ్యమును నడిపించినగాని యిందలి కథాకథనౌచితి ప్రశస్తి నందనేరదు—

మొగమోటమి వీడి చెప్పవలసివచ్చినచో నీకబ్బమున క్వాచిత్కముగ కించిల్లోపము తోఁచుచున్నది. శ్రీనాథుఁడు సముద్రునివలె గంభీరుఁడు. ఆతనిసంభాషణావైఖరి కేవలవాచాలతామాత్రపర్యవసాయి గారాదు. ఆ మహాప్రజ్ఞానిధి యీకావ్యమున చెన్నమరాజుతో భాషించినధోరణి, సమాధానించినతీరు వేదజడులకో యుపన్యాసకులకో

తగును. అప్రతీప మగునాత్మప్రత్యయము గలిగి యద్భుతరాజనీతి ధురంధరధీమాచాతురితో మంత్రిసత్తములకే విస్మయము గలిగించిన యాపుంభావసరస్వతీమూర్తిచే నాకవిసార్వభౌమునిచే చేయించు ప్రసంగములలో మిక్కిలి మెలకువ చూపిన బాగుగా నుండెడిది. అప్రతీతపదప్రయోగాభినివేశమును శయ్యానైగనిగ్యసంపాదనాభిరతియు, ననుప్రాసాదిశబ్దాలంకారప్రచురవాగాడంబరతానితరాంలిలిప్సయును, రసబ్బంధిష్ఠరచనావిశేషస్వాయత్తీకరణౌత్సుక్యము నతిమాత్రములై యాకృతిని పెక్కుతావుల దురవబోధముగావించినవి. ఈయనలో స్త్రీ సౌందర్య వర్ణనాకాంక్ష యనంతమగుటచే కొన్నియెడల చదువరులు జుగుప్సాభావపరిభావితు లగుదురు.

అయినను విద్వత్కవుల కౌషధ మనందగి నెగడినవీరికైత నారికేళపాకమున నడచి మాబోంటిపాఠకులను విస్మయావిష్టుల నొనరించుచున్నది. ఈమహాకవికవనప్రచురప్రసారములు వలినభవాపరోధవదనగ్రధనప్రథమాన వీటికాకలహిమ వాలుకామలసగంధసుగంధనిబంధురమ్ములనియు, నుజ్జ్వలితతదీయరత్నవిభాసురనూపుర మంజుశింజితావళిమిళితమ్ము లనియు, స్తవించిన పార్థసారథిగారినుతు లతిశయోక్తులు కావు. "ఇహ తు ప్రివ్యాహార్యం సంకేతితసుప్రసిద్ధ మేవ పదమ్" అన్న వాగనుశాసనుని శాసనమునకు వ్యతిరిక్త మైనయీకవిత్వము విరళశబ్దములతో నతిక్లిష్టమైయున్నను సర్వజ్ఞరసజ్ఞశేఖరులకు సమ్మోదము నే రవణించును—"

ఒకపండితాఖండలుని యభిమతమువంటి యభిప్రాయము నిందుదహరించుట యాక్షేపణీయముకాదు. ఇట్లనుకొనువారుకూడ కొంద ఱుందురని వెల్లడించుటకే దాని నిచ్చట సంక్షిప్తపఱచి విలిఖించితిని. ఒకఁ డొకపని జేసినప్పుడు సన్మానమో యవమానమో లభించును భూషించినచో పొంగుట దూషించినచో కుంగుట యల్పులలక్షణము.

ఈ కావ్యమును వ్రాసి ప్రముఖులచే ప్రౌఢకవిచంద్రబిరుదము వడసిన శాస్త్రిగారు దూషణభూషణ తిరస్కారముల కతీతు లైనపరిణతమనస్కులు. ఏమైనను ఈకంచుఢక్కను సృష్టించినకలము కౌశికాభ్యుదయమును నిర్మించినలేఖినియేనా? యని విజ్ఞు లాశ్చర్యచకితులు కాక మానరు. అట్టియాశ్చర్యము నణఁగించి యానందము నందించుసంగతులుగూడ నిందు విరివిగా నున్నవి. అవకాశ మున్నచో నామెఱపులను మఱియొకపర్యాయము వెలికి దీసి చూపెదను.

"పడయుఁగాక నిశితపాండితిశౌండత! నోచుఁగాక సుకవితాచతురతఁ!! గాంచుంగాక సార్వకాలికవిజయమ్ము!!! దీని విను పఠించు మానవుండు—" అని కృష్ణశాస్త్రిగారు తమకంచుఢక్కకు ఫలశ్రుతి చెప్పిరి. వారి యీ విశ్వాస మప్రతిహత మని నేను చెప్పుచున్నాను.



## మహాత్మా బసవేశ్వరుని అష్టమ శతవార్షికోత్సవములు

( శ్రీ బండారు తమ్మయ్య. )

వీరశైవ మతోద్ధారకుడని వ్యవహరింపఁబడి తన్మతోద్ధరణమునకై క్రీ॥ శ॥ పదిరెండవ శతాబ్దిలో దక్షిణ హిందూదేశమున నవతరించిన సుప్రసిద్ధ సంస్కర్త మహాత్మా బసవేశ్వరుఁడు. ఈయన కర్ణాట దేశంబున బీజాపూర్ జిల్లాయందలి హింగుళేశ్వర భాగవాటి (Bagewadi) యను నగ్రహారమున మండంగి మాదిరాజు, మాదమాంబిక యను శైవబ్రాహ్మణ దంపతుల తనయుఁడై క్రీ॥ శ॥ 1125 సం॥ ప్రాంతమున వైశాఖ శుద్ధ ద్వితీయా తిథియందు రోహిణీనక్షత్రయుక్త శుభలగ్నమున వారికి నందికేశ్వర వ్రతాచరణ ప్రభావమున జనియించినవాఁడు. తరువాత నాతఁడాకాలమునఁ బశ్చిమ చాళుక్య చక్రవర్తుల సామంతుఁడుగాఁ గర్ణాటదేశంబున తర్దవాడిసీమ యందు మంగళవాడలోఁ బరిపాలన మొనర్చుచుండిన కలచుర్య బిజ్జలునియొద్ద మంత్రిగఁ బ్రవేశించి, బిజ్జలుఁడు మఱికొంత కాలమునకుఁ బశ్చిమ చాళుక్య రాజధానియగు కల్యాణ పట్టణమున కేతెంచి తైలప చక్రవర్తిని సింహాసన భ్రష్టునిఁ గావించి, చక్రవర్తి పదమధిష్ఠించినప్పు డాతనితోఁదానుగూడఁగల్యాణపట్టణమున కరుదెంచి యచ్చట బిజ్జలుని ప్రధాన మంత్రిగా వ్యవహరించుచు, అనుభవ మంటపాదుల నచట నెలకొల్పి, యనతికాలముననే తన దివ్యప్రభావమున, వీరశైవ పంచాచార్య ప్రతిపాదితమై నానాఁటికి క్షీణదశను బ్రాపించిన తొల్లింటివీర శైవ మతమును పునరుద్ధరించి, విశేష సంస్కారణములతో దానిని విస్తరింపఁజేసెను. పశ్చిమ చాళుక్య రాజధానియగు నీ కల్యాణపట్టణము, బసవేశ్వరుని కాలమునుండి బసవకల్యాణమను పేరితోఁ బిలువఁబడుచున్నది. బసవేశ్వరుఁడు కల్యాణ బసవేశ్వరుఁడని వ్యవహరింపఁబడుచున్నాఁడు. బసవేశ్వరుని జన్మస్థలమగు హింగుళేశ్వర భాగవాటికి సమీపమున, కృష్ణామలప్రభా నదుల సంగమస్థలమున నున్న కూడలి సంగమేశ్వర క్షేత్రమున శివలింగరూపమున వెలసిన సంగ

మేశ్వరస్వామి, జంగమ రూపమున బసవేశ్వరుని జన్మ సమయమునఁ బురిటింటియందే ప్రత్యక్షమై యర్ధోదయకాలముననే బసవనికి వీరశైవ ప్రధానాంగమగు, ఇష్టలింగ ధారణమొనర్చి, తల్లియగు మాదమాంబికతో "అమ్మా! ఈ బిడ్డఁడు నాతనయుఁడుగాని నీ నందనుఁడు కాఁడు. కొన్ని కారణములచే వీరశైవ మతోద్ధరణ ప్రయోజనమునకై నా వాహన రూపకమైన నందికేశ్వరునే (ద్వితీయ శంభుని) నీ గర్భమున నుదయింపఁజేసినాను. నే నిప్పు డీతనికిఁ బ్రసాదించిన ఇష్టలింగమునకు మునుముందర్పితముగావింపక ఏ పదార్థమును, స్తన్యమునైనను నీబిడ్డనికిఁ బెట్టరాదు. అట్లొనర్పకున్నచో నీతఁడు నీకుఁదక్కనేరఁడు. ఈతని మూలమున వీరశైవ మతోద్ధరణము జరగి, లోకమునకు మహోపయోగములుకానున్నవి." ఇత్యాదిగాఁ బెక్కునీతులు బోధించి యంతర్ధానమయ్యెను. సంగమేశ్వరస్వామి యాజ్ఞానుసారమే తలిదండ్రులీతనికి వృషభ, పశుపశబ్దంబులకు వికృతిరూపమగు "బసవ" నామంబిడినారు. తరువాత నీతఁడు కూడలసంగమేశ్వరాలయమునఁ దపమొనర్చుచుండిన జాతవేద మహర్షియను వీరశైవ గురునియొద్ద విద్యాసంస్కారములనొంది ప్రజ్ఞావంతుఁడయ్యెను. వంశాచారము ననుసరించి తలిదండ్రు లితనికి నెనిమిదవయేట (గర్భాష్టకమున) వడుగు (ఉపనయనము) నొనర్పఁ బ్రయత్నింప నీతఁడు వారితో ప్రతిఘటించి "కర్మసంహారమూర్తియగు పరమేశ్వరుఁడు శ్రీకూడల సంగమేశ్వరుఁడే నాగురుఁడు. ఆతఁడు నా జనన సమయమున అర్ధోదయ కాలముననే నాకు వీరశైవదీక్ష యొసంగి లింగయజ్ఞోపవీతధారణము (ఇష్టలింగ ధారణము) నొనర్చినాఁడు. అట్టినన్ను మీరు కర్మాబ్ధిలోముంపవలదు. వీరభక్తికి బ్రాహ్మ్యమునకుఁ జాలదూరము. మీరు నా జన్మమునకు నిమిత్త మాత్రముగఁగారణులైన వారేగాని వాస్తవముగా కూడల సంగమేశ్వరుఁడే నా తండ్రియు, గురుఁడును.వీరశైవులే నాబంధువర్గము. నేను వారిలోనే కలిసి వసింతును." అని తర్కమొనరించి,తలిదండ్రుల

విశనాడి వీరశైవులలోఁగలిసిపోయెను. ఈతని మేనమామయు బిజ్జలుని ప్రధానమంత్రియునగు బలదేవుఁడీతని భక్తివిశేషములకు విద్యాసం పన్నతకు మిగుల నలరి తనతనయగంగాంబికనిచ్చి పెండ్లిగావించెను. ఆమెయు వీరశైవ దీక్షనొందెను. బలదేవుని యనంతర మీతఁడు బిజ్జ లుని ప్రధానమంత్రిత్వము తా నేవహించెను. కల్యాణపట్టణమున క్రీ॥ శ॥ 1168 సం॥ర ప్రాంతమున బిజ్జలునికి బసవేశ్వరునికిఁ గలిగిన మత విషయక భేదాభిప్రాయముల కారణముగా నచ్చట నొక మహా క్రాంతి (Revolution) సంభవిల్లెను. బిజ్జలుఁడొనర్చిన యొక మహా పచారమువలనఁ గొందఱు వీరశైవులు బిజ్జలు నాతని యంతఃపురము చొచ్చిహత్యగావించిరి. కల్యాణపట్టణము పాడఱునట్లు శపించి, బసవే శ్వరుఁడు నాతనియనుచరులు నటనుండి వెడలిపోయిరి. బసవేశ్వరుఁడు కూడలి సంగమేశ్వర క్షేత్రమునకేఁగి నిజగురుండగు సంగమేశ్వరుని యందైక్యమై యవతారమును జాలించెను. ఇట్లు బసవేశ్వరుని జీవిత పరిమితి క్రీ॥ శ॥ 1125–1167, రమారమి 42 సం॥లు మాత్రమేయైనను నీస్వల్పకాలములో నామహాపురుషుఁడొనర్చిన ఘనకార్యములు,సంస్కా రణములునసంతములు.అవతార పురుషులకేగాని యిట్టివి సాధ్యములు కావు. అని శంకరాచార్యులుగూడ నలువది రెండవయేట నే యవతా రము చాలించినట్లు అనుశ్రుతముగా వినవచ్చుచున్నది.

బసవేశ్వరుని చరిత్రమును మునుముందు కర్ణాటాంధ్రభాష లలో వెలువరించిన కవీశ్వరులు, కన్నడమున హంపి హరీశ్వరుఁడు, ఆంధ్రమున పాలకురికి సోమనాథుఁడు. వారు బసవేశ్వరుని సమీప కాలమువారు. హరీశ్వరునకు హరిహరదేవుఁడను నామాంతరము గూడఁగలదు. ఆతఁడు పలువురు శివభక్తుల చరిత్రములను కర్ణాట భాషలో "రగళె" యను దేశిచ్ఛందములో "శివగణదరగళె"అను పేరితో రచించెను. గిరిజా కల్యాణము మున్నగు ప్రౌఢకృతులఁగూడ రచించెను. ఆతఁడు బసవని చరిత్రమును "బసవదేవరాజరగళె" యను

పేరున రచించెను. అది లోకమునకు సమగ్రముగ లభింపలేదు. లభ్యమై నంతవఱకు మైసూరులో చాలకాలము క్రిందట నదిముద్రితమైనది. పాల కురికి సోమనాథుఁడు, "బసవపురాణము" అను పేరితో నేడాశ్వాసముల ద్విపదకావ్యమును రచించెను. అందు బసవేశ్వరునకు ముందువను, సమకాలమునను వెలసిన పలువురు పురాతనాద్యతన శివభక్తుల చరిత్ర ములుగూడ "మణిసూత్రభాతి"గా ననుస్యూతములై నవి. బసవేశ్వ రుని చరిత్రమును దొలుదొల్తఁ బురాణరూపమున రచించిన గౌర వము, ఆంధ్ర వీరశైవ కవిసార్వభౌముఁడగు పాలకురికి సోమనాథునకే దక్కినది. తరువాత రెండువందల సంవత్సరముల యనంతరము భీమ కవి కర్ణాటభాషలో దానికి యథా మాతృకమైన యనువాద మొన ర్చెను. సోమనాథుని యాంధ్ర ద్విపదకావ్యమున కాతని కాలముననే యాతని స్వయం శిష్యుఁడగు వేలాల వీరభద్రకవియు, అపంతరము మూఁడువందల సంపత్సరములకు సోమనాథుని శిష్య ప్రశిష్య కోటికిఁ జెందిన పిడుపర్తి సోమనాథకవియుఁ బద్యకావ్యములు రచించిరి. ఈ రెండవది మాత్రమే చిరకాలమునుండి యాంధ్రదేశమున సోమనాథుని ద్విపదకావ్యముతోపాటు ప్రచారమందున్నది. వేలాల వీరభద్రుని కృతి యసమగ్రముగా మూఁడాశ్వాసములు మాత్రమే నూతనముగ మహబూబు నగరములో ఉపాధ్యాయులుగ నున్న హస్నబాద నాగ లింగశివయోగిగారికి దొరకినది. హరీశ్వర సోమనాథుల బసవ చరిత్ర కథనములోఁగొన్ని స్వల్పభేదములున్నవి. వానిని గూర్చి, ఇంతకు మున్ను మదరాసులో వెలువడిన "పరిశోధన" పత్రికలో (సం॥ 3 సం॥ 2) 1956 లో ఒక వ్యాసము ప్రకటించియుంటిని.

బసవేశ్వరునిమహత్త్వమాతఁడొనర్చినవీరశైవమతోద్ధరణము సంస్కరణముల మూలముననేగాక యాతఁడు కన్నడభాషలోమాత్రా చ్ఛందరూపమున నపంఖ్యాకములుగ రచించిన గీతములవలన లోకము

నకు విశేషముగ వ్యక్తమైనది. అవి బసవ వచనములను పేరితో నిప్పుడు వ్యవహృతములగుచున్నవి. పాలకురికి సోమనాథుని బసవపురాణము నాలుగవ యాశ్వాసమున మడివాలు మాచయ్యగారి కథలో :

" లాలితంబుగ నాల్గు లక్షల మీఁద
నోలి నర్వది నాల్గు వేల గీతములు
గావించుటిది యెగ్గు గనియేవగించు
భావన నాకయ్యె నీవు గైనమి. "

అనుమాచయ్య బసవేశ్వరుల సంభాషణములో నుదాహృతములైన వాక్యముల వలన నీ వచనముల నాతఁడు లక్షలకొలఁది చెప్పినట్లు కానవచ్చును. కాని దేశదౌర్భాగ్యమువలన నివిచాలవఱకు వినష్టములై, రమారమి వేయినఱకు మాత్రము పరిశోధకుల విశేషపరిశ్రమమూలమున నిప్పటికి వెలువడి కన్నడభాషయందు ముద్రితములై ప్రచారమందున్నవి. అన్నియు బసవేశ్వరుని గురుఁడగు కూడలసంగమేశ్వరుని పేరనే యంకితములైనవి. ఇవి వేదవేదాంత సారములై విశేషముగ భక్తి, జ్ఞాన, నీతి, వైరాగ్య బోధకములై యలరారు చుండును. ఈ బసవ వచనములను, బసవేశ్వరుని కాలమున నాతఁడు కల్యాణ పట్టణమున స్థాపించిన యనుభవ మంటపమున వసించిన శివశరణలు తమతమ శివానుభవద్యోతకములుగా రచించి, ప్రచురించిన వచన వాఙ్మయమునకు కర్ణాట భాషలో విశిష్టస్థానమున్నది. నేఁటి కర్ణాట భాషా వాఙ్మయమునకు వానివలన జవసత్వము లేర్పడి పరిపుష్టత కలిగినది.

బసవేశ్వరుని మాహాత్మ్యము, మహాత్మాగాంధియే గాక పలువురు పాశ్చాత్య విద్వాంసులుగూడ నేనాఁడో యాతని వచనముల వలన గ్రహించి ప్రశంసించియున్నారు. గాంధి మహాత్ముఁడు తన సర్వోదయ సిద్ధాంతములకు, హరిజనోద్ధరణము, స్త్రీలహక్కుల సంరక్షణము మున్నగు వానికెల్ల మూలము బసవేశ్వరుని మహోపదేశము-

లేయని బహిరంగసభలలో పలుసారు లుపన్యసించి, బసవేశ్వరుని మాహాత్మ్యమును నతివేలముగ ప్రశంసించియున్నారు.

ఈ క్రింది యుదాహరణముల వలన బసవేశ్వరుని యెడ పాశ్చాత్యప్రపంచమునకుఁగల భక్తి గౌరవములు కొంతవఱకు వ్యక్తము కాఁగలవు.

"Whatever the legend may say about Basava, the fact is fully clear that he was the first Indian free thinker. He might be called the Luther of India. (Arthur Miller.)

"It was the distinctive feature of his mission, that while illustrious, religious and social reformers in India before him had each laid his emphasis on one or other items of religious and social reform, either subordinating more or less other items to it, or ignoring them altogether, Basava sketched and boldly tried to work out a large and Comprehensive Programme with the elevation and independence of woman-hood as its guiding points.

Nreither social conferences, which are annually held in these days, in several parts of India, nor social reformers can improve upon that programme as to the essantials. As was in substance remarked by the late Sir James Campbell, whose knowledge of Indian History, Customs and manners was almost phenomenal, the present day social reformer in India is but speaking the language and seeking to enforce the mind of Basava".

EXTRACT FROM :

*Times of India 17th May 1918.*

ఈనాఁడు మన భారతీయులు బసవేశ్వరుని మాహాత్మ్యములను బాగుగా గ్రహించి యాతని యష్టమ శతవార్షికోత్సవమును దేశము మొత్తముమీఁద మహావైభవముతో నిర్వహింప నుద్యమించుట మిక్కిలి ముదావహము. ఇందుకై మూఁడేండ్లనుండి బసవసమితులు కర్ణాటాంధ్రదేశంబులనేర్పడి చాల కృషిగావించుచున్నవి. ప్రధాన సమితి బెంగుళూరులో మైసూరు రాష్ట్రము, ఆహారశాఖామంత్రి శివశ్రీ B. D. Jetti B.A., L.L.B., గారి యధ్యక్షతను స్థాపింపఁబడినది. శాఖా యువసమితులు ఆంధ్రరాష్ట్రమునఁగూడ హైదరాబాదు, అనంతపురము, విజయవాడ, మున్నగు తావుల స్థాపితములై పనిచేయుచున్నవి.

బసవేశ్వరుని వచనములకుఁ గొన్నిటికి, ఆంధ్రమున ననువాదములు కొందఱు విద్వాంసులు చాల వత్సరముల క్రిందటనే రచించి ప్రకటించిరి, ఇప్పుడు వానిలో ముఖ్యములైన నూటయెనిమిదింటినేఱి వాని యనువాదములను సంస్కృతమునను, ఆంగ్లమునను, భారత దేశమందలి పదునాల్గు ప్రధాన దేశభాషలలోను బ్రచురించుటకు బసవ సమితివారు ఉద్యమించినారు. మిత్రులు శ్రీ బాణాల రామయ్య M. A. (Lecturer Yuvaraja College Mysore) గారి యాంధ్రను వాదములనొండు రెండుమచ్చున కుదాహరించెదను.

1. అంబు గర్భము నందగ్నియై లోలోననడఁగి యుండె
ఓషధీవరులోని రస రుచిగ నొప్పె
కోరకముల పరిమళమున కూడుక
కూడల సంగమ దేవుని నెలవు
కన్నియ వలపువోలె నలరించె॥

21. చెంపనెరసి చిబుకములపై మేనుగూడు గాక యముందె
పల్లుడుల్లి వెన్నువంగి యన్యుల నాశ్రయింపకముందె

కాళ్ళపైని కేలనూఁది కోలఁబట్టకముందె
ముప్పుచే నొప్పుచెడకముండె
కొలువుమా! కూడల సంగమదేవుని॥

బసవేశ్వరుని యష్టమ శతవార్షికోత్సవములు మైసూరు రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యమున 26-12-67 నుండి 28-12-67 దేదీలందు, బసవ కల్యాణపట్టమునను, 31-12-67 నుండి 2-1-68 తేదీలందు బసవేశ్వరుఁడు శివైక్యమందిన కూడలి సంగమేశ్వర క్షేత్రమందును నిర్ణీతమగు కార్య ప్రణాళికలతో నిర్వహింపఁబడుచున్నవి.

Indian republic vice-president Hon'ble. V.V. Giri గారు ప్రారంభోత్సవము గావింతురు. వివిధ భాషలలోఁ బలువురు విద్వాంసులు రచించిన వ్యాస రాజములతో విరాజిల్లు "జ్ఞానప్రసాదము" అను స్మారక సంచిక (Commemoration Volume) కూడ నప్పుడు వెలువడనున్నది. మైసూరు ముఖ్యమంత్రి శివశ్రీ S. నిజలింగప్పగారు దాని నావిష్కరింతురు.

రాయలసీమలో శ్రీశైలక్షేత్రమందును, అనంతపురము నందును, ఆంధ్రరాష్ట్రధాని హైదరాబాదునందును, ఉత్తర సర్కారు జిల్లాలకంతట విజయవాడ యందునుగూడ నీయుత్సవములు మఱికొన్ని తేదులలో జరుపఁబడుచున్నవి. ఆంధ్రసాహిత్య పరిషత్ పక్షమున నీసందర్భమున కానుకగా పరిషత్పత్రికయందు, ఈ వ్యాసమును ప్రకటించుచున్నాము. పాఠకులు బసవేశ్వర ప్రసాదమును బడసి చరితార్థులయ్యెదరుగాకయని యభిలషించుచున్నారము.



శ్రీమజ్జగద్గురవే నమః

## మహాత్మా నీకు కేల్మోడ్చెదన్ !!

శ్రీమతి యస్. హైమవతి.

మ. అమృతాద్వైతము భూరివైఖరుల ది
గ్వ్యాప్తంబు గావించి దు
ర్దమదుర్దాంతమతాంధకారపటుధూ
ర్తత్వంబు వారించి ని
త్యము నిష్కల్మష మాశ్రితావనము స
త్యస్ఫూర్తిమంతం బనం
తము జూపించి జనమ్ము గాచినమహా
త్మా! నీకు కేల్మోడ్చెదన్. 1

ఉ. ఆర్యపథంబు వీడి పర, మార్గవిభూతుల నుజ్జగించి సాం
కర్యము నూలుకొల్ప తమ, కమ్మను జూపెడిదుష్టరాక్షస
స్థైర్యము రూపుమాపినమహాత్తరశీలివి నీవు శంకరా
చార్య! నమస్కృతుల్ కొనుము, శాశ్వతనీతినొసంగుచుర్వికిన్.

మ. స్తవనీయాగమశాస్త్రవాదనకళా
ధారుండవై పూజ్యహైం
దవధర్మోన్నతి దక్షయుక్తముగ ను
ద్ఘాటించి విఖ్యాతశాం
భవదీక్షాపరతన్ జగద్గురుడవై
వైశిష్ట్యముం బొంది స
త్కవివై పండితమౌళివైతివి నమ
స్కారింతు నీశక్తికిన్. ౩



## శ్రీవిఘ్నేశ్వరపాదపంకజములు

శా. దేవానీకము భక్తితోఁ గొలుచు నే
దివ్యాంఘ్రియుగ్మంబు, సం
సేవింపన్ వినుతింప నేచరాచరా
జీవంబు లక్ష్యంబు, లా
శావేశంబుల కేపదంబులు పరి
ష్కారంబులై పొల్చు నా
శ్రీవిఘ్నేశ్వర పాదపంకజములన్
చింతింతు నశ్రాంతమున్. 1

శా. వివాదమ్ములు మాని మానసములో
విశ్వాసముం బూని సం
భావింపన్ భజియింప శాస్త్రవిధులన్
పాటించి యర్థించినన్
ప్రావృణ్ణీరదమట్లు శోభనములన్
వర్షించి మెప్పించు నా
శ్రీవిఘ్నేశ్వరపాదపంకజములన్
చింతింతు నశ్రాంతమున్. 2

శా. కావంజాలు శుభమ్ము లీయఁగలుగున్
గావించుచోఁ బూజలన్;
త్రావించున్ గరళాగ్నికీలలను దు
ర్ధర్షించి ద్వేషించినన్;
దీవించున్ కరుణన్, గ్రసించు నలుకన్;
దేదీప్యమానమ్ము లా
శ్రీవిఘ్నేశ్వరపాదపంకజములన్
చింతింతు, నశ్రాంతమున్. 3



# నన్నెచోడుని పద్యము

(శ్రీ) టేకుమళ్ళ కామేశ్వరరావు బి. ఏ., బి. ఇడి.

నన్నెచోడ మహాకవియొక్క కుమార సంభవములోని పద్య మీక్రింద నుట్టంకింపఁ బడినది—

ఉ. జీరిక కల్లు త్రావి మదసింధురగామిను లన్ని కేరియల్
వారుచు, గౌడుగీతములు పాడుచు, పొల్పుగ గ్రాలియాడుచున్,
గోరడమాడుచున్, బతులకున్ వశవర్తులుగాక మేరకున్
మీరుచు, వన్నెకాంతలు రమింతురు దద్విపినాంతరమ్ములన్.
(ఆ 6 ప 54)

ఆ పద్యమును గుఱించి వేదాల తిరువేంగళాచార్యులుగారు తమ గ్రంథములోని* యథోజ్ఞాపికలోనిట్లు విమర్శించిరి.— "ఈ పద్యమంతా అసందర్భమే. కేరియల్ వారడమేమిటి? కేరింతలు కొట్టుచున్నా రందురు. ప్రాసకోసమని యీ 'వారుచు' వచ్చినది. "పొల్పుగ గ్రాలుట," "పతులకు వశవర్తులుగాక" "మేరమీరుట" ఈ పునరుక్తులేమిటి? "వశవర్తులుగాక" ఎవరు? వన్నెకాంతలు వశవర్తినులగుదురా? వశవర్తులగుదురా? ఈ పదము తప్పు. ఇదియట గొప్పకవిత యట? ఈతఁడు మహాకవియట, పెద్దలు విచారించండి" యని, తమ మూల విమర్శలో మఱికొంతకూడ విమర్శించిరి.

నన్నెచోడ మహాకవి నన్నయభట్టుకి సుమారుగా రెండు వందలేండ్లు పూర్వపువాడు. అంతటి పూర్వపు కవిత్వములోని పదములకర్థ మొక్కొక్కప్పుడు సులభముగాఁ బోధపడదు. అతఁడు తంజావూరి జిల్లాలోని యొరయూరునకుగాక కడపజిల్లాలోని యొరయూరిపుర వరాధీశ్వరుఁడు. అతని రాజ్యమునకు కన్నడ రాజ్యము సరిహద్దు. ఆ సందర్భములను మనసులో నుంచుకొని యతని కవిత్వమును గ్రహింపవలసియున్నది. పై పద్యములోని కొన్నిపదములను జూచెదము.

1) జీరిక కల్లు—ఈ నాటి యడవిజనులు "ఇప్పకల్లు"ను త్రాగెదరు. జీరిక శబ్దమిప్పుడు వాడుకలోఁ గనఁబడదు.

2) "కేరియల్ వారుచు" అనుపద సంపుటి యర్థమేమి? కేరియను మాట పూర్వపు దెలుగులో నుండినది. ఈ నాటి వాడుకనుండి తొలగినది. కాని యిది యిప్పటికిని కన్నడ భాషలో మిగిలినది.* కేరి = Street; lane తెలుగు భాషలో సందు, వీధి యని చెప్ప వచ్చును. ఆటవికలు దప్పతాగి వేర్వేఱు దారులలో పరుగిడిరి. మందగామిను తోడలు తెలియనప్పుడు చేసెడి పనిని కవి చక్కగా దెలియ జేసినాడు.

3) గౌడుగీతములు—గౌడు పదము గౌలు అనగా చెఱకు కంపు అను పదమునుండి యేర్పడి యుండుసని యాచార్యులుగారియూహ. కాని యాపదమే వేఱు. అ పదమిప్పటికిని తూర్పుగోదావరిజిల్లాలోని కోనసీమలో మిగిలియున్నది. కల్లుగీయుచు, కొబ్బరి, తాటితోటలలో పనిపాట్లను చేసెడియొక శూద్రజాతివారికి గౌడులనిపేరు. కాఁబట్టి గౌడుగీతములనగా కల్లు పాటలు లేక గౌడ జాతివారు పాడెడి పాటలని చెప్పవలెను. ఈ కాలములో మనము గౌడు గీతములను బాడుచున్నా రనక, తాగి తందనాలు తొక్కుచున్నారందుము. అనగా, పట్టి పాటలేకాక గంతులాటలుకూడ వేయుచున్నారని భావము. అదే విష యము నా మహాకవి "పొల్పుగ గ్రాలియాడుచున్"యను పద సంపు టినిగూడ జేర్చి విశదపఱచినాడు. "క్రాలు"అను పదమునకు గిరగిరఁ దిరుగు అనెడియర్థము శబ్దార్థచంద్రికలో నున్నది. క్రాలుశబ్దమున కున్న మఱియొక యర్థములో "మదనాగంబును బోలి క్రాలవలదా మాఱెందు లేకున్నతిన్" (అ 1 ప 40)లో వాడఁబడినది.

4) గోరడమాడుచున్—ఈ పద సంపుటిని యితర కవులు "గోరాడుచున్" అని వాడుచుండిరి. పోతన గజేంద్రమోక్షములో 'గొబ్బిళ్ళు గోరాడునున్' అని వ్రాసినాడు.

5) వన్నెకాన్తలు—ఇది కేవలము లేఖకుని పొరపాటని చెప్ప వచ్చును. అతనికి 'మన్నె'యను మాట తెలుగులో చిరకాలము నుండి వచ్చుచున్నది. ఇదె 'మన్నెసుల్తాన్' బిరుదులోనికిగూడ నెక్కినది. కాఁబట్టి యది 'వన్నె' కాదు 'మన్నె' మాత్రమే. మన్నెకాంతల నగానాటవికలుగదా? అడవి వారిని వన్నెకాంత లనుటలో సొగసు లేదు. వారు వన్నెలేని మన్నెకాంతలు మాత్రమె.



## కాళిదాసు వైశిష్ట్యము—వ్యక్తిత్వము

(శ్రీ) అయ్యగారి నరసింహమూర్తి.

ప్రాచీనులు కవులైనను, గాయకులైనను, తత్త్వవేత్తలైనను, రాజకీయతంత్రజ్ఞులైనను, సామ్రాజ్యము నేలుచక్రవర్తులైనను, వైద్యులైనను, వైజ్ఞానికులైనను—విద్య నేర్చినవారిలోఁ బెక్కుఱకు తమ నాటికే యేశాస్త్రము లెంతెంత వఱకుఁ బరిణతి చెందియుండినవో వానికి సంబంధించినవిషయములనేకములు వారికి బాగుగాఁ దెలిసియుండిన వనువిషయము వారు రచించినగ్రంథములనుబట్టి తెలియుచున్నది అంతియకాక తాము నేర్చినవిషయముల నెచటనైన, నెప్పుడైన వెల్లడించుట కనువగురీతి నాయావిషయములను దమరసనలపై గుప్తపఱచుకొనెడివారు. "పుస్తకస్థా తు యా విద్యా పరహస్తగతం ధనం, కార్యకాలే తు సంప్రాప్తే న సా విద్యా న తద్ధనమ్" అనుతలంపు గలిగినవారు వారు. "నైషధమ్ విద్వదౌషధమ్" అని ప్రసిద్ధికాంచిన శ్రీహర్షుడు, బౌద్ధాచార్యుఁ డైననాగార్జునుఁడు, కవికులగురు వగు కాళిదాసు నాతనికృతులకు వ్యాఖ్య లొనర్చినమల్లినాథుఁడు—వీరందఱు

బహుశాస్త్రకోవిదులే. వీరిలోఁ బెక్కుఱు కవులైనను భావనాశక్తిలో గవిత నల్లఁగలనైపుణ్యమేకాక వారి కితరశాస్త్రములందుఁ గలవైదుష్యమును నసమానమే.

అందుఁ గాళిదాసు 'విశ్వకవి'గా విఖ్యాతి నార్జించినాఁడు. ఈతనిస్థానము సాహితీక్షేత్రములో నద్వితీయమైనది. ప్రాగ్లోకపరిజ్ఞానము, సౌందర్యదిదృక్ష, దేశాటనాశక్తి. దృగ్గోచరవిషయశోధనాకాంక్ష సునిశితజీవితానుభవము గలయీతఁడు 'రిక్తస్సర్వో భవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ' అనుసూక్తి కనువగుకీర్తిని శాస్త్రములను బ్రకృతిని నధ్యయనము చేసి యనన్యసామాన్యలోకవ్యవహారాభిజ్ఞతతోఁ బాటు, పచేళిమమైనభావనాశక్తిని బ్రహ్మజ్ఞానముగాఁ బరిణతి చెందునుపమాతత్త్వజ్ఞానమును బెంపొందించుకొనినాఁడు. వివిధము, విస్తారము, ననవద్యము, ననర్గళము నైన యీ విశిష్టజ్ఞానమును కేవలశాస్త్రభాషావైదుష్యప్రకటనార్థముగాఁ గాక ప్రకరణమున కనువగుభావముతో, దాని కనువగుఛందముతో సర్వాంగసుందరము, శ్రుతిసుఖదము,హృదయాహ్లాదముగా నేతద్భావార్థమును వెలువరింపఁ గలపదవిన్యాసముతో మనోహర మగునుపమలలోఁ బొదుగుట యీతనివిశిష్టత, విజ్ఞత కూడ. ఆకారణముననే గవికులగురుని గైర్వాణవాణీపదమంజీరశింజిని మంజులమై యీనాటికిని రసజ్ఞులచేనాస్వాదింపఁబడుచున్నది.

కాళిదాసు భారతదేశమున జన్మించినను నాతని వాణి ప్రపంచమందలి జనుల నాకర్షించి యలరించుట యాతనికిఁగల ప్రత్యేకతలలో నొకటి. ఈతని యుపమలను ష్టుప్ ఛందములో నొకపాదములో నిమిడి గంభీరములు, సుందరములు, నిర్దుష్టములు నై ప్రసాదగుణముతో నొప్పుచుండును. ఉపమానోపమేయములపోలిక పాలు- పంచదారల సంయోగమువలె నతిరుచిరమై యుండును. భాషపై నీతనికిఁ గల యధికార మసామాన్యమైనది. శబ్దశక్తి నెఱుంగుటలో మేటి. ఇఁక

ప్రతిభ విశ్వతోముఖ మైనది. వర్ణనావిషయములు నిసర్గమధురములు నై యుండును.

మహాకవికి బహుశాస్త్రపరిజ్ఞాన మావశ్యకము. కవులలోఁ బెక్కఱు బహుశాస్త్రపరిజ్ఞానము లోకజ్ఞత కలిగియు కొందఱు పాండిత్యప్రకర్ష నిరూపణకు చిత్రవిచిత్రకవిత్వనిరూపణకు లోనుగాగా మఱి కొందఱు సందర్భశుద్ధిని పాటింపక తమకుఁ దెలిసినవిషయముల నేకరువు పెట్టఁ దొడంగిరి. ఇట్టిగుణములు మందునకైనను లేకుండుట యీతనిలోఁ గల మఱియొక విశేషము.

ఈతఁడు ఆత్మగౌరవము తనకళయం దత్యంతపూజ్యభావము కలిగినవాఁడు. పాండిత్యమునందు దిట్టతనము నాత్మవిశ్వాసము నధికముగాఁ గలవాఁ డగుటచే నాచంద్రతారార్కముగ వఱలుచు సప్త సంతానములలో నొకటి యగుసాహితీక్షేత్రమునఁ దనకుఁ గలుగు స్థానమును భంగ్యంతరమున గంభీరముగ నీక్రిందిశ్లోకములో వెలువరించినాఁ డని చెప్పవచ్చును.” పరివృద్ధా హీయతే చన్ద్రః సముద్రోఽపి తథా విధః స తు తత్సమవృద్ధిశ్చ న చాభూత్తా వివ క్షయా రఘు (17–21) చంద్రుఁడు దినదినాభివృద్ధి చెందినట్లే క్షయమును బొందును. సముద్రమును న దేవిధముగ నుండును. కాని యాయనఁ (చంద్రసముద్రములవలె) వృద్ధిచెందువాఁడే కాని యెన్నఁడును క్షయమునుమాత్రము పొందఁడు. ఆహా! ఏమి క్రాంతదర్శిత్వము. ‘ఋషీణాం పునరాద్యానామ్ వాచ మర్థో నుధావతి’– అనిగదా సూక్తి సూక్తు లెన్నటికిని నవితథములు గావుగదా! మఱియు రఘువంశ దశమసర్గలో పురాణస్య కవే స్తస్య వర్ణస్థానసమీరితా, బభూవకృత సంస్కారా చరితార్థైవ భారతీ (రఘు. 10–37) అని పలికినాడు. (రఘు. 10–37) ఇదియును యథార్థమే.

ఘన మగువిద్యాసంపద గలిగియు నహంకారాదిగుణములు లేక సత్త్వగుణప్రధానుఁడై వినయసౌశీల్యాదిసుగుణసంయుతుఁ డగుట విశేషములలో విశేషముగదా! రఘువంశమున మన్దః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్ ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః' అని వినయగుణమును బ్రదర్శించినాఁడు. 'మాళవిక' ప్రస్తావనలో పురాణ మిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్ సన్తః పరీక్ష్యాన్యతర ద్భజన్తే మూఢః పరప్రత్యయ నేయబుద్ధిః॥ అని రసజ్ఞశేఖరులే తనరచనయందలి బాగోగులను గ్రహించి తెలిసికొనగలుగుదు రనినాఁడే కాని తనకుఁ దానై తన్నుగూర్చి గాని తనరచననుగూర్చి గాని యేమియు వాకొనలేదు. వయసుతోఁబాటు మేధ, యీరెంటితోఁబాటు రచనాపాటవము నిక్కుటమైనను, నాతనిలో నౌద్ధత్యముమాత్రము తలయెత్తలేదు. పరిశ్రమతో యథాక్రమముగాఁ బరిణతి చెందినపిమ్మట రచింపఁబడిన నాటకరాజమున కభిజ్ఞానముగా జగద్విఖ్యాతి గాంచినయభిజ్ఞానశాకున్తలమునఁ గూడ "ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్ బలవదపి శిక్షితానాం ఆత్మ న్యప్రత్యయం చేతః॥ (నానేర్పును బండితులు కని మెచ్చునంతవఱకు నేను సరియగు నని నమ్మఁజాలను. లోకములో నెంతప్రయత్నముతో నేర్చినవానికైనను దనయభిప్రాయముం బట్టియే తన నేర్పున నమ్మకము కుదురదు.)

సదసద్వివేచనాజ్ఞానము నొసఁగుచు మోక్షమునకు మార్గమును (సా విద్యా యా విముక్తయే) జూపువిద్యను నేర్చి బహిరంతర్గతముల జ్ఞానదీప్తితో వెలుఁగొందుచు జీవితపరమార్థమును దెలిసికొని పరమేశ్వరాంఘ్రిధ్యానైకశీలతత్పరుఁడై జ్ఞానధ్యానముల మూలమున శివైక్యమును జెందగోరినవ్యక్తికి వినమ్రభావముగాక యౌద్ధత్య మెట్లు పొడసూపును ?

ఈతని గ్రంథారంభశ్లోకములనుబట్టి యీతఁడు శైవోపాసనాప్రవృత్తి యధికముగాఁ గలవాఁడని తెలియుచున్నది. అయినను నీతనికి మతసహనము మెండుగాఁ గల దని రఘువంశ (10 వసర్గ) కుమారసంభవములందలి విష్ణ్వాదిదేవతావర్ణనలనుబట్టి తెలియును. మఱియు నావర్ణనలు మనోహరములై పాఠకుల కాయామూర్తులు దృగ్గోచరమగు నన్నను నతిశయోక్తి కాదు. త్రిమూర్త్యాత్మక మగుభగవంతుని గూర్చి నమో విశ్వసృజే పూర్వం విశ్వం తదను బిభ్రతే అథ విశ్వస్య సంహర్త్రే తుభ్యం త్రేధా స్థితాత్మనే॥ (ఆదిలో విశ్వమును సృజించుచు తరువాత దానిని భరించి యనంతరము దానిని సంహరించుచు త్రిమూర్తుల పరిణమించిన ఓ దేవా! నీ కిదే నమస్కారము) అని పలికినను నీశ్వరుఁడే సర్వవ్యాపకుఁ డనువిషయముపై నీతనికి దృఢవిశ్వాసము గలదు. శాకున్తలమునందలి నాందీశ్లోక మగు యా సృష్టిః స్రష్టురాద్యా। యనునది పై విషయమున కభిజ్ఞానముగా నున్నది. ఈశ్వరుఁడు జీవుడు, మాయ- బ్రహ్మ ఆత్మ- పరమాత్మ- వీని సంబంధము శైవాచార్యుఁ డగుశంకరుఁ డెఱింగినట్లే యీతఁడును నెఱుంగును.

నిష్కామకర్మ, భగవద్ధ్యానము- పునర్జన్మ లేకుండ చేసికొనుటకు సాధనము లని నమ్మినవాఁడు. భగవద్ధ్యానమువలన ననేకలాభము లుండు నని విక్రమోర్వశీయ' నాందీశ్లోకమున వ్యక్తము చేసినాఁడు.

వేదాన్తేషుయ మాహు రేకపురుషం వ్యాప్యస్థితం రోదసీ యస్మిన్ ఈశ్వర ఇత్యనన్యవిషయః శబ్దో యథార్థాక్షరః అన్తర్యశ్చ ముముక్షుభి ర్నియమితప్రాణాదిభి ర్మృగ్యతే స స్థాణుః స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసా యాస్తు వః॥

జీవిత మన నేమి? దానిలక్ష్యమేమి? మానవుడు భగవంతునిఁ జేరుటకుఁ జేయవలసిన ప్రయత్నములు. ఈవిషయములను బాగుగాఁ దెలిసికొని యారీతిని నడచుకొనినవ్యక్తి.

కష్టసుఖముల పరివర్తనమే జీవితము. అది మరణముతో నంత మొందును". We are such stuff; As dreams are made of and our little life;is rounded with a sleep-Shakespeare. మఱియు నీలోకమున కష్టసుఖము లెవ్వరికిని శాశ్వతములు గావు. 'కస్యైకాన్తం సుఖ ముపనతం దుఃఖ మేకాన్తతో వా నీచై ర్గచ్ఛ త్యుపరిచదశా చక్రనేమిక్రమేణ (మేఘ. 2–48).

పుణ్యక్షయ మయినపుడు భగవదనుగ్రహమువలన మర్త్యలోకమున మానవులుగా బుట్టుచుందు రనియు, పరమేశ్వరునిసృష్టిలో నీమానవజన్మ యత్యుత్తమ మైనదని యట్టిజీవితమును క్షణముగడపినను చాల లాభదాయక మని యట్టిజన్మమును బొందినమానవుడు దైవమున కెల్లపుడు కృతజ్ఞుఁడై యుండి తనకు విహిత మైనధర్మము నాచరించుచు భగవద్ధ్యానముతోఁ బరమేశ్వరునిలో నైక్యము పొందవచ్చు నని తెలిపినాఁడు.

ధర్మాచరణమునకు శరీరము ముఖ్యసాధనము "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" (కుమార 5–33) ప్రకృతిలోఁ బుట్టిన వన్నియు గిట్టవలసియున్నను క్షణకాల మూపిరి పీల్చి యాకాలమును సద్వినియోగము చేసికొనినయెడల భగవదనుగ్రహమును బడయఁగలము.

"మరణం ప్రకృతి శ్శరీరిణాం వికృతి ర్జీవిత ముచ్యతే బుధైః క్షణమ ప్యవతిష్ఠతే శ్వసన్యదిజంతు ర్నను లాభవా నసౌ॥ (రఘు. 8–87).

పై దానినిఁబట్టి భగవంతునిగూర్చి తెలిసికొనుచు నాత్మరక్షణము చేసికొనుటయే వ్యక్తిజీవిత మనుట కాళిదాసుభావ మని విశద మగుచున్నది.

సాధనములనూాలమున స్వయంసంపూర్ణత్వమును (Self perfe ction) బొందవచ్చును. ఆసాధనములు శాస్త్రములందు వివ

ఱంపఁబడినవి. అవియే మానవుని కున్నతపథమును జూపుచివ్వేలు. ఎట్లన శ్రుతే రివార్థస్స్మృతి రన్వగచ్ఛత్' (రఘు. 2-12).

'త దిచ్ఛామో విభో స్రష్టుం సేనాన్యంతస్య శాన్తయే కర్మ బన్ధచ్ఛిదం ధర్మం భవస్యేవ ముముక్షవః (కుమా. 2-51).

సంసారబంధమును ద్రెంచువారు దానికిఁ గారణ మగుధర్మము నెట్లు కోరుదురో) ఉద్ఘాతః ప్రణవో యాసాం న్యాయై స్త్రిభి రుదీరణమ్ కర్మయజ్ఞః ఫలం స్వర్గ స్తాసాం త్వం ప్రభవో గిరామ్ (కుమా. 2-12)

త్వా మామనంతి ప్రకృతా పురుషార్థప్రవర్తినీమ్ తద్దర్శిన ముదాసీనం త్వా మేనపురుషం విదుః (కుమా. 2-13).

ప్రవేదములకు మొదట నోంకార ముండునో యుదాత్తాను దాత్తస్వరితము లుచ్చారణమో పని యజ్ఞమో ఫలము స్వర్గమో యట్టివేదములకే నీవు కారణుఁడవు. దేవా సత్త్వరజస్తమోగుణా త్మక మయినపురుషునకు భోగమోక్షములను సమకూర్చు ప్రకృతిగాఁ జెప్పెదరు. నీవే యాప్రకృతి నుదాసీనభావముచే చూచునాత్మ వని తెలంతురు).

మమాపి చ క్షపయతు నీలలోహితః పునర్భవం పరిగతశక్తి రాత్మభూః (శాకుం. 7-35).

భౌతికవాచికవిషయములకంటె మానసికవిషయములే వ్యక్తి జీవితములోఁ బ్రధాన మనినాఁడు. మానవుడు మనఃపూర్వకముగాఁ బుట్టుదలతో మనస్సును నింద్రియములను చెడుకార్యములు, చెడుమాటలు, చెడుతలంపులవైపునకు మఱలకుండ నడుపుటలోఁ బెట్టుకొని పరిశుద్ధాంతరంగుఁడై యుండవలెను. మనోనైర్మల్యము క్లిష్టదశలో మానవునకు సన్మార్గమును జూపును. 'సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మన్తఃకరణప్రవృత్తయః (శాకుం 1-19).

కోరికలమధ్య దృఢచిత్తము కావలయును. అనఁగా వాంఛల ననుసరించి చిత్తమును యథేచ్ఛముగాఁ దిరుగనీయకుండఁ జేయుట. (వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః (కుమా. 1-59).

పెద్దలయెడ నవినయావిధేయతలు శ్రేయః ప్రతిబంధకము లని నాఁడు. ప్రతిబధ్నాతి హి శ్రేయః పూజ్యపూజావ్యతిక్రమః (రఘు.1-79)

అవినాశనకారి యైనయాత్మ పునర్జన్మలవిషయము కాళిదాసు నకుఁ దెలియుటయేకాక వానియందును నీతనికి నమ్మకము గలదు.

మాయావరణము తొలఁగి సంచితకర్మక్షయ మయినప్పు డాత్మ పదమాత్మలో లీన మగును. ఇది వేదాన్తగతత్త్వము. తమసః పరమా పదవ్యయం పురుషం యోగసమాధినా రఘుః (రఘు. 8-24).

కార్యసంస్కారబీజములు మాత్రము నష్టముగావు.

'ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః' (కుమా. 1-30) భావస్థిరాణి జననాన్తరసౌహృదాని (శాకుం.) మనో హి జన్మాంతరసంగతిజ్ఞమ్ (రఘు. 7-15).

పూర్వకర్మలవలననే యీలోకములో బంధుత్వము స్నేహము కలుగుచుండును. కనుకనే పూర్వజన్మవిషయము లీజన్మలోఁ దెలియ కున్నను బాగుగా నలవాటుపడినమార్గమున బండి పోవురీతిగా నాయా పరిధులలో మనసు తిరుగుచు సుఖదుఃఖములను బొందుచుండును. ఈ విషయమై మల్లినాథు డీవిధముగ వ్యాఖ్యానించినాఁడు.

"త దే వేద మితి విశేషప్రత్యభిజ్ఞాభావేఽపి వాసనావశా దను భూతార్థేషు మానసీప్రవృత్తి ర స్తీ త్యేతావతైవో క్తం సంగతిజ్ఞ మితి తేన జ్ఞానేన ప్రవర్తత ఇత్యర్థః॥

ఇఁకఁ బరలోక మందిన దేహులు వారివారి కర్మపరిపాకమును బట్టి వేఱువేఱుదారులలోఁ బయనింతురు. పరలోకజుషాం స్వకర్మభి ర్గతయో భిన్నపథాహి దేహినామ్' (రఘు. 8-85).

ధర్మకార్యాచరణమున కుపకరణ మైనశరీరమును గృహస్థాశ్రమమునం దుంచవలెను. ఏలయన గార్హస్థ్యమే సర్వాశ్రమముల వారికి సేవఁజేయుటకుఁ దగియున్నది.

"ద్వితీయం సర్వోపకారక్షమ మాశ్రమః" (రఘు. 5-10)

"యథా మాతర మాశ్రిత్య సర్వే జీవన్తి జన్తవః వర్తన్తే గృహిణం తద్వ దాశ్రి త్యేతర ఆశ్రమాః (మను) తపోదానాది పుణ్యకర్మలచేఁ బరలోకసుఖము మాత్రమే కలుగగా మంచివంశమునందు కలిగెడు సంతానము ఇహపరలోకసుఖముల రెంటిని సమకూర్చును. 'లోకాన్తరసుఖం పుణ్యం తపోదానసముద్భవమ్ సంతతి శ్శుద్ధవంశ్యా తు పరత్రేహ చ శర్మణే' (రఘు. 1-69).

తపోదానాదులవలన సంఘటిత మగుపుణ్యము పరలోకసుఖప్రదము. మఱి శుద్ధవంశములోఁ బుట్టినసంతతి సుఖమునకే కాక యిహపరలోకసుఖములకుఁగూడఁ గారణ మగునుగదా! పవిత్రత, మితభాషిత్వములనుగూర్చి నొక్కి చెప్పినాఁడు. "సత్యాయ మితభాషిణాం" (రఘు. 1-7).

పాపమునుండి వైదొలఁగి పరోపకారచింతనతో నమలినమై ధర్మబద్ధముగా నుండుటయే జీవిత మని, వినయము, ప్రాణులయెడ దయాళుత్వము శాన్తము చిత్తస్థైర్యము గలిగియుండువాఁడు సత్పురుషుల యాశీస్సుల కర్హుఁడై సుఖములను బొంద వీలగు ననినాఁడు. ఈ విశిష్టగుణగణభూషితుఁడే కాళిదా సని యాతనిగ్రంథములను క్షుణ్ణముగఁ జదివినవా రెఱుంగఁగలరు.

సుందరవనాంతర్గ్య మైనపర్ణకుటీరము లనిన సీతనికిఁ బ్రత్యేకాభిమానము. పుణ్యాశ్రమ. పుణ్యమూర్తులదర్శనములవలన శుభములు చేకూరఁగల వని యాతనిభావన. 'పుణ్యాశ్రమదర్శనేన తావదాత్మా పునీమహే' అని శాకున్తలమున దుష్యన్తునిచే ననిపించినాఁ

డు. శృంగారప్రధాన మైనమేఘమున యక్షుఁడు మేఘునితో 'నీవు మహాకాళక్షేత్రమున కేగునప్పటికి సాయంకాలము కాకపోయినను సాయంకాల మగువఱకును నచటనే వేచియుండుము. శివపూజాసమయమున నీ వురుముదువేని శివునిసేవలోఁ బటహమును ప్రయోగించిన పుణ్యమును బొందఁగలవు. ఈ ఉదాహరణము కాళిదాసునకుఁ గల యమితభక్తిప్రపత్తులకు నికషోపలము.

నయనానందకరము, ప్రశాంతయుతము నగుపర్ణశాలవాతావరణమును రఘువంశ, శాకుంతలముల వర్ణింపఁబడినది. కుమారసంభవమున శివపార్వతుల తపోవనభూములు వర్ణింపఁబడినవి. ఇవి యన్నియు నేత్రగోచరములై నయనములకు హృదయమునకుఁగూడఁ బ్రీతిని గలిగించునట్టివై యున్న వనుటలో నతిశయోక్తి లేదు. ఈ వర్ణనలాతనిసౌందర్య సమారాధనకు పరిశీలనకు వర్ణనావైచిత్రికి, శబ్దాధికారమునకుఁ దార్కాణము లైనవి. మఱియు వీనినిఁ జదువునపుడు పాఠకుఁడై తన్మయుఁడై తా నాతోవల సంచరించుచున్నటుల దృప్తి నొందఁగలఁడు.

నెమలి యనినను దీపశిఖ యనినను నీతని కధికప్రీతి. 'దీపశిఖ' ననేకపందర్భముల వర్ణించి సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ' 'దీపశిఖా' యనుబిరుదమును బొందినాఁడు. ఇందుమతీ స్వయంవరసందర్భమున స్వయంవరమునకు విచ్చేసినరాజులవిలాసచేష్టలను వర్ణించి "కాళిదాసో విలాసః" అని ప్రశస్తిని బడసెను.

ఈదనికి గో వనినను, గోపూజ యనినను పూజ్యభావము గల దు. రఘువంశమున గోవుయొక్క యుత్తమత్వమును, పవిత్రతను వర్ణించినాఁడు. శబ్దశక్తిని బాగుగా నెఱింగిన వా డగుటవలన నీతనికి మంత్రములయందును నమ్మిక గల దని తెలియనగును. (రఘు. 11-9 బల, అతిబల).

విద్యావిషయమై తనకుఁ గల భావములను గాళిదాసు మాళవిక నాటకమున హరదత్తగణదాసులను బురస్కరించుకొని చక్కఁగా వ్యక్తపఱచినాఁడు. ప్రతివ్యక్తికిని కులవిద్యయం దభిమానము మెండుగా నుండును. 'కామం ఖలు సర్వస్యాపి కులవిద్యా బహుమతా! ప్రతి మానవునకు నేమియో యొకవిద్యలో నభిరుచి యుండితీరును. ఆవ్యక్తుల యభిరుచుల ననుసరించి సుశిక్షితుఁడైన గురువుకడ వాని నుంచినచో గురుశిష్యు లిరువురు ప్రకాశవంతు లగుదురట. 'పాత్రవిశేషే న్యస్తం గుణాన్తరం వ్రజతి శిల్పమాధాతుః' అది యెట్లనఁగా జలమివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య" జ్ఞాన మొసఁగిన గురువును స్మరించి కృతజ్ఞుఁడుగా నుండవలెను" దేవ శ్రూయతాం మయా సుతీర్థాత్ అభినయవిద్యాశిక్షితా దత్తప్రయోగ శ్చాస్మి దేవేన దేవ్యా చ పరిగృహీతః (ప్రథమాఙ్కం) సమవిద్యఁ గలవారి మధ్య యశస్స్పర్ధ యుండుట సహజము. "ప్రాయః సమానవిద్యాః పరస్పరయశః పురోభాగః". అట్టి విద్యాధికులలో వయోవృద్ధులకుఁ బ్రాధాన్య మీయవలయు నని చెప్పినాఁడు. "నను సమానేఽపి జ్ఞానవృద్ధభావే వయోవృద్ధత్వాత్ గణదాసః పురస్కార మర్హతి॥.

విద్యావంతుని శక్తిసామర్థ్యములను దెలిసికొనుట లేక వ్యక్తి చేయు నిర్ణయముపై విశ్వాస ముంచుట తగదట. "సర్వజ్ఞస్యాప్యేకాకినో నిర్ణయాభ్యుపగమో దోషాయ". పరీక్షాధికారులు పక్షపాతరహితులు, సమర్థులు కానియెడల వ్యక్తులప్రజ్ఞాప్రాభవములు శక్తియుక్తులు వెల్లడి కాఁజాలవు. "అలం ఉపాలంభేన పత్తనే విద్యమానేఽపి గ్రామే రత్నపరీక్షా"॥

సుశిక్షితు లందఱు గురుపీఠమున కర్హులుకా రనుచు వ్యక్తిలో విద్య యేయేరీతుల ప్రకాశించునో యెట్టివాఁడు గురుపీఠమున కర్హుఁడో యెవరిని సద్గురు వని చెప్పవలెనో యీ క్రిందిశ్లోకములందుఁ దెలిపినాఁడు.

"సుశిక్షితోఽపి సర్వ ఉపదేశదర్శనే న నిపుణో భవతి"." శిష్టా క్రియా కస్యచి దాత్మసంస్థా, సంక్రాంతి రన్యస్య విశేషయుక్తా యస్యోభయం సాధు సశిక్షకాణాం ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ. మందమతులను స్వీకరించుటలోనే గురువుల మేధాసంపన్నత తెలియఁగలదు. ఏవ మాపద్యతే వినేతు రదత్రివ్యపరిగ్రహోఽపి బుద్ధిలాఘవం ప్రకాశయతి. మరియు నెవనివిద్య విబుధులయెదుట పరీక్షకుఁ దాళఁజాలునో వానివిద్యయె విద్య. వాని నేర్పే నేర్పట: "ఉపదేశం విదుః శుద్ధం సన్త స్త ముపదేశినః శ్యామాయతే న యుష్మాసు యః కాఞ్చన మివాగ్నిషు॥. ఎవఁడు కొంతకీర్తిని గడించి భుక్తికి గడించుచు విద్యావ్యాసంగములలోఁ బాల్గొనక పరు లేమనుకొన్నను దమకీర్తిప్రతిష్ఠలకు భంగమురా దని యోచించుకొనునో యట్టివానివిద్య కేవలము భుక్తికొఱకు మాత్రమే యని యాతఁడు విద్య నమ్ముకొను వర్తకుఁ డని తెలిపినాఁడు. "లబ్ధాస్పదోఽస్మీతి వివాదభీరో స్తితిక్షమాణస్య పరేణ నిన్దామ్ యస్యాగమః కేవలజీవికాయై తం జ్ఞానపణ్యం వణిజం వదన్తి (1–17). చివఱగాఁ గన్ను లున్నను దీపములేనిచో చీకటిలోనివస్తువులను గాంచ లేనియట్లు చదివినవిద్యను సక్రమముగా వినియోగింప నేర్వనిచో నావిద్యయు వ్యర్థమే యనినాఁడు." దృశ్యం తమసి న పశ్యతి దీపేన వినా సా చక్షు రపి. (1–9). ఈరీతిని కాళిదాసు విద్యాగురుశిష్యులనుగూర్చి యెల్ల దేశములవారికిని నెల్లకాలములకు సరిపడు రీతిగా నమాల్యము లగువిషయములను నవకాశమును బురస్కరించుకొని మాళవికలో నిక్షిప్తము చేసినాఁడు.

కాళిదాసునకు తనదేశముమీఁదను, తనజన్మభూమియందును నమిత మగుభక్తి, గౌరవము నభిమానము గలదు. ఈవిషయము రఘువంశమునఁ బదమూఁడవసర్గలోఁ జక్కఁగాఁ దెలుపఁబడినది. తన దేశము దేవతలకు నిలయ మగుటచేఁ బుణ్యభూమి యని. సకలభోగై

శ్వర్యములకు నిలయ మని, మీదుమిక్కిలి యీ దేశమునకు సౌభాగ్యదేవతాశీర్వాదము గలదని చాటినాఁడు. రఘువంశమేఘసందేశములందు భారతదేశమునఁ జూడఁదగినప్రదేశములను దెలిపినాఁడు. కుమారసంభవమున హిమాలయములందలి ప్రకృతిసౌందర్యమును, దానియౌన్నత్యమహనీయతలను వర్ణించినాఁడు. గంగానదివర్ణనను చాల మనోజ్ఞముగఁ జేసినాఁడు. కాశ్మీరమునందలి కుంకుమపుష్పమునుగూడ వర్ణించినాఁడు. హిందూదేశమునందలి కొన్ని ప్రదేశములు మాత్రమే కాక భారతదేశ మంతయు నొకదివ్యక్షేత్ర మని యెలుఁగెత్తి చాటినాఁడు. ఇందలిజనులు శౌర్యపరాక్రమవిలసితు లని యిందలిప్రకృతిసంపద యపారమగుటయే కాక ప్రపంచమున కన్నివిధముల మార్గదర్శక మని (స్థితః పృథివ్యా మివ మానదణ్డః) భారతదేశాధిక్యమును, విశ్వాసముతోఁ గూడినజాతియున్నతదృక్పథమును రాజు ప్రజలను బాలించు తెఱంగును (సపితాపితరస్తాసాం కేవలం జన్మహేతవః (రఘు 1-24) వర్ణించి భారతదేశ మన్నివిధముల నిరుపమాన మైనదనినాఁడు.

అవని యంతయు నేకచ్ఛత్రాధిపత్యమునకు రావలె ననెడియాకాంక్ష గలిగినవాఁడు. ఈయంశము శాకున్తలమున మనకు స్పష్టముగా గోచరించును. 'రథేనానుత్ఖాతస్తిమితగతినా తీర్ణజలధిః పురాసప్తద్వీపాం జయతి వసుధా మప్రతిరథః (శాకుం. 7-33).

సర్వశాస్త్రపారంగతుఁడు కాళిదాసు. ఈతని బహుముఖీనపాండితీప్రతిభనుగూర్చి వేఱొకతఱి ముచ్చటింపఁదలంచితిని గాన ప్రస్తుతమునకు స్థాలీపులాకన్యాయనమున రెండుమూడు ఉదాహరణములను దెలియఁజేసెదను. "వాగర్థా విన సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ" (రఘు 1-1). (వాక్కును నర్థంబును నొండొంటితో నిత్యముగాఁ కూడియున్నవిధమున నొండొకరితో నిత్యముగాఁ గూడియున్న పార్వతీపరమేశ్వరులను వాగర్థజ్ఞాన-

మును నాకు ననుగ్రహించుటకై నమస్కరించుచున్నాను). "తా నరాధిపసుతా నృపజాత్మజైస్తే చ తాభి రగమన్కృతార్థతాం సోఽభవ ద్వరవధూసమాగమః ప్రకృతి - ప్రత్యయయోగసన్నిభః (రఘు 11-56). సీతారామాదివివాహఘట్టము. ఈ రెండు ఉదాహరణములు నాతని శబ్దవ్యాకరణపరిజ్ఞానములకు మచ్చుతునకలు. స్త్రీల తీరు తెన్నులను గూర్చి పరిశీలించుటలోఁ గాళిదాసునకుఁ బ్రత్యేకాసక్తి కుతూహలము గలదు. తండ్రిపార్శ్వతలమునుండి పెండ్లివార్తలు వినుచున్న పార్వతిచేష్ట నీవిధముగఁ గుమారసంభవమున వర్ణించినాఁడు.

"ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ"

వీరరసములోను యుద్ధవీరముకంటె దానధర్మవీరములపట్ల నాతఁడు మొగ్గుచూపును. నిశ్శేషవిశ్రాణితకోశజాతుఁడైన రఘువు దానమును, మాంసపుముద్దవలె స్వదేహమును సింహమున కర్పించిన దిలీపునిదయాధర్మశీలమును నీతఁడమితోత్సాహముతో వర్ణించినాఁడు

"సత్యం, శివం, సుందరమ్- అని వర్ణింపఁబడుపరమేశ్వరస్వరూపమును, నున్నతస్థితికి మానవుఁ డవలంబింపవలసినవిధానమును, ననాచారమువలనఁగలుగుపతనమును, నార్షసంప్రదాయానుబద్ధముగ ముకురమునఁ బ్రతిబింబమువోలె విపులముగ కావ్యములందు వర్ణించి పవిత్రము, ప్రశాంతము నానందజనకము నైనప్రదేశముల వసించి పరిపూర్ణమేధాసంపద్విలసితుఁడై పరిశుద్ధాంతరంగముతో భగవద్భక్తిపరాయణుఁడై యార్షమతము ననుసరించి జీవితమును గడిపి హైందవజాతి మేధావులలో నొకఁడై శివైక్యమును జెందినధన్యజీవి.

సనాతనభారతీయసంస్కృతిగా మూర్తీభవించిన పుణ్యమూర్తిత్రయములోఁ గాళిదాసు మూఁడవవాఁడు. త్రిమూర్తులుగాఁ బేర్కొనఁబడుచున్న దేవతాగణములో మూఁడవవాఁడు శంకరుఁడు. తన మతివిలసనముచే జగద్విఖ్యాతి నంది యఖండముగ ఖండాంతరములందును దనకీర్తిచంద్రికలను వెదజల్లుచున్నకాళిదాసుకూడ మాహేశ్వరాం-

ఘ్రికమలధ్యానైకతత్పరుఁ డగుట మిగుల ముదావహము, విశిష్టము నగువిషయముగదా!

అగవిందుఁ డీతనిచే రచింపఁబడిన గ్రంథముల స్వరూపమునం దును, వస్తువిశేషమందును నెంత తారతమ్య ముండినను, వానియందతని వ్యక్తివైశిష్ట్యము స్పష్టముగాఁ గన్పట్టుచుండును. ఈవ్యక్తివైశిష్ట్యమే యనుకరింపరాని కాళిదాసుని ప్రతిభకు నికషోపల మని యనివాఁడు.

## భ గ వ త్సం ద ర్శ న ము

విద్వాన్ శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి.

మ. చిరకాలమ్మునకున్ లభించెనపురా! శ్రీవేంకటాద్రీశ్వరున్
బరితృప్తింగనుభాగ్యమంచు మదిలో భావించుచున్ ముందు నిన్
దరిసింపం జనుదెంచినాడ, శ్రితవాత్సల్యమ్ము దీపింప సు
స్థిరకారుణ్యరసార్ద్రదృష్టిఁగనవే! శ్రీ కాళహస్తీశ్వరా! 1

శా. తిన్నండిచ్చిన మాంసఖండముల సంతృప్తిం బ్రశంసింపవే?
మున్నాధూర్జటి పాండితీగరిమకున్ ముక్తిం బ్రసాదింపవే!
కన్నుల్ ధన్యతఁగాంచె నిన్నిటఁగనన్ గౌరీమనోనాయకా!
మన్నింపందగు నన్ను; నెల్లెడమహాత్మా! కాళహస్తీశ్వరా! 2

మ. సెలలీయంగదె! యేడుకొండల దొరన్, శ్రీ వేంకటేశప్రభున్
దిలకింపంగఁ గుటుంబసంయుతు, ననున్ దేవా! కటాక్షింపవే!
చలిలోఁబైన; మసాధ్య; మైనభగవత్సందర్శనా తత్పరుల్
చలియంచున్ గిలియంచు నెంతురె? మహేశా! కాళహస్తీశ్వరా! 3

మ. శరణన్నంగరుణించు శ్రీవరదరాజస్వామి నీక్షించితిన్
తిరుచానూరున కేగి యందు శుభగాత్రిన్, మంగతాయారు భా
సురమూర్తిం దిలకించి నేఁడమిత తేజోరాశి పద్మావతీ
చిరపుణ్యాత్తఫలమ్ముఁగంటిని నినున్ శ్రీ వేంకటేశప్రభూ! 4

గీ. పాపనాశోదకములఁ బావనత నంది
సతియు, సుతులును, నల్లుఁడు సకలవిధుల
నుపచరింపఁగ నీదర్శనోత్సవమున
జన్మము తరించె వేంకటాచలనివాస!

# శ్రీమదర్వపల్లీ లక్ష్మీనృసింహస్తోత్రము

## పీఠిక

శ్రీరంగాచార్య.

"శ్రీమదర్వపల్లీలక్ష్మీనృసింహస్తోత్రము" అను నీ సంస్కృత కృతి- చాలకాలమునుండి మాయింట గలప్రాచీనకృతులలో నందున నముద్రితముగా నున్నవానిలో నొకటి. దీనిని మా పితృపాదు లుద్ధరించి వ్రాసి యుంచినారు.

ఏకారణము వలననో గాని ప్రస్తుతస్తోత్రకర్త యెవ్వరో తెలియుట లేదు. రచనయందును నెచ్చట తనపేరును చెప్పకొనలేదు. వ్రాయసగాండ్రనుండి జరిగినప్రమాదమున గావచ్చును. కర్తృనామము లేదు.

మావద్ద గలప్రాచీనకృతులయందు మరింగంటి కవుల రచనలు హెచ్చుగా గలవు. (1) శ్రీరామ పాదుకా స్తవము[1]ను-నీస్తోత్రమును నొకేప్రతియందు వ్రాసి యున్నవి. కావున మరింగంటి యప్పలదేశికుల వారే దీనికి కర్త యను ననుమానము గలుగును. కాని యట్లు భావింప వీలులేదు. కారణ మేమనగా అప్పలదేశికులవారు సాక్షాచ్ఛ్రీ రామభక్తుండు. ఆయన రచన - శైలిం మరందకదళీసుధామధుర సాలమృద్వీచి"గా గలదు. ఇందలి రచన యతిప్రౌఢము, అంతేగాక- మలిగంటికవులయందు నేయొకరిద్దరో దప్ప నృసింహస్వామినిగూర్చి హెచ్చుగ వ్రాసినవారు గారు. కావున నీస్తోత్రకర్తృత్వము- భావిపరిశోధనవలన విదిత మగుననియు, నంతవరకు దీని నకర్తృకముగనే యుంచుట శ్రేయస్కర మనియు నాయూహ.

మా పెద్దలవలన నీస్తోత్రమును గూర్చి వినినవిషయములంబట్టి యేతద్రచయిత సుమారు 180 సం. పూర్వుం డని భావించితిని. కాన నీస్తోత్రము ప్రాచీన మనుటకు నూహా పొడముచున్నది.

1. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక ప్లవంగ- ఆశ్వయుజ- కార్తికములు సంపు 56 సంచిక 4, పుటలు 30-33 (ఈ సంచికలో పీఠికమాత్రమే ముద్రితము.

మాకు లభించినంతవఱ కీస్తోత్రము 29 శ్లోకములు గలవు. అన్నియును నొకేవృత్తమున గలశ్లోకములు. ఈ పద్ధతిని జూడగా కవి దీనిని 'శతకము'గా రచింపనెంచెనో! రచించినచో నుత్సన్నముగ గాగా మిగిలిన వీశ్లోకములో తెలియదు.

ఇందలి కవిత్వము మిక్కిలి జటిలముగను సమాసభూయిష్ఠముగను నుండి చదువరులను శ్రమింపజేయు నని చెప్పనొప్పును.

మయూరుని 'సూర్యశతకము' ననుసరించి కవి యీస్తోత్రమును వ్రాసెనేమో! కారణ మేమన నందలిశ్లోకములును నీశ్లోకములును వృత్తసంబంధము, కొంత శైలీసామీప్య ముండుటయే[2].

'అర్వపల్లి' యనునది నల్లగొండజిల్లా సూర్యారావుపేట తా॥ యందుగల నొకగ్రామము. ప్రసిద్ధమైన నృసింహక్షేత్రము. తద్గ్రామమున నీయాలయము గలదు. తత్స్వామినిగూర్చి చెప్పఁబడినదే యీ స్తోత్రము.

ఈ స్తోత్రమును తత్ప్రాశస్త్యమును గూర్చియు మా ప్రాంతమున నొక'కథ' బహుళప్రచారమునఁ గలదు. విస్తరభీతికి భీతిల్లక దాని నిటఁ జేర్కొనుచున్నాను.

'ఈతఁడు (కవి) ప్రబలకుష్ఠవ్యాధిబాధితాంగుఁడై శరీరమంతయుఁ గుళ్ళిపోవ నింటఁ బయట రోసి దేశాంతరగతుఁ డగుటకో లేక ప్రాణత్యాగము చేసికొనుటకో తలఁపడి వెళ్లుచు నీస్వామిసన్నిధికి వచ్చి యాలయమున నిల్చి యాశుధారగా నీశ్లోకములఁ జదువ–తన్మాహాత్మ్యమునకు ప్రభావమునకు స్వామి పట్టజాలనివాఁడై కవికిఁ బ్రత్యక్షమై సామీప్యమునఁ గలబావియందు స్నాన మొనర్చి రమ్మని యాదేశింప కవి యట్లుచేసి వజ్రసదృశశరీరుఁ డాయెనట.

2. ఈ పద్ధతిలోనే 'మట్టపల్లీనృసింహస్తోత్రము' మావద్ద గలదు. తత్కర్త గోవర్ధనం వేంకటనృసింహాచార్యులు–సుమారు 50 సం.ల క్రిందివాడు. ఈస్తోత్రమును గూర్చియు కవిని తదితరకృతులను గూర్చియు త్వరలో ప్రత్యేకముగ తెలుపుదుము.

ఇట్టి విషయముల నత్యాభునికుల మైనమనము నమ్మజాలమేమో? కాని పూర్వ మీవిధముగ జరిగినగాథలు గలవు. కవులు వాక్శ క్తిగల వారు. అందుకే 'పండితవాక్యము రిత్తవోవునే' అని చెప్పకొనినారు. 1948 సం॥న జరిగిన రజాకర్ విప్లవము (పోలీసు చర్య సమయమున నీ యర్వపల్లియాలయమున మహమ్మదీయులుగాని మఱి యూకాల మున గలదుండగీలుగాని ప్రవేశింపలేదట³. కారణ మేమన-నొక మాఱావిధముగ ప్రవేశింప స్వామి కందీగఁగలఁ దోలి వారిని పార దోలెనట. ఇట్టి మాహాత్మ్యముగల దాక్షేత్రము- ఆస్వామిపై జెప్పిన యీరచనయు నట్టిదే.

నాకు లభించినంతవర కీస్తోత్రమును యథాతథముగ ప్రచురించు చున్నాను: (కొంతకొంత సంస్కరణ చేసి) లేఖకులవలన పరంపరా యాత మైనదోషము లిం దున్నట్లు వ్యక్తమగుచున్నది. విజ్ఞు లిందలి గుణాఽగుణములఁ బరిశీలింప వేఁడికోలు.

'నల్లగొండకవులు- తద్రచనలు' అనువిషయముపై పరిశ్రమిం చుచు నేను సిద్ధము చేసినవ్యాసములలో నిది యొకటి. నా యీరచ నల నత్యంతవాత్సల్యముతోఁ బ్రచురించి భాషాసేవయేకాక 'విస్మృత తెలంగాణకవులు- రచనలు' వీనిని సూర్యాలోకభాగ్యము లగునట్లు జేయుచున్న (శ్రీ) ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికాధిపతులకు నా సవినయ పూర్వక కృతజ్ఞతలు.

అమరగ వేల్పులచే క
బ్బము సెప్పియకాదె వరము బడసిరి మును బా
ణమయూరాదులు సత్కా-
వ్యము సెప్పినఁ బడయరానివస్తువు గలదే.

---

3. ఇట్టి భగవత్ప్రభావమునకు ప్రబలోదాహరణ 'సింహాద్రినారసింహ శత కము' దానినిగూర్చియు, నైవిధముగనే వాడుక గలదు(కథ)

# ‘శ్రీమదర్వపల్లీ లక్ష్మీనృసింహస్తోత్రము’

సం-శ్రీరంగాచార్య.

శ్రీమంతం తార్క్ష్యవాహం శ్రుతిశిఖరవచస్సత్కృతం శేషతల్పం
సంకల్పైకప్రక్లప్తాఖిలజగదుదయత్రాణసంహారకార్యం
కల్యాణైకప్రదానం నిరత మఘలవప్రత్యనీకం చ నిత్యం
వాత్సల్యౌదార్యసింధుం ప్రణత హృదయభ క్త్యార్వపల్లీనృసింహమ్॥ ౧

శుభ్రాభ్రా దభ్ర(అదభ్ర?)మభ్రంకష చటులసటం సుభ్రువం భ్రాజమానం
భ్రాంత్యా బభ్రమ్యమాణప్రథమదివిషదాం ప్రాజ్యజంఝానిలాభం
గర్జద్దుర్జాతిఖర్జూహరణరణచణం నక్రవిక్రాంతచక్రం
సక్రోధక్రూరవక్రక్రతుహరహరమాద్యర్వపల్లీనృసింహమ్॥ ౨

గంభీరాంభోదసంభేదకవికటసటాపాటవాస్ఫోటితాండం
జంభార్యంభోజసంభూతముఖసురనుతం శంభుదంభాపనోదం।
రంభాస్తంభోరుగుంభం(?) దనుజభయకరస్తంభసంభూతడింభం
బంభర్యంభోజశుంభన్నయన మనుచరా మ్యార్వపల్లీనృసింహమ్॥ ౩

జ్వాలాజాజ్వల్యమానం దితిసుతతతయే శాత్రవాభీలతీక్ష్ణం
రక్షోవిక్షోభివక్షోభణనిపుణనఖం రౌప్య దేదీప్యమానం।
పరిహ్లాదాహ్లాదదక్షం ప్రణతజనసుధాప్రియ(ధీప్రి)పరితాపం
సాంహాస్సంహారరంహశ్చటులమటమనోహ్యార్వపల్లీనృసింహమ్॥ ౪

అభ్రాంతభ్రాంతకర్ణం భ్రుకుటికుటిలతాసూచకాభీలవక్త్రం
దంష్ట్రారోచిర్వితానప్రశమితతిమిరప్రస్ఫురత్తారహారం।
దుర్వారాఖర్వగర్వక్షితిపతితతిహం దోర్వ్యగాశ్చర్యచర్యం
హిండద్వేదండశుండాచటులపటుభుజం హ్యార్వపల్లీనృసింహమ్॥ ౫

సంతంతంసంతతంతం దితదితిజతతిం సందహంతం స్ఫురంతం
నందంతం కుందదంతం కటితటఘటితస్వ్యక్తముక్తాకలాపం।
హిండంతం కుండలాభ్యాం హిమకరసదృశం భండనోద్దండకాండం
హింసంతం హింస్రిసంఘం ఘటితహిత మముం హ్యార్వపల్లీనృసింహమ్॥

చండం వేదండతుండం దితితనయవిషంఖండయంతం ఘటంతం
లంఘుజ్జంఘాలజంఘాసభసశరభం శంభుశుంభం నటంతం
ఘ్నంతం సోపఘ్నమూర్వోః కనకకశిపు ముద్వ్యఘ్నవిఘ్నం భయఘ్నం
ప్రహ్లాదస్య ప్రసిద్ధం భజ హృదయ సదా వ్యాఘ్రపల్లీనృసింహమ్॥ ౭

స్వాం శం సంతం నృశంసం చటుపటురభసం సంరటంతం దురంతం
తుంగంతం నందతం సంగరఖరతరసం సంసదంతం దుగతం
ఉత్ప్లుత్యోత్ప్లుత్య దైత్యం కనకకశిపు మాక్రమ్య సంసక్తమూర్వోః
హింసంతం సంతతం తం హృదయ భజ సదా వ్యాఘ్రపల్లీనృసింహమ్॥

చంచంతం సంచరంతం కరఖరనఖరై స్సంచయం వంచయంతం
తం చండం ఖండయంతం తతదితిజతతే ర్మానినాం మానయంతం
యం యం యంతాం మగ్రేసరమరసదసాంతం తమంతం నమంతం
గర్జంతం దుర్జయంతం త మనుసర మనో వ్యాఘ్రపల్లీనృసింహమ్॥ ౯

తుంగత్వంగత్తరంగశ్వసితతభగపరిష్వంగనిస్సంగలింగ
ద్గంగం గంథానుగంత్రగ్రగగనగగంధర్వగీర్వాం మహోర్వాం।
శుభ్రాద్రిభ్రిం నిరభ్రిం శిశుశశిశిశిరస్స్వీయకామోధవస్వా
భీక్ష్ణం తీక్ష్ణం పరాక్షాం నను మనసి నమా వ్యాఘ్రపల్లీనృసింహమ్॥ ౧౦

దోర్ధూమదుర్ధర్షమూర్ధప్రసరపటునటత్కేసరై ర్భాసురాంగం
స్వఫానస్రాఙ్నిర్నిర్ధూనననుమునవాప్తసంఛన్నతౌఘం।
రక్షస్సృక్షోధవక్షఃక్రకచవికచసర్వ్యజాగ్రిన్నఖాగ్రం
న్యగ్రోధాగ్రచ్ఛదాంభోధర మథ కలయా వ్యాఘ్రపల్లీనృసింహమ్॥ ౧౧

ఘస్రే శోస్రే సహస్రే తపతి నిపతితం పథ్యజస్రం దృగస్రే
ప్రస్తావ్య స్తం తమిస్రాచరయువతిజనప్రస్రవద్గర్భగర్భం
నిర్భిత్త్వంతం దురంతై ర్భయకరనినదై ర్వ్యగ్రసవ్యాగ్రిరోగ్రం
సంగ్రామాగ్రే చరంతం శరణ మనుగమే వ్యాఘ్రపల్లీనృసింహమ్॥

ముగ్ధానాద్భిత్యరాద్యాధ్వనికటనకటప్రాజ్యగంధం సనోగ్రం
సధ్యాన ధ్వాంక్షవన్యా ధ్వనివిహతపదాం సాధ్వసాభ్యాసదక్షం
స్వగ్రామస్వర్ధినిర్ధూనన మనుమననం వార్ధిరాణ్ణాగవంద్యం
దోర్ధ్వం మూర్ధాభిషిక్తం నమనుజనికరై రర్వ్యపల్లీనృసింహమ్॥ ౧౩

స్ఫూర్జద్గర్జాత్తి తర్జావచనరచన సంఘుర్ఘురై ర్నిర్జితారిం
ధూర్జట్యావర్జితోత్తం సమణిగణఘృణిం నిర్జరోర్జస్వలాంఘ్రిం ।
సుభ్రూభంభ్రమ్యమాణం స్ఫురదనలశిఖాచక్రచక్రం త్వవక్రం
స్ఫూర్జదృగ్వ్యాట్టహాసం స్మరతు మమ మనో హ్యార్వ్యపల్లనృసింహమ్॥

బద్ధశ్రీద్ధోపరుద్ధ స్వచరణయుగళస్నిగ్ధ సంధిం విశుద్ధం
దుగ్ధాభాభావిముగ్ధం పరుషపురుషహంసగ్ధగం వాగ్ధవార్చ్యం ।
దోర్ధాగం దుగ్ధవార్ధిం దనుజపరిషదం ముగ్ధముగ్ధాంతరాణాం
దోర్ధాగం సాదరం స్తౌ మ్యనుకల మపి హ్యా ద్యార్వ్యపల్లీనృసింహమ్॥

బాహ్యాబాహ్యావగాహ్యార్య్య నిశవికలతా సహ్యమోముహ్యమానం
శాస్త్రీహ్యశాన్యోపవాహ్యా మహినిహతపదా సహ్యగాయాతుసహ్యం ।
యద్భీత్యా దైత్యసేనా చకితచకితవిద్రావితా ద్రాగ్విరామం
సంక్షేపం సంతనోతుక్షతశతదురితం హ్యార్వ్యపల్లీనృసింహమ్॥ ౧౬

స్వస్థానేసుస్థిరప్రీత్యభిలషితమతం స్థానసంస్థాననాస్త్రం
శ్రీస్త్రానుస్త్రాననిష్టేష్ట దనుసదృశ దృష్ణిష్ణగం గీర్గరిష్ఠం ।
నిర్ఘోషద్రాక్షసానాం కదనభువి మహామూర్ఖనిర్ఘాతదీర్ణం
శాగమ్యం ధర్షయంతం భజహృదయసదా వ్యాఘ్రపల్లీనృసింహమ్॥

శంఖంచక్రం కరాభ్యాముపరి విలసితాభ్యాముభాభ్యాం...
భ్రాంతంయోగాసనస్థం సురుచిరవదనం యోగపట్టాప్తజాన్వోః ।
న్యస్తాభ్యాం సద్భుజాభ్యాం విలసితమరుణాం భోజసంభాసదంఘ్రిం
యోగానందం నృసింహం ఝడితిహృదిభజహ్యార్వ్య పల్లనృసింహమ్॥

ధారాసంపాతసంబాధిక నిగవధికాహేతుకాభానుకంపం
శంపాపారం పరీపత్యధిగతమభయభ్రాజమానం మహాంతం ।
స్వాంతం ధ్వాంతం హరంతం కలశకులిశరేఖోల్లసత్పాదపద్మం
పద్మాసద్మాయితోరస్థల మహమనుయాహ్యార్వపల్లినృసింహమ్ ।
రక్షాపేక్షాప్రతీక్షం సపదిహృదిసతామేప్సితార్థైకదీక్షం
కృత్స్నం మత్స్యాభమూర్తింముహురిహమహిమత్స్వయాపాలయంతం
సర్వాశ్చర్యాత్మచర్యం హృదయమధుసుధాసాగమాఘుగ్యఘుగ్యం
స్మేరాస్యం సుందరాంగం హృదిభజ సుజనహ్యార్వపల్లీనృసింహమ్ ।
పాటీరాభం కిరీటాగణితమణి ఘృణీకోటికోటీరకోటిం
ధాటీసృక్జల్లలాటం పరిచకితకటం యాతునూత్నం ప్రయత్నం ।
రత్నంప్రత్నం సపత్నప్రకరభయకరం వక్షసిభ్రాజయంతం
శ్రీమంత్రం మంత్రగోప్యం హృదయభజసదాహ్యార్వపల్లినృసింహమ్॥
మందారం వందినాం దుస్సహబహుమహిమా మందిరం మందహాసం
కందార్పానందకందం శతమదనమహాసుందరాంగం దరఘ్నం ।
వందేహంచార్వపల్లీహరిదుధ సుజనైర్వందితం ద్రుగ్యాగాంకం
వందేహం దేవదేవం కగయుగళదరస్యందనాంగాహితఘ్నం॥ ౨౨

గంభీరం శంభుజం భద్విషదవన పరీరంభసంరంభ శుంభ
ద్బాహాస్తంభం విజృంభత్కుసుడు దరచరద్యం భరాజాక్షితాపం ।
తారంగ శ్రీవిరాజత్త్రివళివళివిభానిందితేందుం ముకుందం
కుందాచ్ఛద్దంతబృదం హరిమహమభజం హ్యార్వపల్లీనృసింహమ్॥ ౨౩

ప్రోద్యద్విత్యాత్సయుక్స్వవదన విలసితం వ్యాప్తదిక్చక్రవాళం
స్మేరాంగం దీర్ఘదృగ్నిగ్రహ మహామిహాసర్వేష్టదానైకదీక్షం ।
తత్తద్వాంఛాసరణి తులసీపల్లవం ప్రాపయంతం
త్రాయంతంచింతన శ్రీయుత నిజనివహాం హ్యార్వపల్లీనృసింహమ్॥ ౨౪

శర్వేసంపుల్యమానాం బుజదళనయనం కల్యకల్యాణకుల్యా
తుల్యంకల్యాణనేత్రిం సహృదయసదయాశాలి శీల్యంభయఘ్నం ।
వాత్సల్యౌదార్యతౌల్యం నిరవధికమహాస్థౌల్యసౌశీల్యమూల్యం
చర్యామాధుర్యచర్యం భజహృదయసదా హ్యాగ్వపల్లీనృసింహమ్॥

రక్షశ్శిక్షాతరక్షుం క్షురణకరణతదక్షణా క్షీణదీక్షం
ప్రాక్షుద్రిక్షాద్రిసర్వం హితసుగుణగణం పక్ష్మలంపక్ష్మలాక్షం ।
లక్ష్మీపద్మాక్షి వక్షస్థలనిఖిలజగత్త్రాణ పట్టాభిషిక్తం
వ్యక్తం సంరక్తభక్తం సరళగళకళాసక్తముక్తాకలాపమ్॥ ౨౮

హాత్యావృత్యప్రఘాత్యశ్వసిత విలసితం దిత్యపత్యాపపత్యం
స్తుత్యంక్షిత్యం తరిక్త(క్ష)క్షితినగసుగవక్త్రాంతరవ్యక్తసూక్తైః ।
బిభ్యద్దైతేభ్యసభ్యం పటుపటుఘటితప్రస్థశుంభన్నితంబం
జృంభంతం స్తంభలంబి స్ఫుటచటుల సటం స్తౌమి భీమం నృసింహమ్॥

దీప్యత్స్వేతాతపత్రం మణిముకుటలసన్మస్తకం యుక్తపార్శ్వం
లక్ష్మీక్ష్మాజా ముఖాబ్జాసకరుణ చగణం పూర్ణిమాచంద్రవక్త్రం ।
సర్వోత్తంసం సమస్తాభగణ విలసితం కోటిసూర్యప్రకాశం
సేతా నందం ప్రదంతం మమహృదికలయేహ్యాగ్వ పల్లీనృసింహమ్॥

రాకాసంపూర్ణచంద్రం చితశితసుతనుం రంగదుత్తుంగగంగా
త్వంగత్కారుణ్యపూరం తరుణతరణి బింబోపమానాధరోష్ఠం ।
దోర్భ్యాం శంఖం చచక్రం భృతమధురసుధాసారధారానుకారం
వందేలక్ష్మీనృసింహం ప్రతికలమనుయామ్యాగ్వ పల్లీనృసింహమ్॥ ౩౨

1. అన్నిటివలె ఈ శ్లోకమునకు మకుటము లేదు; దీని తరువాతి శ్లోకమునకు భేదము గా లేదు.

# సంపాదకీయము

వసంతము మొదలుగ హేమంత ఋతువుదనుక నీ ప్లవంగవత్సరమున నాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికాపంచకము సకాలమున ముద్రితమై యాంధ్రభాషావిదుల హస్తంగత మైనది. దీనికి గారణము వ్యాసపద్యరచయితల కాలానతిక్రమణీయరచనాపత్త్రప్రేషణమును, ముద్రణాలయసకాలముద్రణమును మాత్రమే. కావున వా రెల్లరును నభినందనీయులు. ఇఁక శిశిర ఋతుపత్త్రిక మాత్రమే మిగిలి యున్నది. అదియు కీలకసంవత్సరము రాకమున్నే ప్రచురితము కాగల దని మా విశ్వాసము.

కవివరు లంపురచనాలేఖనములలో విసంధులు మిశ్రసమాసములు నపశబ్దములు నన్యకవిదూషణములు ననుచితభాషణములును లేకుండ లిఖించి పంపఁ బ్రార్థితులు.

ఇట్లు
సంపాదకుఁడు, కవిమూర్ధన్య,
కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంపాదక సహాయులు,

1. శిష్ట్లా బాలకోటీశ్వరరావు (సరసకవితావతంస)
2. విద్వాన్ గున్నేపల్లి అక్షయలింగకవి.

